జగద్గురు శ్రీశంకరాచార్య విరచిత

# శ్రీ వివేకచూడామణి

## ఆంధ్రవ్యాఖ్యాసమేతము



వ్యాఖ్యాత
డా. పుల్లెల శ్రీరామచంద్రుడు ఎమ్. ఏ. పిహెచ్. డి.




ప్రచురణ:

సంస్కృతభాషా ప్రచారసమితి,

హైదరాబాదు - 500 001
1995

# జగద్గురు శ్రీశంకరాచార్య విరచిత
# శ్రీవివేకచూడామణి
## ఆంధ్రవ్యాఖ్యాసమేతము

వ్యాఖ్యాత
డా. పుల్లెల శ్రీరామచంద్రుడు ఎమ్. ఏ. పిహెచ్. డి.





ప్రచురణ తేది : 1-4-1995

ప్రతులు : 2000

మూల్యము : రూ. 120/-

ప్రకాశకులు :
సంస్కృతభాషా ప్రచారసమితి,
5-4-743, రెండవ అంతస్తు,
హరేకృష్ణదేవాలయం ప్రక్కన,
నాంపల్లి స్టేషన్ రోడ్డు, హైదరాబాదు - 1,
ఫోన్: 515481.

ముద్రణ :
శ్రీకళాంజలి గ్రాఫిక్స్,
విఠల్ వాడి, నారాయణగూడ,
హైదరాబాదు,
ఫోన్ నం. 597831.

# మున్నుడి

వేదము ప్రవృత్తిమార్గము, నివృత్తిమార్గము అను రెండుమార్గములను బోధించుచున్నది. అందు నివృత్తిమార్గమును బోధించు భాగమునకు ఉపనిషత్తు లని పేరు. వేదముల చివర నుండుటచే ఉపనిషత్తులకే వేదాంతము లని కూడ పేరు. ఉపనిషత్తుల తాత్పర్యము నెట్లు నిర్ణయింపవలెనో ప్రతిపాదించుచు బాదరాయణుడు సూత్రములను రచించెను. వీటి ప్రధాన ప్రతిపాద్య విషయము బ్రహ్మ (ఆత్మ) అగుటచే వీటికి బ్రహ్మసూత్రము లని పేరు. ఉపనిషదర్థమునే గ్రహించి అనేక పురాణేతిహాసాదులలో, వివిధ ఘట్టములలో, ఆత్మతత్త్వ ప్రతిపాదనము చేయబడినది. ఆత్మతత్త్వమునకు సంబంధించిన అన్ని విషయములను చక్కగా ప్రతిపాదించి ఉండుటచే మహాభారతాంతర్గతమైన భగవద్గీత సర్వోత్కృష్టమైనది. అనగా ఉపనిషత్తులు ప్రతిపాదించు తత్త్వమునే బ్రహ్మసూత్రములును, భగవద్గీతయును భంగ్యంతరముచే బోధించుచున్నవని అర్థము. ఈ మూడు గ్రంథములకును ప్రస్థానత్రయ మని పేరు. శ్రీ మచ్ఛంకరభగవత్పాదులు ఈ ప్రస్థానత్రయముపై విపులమగు వ్యాఖ్యలు (భాష్యములు) వ్రాసి అద్వైతసిద్ధాంతము సుప్రతిష్ఠితము చేసిరి. ఈనాడు ఈ భాష్యత్రయమునకే ప్రస్థానత్రయమని ప్రసిద్ధి. ఈ భాష్యములు శాస్త్రఫక్కికలో వాదకథాప్రధానముగ వ్రాయబడిన వగుటచే శాస్త్రములో ప్రవేశమున్న వారికి మాత్రమే అందుబాటులో నుండును. ఈ విషయము గ్రహించిన భగవత్పాదులు జిజ్ఞాసుజనానుగ్రహమునకై, సిద్ధాంతమును మాత్రమే ప్రతిపాదించుచు అనేక ప్రకరణ గ్రంథములను రచించిరి. ఇట్టి ప్రకరణగ్రంథములలో చూడామణి వంటిది వివేకచూడామణి. తత్త్వజిజ్ఞాసువుల పాలిటి చింతామణి.

శ్రీ శృంగేరీ శారదాపీఠాధిపతులును, ప్రాతఃస్మరణీయనామధేయులును, జీవన్ముక్తులును అగు శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరభారతీస్వాములవారు ఈ వివేకచూడామణికి ఒక వ్యాఖ్య వ్రాసి ఉన్నారు. శ్రీ శారదాపీఠాధిపతులందరికిని అనితర సాధారణమగు ఒక వైశిష్ట్యమున్నది. వీరికి గల

ప్రారంభింపజాలక పోయితిని. 1977వ సంవత్సరమున శ్రీ మదభినవ విద్యాతీర్థ శ్రీచరణులు హైదరాబాదు వేంచేసినపుడు వారి దర్శనము చేసి కొని, మరల ప్రత్యక్షముగ వారి ఆశీర్వచనములను పొంది 27-7-1977 తేదీన ఈ అనువాద కార్యక్రమమును ప్రారంభించి, 23-11-1978 తేదీ నాటికి పూర్తిచేయుగలిగితిని. నన్ను కరణముగ చేసికొని శ్రీ మదాచార్య చరణులే ఈ అనువాదమును రచించిరని నా విశ్వాసము. ఏమైన దోష ములున్నచో అవి మదీయచిత్తానవధానప్రయుక్తములు. వాటిని సహృద యులు మన్నించగలరు.

ఈ గ్రంథమును ప్రచురించవలసినదిగా శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానాధికారులను కోరగా వారు అంగీకరించిరి. ఈనాడు శ్రీ వేంకటా చలాధీశుని కరుణచే ఇట్టి గ్రంథము లెన్నియో ప్రచురణ భాగ్యమును పొందుచుండుట ఆస్తికజన మనోముదావహము. ఇట్టి కార్యమును చేపట్టిన అధికారులు ధన్యాత్ములు. ఆస్తికజన కృతజ్ఞతాభాజనులు.

తమ ఆశీస్సులచే మదీయానువాద ప్రామాణ్యమును ఇనుమ డింపచేసిన శ్రీ మద్దక్షిణామ్నాయ శ్రీ శారదాపీఠాధిష్ఠిత శ్రీ జగద్గురు శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థ శ్రీచరణులకును, ఏతదనువాద ప్రక్రియపై తమ ఆమోదముద్ర ననుగ్రహించిన శ్రీశ్రీశ్రీ భారతీతీర్థస్వాములవారికిని సాష్టాంగప్రణామములు.

యత్కృపాలేశ సంసర్గా దనువాదః కృతో మయా,
తస్యైవ జానకీజానేః పదయో రయ మర్ప్యతే.

హైదరాబాద్,
3-3-1984.

పుల్లెల శ్రీరామచంద్రుడు

శ్రీః

# కృతజ్ఞతలు

శ్రీ చంద్రశేఖర భారతీ స్వాములవారు అనుగ్రహించిన వ్యాఖ్యానముతో సహా వివేకచూడామణికి నేను ఆంధ్రభాషలో రచించిన అనువాదమును తిరుమల తిరుపతి దేవస్థానం వారు ప్రచురించి ఉన్నారు.

ఇప్పుడు ఆ గ్రంథములు లభ్యములు కాకపోవుటచే చాలమంది పాఠకుల అభిలాషను అనుసరించి దీని పునర్ముద్రణమునకై తిరుమల తిరుపతి దేవస్థానం వారి అనుమతిని కోరగా వారు దయతో అనుమతి ఇచ్చినారు. అందులకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానాధికారులకు కృతజ్ఞత తెలుపుచున్నాను.

వారు ఇచ్చిన అనుమతి ఈ ఒక్క ముద్రణమునకే గాన, దీని పునర్ముద్రణాధికారములన్నీ తిరుమల తిరుపతి దేవస్థానం వారికే చెంది ఉన్నవి.

వివేకచూడామణి విషయజిజ్ఞాసులకు ఈ గ్రంథము ఉపకరించగలదని ఆశించుచున్నాను.

ఇలాంటి గ్రంథాల పునర్ముద్రణం చెయ్యాలని అస్మాదృశులకు ఎంత తీవ్రమైన అభిలాష ఉన్నా అది మనోరథమాత్రంగానే నిలిచిపోతుంది. దానికి సాఫల్యం కూర్చినవారు సంస్కృతభాషాప్రచారసమితి స్థాపకులు, తత్పోషకులూ అయిన శ్రీ జి.పుల్లారెడ్డిగారు. వారికి నా కృతజ్ఞతను తెలుపుతున్నాను.

సకలజన మనోవృత్తి ప్రవర్తకుడు, హృషీకేశుడూ అయిన శ్రీవేంకటేశ్వరస్వామికి పరఃసహస్రసాష్టాంగప్రణామాలు సమర్పిస్తున్నాను.

పుల్లెల శ్రీరామచంద్రుడు

యువనామ సంవత్సర,
చైత్రప్రతిపత్,
1-4-1995.

# శ్రీ శ్రీ జగద్గురు శంకరాచార్య మహాసంస్థానమ్
# దక్షిణామ్నాయ శ్రీ శారదాపీఠమ్, శృంగేరీ.

"శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు సనాతన ధర్మమును పునరుద్ధరించి, వేదాంతసిద్ధాంతమును ప్రచారము చేసి, లోకోత్తరమహిమలను ప్రదర్శించిన మహామహిములు. వారు పరశివావతారభూతు లనుటలో ఎట్టి సందేహము లేదు. వారు రచించిన గ్రంథములు విద్వజ్జనాదరణీయములుగను, ముముక్షుజనోపాదేయములుగను విరాజిల్లుచున్నవి. వేదాంతతత్త్వమును సామాన్యజనులకు గూడ సులభావగాహమగు రీతిలో తెలియజేయుట వారి గ్రంథములలోని అనితర సాధారణమగు వైశిష్ట్యము.

అట్టి గ్రంథములలో "వివేకచూడామణి" పేరెన్నిక గన్నది. ఆ వివేకచూడామణికి జీవన్ముక్తులైన అస్మద్గురుచరణులగు శ్రీ జగద్గురు చంద్రశేఖరభారతీస్వామివారు సరళసుందరమగు వ్యాఖ్యను రచించి లోకానుగ్రహ మొనర్చిరి. ఆ వ్యాఖ్య మూలముయొక్క అర్థమును చక్కగా స్ఫుటీకరింపజేయుచు లోకోత్తరముగ అలరారుచున్నది. అట్టి సవ్యాఖ్యానమగు వివేకచూడామణిని అస్మదత్యంత ప్రియశిష్యులును, వేదాంతశిరోమణి పట్టభద్రులునగు పుల్లెల శ్రీరామచంద్రుడు గారు తెలుగున కనువదించినారు. ఈ అనువాదమును మేము చూచి మిక్కిలి సంతసించినాము. మూలగ్రంథమును, వ్యాఖ్యను అర్థము చేసికొనుటకు ఈ అనువాదము మిక్కిలి ఉపకరించగలదు. ఈ గ్రంథమును తిరుమల

తిరుపతి దేవస్థానము వారు ప్రకటించుట ప్రశంసనీయమైన విషయము. ఈ గ్రంథము ముముక్షుజన పాణిపల్లవ భూషణమై వెలుగొందు గాక యని ఆశీర్వదించుచున్నాము.

— ఇతి నారాయణ స్మరణమ్ "

శ్రీ జగద్గురు మహాస్వాములవారు పై విధముగా ఆశీర్వచనము నొసంగిరి.

శృంగేరి,
17–2–1984

శ్రీ చరణుల ఆజ్ఞతో –
ఆప్త కార్యదర్శి

# శ్రీ వివేకచూడామణి

## విషయసూచిక

ఓమ్

శ్రీః

శ్రీ సచ్చిదానన్దశివాభినవనృసింహభారతీస్వామి
చరణారవిన్దాభ్యాం నమః

శ్రీ శ్రీ చంద్రశేఖర భారతీ - శ్రీమదభినవవిద్యాతీర్థ
శ్రీమద్భారతీ తీర్థస్వామి చరణారవిన్దాభ్యాం నమః

# శ్రీ వివేకచూడామణి

## ఆంధ్రవ్యాఖ్యాసమేతము

### మంగళాచరణము

సర్వవేదాన్తసిద్ధాన్తగోచరం తమగోచరమ్.
గోవిన్దం పరమానన్దం సద్గురుం ప్రణమామ్యహమ్. 1

సర్వవేదాన్త సిద్ధాన్త గోచరం = సమస్తములైన ఉపనిషత్తుల సిద్ధాంతములకు గోచరుడైనట్టియు, అగోచరం = బుద్ధీంద్రియాదులకు గోచరింపనట్టియు, పరమానన్దం = పరమానంద స్వరూపుడైనట్టియు, సద్గురుం = సద్గురువైన, తం గోవిన్దం = ఆ గోవిన్దస్వరూపులగు గోవింద భగవత్పాదాచార్యుని, అహం = నేను, ప్రణమామి = నమస్కరించు చున్నాను.

### బ్రహ్మనిష్ఠామహత్త్వము

జన్తూనాం నరజన్మ దుర్లభ మతః పుంస్త్వం తతో విప్రతా
తస్మా ద్వైదికధర్మమార్గపరతా విద్వత్త్వమస్మాత్పరమ్.
ఆత్మానాత్మవివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితి
ర్ముక్తి ర్నో శతకోటిజన్మసు కృతైః పుణ్యైర్వినా లభ్యతే.

జన్తూనాం = ప్రాణులకు, నరజన్మ = మనుష్యజన్మ, దుర్లభం = కష్టముచే లభ్యమైనది, అతః = దానికంటె, పుంస్త్వం = పురుషత్వము, తతః = దానికంటె, విప్రతా = బ్రాహ్మణత్వము, తస్మాత్ = దానికంటె, వైదికధర్మమార్గపరతా = వైదిక ధర్మమార్గమునందు ఆసక్తి, అస్మాత్ = దానికంటె, పరం = అధికముగా, విద్వత్త్వం = పండితత్వము(దుర్లభము). ఆత్మానాత్మవివేచనం = ఇది ఆత్మ, ఇది ఆత్మభిన్నము అను వివేకము, స్వనుభవః = బాగుగా అనుభవము, బ్రహ్మాత్మనా = బ్రహ్మరూపముతో, సంస్థితిః = ఉనికి యను రూపముగల, ముక్తిః = ముక్తియు, శతకోటి జన్మసు = వందకోట్ల జన్మలయందు, కృతైః = చేయబడిన, పుణ్యై ర్వినా = పుణ్యములు లేకుండగా, నో లభ్యతే = పొందబడదు.

వ్యాఖ్యానువాదము :

శ్రీ చంద్రశేఖర భారతీస్వాములు అనుగ్రహించిన వ్యాఖ్యకు అనువాదము.

అంతవిహీనభీకరభవాంబుధి మగ్న జనాళిఁ బ్రోవ న
త్యంత కృపావశంవదత నాత్తనృసింహయతీంద్రరూపుఁడై,
ధ్వాంతసదృక్ష ఘోరజడతా వినికృంతనదక్షు దక్షిణా
శాంతముఖున్ కృపాజలధి నాదృతితో ననిశంబు గొల్చెదన్.
భగవత్పాదార్చితపద
యుగ! యోవాగ్దేవి! కరుణ యొప్పార మదిన్
దగనిల్చి వ్యాఖ్య వ్రాయుమి
సుగమంబుగ నీ వివేకచూడామణికిన్.
సుప్రసన్నమయ్యు సూక్ష్మగంభీరంబు
దేశికేశు వాక్య దివ్య సరణి,
దీని భావమెల్ల దీప్తమై నా మది
చేరఁ దీయుమమ్మ శారదాంబ!
ఓ రత్నగర్భగణపతి!
కారుణ్యనిధాన! విఘ్నఘనరూపోద్య

ఘోరాంధకార భాస్కర!
పూరింపుము వ్యాఖ్య సుగుణపూరితరీతిన్.
బ్రహ్మవిద్యాశ్రయా! దేవ! భద్రమూర్తి!
చంద్రమౌళీశ! కర లసద్జ్ఞానముద్ర!
స్వానుభూతి నొసంగు నా భావమందు
వ్యాఖ్య వ్రాసెద నాచార్య వాక్యములకు.

"అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాం శ్చ భాషసే,
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పండితాః."

"నీవు మహాబుద్ధిమంతునివలె మాటలు చెప్పుచున్నావు. కాని దుఃఖింపదగని వారినిగూర్చి దుఃఖించుచున్నావు. పండితులగువారు మరణించిన వారినిగూర్చియు, జీవించియున్న వారినిగూర్చియు దుఃఖింపరు." ఇవి శ్రీకృష్ణుడు అర్జునునితో పల్కిన మాటలు (భ.గీ. 2. 11). ఈ శ్లోకము గీతాశాస్త్రార్థమునంతయు సంగ్రహముగ బోధించుచున్నది. ఇట్లే "జన్తూనాం నరజన్మ" అను ఈ శ్లోకము వివేకచూడామణి నామకమగు ఈ ప్రకరణగ్రంథమందు ప్రతిపాద్యమగు విషయమునంతయు సంగ్రహముగ సూచించుచున్నది. ఆస్తికునకు మాత్రమే ఈ శాస్త్రమునందు అధికారము. అందుచే "జన్తూనాం నరజన్మ దుర్లభమ్" అను మాటలలో నరజన్మకు ప్రాశస్త్యమును చెప్పుచు తద్ద్వారా శరీరవ్యతిరిక్తమగు ఆత్మ యనునది ఒకటి ఉన్నదను విషయమును ధ్వనింపజేయుచున్నాడు. కావుననే శారీరక భాష్యమునందు — బుద్ధిపూర్వకముగ ప్రవర్తించువానికి, ఆత్మకు పరలోకసంబంధ మున్నదను విషయము తెలియకున్నచో శాస్త్రీయములగు కర్మల నాచరించుట మొదలగు వ్యవహారమునందు అధికారము లేకున్నను ........" అని చెప్పబడియున్నది. జన్తూనాం = జన్మించు స్వభావముగల ప్రాణులకు, నరజన్మ = మనుష్యత్వము, దుర్లభం = దుర్లభమైనది అని దీని యర్థము. ఒక్కడే అనేక జన్మములుపొందు

టకు అవకాశమున్నపుడు మాత్రమే "నరజన్మము దుర్లభము" అని చెప్పుట పొసగును. జన్మము అనగా శరీరసంబంధమే కదా? ఈ విధముగ ఒక్కనికి అనేక శరీరసంబంధ ముండునని చెప్పుటచే ఆత్మ శరీరముకంటె భిన్నమైనదను విషయము సూచితము. అనేకములగు పుష్పములు గ్రుచ్చిన దారము ఆ పుష్పములకంటె భిన్నమైనది; అనేకవస్త్రములను ఒక్కమారుగా గాని, వేరువేరు సమయములందు గాని ధరించు శరీరము వాటికంటె భిన్నమైనది అను విషయము సర్వవిదితమే కదా! కావున సుఖహేతువగు శరీరము లభింపవలె నన్నచో, దుఃఖహేతువగు శరీరము లభింపకుండవలె నన్నచో పుణ్యము చేయవలెను; పాపాచరణమునుండి మరలవలెను. ఈ విధ ముగ విధి నిషేధాత్మకమగు శాస్త్రమునందు ఆస్తికునకు మాత్రమే అనగా వేదప్రామాణ్యమును, శరీరభిన్నమగు ఆత్మ యున్నదను విషయమును నమ్మువానికి మాత్రమే - అధికారము. జ్ఞానముద్వారా సకల కర్మలను తొలగించుకొనుటకై మోక్ష శాస్త్రమునందు గూడ ఆస్తికునకే అధికారము.

శరిరమే ఆత్మయైనచో అది ప్రత్యక్షసిద్ధమే కావున దాని దర్శన మునకై సాధనములను విధించుచు చెప్పిన "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" (ఆత్మను చూడవలెను- సాక్షాత్కరింప జేసికొనవలెను, వినవలెను, మననముచేయవలెను, ధ్యానింపవలెను) మొదలగు వాక్యములు అనుపపన్నములగును. ఒకేవ్యక్తి, శుభాశుభమిశ్రములగు కర్మల నాచరించుటచే ఒక విజాతీయమగు (విశిష్టమగు) శరీరము లభించునని-"శుభైరా ప్నోతి దేవత్వం నిషిద్ధైర్నారకీం తనుమ్, ఉభాభ్యాం పుణ్య పాపా భ్యాం మానుష్యం లభతేఽవశః" (జీవుడు) శుభకర్మలచే దేవత్వ మును, నిషిద్ధ కర్మలచే నరకయోగ్యమగు శరీరమును, పుణ్యపాప ములు రెండును ఆచరించుటచే మనుష్య శరీరమును పొందును,

దీనిని తప్పించుకొనజాలదు – ఇత్యాది వాక్యములు చెప్పుచున్నవి. అట్లు కానిచో లోకమునందు కానవచ్చుచున్న సుఖదుఃఖాది వైచిత్ర్యము ఎట్లు కుదురును? వారి వారి కర్మలనుబట్టి కాక. ఈశ్వరుడే కొందరు ప్రాణులను సుఖవంతులుగను, కొందరిని దుఃఖ వంతులుగను చేయును అని యన్నచో ఈశ్వరునకు పక్షపాతము, దయారాహిత్యము ఉన్నవని చెప్పినట్లగును. అట్లైనచో ఆతని ఈశ్వరత్వమునకే భంగము వాటిల్లును. ఈ విషయమునే (బాద రాయణుడు) "వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్" (ఈశ్వరునకు పక్షపాతము, నిర్దయత్వము అపాదించవా? అపాదించివు. ఆయన కర్మలనుబట్టి ఇట్టి భిన్నరూపులగు జీవులను సృష్టించుచున్నాడు.) ఈ విషయమునే శ్రుతి ప్రతిపాదించుచున్నది– "న కర్మావిభాగాదితి చేత్ నానాదిత్వాత్" (కర్మవిభాగము కుదరదు కాన ఈశ్వరునకు కర్మాపేక్షత్వముచెప్పుట యుక్తముకాదు అని యనరాదు; ఏలయన కర్మ సంసారాదికము అనాది). "ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ" (కర్మ సంసారాదుల యనాదిత్వము యుక్తి సంగతము: శాస్త్రోక్తము) ఇత్యాది సూత్రములచే ఈశ్వరుడు కర్మసాపేక్షుడనియు సంసారము అనాది యనియు చెప్పియున్నాడు. (జీవుని) ధర్మమగు సంసారము అనాదియైనచో దానికి (సంసారమునకు) ఆశ్రయభూతుడగు సంసారి (జీవుడు) అనాదియని వేరుగచెప్పవలెనా? కావున ఆత్మ శరీరభిన్న మనియు, శరీరముకంటె భిన్నమగు ఆత్మ యున్నదని చెప్పువాడే ఆస్తికుడనియు సిద్ధించుచున్నది. ఆస్తిక్యమనునది శాస్త్ర వ్యవహార ముపై ఆధారపడియున్నది అను విషయమును "జన్తూనాం నరజన్మ దుర్లభమ్" అనునది సూచించుచున్నది. "తతః పుంస్త్వమ్"–స్త్రీకి వేదాధ్యయనాధికారము లేదు గాన, ఉపనిషత్తుల ద్వారా మాత్రమే **తెలియదగిన ఆత్మను వారు తెలిసికొనజాలరని అభిప్రాయము.**

పై మూడు వర్గముల వారికిని వేదాధికారమున్నది. ఐనను క్షత్రియ వైశ్యులకు రాజ్యపాలనము కృషి మొదలగు చిత్తవిక్షేప హేతువులగు బాహ్య వ్యాపారము లెన్నియో ఉండుటచే శ్రద్ధా తాత్పర్యములతో ఆత్మవిచారము చేయుట వారికి అంతగ శక్యము కాదు. శ్రద్ధాతాత్పర్యములతో, ఇతరవ్యావృత్తి యేదియు లేకుండ బ్రహ్మ విచారము చేయుటకు ప్రధాన సాధనము సన్న్యాసము. "ముఖజానామయం ధర్మః వైష్ణవం లిఙ్గధారణమ్, బాహుజాతోరు జాతానాం నాయం ధర్మో విధీయతే" (వైష్ణవమగు ఈ లింగధార ణము–సన్న్యాసము–బ్రాహ్మణులకే ధర్మము. ఇది క్షత్రియ వైశ్యు లకు విహితము కాదు) ఇత్యాది స్మృత్యనుసారముగ వారికి సన్న్యాస గ్రహణావకాశము లేదుగాన ఒకే జన్మలో వారికి బ్రహ్మ సాక్షాత్కా రము దుర్లభమని సూచించుటకై "ద్విజత్వం తతః" అనికాక "తతో విప్రతా" అని చెప్పబడినది. (ద్విజత్వం అన్నచో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలో ఎవ్వరైన అగుట యని యర్థము వచ్చును.) "బ్రాహ్మణస్య తు దేహోఽయం నోపభోగాయ కల్పతే, ఇహ క్లేశాయ మహతే ప్రేత్యానన్త సుఖాయ చ" (ఈ బ్రాహ్మణ దేహము భోగములను అనుభవించుటకు కాదు: ఈ లోకములో ఎన్నియో కష్టము లనుభవించి మరణానంతరము అనంత సుఖాను భవము కొరకు) అను వసిష్ఠ స్మృత్యనుసారము వేద విహితములగు ప్రవృత్తి (కర్మ) నివృత్తి (జ్ఞాన) ధర్మముల ననుష్ఠించుటచే బ్రాహ్మణుడు ఒక్క జన్మయందే బ్రహ్మసాక్షాత్కారమును పొంద సమర్థు డగునని భావము. అందుచేతనే–"తస్మా ద్వైదికధర్మ మార్గపరతా" అని చెప్పబడినది. ఆ పొంద వలసిన దానిని (ఆత్మ సాక్షాత్కారమును) పొందుటకు కేవలము బ్రాహ్మణుడైనంత మాత్రమున చాలదు: బ్రాహ్మణజన్మమెత్తి విహిత ధర్మాచరణము చేతనే అది లభించునని భావము, "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" (ఈ ప్రపంచము అంతయు నిలుచుటకు ధర్మమే కారణము).."ధర్మేణ పాప మపనుదతి"

(ధర్మముచే పాపమును తొలగించుకొనుచున్నాడు) అను శ్రుతి వాక్యములు, ధర్మమే సుఖ సాధనమనియు, దుఃఖమునకు హేతువగు పాపమును తొలగింప గలిగినది గూడ ధర్మమే యనియు, పాపమును తొలగించి దుఃఖము లేకుండ చేయునది ధర్మమే యనియు చెప్పుచున్నవి. నాకు సుఖము కలుగవలెను, దుఃఖము కలుగకూడదు అని ప్రతిఒక్కడును కోరుకొనుచుండును. ఈ సుఖము అనగా దుఃఖాభావము అనెడు పురుషార్థమునకు సాధనమైనది ధర్మమే అనియు. "ధరతీతి ధర్మః" (ధరించునది గాన ధర్మము), 'ధ్రియతే అనే నేతి ధర్మః'(దీనిచే జగత్తు ధరింపబడును గాన ధర్మము) అను వ్యుత్పత్తి ననుసరించి ధర్మమే జగత్ప్రతిష్ఠకు హేతువనియు శ్రుతిబోధితమగు విషయమును సూచించుటకై "వైదిక కర్మమార్గ పరతా" అని కాక 'ధర్మమార్గ' అని చెప్పియున్నారు. వైదిక కర్మకూడ ధర్మమే యైనను 'కర్మ' శబ్దమును ప్రయోగించినచో ఇంత అర్థము లభింపదు. దుఃఖము తొలగించుకొని సుఖమును సంపాదించుకొనుటకు ధర్మభిన్నమగు సాధనము వేరేదైన ఉన్నచో, ఎల్లరును ఆ సాధనమునే సంపాదించుకొని ఎల్లప్పుడును సుఖవంతులుగను, దుఃఖరహితులుగను ఉండెడివారు. ధర్మమన్ననో ఇంద్రియములకు గోచరింపనిది; శాస్త్రముద్వారా మాత్రమే తెలియ దగినది. కావున జనులకు శాస్త్రజ్ఞానము లేకున్నచో ధర్మజ్ఞానము కలుగదు. అందుచే సాధనము లభింపకపోవుటచే ఫలము కూడ లభ్యముకాదు అని చెప్పవచ్చును. ఈ విషయమునే 'వైదిక' అను పదము సూచించుచున్నది.

"చోదనాలక్షణోఽర్థో ధర్మః" అను సూత్రముచే జైమినిమహర్షి "వేదవిహితమైనదే ధర్మము" అని ధర్మలక్షణమును చెప్పియున్నారు. 'వైదిక' అను విశేషణము ఆ విషయమునే సూచించుచున్నది. వేదము తప్ప మరి యేప్రమాణముచేతను ధర్మస్వరూపమును తెలియ శక్యముకాదు. ధర్మము ఇంద్రియగోచరము గాదు; అందుచే ప్రత్యక్ష ప్రమాణమునకు ఇచట తావులేదు. అనుమాన ప్రమాణము

ప్రత్యక్షముపై ఆధారపడియున్నది. అందుచే అదిగూడ ప్రవర్తింప జాలదు. ప్రత్యక్షాది ప్రమాణములచే తెలిసిన విషయములనే లౌకిక శబ్దము బోధించును. కావున వేదభిన్నమగు శబ్దప్రమాణముకూడ ఇచట ప్రసరింపదు. స్మృతులు స్వతఃప్రమాణములు (తమంతట తాముగ ప్రమాణములు) కావు. అవి పురుషనిర్మితములు. పురుషులకు భ్రమము, ప్రమాదము మొదలగు దోషము లుండుటకు అవకాశ మున్నది. అందుచే వారు రచించిన గ్రంథములు కూడ నిర్దుష్టములని చెప్పుటకు వీలులేదు గాన అప్రమాణములే యను శంక కలుగుచునే యుండును. దానిని వారించుటకై అపౌరుషేయములు (పురుష రచితములుకానివి) అగుటచే దోషలేశముకూడ ఉండుటకు వీలులేని శ్రుతులను అనుసరించి రచించిన వగుటచేతనే స్మృతులు ప్రమాణములు అని చెప్పవలసియున్నది. కావున వేదవ్యతిరిక్తమగు శబ్దము ధర్మము విషయమున స్వతః ప్రమాణము కాదు అని తేలినది. ఈ స్మృతికర్తలైనను అతీంద్రియమగు ధర్మమునుగూర్చి ఎట్లు తెలిసికొనగల్గిరి? యోగజన్యమగు సామర్థ్యముచే అన్నచో, ఆ సామర్థ్యముమాత్రము వారి కెట్లు లభించినది? ధర్మానుష్ఠానముచే లభించిన దన్నచో ఆ ధర్మమెట్లు తెలిసినది? మొట్టమొదట సృష్టింపబడిన హిరణ్యగర్భునికికూడ ఈశ్వరుడు ఇచ్చిన వేదమునుబట్టియే ధర్మజ్ఞానము కలిగినది అని. "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వైవేదాంశ్చ ప్రహిణోతి తస్మై" — ఏ పరమాత్మ మొదట బ్రహ్మను సృజించి, ఆతనికి వేదములను అందజేసెనో...." ఇత్యాదిగ శ్రుతులు చెప్పు చున్నవి. ఆ హిరణ్యగర్భుని విషయమే ఇట్లున్నచో ఇతరులమాట ఏమిచెప్పవలె? కావున 'వైదిక' అని చెప్పుట యుక్తమే. (ఈ 'వైదిక' పదము) 'అబ్భక్షాః' 'వాయుభక్షాః' ('జలమును భక్షించువారు', 'వాయువును భక్షించువారు' అనునపుడు జలమునుమాత్రమే, వాయువును మాత్రమే అను నర్థము వచ్చినట్లు) ఇత్యాదు లందువలె **'ధర్మము వేదముద్వారామాత్రమే తెలియును'** అని బోధించుచున్నది.

ఇచట 'ధర్మ' శబ్దము ప్రవృత్తిధర్మమును(కర్మను), నివృత్తిధర్మమును (కర్మసన్న్యాసమును) కూడ బోధించును. కావుననే గీతాభాష్యము నందు – 'వేదోక్తధర్మము ప్రవృత్తిరూపము, నివృత్తిరూపము అని రెండువిధములు' అని చెప్పబడియున్నది.

నిత్యమగు సుఖమును సంపాదింపవలెనన్నచో ధర్మ మొక్కటియే సాధనము: ఇక దీనిని అపేక్షింపబనిలేదు అని కర్మమీ మాంసకులు చెప్పుదురు. 'మార్గ' అని చెప్పుచు వారి యభిప్రాయము నిర్దుష్టము కాదని సూచించుచున్నారు. సన్న్యాసరూపమగు నివృత్తి ధర్మము, పరమపురుషార్థ సాధనమగు బ్రహ్మసాక్షాత్కారమునకు సాధనమగు ఉపనిషద్విచారమునకు హేతువు. నిష్కామకర్మానుష్ఠాన రూపమగు ప్రవృత్తిధర్మము ఆ సన్న్యాసమునకు సాధనమగు వైరాగ్య మునకు హేతువైన చిత్తశుద్ధిని కల్గించును. ఈ రెండువిధములగు ధర్మములును ఈ విధముగ ఆవశ్యకములు. అంతియే కాని నిరతి శయసుఖమును ఈ రెండు ధర్మములుగూడ ప్రత్యక్షముగ ఈయ జాలవని సూచింపబడినది. భగవంతుడగు బాదరాయణుడు ఈ విషయమునే ఈ క్రిందిశ్లోకములో చెప్పియున్నాడు–

"ద్వావిమావథ పన్థానౌ యత్ర వేదాః ప్రతిష్ఠితాః,
ప్రవృత్తి లక్షణో ధర్మో నివృత్తిశ్చ ప్రకీర్తితః"

(ప్రవృత్తిధర్మము, నివృత్తిధర్మము అనునవి ఈ రెండును రెండుమార్గములు: వీనియందే వేదముల తాత్పర్యము).

కావున ఉపనయనానన్తరము బ్రాహ్మణుడు–

"వేదో నిత్యమధీయతాం తదుదితం కర్మ స్వనుష్ఠీయతాం
తేనేశస్య విధీయతా మపచితిః కామ్యే మతిస్త్యజ్యతామ్,
పాపౌఘః పరిధూయతాం భవసుఖే దోషోఽనుసన్ధీయతాం
ఆత్మేచ్ఛా వ్యవసీయతాం నిజగృహాత్తూర్ణం వినిర్గమ్యతామ్.
సంగః సత్సు విధీయతాం భగవతో భక్తిర్దృఢాధీయతాం,
శాన్త్యాదిః పరిచీయతాం దృఢతరం కర్మాశు సన్త్యజ్యతామ్."

నిత్యమును వేదాధ్యయనము చేయుదు. దానియందు విధింపబడిన కర్మలు ఆచరింపుడు. దానిచే ఈశ్వరునకు ప్రీతి కలిగింపుడు. కామ్య కర్మయందు ఆసక్తిని విడువుడు. పాపసముదాయము తొలగించు కొనుడు. సంసార సుఖమునందలి దోషమును గుర్తింపుడు. ఆత్మ విషయమున ఇచ్ఛను పెంపొందించుకొనుడు. వెంటనే స్వగృహ మును విడచిపొండు. సత్పురుషుల సంగముచేయుడు. భగవంతునిపై దృఢమగు భక్తి సంపాదింపుడు. శాన్త్యాదికము వృద్ధి పొందించు కొనుడు. దృఢతరమైన కర్మను శీఘ్రముగా విడువుడు అని సోపాన పంచకమున (శంకరభగవత్పాద విరచితము) చెప్పబడిన విధమున ఈశ్వరార్పణబుద్ధితో కర్మచేయుచు, చిత్తమును నిర్మలము కావించు కొని, విషయములనుండి వైరాగ్యమును బొంది కర్మలనుండి విర మింపవలెను అని బోధింపబడినది. మోక్షధర్మమునందు గూడ—

"నైతాదృశం బ్రాహ్మణస్యాస్తి విత్తం
యథైకతా సమతా సత్యతా చ,
శీలం స్థితిర్దణ్డ నిధాన మార్జవం
తతస్తతశ్చోపరతిః క్రియాభ్యః."

ఏకాకిత్వము, సమత్వము, సత్యము, శీలము, స్థితి, అహింస, ఋజుత్వము, క్రమముగ కర్మలనుండి నివర్తించుట అను వీటితో సమానమైన ధనము బ్రాహ్మణునకు లేదు అని చెప్పబడినది.

"విద్వత్త్వమస్మాత్పరమ్" — ప్రవృత్తిధర్మము విషయమున దీనిఅర్థమును ఈ విధముగ చెప్పవలెను. "యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" అను ఛాందోగ్య శ్రుతి ననుసరించిచేసెడి కర్మను దాని కంగములగు మంత్రముల అర్థ జ్ఞానముతో చేసినచో అధికఫలము లభించును అని చెప్పినట్లైనది. కావుననే ఆ ఘట్టమునందలి భాష్యములో— "ఒక వర్తకుడు, ఒక

ఆటవికుడు పద్మరాగ మాణిక్యమును అమ్మినపుడు, వర్తకునకు జ్ఞానము అధికముగ నుండుటవలన అధిక ఫలము లభించుట లోకమున కానవచ్చుచునే యున్నదికదా" అని చెప్పబడినది. నివృత్తి ధర్మవిషయమున దీని యర్థమిట్లు:— 'సన్న్యస్య శ్రవణం కుర్యాత్' సన్న్యసించి శ్రవణము చేయవలెను అని విధించుటవలన, సన్న్యసించినపిమ్మట వేదాన్తవాక్యముల శ్రవణము చేయుటచే జనించిన పరోక్షజ్ఞానము కలిగి యుండుటయే విద్వత్త్వము.

అస్మాత్పరం ఆత్మానాత్మ వివేచనమ్:— ఈ విషయము ముస్తుందు గ్రంథమునందు స్పష్టమగును. దీనిచే, వినిన విషయమును యుక్తులచే దృఢము చేసికొనుటకై చింతనము చేయుట యను మననమును చెప్పినట్లైనది. ఈ మననము సంశయమును తొలగించును. దాని తరువాత నిదిధ్యాసనము చేయగా కల్గిన బ్రహ్మసాక్షాత్కారరూపమగు 'స్వనుభవము' చెప్పబడినది. శ్రవణ మననముల వలన కలిగిన అనుభవము విపరీత జ్ఞానమును తొలగించెడు నిదిధ్యాసనము లేకున్నచో స్థిరముగ నిలువజాలదు గాన అది 'స్వనుభవము' అని చెప్పబడినది. దీనిచే శుభేచ్ఛ (శాస్త్రసజ్జనసంపర్కాభిలాష) విచారణ (సదాచారప్రవృత్తి),తనుమానస(విషయాభిలాషక్షీణించుట) సత్త్వాపత్తి (సత్త్వగుణాభివృద్ధి) అను నాల్గు జ్ఞానభూమికలను చెప్పినట్లైనది. "బ్రహ్మాత్మనా సంస్థితిః ముక్తిః" అనునపుడు వాసనాక్షయ మనోనాశనములతో గూడిన స్వనుభవమును బోధించు 'సంస్థితి' శబ్దముచే అసంసక్తి (సంగరాహిత్యము), పదార్థాభావనా (ఆత్మైక దృష్టి ఏర్పడుటచే బాహ్యాన్తర పదార్థములను గుర్తింపక పోవుట), తుర్యగా (అద్వైతాత్మస్థితి) అను భూమికలు కూడ సూచింపబడినవి. ఈ భూమికాసప్తకము సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహములో 939-948 శ్లోకములలో విపులముగ వర్ణింపబడినది. దీనిచే సాలోక్య-సామీప్య-సారూప్య-సాయుజ్యము లనునవి ముఖ్యమైన ముక్తులు కావను విషయము గూడ సూచితమైనది. ఈ నాల్గును సగుణ

విషయకములేగాన మిథ్యాభూతములే. సగుణ రూపమునకు పరిచ్ఛేదత్రయశూన్యత్వరూపమగు బ్రహ్మత్వమును జెప్పుట కుదరదు కదా! (సాలోక్యాదులకు—దేవుని లోకము నందుండుట, సమీపము నందుండుట, సమానరూపముతో నుండుట, దేవునితో కలియుట అని అర్థము. ఈ కాలము నందున్నది అని చెప్పుట కాలతః పరిచ్ఛేదము. ఈ ప్రదేశము నందున్నది అని చెప్పుట దేశతః పరిచ్ఛేదము. ఇది దానికంటె భిన్నము అని చెప్పుట వస్తుతః పరిచ్ఛేదము. బ్రహ్మకు ఈ మూడు పరిచ్ఛేదములు లేవు. అనగా అది సర్వదా ఉన్నది. అంతట ఉన్నది. తద్భిన్నమగునది ఏదియు లేదు). కల్పితములగు సకలవిధోపాధుల సంబంధములేని నిత్యము, శుద్ధము, బుద్ధము, ముక్తము, ప్రత్యగాత్మభిన్నము అగు పరిపూర్ణ స్వరూపమున ఉండుటయే 'బ్రహ్మాత్మనా సంస్థితి'. అట్టి కైవల్యమే ముక్తి. అది శతకోటి జన్మకృతములగు పుణ్యములు లేకున్నచో లభింపదు అని అన్వయము.

దుర్లభం త్రయమేవైతద్ దైవానుగ్రహహేతుకమ్,
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః. 3

మనుష్యత్వం=మనుష్యత్వము, ముముక్షుత్వం=మోక్షేచ్ఛకలుగుట, మహాపురుషసంశ్రయః=మహాపురుషుని ఆశ్రయము అనెడు ఏతత్=ఈ, త్రయం = త్రయము, దుర్లభమ్ = కష్టముచే లభించునది. దైవానుగ్రహహేతుకం ఏవ = దైవానుగ్రహమే హేతువుగా కలది (దైవానుగ్రహము చేతనే కలుగును).

లబ్ధ్వా కథంచిత్ నరజన్మ దుర్లభం
తత్రాపి పుంస్త్వం శ్రుతిపారదర్శనమ్,
యః స్వాత్మముక్త్యై న యతేత మూఢధీః
స ఆత్మహా స్వం వినిహన్త్యసద్గ్రహాత్. 4

దుర్లభం = దుర్లభమైన, నరజన్మ=మనుష్యజన్మను, కథంచిత్ = ఎటులనో, లబ్ధ్వా = పొంది, తత్రాపి = అందును, పుంస్త్వం =పురుషత్వమును, శ్రుతిపారదర్శనం = శాస్త్రాంత జ్ఞానమును, (పొంది), యః = ఏ, మూఢధీః = మూఢబుద్ధికలవాడు, స్వాత్మముక్త్యై = తన యొక్క మోక్షము కొరకు, న యతేత = ప్రయత్నించదో, సః = అతడు. ఆత్మహా = ఆత్మఘాతుకుడు, అసద్గ్రాహాత్ = చెడ్డపట్టుదలవలన, స్వం= తనను, వినిహన్తి = చంపుచున్నాడు (నశింపచేసికొనుచున్నాడు).

ఇతః కోన్వస్తి మూఢాత్మా యస్తు స్వార్థే ప్రమాద్యతి.
దుర్లభం మానుషం దేహం ప్రాప్య తత్రాపి పౌరుషమ్. 5

యః = ఎవడు, దుర్లభం = పొందుటకు కష్టమైన, మానుషం దేహం = మనుష్యదేహమును, తత్రాపి = అందులోను, పౌరుషం = పురుషదేహమును, ప్రాప్య = పొంది, స్వార్థే = స్వలాభవిషయమున, ప్రమాద్యతి = శ్రద్ధారహితుడై ప్రమాదమును చెందునో, ఇతః = ఇట్టి వానికంటె, మూఢాత్మా = మూఢబుద్ధిగలవాడు, కోను = ఎవడు, అస్తి= ఉన్నాడు.

పఠన్తు శాస్త్రాణి యజన్తు దేవాన్
కుర్వన్తు కర్మాణి భజన్తు దేవతాః.
ఆత్మైక్యబోధేన వినా విముక్తిః
న సిద్ధ్యతి బ్రహ్మశతాన్తరేఽపి. 6

శాస్త్రాణి = శాస్త్రములను, పఠన్తు = పఠింతురుగాక; దేవాన్ = ఇంద్రాదిదేవతలను, యజన్తు = యజ్ఞములచే సేవింతురుగాక; కర్మాణి= కర్మలను; కుర్వన్తు =చేయుదురుగాక; దేవతాః = దేవతలను; భజన్తు= ఉపాసింతురుగాక. ఆత్మైక్యబోధేన వినా= ఆత్మైక్యజ్ఞానము లేకుండగా, బ్రహ్మశతాన్తరేఽపి = నూరు బ్రహ్మాంతరములలో గూడ, విముక్తిః = ముక్తి, న సిద్ధ్యతి = సిద్ధింపదు.

అమృతత్వస్య నాశాస్తి విత్తే నేత్యేవ హి శ్రుతిః,
బ్రవీతి కర్మణో ముక్తేరహేతుత్వం స్ఫుటం యతః. 7

యతః = ఎందువలన అనగా, విత్తేన = ధనముచేత, అమృతత్వస్య = మోక్షమునకు, ఆశా = ఆశ, నాస్తి = లేదు, ఇత్యేవ= అని, శ్రుతిః = శ్రుతి, కర్మణః = కర్మ, ముక్తేః = ముక్తికి, అహేతుత్వం = హేతువుకాదు అను విషయమును, స్ఫుటం = స్పష్టముగా, బ్రవీతి హి = చెప్పుచున్నదికదా॥

## జ్ఞానోపలబ్ధికి ఉపాయము

అతో విముక్త్యై ప్రయతేత విద్వాన్
సంన్యస్త బాహ్యార్థ సుఖస్పృహః సన్.
సన్తం మహాన్తం సముపేత్య దేశికం
తేనోపదిష్టార్థ సమాహితాత్మా. 8

అతః = ఈ కారణము వలన, విద్వాన్ = విద్వాంసుడు, సంన్యస్త బాహ్యార్థ సుఖస్పృహః = బాహ్యవిషయములవలన కలుగు సుఖముల యందు ఆశను విడనాడిన వాడై, సన్ = సత్త్వము (ఉనికి) కలవాడై, సన్తం=సత్స్వరూపుడును. మహాన్తం=మహాపురుషుడును ఐన, దేశికం= గురువును, సముపేత్య = సమీపించి, తేన = అతనిచే, ఉపదిష్టార్థ సమాహితాత్మా = ఉపదేశింపబడిన విషయమునందు నిలుపబడిన బుద్ధికలవాడై, విముక్త్యై = ముక్తికొరకు, ప్రయతేత = ప్రయత్నింపవలెను.

మనుష్యజన్మ పురుషజన్మాదికము ఎన్నోజన్మలలో చేసికొనిన పుణ్యముల ఫలము. పురుషుడు స్వలాభప్రాప్తి విషయమున అప్రమత్తుడుగ నుండవలెను. దుఃఖములు పూర్తిగ తొలగిపోయిన పిదప లభించు నిరతిశయ సుఖరూపమగు మోక్షము ఆత్మైక్య జ్ఞానము కలుగనంతవరకు కర్మకాండను అధ్యయనము చేసి తద్విహితమగు కర్మల ననుష్ఠించినంత మాత్రమున లభింపదు: ఈ విషయ

మును "అమృతత్వస్య నాశాస్తి విత్తేన" అను శ్రుతి కూడ సమర్థిం చుచు ధనసాధ్యమగు కర్మ సాక్షాన్మోక్షసాధనము కాజాలదని చెప్పు చున్నది. ఈ కారణములచే విద్వాంసుడు మోక్షము కొరకై ప్రయ త్నించవలెను. 'విద్వాన్' అను పదమునకు నిత్యానిత్య వివేకము కలవాడని యర్థము; ఏలయన-

యే హి సంస్పర్శజా భోగా దుఃఖ యోనయ ఏవ తే,
ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః.

ఓ అర్జునా, ఇంద్రియ విషయ సంయోగము వలన కలిగిన భోగ ములు దుఃఖమునకే కారణములు. వీటికి ఆదియు అంతమును ఉన్నవి. బుధుడు వాటిపై ఆసక్తి చూపడు అను భగవద్గీతా శ్లోక మున 'బుధ' శబ్దము ఈ యర్థమునందే ప్రయోగింప బడినది. భోగ్య వస్తువుల వలన కలుగు సుఖము (వైషయిక సుఖము) అనిత్య మని సూచించుటకై బాహ్యార్థ' అని చెప్పబడినది. విషయములు బాహ్యము లగుటచే అవి ఆగంతుకములు-అప్పుడప్పుడు వచ్చునవి. అవి ఎల్లప్పుడును ఉండునవికావు. కావున వాటి వలన కలుగు సుఖము కూడ అట్టిదే. అందుచే వివేకవంతుడగు పురుషశ్రేష్ఠుడు అట్టి భోగములపై ఆసక్తిని విడనాడవలెను. అట్లు విడనాడుటలో మొదటిప్రయత్న మెట్లు చేయవలెనో సూచించుచు "సంన్యస్త బాహ్యార్థసుఖస్పృహః సన్" అని చెప్పుచున్నాడు. "బాహ్యములగు పదార్థములవలన కలిగెడు సుఖమునందు ఆసక్తిలేనివాడు" అని చెప్పుటచే ఐహికాముష్మిక ఫలభోగ విరాగము-ఇహలోకమునందును పరలోకమునందు లభించు ఫలముల ననుభవించు విషయమున వైరాగ్యము సూచితమైనది. దీనిచే శ్రుతిస్మృతి విహితములగు కర్మ లను నిష్కామముగ అనుష్ఠించి అంతఃకరణమును నిర్మలము చేసికొన వలెను అను విషయమును గూడ చెప్పినట్లే. విషయలంపటుడగు

వివేకరహితునకు అస్తిత్వముకూడ దుర్లభము (అట్టివాడు ఉన్నను లేనట్లే) అని సూచించుటకై 'సన్' అని చెప్పబడినది.

"ఆచార్యవాన్ పురుషో వేద ఆచార్యాద్ధైవ విద్యా విదితా సాధిష్ఠం ప్రాపత్, — ఆచార్యుడుగల పురుషుడే తెలిసికొనగలడు: ఇత్యాది శ్రుతులు చెప్పినవిధమున - అతీంద్రియమగు ఆత్మైక్యజ్ఞానము లభింపవలెనన్నచో గురుసహాయము లేకుండ శక్యము కాదు గాన, పూర్వము చెప్పినట్లు మహాపురుషుని ఆశ్రయింపవలెనని 'సన్తం' ఇత్యాదికముచే చెప్పుచున్నాడు. 'సన్తం' అనగా 'అస్తీతి సన్' అను విగ్రహముచే 'ఉన్నవానిని' అని యర్థము. "అస్తి బ్రహ్మేతి చేద్వేద సన్తమేవం తతో విదుః" (బ్రహ్మ ఉన్నది అని ఎవడు తెలిసికొనునో ఆతనిని 'సన్' అని-ఉన్నాడు అని చెప్పుదురు), 'సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్', (ఓ సౌమ్యుడా! ఇదియంతయు ప్రారంభమున సద్రూపముననే ఉండెను), "యో వై భూమా తదమృతమ్: అతోఽన్యదార్తమ్" (ఏది అతి విస్తృత మైనదో, సంకోచ రహితమైనదో అదియే నాశరహితమైనది; తద్భిన్నమైన దంతయు దుఃఖభూయిష్ఠమైనది, నశ్వరమైనది), "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" (బ్రహ్మ సత్యస్వరూపమైనది, జ్ఞానరూపమైనది, అనంతమైనది),

"నాసతో విద్యతే భావో నాభావో విద్య తేసతః,
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయోస్తత్త్వదర్శిభిః"

(అసత్తునకు భావము — అనగా ఉనికిలేదు; సత్తునకు అభావము అనగా లేకుండుట అనునది లేదు. తత్త్వజ్ఞానము కలవారు ఈ సదసత్తులయొక్క యథార్థస్వరూపమును బాగుగా ఎరుగుదురు) మొదలగు శ్రుతిస్మృత్యాదివచనములచే ప్రతిపాదితమగు కాలత్రయాబాధితత్వరూపమగు సత్త్వము అనగా భూతకాలమునందును, వర్తమానమునందును, భవిష్యత్తునందును గూడ ఉండుటయనునది బ్రహ్మయందు మాత్రమే యున్నది. "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" (బ్రహ్మవేత్త

బ్రహ్మగానే అగును) అను శ్రుతిననుసరించి దేశికునకుగూడ బ్రహ్మా భిన్నత్వముండుటచే సత్త్వము లభించుచున్నది. దీనిచే అనాత్మలగు అసత్తుల విషయమున పూర్తిగ అభిమానము తొలగిపోవుట యను బ్రహ్మనిష్ఠ—బ్రహ్మయందు ఏకాగ్రస్థితి—(గురువునకుండవలెనని) సూచితమైనది.

"తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్"—ఆత్మజ్ఞానమునకై సాధకుడు, సమిధలను (గురూ పాయనముగ) చేతధరించి శ్రోత్రియును, బ్రహ్మనిష్ఠుడును అగు గురువువద్దకే వెళ్ళవలెను; "అనన్యప్రోక్తే గతిరత్ర నాస్తి అణీయాన్ హ్యతర్క్యమణుప్రమాణాత్"—అనన్యునిచే అనగా అద్వితీయాత్మజ్ఞాన వంతునిచే బోధింపబడిన ఈ యాత్మవిషయమున గతియనునది లేదు. [బ్రహ్మ జీవాభిన్నము గాన ఎచటికోపోయి బ్రహ్మను కలియుట యనునది లేదు] ఇది అతిసూక్ష్మమైనది. అతిసూక్ష్మమగుటచే (ఊహింప శక్యముకానిది) ఇత్యాది శ్రుతులచే అట్టి బ్రహ్మనిష్ఠుడగు గురువుమాత్రమే సంశయాదులను పూర్తిగా తొలగించి శుద్ధాత్మజ్ఞాన మును కలిగింపగలడని తెలియుచున్నది. ఇది యుక్తమే కదా? లోకములోగూడ మనకు తెలియని మార్గమునుగూర్చి ఎవరైన మనకు చెప్పవలెనన్నచో మొదట వారు ఆ మార్గమును చూచియుండవలెను గదా? ఏదైన ఒకవిషయమును మనము స్వయముగనే తెలిసికొన్నను దానివిషయమున గల్గు సందేహములను, దాని యథార్థస్వరూపము తెలిసినవారు మాత్రమే తీర్పగలరుగాని ఇతరులు తీర్పజాలరు కదా? ఈ విషయమున శుకజనకసంవాదమే ప్రమాణము. శుకుడు పూర్వ జన్మకృతపుణ్యపరిపాకవశముచే స్వయముగ ఆత్మతత్త్వమును తెలిసి కొనగల్గెను; తండ్రి యుపదేశమునుగూడ పొందెను. అయినను ఆయ నకు ఆత్మవిషయమున మనఃస్థైర్యము కలుగుటకు మహానుభావుడగు జనకుని ఉపదేశము ఆవశ్యక మయ్యెను. ఈ విషయము వాసిష్ఠ

రామాయణాదులందు చెప్పబడియున్నది. ఈ విధముగ దేశికుడు సద్రూపబ్రహ్మాభిన్నుడగుటచే ఆయనకు సత్త్వము చెప్పబడినది. కావుననే ఆయనకు మహత్త్వము కూడ. మహత్త్వమనగా పంచ కోశముల వివేకము కలిగియుండుటచే అపరిచ్ఛిన్నముగ అన్న మయాదికోశములచే పరిమితుడు కాకుండ ఉండుట లేదా మహత్త్వ మనగా శాస్త్రోక్తసమస్తసద్గుణములు కలిగియుండుట యని యర్థము చెప్పవచ్చును. ఇట్టి గుణములను "శ్రోత్రియోఽవృజినో.... ఇవానలః" (34) ఇత్యాదిశ్లోకములలో మున్ముందు చెప్పనున్నాడు. "శిష్యేభ్యః జ్ఞానం దిశతి" అను విగ్రహముచే దేశికుడనగా శిష్యులకు జ్ఞానము నిచ్చువాడు అని యర్థము. అతనిని యథాశాస్త్రముగ సమీపించి, అత డుపదేశించిన బ్రహ్మస్వరూపమునందును. తత్ప్రాప్తికి సహాక రించు మార్గమునందును బాగుగ అంతఃకరణమును నిలిపి, ముక్తికై ప్రయత్నింపవలెను. మోక్షేచ్ఛ లేనిచో మోక్షమునకై ప్రయత్నము కుదురదు కాన ముముక్షుత్వము సూచింపబడినది. 'ఉపదిష్టార్థసహి తాత్మా' అని చెప్పుటచే, ఎల్లప్పుడును బ్రహ్మలగ్నమగు మానసము కలిగియుండుట అనునది సర్వకర్మసన్న్యాసము లేనిచో అసంభా వ్యము గాన—వివేకముకలిగిన వైరాగ్యవంతుడు తాను సకలకర్మలను సంన్యసించి, బ్రహ్మనిష్ఠుడగు గురువును సమీపించి బ్రహ్మవిచారము చేయవలెను అని చెప్పినట్లైనది.

సాధకునకు నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థఫల భోగవిరాగము, శమదమాదిసాధనసంపత్తి, ముముక్షుత్వము అను నాలుగుసాధనములు (సాధనచతుష్టయము) ఉండవలెను. 'విద్వాన్' 'సంన్యస్త బాహ్యార్థ సుఖస్పృహః' 'విముక్త్యై ప్రయతేత' అనువాటిచే వివేక - విరాగ - ముముక్షుత్వములు సూచింపబడినవని ఇచట శ్రీ చరణుల వ్యాఖ్యకు అభిప్రాయము.

ఉద్ధరేదాత్మ నాత్మానం మగ్నం సంసారవారిధౌ,
యోగారూఢత్వమాసాద్య సమ్యగ్దర్శననిష్ఠయా. 9

సమ్యగ్దర్శననిష్ఠయా = సమ్యగ్జ్ఞానమునందు నిష్ఠచేత, యోగారూఢత్వం = యోగారూఢత్వమును, ఆసాద్య = పొంది, సంసారవారిధౌ = సంసారసముద్రమునందు, మగ్నం = మునిగియున్న, ఆత్మానం = తనను, (మనస్సును) ఆత్మనైవ = తనచేతనే (మనస్సుచేతనే), ఉద్ధరేత్ = ఉద్ధరించవలెను.

సంగ్రహముగా జెప్పిన విషయమునే ఏడు శ్లోకములలో వివరించుచున్నాడు. అందు ముక్తికొరకై చేయబడు ప్రయత్నమునకు సమ్యగ్దర్శననిష్ఠయే పరమావధి కావున, మోక్షమునకు సాక్షాత్సాధనమగు ఆ సమ్యగ్దర్శననిష్ఠను, దానికి ముఖ్యహేతువైన, పరవైరాగ్యమను నామాంతరముగల యోగారూఢత్వమును ఈ శ్లోకమున చెప్పుచున్నాడు.

"యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే,
సర్వసంకల్ప సంన్యాసీ యోగారూఢస్తదోచ్యతే."

ఎపుడు సర్వసంకల్పములనువిడనాడి, ఇంద్రియార్థములందును, కర్మల కర్మములయందును: అసక్తుడుకాడో అపుడు యోగారూఢుడని చెప్పబడును అని భగవంతుడు చెప్పిన విధమున సంసారసముద్రమునందు పడియున్న తనను ఉద్ధరించుకొనుటకు పరమవైరాగ్యసహితమగు సమ్యగ్దర్శననిష్ఠయే హేతువు అని భావము.

క్లేశాదిపంచక తరంగయుతం భ్రమాఢ్యం
దారాత్మజాప్తధన బన్ధు ఝషాభియుక్తమ్,
ఔర్వానలాభ నిజరోష మనంగ జాలం
సంసారసాగర మతీత్య హరిం వ్రజామి.

క్లేశాదిపంచకమనెడు తరంగములతో కూడినదియు, భ్రమతో (సుడులతో) నిండినదియు, భార్య, కుమారులు, కావలసినవారు, ధనము, బంధువులు అనెడు మత్స్యములతో వ్యాప్తమైనదియు, బడబాగ్నివంటి తన కోపము (కోపమనెడు బాడబాగ్ని) కలదియు, మన్మథుడనెడు వలనుకలదియు అగు సంసారసాగరము దాటి హరిని చేరుదును.

సంసారసాగరవిశాల కరాలకాల
నక్రగ్రహ గ్రసన నిగ్రహవిగ్రహస్య,
వ్యగ్రస్య రాగనిచయోర్మి నిపీడితస్య
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్.

సంసారసాగరమునందలి మహాప్రమాణమును, భయంకరమును అగు (కాలమనెడు) మొసళ్లును, (రోగాదులనెడు) ఇతర జలజంతువులును మ్రింగుటచే పట్టుదప్పిన శరీరముకలవాడను, భయపడుచున్నవాడను, రాగసముదాయమనెడు తరంగములచే పీడితుడను అగు నాకు ఓ లక్ష్మీనృసింహా, చేయూత నిమ్ము - ఇత్యాది విధమున వర్ణితమును, అజ్ఞానరూపమును, అజ్ఞానవిలాసరూపమును అగు సంసారమును సమ్యగ్జ్ఞానము లేకున్నచో దాటు శక్యముకాదు గాన అది ఒక సముద్రమని చెప్పుదురు. అనాత్మయగు దేహమును ఆత్మయని భావించుచున్నంతవరకును ఆ దేహము జనించుచున్నపుడుగాని, మరణించుచున్నపుడుగాని దానికి సంబంధించిన ధర్మము ఆత్మయందులేదు అను జ్ఞానము కలుగదుకదా! అట్లే ప్రాణము క్షుత్పిపాసలతో బాధపడుచున్నప్పుడు గాని, అంతఃకరణము సుఖదుఃఖావిష్టమగునపుడుగాని ఆ ధర్మములు ఆత్మకు సంబంధించునవి కావను జ్ఞానము కలుగదుకదా? ఈ విధముగ అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము అనునవి అవిచ్ఛిన్నముగ నుండుటచే ఈ క్లేశాది పంచకమును తరంగమునుగా రూపించుట జరిగినది. అట్లు

లేనిదానిని ఆ విధముగానున్నట్లు భావించుట భ్రమము. ఈ భ్రమమే సుడి, ఇత్యాద్యర్థము స్పష్టము. ఆత్మ సంగరహితమైనది; సచ్చిదానందస్వరూపమైనది. అట్టి ఆత్మ అనాద్యవిద్యావశముచే "నేను అజ్ఞుడను, కర్తను, మనుష్యుడను" ఇత్యాదివిధమున అనాత్మలగు స్థూలసూక్ష్మకారణ శరీరములందు ఆత్మబుద్ధితో ప్రవర్తించుచు తన యథార్థస్వరూపమును తెలిసికొనకుండుటయే సంసారవారిధి మగ్నత్వము.

సుషుప్తిలో బాహ్యప్రపంచానుభవము ఉండదు. అందుచే వివేకరహితమగు మనోరూపోపాధియే ఈ సంసారమునకు మూలమని చెప్పవలెను. కావుననే –

మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధ మోక్షయోః,
బన్ధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్.

మనుష్యులబంధమోక్షములకు మనస్సే కారణము. విషయాసక్తమైనచో బన్ధమునకును, విషయాసక్తి శూన్యమైనచో మోక్షమునకును కారణము అని చెప్పబడుచున్నది. కావున ఆత్మ సంసారవారిధి మగ్నమగుట యనగా, వివేకశూన్యమగు మనస్సు శరీరాదిసక్త మగుటయే. ఈ మనస్సు శ్రవణమననాది శాస్త్రీయసంస్కారములచే ఎపుడు సంస్కరింపబడునో అపుడు ఆత్మ యథార్థస్వరూపము తెలియుటచే అది భ్రమశూన్య మగును. కావున వివేకశూన్యమగు మనస్సును శాస్త్రవివేకము గల మనస్సుతో, ఉద్ధరేత్ = అనాత్మలనుండి దూరము చేయవలెను. బహిర్ముఖముగనుండుట మనస్సునకు స్వభావము. అది బాహ్యములగు శరీరాదులలో సక్తమగునపుడు, వాస్తవమున ఆత్మసంగవిహీనమైనను, స్ఫటికము జపాపుష్పాది ప్రతిబింబముచే ఎట్లగ కనబడినట్లు సంగము కలదివలె కనబడును. ఆ ఉపాధియగు మనస్సే అంతర్ముఖమై, అనాత్మసంబంధమును వీడి, ఆత్మపై స్థిరముగ నిలచినపుడు ఆత్మ ఉద్ధ

రింపబడినట్లు అగును అని భావము. 'సంసారవారిధిలో మగ్నమైన ఆత్మను, యోగారూఢత్వమును సంపాదించి, సమ్యగ్దర్శనస్థైర్యముచే ఆత్మచేతనే ఉద్ధరింపవలెను' అని అన్వయము.

ఈ శ్లోకమున 'ఉద్ధరేదాత్మనాత్మానమ్' అనుదానికి ఆత్మను ఆత్మచేతనే ఉద్ధరింపవలెను అనియు, మనస్సును మనస్సుచేతనే ఉద్ధరింపవలెననియు రెండు విధముల వ్యాఖ్యానమును శ్రీచరణులు సూచించియున్నారు.

అవ. యోగారూఢత్వమనగా ఏదియో స్పష్టీకరించుచు సన్న్యాస స్వీకారానంతరము సంపాదించవలసినవియు, సమ్యగ్దర్శన నిష్ఠా ప్రాప్తికి సాధనములును అగు శ్రవణ మనన నిదిధ్యాసనములను గూర్చి 'సంన్యస్య' ఇత్యాదిశ్లోకములలో చెప్పుచున్నాడు.

సంన్యస్య సర్వకర్మాణి భవబన్ధ విముక్తయే,
యత్యతాం పండితైర్ధీరై రాత్మాభ్యాస ఉపస్థితైః. 10

సర్వకర్మాణి = సమస్తకర్మలను, సంన్యస్య = సంన్యసించి, ధీరైః = మనస్సును అదుపులో నుంచుకొన్నవారును, ఆత్మాభ్యాసే = ఆత్మకుసంబంధించిన శ్రవణాదులయందు, ఉపస్థితైః = ప్రవర్తించుచున్న పండితులచే, భవబంధవిముక్తయే = సంసారబంధముల ముక్తికొరకు, యత్యతామ్ = ప్రయత్నము చేయబడుగాక.

సర్వకర్మాణి సంన్యస్య=కర్మకాండోక్తములగు కర్మలనన్నింటిని విడచి, భవబంధవిముక్తయే=సాంసారికబంధముల నివృత్తికి కారణ మగు సమ్యగ్దర్శననిష్ఠకొరకై, పండితైః = ఆత్మను ప్రత్యక్షముగ తెలిసికొనగల్గిన, ధీరైః = బుద్ధిని వశములోనుంచుకొన్న వారిచే

పరాంచి ఖాని వ్యతృణత్స్వయంభూః
తస్మాత్ పరాఙ్ పశ్యతి నాన్తరాత్మన్,
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్
ఆవృత్తచక్షురమృతత్వమిచ్ఛన్.

ఇంద్రియములు బహిర్ముఖములుగ మాత్రమే యుండునట్లు బ్రహ్మదేవుడు హింసించెను. అందుచే (మానవుడు) బాహ్యప్రపంచమును మాత్రమే చూడగలడుగాని అంతరాత్మను చూడజాలకున్నాడు. కోరు ఎవ్వడో ఒక్కడు దృష్టిని అంతర్ముఖముగ చేసికొని అంతరాత్మను చూడగల్గుచున్నాడు అని శ్రుతిచెప్పినట్లు ధియం = బుద్ధిని, రాతి = గ్రహించును అనగా వశములో నుంచుకొనును కాబట్టి 'ధీరుడు' దేహేంద్రియాదులలో అతిప్రధానమగు బుద్ధిని స్వాధీనము చేసికొనుచున్నాడన్నచో ఇతరేంద్రియములనుగూడ జయించినాడని వేరుగ చెప్ప బనిలేదు. దీనిచే - శాంత్యాదులు కల్గియుండవలెనను విషయము సూచితము. ఆత్మాభ్యాసమనగా —

తచ్చిన్తనం తత్కథన మన్యోన్యం తత్ప్రబోధనమ్,
ఏతదేకపరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః.

దానిని — ఆత్మనుగూర్చి ఆలోచించుట, దానినిగూర్చి మాటలాడుట, పరస్పరము దానినిగూర్చి బోధించుకొనుట అనునదియే తదేకదృష్టితో చేసెడు బ్రహ్మాభ్యాసమని పండితులు చెప్పుదురు అని ప్రామాణికులు చెప్పిన విధమున వినిన విషయమును మననము చేసికొనుట, దానినిగూర్చి ముచ్చటించుచుండుట. ఒకరికొకరు బోధించుకొనుట అనెడు జ్ఞానకాండోక్తములైన వ్యాపారములందు లగ్నమైయుండుట అట్టి ఆత్మాభ్యాసోద్యుక్తులు, విజాతీయములగు జ్ఞానములచే విచ్ఛిన్నము కాని సజాతీయజ్ఞాన ప్రవాహమగు నిదిధ్యాసనమును అనుష్ఠించుచు ప్రయత్నింతురు గాక అని యన్వయము. (ఇతర జ్ఞానములేవియు

మధ్య కలుగకుండ ఒకేజ్ఞానము అవిచ్ఛిన్నముగ చాలకాలము తైల ధారవలె కొనసాగుట నిదిధ్యాసనము). ఇట్టి పురుషునకు సర్వసంక ల్పములను సంన్యసించుటచే ఉత్తమవైరాగ్యమను నామాంతరముగల యోగారూఢత్వము హస్తగతమే యని తెలియవలెను.

అవ. (ఆశంక) 'యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్ '- జీవించియున్నంతకాలము అగ్నిహోత్రము చేయవలెను; "యావజ్జీవం దర్శపూర్ణమాసాభ్యాం యజేత"- జీవించియున్నంతవరకు దర్శపూర్ణ మాస యాగములు చేయవలెను; "అహరహః సంధ్యాముపాసీత"- ప్రతిదినము సంధ్యోపాసన చేయవలెను; "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః"-కర్మలుచేయుచునే నూరుసంవత్సరములపాటు జీవనము గడపుటకై అభిలషించవలెను — ఇత్యాదిశ్రుతులు జీవించి యున్నంతవరకును కర్మలుచేయుచునే యుండవలెనని బోధించు చున్నవికదా? కర్మసంన్యాసము చేసినచో శ్రుతిని అతిక్రమించినట్లు కాదా?

(సమాధానము). కాదు. ఏలయన ఆ శ్రుతులన్నియు చిత్తశుద్ధి లేనివారినిగూర్చి చెప్పినవి. అందుచేతనే "ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే" అను ఈశావాస్యమంత్రము - 'నరే=నరమాత్రాభిమానముగల, త్వయి=నీయందు, ఇత=కర్మా చరణముకంటె, అన్యథా=మరియొకమార్గము-దేనివలన కర్మలోపము వలనకల్గు పాపముండదో అట్టిమార్గము — నాస్తి=లేదు' అని చెప్ప బడినది. అనగా 'నేను మానవుడను' అని అనుకొనునంతవరకును కర్మ చేయుచునే యుండవలెను అని భావము; "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః" - కర్మచేత కాదు, సంతానము కనుటచేకాదు, ధనముచేకాదు - కర్మత్యాగము చేతనే కొందరు మోక్షమును పొందిరి; 'సంన్యాసయోగాద్యతయః శుద్ధ సత్త్వాః" - యతులు సంన్యాసయోగముచే శుద్ధమైన బుద్ధికలవారు;

ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపాః
అష్టాదశోక్తమవరం యేషు కర్మ,
ఏతచ్ఛ్రేయో యేఽభినన్దన్తి మూఢా
జరామృత్యుం తే పునరేవాపి యన్తి.

యజ్ఞోపాధిభూతులగు ఈ పదునెనమండుగురును - 16 గురు ఋత్విక్కులు, యజమానుడు, అతని భార్య - దుర్బలమైన తెప్పలు. వారిపై ఆధారపడియున్న యజ్ఞరూపమగు కర్మగూడ క్రింది తరగతికి చెందినదే. ఏ మూఢాత్ములు ఈ కర్మనే శ్రేయస్సుగా అభినందింతురో వారు మరల మరల జరామృత్యువుల పాలగుచుందురు, "కిమర్థా వయమధ్యేష్యామహే, కిమర్థా వయం యక్ష్యామహే" - మనమెందులకు ఈ అధ్యయనముచేయుట, ఎందులకీ యజ్ఞము లాచరించుట; ఇత్యాదిశ్రుతులు కర్మసంన్యాసమును విధించి కర్మను నిందించుచున్నవి "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసానాశకేన" - బ్రాహ్మణులు వేదాధ్యయనము చేతను, యజ్ఞము చేతను, దానముచేతను, అనశ్వరమగు తపస్సుచేతను ఈ ఆత్మను తెలిసికొన నిచ్ఛగించుచున్నారు; "యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాత్మశుద్ధయే" - యోగీశ్వరులు సంగమును విడిచి, కర్మలను ఆత్మశుద్ధికొరకై ఆచరించుచుందురు ఇత్యాదిశ్రుతిస్మృతులను పర్యాలోచించగా ఆ కర్మలు చిత్తశుద్ధిద్వారా వివిదిషకు (జ్ఞానేచ్ఛకు) సాధనములుగ నుండునని మాత్రమే నిర్ణయింపబడుచున్నది కాని వీటిని ఎల్లప్పుడును చేయుచునే యుండవలెనని కాదు. అట్లైనచో "యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్" - ఏ రోజున వైరాగ్యము కలుగునో ఆరోజునే సంన్యాసమును స్వీకరింపవలెను - అను సంన్యాసవిధాయకవాక్యములకు బాధ కలుగును; కర్మనింద కూడ అనుపపన్నమగును. "అత ఏవ చాగ్నీన్ధనాద్యనపేక్షా" "సర్వాపేక్షాచ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్" - విద్యయే పరమ పురుషార్థహేతువగుటచే అగ్నీన్ధనాదులగు యజ్ఞాదులగు-గృహస్థాద్యాశ్రమకర్మలు మోక్షవిషయమున

అపేక్షితములు కావు; 'తమేతం వేదానువచనేన' ఇత్యాది శ్రుతులచే ఆశ్రమకర్మలన్నియు విద్య లభించుటకుమాత్రము ఉపయోగించును; ఫలమునిచ్చునది మాత్రము విద్యయే, అశ్వాదులను బండిలాగుటకు మాత్రమే ఉపయోగింతురు గాని దుక్కిదున్నుటకు ఉపయోగింపరు. ఆ విధముగ కొన్ని వస్తువులు కొన్నింటిని సాధించుటకు మాత్రమే ఉపయోగపడును. అట్లే ఈ యజ్ఞాదులు అని బ్రహ్మసూత్రములు గూడ ఈ యర్థమునే బోధించుచున్నవి. కావున కర్మలు పరమ పురుషార్థమగు మోక్షము నీయజాలవు; ఇవి చిత్తశుద్ధి కలిగించుటద్వారా జ్ఞానమునకు బహిరంగములుగానే ఉండును - అను విషయమును 'చిత్తస్య' ఇత్యాదిశ్లోకమున చెప్పుచున్నాడు;

చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూపలబ్ధయే,
వస్తుసిద్ధిర్విచారేణ న కించిత్కర్మకోటిభిః. 11

కర్మ = కర్మ, చిత్తస్య = చిత్తముయొక్క, శుద్ధయే = శుద్ధికొరకు మాత్రమే ఉపయోగించును, తు = కాని, వస్తూపలబ్ధయే = వస్తుజ్ఞానము కొరకు, న = ఉపయోగించదు, వస్తుజ్ఞానము = వస్తుజ్ఞానము, విచారేణ = విచారణ చేయుటచేతనే కలుగును, కర్మకోటిభిః = కోటికర్మలు చేసినను, కించిత్ న = ఏమియు ప్రయోజనము లేదు.

అవ. విచారముచే వస్తుజ్ఞానము కలుగును అను విషయమునే దృష్టాంతముతో విశదీకరించుచున్నాడు.

సమ్యగ్విచారతః సిద్ధా రజ్జుతత్త్వావధారణా,
భ్రాన్త్యోదితమహాసర్ప భవదుఃఖవినాశినీ. 12

భ్రాంత్యా = భ్రాంతిచేత, ఉదితమహాసర్పభవదుఃఖవినాశినీ = పుట్టిన మహాసర్పమువలన కలిగిన దుఃఖమును నశింపజేసెడి, రజ్జుతత్త్వావధారణా = త్రాడుయొక్క యథార్థస్వరూపముయొక్క నిర్ధారణము, సమ్యగ్విచారతః = బాగుగా విచారణచేయుటవలన మాత్రమే, సిద్ధా = సిద్ధించును.

కనుచీకటిలో నేలపై పడిఉన్న త్రాడునుచూచి సర్ప మను కొన్న పురుషుడు భయపడినవాడై, దీపమును తీసికొని వచ్చిన పిమ్మట బాగుగ పరిశీలించి, ఆ వస్తువు యథార్థస్వరూపమును తెలిసి కొని, భయము, వణకు మొదలగు దుఃఖమును విడచును అను విషయము ప్రసిద్ధము. అచట త్రాడునందు, భ్రాంతిచే ఆవిర్భవించిన ఏ మహాసర్పముయొక్క జ్ఞానమువలన కలిగిన దుఃఖమును తొలగింప జాలిన రజ్జుతత్త్వనిర్ణయము బాగుగ ఆలోచించుటవలన కలిగినదో అట్లే భ్రాంతిచే కలిగిన సంసారదుఃఖమును అనగా జన్మమరణముల వలన కలుగు దుఃఖమును తొలగించెడి తత్త్వనిర్ణయము అనగా ఆత్మ యథార్థస్వరూపజ్ఞానరూపమగు ఆత్మసాక్షాత్కారముగూడ సమ్యగ్విచా రణ చేయుటవలననే కలుగును అని ఈ దృష్టాంతము సర్వాం శములందును ప్రకృతోపయుక్తముగ ఉన్నది.

అవ. ఆప్తుల ఉపదేశముప్రకారము చేయు విచారమే అర్థనిర్ణ యమునకుగాని, మరియొకకర్మ ఏదియు కాజాలదనియు చెప్పు చున్నాడు.

అర్థస్య నిశ్చయో దృష్టో విచారేణ హితోక్తితః.
న స్నానేన న దానేన ప్రాణాయామశతేన వా. 13

అర్థస్య = వస్తువుయొక్క, నిశ్చయః = నిర్ణయము, హితోక్తితః = హితులైనవారియొక్క ఉపదేశమువలన కలుగు, విచారేణ = విమర్శచేత, దృష్టః = చూడబడినది, స్నానేన = స్నానముచేత న = కాదు, దానేన = దానముచేతగాని, ప్రాణాయామశతేన వా = అనేక ప్రాణాయామములచేత గాని, న = కాదు.

అజ్ఞానదోషముచే భ్రాంతిచెందిన పురుషుడు భయకంపాద్య నర్థములకు లోనగును. అట్టిసమయమున అప్తోపదేశమనెడు ఆధారము లేకున్నచో అతడు తనంత తానుగ విషయస్వరూపమును గూర్చి

విమర్శింపజాలడు. అందువలన విచారమునకు ఆప్తోపదేశము హేతువుగ చెప్పబడినది. హితుడనగా యథార్థమును చెప్పువాడు. భ్రాంతి చెందినవాడు, హితులు ఉపదేశించిన విధమున విచారముచేయక స్నానము, దానము, ప్రాణాయామములు మొదలగు కర్మలుచేసినను భ్రమను తొలగింపగలిగిన అపరోక్షజ్ఞానము కలుగనంతవరకును, అనర్థకారణమగు భ్రమ నివర్తింపదు గాన, అపుడు అతనికి అనర్థనివృత్తి యెట్లు కలుగును? అని భావము. వస్తువుయొక్క యథార్థస్వరూపమును నిర్ణయించుటకు అనుకూలమగు మానసమగు వ్యాపారమే విచారము. భ్రాంతికలిగినపుడెల్ల దానిని తొలగించి ఒకవస్తువుయొక్క యథార్థస్వరూపమును తెలుపగలిగినది హితుల ఉపదేశము ననుసరించి చేసిన విచారమే యను విషయము ప్రత్యక్షసిద్ధము. కావున ప్రకృతమునందుగూడ శ్రుతిచేతను, ఆచార్యోపదేశానుసారముగను ఆత్మ విచారముచేసి, దాని యథార్థస్వరూపమును సాక్షాత్కరింప చేసికొని అనాత్మాధ్యాస (అధ్యారోప) రూపమగు సంసారమునుండి తనను తాను విడిపించుకొనవలెనని ఈ శ్లోకమునందలి ఉపదేశము.

అవ. ఆయా కర్మలను చేయగలసామర్థ్య మున్నవాడే ఆయా కర్మలఫలమును అనుభవింపగలడు; అసమర్థుడు అనుభవింపజాలడు. కావున బాహ్యములగు దేశకాలాదులు సహకారులుగ మాత్రమే ఉండును; ఫలము నిచ్చెడిది ఆంతరమగు సామర్థ్యము ఒక్కటియే యని చెప్పుచున్నాడు.

## అధికారినిరూపణము

అధికారిణమాశాస్తే ఫలసిద్ధి ర్విశేషతః,
ఉపాయా దేశకాలాద్యాః సన్త్యస్మిం సహకారిణః. 14

ఫలసిద్ధిః = ఫలముయొక్క సిద్ధి, విశేషతః = ముఖ్యముగ, అధికారిణం = అధికారిని, ఆశాస్తే = అపేక్షించును, అస్యాం = ఈ ఫలసిద్ధియందు, దేశకాలాద్యాః = దేశము కాలము మొదలైనవియు, ఉపాయాః = ఇతరోపాయములును, సహకారిణః = సహకారులుగ, సన్తి = ఉన్నవి.

కర్మల ఫలము మనకు కనుపించునది. అందుచే – 'యదాహవనీయే జుహోతి' – ఆహవనీయమునందు హోమముచేయుటవలన; 'అశ్వస్య పదే జుహోతి' – అశ్వము పాదము పెట్టినచోట హోమము చేయవలెను; 'ప్రాచీనప్రవణే వైశ్వదేవేన యజేత' – ప్రాచీన ప్రవణమున వైశ్వదేవయాగము చేయవలెను; 'సాయం జుహోతి' 'ప్రాతర్జుహోతి' – సాయంకాలమునందును, ప్రాతఃకాలము నందును హోమము చేయవలెను; 'వసన్తే బ్రాహ్మణోఽగ్నీ నాదధీత' – బ్రాహ్మణుడు వసంతమునందు అగ్న్యాధానము చేయవలెను; ఇత్యాది శాస్త్రములు పేర్కొనిన వసన్తప్రాతఃకాలాది కాలములును, అశ్వపదాది దేశములుగూడ (ఫలమునకు) అసాధారణకారణము అని అంగీకరింపవలెను.

(ఆశంక) "యథాదర్శే తథాత్మని యథా స్వప్నే తథా పితృలోకే, యథాప్సు పరీవ దదృశే తథా గంధర్వలోకే ఛాయాతపయోరివ బ్రహ్మలోకే" – ఆత్మ నిర్మలమగు బుద్ధియందు అద్దములో కనబడినట్లు స్పష్టముగ కనబడును. పితృలోకమునందు స్వప్నమునందువలె అస్పష్టముగ కనబడును, గంధర్వలోకమున నీటియందువలె ఇంకను అస్పష్టముగ కనబడును; బ్రహ్మలోకమున ఎండనీడలువలె వివిక్తముగ అతిస్పష్టముగ కనబడును; "ఇహ చేదవేదీదథ సత్యమస్తి, న చేదిహావేదీ దథ మహతీ వినష్టిః" – ఈ లోకమునందు బ్రహ్మ సాక్షాత్కారమును పొందగలిగినచో ఈ మనుష్యజన్మకు సార్థకత్వమున్నది; పొందజాలకపోయినచో గొప్పవినాశనము కలుగును – ఇత్యాదిశ్రుతులు మనుష్యలోక బ్రహ్మలోకములే బ్రహ్మజ్ఞానమునకు తగు దేశములని చెప్పుచున్నవి. ఇట్లే

ఋణత్రయమపాకృత్య మనో మోక్షే నివేశయేత్,
అనపాకృత్య మోక్షం తు సేవమానో వ్రజత్యధః.

మూడు ఋణములను చెల్లించినపిదప మనస్సును మోక్షమార్గమున నిలుపవలెను; వాటిని చెల్లింపకయే మోక్షమార్గమున ప్రవర్తించువాడు అధోగతిని పొందును. బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్, గృహాద్వనీ భూత్వా ప్రవ్రజేత్" - బ్రహ్మచర్యమును పూర్తిచేసికొని గృహస్థుడు కావలెను. తరువాత వానప్రస్థుడై, అటుపిమ్మట సంన్యాసమును స్వీకరించవలెను— ఇత్యాది ప్రమాణముల ననుసరించి బ్రహ్మజ్ఞానమున కంతరంగమగు సంన్యాసమునకు కూడ విహితమగు కాలమున్నది. కావున బ్రహ్మజ్ఞానమునకు గూడ దేశకాలాద్యపేక్ష ఉన్నదిగదా?

(సమాధానము) ఇట్టి వాక్యము లున్నమాట సత్యమే. అయినను, చిత్తశుద్ధిలేని రాక్షసరాజగు విరోచనుడు బ్రహ్మలోకమునకు వెళ్లినను, పరమగురువగు బ్రహ్మనుండి ఉపదేశము పొందినను ఆత్మజ్ఞానమును పొందజాలకపోయెను. మరియు

సంసారమేవ నిస్సారందృష్ట్వా సారదిదృక్షయా,
ప్రత్యజన్త్యకృతోద్వాహాః పరం వైరాగ్యమాశ్రితాః.

సంసారము నిస్సారమని గ్రహించి కొందరు, సారమును(పరతత్త్వము) చూడవలెనను అభిలాషతో, వివాహము చేసికొనక, పరమవైరాగ్యవంతులై సంన్యసించుచున్నారు.

"యది వేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్ గృహాద్వా వనాద్వా; యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్"—లేదా బ్రహ్మచర్యాశ్రమమునుండియే సంన్యసించవచ్చును; గృహస్థాశ్రమమునుండి లేదా వానప్రస్థాశ్రమమునుండి సంన్యసింపవచ్చును; ఏ దినమున వైరాగ్యము కలుగునో ఆ దినముననే సంన్యసింపవచ్చును— ఇత్యాది ప్రమాణములననుసరించి, మున్ముందు చెప్పనున్న వైరాగ్యాది సాధన చతుష్టయ సంపత్తికలవానికి దేశకాలముల అపేక్ష లేదు అను అభి

ప్రాయముతో, దేశకాలములు కేవలము సహకారులు_ప్రక్కనుండి ఉపకరించునవి మాత్రమేఅని చెప్పబడినది. కావుననే 'విద్వాన్ సంన్యస్త బాహ్యార్థసుఖస్పృహః సన్' అనువాక్యము శ్లో. 8 బ్రహ్మస్వరూపమున ఉండుట అనెడు మోక్షమునకు ప్రత్యక్షసాధనమగు సమ్యగ్దర్శననిష్ఠ కొరకు, మోక్షసాధనమును ఉపధేశించు గురువును ఆశ్రయించి ఆతడు ఉపదేశించిన విషయముపై మానసమును నిలుపుటకై వివేక వైరాగ్యములు హేతువులని చెప్పినది. ఇట్టి మనఃస్థైర్యము శమ_దమ ఉపరతి_తితిక్షా_శ్రద్ధలు లేనిచో లభింపదు. మోక్షేచ్ఛలేనిచో మోక్ష ప్రయత్నము సంభవింపదు. కావున "అతో విముక్త్యై" అను 8 వ శ్లోకమున, బ్రహ్మజిజ్ఞాసకు సాధారణహేతువులగు వివేక-వైరాగ్య-శమాది షట్క ముముక్షుత్వములు సూచితము లైనవి. "తరతి శోక మాత్మవిత్" - ఆత్మజ్ఞానవంతుడు శోకమును దాటును; "తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్" _ ఇత్యాది శ్రుత్యనుసారముగ 'శోకము' అను నామాంతరముగల బంధమును నశింపచేయగల్గిన సమ్యగ్జ్ఞానము లభింపవలెనన్నచో సద్గురువు ఉపదేశించిన విషయమును మననముచేయుటతప్ప మరియే సాధనమును లేదను విషయముగూడ ఈ శ్లోకమున సూచితమైనది. 'అస్యాం' అనగా 'సిద్ధియందు' అని యర్థము.

అతో విచారః కర్తవ్యః జిజ్ఞాసోరాత్మవస్తునః,
సమాసాద్య దయాసింధుం గురుం బ్రహ్మవిదుత్తమమ్. 15

అతః = ఈ కారణమువలన, దయాసింధుం = దయాసముద్రుడును బ్రహ్మవిదుత్తమం = బ్రహ్మవేత్తలలో గొప్పవాడును అగు, గురుం = గురువును, సమాసాద్య = పొంది, జిజ్ఞాసోః = బ్రహ్మనుగూర్చి తెలిసికోదలచిన సాధకునకు (నిచేత), ఆత్మవస్తునః = ఆత్మవస్తువుయొక్క, విచారః = విచారము, కర్తవ్యః = చేయదగినది.

అతః = సర్వానర్థములను తొలగించు నిర్ణయమునకు హేతు వగుటవలన, జిజ్ఞాసోః = ఆత్మను గూర్చి బాగుగ తెలిసికొనవలెనని కోరు పురుషునకు, ఆత్మవస్తువిచారము కర్తవ్యము. ఎట్లు చేయవలెనో (ముందుగ ఏమి చేయవలెనో) చెప్పుచున్నాడు. దయాసింధుం = తాను (గురువు) కృతార్థుడగుటచే తనకు ప్రయోజనమేమియు లేకున్నను ఇతరులుకూడ దుఃఖమును అనుభవింపకుందురుగాక అనెడు కరుణకు, జలములకు సముద్రమువలె నిలయభూతుడైన, గురుం = గురువును-

గుకారస్త్వన్ధకారః స్యాత్ రుశబ్దస్తన్నిరోధకః,
అన్ధకారనిరోధిత్వాత్ గురురిత్యభిధీయతే.

'గు' అనగా అంధకారము. 'రు' అనగా దానిని తొలగించువాడు. కావున అజ్ఞానాంధకారమును తొలగించువాడు 'గురువు' అని గురు గీతలో చెప్పిన విధముగ స్వోపదేశములచే హృదయాంతర్గతమగు అజ్ఞానమనెడు అంధకారమును తొలగించువాడని యర్థము. అంధ కారము ప్రపంచమును ఆవరించి అది మనకు కనబడకుండచేసినట్లు అజ్ఞానము ఆత్మను ఆవరించి, ఆ ఆత్మ స్పష్టముగ గోచరించకుండునట్లు చేయుచున్నది. కావున అజ్ఞానమే అంధకారము. అందుచేతనే దానిని "తమో హ్యాసీత్; తమసాగూళ్హమగ్రే" ఇత్యాది శ్రుతులు 'తమస్సు' అని పేర్కొనినవి. "బ్రహ్మవిదుత్తమమ్" అను పదము పూర్వోక్త విశేషణములు రెండింటికిని తగిన వ్యక్తిని బోధించుచున్నది. "బ్రహ్మ విదన్తీతి బ్రహ్మవిదః"-బ్రహ్మను తెలిసికొనినవారు. వారిలో ఉత్తముడు, అనగా స్థితప్రజ్ఞుడు. ఈ విషయమున శ్రుతులను పూర్వము ఉదాహ రించినాము. ఆతనిని సమీపించుట యనగా "తమారాధ్య గురుం భక్త్యా ప్రహ్వః ప్రశ్రయసేవనైః" అని ముస్ముందు చెప్పబోవు రీతిగను, "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" తగిన గురువునకు నమస్కరించి, ప్రశ్నించి, ఆయనసేవ చేసి ఆత్మతత్త్వమును గూర్చి తెలిసికొనుము అని భగవద్గీతలో చెప్పిన విధమున ఆ గురువును

తనకు అభిముఖునిగా చేసికొనుట యని అర్థము. ఈ విధముగ "అతో విముక్త్యై" ఇత్యాద్యష్టమశ్లోకార్థము ఇన్ని (7) శ్లోకములచే విశదీకరింపబడినది.

అవ. "అధికారిణమాశాస్తే ఫలసిద్ధిర్విశేషతః" అను శ్లోకములో పేర్కొనిన అధికారినిగూర్చి విపులముగా చెప్పుచున్నాడు-

మేధావీ పురుషో విద్వానూహాపోహవిచక్షణః,
అధికార్యాత్మవిద్యాయా ముక్తలక్షణలక్షితః. 16

మేధావీ = మేధావంతుడును, విద్వాన్ = విద్వాంసుడును, ఊహాపోహవిచక్షణః = ఊహాపోహలయందు నేర్పుగలవాడును, ఉక్తలక్షణలక్షితః = చెప్పబడిన లక్షణములతో కూడినవాడును అగు, పురుషః = పురుషుడు, ఆత్మవిద్యాయాం = ఆత్మవిద్యయందు, అధికారీ = అధికారము కలవాడు.

'మేధా అస్య అస్తీతి మేధావీ' అను విగ్రహముచే 'మేధావీ' అనగా మేధకలవాడు అని యర్థము. 'మేధ' అనగా వినిన విషయమును బుద్ధిలో ధరింపగలిగిన శక్తి. "ధీర్ధారణావతీ మేధా' అని నిఘంటువు. 'విద్వాన్' అనగా కావ్య-కోశ-వ్యాకరణములను చదివినవాడు. 'ఊహాపోహవిచక్షణః' అనుటచే తర్కమీమాంసలలో బాగుగ ప్రవేశము కల్గియుండవలెనని సూచింపబడుచున్నది. అనగా పద-వాక్య-ప్రమాణజ్ఞుడు, వ్యాకరణ-మీమాంసా-న్యాయశాస్త్ర పండితుడు అని యర్థము. ఉక్తలక్షణలక్షితః = ఎనిమిదవశ్లోకము మొదలు పదునైదవ శ్లోకమువరకును సంక్షేపవిస్తారములచే సూచితమగు వివేకము, వైరాగ్యము, శమాదిషట్కము, ముముక్షుత్వము అనెడు సాధనచతుష్టయముతో కూడినవాడు. ఆత్మవిద్యాయాం అధికారీ=ఆత్మవిద్యాఫలమగు మోక్షమును అనుభవించు అర్హతకలవాడు.

అవ. పూర్వోక్తములగు లక్షణములను క్రోడీకరించి, స్పష్టముగ తెలియుటకై వివరించుచున్నాడు - లేదా జిజ్ఞాసుత్వమనెడు (సాధకున కుండవలసిన) లక్షణము చెప్పబడినది. 'అతో విచారః కర్తవ్యో జిజ్ఞాసో రాత్మవస్తునః' అనుశ్లోకమున మేధావిత్వాది విశేషణ విశిష్టుడగు జిజ్ఞాసువే ఆత్మవిద్యాఫలమును పొందగలవాడు. ఇపుడు జిజ్ఞాసయందు అధికారముకలవాడు ఎవరు అని ప్రశ్నించినచో-ఎనిమిదవ శ్లోకములోని 'విద్వాన్', 'సంన్యస్త బాహ్యార్థసుఖస్పృహః సన్' 'ఉపదిష్టార్థసమాహితాత్మా' పదములచేతను, దశమశ్లోకములోని 'ధీరైః' అను పదముచేతను సూచితమగు సాధనచతుష్టయము ఎవ్వనికి ఉండునో అతడే అధికారి యని చెప్పుచున్నాడు.

వివేకినో విరక్తస్య శమాదిగుణశాలినః,
ముముక్షోరేవ హి బ్రహ్మజిజ్ఞాసాయోగ్యతా మతా. 17

వివేకినః = వివేకముకలవాడును, విరక్తస్య = వైరాగ్యవంతుడును, శమాదిగుణశాలినః = శమాదిగుణములతో ఒప్పువాడును, ముముక్షోరేవ = మోక్షేచ్ఛకలవాడును అగు పురుషునకు మాత్రమే, బ్రహ్మజిజ్ఞాసాయోగ్యతా= బ్రహ్మజిజ్ఞాసచేయు అధికారము, మతా = చెప్పబడినది.

వివేకాదుల స్వరూపము ముమ్ముందు మూలముననే స్పష్టము కాగలదు. జ్ఞాతుం=తెలిసికొనుటకు, ఇచ్ఛా=కోరిక, జిజ్ఞాస, బ్రహ్మను తెలిసికొనవలెననెడు కోరిక, జిజ్ఞాస బ్రహ్మజిజ్ఞాస. జిజ్ఞాసాపదము 'జ్ఞా' ధాతువునకు కోరుట అనునర్థమున 'సన్' ప్రత్యయమును చేర్చుటచే ఏర్పడినది. 'సన్' ప్రత్యయార్థమైన ఇచ్ఛకు ఆత్మసాక్షాత్కార పర్యంతమగు జ్ఞానము కర్మ. జిజ్ఞాసయనగా బ్రహ్మసాక్షాత్కార పరమావధికమగు జ్ఞానమును కోరుట. ఈ పదమునకు

లక్షణచే విచారము అని యర్థము. లక్షణావృత్తిచే జిజ్ఞాసాపదార్థమైన బోధితమగు విచారమునకు అఖండాకారవృత్తియందు ప్రతిఫలించిన చైతన్యము ఫలము. ఇట్టి విచారము చేయుటకు పూర్వముగూడ సామాన్యరూపమున బ్రహ్మజ్ఞానము ఉండవచ్చును. కాని ఇట్టి అఖండాకారవృత్తి ప్రతిఫలితచైతన్యరూప ఫలమును సంపాదింపవలె నన్నచో -

దద్యాన్నావసరం కించిత్ కామాదీనాం మనాగపి,
ఆసుప్తే రామృతేః కాలం నయేద్వేదాన్త చిన్తయా.

కామాదుల కే మాత్రమును అవకాశము ఈయరాదు. నిద్రించువరకును, మరణించువరకును గూడ కాలమును వేదాన్తచిన్తతో గడపవలెను అనిచెప్పిన అవిచ్ఛిన్నవేదాన్తవిచారము ఆవశ్యకము.

దేహాత్మజ్ఞానవద్ జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకమ్,
ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే.

దేహమే ఆత్మయనెడు జ్ఞానమువలె ఎవనికి దేహాత్మజ్ఞానమునుబాధించు జ్ఞానము ఆత్మవిషయమున మాత్రమే కలుగునో అతడు ఇష్టములేకున్నను మోక్షము పొందును అనిచెప్పిన జ్ఞానమును కలిగింపగలిగినది అట్టి విచారమే.

అవ. ఇట్టి విచారమును కలిగించు ఇచ్ఛయు, అందుకు యోగ్యతయు వివేకాదిసాధనములు కలవానికి మాత్రమే కలుగును గాని ఇతరునకు కలుగదు అను ఏవకారసూచితమగు అర్థమును అన్వయముఖమునను, వ్యతిరేకముఖమునను గూడ స్పష్టీకరించుచున్నాడు-

## సాధనచతుష్టయము

సాధనాన్యత్ర చత్వారి కథితాని మనీషిభిః,
యేషు సత్స్వేవ సన్నిష్ఠా యదభావే న సిద్ధ్యతి. 18

అత్ర = ఈ విషయమున, చత్వారి = నాలుగు, సాధనాని = సాధనములు, మనీషిభిః=పండితులచేత, కథితాని=చెప్పబడినవి, యేషు = ఏవి, సత్స్వేవ=ఉన్నప్పుడుమాత్రమే, సన్నిష్ఠా=సత్తగు బ్రహ్మయందు స్థైర్యము, సిద్ధ్యతి = సిద్ధించునో, యదభావే = ఏది లేకున్నచో, న = సిద్ధింపదో.

లోకమునందు ఘటము, పటము మొదలగునవి కార్యములు. మట్టి, దారము మొదలగునవి కారణములు. కార్యము ఉన్నచోట ఏది ఉండదో అది ఆ కార్యమునకు కారణము కాజాలదు. ఉదాహరణమునకు– పటము ఉన్నచోట మట్టి లేదు. అందుచే పటమునకు మట్టి కారణము కాదు. ఘటము ఉన్నచోట దారములు లేవు. అందుచే ఘటమునకు దారములు కారణముకావు. కాని మట్టి ఉన్నప్పుడే ఘటము ఉండును; మట్టిలేనిచో ఘటము ఉండదు. ఈ విధముగ అది ఉన్నపుడే ఇది ఉండును; అది లేనిచో ఇది ఉండదు అను అన్వయ - వ్యతిరేకములచే మట్టి ఘటమనుకార్యమునకు కారణమని నిర్ణయింపబడుచున్నది. ఇట్లే సత్స్వరూపమగు బ్రహ్మయందు పూర్తిగఉండుటకు కారణభూతమగు బ్రహ్మజిజ్ఞాస కూడ వివేకాదిచతుష్టయ మున్నప్పుడే సంభావ్యము. అవి లేనిచో సంభావ్యము కాదు. కావున ఈ అన్వయవ్యతిరేకములను బట్టి, వివేకాదులు 'సన్నిష్ఠ' అను నామాన్తరముగల ఫలపర్యంత బ్రహ్మజిజ్ఞాసకు కారణభూతములని తెలియుచున్నది. వివేకాదులున్నపుడే బ్రహ్మజిజ్ఞాస కలుగుచున్నది; ఇది అన్వయము. వివేకాదులు లేనిచో బ్రహ్మజిజ్ఞాస కలుగుట లేదు; ఇది వ్యతిరేకము. ఈ అన్వయవ్యతిరేకములచే బ్రహ్మజిజ్ఞాసకు వివేకాదులు కారణమని నిర్ణయింపబడుచున్నది.

'మనీషిభిః కథితాని ':- మనీషులనగా శ్రుతితాత్పర్య మేదియో తెలిసినవారు. శ్రుతిసాహాయ్యము లేనిచో, అధికారికి ఇట్టి విశేషణము (లక్షణము) లుండవలెను అని తెలియ శక్యముకాదు గదా? బాదరాయణాదులు అట్టి మనీషులు. "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను సూత్రమునందలి 'అథ' శబ్దముచే 'సాధనచతుష్టయము సంపన్నమైనపిమ్మట' అను నర్థమును సూచించుచు, బాదరాయణుడు, ఇట్టివారికే (సాధనచతుష్టయసంపన్నులకే) బ్రహ్మవిద్యయందు అధికారమని బోధించె నని శారీరకమీమాంసా ప్రథమాధికరణ తృతీయ వర్ణకమునందలి భాష్యమువలన తెలియుచున్నది. ఇట్టి విశేషణమును సూచించు శ్రుతులు కూడ ఉన్నవి. 'తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే'— ఈ లోకమున సేవాదికర్మచే సంపాదించిన భోగాదికము ఏ విధముగ క్షీణించిపోవుచున్నదో; అట్లే యజ్ఞాదిసంపాదితమగు పరలోక సుఖముగూడ క్షీణించును, "యో వై భూమా తదమృతమ్"—ఏ బ్రహ్మ స్వరూపము గలదో అది అనశ్వరము; దానికంటె భిన్నమైన దంతయు నశ్వరము; "న జాయతే మ్రియతే విపశ్చిత్"— అపరిలుప్త చైతన్యరూపమగు ఈ ఆత్మ జనింపదు, మరణించదు-ఇత్యాది శ్రుతివాక్యములు, "యత్కృతకం తదనిత్యమ్"— ఏది నిర్మింపబడినదో అది అనిత్యము అను న్యాయముచే గూడ ఉపోద్బలితములై ఆత్మకు నిత్యత్వమును, అనాత్మకు అనిత్యత్వమును బోధించుచు వివేకజ్ఞాన సంపాదకములుగ ఉన్నవి. 'పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్, నాస్త్యకృతః కృతేన"— కర్మలచే సంపాదించిన స్వర్గాదిలోకములను పరీక్షించి బ్రాహ్మణుడు వైరాగ్యమును పొందవలెను; కర్మచే నిత్యమగు మోక్షరూపమగు ఫలము లభింపదు అను శ్రుతియు, "న వా అరే పత్యుః కామాయ" మొదలు "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం

భవతి" అనునంతవరకును గల శ్రుతియు - పతియొక్క కామము కొరకై పతి ప్రియుడుకాడు........లోకములో సర్వమును తనకొరకే ప్రియమగును ఆత్మభిన్నములగు అన్నివస్తువుల విషయమునను; వైరాగ్యమును ప్రతిపాదించుచున్నవి.

> శాన్తో దాన్త ఉపరతస్తితిక్షుః సమాహితః శ్రద్ధావిత్తో
> భూత్వాత్మన్యే వాత్మానం పశ్యేత్

అను శ్రుతి శమాదిషట్కమును బోధించుచున్నది. "న స పునరావర్తతే"—అతడు మోక్షమును పొందినవాడు; మరల తిరిగి రాడు అను శ్రుతి మోక్షము నిత్యమని చెప్పుచు దానిపై ఇచ్ఛను కలిగించుచున్నది. కర్మమీమాంసకులు ఉపనిషత్తులు అర్థవాదము లని చెప్పుదురు. వారిమతము ప్రకారము 'వీటికి స్వార్థమునందు తాత్పర్యము లేదు'—అనగా వీటి యర్థమును ప్రమాణముగ తీసికొనబనిలేదు అను జ్ఞానము మాత్రమే కలుగును. అట్లైనచో 'బ్రహ్మజిజ్ఞాస చేయవలెను. దానికి ఇట్టి విశేషణములు కలవాడు అధికారి' అను జ్ఞానము దుర్లభము. అందుచే 'మనీషిభిః'—పండితులచే, 'కథితాని'—చెప్పబడినవి అని చెప్పినాడు. అనగా ప్రమాణాంతరముచే తెలియనిదియు కాలత్రయాబాధితమును, పరమపురుషార్థ స్వరూపమును అగు బ్రహ్మను ప్రతిపాదించు ఉపనిషత్తులు ఆ విషయమునందే యథార్థప్రమాణము లని చెప్పుటకు అవకాశమున్నది గాన, ఆ యా వాక్యములచే వివేకాదులు గలవానికే 'సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః'—ఆత్మనే అన్వేషింపవలెను, దాని జిజ్ఞాసయే చేయవలెను, ఇత్యాది వాక్యములచే విహితమగు జిజ్ఞాసకు యోగ్యత ఉండును అని చెప్పినచో అంతయు సరిపోవును.

అవ. 'వివేకినో విరక్తస్య' ఇత్యాదిశ్లోకమున చెప్పిన వివేకాదులను క్రమముగ విశదీకరించుచున్నాడు—

ఆదౌ నిత్యానిత్యవస్తు వివేకః పరిగణ్యతే,
ఇహాముత్ర ఫలభోగవిరాగస్త దనన్తరమ్,
శమాదిషట్కసమ్పత్తిః ముముక్షుత్వమితి స్ఫుటమ్. 19

ఆదౌ = ముందుగా, నిత్యానిత్యవస్తు వివేకః = నిత్యానిత్యవస్తువుల వివేకము, పరిగణ్యతే = పరిగణింపబడుచున్నది, తదనన్తరం = దాని పిమ్మట, ఇహాముత్ర ఫలభోగ విరాగః = ఇహలోకమునందును పర లోకమునందును కలుగు ఫలముల అనుభవమునందు వైరాగ్యము, శమాది షట్కసమ్పత్తిః = శమాదిషట్కముయొక్క లాభము, ముముక్షుత్వం= మోక్షేచ్ఛ, ఇతి=ఇట్లు, స్ఫుటం=స్పష్టముగా, (లెక్కింపబడుచున్నది).

వివేకాదులలో వెనుకనున్నది తరువాతనున్నదానికి కారణ మగుటచే ఒక క్రమము ఆశ్రయింపబడినది. ఇది నిత్యము, ఇది అనిత్యము అని తెలిసినకదా అనిత్యమునుండి వైరాగ్యమును పొందుట? నిత్యానిత్యవస్తువివేకములేకున్నచో వైరాగ్యము దుర్ల భముగాన వివేకము వైరాగ్యమునకు హేతువు. అంతరింద్రియ నిగ్రహరూపమగు శాంతియు, బాహ్యేంద్రియ నిగ్రహరూపమగు దాంతియు వైరాగ్యవంతుడగు పురుషునకే కలుగును. అందును బాహ్యేంద్రియ నిగ్రహరూపమగు దమము, అంతఃకరణమును నిగ్రహించుకొన్నవానికే కలుగును. మనస్సుతో సంబంధము తెగి పోయిన పిమ్మట మిగిలిన ఇంద్రియములు ఏమియు చేయజాలవు కదా?

(ప్రశ్న) అట్లైనచో శమ మున్నపుడు దమము తనంతటతానే సిద్ధించునుకదా? మరల దానిని కూడ ఒకసాధనమునుగా పరిగ ణించుట ఎందులకు?

(సమాధానము) "ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః" — క్షోభ కలిగించు స్వభావముగల ఇంద్రియములు మనస్సును బలాత్కారముగ లాగివేయును అని గీతలో చెప్పిన విధమున

బాహ్యేంద్రియ నిరోధము లేకున్నచో శమము దృఢము కాజాలదు. ఉపరమ మనగా సంన్యాసము. అది జితేంద్రియునకే కుదురును. శీతము-ఉష్ణము మొదలగు జంటలను సహింపగల్గుటకు తితిక్ష యని పేరు. అది కూడ ఆతనికే. ఏకాగ్రతతో బ్రహ్మయందు ఉండుటకు సమాధాన మని పేరు. అది కూడ బాహ్యావిక్షేపము లేవియు లేని సంన్యాసికే కుదురును. ఇట్టి గుణములు కలవానికే_'బ్రహ్మ ఒకటియే సత్పదార్థము. జగత్తు మిథ్యాభూతము' అని ఉపదేశించు గురువు యొక్క వాక్యములందును వేదాన్తవాక్యములందును విశ్వాసము కలుగును. ఇదియే శ్రద్ధ. ఈ విధముగ శమాదిషట్కములుగూడ ఒక క్రమమును పాటించుటకు కారణమును చెప్పవచ్చును. ఇట్టి పురుష శ్రేష్ఠుడు మోక్షభిన్నమగు దానిని దేనిని కోరడు; దానియందు ఆలస్యమును సహింపజాలడు. ఆతని మోక్షేచ్ఛ చాల తీవ్రముగ ఉండును_ అను అభిప్రాయముచే 'ఆదౌ నిత్యానిత్య' ఇత్యాదికమును చెప్పినాడు_ 'వివేకము తరువాత వైరాగ్యము' అని చెప్పుటచే 'తదు దితః స హి యో యదనన్తరః' _ఏది దీని తరువాత పుట్టినదో అది దాని కార్యము అని చెప్పినట్లు వైరాగ్యము వివేకకార్యమని చెప్పి నట్లే యైనది. 'తదనన్తరం' అనుపదము ఉత్తరవాక్యముతో కూడ సంబంధించును. కావున వైరాగ్యానంతరము శమాదిసంపత్తి, దాని తరువాత ముముక్షుత్వము అని యర్థము.

అవ. ఈ సాధనములనే విశదీకరించుచున్నాడు_

బ్రహ్మ సత్యం జగన్మిథ్యే త్యేవంరూపో వినిశ్చయః,
సోఽయం నిత్యానిత్య వస్తువివేకః సముదాహృతః. 20

బ్రహ్మ=బ్రహ్మ, సత్యం–సత్యమైనది, జగత్=జగత్తు, మిథ్యా=అసత్యమైనది, ఏవం రూపః=ఈ విధమగు, వినిశ్చయః= నిశ్చయము, సోఽయం=ఆ ఇది, నిత్యానిత్యవస్తువివేకః=నిత్యానిత్య వస్తువివేకమని, సముదాహృతః=చెప్పబడినది.

జనులు సాధారణముగ అనిత్యసుఖములనుకూడ కోరు చుందురు. అందుచే బ్రహ్మ నిత్యము, జగత్తు అనిత్యము అను నిశ్చయ మున్నను దృఢమగు వైరాగ్యము కలుగదు. జగత్తు అసత్యము అని చెప్పినచో— అసత్యవస్తువును ఎవ్వరును కోరరు. రాజ్యము కావలె ననుకొనువారు స్వప్నరాజ్యమును కోరుకొనరు కదా? అందుచే వైరాగ్యము తప్పక కలుగుటకై— 'బ్రహ్మ నిత్యము; జగత్తు అనిత్యము' అని కాక 'బ్రహ్మ సత్యము, జగత్తు అసత్యము' అని చెప్పినాడు. వినిశ్చయ మనగా విశేషముగ నిశ్చయము. అనగా ఈ నిశ్చయము అప్రామాణ్యజ్ఞానముచే బాధింపబడదు అని చెప్పినట్లైనది. 'సోఽయమ్' సః='వివేకినః' (17 వ శ్లో.) అను పదములోని వివేకికి విశేషణముగా చెప్పబడినది, అయం="ఆదౌ నిత్యానిత్యవస్తువివేకః" అని చెప్ప బడినది అని అర్థము. 'సముదాహృతః' అనుపదములో 'సమ్' అను ఉపసర్గను ప్రయోగించుటచే ఇట్టి వివేకమే ఐహికాముష్మికఫల భోగవిరాగమును కలిగింప సమర్థము అను విషయము సూచితము.

అవ. వివేకమును నిరూపించి వైరాగ్యమును విశదీకరించు చున్నాడు—

తద్వైరాగ్యం జుగుప్సా యా దర్శనశ్రవణాదిభిః।
దేహాది బ్రహ్మపర్యన్తే హ్యనిత్యే భోగ్యవస్తుని. 21

దర్శనశ్రవణాదిభిః=దర్శనము శ్రవణము మొదలగువాటిచే, దేహాదిబ్రహ్మపర్యన్తే=దేహము మొదలు బ్రహ్మవరకునుగల, అనిత్యే= అనిత్యమగు, భోగ్యవస్తుని=భోగ్యవస్తువునందు, యా=ఏ, జుగుప్సా= అసహ్యముకలదో, తత్=అది, వైరాగ్యం=వైరాగ్యము.

ఇహలోకమునందలి దేహాది భోగ్యవస్తువులను చూచుటచేతను పరలోకమునందలి దివ్యదేహము మొదలగు భోగ్యవస్తువులను గూర్చి వినుటచేతను, 'ఆది' పదమును ప్రయోగించుటచే— చూచినవాటికిని,

విన్నవాటికిని సజాతీయములగు వాటిని అనుమానముద్వారా తెలిసి కొనుటచేతను, ప్రత్యక్షముగ అనుభవింపబడుచున్న శరీరము మొదలు, బ్రాహ్మమానము ప్రకారము నూరుసంవత్సరములు జీవించు నట్టిదియు, చతుర్దశభువనాధిపత్యమును ఇచ్చునదియు అగు హిరణ్య గర్భశరీరమువరకును గల, అనిత్యములును, అసత్యములును అగు సకలభోగ్యవస్తువుల విషయమునను_ 'ఎన్నటికి ఇట్టిపదార్థములతో సంబంధము కలుగకుండుగాక'_ అను ఏ జుగుప్స కలదో, కాకిరెట్ట యందు వలె ఏ అసహ్యముకలదో, అదియే వైరాగ్యము. "శైత్యం హి యత్సా ప్రకృతిర్జలస్య" అనునపుడు 'యత్ శైత్యం' అనునవి నపుంసకలింగములోనున్నను, 'ప్రకృతిః' అను విధేయవాచకపదము ననుసరించి 'సా' అని స్త్రీలింగమును ప్రయోగించినట్లే ఇచటకూడ ఉద్దేశ్యవాచకమగు 'జుగుప్సా' అనునది స్త్రీలింగములో నున్నను విధేయవాచకమగు 'వైరాగ్యం' అను దానినిబట్టి 'తత్' అను నపుంసక లింగప్రయోగము చేయబడినది. వైరాగ్యవిషయమున ఈ క్రింది శ్రుతిస్మృతిపురాణాది వచనములను అనుసంధానము చేసికొనవలెను.

స్వదేహాశుచిగంధేన న విరజ్యేత యః పుమాన్,
వైరాగ్యకారణం తస్య కిమన్యదుపదిశ్యతామ్.

తనదేహమునందలి దుర్గంధముచే విరక్తిచెందని పురుషునకు వైరా గ్యము కలుగుటకు మరియేమి చూపవలసియుండునో!

సతతం ప్రవాహ్యమానైః వృషభైరశ్వైః ఖరైర్గజైర్మహిషైః,
హా కష్టం! క్షుత్క్షామైః శ్రాన్తైర్నో శక్యతే వక్తుమ్.

ఎల్లవేళల భారాదులను మోయించుటచే అలసి, ఆకలితో కృశించిన వృషభములు, అశ్వములు, రాసభములు, గజములు, మహిషములు, అయ్యో! పాపము! తమకష్టము చెప్పుకొనజాలవు కదా!.

తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్ర
పుణ్యచితో లోకః క్షీయతే,- భూమ్నోఽన్యదార్తమ్.

బ్రహ్మకంటె భిన్నమైనదంతయు నశ్వరము.

క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి -

పుణ్యము క్షీణింపగనే మనుష్యలోకమును చేరుదురు.

ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున,

ఓ అర్జునా! బ్రహ్మలోకమువరకును గల లోకములన్నియు, మరల తిరిగి వచ్చునవే. సూతసంహితలో యజ్ఞవైభవఖండములోని సప్త దశాధ్యాయము. సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహములో "కుక్షౌ స్వమాతుః మలమూత్రమధ్యే -తల్లియొక్క కుక్షిలో మలమూత్రముల మధ్య.... మొదలు

పుణ్యక్షయే పుణ్యకృతో నభస్థైర్నిపాత్యమానాన్,
శిథిలీకృతాంగాన్ నక్షత్రరూపేణ దివశ్చ్యుతాంస్తాన్,
విచార్య కో వా విరతిం న యాతి.

పుణ్యము క్షీణింపగనే, స్వర్గమునందున్న దేవతలు క్రిందికి పడ ద్రోయగా శిథిలమైన శరీరముకలవారై నక్షత్రరూపమున స్వర్గము నుండి పడిపోవుచున్న పుణ్యాత్ములను చూచి ఎవనికి వైరాగ్యము కలుగదు?

యత్రాస్తి లోకే గతితారతమ్యమ్ -

ఏ లోకమున గతులలో తరతమభావము (అధికత్వాల్పత్వములు) ఉన్నదో, అనునంతవరకును ఉన్న శ్లోకములు — మనుష్యదేహాదికము రోగాదులచే బాధింపబడుచుండుటను, పశ్వాదులు ఏమియు మాట లాడలేక పరాధీనములై ఉండుటను, దేవతలు రాక్షసులచే పీడితులగు టను, కురంగాదుల విషయమున చూచినట్లు శబ్దాదివిషయములు

అనేకవిధములగు అనర్థములకు హేతువగుటను చూచుచున్నవానికి ఆత్మభిన్నమగు ప్రతిపదార్థమునందును జుగుప్స అనాయాసముగ కలుగును అని భావము. ఈ విషయమును 'శబ్దాదిభిః' ఇత్యాది శ్లోకములలో మున్ముందు స్వయముగనే స్పష్టీకరింపగలడు.

(ఆశంక) శ్రు. "అపామ సోమమమృతా అభూమ" —సోమపానము చేసితిమి; అమరుల మైతిమి, శ్రు. "అక్షయ్యం హ వై చాతుర్మాస్యయాజినః సుకృతం భవతి" —చాతుర్మాస్య యాగము చేసినవాని సుకృతము అక్షయ్యముగ నుండును, ఇత్యాది శ్రుతులను బట్టి కర్మఫలముకూడ నిత్యమని తెలియుచున్నది కదా?

(సమాధానము) ఐనను — "కర్మచే సాధింపబడిన దెల్ల అనిత్యము" అను న్యాయముచే ఉపోద్బలితమగు - శ్రు. "తద్యథేహ కర్మచితో లోకః ...." ఇత్యాది శ్రుత్యన్తరము ననుసరించి 'అమృత' 'అక్షయ్య' పదముల అర్థమును తప్పక సంకుచితము చేయవలసియుండుటచే దోషములేదు. కావుననే — "ఆభూతసంప్లవం స్థానమమృతత్వం హి భాష్యతే" —మహాభూతప్రళయమువరకు ఉండుటకు అమృతత్వమని పేరు అని చెప్పుదురు.

అవ. శమస్వరూపమును విశదీకరించుచున్నాడు-

విరజ్య విషయవ్రాతాత్ దోషదృష్ట్యాముహుర్ముహుః,
స్వలక్ష్యే నియతావస్థా మనసః శమ ఉచ్యతే. 22

ముహుర్ముహుః = మాటిమాటికి, దోషదృష్ట్యా = దోషములను చూచుటచే, విషయవ్రాతాత్ = విషయముల సముదాయమునుండి, విరజ్య = వైరాగ్యమును పొంది, మనసః = మనస్సుయొక్క, స్వలక్ష్యే = తనలక్ష్యమునందు, నియతావస్థా = స్థిరమగు స్థితి, శమః ఇతి = శమము అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

విషయములకు ఆది, అంతము అనునవి ఉన్నవి. వాటిని సంపాదించుటకు ఎంతో ధనవ్యయము, ఆయాసము ఆవశ్యకములు. చివరకు అవి విరసము లగును. విషయములందు ఇట్టి దోషములున్న వని తెలిసికొనిన పురుషునకు వాటిపై తప్పక వైరాగ్యము కలుగును గాన విషయదోషదర్శనము వైరాగ్యహేతువు. అట్టి వైరాగ్యము కలుగ గనే మనస్సు, సగుణముగాని, నిర్గుణముగాని యగు తనలక్ష్యము నందు స్థిరముగ నిలిచి, నిశ్చలముగను, నిర్వికారముగను ఉండును. ఈ విధముగ మనోనైశ్చల్యరూపమగు శమము వైరాగ్యము వలన కలుగునని 'విరజ్య' ఇత్యాదికముచే చెప్పుచున్నాడు. 'విరజ్య' అను పదములోనున్న 'ల్యప్' ప్రత్యయము ఉత్తరకాలికత్వమును – తరువాత కలుగుట అను నర్థమును – బోధించును గాన (వైరాగ్యము తరువాత జనించు శమము) వైరాగ్యజన్య మను విషయము సూచిత మగుచున్నది.

అవ. దమమును విశదీకరించుచున్నాడు–

విషయేభ్యః పరావర్త్య స్థాపనం స్వస్వగోలకే,
ఉభయేషా మిన్ద్రియాణాం స దమః పరికీర్తితః. 23

ఉభయేషాం = ఉభయవిధములగు, ఇంద్రియాణాం = జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల(యొక్క)ను, విషయేభ్యః = భోగ్యవిషయములనుండి, పరావర్త్య = మరల్చి, స్వస్వగోలకే = తమతమ గోలములలో, స్థాపనం = ఉంచుట, సః = అ, దమః = దమముగా, పరికీర్తితః = చెప్పబడినది.

మనస్సునకు విషయవిచారము చేయగల సామర్థ్య మున్నది. అందుచే (పై శ్లోకములో మనస్సు) 'స్వయముగనే వైరాగ్యమును పొంది' అని చెప్పబడినది. కాని బాహ్యేంద్రియములగు శ్రోత్రాది జ్ఞానేంద్రియములకును, వాగాది కర్మేంద్రియములకును స్వయముగ విషయ విచారముచేయు సామర్థ్యము లేదు. కావున అశ్వములవంటి

ఆ బాహ్యేంద్రియములను, కళ్లెమువంటి మనస్సుచేత శబ్దాదివిషయ మార్గములనుండి పరాఙ్ముఖములనుగచేసి, చెవి, ముఖము మొదలగు వాటి వాటికి సంబంధించిన గోళములలో నిలిపి, వాటి వ్యాపార ములను నిలుపుచేయుటకు 'దమము' అని పేరు. మనస్సు మొదలగు నవి కళ్లెము మొదలైనవాటివంటివి అను విషయము కఠోపనిషత్తులో చెప్పబడినది.

ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు,
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ,
ఇన్ద్రియాణి హయాన్యాహు ర్విషయాంస్తేషు గోచరాన్.

ఆత్మను రథస్వామిగను, శరీరమును రథముగను, బుద్ధిని సారథిగను, మనస్సును కళ్లెముగను, ఇంద్రియములను గుఱ్ఱములుగను, విషయములను మార్గములుగను తెలిసికొనుము.

అవ. బాహ్యేంద్రియముల నిగ్రహము దమము. దానిచే సాధ్యమగు ఉపరతిని విశదీకరించుచున్నాడు-

**బాహ్యానాలమ్బనం వృత్తే రేషోపరతి రుత్తమా. 24**

**వృత్తేః = మనోవృత్తి, బాహ్యానాలమ్బనం = బాహ్యవస్తువుల విషయమున ప్రసరింపక పోవుట, ఏషా = ఇది, ఉత్తమా = ఉత్తమమైన ఉపరతిః = ఉపరతి.**

చెరువులోనున్న నీరు చెరువునకుగల రంధ్రము ద్వారా బయటకు వెడలి, క్షేత్రాద్యాకారమున పరిణమించును. అట్లే లోపల నున్న మనస్సు శ్రోత్రాదిచ్ఛిద్రముల ద్వారా బయటకువెడలి శబ్దాది విషయాకారమున పరిణతి చెందును. ఇట్టి పరిణతికే వృత్తి (అంతః కరణవృత్తి) యని పేరు. బాహ్యేంద్రియములను నిగ్రహింపగనే లోపలనున్న మనస్సు బైటకువచ్చుటకుగాని, బాహ్యవిషయా కారమున పరిణమించుటకుగాని అవకాశముండదు అని భావము.

అవ. చిత్తమునకు బాహ్యవస్తువు సంబంధము లేనప్పుడు శీతోష్ణాదిద్వంద్వముల జ్ఞానముకూడ కలుగదు. ఒకవేళ కర్మవశము చేతను, కాలాదివశముచేతను, అట్టి జ్ఞానము కలిగినను, వాటిని సహించెడు శక్తి _ దీనికే తితిక్ష యని పేరు _ కలుగునని చెప్పు చున్నాడు_

సహనం సర్వదుఃఖానా మప్రతీకారపూర్వకమ్.
చిన్తావిలాపరహితం సా తితిక్షా నిగద్యతే. 25

అప్రతీకారపూర్వకం = ప్రతిక్రియ యేమియు చేయకుండగను, చిన్తావిలాపరహితం = చింతగాని విలపించుటగాని లేకుండగను, సర్వ దుఃఖానాం = సమస్తదుఃఖముల (యొక్క) ను, సహనం = సహించుట, సా = ఆ, తితిక్షా = తితిక్ష యని, నిగద్యతే = చెప్పబడుచున్నది.

ఉన్నిబట్టలు, వింజామరలు మొదలగు వాటితో శైత్యము, ఉష్ణము మొదలగు దుఃఖములకు ప్రతిక్రియచేసికొనుట లోకప్రసిద్ధము. అట్టి సామగ్రి లేనిచో_ "అయ్యో! దీనులమగు మన మిపు డేమి చేయవలెను" అను చింతయు, ఏడ్పునుగూడ ప్రసిద్ధములే, 'అప్రతీ కారపూర్వకమ్' ఇత్యాదికముచే ప్రతీకారాపి చింతాదికమున్నచో అది బ్రహ్మవిచారసాధనమగు తితిక్ష కాజాలదని చెప్పుచున్నాడు. 'దుఃఖానామ్' అను దానికి దుఃఖహేతువులగు శీతోష్ణాదులు అని యర్థము. చిన్తావిలాపాది సహితమగు మనస్సునకు ఆత్మవిచార మనునది చాల దూరము కదా_ అని భావము.

అవ. వస్తుజ్ఞానమునకు అసాధారణకారణమగు శ్రద్ధను విశదీ కరించుచున్నాడు_

శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యావధారణా.
సా శ్రద్ధా కథితా సద్భిః యయా వస్తూపలభ్యతే. 26

యయా = దేనిచేత, వస్తు = వస్తువు, ఉపలభ్యతే = తెలియబడునో, సా = అట్టి, శాస్త్రస్య = శాస్త్రముయొక్కయు, గురువాక్యస్య = గురువచనము యొక్కయు, (శాస్త్ర-గురువాక్యములను) సత్యబుద్ధ్యా = సత్యమనెడు బుద్ధితో, అవధారణా = నిర్ణయించుట, శ్రద్ధా = శ్రద్ధ యని, సద్భిః = సత్పురుషులచే, కథితా = చెప్పబడినది.

లోకములో కూడ, ఆప్తవాక్యమును విశ్వసింపని పురుషుడు, తదనుసారముగా విచారాదులయందు ప్రవర్తింపడు. అట్టి పరిస్థితిలో, అతీంద్రియమగు శాస్త్రార్థము విషయమున వేరుగ చెప్పనేల? అందుచే శ్రద్ధ అత్యుత్తమకారణము.

అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప,
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని.

ఓ అర్జునా! ఈ ధర్మముపై శ్రద్ధలేని పురుషులు, నన్ను పొందజాలక మృత్యుసంసారమార్గమునందు తిరుగుచుందురు అని భగవద్గీతలో కూడ చెప్పబడినది. శాన్తి, దాన్తి (శమ-దమ), ఉపరతి, తితిక్షలు కలవాడు మాత్రమే- "బ్రహ్మ ఒక్కటియే సత్యము; ఆ బ్రహ్మ నీవే; మిగిలినదంతయు మిథ్య" అని గురువు వేదాంతములును బోధించిన తత్త్వమును, అది అట్లేయని నమ్మగలుగును. అవి లేనివాడు నమ్మ జాలడు. అందుచే గురువేదాంతవాక్యముల విషయమున శ్రద్ధ ఆ శమాదిసాధనముల పిమ్మట పేర్కొనబడినది. శాస్త్రమనగా శ్రు. 'తత్త్వమసి' ఇత్యాదికము. దానిని అనుసరించి _ "నీవు సంసారియగు జీవుడవు కాదు. నిత్యము, శుద్ధము, జ్ఞానస్వరూపము, ముక్తము అగు పరబ్రహ్మవు. ఇతరమైనదంతయు మిథ్య" అని బోధించు గురువుయొక్క వాక్యము గురువాక్యము. 'ఇది సత్యము, అనగా అబాధితమగు అర్థమును బోధించుచున్నది' అను నమ్మికతో నిర్ణయించుకొనుట అవధారణ. అనగా దృఢమగు నిశ్చయము.

అవ. ఇట్టి శ్రద్ధ కలవానికే సమాధానము బాగుగ కుదురును గాన దాని తరువాత సమాధానమును విశదీకరించుచున్నాడు-

సమ్యగాస్థాపనం బుద్ధేః శుద్ధే బ్రహ్మణి సర్వదా.
తత్సమాధాన మిత్యుక్తం న తు చిత్తస్యలాలనమ్. 27

శుద్ధే = పరిశుద్ధమగు, బ్రహ్మణి = బ్రహ్మయందు, సర్వదా = ఎల్లప్పుడును, బుద్ధేః = బుద్ధియొక్క, ఆస్థాపనం = నిలుపుట, తత్ = ఆ, సమాధానం = సమాధానము, ఇతి = అని, ఉక్తం = చెప్పబడినది. తు = కాని, చిత్తస్య = చిత్తముయొక్క, లాలనం = లాలనము, న = కాదు.

స్వలక్ష్యమునందు స్థిరముగ నుండుట యనునది శమము. అట్టి శమమునకును ఈ సమాధానమునకు ఎక్కువ భేద మున్నట్లు కనబడుటలేదు. అయినను - "మాటిమాటికిని దోషములను చూచుచు విషయములనుండి విరక్తమై మనస్సు తన లక్ష్యమునందు స్థిరముగ నుండుట" యనునది శమము. దీనిని సంపాదించుటకు, సంకల్ప వికల్పాత్మకమగు మనస్సును స్థిరముగ నుంచుకొనుటకు,

యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్.
తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్.

చపలము, అస్థిరము అగు మనస్సు ఏ యే మార్గములద్వారా బయటకు పోవుటకు ప్రయత్నించుచుండునో ఆ యా మార్గములనుండి అడ్డుపెట్టి దీనిని ఆత్మయందే (తనయందే) వశమగునట్లు చేయవలెను అని భగవద్గీతలో చెప్పిన విధమున ప్రయత్న విశేషము అపేక్షిత మగుచున్నది. కావుననే ఇచట (సమాధానమున) "నిశ్చయాత్మకమగు బుద్ధిని ఎల్ల వేళల శుద్ధబ్రహ్మయందు స్థిరముగ నిలుపవలెను" అని చెప్పుటచే, ప్రకృతమున అంతఃకరణము సంకల్పవికల్పవిముక్తము కావలెనని చెప్పుట జరిగినది. కావుననే సంకల్పవికల్పాత్మ కాంతఃకరణార్థకమగు

'మనః' శబ్దమును ప్రయోగింపక నిర్ణయాత్మకాంతఃకరణ మను అర్థముగల 'బుద్ధి' శబ్దము ప్రయోగింపబడినది. మరియు 'శుద్ధే బ్రహ్మణి' అని సర్వోపాధివినిర్ముక్తమగు నిర్గుణబ్రహ్మమునందు నిలుప వలెనని చెప్పబడినది. శమమును గూర్చి చెప్పునపుడు 'స్వలక్ష్యే నియతావస్థా' అనుటచే సగుణవస్తువుపై స్థిరముగనున్నను మనస్సు శాంతమని చెప్పుటకు అవకాశమున్నది. శమము సాధనము, సమాధానము దాని ఫలము. అనగా శమమే పరిపక్వమైనచో సమాధాన మగును. లోకములో పిల్లలు ఎక్కువగ ఏడ్చినపుడు వారికి కావలసిన దానిని ఇచ్చి ఊరడింతురు. ఆ విధముగ మనస్సునకు యథేష్టముగ విషయమార్గమున ప్రవర్తించు అవకాశ మిచ్చినచో అది సమాధానము కాజాలదని బోధించుటకై "న తు చిత్తస్య లాలనమ్" అని వ్రాయు చున్నాడు లేదా—

శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహన్తీ వాసనాసరిత్,
పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి.

శుభాశుభమార్గములలో ప్రవహించుచున్న వాసనానదిని పురుష ప్రయత్నముచే శుభమార్గమున ప్రవహించునట్లు చేయవలెను.

అశుభేషు సమావిష్టం శుభేష్వేవావతారయేత్,
స్వమనః పురుషార్థేన బలేన బలినాం వర.

ఓ బలవంతులలో శ్రేష్ఠుడా! అశుభమార్గములందు ప్రవర్తించుచున్న తన మనస్సును, పురుషప్రయత్నముచే, బలాత్కారముగ శుభ మార్గములందే ప్రవర్తించునట్లు చేయవలెను.

అశుభాచ్చాలితం యాతి శుభం తస్మాదపీతరత్,
జన్తోశ్చిత్తం తు శిశువత్ తస్మాత్తచ్చాలయేద్బలాత్.

అశుభమార్గమునుండి చలింపచేయబడిన మానవుని చిత్తము శుభ మార్గమువైపు పోవును. శుభమార్గమునుండి చలింపబడినచో అశుభ

మార్గమువైపు పోవును. కావున దానిని శిశువునువలె, బలాత్కారముగ (శుభమార్గమువైపు) చలింపచేయవలెను.

సమతా సాన్త్వనేనాశు న ద్రాగితి శనైః శనైః,
పౌరుషేణ ప్రయత్నేన లాలయే చ్చిత్తబాలకమ్.

ఈ విధముగ చిత్తమనెడు బాలుని, సమతయనెడు సాంత్వనము (ఊరడింపుచే) తొందరపడకుండ మెల్లమెల్లగ పురుషప్రయత్నముతో లాలింపవలెను అని వాసిష్ఠోక్తప్రకారమున చాలనము లేదా లాలనము శమాదిసాధనముగ పూర్వము (ప్రారంభమున) అపేక్షిత మైనది. ఫలమైన సమాధానావస్థలో దాని అవశ్యకతలేదు. అట్టి లాలనము లేకున్నను, శమాదులను సంపాదించుకొనెడు సమయమున చేసిన ప్రయత్నముచేతనే మనస్సునందలి బాహ్యవాసనలన్నియు క్షీణించును. ఇక ఆ మనస్సును సగుణమునుండి తప్పించి నిర్గుణ స్వరూపముపై నిల్పుట అనునది ఒక్కటియే కావలసినది.

అవ. ఇట్టి సాధనసామగ్రి ఉన్నవానికి మాత్రమే ముముక్షుత్వము లభించునుగాని ఇతరులకు లభింపదని చెప్పుచున్నాడు–

అహంకారాదిదేహాన్తాన్ బంధానజ్ఞానకల్పితాన్,
స్వస్వరూపావబోధేన మోక్తు మిచ్ఛా ముముక్షుతా. 28

అహంకారాదిదేహాన్తాన్=అంతఃకరణము మొదలు దేహమువరకును ఉన్న, అజ్ఞాన కల్పితాన్=అజ్ఞానముచే కల్పితములగు, బన్ధాన్=బంధములను, స్వస్వరూపావబోధేన=స్వస్వరూపజ్ఞానముచే, మోక్తుం=విడచుటకు, ఇచ్ఛా=కోరిక, ముముక్షుతా=ముముక్షుత్వము.

అన్తఃకరణమేతేషు చక్షురాదిషు వర్ష్మణి,
అహమిత్యభిమానేన తిష్ఠత్యాభాసతేజసా.
అహంకారః స విజ్ఞేయః–

ఈ చక్షురాదీంద్రియములందును, శరీరమునందును, 'అహం' (నేను) అను అభిమానముతో, అంతఃకరణము ఆభాసతేజస్సుతో ప్రవర్తించును. అదియే అహంకారముగ తెలియదగినది అని చెప్పిన విధముగ, చిత్ప్రతిబింబముతో గూడిన అంతఃకరణమే అహంకారము లేదా ఆనందమయకోశము అనుపేరు గల భోక్తయగు జీవుడు అహంకారము.

సుప్తిగతైః సుఖలేశైరభిమనుతే సుఖీభవామీతి,
ఆనందకోశనామా సోఽహంకారః కథం భవేదాత్మా.

ఆనందమయకోశమను పేరుగల ఏ అహంకారము సుప్తియందు కలుగు సుఖలేశములచే "నేను సుఖము కలవాడను" అని భావించుచుండునో అది ఆత్మ ఎట్లగును? అను శ్లోకమున, 'ఆత్మనిరూపణము' నందు ఆనందమయకోశమే అహంకారమని చెప్పబడినది. అది కూడ అజ్ఞానకల్పితమనియు, మనోరూపమగు ఉపాధినిబట్టి గౌణమగు వికారమనియు చెప్పవచ్చును. కావున, ఆత్మసాక్షాత్కారమునకు పూర్వము ఆత్మగా భావింపబడుచున్నవియు, ఆనందమయకోశము మొదలు విజ్ఞానమయ - మనోమయ - ప్రాణమయ - అన్నమయ కోశమువరకును ఉన్నవియునగు బంధములను, స్వస్వరూపజ్ఞానముచే విడచుటకు, వాటియందు మరల ఎన్నడును అహంబుద్ధి కలుగకుండు విధమున బాధించుటకు అని యర్థము. స్వస్వరూపజ్ఞానము కలుగగనే "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్" అను శ్రుతిచే స్వభిన్నమగు ఏ వస్తువును భాసింపదు గాన కోశపంచకాత్మకమగు బంధము పూర్తిగ నివర్తించును అని భావము.

అవ. మంద, మధ్య, ప్రవృద్ధ అని ఈ ముముక్ష (మోక్షేచ్ఛ) మూడువిధములు. మోక్షము నిత్యసుఖరూపమే యైనను సాంసారిక వాసనచే వాసితమగు అంతకరణము కలవారికి మోక్షేచ్ఛ కలుగుటయే కష్టము. అధ్యాత్మశాస్త్రమును వినెడు సమయమున అది పేరునకు

కలిగినను నిలువదు. ఇది తాత్కాలికమగు మందముముక్ష. శ్రవణముచేసిన తరువాత కలిగిన వివేకబుద్ధిచే, పురుషుడు సాంసారికములగు విషయములలో దోషములను చూచి చూచి, వాటి విషయమున వైరాగ్యమును పొంది, యథాశాస్త్రముగ సర్వకర్మసంన్యాసము చేసి, విచారార్థమై గురూపసదనాదులను (గురువువద్దకు వెళ్ళుట) చేయుటకై ప్రవర్తించినపుడు ఆ మందముముక్షత మధ్యముముక్షతగా మారును. వైరాగ్యము తీవ్రమైనకొలది మనస్సు శాంతమై సమాధానమును పొందుచుండును. 'ఈతడు శీఘ్రముగ సంసారసముద్రమును దాటుగాక' అని గురువుకూడ అనుగ్రహించును. అపుడు ఆ పురుషుడు నిత్యసుఖరూపమగు మోక్షముతక్క మరేదియు వాంఛింపడు. అందు ఆలస్యమునుకూడ సహింపడు. ఈ విధముగ ముముక్ష ప్రవృద్ధముకాగా, ముఖ్యాధికారియై ఫలమును శీఘ్రముగ పొందును అని చెప్పుచున్నాడు.

మన్దమధ్యమరూపాపి వైరాగ్యేణ శమాదినా.
ప్రసాదేన గురోః సేయం ప్రవృద్ధా సూయతే ఫలమ్. 29

సా ఇయం=ఈ ముముక్ష, మందమధ్యమరూపాపి=మందమధ్యమరూపమైనను, వైరాగ్యేణ=వైరాగ్యముచేతను, శమాదినా=శమాదికముచేతను, గురోః=గురువుయొక్క, ప్రసాదేన=అనుగ్రహముచేతను, ప్రవృద్ధా=ప్రవృద్ధమైనదై, ఫలం=ఫలమును, సూయతే=కనును.

ఈ విధముగ ముముక్ష మోక్షేచ్ఛారూపమే యైనను, అది ఎప్పుడు ప్రవృద్ధమగునో అప్పుడే ఫలము నిచ్చునుగాన దాని ప్రవృద్ధి కొరకై, విషయవైరాగ్యమును, శమాదిషట్కమును, గురుప్రసాదమును సంపాదించుటకై పురుషుడు ప్రయత్నించవలెనని భావము.

అవ. ఈ నాల్గుసాధనములలో రెండవది, నాల్గవది ఉన్నచో అన్నియు ఉన్నట్లే. అవి లేనిచో అట్లుకాదు అని చెప్పుచున్నాడు–

వైరాగ్యం చ ముముక్షుత్వం తీవ్రం యస్య తు విద్యతే.
తస్మిన్నేవార్థవన్తః స్యుః ఫలవన్తః శమాదయః. 30

యస్య = ఎవనికి, తీవ్రం = తీవ్రమైన, వైరాగ్యం చ = వైరాగ్యము, ముముక్షుత్వం = మోక్షేచ్ఛయు, విద్యతే = ఉండునో, తస్మిన్నేవ = వాని విషయముననే, శమాదయః = శమాదిశబ్దములు, అర్థవన్తః = ఫలముకలవిగను, ఫలవన్తః = ఫలముకలవిగను, స్యుః = అగును.

'శమాదయః' అనుదానికి శమాదిశబ్దములు అని అర్థము. ఆ పురుషునియందు శమాదు లున్నవి అను వ్యవహారము సార్థకమని భావము. 'ఇతడు శాంతుడు' 'ఇతడు దాంతుడు' అని యన్నచో అతనికి తీవ్రమైన వైరాగ్యము, తీవ్రమైన మోక్షేచ్ఛ ఉన్నవని యర్థము. శమాదు లున్నందుకు ఫలము తీవ్రమోక్షేచ్ఛయే కదా! ఒకనికి తీవ్రముగా ముముక్ష ఉన్నదన్నచో కార్యమునుబట్టి కారణమును ఊహించుకొనవచ్చును గాన ఆతనికి శమాదులు ఉన్నవని సులభముగ చెప్పవచ్చును. సాధనములేనిచో ఫలము లభింపదు కదా! అట్లే శమాదులకు సాధనమగు తీవ్రవైరాగ్యము ఒకనికి ఉన్నదన్నచో, సాధనమున్నపుడు ఫలముకూడ తప్పక ఉండవలెను గాన ఆతనికి శమాదికము ఉన్నదనుట గూడ అనివార్యమగును. శమాదిసాధనమగు తీవ్రవైరాగ్యము, తీవ్రవైరాగ్యశమాదులకు ఫలమగు తీవ్రముముక్షుత్వము ఉన్నపుడు తమ (శమాదుల) సాధనమునకును (తీవ్రవైరాగ్యమునకును) ఫలమునకును (తీవ్రముముక్షుత్వమునకును) నడుమ తాను (శమాదికము) ఉన్నదని చెప్పుటలో సందేహమేదియు లేదు. తీవ్రవైరాగ్యమున్న నీ శమాదిశబ్దములు సార్థకములు; తీవ్రమగు ముముక్షుత్వ మున్నపుడే శమాదులు ఫలవంతములు అని శ్లోకతాత్పర్యము.

ఇతరుల అంతఃకరణములలో శమాదు లున్నవో లేవో తెలియుట కష్టము. కావున శమాదులకు కారణమగు వైరాగ్యమునుబట్టియు

కార్యమగు ముముక్షుత్వమునుబట్టియు శమాదుల ఉనికిని ఊహింప వలసియుండునని అభిప్రాయము. తనకుగూడ శమాదికము లభించి నదా లేదా అని తెలిసికొనవలె నన్నచో వాటి పుష్కలకారణమగు తీవ్రవైరాగ్యము, వాటి విశిష్టఫలమగు తీవ్రముముక్షుత్వము ఉన్నచో శమాదులుకూడ ఉన్నట్లే. కావున తన విషయమందైనను, ఇతరులవిషయ మందైనను శమాదుల ఉనికిని సూచించునవి కార్య కారణములే.

కాకస్య విష్ఠావ దసహ్యబుద్ధి ర్భోగేషు సా తీవ్రవిరక్తి రిష్యతే,
విరక్తితీవ్రత్వనిదాన మాహు ర్భోగేషు దోషేక్షణమేవ సన్తః.

కాకిరెట్టయందువలె భోగములయందు జుగుప్సకు తీవ్రవైరాగ్య మని పేరు. భోగములలో దోషములను చూచుటయే ఇట్టి తీవ్రవైరాగ్యము నకు మూలకారణమని సత్పురుషులు చెప్పుదురు అను సర్వవేదాన్త సిద్ధాన్తసంగ్రహమునందలి శ్లోకములో వైరాగ్యమునకుగల తీవ్ర త్వము, తత్సాధనముకూడ చెప్పబడినవి. తీవ్రముముక్షుత్వమనగా వెనుక చెప్పిన ప్రవృద్ధముముక్షుత్వము.

**ఏతయోర్మన్దతా యత్ర విరక్తత్వ ముముక్షయోః.**
**మరౌ సలిలవత్తత్ర శమాదేర్భానమాత్రతా. 31**

యత్ర = ఎచట (ఏ వ్యక్తియందు), ఏతయోః = ఈ, విరక్తత్వ ముముక్షయోః = వైరాగ్య మోక్షేచ్ఛలకు, మన్దతా = మాంద్యముండునో, తత్ర = అచట (ఆ వ్యక్తియందు), మరౌ = ఎడారియందు, సలిలవత్ = ఉదకమునకువలె, శమాదేః = శమము మొదలగువాటికి, భానమాత్రతా = కేవలము భాసమే ఉండును (శమాదులు లేకపోయినను ఉన్నట్లు కనబడును).

ఏ పురుషునియందు, మరువునందు ఉదకమువలె, ఈ విరక్తత్వ ముముక్షుత్వములు మందముగ, తాత్కాలికముగ మాత్రమే ఉండునో–

గ్రీష్మసమయమునందు ఎడారిప్రదేశమున సూర్యకిరణసంపర్కము కలిగినపుడు, దూరమునుండి చూచువానికి అచట జలమున్నట్లు భ్రాంతి కలుగును. భ్రాంతియేకాని జలము లభింపదు; దప్పిక తీరదు. జలలాభము లేకపోగా, అలసటచెంది జలముకొరకై అచటకు వెళ్ళువానికి ఎక్కువ శ్రమమాత్రమే మిగులును. అట్లే తీవ్రవైరాగ్య ముముక్షలు లేకున్నచో అట్టి వ్యక్తియందు మరువునందు జలమువలె శమాదులు ఉన్నట్లు కనబడునే గాని ఆతనికి వాటివలన ఫలమేమియు లభింపదు; ఇతరులుకూడ 'ఈతడు శాంతుడు' అని అనుకొనరు.

అవ. వేదాంతములకు జీవాత్మాభిన్నము, నిత్యము, శుద్ధము, జ్ఞానరూపము అగు అద్వితీయబ్రహ్మయందే తాత్పర్యము అని నిర్ణ యించుటకు తగు వ్యాపారము శ్రవణరూపమగు బ్రహ్మవిచారము. అట్టి విచారమునందు అధికారముగలవానికి చెందు వివేకాదివిశేషణము లను ఇంతవరకు విశదీకరించి ఇపుడు, ఈ విచారముచే సాధింపతగి నదియు, ఆత్మసాక్షాత్కారమునకు సాక్షాత్సాధనమును అగు భక్తిని విశదీకరించుచున్నాడు-

మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ,
స్వస్వరూపానుసన్ధానం భక్తిరిత్యభిధీయతే. 32

మోక్షకారణసామగ్ర్యాం=మోక్షమునకు కారణమగు సామగ్రిలో, భక్తిరేవ=భక్తియే, గరీయసీ=గొప్పది, స్వస్వరూపానుసన్ధానం=స్వస్వ రూపము యొక్క ధ్యానము, భక్తిరితి=భక్తియని, అభిధీయతే=చెప్ప బడుచున్నది.

స్వస్వరూపానుసన్ధాన మనగా నిదిధ్యాసనము. ఇదియే సాక్షా త్కారమునకు ప్రత్యక్షసాధనము. "నీస్వరూపము బ్రహ్మయే; నీవు ఆ బ్రహ్మయే" అని శ్రుతివాక్యమునుండియు, ఆచార్యోప

దేశము చేతను విని ఆ విషయమునే అనుసంధానము చేసికొనవలెను. విజాతీయప్రత్యయములచే తిరస్కృతముకాని - ఇతర విధములగు ఆలోచనలచే అడ్డుకొనబడని, సజాతీయప్రత్యయప్రవాహము - ఒకేవిధమగు జ్ఞానము అవిచ్ఛిన్నముగ కలుగుట, అనుసంధానము. ఇది సాక్షాత్కారమునకు అసాధారణకారణము. శమాదులు మొదట విచారమును కలిగించి, తద్ద్వారా నిదిధ్యాసనమును, తద్ద్వారా జ్ఞానమును కలిగించును. నిదిధ్యాసనము సాక్షాత్తుగనే జ్ఞానమును కలిగించుచున్నది. కావున నీ మోక్షమునకు కారణమగు - అభివ్యంజకమగు - జ్ఞానమునకు ఏ సామగ్రి - సాధనసముదాయము - ఉన్నదో ఆ సాధనములలో భక్తియే, సాక్షాత్సాధనముగాన. శ్రేష్ఠమైనదని చెప్పబడినది. వివేకము మొదలు నిదిధ్యాసనము వరకును ఉన్న సాధనములే జ్ఞానసామగ్రి.

అవ. ఇతరుల మతమును చెప్పుచున్నాడు -

స్వాత్మతత్త్వానుసన్ధానం భక్తి రిత్యపరే జగుః. 32

**స్వాత్మతత్త్వానుసంధానం = జీవాత్మకు పరమాత్మత్వము యొక్క - అనుసంధానము, భక్తిరితి = భక్తియని, అపరే = ఇతరులు, జగుః = చెప్పిరి.**

జీవుడగు తనకు తత్పదవాచ్య పరమాత్మత్వమును అనుసంధానముచేయుట, అనగా వాస్తవికభేదమున్నను అభేదోపాసనము చేయుట, _దినికే అహంగ్రహోపాసన మని పేరు - భక్తి యని మరికొందరు చెప్పిరి. భేదబుద్ధితో కూడిన దగుటచే భ్రాంతిరూపమగు ఈ భక్తి ముఖ్యభక్తి కాజాలదని సూచితమైనది.

అవ. పూర్వోక్తసాధనసంపన్నుడు చేయవలసిన పనిని చెప్పుచున్నాడు..

# గురూపసదనము — ప్రశ్నవిధి

ఉక్తసాధనసమ్పన్నః తత్త్వజిజ్ఞాసురాత్మనః.
ఉపసీదేద్గురుం ప్రాజ్ఞం యస్మాద్బన్ధవిమోక్షణమ్. 33

ఉక్తసాధన సంపన్నః=పూర్వోక్తములగు వివేకాదిసాధనములతో సంపన్నుడగు పురుషుడు, ఆత్మనః=ఆత్మయొక్క, తత్త్వజిజ్ఞాసుః= తత్త్వమును తెలియదలచినవాడై, యస్మాద్=ఏ గురువువలన, బన్ధ విమోక్షణం=బంధమోక్షము కలుగునో, అట్టి, ప్రాజ్ఞం=బ్రహ్మనిష్ఠుడైన, గురుం=గురువును, ఉపసీదేత్=సమీపించవలెను.

ఉక్తసాధనసంపన్నః = విచారసాధనములుగా చెప్పబడిన ఏ వివేకాదిసాధనములు గలవో వాటితో కూడిన, 'పుమాన్' అని అధ్యాహారము. తనయొక్క యథార్థస్వరూపమును తెలియదలచిన వాడై, ఉపసీదేత్=శరణము పొందవలెను. గురుం=ఉపదేశకర్తను; 'ప్రజ్ఞా' అనగా నిరతిశయము, అత్యుత్కృష్టము అగు జ్ఞానము. అనగా బ్రహ్మసాక్షాత్కారము. 'బ్రహ్మాత్మనోః శోధితయోః' అని మున్ముందు చెప్పనున్న ఈ ప్రజ్ఞకలవాడు ప్రజ్ఞుడు. ప్రజ్ఞుడే ప్రాజ్ఞుడు; అనగా బ్రహ్మనిష్ఠుడు. యస్మాత్=ఏ గురువునుండి, అజ్ఞాన కల్పితమగు అహంకారాదిదేహాన్తమగు బంధమునకు నివృత్తి కలుగునో అట్టి వానిని, శరణు పొందవలెను అని పురుషునకు గల్గు లాభమును చెప్పుచున్నాడు. అట్టి గురువును సేవించినచో ఆతని ఉపదేశముచే తన యథార్థస్వరూపము తెలియును. అపుడు బంధ నివృత్తిరూపమగు మోక్షము సిద్ధించును అని భావము.

అవ. ఆ గురువుయొక్క లక్షణములనే విశదీకరించుచున్నాడు —

శ్రోత్రియోఽవృజినోఽకామహతో యో బ్రహ్మవిదుత్తమః.
బ్రహ్మణ్యుపరతః శాన్తో నిరిన్ధన ఇవానలః. 34

అహేతుక దయాసిన్ధు ర్బన్ధురానమతాం సతామ్. 35

శ్రోత్రియః = ఉపనిషద్రూపవేదాధ్యయనము చేసినవాడును, అవృజినః = పాపములులేనివాడును, అకామహతః = కామములచే పీడింపబడనివాడును, బ్రహ్మవిదుత్తమః = బ్రహ్మవేత్తలలో ఉత్తముడును, బ్రహ్మణి = బ్రహ్మయందు, ఉపరతః = లీనమైన మనస్సు కలవాడును, నిరిన్ధనః = ఇంధనములులేని, అనల ఇవ = అగ్నివలె, శాన్తః = శాంతుడును, అహేతుకదయాసిన్ధుః = నిష్కారణమగుదయకు సముద్రమువంటివాడును, ఆనమతాం = నమస్కరించుచున్న, సతాం = సత్పురుషులకు, బన్ధుః = బంధువును (అగు మహాపురుషుడు గురువు).

సూ. "శ్రోత్రియశ్ఛందోఽధీతే" అను పాణిని సూత్రము ననుసరించి 'శ్రోత్రియః' అనగా ఉపనిషత్తుల అధ్యయనము చేసిన వాడు అని అర్థము. ఉపనిషదధ్యయనముచేసి వాటి అర్థమును విచారించు వానికే సాక్షాత్కారము కలుగును. అవృజినః = పాపములు లేనివాడు.

నావిరతో దుశ్చరితాన్ నాశాన్తో నాసమాహితః,
నాశాన్తమానసో వాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్.

పాపములనుండి విరమింపనివాడు, ఇంద్రియనిగ్రహము లేనివాడు, చిత్తైకాగ్రతలేనివాడు, శాన్తమైనమనస్సు లేనివాడు, ఈ ఆత్మను బుద్ధిచే తెలిసికొనజాలడు అని శ్రుతి చెప్పుచున్నది. కామేన = విషయాశచేత, హతః = పీడింపబడుచున్నవాడు. స్వరూపజ్ఞానము లేనివాడు. కామహతుడు కానివాడు అకామహతుడు. స్వస్వరూపమగు ఆనందమును గుర్తించనివాడు బాహ్యవిషయములలో ఆనందమున్నదను అభిప్రాయముతో పాపముకూడ చేయవచ్చును. కాని ఈ బ్రహ్మవేత్త స్వరూపానందమును సాక్షాత్కరించు కొనినవాడగుటచే—

విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే.

ఆహారములేని — విషయభోగములు చేయనివానికి భోగములు తమంతటు తామే దూరమగును. రసము మాత్రము — అభిలాష మాత్రము, మనస్సులో ఉండును. ఆ పరమాత్మను చూచినపిమ్మట ఆ రసముకూడ తొలగిపోవును అని భగవద్గీతలో చెప్పిన విధమున రాగనివృత్తి రూపమగు అకామ హతత్వము ఆతనికి సిద్ధించును. కావున ఆతడు పాపరహితుడు. కామమేకదా పాపమును చేయించునది? కావుననే—

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః,
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః.

ఓ శ్రీకృష్ణా! మానవుడు బలాత్కారమున దేనిచే ప్రేరితుడై ఇష్టము లేకున్నను పాపము చేయుచున్నాడు అని భగవద్గీతలో అర్జునుడు ప్రశ్నింపగా, శ్రీకృష్ణుడు—

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్.

రజోగుణమువలన బుట్టిన కామము క్రోధము అనునవి మనుష్యుని పాపాచరణమున ప్రేరేపించుచున్నవి. ఇవి తీరని ఆకలిగలవి. మహాపాపహేతువులు అనిచెప్పియున్నాడు. బ్రహ్మణ్యుపరతః=బ్రహ్మాయందు విలీనమైన మనస్సుకలవాడు. కావుననే కట్టెలులేని అగ్నివలె శాంతమైనవాడు. ఇంధనములు లేనిచో అగ్ని ఎట్లు జ్వాలావిహీనమై శాంతముగ ప్రకాశించునో, అట్లే ఇతడు బాహ్యావృత్తుల నన్నింటిని ఉపసంహరించుకొని నిర్గుణబ్రహ్మాయందే చిత్తమును నిలుపుకొనుటచే నిర్వికారుడై యుండును అని భావము. బ్రహ్మవిత్తమునియందు అశ్రోత్రియత్వముగాని, పాపముగాని, కామ హతత్వముగాని అసం

భావ్యములుగాన ఇచట. ప్రయుక్తములగు శ్రోత్రియత్వాది విశేషణములు వ్యావర్తకములు కావు. అట్టి గురువు యొక్క స్వరూపమును బోధించునవగుటచే ఇవి స్వరూపలక్షణములు మాత్రమేయని గ్రహింపవలెను. 'తెల్లని ఆవు' అనునపుడు 'తెల్లని' అను విశేషణమును ప్రయోగించుటచే ఆ ఆవు ఎఱ్ఱనిదిగాని, నల్లనిదిగాని, మరి ఇతర వర్ణముకలదిగాని కాదు అను అర్థమువచ్చును. ఆవులలో తెలుపుకంటె భిన్నములగు వర్ణములు సంభావ్యములుగాన ఈ విశేషణము వాటి నన్నింటిని నిషేధించు చున్నది. అందుచే అది వ్యావర్తకము. ఆ విధముగ ఇచట బ్రహ్మవిదుత్తముని విషయమున ప్రయోగించిన 'శ్రోత్రియః ఇత్యాదివిశేషణములు వ్యావర్తకములు కావు. ఆవునకు తెలుపుకంటె భిన్నములగు వర్ణము లున్నట్లు ఆతనికి అశ్రోత్రియత్వాదులు ఉండుటకు అవకాశము లేదు. కావున 'శ్రోత్రియః' ఇత్యాదిపదములు ఆ బ్రహ్మవిదుత్తముని స్వరూపమును మాత్రమే బోధించును. 'తెల్లని పాలు' అన్నప్పుడు 'తెల్లని' అను విశేషణము నల్లని పాలు లేకుండుటచే ఏ విధముగ ఇతర వ్యావర్తకముకాదో అట్లే ఇతర వ్యావర్తకములు కావు. స్వరూపలక్షణ కథనమాత్రపరములు.

హేతువులేని ఏ దయ- అనగా ఇతరుల దుఃఖమును తొలగింపవలెననెడు ఇచ్ఛ, గలదో దానికి-సింధువు, అనగా ఆశ్రయభూతుడు. లోకమున దయావంతులగు ఇతరులకు గూడ పరుల దుఃఖములను చూచినపుడు దయ కలుగవచ్చును కాని ఈ దయ పరులదుఃఖమును చూచుటచే తనకు కలిగిన దుఃఖమునుబట్టి కలిగినది. కావున ఈ దయకు కారణ మున్నది. బ్రహ్మవిదుత్తమునకు కలుగు దయ అట్టిది కాదు .అని చెప్పుటకై 'అకారణ' అను విశేషణము. ఇట్టి జ్ఞానికి స్వతః కాని, పరులవల్ల కాని దుఃఖము కలుగు నవకాశము లేదు. సమాధిస్థితినుండి బైటకు వచ్చినప్పుడు ఈ జనులు సంసారసముద్రమును తరింతురుగాక అని ఇచ్ఛ కలుగును. బన్ధుః=దుఃఖమును తొల

గించువాడు. ఎవరియొక్క? ఆనమతాం సతామ్ = వినయముతో నమస్కరించిన సత్పురుషులకు; ఇట్లు చెప్పుటచే శిష్యుల లక్షణములను పరిశీలించిన పిమ్మటనే వారు ఉపదేశింతురని సూచితమైనది. శ్రు. "నాసూయకాయానృజవేఽశఠాయ" – అసూయకలవానికి, వక్ర స్వభావముకలవానికి, రహస్యముగ అపకారముచేయువానికి బోధింపగూడదు, శ్రు. "ఇదమశిష్యాయ నో దేయం" – దీనిని ఉపదేశార్హత లేని వానికి ఉపదేశింపగూడదు అని శ్రుతులు చెప్పుచున్నవి. భగవద్గీతలో గూడ–

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన,
న చాశుశ్రూషవేవాచ్యం న చ మాం యోఽభ్యసూయతి.

తపస్సులేనివానికిని, భక్తుడు కాని వానికిని, శ్రవణేచ్ఛలేని వానికిని, నన్ను ద్వేషించువానికిని దీనిని బోధింపగూడదు అని శ్రీకృష్ణుడు అర్జునునితో చెప్పియున్నాడు. ఈ విధముగ ఇట్టిగురువువద్దకు వెళ్లుటకు 'ఉపసదనము' అని పేరు.

అవ. తరువాత ఏమిచేయవలెనో, భగవంతుడగు భాష్యకారుడు, శిష్యునకు కరుణతో బోధించుచున్నాడు –

**తమారాధ్య గురుం భక్త్యా ప్రహ్వః ప్రశ్రయసేవనైః,**
**ప్రసన్నం తమనుప్రాప్య పృచ్ఛేత్ జ్ఞాతవ్య మాత్మనః. 36**

భక్త్యా = భక్తిచే, ప్రహ్వః = వంగినవాడై, ప్రశ్రయసేవనైః = వినయముతోడను, సేవనముతోడను, తం = అట్టి, గురుం = గురువును, ఆరాధ్య = సేవించి, ప్రసన్నం = ప్రసన్నుడైన, తం = ఆ గురువును, అనుప్రాప్య = సమీపించి, ఆత్మనః = ఆత్మకుసంబంధించిన, జ్ఞాతవ్యం = తెలియవలసిన. విషయమును, పృచ్ఛేత్ = ప్రశ్నింపవలెను.

భక్తిః = పూజ్యుల విషయమున ప్రేమ. ఇది మానసమగు ధర్మము; దానిచేత, ప్రహ్వః = ఆ భక్తిని సూచించు ఆకారముకలవాడై,

వంగిన శరీరముకలవాడై, దోసిలియొగ్గినవాడై, 'ప్రశ్రయసేవనైః'- వినయముతో మాటలాడుట ప్రశ్రయము. సాష్టాంగప్రణామము, పాదములు ఒత్తుట, ఆయన ఆజ్ఞప్రకారము చేయుట మొదలగునవి సేవనములు. వాటిచే ఆతనిని సేవించి, నిష్కపటమగు ఆ సేవచే ప్రసన్నుడైన – తన విషయమున అభిముఖుడుగానున్న, ఆయనను, అనుప్రాప్య = ఆయన నిర్దేశించిన సమయమున ఆయన సమీపమున యథావిధిగ ఉండి, ఆత్మ యథార్థస్వరూప విషయమున తెలియదగిన విషయమునుగూర్చి ప్రశ్నింపవలెను. "భక్త్యా ప్రహ్వాః ప్రశ్రయ సేవనై రారాధ్య" అని చెప్పుటచే ఆరాధనము చేయువాడు మనస్సు, వాక్కు, శరీరము అను త్రికరణములను శుద్ధముగ నుంచుకొనవలెను అని చెప్పబడినది.

అవ. భక్తిపురస్సరముగ వాక్కుతో ఏ విధముగ సేవింపవలెనో భగవత్పాదులు జిజ్ఞాసువులవిషయమున దయచే 'స్వామి న్నమస్తే' అను శ్లోకము మొదలు 'తథావదన్తం' అను శ్లోకమువరకును గల ఏడు శ్లోకములలో బోధించుచున్నారు.

స్వామిన్నమస్తే నతలోకబన్ధో కారుణ్యసిన్ధో పతితం భవాబ్ధౌ.
మా ముద్ధరాత్మీయ కటాక్షదృష్ట్యా ఋజ్వ్యాతికారుణ్య సుధాభివృష్ట్యా. 37

నతలోకబన్ధో = నమస్కరించు జనులకు బంధువైన, స్వామిన్ = ఓ ప్రభూ! తే = నీకు, నమః = నమస్కారము, హే కారుణ్యసిన్ధో = ఓ కారుణ్యసముద్రుడా, భవాబ్ధౌ = సంసారసముద్రమునందు, పతితం = పడిన, మాం = నన్ను. ఋజ్వ్యా = వక్రముకానిదియు, అతికారుణ్యసుధాభివృష్ట్యా = అత్యధికమగు కారుణ్యమనెడు అమృతమును వర్షించునదియు అగు, కటాక్షదృష్ట్యా = కటాక్షవీక్షణముచే, ఉద్ధర = పైకి లేవదీయుము.

నతానాం = నమస్కారముచేయు జనులకు, బంధుః = దుఃఖ విమోచకుడు, ఆతనికి సంబుద్ధి– 'నతలోకబంధో,' ఓ స్వామీ! నీకు నమస్కారము, ప్రహ్వీభావము అగు గాక అని యర్థము. నీవు నతలోక దుఃఖమోచకుడవుగాన నిన్ను దుఃఖవిముక్తికై నమస్కరించు చున్నాను అని భావము. 'కారుణ్యసింధో' అను సంబోధనముచే అందులకు కారణమును చెప్పుచున్నాడు. 'అహేతుకదయాసింధుః' అనుపదమును వ్యాఖ్యానించు నవసరమున దీని భావము వివరింపబడి నది. తనకున్న దుఃఖ మేదియో చెప్పుచున్నాడు–'భవాబ్ధౌ పతితం'= జన్మ - జరా - రోగ - మరణాది మహానర్థములతో వ్యాకులముగనున్న సంసారసముద్రములో పడినవాడను అని యర్థము. ఇపుడు దానికి నివృత్తిని ప్రార్థించుచున్నాడు–"ఆత్మీయకటాక్షదృష్ట్యా" = నీ లోచ నాంతముచేత అని యర్థము. బ్రహ్మసాక్షాత్కారముచే సకల మాలిన్యములును తొలగిపోయిన నీ పవిత్ర కటాక్షము ప్రసరింపగనే నా పాపములన్ని పటాపంచలై నేను సంసారసాగరమును దాటగల నని భావము.

యస్యానుభవపర్యన్తా బుద్ధిః సత్వే ప్రవర్తతే,
తద్దృష్టిగోచరాః సర్వే ముచ్యన్తే సర్వకిల్బిషైః.

బ్రహ్మానుభూతిని పొందినవారి దృష్టిప్రసరించిన అందరి పాపములును తొలగిపోవును అని చెప్పబడినది: ఇట్లు చెప్పుటచే శిష్యుడు గురువు నకు పూర్తిగ ఎదురుగ కూర్చుండగూడదు' అను వినయపద్ధతి సూచిత మైనది. మరియు, నీ కటాక్షపాతముగూడ సంపూర్ణావలోకనమే కావున దానిని కోరుచున్నానని అర్థము. నిత్యశుద్ధ బ్రహ్మానందమగ్న మగు (నీ) మనస్సు నేత్రాంతము ద్వారా పరిపూర్ణముగ నాపై ప్రస రింపగనే నేను సర్వవిధముల పూతుడనై దుఃఖవిముక్తుడ నౌదును అని భావము. లేదా 'ఆత్మీయకటాక్షదృష్ట్యా' అనగా 'నీ యొక్క సానుగ్రహ దృష్టితో' అని యర్థము. ఋజ్వ్యా = స్వభావముచే

సరళమైనది. ఈ విశేషణముచే - లోకమున అగాధజలములో పడిన వాడు పొడవైన త్రాడునుగాని కఱ్ఱనుగాని ఊతగ గొని ఎట్లు పైకి వచ్చునో అట్లే నేను అతిదీర్ఘమగు నీకటాక్షమును ఊతగగొని సంసార సముద్రమునుండి ఉద్ధరింపబడుదును అని సూచితమగుచున్నది. సూర్యమండలము, దీపము మొదలగు వాటినుండి కిరణములు పుంజీభూతములై త్రాడువలె ఎట్లు బయల్వెడలునో అట్లే చక్షురింద్రియము గూడ తేజోరూపము గాన దాని నుండి బయల్వెడలిన కిరణములు ఈతనిపై సంక్రమించి, బ్రహ్మనిష్ఠమగు (గురువుయొక్క) మనస్సుతో సంబంధించినవగుటచే ఈతనిని ఉద్ధరించునని భావము. అతికారుణ్యసుధాభివృష్ట్యా = అత్యంతము కారుణ్యము అతికారుణ్యము; అదియే సకలతాపహారక మగుటచే సుధయని ఆరోపింపబడుచున్నది. సుధ యనగా అమృతము. దానియొక్క వర్షము, అంతటను ఏ దృష్టి యందు ఉన్నదో అట్టి దృష్టిచేత; అమృతవృష్టిచే పురుషుడు జరా మరణాదులు లేనివాడగు నని ప్రసిద్ధము. యుద్ధమునందు మరణించిన వానరులను ఇంద్రుడు అమృతమును కురిపించి పునరుజ్జీవితులను చేసెనని రామాయణమున ప్రసిద్ధము. ఆ అమృతమే అట్టి ఫలమును కలిగించ కలిగిన దన్నచో దయామృతమును కురిపించెడు బ్రహ్మనిష్ఠుని దృష్టి శాశ్వతమగు జరామరణరాహిత్యమును ఈయగల దనుటలో సందేహమేమి?

అవ. తన ఉద్ధరణము విషయమున ఆలస్యము నే మాత్రము సహింపనివాడై తనకు గల తీవ్రముముక్షుత్వమును ప్రకటించుచున్నాడు -

దుర్వారసంసారదవాగ్నితప్తం
దోధూయమానం దురదృష్టవాతైః,
భీతం ప్రపన్నం పరిపాహి మృత్యోః
శరణ్యమన్యం యదహం న జానే. 38

దుర్వార సంసారదవాగ్ని తప్తం = వారింపకష్టమైన సంసారదావాగ్నిచే తపింపచేయబడినవాడను, దురదృషవాతైః = పాపములనెడు వాయువులచేత, దోధూయమానం = ఇటునటు ఎగురగొట్టబడనున్నట్టి వాడను, భీతం = భీతుడను, ప్రపన్నం = శరణుజొచ్చినవాడను అగు నన్ను, మృత్యోః = మృత్యువునుండి, పరిపాహి = రక్షింపుము, యత్ = ఎందువలన అనగా, త్వదన్యం = నీకంటె అన్యుడైన, శరణ్యం = రక్షకుని, అహం = నేను, న జానే = ఎరుగను.

సంసారమే, దవాగ్నిః = నలుమూలల వ్యాపించి తాపమును కలిగించుటచే, వనమునందలి అగ్ని; అది నీ సదుపదేశమువలన కలుగు జ్ఞానము లేనిచో నాచే స్వయముగ వారించుకొనుటకు శక్యము కానిది. దుర్వారమగు అట్టి సంసారదవాగ్నిచే, తప్తం = కాల్చబడినవాడను; దవాగ్నికి గాలికూడ తోడైనచో అది అంతట వ్యాపించి కాల్చుట ప్రసిద్ధము; అట్లే, దురదృష్టము లనగా పాపములు. అవే ప్రతికూలవాయువులు; వాటిచే, దోధూయమానం = మాటిమాటికిని కంపింపబడుచున్న వాడను. వాయువు అనుకూలమైనచో మరియొక ప్రక్క తీసికొని పోవచ్చును. కాని ప్రతికూలమైనచో ఈతనిని అగ్నిలో పడవేయును, లేదా అగ్నిని ఈతనిపై ప్రసరింపచేయును. ఈ విధముగ దావాగ్ని తప్తుడైనవానిపై అమృత వృష్టి కురిపించినచో తాపము తొలగును అను నభిప్రాయముతో పూర్వశ్లోకములో 'దృష్ట్యా' అనుదానికి 'అతికారుణ్యసుధాభివృష్ట్యా' అను విశేషణము ప్రయుక్త మైనది. ఈ పదమున బహువ్రీహిసమాసమును అంగీకరించి వెనుక అర్థము చూపబడినది. అట్లు బహువ్రీహి చేయక దృష్ట్యా = దృష్టితో, అతికారుణ్యసుధాభివృష్ట్యా = కారుణ్య సుధావర్షముచే అనికూడ అర్థము చెప్పవచ్చును. ఆ వర్షణముచే, దావాగ్ని తప్తుడనైన నన్ను మృత్యువునుండి రక్షింపుము అని అన్వయము. 'ఋజువైన కటాక్షదృష్టిచే నన్ను ఉద్ధరింపుము' అని పూర్వశ్లోకమునందును, ఆ దృష్టిచేతనే సుధావర్షమును కురిపించి

సంసారదావాగ్ని తప్తుడనైన నన్ను మృత్యువునుండి కాపాడుము అని ఈ శ్లోకమునందును అన్వయము. మృత్యువునుండి భయపడిన వాడను, శరణాగతుడను అగు నన్ను మృత్యువునుండి రక్షింపుము అని ఉభయస్థలములందును అన్వయము. నీ అనుగ్రహమువలన ఆత్మజ్ఞానము కగిలినచో నాకు శరీరమునుండి బయటకు పోవుట అను మరణము కలుగదని భావము. శ్రు. "న తస్య ప్రాణాఉత్క్రామన్తి అత్రైవ సమవలీయన్తే"—బ్రహ్మవేత్తయగు వాని ప్రాణములు పైకి ఎగిరిపోవు; ఇచటనే లీనమై పోవును అని శ్రుతి చెప్పుచున్నది. ధ్రువం జన్మ మృతస్య చ — మరణించినవానికి మరలజన్మ సత్యము అని చెప్పినవిధమున మరణము లేకున్నచో జన్మయే యుండదు గాన, నీ అనుగ్రహము లభించినచో జన్మమరణ ప్రవాహరూపమగు సంసారమునుండి ముక్తుడనగుదునని భావము. గురువును అభిముఖునిగ చేసికొనుటకై నీవుతక్క మరియొక్క శరణమేదియు లేదు, అని చెప్పుచున్నాడు. నాకు మరియొక రక్షకు లెవరును లేకుండుటచే నన్ను ఉపేక్షింపరాదు అని భావము.

అవ. నీవంటి సత్పురుషులకు మావంటి వారివిషయమున అవ్యాజమగు కరుణఉండును అని రెండుశ్లోకములలో చెప్పుచున్నాడు—

శాన్తా మహాన్తో నివసన్తి సన్తో వసన్తవ ల్లోకహితం చరన్తః,
తీర్ణాః స్వయం భీమభవార్ణవం జనానహేతునాన్యానపి
తారయన్తః. 39

అయం స్వభావః స్వత ఏవ యత్పర
శ్రమాపనోద ప్రవణం మహాత్మనామ్.
సుధాంశురేష స్వయమర్క కర్కశ
ప్రభాభితప్తా మవతి క్షితిం కిల. 40

వసన్తవత్ = వసంతఋతువువలె, లోకహితం = లోకములకు హితమును, చరన్తః = చేయుచున్నట్టియు, శాన్తాః = శాంతులును, మహాన్తః = గొప్పవారును, స్వయం = తాము, భీమభవార్ణవం = భయంకరమైన సంసారసముద్రమును, తీర్ణాః = దాటినవారును, అహేతునా = కారణమేమియు లేకుండగనే, అన్యాన్ జనానపి = ఇతరజనులను గూడ, తారయన్తః = దాటింపజేయుచున్న, సన్తః = సత్పురుషులు, నివసన్తి = నివసించుచున్నారు.

మహాత్మనాం = మహాత్ములయొక్క, యత్ = ఏ, పరశ్రమాపనోద ప్రవణం = పరులయొక్క బాధలను తొలగించుట యందలి ఆసక్తి కలదో, అయం = ఇది, స్వత ఏవ = స్వతఃసిద్ధమగు, స్వభావ ఏవ = స్వభావమే, ఏషః = ఈ, సుధాంశుః = చంద్రుడు, అర్కకర్కశ ప్రభాభితప్తాం = సూర్యుని తీవ్రకిరణములతపింపచేయబడిన, క్షితిం = భూమిని, స్వయం = తానే, అవతి కిల = రక్షించును కదా!

వర్షకాలమున వర్షబాధ; గ్రీష్మమున వేడి; శరదృతువునందు ప్రారంభమునందు మాత్రమే సుఖము; పూర్తిగ రెండు మాసములందును ఉండదు; కార్తికమాసపు చివరభాగము యమదంష్ట్ర (యముని కోరలు) అని చెప్పుదురు కదా? హేమన్తశిశిరములలో చలి; కాని సుగంధిపుష్పములకు నిధియగు వసంతము పూర్తిగ లోకమునకు సుఖమును కలిగించును గాన 'వసంతమువలె' అని చెప్పబడినది. అప్పుడు వర్షముగాని, తాపముగాని, చలిగాని, రోగములుగాని ఉండవు కదా? ఆ ఋతువు ఏ విధముగ సుఖమునుమాత్రమే కలిగించునో అట్లే లోకమునకు సుఖమునే చేయుచు, శాన్తాః = నిర్వికారమగు మనస్సుకలవారును, కావుననే మహాన్తః = అపరిచ్ఛిన్నమగు బ్రహ్మను సాక్షాత్కరించుకొన్నవారును, కావుననే శ్రు. 'బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి' – బ్రహ్మవేత్త బ్రహ్మయే యగును అని శ్రుతిచెప్పిన విధమున సన్తః = అట్టి అపరిచ్ఛిన్న బ్రహ్మాభేదముతో నున్నవారును, తాము సంసారరహితులును, తాము ఆప్తకాములు – కోరికలన్నియు తీరిన

వారు అగుటచే స్వప్రయోజన మేమియు లేకుండగనే సంసారసముద్ర నిమగ్నులగు ఇతరులనుగూడ దాటించుచున్నవారును, కారణములేని ప్రవృత్తి ఉండదు కదా! కారణములేకుండ వీరు ఇతరుల నెందులకు తరింపచేయుదురు అని ఆశంకించుకొని 'అయం స్వభావః' ఇత్యాది వాక్యముచే సమాధానము చెప్పుచున్నాడు. స్వభావమునకు కారణ మేమి అని అన్వేషించుట యుక్తముకాదు. పంచదారలో మాధుర్యము స్వాభావికము. ఈ మాధుర్యమునకు కారణమేమి అని ప్రశ్నించుటలో అర్థము లేదుకదా? పరశ్రమాపనోదప్రవణం = పరులయొక్క ఏ శ్రమ యున్నదో దానిని నివారించుటలోని అత్యాసక్తి; 'ప్రవణ' శబ్దము ఇచట భావప్రధానముగ 'ప్రవణత్వము' అను నర్థమున ప్రయుక్త మైనది. ఇది మహాత్ములకు స్వాభావికమేగాన ఈ విషయమున పర ప్రేరణాపేక్షలేదు అని భావము. ఇందులకు 'సుధాంశుః' ఇత్యాదికము దృష్టాంతము.

అవ. ఈ విధముగ వినీతవేషమును, దానికి అనుగుణమగు వాక్కును, దానిచే వ్యంజితమగు భక్తినిచూచి - 'ఇతరమేదియు లేక ఆర్తుడైయున్న ఈతనిని సర్వవిధముల రక్షింపవలెను' అను నభిప్రాయముచే తనకు అభిముఖుడైనట్టియు, దయామృతమును వర్షించు సానుగ్రహకటాక్షములచే తనను పవిత్రునిచేయుచున్న దేశికోత్తముని, ఇపుడు తనకు బంధమోచనోపాయమును ఉపదేశింపుమని, ధైర్యముతో ప్రార్థించుచున్నాడు -

బ్రహ్మానన్దరసానుభూతికలితైః పూతైః సుశీతైః సితైః
యుష్మద్వాక్కలశోజ్ఝితైః శ్రుతిసుఖై ర్వాక్యామృతైః సేచయ.
సన్తప్తం భవతాపదావదహనజ్వాలాభి రేనం ప్రభో.
ధన్యాస్తే భవదీక్షణక్షణగతేః పాత్రీకృతాః స్వీకృతాః. 41

హే ప్రభో = ఓ ప్రభూ! భవదీక్షణక్షణగతేః = నీ యొక్క దృష్టి యొక్క క్షణప్రసారమునకు (ఎవరు), పాత్రీకృతాః = పాత్రగా చేయబడినారో, స్వీకృతాః = (నీచే) స్వీకరింపబడినారో, తే = వారు, ధన్యాః = ధన్యులు, భవతాపదావదహనజ్వాలాభిః = సంసారమునందలి దుఃఖములనెడు దావాగ్నిజ్వాలలచే, సన్తప్తం = తప్తుడైనట్టి, ఏనం = ఈ నన్ను, బ్రహ్మానన్దరసానుభూతికలితైః = బ్రహ్మానందరసము యొక్క అనుభవముతో కూడినవియు, పూతైః = పవిత్రమైనవియు, సుశీతైః = చాలచల్లనివియు, సితైః = పరిశుద్ధమైనవియు, యుష్మద్వాక్కలశోజ్ఝితైః = నీ యొక్క వాగింద్రియమనెడు కలశముచే పోయబడినవియు, శ్రుతిసుఖైః = చెవులకు సుఖకరమైనవియు అగు, వాక్యామృతైః = వాక్యామృతములతో, సించయ = తడుపుము.

హే ప్రభో = ఓ సర్వసమర్థుడా! భవదీక్షణక్షణగతేః = నీయొక్క దయార్ద్రదృష్టి క్షణకాలముపాత్రైనను లభించుటకు, పాత్రీకృతాః = లక్ష్యముగా చేయబడినవారు లేదా మీయొక్క నేత్రముతో క్షణకాలమైననుసంయోగమునకు, పాత్రీకృతాః = ఆశ్రయముగా అయినవారు, కావుననే, స్వీకృతాః = ఎవరు ఆత్మీయులుగా గ్రహింపబడినారోవారు ధన్యాః = కృతార్థులు. అందుచే నేనుగూడ, నీ కటాక్షముచే తొలగింపబడిన అజ్ఞానము కలవాడనై అధికముగా పవిత్రీకరింపబడినవాడనై ధన్యుడనైతిని. సాంసారికాగ్ని తాపమును అతిశీఘ్రముగ తొలగింపదలచినవాడై శాంతింపచేసికొనవలెనని కోరుచు ఈ విధముగ ప్రార్థించుచున్నాడని సూచించుచున్నాడు. 'శ్రేయసి కేన తృప్యతే'-శ్రేయస్సు కలుగుచున్నపుడు చాలునని ఎవరందురు అను లోకోక్తి ననుసరించి ఇంకను కోరుచున్నాడు_కటాక్షపాత్రుడనై, స్వీకృతుడనగు, సంసార శోకదావాగ్నిజ్వాలలచే సంతప్తుడనగు ఏనం = ఎదుటనున్న నన్ను, బ్రహ్మానందమే ఆస్వాదింపబడును గాన రసము. దాని అనుభవముతో మిశ్రితములైన కనుకనే, పూతైః = సకలకల్మషములను హరించునవగుటచే పవిత్రమైన 'న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే' - జ్ఞాన

ముతో సమానమైన పవిత్రమగువస్తువు మరేదియు ఈ లోకమునలేదు కదా! అని స్మృతిననుసరించి అట్టి జ్ఞానముకలవాని వాక్యములుగూడ సకలపాపహారమగు జ్ఞానమును ఉపదేశించునవగుటచే పవిత్రములు. సుశీతైః=ఆధ్యాత్మికాధిదైవికాధి భౌతికములగు అంతరతాపములను నశింపచేయునవగుటచే మిక్కిలి చల్లనైనవి. సితైః=రజస్తమోమార్గములను తొలగించుటద్వారా కేవల సత్త్వమార్గమును మాత్రమేపొందింప చేయుటచే నిర్మలమైనవి. మీ వాగింద్రియమునకు స్థానమగు ముఖమే కలశము; దానినుండి బయల్వెడలినవి, కర్ణానందదాయకములైనవి అగు వాక్యామృతములచే నన్ను తడుపుము. పవిత్రత్వము, శీతత్వము, శుద్ధత్వము, కలశోజ్ఝితత్వము అనునవి వాక్యములయందును అమృతమునందును తుల్యముగ నుండుటచే వాక్యములయందు అమృతత్వము ఆరోపింపబడినది. 'బ్రహ్మానన్దరసానుభూతికలితైః' అనునది పవిత్రత్వమునకు కారణమును చెప్పుచున్నది. 'శ్రుతిసుఖైః' అనుటచే శ్రవణకాలమునందే సుఖమును కలిగించునవి; వాటి యర్థమును బాగుగ అనుసంధానము చేసికొని అనుభవములోనికి తెచ్చుకొన్నచో ఎంతటి ఆనందము కలుగునో చెప్పనలవికాదు అని సూచింపబడుచున్నది.

అవ. (38 శ్లోకములు) వెనుక 'భీతం ప్రపన్నం' ఇత్యాది వాక్యములచే సూచితమగు భీతిని, వెంటనే తనపై అనుగ్రహము కలుగుటకై స్పష్టీకరించుచున్నాడు-

కథం తరేయం భవసింధుమేతం
కా వా గతి ర్మే కతమోస్త్యు పాయః.
జానే న కించిత్కృపయావ మాం భోః
సంసారదుఃఖ క్షతిమాతనుష్వ. 42

ఏతం = ఈ, భవసిన్ధుం = సంసారసముద్రమును, కథం = ఎట్లు, తరేయం = దాటగలను? మే = నాకు, కా = ఏమి, గతిః = గతి? కతమః = ఏ, ఉపాయః = ఉపాయము, అస్తి = ఉన్నది? కించిత్ = ఏమియు, న జానే = ఎరుగను, భోః = ఓస్వామీ, కృపయా = దయతో, మాం = నన్ను, అవ = రక్షింపుము, సంసారదుఃఖక్షతిం = సంసారదుఃఖముయొక్క నాశనమును, ఆతనుష్వ = చేయుము.

ఈ విధముగ అనేకవిధములగు నివారింపశక్యము కాని దుఃఖముల సముదాయముచే వ్యాప్తమైన సంసారసముద్రమును ఎట్లు దాటుదును? ఈ విధముగనే ఉన్నచో నాకు ఏమి గతి? నాకు ఏమి లభింపనున్నది? సర్వవిధముల దుఃఖమే అని తాత్పర్యము. అందుచే ఈ సంసారసముద్రమును దాటుటకు ఏ ఉపాయమున్నది? నాకు మాత్రము ఏదియు కనబడుటలేదు. భీతుడనైన నన్ను రక్షింపుము. ఈ రక్షణమునే 'సాంసారదుఃఖక్షతి మాతనుష్వ' అని చెప్పుచు స్పష్టికరించుచున్నాడు. ఈ సాంసారిక దుఃఖమును సమూలముగ నశింప జేయుము అని యర్థము.

అవ. ఇపుడు శ్లోకద్వయముచే గురువుయొక్క కర్తవ్యమును చెప్పుచున్నాడు—

## ఉపదేశవిధి

తథా వదన్తం శరణాగతం స్వం
సంసారదావానల తాపతప్తమ్,
నిరీక్ష్య కారుణ్యరసార్ద్రదృష్ట్యా
దద్యాదభీతిం సహసా మహాత్మా. 43

విద్వాన్సతస్మా ఉపసత్తిమీయుషే
ముముక్షవే సాధుయథోక్తకారిణే,
ప్రశాన్తచిత్తాయ శమాన్వితాయ
తత్త్వోపదేశం కృపయైవ కుర్యాత్. 44

మహాత్మా = మహాత్ముడైన ఆ గురువు, తథా = ఆ విధముగా, వదన్తం = పలుకుచున్నట్టియు, స్వం = తనను శరణాగతం = శరణు జొచ్చినట్టియు, సంసారదావానలతాపతప్తం = సంసారదావాగ్ని యొక్క తాపముచే తపింపచేయబడిన ఆ శిష్యుని, కారుణ్యరసార్ద్రదృష్ట్యా = కారుణ్య రసముతో ఆర్ద్రమైన దృష్టితో, నిరీక్ష్య = చూచి, సహసా = వెంటనే, అభీతిం = అభయమును, దద్యాత్ = ఈయవలెను.

సః = ఆ, విద్వాన్ = విద్వాంసుడైన గురువు, ఉపసత్తిమీయుషే = తననుసమీపించినట్టియు, ముముక్షవే = మోక్షేచ్ఛకలిగినట్టియు, సాధు = బాగుగా, యథోక్తకారిణే = చెప్పిన ప్రకారము శాస్త్రోక్తకర్మాదికమును చేయునట్టియు, ప్రశాన్తచిత్తాయ = శాంతమైన చిత్తము కలిగినట్టియు, శమాన్వితాయ = శమముతో కూడిన, తస్మై = ఆ శిష్యునకు, కృపయా = దయతో, తత్త్వోపదేశం = తత్త్వోపదేశమును, కుర్యాత్ ఏవ = తప్పక చేయవలెను.

శిష్యుని ఆంతరమగు (అంతరంగమునకు సంబంధించిన) అధికారము ఆతని మాటలద్వారా మాత్రమే తెలియునుగాన, వాటిద్వారా ఆతడు అధికారియని తెలిసికొనిన పిమ్మటనే గురువులు అభయదానోపదేశాదులను ఈయవలెనను విషయము "తథావదన్తం" ఇత్యాది వాక్యముచే సూచితమైనది. మహాత్మా = క్షుద్రబుద్ధికానివాడు, 'వెంటనే అభయమును ఈయవలెను' అని చెప్పుటచే భయముచెందినవారి భయమును వెంటనే తొలగించవలెను అని సూచింపబడినది. అభయము చెందినవారి భయము తొలగిన పిమ్మటనే పురుషునకు ఉపదేశింపబడిన విషయమును గ్రహించు సామర్థ్య ముండును. భయపడిన వాని భయము చాలకాలముండు నట్లు ఊరుకొనరాదు అని సూచించుటకై 'సహసా' అనుపదము ప్రయోగింపబడినది. భయపడిన వానికి ముందుగ అభయప్రదానముచేసి పిమ్మట అధికారానుసారముగ ఉపదేశము చేయవలెను అని విద్వానిత్యాది శ్లోకములో చెప్పుచున్నాడు. విద్వాన్, బ్రహ్మవేత్తలలో గొప్పవాడగు గురువు, సాధుయథోక్త

కారిణే = విహితానుష్ఠానమును చక్కగ చేయువాడు. ఇట్లు చెప్పుటచే శిష్టత్వము సూచితమైనది.

శ్రు. నావిరతో దుశ్చరితాన్నాశాన్తో నాసమాహితః,
నాశాన్తమానసోవాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్.

(చూ. 34 శ్లో వ్యా) అని శ్రుతిననుసరించి శిష్యునియందు శ్రోత్రియత్వము, పాపరహితత్వము, మోక్షకామాభిన్నకామ శూన్యత్వము అనునవి ఆవశ్యకములని భావము. ప్రశాన్తచిత్తాయ = దేహాము మొదలు బ్రహ్మవరకునుగల భోగ్యవస్తువులనుండి విరక్తుడై తనలక్ష్యమునందు స్థిరముగనున్న మనస్సు కలవాడు. శమాన్వితాయ = బాహ్యేంద్రియములను నిగ్రహించుకొన్నవాడు. దీనిచే అధికారికి విశేషణమగు శమాదిషట్కము సూచితమైనది. వైరాగ్యాది గుణమండితుడగు అట్టి శిష్యునకు, కృపయా = అతని దుఃఖమును తొలగింపవలెనను ఇచ్ఛచేత; ఆప్తకామునకు మరియొకవిధమగు కోరిక ఏదియు ఉండదు కదా? 'ఏవ' అను దానిని 'కుర్యాత్' అను పదముతో అన్వయించి "తప్పక చేయవలెను" అను నర్థముచెప్పవలెను. అధికారి లభించినపుడు ఔదాసీన్యము వహింపరాదు. సత్పాత్రకు ఉపదేశింపబడిన బ్రహ్మవిద్య లోకానుగ్రహమునకై సుప్రతిష్ఠితమగును అని భావము. ఈ విధముగ - సర్వానర్థములకు హేతువగు అవిద్యను తొలగించెడి బ్రహ్మవిద్యాపారంపర్యమును అవిచ్ఛిన్నముగ కాపాడుట తన శిష్యుని బంధమునుండి విడిపించుట అనునవి ఉపదేశమునకు ఫలములని తాత్పర్యము. ఈ ప్రకరణ గ్రంథమున ప్రతిపాద్యమగు విషయము శ్రోతలబుద్ధిలో చక్కగ ప్రవేశించుటకై గురుశిష్యసంవాద రూపమున ప్రారంభము చేయబడినది. కావుననే శ్రుతులందు గూడ అక్కడక్కడ ఆఖ్యాయికలు కానవచ్చుచున్నవి. ఈ విధముగ చెప్పుటచే గురువుయొక్క లక్షణము, శిష్యునిలక్షణము, ప్రశ్నింపవలసిన అన్ని విషయములు మనకు అనాయాసముగ తెలియును.

అవ. పరమకారుణికుడగు గురువు "కథం తరేయం భవసిన్ధు మేతం" ఇత్యాది వాక్యమున సూచితమగు శిష్యునకు కలిగిన భయమును వెంటనే తొలగింపవలెనను అభిలాషతో చెప్పుచున్నాడు—

మాభైష్ట విద్వంస్తవ నాస్త్యపాయః
సంసారసింధోస్త రణేఽస్త్యుపాయః,
యేనైవయాతా యతయోఽస్యపారం
తమేవ మార్గం తవనిర్దిశామి. 45

హేవిద్వన్ = ఓ విద్వాంసుడా! మాభైష్ట = భయపడకుము, తవ = నీకు, అపాయః = అపాయము, నాస్తి = లేదు, సంసారసిన్ధోః = సంసార సముద్రముయొక్క, తరణే = దాటుటయందు, ఉపాయః = ఉపాయము, అస్తి = ఉన్నది, యతయః = యతీశ్వరులు, యేనైవ = ఏ మార్గముచే, అస్య = దీనియొక్క, పారం = అవలి ఒడ్డును, యాతాః = పొందినారో, తం = ఆ, మార్గమేవ = మార్గమునే, తవ = నీకు, నిర్దిశామి = బోధించుచున్నాను.

నీకు భయములేకుండుగాక అని అభయము ఈయబడినది. వివేకాదికమును సంపాదించుకొని, గురుకరుణ లేనిచో దుఃఖతరణము శక్యముకాదు అను నభిప్రాయముతో నాదగ్గరకు వచ్చినావు; కావున తెలియవలసిన విషయము నీకు తెలియును అని సూచించుటకై 'విద్వన్' అని సంబోధించినాడు. బాగుగా యథావిధిగా చేయు నీకు "న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి" నాయనా! మంచిపనిచేయువాడెన్నటికిని చెడిపోడు అను స్మృతి ననుసరించి అపాయమేమియు లేదు; అందుచేత, దీనినెట్లు తరింతును? గతి ఏమి? అని భయపడకుము. ఈ విధముగ ముందుగ ఓదార్చి, 'కతమోఽస్త్యుపాయః' అనుప్రశ్నకు సమాధానముగ "సంసారసిన్ధోస్తరణేఽస్త్యుపాయః" అని చెప్పుచున్నాడు. ఆ విషయమున బాగుగ

విశ్వాసముకలుగుటకై ఆ ఉపాయమును సప్రమాణముగ చెప్పుచున్నాడు. ఏ ఉపాయముచే, ఈ సంసారసింధువుయొక్క, పారం = అన్తమును, యతయః = ప్రయత్నశీలురగు సంన్యాసులు, పొందినారో ఆ మార్గమునే నీకు ఉపదేశింతును.

అవ. అట్టిమార్గమును గూర్చి వినుటయందు ఎక్కువ ఆసక్తి కలుగుటకై సామాన్యరూపమున మరల ఆ ఉపాయమును చూపుచున్నాడు_

**అస్త్యుపాయో మహాన్ కశ్చిత్సంసారభయనాశనః,**
**తేన తీర్త్వా భవామ్భోధిం పరమానన్ద మాప్స్యసి. 46**

సంసారభయనాశనః = సంసారభయమును నశింపజేసెడు, కశ్చిత్ = ఒకానొక, మహాన్ = గొప్పదైన, ఉపాయః = ఉపాయము, అస్తి = ఉన్నది, తేన = దానిచే, భవామ్భోధిం = సంసారసముద్రమును, తీర్త్వా = దాటి, పరమానన్దం = గొప్ప ఆనందమును, అప్స్యసి = పొందగలవు.

మహాన్ = అధికశ్రమచే సంపాదించదగిన సాధనములచే సాధింపశక్యమైనది. తేన = చెప్పబడబోవు ఆ ఉపాయముచే, భవామ్భోధింతీర్త్వా = దుస్తరమైన సంసారసాగరమును దాటి, అనగా దానికి మూలమగు అవిద్యను తొలగించుకొని, పరమానన్దం = నిరవధికమైన శాశ్వతసంతోషమును, పొందగలవు. నీవు కోరునది దుఃఖనివృత్తియేకదా? నేను చెప్పబోవు ఉపాయముచే ఆ దుఃఖము పూర్తిగ తొలగిపోవును; నిత్యము, నిరతిశయము అగు ఆనందము ఆవిర్భవించును_అని చెప్పుచు శిష్యునకు మిక్కిలిఊరట కలిగించుచున్నాడు.

అవ. ఆ ఉపాయమునే విశేషరూపమున ఉపదేశించుచున్నాడు_

**వేదాన్తార్థవిచారేణ జాయతే జ్ఞానముత్తమమ్.**
**తేనాత్యన్తిక సంసారదుఃఖనాశో భవత్యను. 47**

వేదాన్తార్థవిచారేణ = ఉపనిషత్తుల అర్థము విచారణచేయుటచేత, ఉత్తమం = ఉత్తమమైన, జ్ఞానం = జ్ఞానము, జాయతే = జనించును; తేన = దానిచేత, అను = వెంటనే, ఆత్యన్తికసంసారదుఃఖనాశః = పూర్తిగ సంసారదుఃఖముయొక్క నాశము, భవతి = కలుగును.

వేదములయొక్క చివరిభాగములు వేదాన్తములు - అనగా ఉపనిషత్తులు. వాటియొక్క ఏ అర్థముకలదో - అనగా ఉపక్రమము, ఉపసంహారము మొదలగు తాత్పర్యనిర్ణయకములగు ఆరు లింగములచే ఉపనిషత్తులలో ప్రతిపాదితమును, సజాతీయ విజాతీయ స్వగతభేద రహితమును, నిత్య - శుద్ధ - బుద్ధ - ముక్తస్వభావమును అగు ఏ పర మాత్మ స్వరూపమున్నదో - దానియొక్క, విచారేణ = దానియొక్క నిర్ణయమునకు అనుకూలమగు మానసవ్యాపారముచేత, ఉత్తమం, జ్ఞానం = సంశయాదులతో మిశ్రముకాని జ్ఞానము, అనగా నిర్ణయము కలుగును. తేన = ఆ నిర్ణయముచే, ఆత్యన్తిక సంసారదుఃఖనాశః = స్వసమానాధికరణదుఃఖప్రాగభావాసమానకాలికమగు దుఃఖనాశము- అనగా ఈ నిర్ణయము కలిగినవానియందు ఇక ఎన్నటికిని దుఃఖ ప్రాగభావము ఉండదు; అనగా మున్ముందు మరల దుఃఖములు కలుగుట ఉండదు; అట్టి దుఃఖనాశము, అను = అట్టి నిర్ణయము కలిగినవెంటనే, భవతి = కలుగును.

అవ. ఇపుడు, అట్టినిర్ణయమునకు అసాధారణకారణమును చెప్పుచున్నాడు-

శ్రద్ధాభక్తిధ్యానయోగా న్ముముక్షో
ర్ముక్తే ర్హేతూ న్వక్తిసాక్షాచ్ఛ్రుతేర్గీః.
యో వా ఏతేష్వేవ తిష్ఠత్యముష్య
మోక్షోఽవిద్యాకల్పితాద్దేహబన్ధాత్. 48

సాక్షాత్ = సాక్షాత్తుగా, శ్రుతేఃగీః = వేదవాక్యము, ముముక్షోః = మోక్షముపొంద నిచ్ఛగలవానికి, ముక్తేః = మోక్షమునుపొందుటకు, శ్రద్ధాభక్తిధ్యానయోగాన్ = శ్రద్ధా-భక్తి-ధ్యాన-యోగములను, హేతూన్ = హేతువులనుగా, వక్తి = చెప్పుచున్నది, యఃవా = ఎవ్వడు, ఏతేష్వేవ = ఈశ్రద్ధాదులయందే, తిష్ఠతి = స్థిరముగానుండునో, అముష్య = వానికి అవిద్యాకల్పితాత్ = అవిద్యచేనేర్పడిన, దేహబన్ధాత్ = దేహబంధమునుండి, మోక్షః = మోక్షము కలుగును.

'శ్రద్ధ' అనగా "శాస్త్రస్య గురువాక్యస్య" ఇత్యాదిశ్లోకమున ప్రతిపాదితమగు గురువచన - వేదాన్తవాక్యములయందు విశ్వాసము. 'భక్తి' యనగా స్వస్వరూపాను సంధానము. ఇదియే నిదిధ్యాసనము. 'ధ్యానము' అనగా "తత్రప్రత్యయైక తానతాధ్యానమ్" – ఆలక్ష్య మునందు అవిచ్ఛిన్నమగు ప్రత్యయమును - అనగా జ్ఞానమును కలిగియుండుట అనుయోగసూత్రమునందు నిర్దిష్టమైనది. ఇదియే "సమ్యగాస్థాపనం బుద్ధేః శుద్ధే బ్రహ్మణిసర్వదా" అని పూర్వోక్తమగు సమాధానము. సూ. 'యోగశ్చిత్తవృత్తి నిరోధః' అను పాతంజల యోగసూత్ర నిర్దిష్టమగు చిత్తవృత్తినిరోధము – మనస్సు ఇటునటు సంచరింపకుండునట్లు నిలుపుకొనుట యోగము. వీటిలో శ్రద్ధ అన్నింటికిని హేతువు. భక్తిధ్యానయోగములలో ఉత్తరోత్తరము పూర్వ పూర్వమునకు హేతువు. చిత్తవృత్తిని నిరోధించినపిదప సమాధానము, సమాధానము కలిగినపిదప ఆచార్యోపదేశము జరిగిన వెనువెంటనే స్వస్వరూపాను సంధానరూపమగు నిదిధ్యాసనము సంభవించును కదా? 'ధ్యానం' అనుపదము "ధ్యై చిన్తాయాం" అను ధాతువునుండి నిష్పన్నమైనది గాన దీనికి యుక్తులచే అనుచిన్తనముచేయుట అనెడు మననము అని యర్థము. ఇదియే నిదిధ్యాసనమునకు సాక్షాత్తుగ కరణము. లేదా ధ్యానమనగా జ్ఞానప్రతిబంధకములగు సకల దురితములను తొలగించెడి సగుణధ్యానము. ఈ అర్థములలో ఏ యర్థము చెప్పినను, అట్టి ధ్యానమునకు, చిత్తముయొక్క బాహ్యా

వృత్తులను నిరోధించుట అను యోగము కారణము అని చెప్పుట యుక్తమే, లేదా – 'యుజ్యతే అనేన ఆత్మసాక్షాత్కారేణ' – దీనిచే ఆత్మసాక్షాత్కారమును పొందునుగాన యోగము, అను విగ్రహముచే యోగమనగా ఆత్మసాక్షాత్కారసాధనము అని యర్థము. కావున 'భక్తిశ్చాసౌయోగః', 'ధ్యానం చ తత్ యోగః' అను విగ్రహములచే భక్తియోగము, ధ్యానయోగము అని చెప్పవచ్చును. అనగా భక్తి యనెడు యోగము, ధ్యానమనెడుయోగము అని యర్థము. ముముక్షువునకు, ముక్తేః = బంధనివృత్తికి, హేతువులను, 'శ్రద్ధా భక్తిధ్యాన యోగాద వేహి' అను కైవల్యోపనిషత్తు స్పష్టముగ చెప్పుచున్నది. లేదా, ముక్తేః = ముక్తి హేతువగు జ్ఞానమునకు; సాక్షాద్ధేతూన్ = సాక్షాత్తుగా కారణములనుగా 'అవేహి' అనుపదముతో గూడిన శ్రుతి – శ్రద్ధాభక్తిధ్యానయోగసహాయముతో తెలిసికొనుము; జ్ఞానమును పొందుము – అని చెప్పుచున్నది అని యర్థము. ఏ పురుషుడు ఈ శ్రద్ధాభక్తియోగములయందే స్థిరముగ నుండునో, అనగా ఎల్లప్పుడును శ్రద్ధాళువై, భక్తిమంతుడై, ధ్యానముచేయు వాడై, యోగియై యుండునో, అముష్య = అట్టి అతనికి 'అదసస్తు విప్రకృష్టమ్' అని చెప్పినరీతిగ దూరమునందున్న వస్తువును బోధించు అదశ్శబ్దమును ప్రయోగించుటచే అట్టి అధికారి దుర్లభుడని సూచించుచున్నాడు. వానికి అజ్ఞానకల్పితమగు, అహంకారాది దేహబంధమునుండి, మోక్షము, 'సిద్ధించును' అని అధ్యాహారము. 'యోవా' అనుచోట 'వై' అనుదానికి అవధారణము అర్థము. దానికి అంతమునందు అన్వయము. మోక్షము తప్పక సిద్ధించును అని యర్థము. 'ఏతేష్వేవ' అనుచోటనున్న 'ఏవ' అనునది – 'ఇవే సాధనములు, ఏతద్భిన్నసాధనముల నాశ్రయించినచో ప్రయోజనము లేదని చెప్పుచున్నది.

అవ. ఇపుడు గురువు, సంసారహేతువును, దానిప్రధానలక్షణ మును, దానిని నివారించుకొను నుపాయమును, దానికి కారణ మును సంగ్రహముగ శిష్యునకు చెప్పుచున్నాడు—

అజ్ఞానయోగాత్పరమాత్మనస్తవ
హ్యనాత్మబన్ధస్తత ఏవ సంసృతిః,
తయోర్వివేకోదిత బోధవహ్ని
రజ్ఞానకార్యం ప్రదహేత్సమూలమ్. 49

పరమాత్మనః = పరమాత్మవైన, తవ = నీకు, అజ్ఞానయోగాత్ = అజ్ఞానసంబంధమువలన, అనాత్మబన్ధోహి = అనాత్మవస్తువులతో సంబంధ మేర్పడినదికదా, తతఃఏవ = అందువలననే, సంసృతిః = సంసారము, తయోః = ఆ ఆత్మానాత్మలయొక్క, వివేకోదితబోధవహ్నిః = వివేకము వలన కలిగిన జ్ఞానాగ్ని, సమూలమ్ = సమూలమైన, అజ్ఞానకార్యం = అజ్ఞాన కార్యమును, ప్రదహేత్ = దహించును.

పరమాత్మవైన నీకు, అజ్ఞానయోగాత్ = అనాదియైన అవిద్యా సంబంధమువలన, అనాత్మబన్ధః = అనాత్మలగు స్థూలసూక్ష్మ కారణ శరీరములందు ఆత్మత్వబుద్ధి, దానివలననే జన్మము, వార్ధక్యము, మరణము, సుఖము, దుఃఖము, జడత్వము మొదలగు ధర్మముల అధ్యాసరూపమగు సంసారము. ఆ ఆత్మానాత్మల, వివేక మనగా భేదజ్ఞానము, దానివలన కలిగిన, బోధవహ్ని, అనగా సాక్షాత్కార రూపమగు అగ్ని, సమూలం = అజ్ఞానరూపమగు బీజముతో కూడిన దియు, అజ్ఞానజనితమును అగు అహంకారము మొదలు దేహమువర కునుగల బంధమును, దానివలన కలిగిన జన్మ జరామరణాదిరూప సంసారమును, ప్రదహేత్ = పూర్తిగ భస్మముచేయును. ఈ విధముగ— సంసారమునకు కారణము అనాత్మబంధము; దానికి కారణము నీకు అజ్ఞానసంబంధము. అది నివర్తించుటకు ఉపాయము పరమాత్మ బోధము; దానికి కారణము ఆత్మానాత్మవివేకము అని చెప్పినట్లు

అయినది. అజ్ఞానమువలన కలిగిన బంధమునుండి విముక్తి కావలె నన్నచో జ్ఞానమువలననే కలుగును గాని మరి దేనివలనను కలుగదు గాన వేదాన్తవిచారమువలన కలుగు ఉత్తమజ్ఞానము సంసారదుఃఖ నాశక మనుటలో ఉపపత్తి చూపబడినది.

అవ. ఈ విధముగ గురుముఖారవిందమునుండి వెడలిన వాక్యామృతప్రవాహముచే ఆనందమును పొందిన శిష్యుడు, అతని ముఖకలశమునుండి నిరర్గళముగ ప్రవహించుచున్న వాక్యామృతసింధువులో పూర్తిగ మునుగవలెనని అభిలషించుచు, తన సకలసందేహములను తొలగించుటకై ఆతనిని ప్రశ్నించుటకు సవినయముగ ప్రార్థించుచున్నాడు—

## ప్రశ్ననిరూపణము

శిష్య ఉవాచ :-

కృపయా శ్రూయతాం స్వామిన్ ప్రశ్నోఽయం
క్రియతే మయా.
యదుత్తరమహం శ్రుత్వా కృతార్థః స్యాం భవన్ముఖాత్. 50

శిష్యః = శిష్యుడు, ఉవాచ = పలికెను, హే స్వామిన్ = ఓస్వామీ, కృపయా = దయచే, శ్రూయతాం = వినబడుగాక, మయా = నాచే, అయం = ఈ, ప్రశ్నః = ప్రశ్న, క్రియతే = చేయబడుచున్నది, యదుత్తరం = దేనికి సమాధానమును, భవన్ముఖాత్ = నీముఖమునుండి, శ్రుత్వా = విని, అహం = నేను, కృతార్థః = కృతార్థుడను, స్యాం = అగుదునో.

మొదట సవినయముగ తెలుపకుండగ గురుసన్నిధిలో ప్రశ్న వేయగూడదు అనెడు శిష్యధర్మము దినిచె బోధింపబడినది. "ప్రశ్నోఽయం క్రియతే మయా" అని మొదటచెప్పక, ముందుగ 'కృపయా శ్రూయతామ్, అని ప్రార్థించి, పిదప అట్లు చెప్పుటచే తనస్థై

దయాభివృద్ధి కలుగుటకై మనోమార్దవము, శీఘ్రముగ తెలిసికొన వలెననెడి అభిలాషయు సూచితమగుచున్నవి. 'భవన్ముఖాచ్ఛ్యుత్వా' అని చెప్పుటచే తనకు వేరే ఎవరును శరణము లేరు అను విషయము సూచింపబడినది.

అవ. ఇపుడు ప్రశ్నించుచున్నాడు —

కో నామ బన్ధః కథమేష ఆగతః
కథం ప్రతిష్ఠాస్య కథం విమోక్షః,
కోఽసావనాత్మా పరమః క ఆత్మా
తయోర్వివేకః కథమేతదుచ్యతామ్. 51

బన్ధః = బంధమనగా, కో నామ=ఏది? ఏషః= ఇది, కథం = ఎట్లు, ఆగతః = వచ్చినది? అస్య = దీనికి, ప్రతిష్ఠా = స్థితి, కథం = ఎట్లు? విమోక్షః = దీనినుండి మోక్షము, కథం = ఎట్లు? అసౌ = ఈ, అనాత్మా = అనాత్మ, కః =ఏది? ఆత్మా = ఆత్మ, కః = ఏది? తయోః = ఆ రెండింటి యొక్క, వివేకము, కథం = ఎట్లు? ఏతత్ = ఇది, ఉచ్యతామ్ = చెప్ప బడుగాక.

బంధ స్వరూపము తెలిసినచో, తగు ఉపాయములచే దానిని అనాయాసముగ తొలగించుకొన వచ్చునుగాన ముందుగా "కో నామ బంధః" అని బంధస్వరూపమును గూర్చి ప్రశ్నించుచున్నాడు. 'కథమేష ఆగతః' అని దానికి కారణమును ప్రశ్నించుచున్నాడు. 'కథం ప్రతిష్ఠాస్య' అని దానిస్థితికి కారణమును ప్రశ్నించుచున్నాడు. అస్య = ఈ బంధము యొక్క, ప్రతిష్ఠా = చిరకాలము స్థితి, కథం= ఎట్లు; ఏ కారణముచేత? విమోక్షః = నివృత్తి. పరమాత్మవైన నీకు అనాత్మబంధమున్నది అని గురువు చెప్పియున్నాడు. అందుచే ఆ అనాత్మయేది? పరమాత్మయేది? అని ప్రశ్నించుచున్నాడు. 'తయోర్వివేకోదిత' అని గురువు చెప్పుటచే ఆ అనాత్మ పరమాత్మల భేద

జ్ఞానము ఎట్లు జరుగును? ఈ విషయమంతయు విస్తరముగ చెప్పుడు అని పల్కినాడు. శ్రీచరణులు సంగ్రహముగ పరమాత్మనగు నాకు అజ్ఞానమువలన అనాత్మబంధము వచ్చిన దని చెప్పుటచే, ఇది ఎందులకు వచ్చినదో కొంచెము తెలిసినట్లున్నది. అట్లే వాటి వివేకము వలన కల్గిన జ్ఞానాగ్ని అజ్ఞానకార్యమును సమూలముగ దహించివేయును అని చెప్పుటచే, మోక్ష మెట్లుకలుగును అను విషయముకూడ కొంచెము తెలిసినట్లే ఉన్నది. శబ్ద మాత్రమును వినుటచే కొంచెము అర్థము తెలిసినట్లు ఉన్నను ఆ విషయమున సందేహము లన్నియు తొలగుటకు విస్తరముగ చెప్పినగాని, బంధస్వరూపము, దానిస్థితికి కారణము, ఆత్మానాత్మవివేకము పూర్తిగ తెలియవు. అందుచే ఈ విషయమునంతను బాగుగా తెలిపి దీనదీనుడనైన నన్ను కృతార్థుని చేయవలెను అని భావము.

అవ. ఈ ప్రశ్న వైఖరిచేతను, వెనుకనే తెలిసిన త్రికరణశుద్ధి చేతను ఈతనికి బ్రహ్మవిద్యయందు ఉత్తమాధికారమున్నదని తెలిసికొని (గురువు) ఆతనికి వెంటనే బ్రహ్మవిచారమున ప్రవేశముకలుగుటకై శ్లాఘించుచున్నాడు. మహాత్ముడగు బ్రహ్మవిదుత్తమునిచే శ్లాఘితుడైనచో, తన మనస్సులోనున్న దుఃఖమునంతను తొలగించుకొని, విచారాభిముఖమగు మనస్సుకలవాడై తాత్పర్యబుద్ధితో పరమాత్మవిచారముచేసి వెంటనే కృతార్థుడగును అని భావము-

## శిష్యప్రశంస

శ్రీగురురువాచ :-

ధన్యోఽసి కృతకృత్యోఽసి పావితం తే కులం త్వయా.
యదవిద్యాబన్ధముక్త్యా బ్రహ్మీభవితు మిచ్ఛసి. 52

శ్రీగురుః = శ్రీగురువు, ఉవాచ = పలికెను, ధన్యః = ధన్యుడవు, అసి = అయినావు, కృతకృత్యః = కృతకృత్యుడవు, అసి = అయినావు, త్వయా = నీచేత, తే = నీయొక్క, కులం = వంశము, పాలితం = పవిత్రము చేయబడినది, యత్ = ఏ కారణమువలన, అవిద్యాబన్ధముక్త్యా = అవిద్యాబంధముయొక్క ముక్తిచే, బ్రహ్మీభవితుం = బ్రహ్మయగుటకు. ఇచ్ఛసి = కోరుచున్నావో.

"శ్రీయుతః గురుః శ్రీగురుః" - 'శ్రీ'కల గురువు. శ్రు. -ఋచస్సామాని యజూంషి, సా హి శ్రీరమృతా సతామ్" - ఋక్కులు, సామములు, యజుస్సులు-ఇవి సత్పురుషులయొక్క అమృతమగు సంపద అను శ్రుతిచే శబ్దరూపములగు ఋగాదులే అమృతసంపద్రూపములైనపుడు, సకలవేదాన్తములను, వాటిచే ప్రతిపాదితమగు అర్థమును సాక్షాత్కరించుకొనిన గురువు శ్రీమంతుడు అని వేరుగ చెప్పవలెనా? సూర్యాది సకలతేజస్సుల భావమునకు హేతువగు బ్రహ్మతేజస్సుతో సంపన్నుడు అని యర్థము. శిష్యుని అంతఃకరణములోనున్న అంధకారమును తొలగింపగలిగిన అట్టి శ్రీగురువు శిష్యుని ప్రశ్నకు ఉత్తరమును చెప్పెను. మొదట ఆతని మనస్సును వికసింప జేయుటకై (ఆనందింప జేయుటకై) శ్లాఘించుచున్నాడు. ధన్యః = ధనమునకు తగినవాడు.

న ఖలు ధనత్వం జాతిః యస్య యదిష్టం తదేవ తస్య ధనమ్,
తత్తదివ పామరాణాం ఆకించన్యం ధనం విదుషామ్.

ధనత్వమనునది ఒకజాతి కాదుకదా! ఎవరికి ఏది ఇష్టమో అదే వారికి ధనము. సామాన్యజనులకు ఆ యా వస్తువులు ధనమైనట్లు విద్వాంసులకు లేమియే ధనము అని చెప్పినట్లు, విద్వాంసులు ధనమని అంగీకరించిన వైరాగ్యాదిభాగ్యము నీ కున్నది అని అర్థము. అందుకు కారణము 'కృతకృత్యోఽసి' అనునది. శాస్త్రవిహితములగు కర్మల ననుష్ఠించుటచే శుద్ధచిత్తుడవైనావు అని యర్థము. చిత్తశుద్ధిలేనిచో

సంసారముపై వైరాగ్యము కలుగదుకదా? యేన=ఎవనిచే, కృత్యాని=శాస్త్రవిహితములును, స్వవర్ణాశ్రమాద్యుచితములును అగు కర్మలు, కృతాని=చేయబడినవో, ఆతడు కృతకృత్యుడు. ఈ విధముగ కృతకృత్యుడవై, చిత్తమును శుద్ధము చేసికొని, తీవ్ర వైరాగ్యమును సంపాదించుకొని మోక్షేచ్ఛ కలవాడవైనావు. ఇట్టి నిచే నీ వంశమంతయు పవిత్రము చేయబడినది. కావుననే

కులం పవిత్రం జననీ కృతార్థా విశ్వంభరా పుణ్యవతీ చ తేన,
అపారసచ్చిత్సుఖసాగరేఽస్మిన్ లీనం పరే బ్రహ్మణి యస్య చేతః.

ఎవని మనస్సు అపారసచ్చిత్సుఖసాగరమగు ఈ పరబ్రహ్మయందు లీన మైనదో ఆతనికులము పవిత్ర మగును; తల్లి పవిత్రురాలగును; ఈ భూమి పవిత్ర మగును అనియు,

స్నాతం తేన సమస్తతీర్థసలిలే సర్వాపి దత్తావనీ
యజ్ఞానాం చ సహస్రమిష్టమఖిలా దేవాశ్చ సంపూజితాః,
సంసారాచ్చ సముద్ధృతాః స్వపితరస్త్రైలోక్యపూజ్యోఽప్యసౌ,
యస్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్.

ఎవ్వని మనస్సు క్షణకాలమైనను బ్రహ్మవిచారణమునందు స్థిరముగ నుండునో ఆతడు సమస్తతీర్థోదకమునందును స్నానము చేసినట్లే. భూమినంతను దానము చేసినట్లే. వేయియజ్ఞములు చేసినట్లే. సకల దేవతలను పూజించినట్లే. ఆతడు తన పితృదేవతలనందరిని సంసారమునుండి ఉద్ధరించును. అతడే ముల్లోకములలో పూజ్యుడు అనియు చెప్పుదురు. ఆతనికి ఇప్పుడింకను జ్ఞానము కలుగకపోయినను, ఆతడుత్తమాధికారియగుటచే గురూపదేశమును వినినవెంటనే జ్ఞానవంతుడగును.

పరిపక్వమతేః సకృచ్ఛ్రుతం,
జనయేదాత్మధియం శ్రుతేర్వచః.

పరిపక్వమైన బుద్ధికలవానికి, ఒక్కమాటు విన్నను శ్రుతివాక్యము ఆత్మజ్ఞానమును కలిగించును అని మాధవీయ శంకరవిజయములో శ్రీమదాచార్యులు చెప్పియున్నారు. "అత్యన్తవైరాగ్యవతః సమాధిః" అని ఈ గ్రంథమునందుగూడ చెప్పనున్నారు. శీఘ్రముగనే బ్రహ్మ విలీనమగు మనస్సుకలవాడై కులమును భూమినిగూడ పవిత్రీకరింప చేయును అని భావము.

న విషయభోగో భాగ్యం, యోగ్యం ఖలు
యత్ర జన్తుమాత్ర మాత్రమపి,
బ్రహ్మేన్ద్రరుద్రమృగ్యం భాగ్యం విషయేషు వైరాగ్యమ్.

విషయములభోగము భాగ్యముకాదు. అట్టి భాగ్యము ననుభవించుటకు ప్రతిప్రాణికిని యోగ్యత యున్నది. విషయములయందు వైరాగ్యమును భాగ్యమును బ్రహ్మేంద్రరుద్రులు గూడ అన్వేషించుచుందురు అని చెప్పబడిన వైరాగ్యమను భాగ్యముకలవా డగుటచే మహాపుణ్యశాలి గాన అతనికి వంశపావనత్వము ఇపుడుకూడ ఉన్నది. అందులకు హేతువు చెప్పుచున్నాడు. యత్ = ఏ కారణమువలన, అవిద్యాబన్ధముక్త్యా = అవిద్యాకృతమగు అహంకారాది దేహపర్యంతమగు బన్ధమును త్యజించుటచేత, బ్రహ్మీభవితుం = బ్రహ్మస్వరూపముతోడనే ఉండుటకు, కోరుచున్నావో అందువలన; దీనిచే తీవ్రవైరాగ్యానన్తరము కలిగిన తీవ్ర ముముక్ష చెప్పబడినది. ఇట్టివారు ఈ జన్మలోనే పరబ్రహ్మసాక్షాత్కారము సంపాదించుకొని కులమును, జగత్తును పవిత్రము చేయుదురు అని అభిప్రాయము.

(ఆశంక) 'బ్రహ్మీభవితుం' అను పదము "అభూతతద్భావే చ్విః"-అట్లు లేనిది అట్లు అయినది అను నర్థమున చ్విప్రత్యయము వచ్చును అను నియమము ననుసరించి చ్విప్రత్యయము చేర్చుటచే ఏర్పడినది. కావున పూర్వము లేని బ్రహ్మత్వము ఇపుడు సిద్ధించినది

అను నర్థము వచ్చును. ఆ పక్షమున బ్రహ్మభావము ఆగంతుకము గాన (లేనిది వచ్చినదిగాన) తద్రూపమగు మోక్షముగూడ అనిత్యము కావలసివచ్చునుకదా ?

(సమాధానము) బ్రహ్మయే జీవుడుగా నుండుటచే సర్వదా బ్రహ్మభావముండనే ఉన్నది. కాని అది ఉన్నదను విషయము తెలియుటలేదు. ఆ విషయము తెలిసినపుడు బ్రహ్మీభావము వచ్చినట్లు కేవలము గౌణప్రయోగముచే చ్విప్రత్యయము ప్రయోగింపబడినది. అనగా ఇపుడు అజ్ఞానవశముచే బ్రహ్మయే అబ్రహ్మవలె నున్నది. జ్ఞానము కలిగిన తరువాత బ్రహ్మ బ్రహ్మగానే ఉన్నట్లు గోచరించును. కావున బ్రహ్మభావము పూర్వములేనిది క్రొత్తగా వచ్చినదను ఆశంక నిరాకృతమైనది.

అవ. ఎల్లరును భవబంధవిముక్తికై ప్రవర్తింపవలెనను నభిప్రాయముతో, ఆ విముక్తి వారివారి ప్రయత్నముచేతనే సాధ్యమగు నను విషయమును, లోకానుగ్రహబుద్ధిచే, ముందుగనే గురువు ఉపదేశించుచున్నాడు. జనులు దాని (ముక్తి) విషయమున నిర్లక్ష్యభావముతోనుండి, ఈశ్వరానుగ్రహలబ్ధమగు మనుష్యజన్మను వ్యర్థము చేసికొని దుఃఖపరంపరను అనుభవింపకుందురుగాక యనునది ఈ ఉపదేశము చేయుటలోని ప్రధానోద్దేశ్యము—

## స్వప్రయత్న ప్రాధాన్యము

ఋణమోచనకర్తారః పితుస్సన్తి సుతాదయః,
బన్ధమోచనకర్తా తు స్వస్మాదన్యో న విద్య తే. 53

**పితుః** = తండ్రియొక్క, **ఋణమోచనకర్తారః** = ఋణమును తొలగించెడు, **సుతాదయః** = పుత్రులుమొదలగువారు, **సన్తి** = ఉందురు, **తు** = కాని, **స్వస్మాత్** = తనకంటె, **అన్యః**=ఇతరుడైన, **బన్ధమోచనకర్తా తు**= బంధమోచనము చేయువాడుమాత్రము, **కశ్చన** = ఎవ్వడును, **న** = లేడు.

ఈ లోకమున, తండ్రిచేసిన ఋణమునుతీర్చ పుత్రపౌత్రాదు లుండవచ్చును. వారు పుత్రులను కనుటద్వారాగాని, తండ్రి వాక్యమును పాలించుటచే గాని, ధనమును సమర్పించుటచే గాని (తండ్రిని) శాస్త్రీయఋణమునుండి (పితృణాదికము) గాని, లౌకిక ఋణమునుండి గాని విడిపింపవచ్చును. బన్ధమోచనకర్తా తు = అహం కారము మొదలు దేహమువరకునుగల అనాత్మబంధమునుండి విడి పించువాడు మాత్రము, తనకంటె భిన్నుడెవ్వడును ఉండడు. అనాత్మయగు అంతఃకరణాదివిషయమున తనకుగల అధ్యాసమును పోగొట్టకల్గినవాడు తానే కాని మరి యెవ్వడును ఉండడని భావము. తనకు ఒకవస్తువును గూర్చిన ప్రత్యక్షభ్రమ ఏర్పడినపుడు, అది పోవలెనన్నచో ఆ వస్తువునుగూర్చిన తన ప్రత్యక్షప్రమయే కావలెను కదా? కనుచీకటిలో పడియున్న రజ్జువును జూచి సర్ప మనుకొని తండ్రి భయపడుచున్నపుడు, కుమారుడు అక్కడనున్న రజ్జువునే చూచుచున్నను, తండ్రికిగూడ ఆ రజ్జుసాక్షాత్కారము కలుగువరకు, ఆతని భయకంపాదులను తొలగింపజాలడు. అట్లే తనచే అనుభవింప బడుచున్న బంధమును తానే తొలగించుకొనవలెను కాని మరి యెవ్వరును తొలగింపజాలరు. ఈ విషయమును బాగుగ గ్రహించి జనులు తమబంధవిముక్తికై ప్రయత్నింతురుగాక అను నభి ప్రాయముతో, ఆచార్యులు ఈ విషయమునే అనేకదృష్టాంతములతో మనమనస్సులో దృఢముగ నాటుకొనునట్లు చెప్పుచున్నారు.

మస్తకన్యస్తభారాదేః దుఃఖమన్యైర్నివార్యతే,
క్షుధాదికృతదుఃఖం తు వినా స్వేన న కేనచిత్. 54

**మస్తకన్యస్త భారాదేః = శిరస్సుపైనున్న భారము మొదలగు దానివలన కలుగు, దుఃఖం = దుఃఖము, అన్యైః = ఇతరులచేత, నివార్యతే = నివారింపబడును. తు = కాని, క్షుధాదికృతదుఃఖం = ఆకలిమొదలగువాటిచే కలుగు దుఃఖము, స్వేన వినా = తాను తప్ప, కేనచిత్ = ఎవ్వనిచేతను, న = నివారింపబడదు.**

భారాదేః, అనుచోట 'ఆది' పదముచే సంకెళ్ళు మొదలగు వాటిచే బంధింపబడిన కరచరణాదికము గ్రహింపబడును. వాటివలన కలుగు దుఃఖము ఆ భారమును క్రిందికి దింపుటచేత గాని, సంకెళ్లు మొదలగు వాటిని విడిపించుటచే గాని, అన్యులచే నివారింపబడ వచ్చును. ఆకలి మొదలగు వాటిచే కలుగు దుఃఖమును మాత్రము తాను తప్ప ఎవ్వరును తొలగింపజాలరు. పుత్రాదు లెవ్వరైన భుజించి నను, నీరు త్రాగినను తండ్రియొక్క ఆకలిదప్పులు తీరుట కనబడుట లేదుకదా?

అవ. మరియొక దృష్టాంతమును చెప్పుచున్నాడు-

పథ్యమౌషధసేవా చ క్రియతే యేన రోగిణా.
ఆరోగ్యసిద్ధిర్దృష్టాస్య నాన్యానుష్ఠితకర్మణా. 55

యేన = ఏ, రోగిణా = రోగిచేత, పథ్యం = పథ్యము, ఔషధ సేవా చ = ఔషధసేవయు, క్రియతే = చేయబడునో, అస్య = వీనికే, ఆరోగ్యసిద్ధిః = ఆరోగ్యప్రాప్తి, దృష్టా = చూడబడుచున్నది. అన్యానుష్ఠిత కర్మణా = ఇతరులచే చేయబడినకర్మచే, న = కాదు,

పథ్యమును, ఔషధసేవను ఏ రోగి చేయునో ఆతనికి ఆరోగ్య సిద్ధి కనబడుచున్నది. పథ్యాదులను ఒకరు చేసినచో మరొకరిరోగము శాంతించుట కానరాదని యర్థము. పథ్యము, ఔషధసేవ అను రెండింటిని చెప్పుటచే దృఢతరమగు సాధనచతుష్టయ సంపత్తియు, వేదాన్తశ్రవణమును జ్ఞానమునకు హేతువు అని సూచింపబడినది.

వస్తుస్వరూపం స్ఫుటబోధచక్షుషా
స్వేనైవ వేద్యం న తు పండితేన.
చన్ద్రస్వరూపం నిజచక్షుషైవ
జ్ఞాతవ్య మన్యైరవగమ్యతే కిమ్. 56

మృత్యువును తరించును; మోక్షమునకు మరియొకమార్గము లేదు. శ్రు. "జ్ఞానాదేవ తు కైవల్యమ్"– జ్ఞానమువలన మాత్రమే మోక్షము కలుగును, ఇత్యాది శ్రుతుల ననుసరించి, గురుశిష్యసంవాదరూపమగు ఈ గ్రంథమునందు "పఠన్తు శాస్త్రాణి" ఇత్యాది శ్లోకమునందు (6) చెప్పిన విధమున బ్రహ్మాత్మైకత్వజ్ఞానవ్యతిరిక్తమైనదానికి మోక్షహేతుత్వమును నిషేధించుచున్నాడు. .... వ్యతిరిక్తమైనది మోక్షహేతువు కాజాలదని చెప్పుచున్నాడు –

## ఆత్మజ్ఞానమహత్త్వము

న యోగేన న సాంఖ్యేన కర్మణా నో న విద్యయా,
బ్రహ్మాత్మైకత్వబోధేన మోక్ష స్సిధ్యతి నాన్యథా 58

యోగేన = యోగశాస్త్రముచే, న = కాదు, సాంఖ్యేన = సాంఖ్యశాస్త్రముచే, న = కాదు, కర్మణా = యజ్ఞాదికర్మచే, న = కాదు, విద్యయా = సగుణోపాసనారూపమగు విద్యచే, న = కాదు, మోక్షః = మోక్షము, బ్రహ్మాత్మైకత్వబోధేన = బ్రహ్మాత్మైకత్వ జ్ఞానముచేతనే, సిధ్యతి = సిద్ధించును, అన్యథా = మరియొకవిధముగా, న = కాదు.

మోక్షః = బ్రహ్మస్వరూపముతో ఉండుట అను లక్షణముగల మోక్షము, బ్రహ్మాత్మైకత్వబోధేన = బ్రహ్మయొక్కయు ఆత్మయొక్కయు ఏకత్వము, అనగా అభేదము, దానియొక్క, బోధః = సాక్షాత్కారము, దానిచే, సిధ్యతి = అభివ్యక్తమగును, మరియొక ప్రకారముచే సిద్ధింపదు. ఆ ఇతరప్రకారములనే విశదీకరించుచున్నాడు. భేదమును బోధించు యోగశాస్త్రమువలన కలిగిన జ్ఞానముచే మోక్షము సిద్ధింపదు. లేదా చిత్తవృత్తినిరోధరూపమగు యోగముచే మోక్షము రాదు అని యర్థము. ఇట్లే, సాంఖ్యేన = నానాత్మవిషయకమయి కపిలమహర్షిచే రచితమైన సాంఖ్యశాస్త్రమువలన కలిగిన జ్ఞానముచే గూడ, మోక్షము సిద్ధింపదు. కర్మణా = పూర్వకాండ విహితమగు

యజ్ఞాదికర్మచే గూడ, సిద్ధించదు. విద్యయా—ఉపనిషత్తులలో విహిత మైనదైనను సగుణోపాసనారూపమగు విద్యచేతగూడ కైవల్యరూప మగు మోక్షము సిద్ధింపదు. యోగసాంఖ్యశాస్త్రముల వలన కలుగు జ్ఞానము భేదవిషయకమైనది. శ్రు. "యదా హ్యేవైష ఏతస్మిన్నుదర మన్తరం కురుతే; అథ తస్య భయంభవతి"—ఈ ఆత్మస్వరూప విషయమున ఏ మాత్రము భేదబుద్ధిచేసినను ఆతనికి భయమే కలుగును అని చెప్పిన విధముగ, ఆ యోగసాంఖ్యాదిశాస్త్రజన్యభేదజ్ఞానము ఏ మాత్రము అభయస్థితి ప్రాపకము కాజాలదు. శ్రు. నాస్త్యకృతః కృతేన — కృతకమగు కర్మచేత అకృతకమగు మోక్షముకలుగదు. శ్రు."అమృత త్వస్య నాశాస్తి విత్తేన"— ధనముచే, అనగా ధనసాధ్యమగు కర్మచే, అమృతత్వమును ఆశించుటకు వీలులేదు అనుశ్రుతులు కర్మనిత్యమగు మోక్షమును వ్యంజింపజాలదని చెప్పుచున్నవి. శ్రు. "న చ పునరా వర్తతే" అనుశ్రుతి మోక్షము నిత్యమని బోధించుచున్నది. సః—బ్రహ్మ లోకమునకువెళ్లిన సగుణోపాసకుడగు పురుషుడు, మరల, నావర్తతే— సంసారవంతుడు కాడు; మరల జన్మపొందడు అని అర్థము. అట్లు పునరావృత్తిరాహిత్యమునకు కారణము ముక్తత్వమే. బ్రహ్మస్వరూప మున ఉండుటయే ముక్తత్వము. శ్రు. "యోవై భూమా తదమృ తమ్"—సర్వవ్యాప్తమగు ఏ ఆత్మకలదో అది నాశరహితము. "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" — బ్రహ్మ సత్యరూపము, జ్ఞానరూపము, అన న్తము, శ్రు. "నిత్యోఽనిత్యానామ్" — అనిత్యములగు పదార్థముల నడుమనున్న నిత్యపదార్థము ఆత్మయే, ఇత్యాదిశ్రుతిశతములచే బ్రహ్మ నిత్యమని చెప్పబడుటచే తత్స్వరూపమగు మోక్షము కూడ నిత్యము. శారీరకమీమాంసాశాస్త్రము చివరి అధికరణభాష్యమున— 'సమ్యగ్ జ్ఞానముచేనశించిన అజ్ఞానముకలవారును, నిత్యసిద్ధమగు మోక్షమునం దాసక్తి కలవారును అగువారికి ఆవృత్తిరాహిత్యము సిద్ధమే; అట్టి వారిని ఆశ్రయించుటచే సగుణోపాసకులకు గూడ అనావృత్తి సిద్ధిం

చును' అని చెప్పబడినది. అందుచే, బ్రహ్మలోకమునుపొంది, ఆత్మ సాక్షాత్కారమును సంపాదించిన వారికి అచటనే కైవల్యరూపమగు మోక్షము వచ్చును అను విషయము-

శ్రు. "తే బ్రహ్మలోకే తు పరాన్తకాలే,
పరామృతాత్పరిముచ్యన్తి సర్వే."

శ్లో॥ బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే,
పరస్యాన్తే కృతాత్మానః ప్రవిశన్తి పరం పదమ్.

"సగుణోపాసనచేసి బ్రహ్మలోకమును చేరినవారు మహాప్రళయమున మోక్షమును పొందుదురు." "వారందరును ఆత్మసాక్షాత్కారము పొందినవారై మహాప్రళయము వచ్చినపుడు బ్రహ్మతోకూడి మోక్షమును పొందుదురు" ఇత్యాది శ్రుతిస్మృతులవలన తెలియుచున్నది. పరామృతాత్ = వేదాన్తవిచారజనితమగు ఉత్కృష్టజ్ఞానమువలన, కృతాత్మానః = ఆత్మసాక్షాత్కారముపొందినవారు. కవచము (చొక్కా) మొదలగువాటివెనుక మరుగుపడిన బంగారు ఆభరణమును వెదకి వెదకి అలసిపోయినవాడు "ఇదిగో; ఇది నీ కంఠమునందే ఉన్నది; ఎందుకు భ్రాంతిపడెదవు?" అని ఆప్తుడెవ్వడైన చెప్పగా, పోయినది దొరకినట్లు భావించును. ఆ ఆప్తవాక్యమువలన కలిగిన జ్ఞానము ఉన్న వస్తువునే అభివ్యక్తము చేయుచున్నది. అట్లే గురూపదిష్టములగు 'తత్త్వమసి' ఇత్యాది మహావాక్యములవలన కలిగిన సాక్షాత్కారము గూడ నిత్యసిద్ధముగనే ఉన్న బ్రహ్మభావరూపమగు మోక్షమును అభివ్యక్తము చేయుచున్నది. కావున మోక్షము జ్ఞానజన్యమని శంకింపరాదు. కర్ణుడు మొదటినుండియు కుంతీకుమారుడే. కాని చిన్నతనమునుండియు అతనిని రాధ పెంచుటచే అతడు రాధేయుడ నని అనుకొనుచుండెను. తరువాత కుంతి చెప్పగనే కౌంతేయుడనని తెలిసికొనెను. తావన్మాత్రముచే ఈ కౌంతేయత్వము అతనికి క్రొత్తగ రాలేదు. ఇక నేమనగా పూర్వము తెలియనిది ఇపుడు తెలిసి

నది. ఇచటగూడ అట్లే తెలిసికొనవలెను. ఇంకను ఎట్లనగా — "ఆత్మానం మానుషం మన్యే రామం" అని చెప్పినట్లు శ్రీరాముడు తాను మానవుడనియే అనుకొనుచుండెను. బ్రహ్మదేవుడు — "ఏక శృంగో వరాహస్త్వం" ఇత్యాది వాక్యములచే నీవు మహావిష్ణువని చెప్పినపు డాతడు తాను మహావిష్ణువే అని స్వస్వరూపమును తెలిసి కొనెనే కాని ఆతనికి పూర్వము లేని మహావిష్ణుత్వ మిపుడు క్రొత్తగ రాలేదు. ఈ వాక్యములు ఆతని మహావిష్ణుత్వమును అభివ్యక్తము చేసినవి. ఇక్కడకూడ అట్లే అని తెలియవలెను.

అట్లే కర్మఫలము ఉత్పాద్యముకాని, ఆప్యముకాని, సంస్కార్యము కాని, వికార్యముకాని కావలెను. ఉదాహరణమునకు— యాగమువలన స్వర్గము ఉత్పన్నమగుచున్నది గాన స్వర్గరూపమగు ఫలము యాగము వలన ఉత్పాద్యము—క్రొత్తగ పుట్టుచున్నది. అధ్యయనము చేయుటచే శబ్దరాశిరూపమగు వేదము పొందబడుచున్నది. కావున వేదరూప ఫలము ఆప్యము. హోమమునకై ఉపయోగించు వ్రీహులపై (ధాన్యముపై) నీళ్లు చల్లుటచే సంస్కారము కలుగుచున్నది. కావున ఇచట ఫలము సంస్కార్యము. ధాన్యము మొదలగువాటిని దంచుటచే పొల్లు పోవుటవంటి వికారము కలుగుచున్నది. కావున ఇచట ఫలము వికార్యము. మోక్షము నిత్యము గాన ఉత్పాద్యము కాదు. ఆత్మ స్వరూపముగాన, ఆత్మ సర్వదా పొందబడియే యున్నదిగాన, ఆప్యము కాదు. నిత్యశుద్ధబ్రహ్మస్వరూపముగాన సంస్కార్యము కాదు. నిర్వికార బ్రహ్మరూపముగాన వికార్యము కాదు. ఈ విషయమును భగవత్పాదులు సమన్వయసూత్రభాష్యమున విస్తృతముగ విశదీకరించిరి. కావున కర్మఫలములుగా చెప్పదగిన ఉత్పాద్యత్వ - ఆప్యత్వ - సంస్కార్యత్వ - వికార్యత్వములలో ఏ ధర్మమును మోక్షవిషయమున కుదురదు గాన మోక్షము కర్మవలన లభించునది కాదు అని అర్థము. శ్రు. 'విద్యాం చావిద్యాం చ', శ్రు. "విద్యయా తదారోహంతి" ఇత్యాదులలో విద్యా

శబ్దము ఉపాసనార్థమున ప్రయోగింపబడినది. కావున ఇచట గూడ 'విద్యా' పదమునకు ఆత్మవిద్యాభిన్నమగు అపరవిద్య అని యర్థము. ఆ అపరవిద్య వలన బ్రహ్మస్వరూపముతో ఉండుట అను లక్షణముగల మోక్షము సాక్షాత్తుగ లభింపదు- అని యర్థము.

అవ. మోక్షము బ్రహ్మాత్మైక్యజ్ఞానము వలననే కలుగును కాని మరియొక ఉపాయముచే కలుగదు అను విషయమును దృష్టాంతమును చూపి విశదీకరించుచున్నాడు-

వీణాయా రూపసౌన్దర్యం తన్త్రీవాదనసౌష్ఠవమ్.
ప్రజారంజనమాత్రం తన్న సామ్రాజ్యాయ కల్పతే. 59

వీణాయాః = వీణయొక్క, రూపసౌన్దర్యం = రూపముయొక్క సౌందర్యము, తన్త్రీవాదన సౌష్ఠవం = తంత్రులను మ్రోగించుటలో సౌష్ఠవము, ప్రజారంజన మాత్రం = ప్రజారంజనమునకు మాత్రమే ఉపయోగించునది. తత్ = అది, సామ్రాజ్యాయ = సామ్రాజ్యము సంపాదించుట కొరకు, న కల్పతే = ఉపయోగింపదు.

'రాజా ప్రకృతిరంజనాత్' అని చెప్పిన విధముగ ప్రజలను రంజింపచేయువాడు రాజు. ఒకవైణికుడు ఆకారముచే జనమనోహరముగానున్న వీణను తీసికొని, దాని తీగెలను బాగుగ మ్రోగించినచో సుందరమగు ఆ వీణను చూచియు, తంత్రీవాదనమును వినియు ప్రజలు రంజింపబడవచ్చును. అయినను, ఆ విధముగ రంజింపచేయుట ఆ వైణికుడు సమ్రాట్టు అగుటకు ఉపకరించదు. అట్లే ఆత్మైక్యబోధము లేనిచో యోగశాస్త్రాది జన్యమగు జ్ఞానముగాని, కర్మగాని, ఉపాసనము గాని కైవల్యమునకు ప్రత్యక్షముగ ఉపకరింపవు. 'రూపసౌందర్యం' అనగా సుందరరూపము అని యర్థము. తంత్రులను మ్రోయించుటలో వైణికునకు గల నేర్పు ప్రజారంజనమాత్రమునే చేయునుగాని వానికి రాజత్వమును సంపాదింపజాలదని యర్థము.

అవ. కేవల శబ్దశ్రవణమాత్రముచే మనోరంజనము చేయువారి విషయము చెప్పి, ఇపుడు, అర్థతః కూడా ఎవరు మనోరంజనము చేయుదురో వారికిగూడ పూర్వోక్తజ్ఞానము లేనిచో ముక్తి లేదని చెప్పుచున్నారు-

వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవ్యాఖ్యానకౌశలమ్.
వైదుష్యం విదుషాం తద్వ ద్భుక్తయే న తు ముక్తయే. 60

వాగ్వైఖరీ = వాగ్వైఖరియు, శబ్దఝరీ = శబ్దప్రవాహము, శాస్త్రవ్యాఖ్యానకౌశలం = శాస్త్రములను వ్యాఖ్యానము చేయుటయందు నేర్పు, ఈ విధమైన, విదుషాం = విద్వాంసులయొక్క, వైదుష్యం = పాండిత్యము, తద్వత్ = వీణావాదనాదికమువలెనే, భుక్తయే = భుక్తికల్పించుటకే కాని, ముక్తయే తు = ముక్తికొరకుమాత్రము, న = కాదు.

వాగ్వైఖరీ = సరళపదబంధములతో కూడిన వాక్కు. శబ్దఝరీ = అడ్డులేకుండ ప్రవహించుచున్న వాక్కు. శబ్దప్రవాహమనగా వాక్ప్రయోగమునందు చాతుర్యము. శాస్త్రవ్యాఖ్యానకౌశలం-

పదచ్ఛేదః పదార్థోక్తిః విగ్రహో వాక్యయోజనా,
ఆక్షేపస్య సమాధానం వ్యాఖ్యానం పంచలక్షణమ్.

పదచ్ఛేదము, పదముల అర్థమును చెప్పుట, సమాసాదుల విగ్రహవాక్యములను చెప్పుట, వాక్యమును అన్వయించుట, ఆక్షేపమునకు సమాధానము చెప్పుట అని వ్యాఖ్యానమునకు ఐదులక్షణములు అని చెప్పిన విధమున శాస్త్రార్థమును చెప్పుటలో ప్రావీణ్యము. ఈ విధమైన పండితుల పాండిత్యము కూడ వీణావాదనాదికమువలె, వారికి కీర్తిని సంపాదించి భుక్తిని కల్గించును. ముక్తికి మాత్రము ఉపయోగింపదు. పూర్వోక్తాత్మ సాక్షాత్కారమొక్కటియే కారణము అని భావము.

అవ. (ఆశంక) తాత్కాలికముగ సౌఖ్యమును కలిగించు వైణికుల నేర్పు ఎక్కడ? వినినపిమ్మటగూడ బాగుగ అంతఃకరణము

నందు ప్రవేశించి ఆనందమును కల్పించుటకు సమర్థమైన పండితుల పాండిత్య మెక్కడ? అందుచే పాండిత్యమును 'తద్వత్' అని వీణా వాదనకౌశలముతో పోల్చుట యుక్తముకాదని ఆశించినచో-

(సమాధానము) ఆ రెండిటికి అట్టి భేద మున్నచో ఉండ వచ్చును. అయినను ఆత్మతత్త్వసాక్షాత్కారము లేనంతవరకు శాస్త్రాధ్యయనము దానివలన కలిగిన ప్రావీణ్యము మోక్షఫలము నీయజాలవని చెప్పుచున్నాడు-

అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా,
విజ్ఞాతేఽపి పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా. 61

పరే తత్త్వే = పరతత్త్వము, అవిజ్ఞాతే = తెలియబడనిదగు చుండగా, శాస్త్రాధీతిః = శాస్త్రాధ్యయనము, నిష్ఫలా = వ్యర్థము, పరే తత్త్వే = పరతత్త్వము, విజ్ఞాతేఽపి = తెలిసినను, శాస్త్రాధీతిః = శాస్త్రాధ్యయనము, నిష్ఫలా = వ్యర్థము.

పరే = కాలత్రయా బాధ్యమగుటచేతను, స్వయంప్రకాశానంద రూపమగుటచేతను, జడదుఃఖాదిరూపమును దేహము మొదలు మాయ వరకును గల మిథ్యాభూతములగు సకల కార్యకారణములకంటె ఉత్కృష్టమైనదియు, దానియంతకును అధిష్ఠానమగు నిర్గుణబ్రహ్మ తత్త్వము, అవిజ్ఞాతే = సాక్షాత్కరింపబడకపోయినచో, శాస్త్రాధీతిస్తు = అర్థవిచారమువరకును ప్రవర్తించు వేదాన్తాధ్యయనము కూడ వ్యర్థమే. ఏ ఫలమును పొందుటకై విచారము శాస్త్రముచే విహిత మైనదో అది లభింపనంతవరకును ఆ విచారము వ్యర్థమే. జన్మాంతర మునందు చేసిన సాధనముచే గర్భమునందున్నప్పుడే వామదేవుడు పరతత్త్వమును తెలిసికొనగల్గెను. ఆ విధముగ సాక్షాత్కారరూపమగు ఫలము లభించిన పిమ్మట గూడ శాస్త్రాధ్యయనము చేయవలసిన పనిలేదని భావము.

అవ. మహారణ్యమును ప్రవేశించిన పురుషుడు దిక్కులు తెలియక వ్యర్థముగ తిరుగాడును. అట్లే కేవలము శబ్దజాలాత్మకమగు శాస్త్రముకూడ మనోవిక్షేపమును మాత్రమే కలిగించును గాన తన్నిష్ఠత్వమును విడచి పరమాత్మసాక్షాత్కారవంతుడగు గురువునుండి ఆత్మ యథార్థస్వరూపము ప్రత్యక్షమగునట్లు తెలిసికొనవలెను అని చెప్పుచున్నాడు -

శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణ కారణమ్,
అతః ప్రయత్నాత్ జ్ఞాతవ్యం తత్త్వజ్ఞాత్తత్త్వమాత్మనః. 62

శబ్దజాలం=శబ్దసముదాయమనెడు, మహారణ్యం=మహారణ్యము, చిత్తభ్రమణకారణం=చిత్తమునకు విభ్రాంతిని కలిగించును, అతః=ఆ కారణమువలన, ఆత్మనః=ఆత్మయొక్క, తత్త్వం=తత్త్వము, తత్త్వజ్ఞాత్=తత్త్వము నెఱింగిన వానినుండి, ప్రయత్నాత్=ప్రయత్నపూర్వకముగ, జ్ఞాతవ్యం=తెలియదగినది.

ఆచార్యోపదేశముద్వారా ఉపనిషద్రూపశాస్త్రమునుండియే ఆత్మతత్త్వమును తెలిసికొనవలసియున్నను శాస్త్రకోలాహలమును ఆశ్రయింపరాదు. "లోకవాసనయా...." ఇత్యాదిశ్లోకమున మున్ముందు (272వ శ్లో.) చెప్పనున్న విధమున శాస్త్రవాసనకూడ జ్ఞానప్రతిబంధకమే యని భావము.

అవ. అజ్ఞానమును నివర్తింపజేయునది జ్ఞానమే కాని మరి యేదియును కాదని చెప్పుచున్నాడు.

అజ్ఞానసర్పదష్టస్య బ్రహ్మజ్ఞానౌషధం వినా,
కిము వేదైశ్చ శాస్త్రైశ్చ కిము మన్త్రైః కిమౌషధైః. 63

అజ్ఞాన సర్పదష్టస్య=అజ్ఞానమనెడు సర్పముచే కరవబడినవానికి, బ్రహ్మజ్ఞానౌషధం వినా=బ్రహ్మజ్ఞానమనెడు ఔషధముతప్ప, వేదైశ్చ=

వేదములచేత, కిము = ఏమిప్రయోజనము, శాస్త్రైశ్చ = శాస్త్రములచేత, కిము = ఏమిప్రయోజనము, మన్త్రైః = మంత్రములచేతను, ఔషధైః = ఔషధములచేతను, కిం = ఏమి ప్రయోజనము.

అత్యంతము అనర్థమునకు హేతువగుటచే అజ్ఞానమే సర్పము. దానిచే, దష్టస్య = ఆవరణ విక్షేపములచే మోహితుడైనవానికి, బ్రహ్మజ్ఞానమే ఔషధము. అదిలేనిచో, వేదైః = ఋగాది వేదములచేతను, శాస్త్రైః = వ్యాకరణాదిశాస్త్రములచేతను, మన్త్రైః = సప్తకోటిమహామంత్రములచేతను, ఔషధైః = సంజీవనిమొదలగు ఓషధులచేతను, ఏమిప్రయోజనము. వాటిలో ఏ ఒక్కటియు అజ్ఞానసర్పము వేసిన కాటుచే కలిగిన మోహమును నివర్తింపజాలవు అని యర్థము.

అవ. కేవలము శబ్దము మోక్షము నీయజాలదు అను విషయమును దృష్టాంతప్రదర్శనపూర్వకముగ చెప్పుచున్నాడు.

## అపరోక్షానుభవముయొక్క ఆవశ్యకత

న గచ్ఛతి వినా పానం వ్యాధి రౌషధశబ్దతః.
వినాపరోక్షానుభవం బ్రహ్మశబ్దై ర్న ముచ్యతే. 64

వ్యాధిః = రోగము, పానం వినా = ఔషధపానము చేయకుండగా, ఔషధశబ్దతః = 'ఔషధము' అనుశబ్దము నుచ్చరించినంత మాత్రమున, న గచ్ఛతి = తొలగదు, అపరోక్షానుభవం వినా = ప్రత్యక్షానుభవము లేకుండగా, బ్రహ్మశబ్దైః = "బ్రహ్మ" అనుశబ్దము నుచ్చరించుటచే, న ముచ్యతే = మోక్షము పొందజాలడు.

ఔషధసేవనము చేయకుండగా "ఔషధము", "ఔషధము" అనిశబ్దమును ఉచ్చరించినంతమాత్రమున రోగము కుదురదు. అట్లే అపరోక్షానుభవం వినా = ఆత్మసాక్షాత్కారము లేకుండగా, కేవలము

ఉపనిషత్తులలోనున్న "బ్రహ్మ" శబ్దములచే, న ముచ్యతే=బంధ ముక్తుడు కాజాలడు.

అవ. తత్త్వజ్ఞానమునకు ప్రధానకారణ మేదియో చెప్పుచు ఈ విషయమునే మరియొక విధముగ చెప్పుచున్నాడు-

అకృత్వా దృశ్యవిలయ మజ్ఞాత్వా తత్త్వమాత్మనః,
బాహ్యశబ్దైః కుతో ముక్తి రుక్తిమాత్రఫలై ర్నృణామ్. 65

దృశ్యవిలయం=దృశ్యమగు ప్రపంచముయొక్క విలయమును, అకృత్వా=చేయక, ఆత్మనః=ఆత్మయొక్క, తత్త్వం=తత్త్వమును, అజ్ఞాత్వా=తెలిసికొనక, ఉక్తిమాత్రఫలైః=ఉచ్చారణమాత్రమే ఫలముగా గల, బాహ్యశబ్దైః=బాహ్యశబ్దములచే, నృణాం=మానవులకు, ముక్తిః= మోక్షము, కుతః=ఎట్లు లభించును?

దృశ్యవిలయం=దృశ్యమనగా శబ్దేతరములగు చక్షురాదుల వలన కల్గిన మనోవృత్తికి విషయమైనది లేదా చిత్తుకు విషయమైనది. ఇట్లు చెప్పుటచే శబ్దమును వినగనే కలిగిన మనోవృత్తికి విషయమగు శశశృంగాదికముకంటెను, బ్రహ్మకంటెను భిన్నమైనది అను నర్థము వచ్చును; అట్టి అజ్ఞానము వరకును ఉన్నదియు, బ్రహ్మవ్యతిరిక్తమును అగు సకలదృశ్యజగత్తుయొక్క విలయమును అనగా బ్రహ్మయందు ప్రవిలాపనమును - అణగిపోవుటను - చేయకుండగను, ఆత్మనః=తన యొక్క, తత్త్వం=సజాతీయ విజాతీయ స్వగతభేదరహితము, సర్వాధిష్ఠానము, సత్యము, స్వయంప్రకాశము అగు ఆనందస్వరూపత్వమును తెలిసికొనక, ఉక్తిమాత్రఫలైః=ఉచ్చారణమాత్రమే ప్రయోజనముగా గలిగిన, బాహ్యశబ్దైః=ఆంతరమగు అనుభవము లేకుండగనే ఉచ్చరింపబడుచున్న 'అహం బ్రహ్మాస్మి' ఇత్యాది శబ్దముల చేత, నృణాం=మానవులకు ముక్తి ఎట్లువచ్చును? అసంభావ్యమని యర్థము. 'కుతః' అనుశబ్దము నిషేధార్థకము.

అవ. ఈ విధముగ 'అకృత్వా' ఇత్యాది పూర్వశ్లోకమున, సమస్తదృశ్యప్రపంచమును అణచివేసి బ్రహ్మమాత్రమునే మిగుల్చుట అనునది ఆత్మతత్త్వమును తెలిసికొనుటకు పరమకారణము అని వ్యతిరేకముఖమున చెప్పబడినది. అట్లే తత్త్వజ్ఞానమును కలిగిననే ముక్తి కలుగును, మరియొకవిధముగ కలుగదు అను విషయముగూడ వ్యతిరేకముఖమున చెప్పబడినది. ఇపుడు దృష్టాంతమును చెప్పుచున్నాడు-

అకృత్వా శత్రుసంహార మగత్వాఖిలభూశ్రియమ్.
రాజాహమితి శబ్దాన్నో రాజా భవితు మర్హతి. 66

శత్రుసంహారం = శత్రుసంహారమును, అకృత్వా = చేయకుండగా, అఖిలభూశ్రియం = సమస్తమైన భూలోకముయొక్క లక్ష్మిని, అగత్వా = పొందకుండగా, 'రాజా అహమ్' = నేను రాజును, ఇతి = అను, శబ్దాత్ = శబ్దమువలన, రాజా = రాజుగా, భవితుం = అగుటకు, నార్హతి = తగడు.

తన రాజ్యభోగమునకు అడ్డుతగులుచున్న శత్రువుల నాశమును చేయకుండ, అఖిలభూశ్రియం = సమస్త పృథ్వీసంపదను, పొందకుండగా 'నేను రాజును' అని చెప్పుకొనినంతమాత్రమున రాజు కాజాలడు అని అన్వయము. సకలశత్రువులను లయింపజేసి సమస్త భూమియొక్క సంపదను పొందుట రాజత్వమునకు ఎట్లు కారణమో, అట్లే ముక్తికి గూడ సకలదృశ్యజగత్తును విలీనముచేసి ఆత్మతత్త్వమును తెలిసికొనుట కారణము అని భావము.

అవ. కేవలబాహ్యశబ్దములచే ముక్తి లభింపదు. అందుచే తత్త్వవేత్తయగు గురువునుండి ప్రయత్నపూర్వకముగ ఆత్మతత్త్వమును తెలిసికొనవలెను అని దృష్టాంతముతో సవిస్తరముగ చెప్పుచున్నాడు-

ఆప్తోక్తిం ఖననం తథోపరి శిలాద్యాకర్షణం స్వీకృతిం
నిక్షేపః సమపేక్షతే న హి బహిఃశబ్దైస్తు నిర్గచ్ఛతి,
తద్వ ద్బ్రహ్మవిదోపదేశమనన ధ్యానాదిభిర్లభ్యతే
మాయాకార్యతిరోహితం స్వమమలం తత్త్వం న
దుర్యుక్తిభిః. 67

నిక్షేపః=భూమిలోదాచిఉంచిన ధనము, ఆప్తోక్తిం=ఆప్తులమాటను, ఖననం=త్రవ్వుటను, శిలాద్యాకర్షణం=రాళ్లనుతొలగించుటను, స్వీకృతిం=స్వీకరించుటను, సమపేక్షతే=అపేక్షించును, తు=కాని, శబ్దైః=మాటలమాత్రముచే, బహిః=బైటకు, న నిర్గచ్ఛతి=రాదుకదా! తద్వత్=అట్లే, మాయాకార్యతిరోహితం=మాయచేతను దానికార్యములగు దేహాదులచేతను కప్పివేయబడిన, అమలం=నిర్మలమైన స్వం=స్వకీయమైన, తత్త్వం=తత్త్వము, బ్రహ్మవిదా=బ్రహ్మవేత్తచేత చేయబడిన, ఉపదేశమననధ్యానాదిభిః=ఉపదేశము, మననము, ధ్యానము మొదలగువాటిచే, లభ్యతే=పొందబడును, దుర్యుక్తిభిః=చెడ్డయుక్తులచేత, న=పొందబడదు.

లోకమున భూమిలోపల దాచియుంచిన బంగారము మొదలగు నిధిని పొందవలెనన్నచో, దానిని చూచినవారియొక్క మాటలు గాని, లేదా అంజనవిశేషాదుల సహాయముతో దానిని తెలిసికొని సత్యమును చెప్పెడు అప్తులయొక్క మాటలుగాని విని, భూమిని త్రవ్వి, ఆ నిధిపైకప్పిన రాయి తీసివేసి, దానిని పొందవలెను. అంతియే కాని 'నిక్షేపము' 'నిక్షేపము' అనుమాటలచే అది బయటకురాదు. ఈ విషయము ఏ విధముగ లోకప్రసిద్ధమో, తద్వత్=శిలచేతను, భూమిచేతను కప్పబడిన నిధివలె, స్వం=స్వకీయమైన, అమలం=స్వతః పరిశుద్ధమైన, తత్త్వం=తత్త్వము, అనగా బ్రహ్మ, మాయాకార్యతిరోహితం=అజ్ఞానముచేతను, దానికార్యములగు అహంకారాది దేహాంతకోశములచేతను అడ్డుకొనబడిన స్ఫుటప్రకాశము కలదై, బ్రహ్మవిదోపదేశమననధ్యానాదిభిః అ=అంతటు, ఉపదేశః=ఉప

దేశము, ఓపదేశము. బ్రహ్మవిదుని ఓపదేశము బ్రహ్మవిదోపదేశము. లేదా 'బ్రహ్మవిదా' అనునది తృతీయాంతమగు వ్యస్తపదము కావున 'అ బ్రహ్మవిదా' ఉపదేశమున కర్త యను నర్థము లభించును. బ్రహ్మవేత్తచేసిన ఉపదేశము, శ్రవణము, మననం = యుక్తులచే చింతనముచేయుట, ధ్యానం = నిదిధ్యాసనము. 'ఆది' పదముచే నిర్వికల్పకసమాధి గ్రహింపబడును. వాటిచే, లభ్యతే = సాక్షాత్కరింపబడును, బ్రహ్మ తనకంటె భిన్నముకాదు కావున మరియొక విధమగు లాభము ఇచట చెప్పుటకు వీలులేదు. అందుచే బ్రహ్మ లాభమనగా బ్రహ్మసాక్షాత్కారము. కంఠస్థచామీకరాది లాభము మొదలగు స్థలములలో గూడ నిట్లే చెప్పవలెనుకదా? "నైషా తర్కేణ మతిరాపనేయా"—ఈ జ్ఞానము తర్కముచే లభించునది కాదు అనుశ్రుతి ననుసరించి ఇది దుర్యుక్తులచే లభించునది కాదు. శ్రుతి విరుద్ధములు కాని యుక్తులు మాత్రము అంగీకార్యములే, "పణ్డితో మేధావీ గాన్ధారానేవోపసంపద్యతే — దొంగలుపట్టుకొని నట్టడవిలో విడిచిపెట్టగా తెలివిగలవాడు బుద్ధిచే ఊహించుకొని ఊహించుకొని ఏ విధముగా తనస్వస్థానమగు గాంధారదేశము చేరునో అట్లే యుక్తులచేతగూడ ఆత్మతత్త్వమును తెలిసికొనవలెను అను శ్రుతియే సత్కర్మమును అంగీకరించుచున్నది. మహామత్స్యాదిదృష్టాంతముచే ఆత్మ అసంగమను విషయమును, సుషుప్తియందు (జీవుడు) ప్రపంచమునుండి పూర్తిగ.దూరమై సదాత్మతో కలిసిపోవుటచే(నాతడు) నిష్ప్రపంచసదాత్మ స్వరూపుడను విషయమును, కార్యకారణములకు భేదము లేదను న్యాయముచేతను, మట్టిముద్దమొదలగు దృష్టాంతములచేతను ఒకవస్తువును తెలిసికొనినచో అన్నియు తెలియును, ప్రపంచము బ్రహ్మకంటె వేరుకాదు అను విషయమును, సాలెపురుగు మొదలగు దృష్టాంతములచే బ్రహ్మ జగత్తుకు ఉపాదానకారణము నిమిత్తకారణము గూడ అనువిషయమును, తస్కరదృష్టాంతముచే సత్యాభిసంధికలవాడు ముక్తిపొందును. మిథ్యాభిసంధికలవాడు బంధము పొందును

అను విషయమును, ఈ విధముగ అనేకయుక్తుల సాహాయ్యముచే శ్రుతియే అనేకవిషయములను బోధించుచున్నదిగాన మంచియుక్తులు అంగీకార్యములే. దుర్యుక్తులు మాత్రమే అంగీకార్యములు కావు అని చెప్పుటకై 'దుర్యుక్తిభిః' అని చెప్పబడినది.

తస్మాత్సర్వప్రయత్నేన భవబంధవిముక్తయే,
స్వైనైవ యత్నః కర్తవ్యో రోగాదేరివ పణ్డితైః. 68

తస్మాత్ = ఆ కారణమువలన, పండితైః = పండితులచే, రోగాదేరివ = రోగాదికముతొలగిపోవుటకువలె, భవబన్ధవిముక్తయే = సంసారబంధము తొలగిపోవుటకై, సర్వప్రయత్నేన = సర్వవిధములైన ప్రయత్నముచే, స్వైనైవ = స్వయముగనే, యత్నః = ప్రయత్నము, కర్తవ్యః = చేయతగినది.

తస్మాత్ = తనబంధము ఇతరులచే తొలగింప శక్యముకానిదగుటవలనను, సాధనచతుష్టయసంపన్నుడగు తాను గూడ గురువునుచేరి, అతని ముఖమునుండి వేదాన్తములను విని వాటి యర్థములను మననముచేసి, నిదిధ్యాసనముచేసి నిర్వికల్పక నిష్ఠచే బ్రహ్మతత్త్వమును స్పష్టముగ తెలిసికొని మోక్షమును పొందవలెనే గాని కేవల బ్రహ్మాదిశబ్దములవలన మోక్షము లభింపదు కావునను అని యర్థము. సర్వప్రయత్నేన = వెనుకచెప్పిన శ్రవణాదిరూపప్రయత్నము చేత, భవబన్ధవిముక్తయే = అవిద్యమొదలు దేహమువరకునుగల సాంసారికబంధనివృత్తికొరకు, స్వేన ఏవ — ఎవరుబంధమును అనుభవించుచున్నారో వారిచేతనే, పండితైః = బుద్ధిమంతులగువారిచేత, రోగాదేః = రోగము, ఆకలి, దాహము మొదలువాటియొక్క, విముక్తికొరకు ఏ విధముగ ఔషధసేవ, భోజనము, జలపానము మొదలగునవి స్వయముగనే చేయబడునో, అట్లే ప్రయత్నము చేయదగినది. బాగుగ స్థిరమైన వివేకాదిసాధనచతుష్టయమును సంపాదించుకొని

సద్గురువును చేరవలెనని భావము. ఈ శ్లోకమున - 'సర్వప్రయత్నేన' అనియు, "భవబన్ధవిముక్త్యై యత్నః కర్తవ్యః" అనియు రెండుసార్లు యత్నశబ్దమును ప్రయోగించి చెప్పుటచే 'యత్నః కర్తవ్యః" అను దానికి సద్గురూపసదనము చేయవలెను అనునర్థము చెప్పిన బాగుండు నని తోచుచున్నది అని శ్రీ చంద్రశేఖర భారతీంద్రులు వ్రాసియున్నారు

అవ. తీవ్రముముక్ష గలిగిన శిష్యుని ఈ విధముగ అభినందించి ఆతని ప్రశ్నను శ్లాఘించుచున్నాడు.

## ప్రశ్న విచారము

యస్త్వయాద్య కృతః ప్రశ్నో వరీయాన్ శాస్త్రవిన్మతః.
సూత్రప్రాయో నిగూఢార్థో జ్ఞాతవ్యశ్చ ముముక్షుభిః. 69

అద్య = ఇపుడు, త్వయా = నీ చేత, యః = ఏ ప్రశ్న, కృతః = వేయబడినదో అది, వరీయాన్ = శ్రేష్ఠమైనది, శాస్త్రవిన్మతః = శాస్త్రవేత్తలచే అంగీకరింపబడినది, సూత్రప్రాయః = సూత్రప్రాయమైనది, నిగూఢార్థః = గూఢమైన అర్థముకలది, ముముక్షుభిః = మోక్షేచ్ఛ కలవారిచే, జ్ఞాతవ్యశ్చ = తెలిసికొనదగినది.

తీవ్రమగు ముముక్ష యుండుచే నీవు ఉత్తమాధికారివగుటయే కాదు, ముముక్షువులు తెలిసికొనవలసిన అన్ని విషయములను హెచ్చు తగ్గులు లేకుండగ బాగుగ క్రోడీకరించి నన్ను ప్రశ్నించుటచే నీవు మేధావిత్వము, విద్వత్త్వము, ఊహాపోహవిచక్షణత్వము మొదలగు ధర్మములచే గూడ అలంకరింపబడినవాడవై ముముక్షువులందరును తెలిసికొనవలసిన మార్గమును చూపినవాడవైనావు, అని శిష్యుడు మహాత్ముడగు గురువుచే శ్లాఘింపబడినాడు. ఇట్లు శ్లాఘించినచో భక్తిశ్రద్ధలతో నిండిన మనస్సుకలవాడై చెప్పిన విషయమును వెంటనే గ్రహించునని గురువుయొక్క అభిప్రాయము.

యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథా గురౌ,
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః.

ఎవనికి దేవునియందు గొప్ప భక్తియుండునో, దేవునియందెట్లో గురువునందుకూడ ఉండునో, ఆ మహాత్మునికి బోధించినవిషయములు ప్రకాశవంతము లగును అని శ్రుతివాక్యము. ఇప్పుడు నీవు వేసిన 'కో నామ బన్ధః' ఇత్యాది ప్రశ్న, వరీయాన్=ఎంతయు శ్రేష్ఠమైనది. ఇందుకు కారణము చెప్పుచున్నాడు - 'శాస్త్రవిన్మతః' మంచి శాస్త్ర జ్ఞానము కలవారుమాత్రమే ఈ విధముగ ప్రశ్నింపగలరని భావము. ఇందులకు హేతువు 'సూత్రప్రాయః' అనునది. బంధమోచకమగు సాక్షాత్కారము కలుగుటకై ఏమేమి ప్రశ్నింపవలెనో అదియంతయు కొలది అక్షరములుగల మాటలలో ప్రశ్నింపబడినది గాన సూత్ర ప్రాయము. శబ్దము అల్పాక్షరమేయైనను తెలిసకొనవలసిన విషయ మంతయు దీనియందు నిగూఢమైయున్నదని చెప్పుచు దీని సూత్ర ప్రాయత్వమును 'నిగూఢార్థః' అను విశేషణముచే విశదీకరించు చున్నాడు. ఈ ప్రకరణగ్రంథములోని రాబోవు భాగమంతయు ఈ ప్రశ్నకు ఉత్తరరూపమున నుండుటచే బుద్ధిమంతులకు ప్రతిపాదింప వలసిన విషయమునంతను ఈ ప్రశ్నలో సూచించియున్నాడని భావము. కావుననే ఇది ముముక్షువులు తెలిసికొనదగినది. గురువు "అజ్ఞానయోగాత్" ఇత్యాదివాక్యమున ఆత్మానాత్మవివేకజన్యమగు సాక్షాత్కారముచే సహేతుకమగు బంధము నివర్తించుట యనెడు మోక్షము లభించును అని చెప్పగనే గురువాక్యమును బాగుగ అర్థము చేసికొని, ప్రశ్నింపవలసిన విషయముల నన్నింటిని శిష్యుడు నిశ్శేష ముగను, అనావశ్యకవిషయములు లేకుండగను ప్రశ్నించియున్నాడు. అందుచే శిష్యునియందలి మేధావిత్వాదికమును బాగుగ గ్రహించి గురువు అతనిని ఎక్కువ శ్లాఘించెను.

అవ. ఈ విధముగ మహాత్మునిచే శ్లాఘింపబడిన తాను ధన్యుడ నని తలచుచున్న శిష్యుని (గురువు) తను చెప్పుచున్న విషయమును బాగుగ గ్రహించుటకై సావధానచిత్తుడుగ నుండునట్లు చేయు చున్నాడు -

శృణుష్వావహితో విద్వన్ యన్మయా సముదీర్యతే,
తదేతచ్ఛ్రవణాత్సద్యో భవబన్ధాద్విమోక్ష్యసే. 70

హే విద్వన్ = ఓ విద్వాంసుడా, యత్ = ఏది, మయా = నాచే, సముదీర్యతే = చెప్పబడుచున్నదో, తత్ = దానిని, అవహితః = సావధాన చిత్తుడవై, శృణుష్వ = వినుము, ఏతచ్ఛ్రవణాత్ = దీనిని వినుటవలన, సద్యః = వెంటనే, భవబన్ధాత్ = సంసారబంధమునుండి, విమోక్ష్యసే = విముక్తుడవు కాగలవు.

హే విద్వన్ = శాస్త్రోక్తములగు మేధావిత్వము మొదలగు విద్యాధికారము కలవాడా ! నాచే ఏది, సముదీర్యతే = సంగ్రహముగను, విస్తృతముగను బాగుగ తెలియుటకై చెప్పబడుచున్నదో, తత్ = దానిని, అవహితః = విషయాంతరములయందు సంచరించని మనస్సు కలవాడవై, శ్రద్ధతో వినుము; ఏతచ్ఛ్రవణాత్ = నేను చెప్పెడివాక్యములను యథాశాస్త్రముగ వినుటవలన, సద్యః = వినినవెంటనే, ఆత్మను సాక్షాత్కరింపచేసికొని, భవబన్ధాత్ = కర్తృత్వము, భోక్తృత్వము, జన్మ, మరణము మొదలగునవి రూపముగాగల బంధము నుండి, విమోక్ష్యసే = పూర్తిగ ముక్తుడ వగుదువు.

అవ. ఇపుడు అతనిప్రశ్నల ననుసరించి ఆతడు తెలిసికొనదలచిన విషయమును చెప్పదలచినవాడై ముందుగ 'మోక్షము ఎట్లు వచ్చును?' అనుప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు -

(ఆశంక) 'బంధ మనగానేమి? ఇది ఎట్లు వచ్చినది? దీని స్థితి ఎట్లు?' అని మొదటి మూడుప్రశ్నలకును ప్రత్యుత్తరము చెప్ప కుండగా నాల్గవదైన "మోక్షము ఎట్లు" అనుప్రశ్నకు ప్రత్యుత్తరము చెప్పుట అనుచితముకదా అని ఆశంకింపరాదు.

(సమాధానము) ఇంటికి నిప్పంటుకొని మండిపోవుచున్న సమయమున వెంటనే నీరుపోసి అగ్నిని శమింపజేయుటకు బదులు "అగ్ని ఎక్కడపడినది? ఇల్లు ఎట్లు అంటుకొన్నది" అను విచారముచే కాలయాపనము చేసినచో గృహము పూర్తిగా దహించుకొనిపోవును కదా? అజ్ఞానవంతులందరు తీవ్రమగు సాంసారికబంధమును అనుభ వించుచునేయున్నారు. దానిని తొలగించుటకు ముందుగ ప్రయత్నము చేయవలెను అను నభిప్రాయముతో,

అనన్తశాస్త్రం బహువేదితవ్యం స్వల్పశ్చకాలో బహవశ్చ విఘ్నాః,
యత్సారభూతం తదుపాసితవ్యం హంసో యథా క్షీరమివాంబు
మధ్యాత్.

శాస్త్రము అనంతము; తెలియదగినది చాల ఉన్నది. కాలమా స్వల్పము. అనేకవిఘ్నములు. అందుచే హంస నీటినుండి క్షీరమును గ్రహించి నట్లు సారమైనదానిని గ్రహింపవలెను అని పెద్దలు చెప్పిన విధమున తెలిసికొనదగిన అంశములలో సారభూతమగు అంశమును గురువు 'మోక్షస్య' ఇత్యాది శ్లోకములలో ముందుగ చెప్పుచున్నాడు. మోక్ష హేతువునుగూర్చి శీఘ్రముగ తెలిసికొని, అది లభించుటచే వెంటనే శిష్యుడు బంధవిముక్తుడై నిత్యానందమును అనుభవించుగాక అని గురువుయొక్క అభిప్రాయము. మరియు, ఆత్మానాత్మజ్ఞానములేనిచో మున్ముందు చెప్పనున్న బంధముయొక్క స్వరూపము తెలియుటకు శక్యముకాదు. కావున అదియంతయు తరువాత చెప్పవచ్చును అనెడు అభిప్రాయముతో ముందుగ 'కథం విమోక్షః' అనుప్రశ్నకు సమా ధానము చెప్పుచున్నాడు -

మోక్షస్య హేతుః ప్రథమో నిగద్యతే
వైరాగ్య మత్యన్త మనిత్యవస్తుషు.
తతః శమశ్చాపి దమస్తితిక్షా
న్యాసః ప్రసక్తాఖిలకర్మణాం భృశమ్. 71

అనిత్యవస్తుషు = అనిత్యవస్తువులయందు, అత్యంతం = మిక్కిలి, వైరాగ్యం = వైరాగ్యము, మోక్షస్య = మోక్షమునకు, ప్రథమః = మొదటి, హేతుః = కారణముగ, నిగద్యతే = చెప్పబడుచున్నది, తతః = అటుపిమ్మట, శమశ్చాపి = శమము, దమః = దమము, తితిక్షా = తితిక్షయు, ప్రసక్తాఖిలకర్మణాం = ప్రసక్తములగు (చేయవలసియున్న) అన్నికర్మల యొక్కయు, భృశం = పూర్తిగా, న్యాసః = సంన్యాసము, (కారణములు).

తతః శ్రుతి స్తన్మననం సతత్త్వ
ధ్యానం చిరం నిత్యనిరంతరం మునేః.
తతోఽవికల్పం పరమేత్య విద్వా
నిహైవ నిర్వాణసుఖం సమృచ్ఛతి. 72

తతః = అటుపిమ్మట, శ్రుతిః = శ్రవణము, తన్మననం = వినిన దానియొక్క మననము, మునేః = మునియైన యాతనికి, చిరం = చిరకాలము, నిత్యనిరంతరం = నిత్యము, అవిచ్ఛిన్నమగు, సతత్త్వధ్యానం = ఆత్మతత్త్వధ్యానము (కారణములు), తతః = అటుపిమ్మట, (ఆ ధ్యానము వలన) పరం = గొప్పదైన, అవికల్పం = నిర్వికల్పసమాధిని, ఏత్య = పొంది, విద్వాన్ = ఆత్మసాక్షాత్కారమును పొందిన యాతడు, ఇహైవ = ఈ లోకమునందే, నిర్వాణసుఖం = మోక్షానందమును, సమృచ్ఛతి = పొందును.

దేహాది బ్రహ్మపర్యంతములగు అనిత్యవస్తువులయందు పరిపూర్ణ వైరాగ్యము మోక్షమునకు మొదటికారణమని చెప్పబడుచున్నది. అనేకవిధములగు విక్షేపమునకు హేతువగు ఆశతో శూన్యమైనపుడే మనస్సునకు తన లక్ష్యము స్థిరముగ నుండుట యను శమము లభించును. అటుపిమ్మట పూర్వోక్తలక్షణమగు శమము. 'చ' శబ్దము

పూర్వోక్తవిషయసముచ్చాయకము. (అవియు ఇదియుకూడ ఉండవలె నని యర్థము) వైరాగ్య - శమ - దమాదులలో పూర్వాపరభావము ఉన్నను (వైరాగ్యము మొదట, తరువాత శమము ఇత్యాదిక్రమ మున్నను) ఇవన్నియు అంతరంగములేగాన జ్ఞానకాలమునందుకూడ ఇవన్నియు ఉండవలసినదే. ఘటమునకు కులాలుడు కారణమైనను ఆ కులాలునికి కారణభూతుడగు ఆతని తండ్రి ఘటమునకు సంబంధించినంతవరకు కారణమని చెప్పుటకు వీలులేదు వానిని అన్యథాసిద్ధుడందురు. అట్లే ఇచటకూడ మొదటనున్నవన్నియు అన్యథాసిద్ధములని చెప్పరాదని సూచించుటకై సముచ్చయబోధకములగు 'చ' 'అపి' శబ్దములు ప్రయోగింపబడినవి. అట్లే దమము, తితిక్ష సర్వకర్మసంన్యాసము వర్ణాశ్రమముల ననుసరించి విహితము లగుటచే ప్రసక్తములగు సమస్తకర్మలును వైరాగ్యోత్పత్తి కలుగు నంతవరకును అనుష్ఠేయములే. వైరాగ్యము జనించిన పిమ్మట మాత్రము పూర్తిగా వాటిని పరిత్యజింపవచ్చును. పూర్వము, చిత్తశుద్ధియను నామాంతరముగల వైరాగ్యముకొరకై ఫలము నపేక్షింపక, ఈశ్వరార్పణబుద్ధితో కర్మలను చేయవలెను. ఇపుడు వైరాగ్యరూపఫలము లభించినది గాన వాటిని పూర్తిగా త్యజింపవచ్చునని భావము. తతః = సర్వకర్మసంన్యాసము చేసినపిమ్మట, శ్రుతిః = గురుముఖమునుండి వేదాన్తవాక్యముల శ్రవణము, వేదాన్తవాక్యార్థనిర్ణయముచేయుటకు తగు వ్యాపారము. తన్మననం = వినినవిషయము దృఢముగనిలచుటకై ఉపపత్తులతో చింతనముచేయుట. శ్రవణ మననములచే అసంభావనా సంశయభావనలు తొలగిపోయినపిమ్మట, సతత్త్వధ్యానం = పరతత్త్వముయొక్క ధ్యానము. అనాదికాలమునుండి వచ్చుచున్న అనాత్మను స్వాత్మగా భావించెడు వాసన తొలగిపోవలెనన్నచో ఆ ధ్యానమును చిరకాలముపాటు చేయవలెను. చిరకాలముపాటు చేసినను మధ్యమధ్య ఆపి ఆపి చేసినచో ఆ విచ్ఛేదకాలమునందు కలిగిన వృత్తులచే ఆత్మవృత్తి కప్పబడిపోవుటచే నిదిధ్యాసనమే

కుదురదు. అందుచే "నిత్యనిరంతరం" అని చెప్పబడినది. అందుచే_ "స తు దీర్ఘకాలనైరన్తర్యసత్కారా సేవితో దృఢభూమిః"_ఆ చిత్తవృత్తి నిరోధాభ్యాసము చాలకాలముపాటు, నిరంతరము బ్రహ్మచర్యాది సత్కారములతో సేవింపబడినచో దృఢమగును అని యోగసూత్రములో చెప్పబడినట్లు నిదిధ్యాసన మనునది రోజులలోనో, మాసములలోనో సిద్ధించునని వాంఛింపరాదు. అట్లు వాంఛించు ధ్యాత_ఉన్న వేదములు నాలుగేకదా ! వాటి అధ్యయనమునకై పిల్లవాడువెళ్ళి ఐదురోజులైనది అత డింకను రాలేదే ! అని అనుకొను మూఢునివంటివా డగును. ఇక నేమనగా సంవత్సరములకొలది, కొన్ని జన్మములపాటు ఆదరముతో ఎల్లప్పుడును సేవింపవలెను అని చెప్పుటకై 'చిరం' 'నిత్యనిరన్తరం' అను విశేషణములు ప్రయుక్తములు.

అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్_

అనేకజన్మలచే సిద్ధిని పొందినవాడై, అటుపిమ్మట ఉత్తమగతిని పొందును అని స్మృతివాక్యము. నిత్యము అవిచ్ఛిన్నముగ చాల కాలముపాటు నిదిధ్యాసనము ఈ జన్మయందే సిద్ధించినచో, తతః = పరిపక్వమైన ఆ నిదిధ్యాసనమువలన, అవికల్పం = నిర్వికల్ప సమాధిని, పరం = సవికల్పముకంటె ఉత్కృష్టమైన దానిని, పొంది, విద్వాన్ = ఆత్మసాక్షాత్కారవంతుడై, నిర్వాణసౌఖ్యం = ముక్తిసౌఖ్యము, సమృచ్ఛతి = అడ్డులేకుండగ అనుభవించును.

ఈ జన్మలోనే మోక్షమును పొందుటకు చెప్పవలసినవిషయము సంగ్రహముగ చెప్పబడినది. "విద్వాంసుడు, అనగా విద్యకలవాడు, ఇచటనే మోక్షసుఖమును పొందును" అని చెప్పుటచే 'ధనీ సుఖీ' — ధనముకలవాడు సుఖవంతుడు ఇత్యాది వాక్యములలో సుఖము ధనమువలన కలుగును అని తెలియునట్లు, విద్యవలన మోక్షమును పొందును అని తెలియుచున్నది. ఉద్దేశ్యవిధేయ భావస్థలమునందు, బాధకమేదియు లేనపుడు, ఉద్దేశ్యతావచ్ఛేదకము విధేయమునకు

కారణము అను నర్థము భాసించును- "ఉద్దేశ్యవిధేయభావస్థలే అసతి బాధకే ఉద్దేశ్యతావచ్ఛేదక ప్రయోజ్యత్వం విధేయే భాసతే" అను న్యాయము లోకసిద్ధము. 'ధన సుఖీ' అనునపుడు సుఖిత్వము విధేయము. ధనిత్వము ఉద్దేశ్యము. ధనము ఉద్దేశ్యతావచ్ఛేదకము, సుఖము విధేయతావచ్ఛేదకము. కావున ధనము విధేయతావచ్ఛేదకమగు, అనగా విధేయమగు సుఖమునకు కారణమని తేలినది. అట్లే ఇచట గూడ విద్వత్త్వము ఉద్దేశ్యతావచ్ఛేదకము. అది అనగా విద్య, నిర్వాణసుఖమునకు కారణమని తెలియుచున్నది. ఆ విద్య ఆత్మానాత్మ వివేకజన్య మగుటచే ముందుగ దానిని స్పష్టికరించుచున్నాడు. దీనిచే "కోసావనాత్మా పరమః క ఆత్మా" అను ప్రశ్నకు సమాధానము చెప్పిన ట్లగును.

యద్బోద్ధవ్యం తవేదానీ
మాత్మానాత్మవివేచనమ్,
తదుచ్యతే మయా సమ్యక్
శ్రుత్వాత్మ న్యవధార్యతామ్. 73

తవ = నీకు, ఇదానీం = ఇపుడు, యత్ = ఏ కారణమువలన, ఆత్మానాత్మవివేచనం = ఆత్మానాత్మల వివేచనము, బోద్ధవ్యం = తెలియ దగినదో, తత్ = ఆ కారణమువలన, మయా = నాచే, సమ్యక్ = బాగుగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది. శ్రుత్వా = విని, ఆత్మని = మనస్సులో, అవధారయ = నిశ్చయించుకొనుము.

నీకు, ఇదానీం = మోక్షహేతువగు జ్ఞానమునుగూర్చి బోధించుటకు పూర్వము, దానికి కారణముగ, ఆత్మానాత్మవివేచనం = ఇది ఆత్మ, ఇది అనాత్మ అని వేరువేరుగ తెలిసికొనుటకు తగిన వ్యాపారము, బోద్ధవ్యం = తెలియదగినది. తత్ = ఆ కారణమువలన నాచే అది బాగుగా చెప్పబడుచున్నది. దానిని విని మనస్సునందు నిశ్చయించుకొనుము.

అవ. అందు ఆత్మనుగూర్చి అనాత్మద్వారామాత్రమే తెలిసికొనవలసియున్నది. అనాత్మ స్థూలముగాన ముందుగ దానిని తెలిసికొనుట సులభము. అది తెలిసిన తరువాత సూక్ష్మమగు ఆత్మనుగూడ అనాయాసముగ తెలిసికొనవచ్చును. అందుచే ముందుగా—"అథ తే సంప్రవక్ష్యామి" అను (126 వ) శ్లోకము వరకును ఆత్మభిన్నములగు పదార్థములనుగూర్చి చెప్పుచున్నాడు. అందు ముందుగ అందరి బుద్ధికిని గోచరమగు స్థూలశరీరమునుగూర్చి చెప్పుచున్నాడు. అది "అహం", "అహం" (నేను, నేను) అను విస్పష్టమగు వ్యవహారమునకు గోచరమై అందరికిని తెలిసినదికదా ?

## స్థూలశరీరవర్ణనము

మజ్జాస్థిమేదః పలరక్తచర్మ
త్వగాహ్వయైర్ధాతుభి రేభిరన్వితమ్,
పాదోరువక్షోభుజపృష్ఠమస్తకై
రంగై రుపాంగై రుపయుక్తమేతత్. 74
అహం మమేతి ప్రథితం శరీరం
మోహాస్పదం స్థూలమితీర్యతే బుధైః.

మజ్జాత్వ....గాహ్వయైః = మజ్జా = మజ్జయు, అస్థి = ఎముకలు, మేదః = క్రొవ్వు, పల = మాంసము, రక్త = రక్తము, చర్మ = చర్మము, త్వక్ = సూక్ష్మచర్మము అను, ఆహ్వయైః = పేరుగల, ఏభిః = ఈ, ధాతుభిః = ధాతువులతో, అన్వితం = కూడినదియు, పాదోరు....మస్తకైః = పాద = పాదములు, ఊరు = తొడలు, వక్షః = వక్షఃస్థలము, భుజ = భుజములు, పృష్ఠ = పృష్ఠభాగము, మస్తకైః = శిరస్సు అనెడు, అంగైః = అవయవములతోడను, ఉపాంగైః = చిన్నఅవయవములతోడను, ఉపయుక్తం = కూడినదియు, అహం మమేతి = నేను, నాది అని, ప్రథితం = ప్రసిద్ధమైనదియు, మోహాస్పదం = అజ్ఞానమునకు ఆస్పదమైన, శరీరం = శరీరము, స్థూలమితి = స్థూలశరీరము అని, బుధైః = పండితులచే, ఈర్యతే = చెప్పబడుచున్నది.

"స్థూల - మధ్యమ - సూక్ష్మరూపమున పరిణమించుచున్న, భుజింపబడిన ఆహారముయొక్క" అని అంతటను అన్వయించుకొనవలెను. తేజఃపదార్థమగు ఘృతాదికముయొక్క మధ్యమభాగము మజ్జ. దానిస్థూలభాగము అస్థి (ఎముక). దానియొక్క పూర్వపరిణామము క్రొవ్వు. పలం=మాంసము. అది భుజించిన అన్నముయొక్క మధ్యమభాగము. త్రాగిన నీళ్లయొక్క మధ్యమభాగము రక్తము. స్థూలావరణము చర్మము. సూక్ష్మావరణము త్వక్కు. లోపలనున్నధాతువులను, నాడ్యాదులను ఏడు ఆవరణములు ఆవరించుచున్నవి ఈ ఆవరణములలో పైన ఉన్నవి బాహ్యములు; లోపలనున్నవి సూక్ష్మములు. మజ్జ మొదలగు పేర్లుగల ఏ ఏడుధాతువులు గలవో అట్టిధాతువులతో కూడినది, పాదములు మొదలగునవి ఆరు అంగములు. పాదములు, తొడలు, వక్షఃస్థలము, భుజములు, పృష్ఠము, శిరస్సు అను అంగములతోడను; ఇది హస్తములకు గూడ ఉపలక్షణము. మడమలు, మోకాళ్లు, పిక్కలు మొదలగు ఉపాంగములతోడను కూడినది; ఏతత్=ప్రత్యక్షముగా కనబడుచున్నది. 'నేను వెళ్లుచున్నాను, నిలచియున్నాను, దాటుచున్నాను, గ్రహించుచున్నాను' మొదలగు వ్యవహారముచేత 'అహం' (నేను) అను దానికి విషయమైనదియు, "నా యొక్క (మమ) పాదము, హస్తము, శిరస్సు, శరీరము" అని (మమకారాస్పదమై) ప్రసిద్ధమైన శరీరము, అనేకవిధములగు దోషములకు ఆశ్రయమైనను అతిప్రీతిమాస్పదమగుటచే, మోహాస్పదం=ఆత్మయను భ్రమకు ఆశ్రయమైనది అనగా విషయమైనది; స్థూలమని పండితులచే చెప్పబడుచున్నది. స్తంభములు గోడలు మొదలగునవి కలిసినచో గృహములగును. ఇట్టి గృహాదులుఎట్లు ఒక స్వామి భోగముకొరకై ఏర్పడినవో, అట్లే అనేక పదార్థములు కలియుటచే నేర్పడిన దేహము గూడ ఒక స్వామియొక్క భోగముకొరకే ఏర్పడినది అని సూచించుటకై మజ్జాస్థిత్యాదికము

చెప్పబడినది. దీనిచే శరీరము ఆత్మకంటె భిన్న మను విషయము చెప్పినట్లే, ఆత్మస్వామి; శరీరము ఆ ఆత్మయొక్క భోగమునకై ఉద్దిష్టమైనది.

అవ. ఈ శరీరము అనిత్యము. ఆ కారణమువలన గూడ ఇది నిత్యాత్మరూపము కాజాలదు అని చెప్పుటకై దీనికి (శరీరమునకు) కారణములను చెప్పుచున్నాడు—

నభోనభస్వద్దహనాంబుభూమయః
సూక్ష్మాణి భూతాని భవన్తి తాని. 75
పరస్పరాంశై ర్మిలితాని భూత్వా
స్థూలాని చ స్థూలశరీరహేతవః,

నభోనభస్వద్దహనాంబుభూమయః—నభః=ఆకాశము, నభస్వత్=వాయువు, దహన=అగ్ని, అంబు=జలము, భూమయః=భూమి అనునవి, సూక్ష్మాణి భూతాని=సూక్ష్మభూతములుగ, భవన్తి=అగుచున్నవి, తాని=అవియే, పరస్పరాంశైః=పరస్పరముయొక్క అంశములతో, మిలితాని=కలసినవై, స్థూలాని=స్థూలభూతములుగ, భూత్వా=అయి, స్థూలశరీరహేతవః=స్థూల శరీరమునకు కారణములు.

ఆకాశాదిభూతపంచకము మొదట జన్మించునపుడు సూక్ష్మరూపమున జనించును. వీటిని సృష్టించిన దేవతకు—"తాసాం త్రివృతం త్రివృతమేకైకాం కరవాణి"—వాటిలో ఒక్కొక్కదానిని మూడుమూడు అంశములు కలిసిన దానినిగా చేయుదును అను సంకల్పము కలుగుటచే ఒక్కొక్క భూతము పంచీకృతమగును, అనగా ఐదేసిఅంశములు కలదిగా అగును. తైత్తిరీయకశ్రుతి ననుసరించి ఆకాశవాయువులను ఛాందోగ్యోపనిషత్తులో మొదటచెప్పిన అగ్నికంటె పూర్వము చేర్చుకొనవలెను. అందుచే త్రివృత్కరణము పంచీకరణమునకు ఉపలక్షణము. "ఐదుభూతములను ఒక్కొక్క దానిని రెండుగా విభ

జించి, ఒక సగభాగమును అటు ఉంచి, మిగిలిన సగమును నాలుగు భాగములుచేసి ఇతరభూతముల సగముభాగములతో కలిపినచో పంచీకరణము జరుగును" అని భాష్యోక్త విధముగ పంచీకరణపద్ధతిని తెలియవలెను. ఈ విషయమును విద్యారణ్యగురుచరణులు పంచదశిలో ఒక శ్లోకమున సంగ్రహించియున్నారు.

ద్విధా విధాయ చైకైకం చతుర్ధా ప్రథమం పునః,
స్వస్వేతరద్వితీయాంశై ర్యోజనాత్ పంచ పంచ తే.

కావున ఒక్కొక్క స్థూలభూతమునందును, తనకు చెందిన సగము భాగము, ఇతరభూతముల ఎనిమిదవభాగమును ఉండును. ఈ విధముగ పరస్పరాంశములతో సంబంధించిన పిమ్మట గగనాదిశబ్దములతో వ్యవహరించుటకు తగిన స్థూలభూతములుగ నేర్పడిన ఈ పంచమహాభూతములు స్థూలశరీరమునకు కారణ మగుచున్నవి.

అవ: భూతముల ప్రసక్తివచ్చినదిగాన, వాటి ధర్మములగు శబ్దాదివిషయములను గూడ వాటిపై వైరాగ్యము కలుగుటకై చెప్పుచున్నాడు—

మాత్రాస్తదీయా విషయాభవన్తి
శబ్దాదయః పంచ సుఖాయ భోక్తుః. 76

తదీయాః=ఆకాశాదిభూతములకు సంబంధించిన, మాత్రాః=మాత్రలైన, పంచ=ఐదు, శబ్దాదయః=శబ్దముమొదలైన, విషయాః=విషయములు, భోక్తుః=భోక్తయగుజీవునకు, సుఖాయ భవన్తి=సుఖమును కలిగించుచున్నవి.

"మీయన్తే ఇతి మాత్రాః=ఇంద్రియగోచరములుగ చేయబడుచున్నవి, అనుభవింప బడుచున్నవి గాన మాత్రలు, తదీయాః=ఆకాశాదిభూతములకు సంబంధించిన; శబ్దాదయః=క్రమముగ శబ్ద-

స్పర్శ-రూప-రస-గంధములనెడు, పంచ విషయాః=ఐదువిషయములు. 'విషయ' శబ్దము బంధన మను నర్థముగల 'వి' పూర్వక 'షిఞ్' ధాతువునుండి నిష్పన్న మైనది. కావున విషయములు అనగా 'విశేషేణ సిన్వన్తి' అధికముగ బంధించునవి అని యర్థము. భోక్తుః=సంసారియగు జీవునియొక్క. సుఖాయ=సుఖాభాసమునకు మాత్రమే ఉపయోగించును. శాస్త్రమునందు అచ్చటచ్చట శబ్దాదులను పంచతన్మాత్రలని వ్యవహరించుట కలదు. అందుచే ఆ యా శాస్త్రగ్రంథములతో సంవాదముకొరకు (ఏకార్థత్వముకొరకు) 'మాత్రాస్తదీయాః' అని చెప్పబడినది.

అవ. అవి ఎట్లు బంధకములో ఇపుడు చెప్పుచున్నాడు_

యు ఏషు మూఢా విషయేషు బద్ధా
రాగోరుపాశేన సుదుర్దమేన,
ఆయాన్తి నిర్యాన్త్యధ ఊర్ధ్వముచ్చైః
స్వకర్మదూతేన జవేన నీతాః. 77

యే=ఏ, మూఢాః=మూఢులు, సుదుర్దమేన=తొలగింపరాని, రాగోరుపాశేన=రాగమనెడు గొప్పపాశముచే, విషయేషు=విషయముల యందు, బద్ధాః=కట్టబడినారో, వారు, స్వకర్మదూతేన=తమయొక్క కర్మయనెడు దూతచేత, జవేన=వేగముగా, నీతాః=నడిపింపబడినవారై, అధః=క్రిందికి, ఆయాన్తి=వచ్చుచుందురు; ఉచ్చైః+ఊర్ధ్వం=చాలపైకి, నిర్యాన్తి=వెడలుచుందురు.

ఏ, మూఢాః=వివేకరహితులు, ఏషు విషయేషు=ఈ శబ్దాది పంచవిషయములయందు సుదుర్దమేన=ఎంతోకష్టపడినగాని నిగ్రహించుటకు శక్యము కాని, రాగోరుపాశేన=రాగమనెడు గొప్ప పాశముచే; ఉరుపాశమనగా బంధించుటకు ఉపయోగించు దృఢమైన త్రాడు మొదలైనది. ఈ విషయములపై ఆసక్తి యనునదే దృఢమైన పాశము, దానిచే స్తంభమునకు పశ్వాదులవలె కట్టబడినవారై,

అనగా మిక్కిలి కామములు కలవారై, స్తంభమునకు కట్టిన పశువులు స్తంభమును విడచి ఎట్లు వెళ్లజాలవో అట్లే విషయాభిలాషకలవారు వాటిని వీడజాలక, వాటియందే ఆశకలవారై శ్రేయోమార్గమునుండి భ్రష్టు లగుచున్నారు అని చెప్పుచున్నాడు_ 'అయాన్తి' మొ॥ ధర్మా ధర్మరూపమగు తమకర్మ ఊర్ధ్వాధోగమనములకు హేతు వగుటచే దూతవలె నున్నది. న్యాయస్థానాదులలోనున్న దూత విచారణ చేయవలసినవారిని క్రిందికిని మీదికిని ఏ విధముగ తీసికొని వెళ్లుచుండునో అట్లే ఇదియు. శబ్దాదికము సుఖమును కలిగించునను ఉద్దేశముతో, అది లభించుటకై పుణ్యము నాచరించును. అపుడా పుణ్య కర్మ దివ్యశబ్దాదికమును అనుభవింపజేయుటకై వానిని ఉన్నతమగు స్వర్గాదిస్థానమును పొందించును. అచట పుణ్యము క్షీణింపగానే మరల క్రిందికి వచ్చుట ఉండనే ఉన్నది. చేసినది అధర్మమే యైనచో చెప్పవలసిన పనియే లేదు. సర్వదా అధోగమనమే. ఉచ్చైరూర్ధ్వం అయాన్తి = జన్మాంతరకృతమగు పుణ్యవశముచే మనుష్యాదిజన్మలను కలిగించును. మరల రాగము ఏర్పడగనే క్రిందికి పోవుదురు. ఈ విధముగ విషయాభిలాషకలవాడు తనకర్తవ్యములను మరచుటకు ఎక్కువ అవకాశ ముండుటచే ఈ బంధమునుండి తప్పించుకొనజాలడని భావము.

అవ. శబ్దాదులలో ఒక్కొక్కదానిని సేవించువారికే మృత్యుహేతువగు బంధము కనబడుచున్నది. ఐదింటిని సేవించువాని విషయము చెప్ప నేల అని, అవి హేయములని బోధించుటకై, దృష్టాంతపూర్వకముగ, చెప్పుచున్నాడు-

## విషయనింద

శబ్దాదిభిః పంచభిరేవ పంచ
పంచత్వమాపుః స్వగుణేన బద్ధాః,
కురంగమాతంగ పతంగమీన
**భృంగా నరః పంచభి రన్చితః కిమ్.** 78

కురంగ మాతంగ పతంగ మీన భృంగాః=లేడి, ఏనుగు, మిడుత, చేప, తుమ్మెద అనెడు, పంచ = ఐదు జంతువులు, శబ్దాదిభిః = శబ్దము మొదలగు, పంచభిః = ఐదింటిచే, (ఐదింటిలో ఒక్కొక్కదానిచే) స్వగుణేన = వాటి గుణముచే, బద్ధాః = కట్టబడినవై, పంచత్వం = మరణమును, ఆపుః = పొందినవి. పంచభిః = ఐదింటితోడను, అంచితః = కూడిన, నరః = మనుష్యుడు, కిం = (నశించునవి) చెప్పనేల?

కురంగాదులు ఐదును, స్వగుణేన = వాటివాటికి ఆసక్తిని కలిగించు గుణముచే, శబ్దము మొదలు గంధమువరకునుగల ఐదింటిలో క్రమముగ ఒక్కొక్కదానిచేతనే బంధింపబడినవై మరణమును పొందినవి. ఈ విధముగ ఒక్కొక్కటే మరణపర్యంతమగు బంధనమునకు కారణమైనచో ఈ ఐదింటితోడను కూడిన, అనగా ఈ ఐదింటియందును ఆసక్తుడైన, నరుడు మృత్యువును పొందునని వేరుగ చెప్పవలెనా అని యర్థము. హరిణము చపలస్వభావముగలది. అతిశీఘ్రముగ చాలదూరము పరుగెత్తగల్గినది. కాని దానికి వేణుగానాది మధురధ్వనులయందు ఆసక్తి యధికము. అందుచే దానిని పట్టదలచినవారు వేణుగానాదులచే దానిని మైమరపించి, కదలకుండునట్లుచేసి, పట్టుకొందురు. ఈ విధముగ శబ్దమొక్కటి మాత్రమే హరిణబంధహేతువగు చున్నది. వనమధ్యమున స్వేచ్ఛగ విహరించు, పట్టశక్యముకాని మహాగజముగూడ సుఖస్పర్శయందు ఆసక్తి కలదగుటచే, ఆడుఏనుగును చూపి బంధింపబడుచున్నది. ఈ విధముగ త్వగింద్రియమునకు తృప్తి కలిగించు ఒక్క స్పర్శమే అంతటి యేనుగును బంధించివేయుచున్నది. దీపమునందలి భాస్వరరూపమును జూచి, ఏదియో భక్ష్యమని భ్రాంతిచెంది, అది కాల్చునని తెలియక మిడుత ఆ దీపముపై పడి మరణించుచున్నది గాన రూపము మృత్యుహేతువను విషయము ప్రసిద్ధము. ఇట్లే రసము నాస్వాదింప నాసక్తిగల చేప జాలరి విసరిన వలలో చిక్కుకొని మరణించునను విషయము ప్రసిద్ధము. ఘ్రాణేంద్రియమును ఆనందింపజేయుటకై ప్రయత్నించు

తుమ్మెద ఇతరపుష్పములను వలె చంపకపుష్పమునుగూడ ఆఘ్రాణించి దాని వాసనను సేవించుటచే మరణించుచున్నది. ఈ విధముగ శబ్దాదులలో ఏ ఒక్కదానిని సేవించినను మరణాంతమగు అనర్థము కలుగుచున్నది. ఈ తిర్యగ్జంతువులకు పాపమనునది లేదుగాన తాత్కాలికముగ వాటి శరీరమునకు మాత్రమే అనర్థము కలుగుచున్నది. శబ్దాదివిషయముల నైదింటిని సేవించుటకై విహితకర్మను ఆచరింపక పాపాచరణముకూడ చేయు నరుడు లోకద్వయము నుండియు భ్రష్టు డగుచున్నా డని భావము.

అవ. విషయములను అనుభవించుటవలన మృత్యువు కలుగును అను విషయము అటుండ, దర్శనమాత్రముచే గూడ నశింపజేయుచున్న విషయములు కృష్ణసర్ప విషముకంటెగూడ చెడ్డవి అని చెప్పుచున్నాడు-

దోషేణ తీవ్రో విషయః కృష్ణసర్పవిషాదపి,
విషం నిహన్తి భోక్తారం ద్రష్టారం చక్షుషాప్యయమ్. 79

విషయః=విషయము, కృష్ణసర్పవిషాదపి=కృష్ణసర్పవిషముకంటె గూడ, దోషేణ=దోషముచేత, తీవ్రః=తీవ్రమైనది; విషం=విషము, భోక్తారం=భోక్తను మాత్రమే, నిహన్తి=చంపును; అయం=ఈవిషయము, చక్షుషా=నేత్రముచేత, ద్రష్టారం అపి=చూచినవానినిగూడ, నిహన్తి= చంపును.

విషయః=రూపాదివిషయము, కృష్ణసర్పముయొక్క విషము కంటెగూడ దోషముచే తీక్ష్ణమైనది. కృష్ణసర్పవిషమునందు ఎంతటి మారకత్వరూపదోషమున్నదో దానికంటె గూడ విషయమునందు దోషము తీక్ష్ణమైనది. అందులకు హేతువు-"విషం నిహన్తి" మొ॥ కృష్ణసర్పము కరచినపుడు దాని విషము నాడుల ద్వారా పురుషుని జిహ్వను చేరునుగాన అతడు 'భోక్తా' యని చెప్పబడినాడు. కావుననే

కాలు మొదలగు ప్రదేశములలో పాము కరచినపుడు ఆ ప్రదేశము నందు త్రాడు మొదలగువాటిచే గట్టిగా కట్టినచో ఆ విషము నాడుల ద్వారా జిహ్వావరకును ఎక్కదుగాన మరణింపరు. ఈ విధముగ విషము భోక్తను, నిహన్తి= లేనివానినిగ చేయును. ఈ విషయమో నేత్రముతో చూచిన వానిని గూడ చంపును. సుందరమగు రూపాది కమును జూచి జనులు కలహించి నశించుచుందురనుట లోకప్రసిద్ధమే కదా! కలహాదులు లేనిపక్షమున గూడ, మానవుడు విషయముచే మిక్కిలి ఆకర్షింపబడిన చిత్తము కలవాడై తన ఆత్మనుగూర్చి తెలిసి కొనజాలడు. అందుచే విషయము, తప్పక, ఆత్మజ్ఞానము కలుగ కుండుటను చేయు వ్యాపారము కలదిగ నుండునని భావము. ఈ విధముగ 'నిహన్తి' అనుదానికి అసత్త్వాపాదక(లేకుండునట్లుచేయు) వ్యాపారము లేదా అభానాపాదక (ఆత్మభానము లేకుండునట్లు చేయు) వ్యాపారము అని యర్థము. యోగ్యతానుసారముగ అర్థమును గ్రహింపవలెను. అసత్త్వాపాదక వ్యాపారము అభానా పాదక మగుట సిద్ధమే. (మనిషియే లేకుండ పోయినపుడు ఆత్మ జ్ఞానము ప్రశ్న ఏది?) అభానాపాదక వ్యాపారము మాత్రము అసత్త్వాపాదకము కాదు. వాస్తవమున విషయాకృష్టచిత్తుడగు పురుషుడు ఉన్నను, పురుషార్థోపయోగము లేకపోవుటచే లేనివానితో సమానుడు అని కూడ చెప్పవచ్చును.

అవ. ఈ విధముగ అత్యంతము అనర్థకరమగు విషయము నందుగూడ, పురుషుడు, సరియగువిచారణ లేకపోవుటచే ఆశావంతు డగుచున్నాడు. మూఢుడై అందలిదోషమునుగూడ లెక్కచేయుట లేదు. ఆ విధముగ పరమ పురుషార్థమునుండి భ్రష్టు డగుచున్నాడు. కావున ముముక్షువు సర్వవిధముల విషయాశను పరిత్యజింపవలెను. అట్లు కానిచో ఆరుశాస్త్రములందు మంచి అర్థజ్ఞానము సంపాదించి నను మోక్షము దుర్లభమని చెప్పుచున్నాడు-

విషయాశామహాపాశాద్యో విముక్తః సుదుస్త్యజాత్,
స ఏవ కల్పతే ముక్త్యై నాన్యః షట్ఛాస్త్రవేద్యపి. 80

యః = ఎవడు, సుదుస్త్యజాత్ = త్యజించుటకు చాల కష్టమైన, విషయాశామహాపాశాత్ = విషయాశయనెడు మహాపాశమునుండి, విముక్తః = ముక్తుడైనాడో, సః ఏవ = అతడు మాత్రమే, ముక్త్యై కల్పతే = మోక్షము పొందుటకు సమర్థుడగును, అన్యః = ఇతరుడు, షట్ఛాస్త్రవేద్యపి = ఆరు శాస్త్రములు తెలిసినవాడైనను, న = సమర్థుడు కాడు.

ఏ పురుషుడు, సుదుస్త్యజాత్ = చిరకాలమునుండి అలవాటులో నున్నదగుటచే దృఢవిచారము లేకుండగ విడచుటకు శక్యముకాని, విషయాశామహాపాశాత్ = విషయాశయే గట్టిగ బంధించునదగుటచే మహాపాశము, దానినుండి పూర్తిగ విడవబడినవాడో, పూర్తిగ దాని సంబంధము తొలగినవాడో అని యర్థము. అతడే మోక్షమును పొందుటకు సమర్థుడగును. అన్యః = ఆ ఆశాపాశముచే బద్ధుడైనవాడు షట్ఛాస్త్రవేత్తయైనను ముక్తుడు కాజాలడు.

అవ. విషయములందు తీవ్రవైరాగ్యము లేనిచో కల్గు అనర్థమును చెప్పుచున్నాడు-

ఆపాతవైరాగ్యవతో ముముక్షూన్
భవాబ్ధిపారం ప్రతియాతు ముద్యతాన్,
ఆశాగ్రహో మజ్జయతేఽన్తరాలే
నిగృహ్య కణ్ఠే వినివర్త్య వేగాత్. 81

ఆపాతవైరాగ్యవతః = అస్థిరమైన వైరాగ్యము కలిగినట్టియు, భవాబ్ధిపారం = సంసారసముద్రాంతమును, ప్రతియాతుం = పొందుటకు, ఉద్యతాన్ = ఉద్యుక్తులైన, ముముక్షూన్ = మోక్షేచ్ఛకలవారిని, ఆశాగ్రహః = ఆశయనెడు మొసలి, అంతరాలే = మధ్యయందు, కంఠే = కంఠమునందు, నిగృహ్య = పట్టుకొని, వేగాత్ = వేగముగా, వినివర్త్య = మరల్చి, మజ్జయతే = ముంచివేయును.

ఆపాతవైరాగ్యవతః = దుఃఖాదులు కలిగినపుడు "ఛీ! ఈ సంసారము చెడ్డది" అని వైరాగ్యము కలవారును; నిత్యమైన వైరాగ్యబుద్ధిలేనివారని తాత్పర్యము; సంసార సాగరాంతమును చేరగోరిన, అందుకు కారణము 'ముముక్షూన్' అనునది. మోక్షేచ్ఛ కలవారగుటచే సంసారసముద్రమును దాటుటకు ప్రయత్నించు చున్నవారు; అట్టి పురుషులను, ఆశయను మొసలి, సముద్రమధ్యమున గట్టిగ పట్టుకొని, సంసారసముద్రమును దాటకుండగనే వెనుకకు మరల్చి ముంచివేయును. అనగా వారిని కర్మాద్యాచరణమునందు ప్రేరేపించును. పూర్తిగ విషయవైరాగ్యము కలిగినవాడు శమాది గుణగణమండితుడై సద్గురువును సమీపించి, ఆతని ముఖమునుండి ఆత్మనుగూర్చి బాగుగ తెలిసికొని సంసారమునుండి విముక్తుడగును. కాని ఈ ఆపాతవైరాగ్యవంతుడు, ఆ విధముగ ప్రయత్నించినను, దృఢమైన శాంత్యాదికము లేకపోవుటచే మధ్యయందు ఆశచే పీడితుడై పరమపురుషార్థమునుండి భ్రష్టుడగును. జ్ఞానార్హుడు కాడు అని భావము.

అవ. పూర్వోక్త విషయమునే వ్యతిరేకముఖమున చెప్పుచున్నాడు-

విషయాఖ్యగ్రహో యేన సువిరక్త్యసినా హతః,
స గచ్ఛతి భవాంభోధేః పారం ప్రత్యూహవర్జితః. 82

యేన = ఎవనిచేత, విషయాఖ్యగ్రహః = విషయమనెడు మొసలి, సువిరక్త్యసినా = మంచివైరాగ్యమనెడు కత్తితో, హతః = చంపబడినదో, సః = అతడు, ప్రత్యూహవర్జితః = విఘ్నములులేనివాడై, భవాంభోధేః = సంసారసముద్రముయొక్క, పారం = అంతమును, గచ్ఛతి = పొందును.

విషయమనెడు మొసలి ఏ పురుషునిచే, సువిరక్త్యసినా = మంచివైరాగ్యము అనగా దృఢతరమైన తీవ్రవైరాగ్యము, అదియే ఖడ్గము-దానిచే నశింపచేయబడినదో ఆ పురుషుడు, సంసారసాగరమును దాటుటలో విఘ్నములులేనివాడై భవాంబోధేః = జన్మ

మరణాది కల్లోలములతో వ్యాకులమైన సంసారసముద్రముయొక్క, పారం = అంతమును, అనగా

సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్.

ఆతడు మార్గముయొక్క అంతమును, విష్ణువుయొక్క పరమపదమును, అను శ్రుతిననుసరించి, బ్రహ్మను పొందును అని యర్థము. బ్రహ్మ సాక్షాత్కారము పొంది ముక్తు డగునని భావము.

అవ. శ్రు. యస్త్వవిజ్ఞానవాన్భవతి అమనస్కః సదాఽశుచిః,
న స తత్పదమాప్నోతి సంసారం చాధిగచ్ఛతి,
యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః,
స తు తత్పదమాప్నోతి యస్మాద్భూయో న
జాయతే.

ఎవడు విజ్ఞానములేనివాడై, మనోనిగ్రహములేనివాడై, సర్వదా అశుచియైయుండునో అతడు ఆ స్థానమును పొందడు. సంసారమును కూడ పొందును. ఎవడు విజ్ఞానవంతుడై, నిగృహీతమనస్కుడై, సర్వదా శుచియై యుండునో ఆతడు దేనిని చేరిన పిదప మరల జన్మ పొందడో అట్టి పదమును పొందును అని కఠోపనిషత్తునందు ప్రతిపాదితమగు అర్థమును, వెనుకటి రెండు శ్లోకముల సారమును క్రోడీకరించి ఉపదేశించుచున్నాడు–

విషమవిషయమార్గే గచ్ఛతోఽనచ్ఛబుద్ధేః
ప్రతిపద మభిఘాతో మృత్యురప్యేష సిద్ధః,
హితసుజనగురూక్త్యా గచ్ఛతః స్వస్య యుక్త్యా
ప్రభవతి ఫలసిద్ధిః సత్యమిత్యేవ విద్ధి. 83

విషమవిషయమార్గే = ఎగుడు దిగుడుగా నుండెడు విషయమార్గము నందు, గచ్ఛతః = నడచెడు, అనచ్ఛబుద్ధేః = అపరిశుద్ధమైన మనస్సు కలవానికి, ప్రతిపదం = అడుగడుగునను, అభిఘాతః = విఘ్నము; ఏషః = ఈ, మృత్యుః అపి = మృత్యువుకూడ, సిద్ధః = సిద్ధమైనది: హితసుజన

గుర్వాక్త్యా = హితులైన సుజనులయొక్కయు గురువుయొక్కయు ఉపదేశముచేతను, స్వస్య = తనయొక్క, యుక్త్యా = యుక్తిచేతను, గచ్ఛతః = వెళ్లుచువానికి, ఫలసిద్ధిః = ఫలసిద్ధి, ప్రభవతి = కలుగును, సత్యమిత్యేవ = సత్యమే అని, విద్ధి = తెలిసికొనుము.

విషమః = అనేకవిధములగు విక్షేపములకు హేతువైనదియు అత్యన్తదుఃఖజటిలమును అగు, యః = ఏ, విషయః = శబ్దాదివిషయముకలదో, అదియే మార్గము. శ్రు. "విషయాంస్తేషు గోచరాన్" _ విషయములను ఆ ఇంద్రియములకు మార్గములనుగా తెలిసికొనుము అని కఠశ్రుతి. ఆ మార్గమున ప్రయాణము చేయుచున్నవాడును, కావుననే, అనచ్ఛబుద్ధేః = అపరిశుద్ధమైన మనస్సుకలవానికి, _మనస్సు శుద్ధమైనచో అది విచారశీలమై తప్పక విషయములనుండి మరలును_ రజస్తమోభూయిష్ఠమగుటచే మనస్సు విచారము చేయుటకు అసమర్థమైయుండును.

యథా వ్యాలగలస్థోఽపి భేకః దంశానపేక్షతే,
తథా కాలాహినా గ్రస్తో లోకో భోగానశాశ్వతాన్.

సర్పము నోటిలోనున్న కప్ప దోమలకై ఎదురుచూచుచున్నట్లు కాలసర్పమునోటిలోనున్న లోకము అశాశ్వతములగు భోగములను కోరుచుండును అని చెప్పిన రీతిగ అట్టి మనస్సు విషయాసక్తమైయుండును. ఇట్టి అపరిశుద్ధమనస్సునకు అడుగడుగున, అభిఘాతః = ఎల్లప్పుడు మిక్కిలి కష్టములతో సంబంధము, ఏషః = అనుభవసిద్ధమగు, మృత్యురపి = మృత్యుఘటితసంసారమును, "మన ఏవ మనుష్యాణాం" ఇత్యాదిపూర్వోదాహృతశ్లోకమున (9) చెప్పిన విధమున, సిద్ధమై యుండును. భగవద్గీతలోకూడ చెప్పబడినది_

ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే.
క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్స్మృతి విభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి.

విషయములను గూర్చి ఆలోచించువానికి వాటిపై ఆసక్తి ఏర్పడును. ఆసక్తివలన కామము కలుగును. కామమువలన క్రోధము జనించును. క్రోధమువలన మోహము, మోహమువలన స్మృతిభ్రంశము, స్మృతిభ్రంశమువలన బుద్ధినాశము కలుగును. బుద్ధినాశమువలన అతడు నశించును. ఇచటనున్న 'ప్రణాశ' శబ్దము 'ణశ అదర్శనే' అను ధాతువునుండి నిష్పన్నమైనది. దానికి "స్వస్వరూపసాక్షాత్కారము లేకపోవుట" అను నర్థము సూచిత మగుచున్నది. ఈ శ్లోకమునందలి 'మృత్యు' పదమునకు 'ప్రణాశ' శబ్దమునకు చెప్పిన అర్థమునైనను చెప్పవచ్చును. దేనిచేతనైనను అభిహతమగు (విఘ్నితమగు) కామమే క్రోధరూపమున పరిణత మగునుగాన గీతలో చెప్పిన కామాభిఘాత మను అర్థమునే ఇచట నున్న 'ప్రతిపదమభిఘాతః' అను దానికి చెప్పవచ్చును. కోరిన విషయానుభవమెల్ల లభించుట శక్యము కాదు కదా? కోరికకు అడ్డుతగిలినపుడు ఆలోచనావిహీనుడగు పురుషుడు క్రోధాదిక్రమమున వినాశము చెందునని భావము. ఈ విధముగ వైరాగ్యములేనివానికి కలుగు ఫలమును చెప్పి హితజనేత్యాది వాక్యముచే, వైరాగ్యవంతునకు కలుగు ఫలమునుగూర్చి చెప్పుచున్నాడు. హితాః = శ్రేయస్కాములైనవారు, కావుననే సుజనాః = సత్పురుషులైన మిత్రాదులు; వారియొక్కయు, గురువుయొక్కయు ఉపదేశముచే; గురువు హితుడు, సుజనుడు అను విషయము నిశ్చితమే. గురువులభించువరకు సుజనోక్తి, తరువాత గురూక్తియని విభాగము. లేదా — హితా = ఎల్లప్పుడును శ్రేయోహేతువగు, ఏ సుజనుల యొక్కయు గురువుయొక్కయు ఉక్తి కలదో దానిచేతను, ఆ ఉక్తివలన లభించిన, తనయొక్క, యుక్త్యా = సుజనగురూక్తుల ననుసరించిన ఊహాపోహలచేతను, వెళ్ళుచున్నవానికి శ్రు. 'పణ్డితో మేధావీ గాంధారానే వోపసంపద్యేత ఏవమేవే హాచార్యవాన్ పురుషో వేద" — మేధావియగు పండితుడు ఏ విధముగ గాంధారదేశమునే చేరునో అట్లే

ఆచార్యవంతుడగు పురుషుడు (యుక్తులచే ఆత్మను తెలిసికొనును)అని శ్రుతికూడ చెప్పుచున్నది. శ్రేయోమార్గమున నడచువానికి మాత్రమే, ఫలసిద్ధిః = పరమపురుషార్థమగు మోక్షముయొక్క ప్రాప్తి, ప్రభవతి = ప్రకర్షతో నిర్విఘ్నముగ కలుగును. సత్యమిత్యేవ విద్ధి=ఈ విషయమున సందేహ మే మాత్రమును చేయకుము అని భావము.

అవ. 'మాత్రాస్తదీయాః' అనుశ్లోకము మొదలు ఇంతవరకును విషయములు బంధహేతువులు అని నిరూపించుటకు ఫలమును చెప్పుచున్నాడు. లేదా– ఇపుడు ముముక్షువు వేటిని విడువవలెనో, వేటిని గ్రహింపవలెనో ఉపదేశించుచున్నాడు–

మోక్షస్య కాంక్షా యది వై తవాస్తి
త్యజాతిదూరా ద్విషయాన్ విషం యథా,
పీయూషవ త్తోషదయాక్షమార్జవ
ప్రశాన్తిదాన్తీ ర్భజ నిత్యమాదరాత్. 84

తవ = నీకు, మోక్షస్య వై = మోక్షము యొక్కయే, కాంక్షా = కోరిక, అస్తి యది=ఉన్నచో, విషయాన్=విషయములను, విషం యథా= విషమునువలె, అతిదూరాత్ = చాలదూరముగ, త్యజ= విడిచిపెట్టుము, తోష....దాన్తీః, తోష = సంతుష్టి, దయా =దయ, క్షమా=ఓర్పు, ఆర్జవ= ఋజుత్వము, ప్రశాన్తి = శాంతి, దాన్తీః = ఇంద్రియనిగ్రహములను, ఆదరాత్ = ఆదరపూర్వకముగా, పీయూషవత్ = అమృతమునువలె, నిత్యం = ఎల్లప్పుడును, భజ = సేవింపుము.

ముందుగ విడువదగిన దానినిగూర్చి చెప్పుచున్నాడు. 'వై' అనునది అవధారణార్థకము. నీకు మోక్షముయొక్క మాత్రమే ఇచ్ఛ ఉన్నచో శబ్దాదివిషయములను హాలాహలవిషమునువలె అతిదూరముగ విడిచిపెట్టుము. మనస్సునందుగూడ స్మరింపకుము. కావుననే సూతసంహిత–

అకుర్వన్నపి విధ్యుక్తం నిషిద్ధం పరివర్జయేత్,
నిషిద్ధపరిహారేణ విహితేలభతే మతిమ్.

విధింపబడిన కర్మను చేయకున్నను, నిషిద్ధమును మాత్రము వర్జింప వలెను. నిషిద్ధమైనదానిని పరిహరించుటచే విహితకర్మయందు బుద్ధి కలుగును అని చెప్పుచున్నది. గ్రహింపదగినవానిని చెప్పుచున్నాడు– తోషః=సంతోషము. దయా=కరుణ. క్షమా=ఓర్పు ఆర్జవం=చిత్తమునందు కుటిలత్వము లేకుండుట, ప్రశాన్తిః= అత్యధికమగు శమము, దాన్తిః=బాహ్యేంద్రియనిగ్రహము; తోష దయాక్షమార్జవములు అంతఃకరణధర్మములు. "అశాన్తస్య కుతః సుఖమ్" శాన్తిలేనివానికి సుఖ మెక్కడిది? అను గీతావచనము ననుసరించి, శమము లేనిచో సంతోషాదులు ఉండుటకు అవకాశము లేదు గాన అవి యన్నియు శమాధీనములే యని సూచించుటకై 'ప్రశాన్తి' అని 'ప్ర' అను ఉపసర్గతోగూడిన శాంతిపదప్రయోగము చేయబడినది. వీటిని అమృతమునువలె ఎల్లప్పుడు ఆదరాత్= అత్యంతవిశ్వాసముతో, భజ=సేవింపుము.

అవ. ఈ విధముగ మోక్షసాధనముగా విషయవైరాగ్యము దృఢముచేయబడినది. ఆ విషయములపై ఆశ ఏ స్థూలశరీరమునుబట్టి ఏర్పడినదో దానిని అనాత్మ యని ముందుగ చూపించవలసి యున్నది. దానిపై ఆసక్తిని విడచినచో విషయవైరాగ్యము సులభమను అభిప్రాయముతో ముందుగ శరీరముపై ఆసక్తిని విడువవలెను అని చెప్పుచున్నాడు–

## దేహాసక్తినింద

అనుక్షణం యత్పరిహృత్య కృత్య
మనాద్యవిద్యాకృతబన్ధమోక్షణమ్,
దేహః పరార్థోఽయ ముముష్య పోషణే
య స్సజ్జతే స స్వమనేన హన్తి. 85

యత్ = ఏ స్థూలశరీరమును, పరిహృత్య = పరిహరించి, అనుక్షణం = ప్రతిక్షణమునందును, అనాద్యవిద్యాకృతబన్ధవిమోక్షణం = అనాద్యవిద్యచే నేర్పడిన బంధముయొక్క మోక్షణము, కృత్యం = చేయదగినదై ఉన్నదో, అయం దేహః = ఈ స్థూలదేహము, పరార్థః = పరులకొరకై ఉద్దిష్టమైనది; యః = అతడు, అముష్య = దీనియొక్క, పోషణే = పోషణమునందు, స్సజ్జతే = ఆసక్తుడగునో, సః = అతడు, అనేన = ఈ శరీరముతో, స్వం = తననే, హన్తి = చంపుచున్నాడు.

యత్ = ఏ స్థూలశరీరమును, పరిహృత్య = తాదాత్మ్యాధ్యాసమునుండి (అదే నేను అను అధ్యాసమునుండి) దూరముచేసి, అనాద్యవిద్యాబన్ధమోక్షణం = అనాదియగు ఏ మూలావిద్యకలదో దానిచే చేయబడిన అహంకారాది దేహాంతమగు బంధముయొక్క పరిత్యాగము, అనుక్షణం = ఎల్లప్పుడును, చేయదగినదై, 'అస్తి 'అని అధ్యాహారము. మిక్కలి స్థూలముగ గనబడుచున్న ఈ శరీరవిషయమున ముందుగ అహంభావమును విడచిన పిమ్మట గదా ప్రాణాదులవిషయమున దానిని విడచుటకు వీలగును అని భావము. "అయం దేహః పరార్థః" అను వాక్యముచే దేహము అనాత్మయను విషయమును స్పష్టీకరించుచున్నాడు. ఈ విషయము 'మజ్జాస్థి' ఇత్యాదిశ్లోకమున (74) విశదీకరింపబడినది. అందుచే, అనేకవస్తువుల సంఘాతమగుటచే అనాత్మయగు ఈ శరీరమును పోషించుటయందు ఎవ్వడు ఆసక్తుడై, స్వాత్మను మరచి ఈ దేహమే నేను అని విశేషాభిమానముతో దానిని రక్షించుటకై ఎక్కువగ ప్రయత్నించునో, అతడు, స్వం = స్వాత్మను, ఈ స్థూలశరీరముతో హింసించుచున్నాడు. నిజస్వరూపము తెలియకుండునట్లు చేయుచున్నాడు అని అర్థము. ఏ నిజస్వరూపభావముచే ముక్తుడగునో దానికి ప్రతిబంధకమగు స్థూలదేహాభిమానముచే దాని జన్మమరణాది ధర్మములు స్వాత్మకే యున్నవని భావించి ఎల్లప్పుడును దుఃఖమును అనుభవించును అని భావము.

అవ. లోకమున నదిని దాటదలచినవారు, నదిలో తేలుచున్న దృఢమగు దారువునుపట్టుకొని, దానిసాహాయ్యముతో, తాము నదిలో మునుగక నదిని దాటుదురు. అంతియేకాని తేలుచున్న మొసలిని పట్టుకొని దాటుటకై ఇచ్ఛగింపరు. అట్లైనచో నదిలో మకరగ్రస్తులై వారు మరణించుట నిశ్చితము. అట్లే శరీరపోషణమునం దాసక్తి కల వానికి ఆత్మదర్శనము కలుగకుండుటయే కాక దానిపై ఆతని అభిమానము బలీయమై ఆతనిని సంసారసముద్రమున ముంచివేయును అని చెప్పుచున్నాడు -

శరీరపోషణార్థీ సన్ య ఆత్మానం దిదృక్షతే,
గ్రాహం దారుధియా ధృత్వా నదీం తర్తుం స ఇచ్ఛతి.86

శరీరపోషణార్థీ సన్=శరీరపోషణమును కోరుచు, యః=ఎవ్వడు ఆత్మానం = ఆత్మను, దిదృక్షతే = సాక్షాత్కరించుకొనవలెనని ఇచ్ఛించునో, సః = ఆతడు, దారుధియా = కట్టయనెడు బుద్ధితో, గ్రాహం = మొసలిని, ధృత్వా = ధరించి. నదీం = నదిని, తర్తుం = దాటుటకై, ఇచ్ఛతి = ఇచ్ఛగించుచున్నాడు.

శరీరపోషణార్థీ = శరీరపోషణమును కోరెడు స్వభావము కలవాడు-అనగా ఎల్లప్పుడును శరీరమును పోషించుటయందే వ్యగ్రుడై ఏ నరుడు, ఆత్మానం = స్వస్వరూపమును, దిదృక్షతే = సాక్షాత్కరించుకొనుటకు ఇచ్ఛగించునో, వానికి, కట్టయనెడు భ్రాంతితో మొసలిని పట్టుకొనిన వానికి నదీతరణము ఎట్లు అశక్యమో అట్లే ఆత్మసాక్షాత్కారము అసంభావ్యము అని భావము.

అవ. కావున వివేకవంతుడు ముక్తికొరకై శరీరమోహమును విడచిపెట్టవలెను అని చెప్పుచున్నాడు -

మోహ ఏవ మహామృత్యు ర్ముముక్షో ర్వపురాదిషు,
మోహో వినిర్జితో యేన స ముక్తిపద మర్హతి. 87

ముముక్షోః=మోక్షముపొందగోరువానికి, వపురాదిషు = శరీరాదుల యందు, మోహ ఏవ = మోహమే, మహామృత్యుః = గొప్పమృత్యువు, యేన = ఎవనిచే, మోహః = మోహము, వినిర్జితః = జయింపబడినదో, సః = అతడు, ముక్తిపదం = మోక్షమార్గమును గూర్చి, అర్హతి = తగి యున్నాడు.

వపురాదిషు = శరీర-భార్యా-పుత్రాదులయందు, మోహ ఏవ= అహంకారమమకారములే, ముముక్షువునకు మహామృత్యువు. మరణిం చినవాడు ఏ విధముగ ఏ పనిని చేయజాలడో అట్లే శరీరాదులయందు అహంమమాభిమానములుగల ముముక్షువు మోక్షము సంపాదింపజాల డని యర్థము. ఎవనిచే శరీరాదులయందు అహంకారాదిరూపమగు మోహము విడువబడినదో ఆతడే ముక్తిపదమునకు తగినవాడు; అతడే మోక్షమును పొందునని యర్థము.

అవ. అందువలన మోహమును విడువుము అని ఉపదేశించు చున్నాడు-

మోహం జహి మహామృత్యుం దేహదారసుతాదిషు,
యం జిత్వా మునయో యాన్తి తద్విష్ణోః పరమం పదమ్. 88

మునయః = మునులు, యం= ఏ మోహమును, జిత్వా = జయించి తత్ = ఆ, విష్ణోః = సర్వవ్యాపకమగు బ్రహ్మయొక్క, పరమం పదం= ఉత్తమస్థానమును, యాన్తి = పొందుదురో, (తం= అట్టి), దేహదారసుతా దిషు = దేహభార్యాపుత్రాదులయందు, మోహం = మోహమనెడు, మహా మృత్యుం=మహామృత్యువును, జహి = నశింపజేయుము.

మునయః = మననస్వభావముకలవారు, దేహాదికమునందు తాదాత్మ్యాభిమానరూపమగు ఏ మోహమును, అది చాలకాలము

నుండి దృఢమైన మూలము కలదైనను, గురువు చూపినయుక్తిచేతను, శ్రుతిసహాయముచేతను పూర్తిగ విడచి, తత్ = శ్రుతిప్రసిద్ధమైన విష్ణోః పరమం పదం – విష్ణువునకును పదమునకును భేదములేకున్నను 'రాహువుయొక్క శిరస్సు' అనునట్లు భేదకల్పనచే షష్ఠీప్రయోగము, వ్యాపకమైన అనగా దేశకాల వస్తు పరిచ్ఛేదములనెడు పరిచ్ఛేదత్రయ ములేని, సర్వోత్కృష్టమైన బ్రహ్మరూపమగు స్థానమును, యాన్తి = అభేదరూపమున పొందుచున్నారో, బ్రహ్మగ అయి ముక్తు లగు చున్నారో అని యర్థము. అట్టి దేహదారసుతాదులయందు, ఆది పదముచే మిత్రధనాదులను గ్రహింపవలెను, వాటియందు మోహం = భ్రాంతిని, నీకు, మహామృత్యుః = స్వస్వరూపమునుండి పూర్తిగ దూరముచేయుటచే నీవు కనబడకుండచేయుదానిని, జహి = వేదాన్తార్థ విచారణచే నశింపజేయుము.

అవ. మిక్కిలి అశుద్ధములగు పదార్థములతో నిండియుండుటచే దూరముగ విడువదగినదియు, ఏ మాత్రముకూడ అభిమానము చూప దగని స్థూలదేహమునందు జుగుప్సచే, ఇది హేయము అను బుద్ధిని దృఢీకరించుచున్నాడు–

## స్థూలశరీరము

త్వఙ్మాంస రుధిర స్నాయు మేదో మజ్జాస్థి సంకులమ్,
పూర్ణం మూత్రపురీషాభ్యాం స్థూలం నిన్ద్య మిదం వపుః.89

త్వఙ్మాంస....సంకులం = త్వక్ = చర్మము, మాంస = మాంసము, రుధిర = రక్తము, స్నాయు = నాడులు, మేదః = కొవ్వు, మజ్జా = మజ్జ, అస్థి = ఎముకలు వీటితో, సంకులం = వ్యాకులమైనదియు, మూత్రపురీ షాభ్యాం = మూత్రపురీషములతో, పూర్ణం = నిండిన, ఇదం = ఈ, స్థూలం వపుః = స్థూలశరీరము, నిన్ద్యం = నిన్ద్యమైనది.

దేహమునందు అత్యంతము జుగుప్సను కలిగించుటకై "మూత్రపురీషాభ్యాం పూర్ణం" అని చెప్పబడినది. మలమూత్ర భాండమును ఎవ్వడును స్పృశించుటకు కూడ ఇచ్ఛగింపడు కదా? ఇక దానియందు అహంకారమనునది ఎట్లుండును? అందుచేతనే నిందింపతగినది.

అవ. వైరాగ్యోత్పత్తికై ఈ విధముగ, దేహమును నిందించి, మొదట ప్రారంభింపబడిన ఆత్మానాత్మవివేచనమును అనువర్తింప జేయుచున్నాడు-

పంచీకృతేభ్యో భూతేభ్యః స్థూలేభ్యః పూర్వకర్మణా,
సముత్పన్న మిదం స్థూలం భోగాయతన మాత్మనః.
అవస్థా జాగరస్తస్య స్థూలార్థానుభవో యతః. 90

ఆత్మనః = ఆత్మయొక్క, భోగాయతనం = భోగమునకుస్థానమైన, ఇదం = ఈ, స్థూలం = స్థూలశరీరము, పూర్వకర్మణా = పూర్వకర్మచే, పంచీకృతేభ్యః = పంచీకృతములగు, స్థూలేభ్యః భూతేభ్యః = స్థూలభూతములనుండి, సముత్పన్నం = పుట్టినది, తస్య = ఆ స్థూలశరీరముయొక్క, అవస్థా = అవస్థ, జాగరః = జాగరావస్థ, యతః = ఏ కారణమువలన, స్థూలార్థానుభవః = స్థూలవిషయములయొక్క అనుభవము కలుగునో.

ఆకాశాది సూక్ష్మభూతములు పరస్పరాంశములతో కలసి స్థూలములై స్థూలశరీరమునకు హేతువులైనవి అని వెనుక చెప్పబడినది. అక్కడ పంచీకరణమనునది స్పష్టముగ చెప్పలేదు. ఇపు డిక్కడ ఆ పంచీకరణమును 'పంచీకృతేభ్యః' అని చెప్పుచున్నాడు. పంచీకృతములు కావుననే, స్థూలేభ్యః = పృథివీత్యాది వ్యవహారమునకు యోగ్యములైన భూతములనుండి, అందును, దేవతిర్యఙ్మనుష్యాది శరీరములు కలుగుటకు కారణమును 'పూర్వకర్మణా' అనుపదముచే చెప్పుచున్నాడు. పుణ్య-పాప-మిశ్రకర్మల ననుసరించి క్రమముగ దేవ-

తిర్యక్ - మనుష్యశరీరములు లభించునని భావము. ఇదం = ప్రత్యక్షముగ కనబడుచున్నదియు, ఆత్మనః = జీవునియొక్క, భోగాయతనం = దేనియందు భోగము కలుగునో అది భోగాయతనము; అనగా సుఖదుఃఖానుభవజనకము అని యర్థము. సముత్పన్నం = సాంకర్యము, అనగా ఒకజీవునికి రావలసిన శరీరము మరియొకరికి కలుగుట అనునది లేకుండ పుట్టినది యని అర్థము. కర్మఫలదాతయు సర్వజ్ఞుడును అగు నీశ్వరుడు ఆ యా జీవులకు, వారివారి కర్మల ననుసరించి ఆ యాశరీరముల నిచ్చుచుండును గాన సంకరశంకకు అవకాశము లేదు అను విషయమును 'సముత్పన్నం' అనుపదములోని 'సమ్' అను ఉపసర్గయు, 'పూర్వకర్మణా' అనుపదమును సూచించుచున్నవి. స్థూలశరీరము దేనిస్వరూపమున అభిమానింపబడుచున్నదో ఆ యవస్థను, ఇప్పుడు చెప్పుచున్నాడు. ఆ యవస్థ మారిపోవుచున్నను ఆత్మమాత్రము మార్పులేక అనుస్యూతముగ వచ్చుటను బాగుగ బోధించి అది (ఆ అవస్థయు, ఆ అవస్థతో సంబంధించిన స్థూలశరీరమును) అనాత్మ యని బోధించుట ఇందులకు ప్రయోజనము. తస్య = ఆ స్థూలదేహముయొక్క, అవస్థా = అసాధారణమైన అవస్థ, అనగా అది భోగహేతువగు సమయము, జాగరము, "ఇంద్రియైరర్థోపలబ్ధిర్జాగరితం" -- ఇంద్రియములద్వారా విషయములను గ్రహించెడు అవస్థ జాగ్రదవస్థ అని చెప్పబడిన లక్షణముకల జాగ్రదవస్థయని యర్థము. "స్థూలార్థానుభవో యతః" అను వాక్యము ఈ విషయమునే విశదీకరించుచున్నది. దిక్కులు మొదలగువాని అభిమానిదేవతలచే అనుగృహీతములగు శ్రోత్రాదీంద్రియములచే గ్రహింపబడు శబ్దాదివిషయములు స్థూలవిషయములు; స్వప్నమునందు ఇంద్రియముల వ్యాపారము లేకపోవుటచే ఆ యవస్థయందు వాసనారూపముననున్న శబ్దాదులను దేవతానుగృహీతములగు ఇంద్రియములు గ్రహించుట అనునది ఉండదు. మనస్సుకూడ ఇంద్రియమే అనుపక్షమునందు స్వప్నావస్థలోని విషయములు మనోరూపేంద్రియ

ములచే గ్రహింపబడినను ప్రసిద్ధములగు చక్షురాదింద్రియములచే గ్రహింపబడుట యనునది లేదు అని భావము. యతః = ఏ కారణము వలన, ఏ స్థూలశరీరమువలనను, స్థూలశరీరాభిమానమువలనను స్థూలార్థముల అనుభవము కలుగుచున్నదో; తతః = ఆ కారణము వలన, ఆ స్థూలదేహమునకు జాగరము అవస్థ, (అనగా జాగరావస్థ స్థూలశరీరమునకు సంబంధించిన యవస్థ).

అవ. పైన చెప్పిన విషయమునే స్పష్టీకరించుచున్నాడు—

బాహ్యేన్ద్రియైః స్థూలపదార్థసేవాం
స్రక్చన్దన స్త్ర్యాది విచిత్రరూపామ్,
కరోతి జీవః స్వయమేతదాత్మనా
తస్మా త్ప్రశస్తి ర్వపుషోఽస్యజాగరే. 91

జీవః = జీవుడు, స్వయం = తాను, ఏతదాత్మనా = ఈ స్థూలశరీరము నందు తాదాత్మ్యబుద్ధితో, బాహ్యేన్ద్రియైః = బాహ్యములగు ఇంద్రియ ములచే, స్రక్చన్దనస్త్ర్యాది విచిత్రరూపాం = మాలికలు, చందనము, స్త్రీలు మొదలగు విచిత్రరూపములుగల, స్థూలపదార్థసేవాం = స్థూలపదార్థ ములసేవను, కరోతి = చేయుచున్నాడు, తస్మాత్ = ఆ కారణమువలన, జాగరే = జాగ్రదవస్థయందు, అస్య = ఈ, వపుషః = స్థూలశరీరమునకు, ప్రశస్తిః = ప్రాధాన్యము.

బాహ్యేంద్రియైః = త్వగ్ఘ్రాణచక్షురాదులగు బాహ్యేంద్రియ ములచే, "రూప్యన్తే విషయీక్రియన్తే ఇతి రూపాణి" అను వ్యుత్ప త్తిచే విషయముగ చేయబడుచున్నవి, అనగా ఇంద్రియగోచరము లగు పదార్థములు అని యర్థము. మాలలు, చందనము, స్త్రీలు మొదలగు విచిత్రమైన విషయములుగల స్థూలపదార్థసేవనమును, అనగా ఆ యా ఇంద్రియాధిష్ఠానదేవతల అనుగ్రహముచే కలుగు చుండెడు సుఖదుఃఖానుభవమును, పదార్థములస్థూలత్వము వెనుక

సృష్టికరింపబడినది. జీవః=ప్రత్యగాత్మ, ఏతదాత్మనా=స్థూలదే హాత్మద్వారా; అనగా మనస్సుద్వారా స్థూలశరీరమునందు ప్రతిఫలించిన స్వరూపముతో; స్థూలశరీరముపై అధ్యస్తమగు ఆత్మభావముతో అని తాత్పర్యము. స్వయముగనే చేయును. స్వప్నమునందు మనస్సునకు స్థూలదేహముతో సంయోగముండదు. అందుచే దానియందు సరూపప్రతిబింబము అనునది కూడ ఉండదు గాన అపుడు స్థూలశరీరము భోగహేతువుకాదు. స్వప్నమునందు భోగహేతువైనది కాల్పనికము, వాసనామయము అగు మరియొకస్థూలశరీరమే, ప్రసిద్ధమగు తమ తమ స్థూలదేహములకంటె భిన్నములైన తిర్యగ్దేవాది దేహములతోగూడ స్వప్నమునందు భోగముల ననుభవించుచుందురు అనువిషయము ప్రసిద్ధమే కదా? కావున ఈ స్థూలశరీరమునకు జాగ్రదవస్థయందు ప్రాముఖ్యము. స్వప్న సుషుప్త్యవస్థలలో ఈ స్థూలదేహమువిషయమున అభిమానమే ఉండదు కదా? ఈ విధముగ ఆ రెండు అవస్థలయందును భాసింపక, కేవలము జాగ్రదవస్థలో మాత్రమే భాసించుచున్న ఈ స్థూలదేహము, సర్వావస్థాసాక్షియగు ఆత్మ అనువృత్తమగుచుండ, తాను నివర్తించుచుండుటచే ఆ ఆత్మకంటెభిన్నమనియు, అనాత్మయనియు సులభముగ గ్రహింపవచ్చును.

అవ. తన గృహమే తన ఆత్మయని లోకములో ఎవ్వడును భావింపడు. స్థూలదేహము విషయమునగూడ ఈ విధముగనే గ్రహింపవలసియుండగా, దాని విషయమున అహంకారము ఏ మాత్రము చేయదగినది కాదు అని చెప్పుచున్నాడు—

సర్వోఽపి బాహ్యః సంసారః పురుషస్య యదాశ్రయః,
విద్ధి దేహ మిదం స్థూలం గృహవ ద్గృహమేధినః. 92

**పురుషస్య=పురుషునియొక్క, బాహ్యః=బాహ్యమైన, సర్వోఽపి= సమస్తమైన, సంసారః=సంసారము, యదాశ్రయః=దేనిని ఆశ్రయించు**

కొని యున్నదో, అట్టి, ఇదం = ఈ, స్థూలం దేహం = స్థూలదేహమును, గృహమేధినః = గృహస్థునికి, గృహవత్ = గృహమువంటి దానినిగ, విద్ధి = తెలిసికొనుము.

బాహ్యము, ఆంతరము అని సంసారము రెండువిధములు. సుఖము, దుఃఖము, కర్తృత్వము, భోక్తృత్వము మొదలగునది ఆంతరసంసారము. జన్మము, జర, మరణము, స్థూలత్వము, బాల్యము మొదలగునది బాహ్యసంసారము. దీనినిగూర్చి రాబోవు శ్లోకమున వివరింపబడును. వాస్తవమున సంసారరహితుడగు పురుషునకు దేని విషయమున తాదాత్మ్యాధ్యాసము (ఈ దేహమే నేను అను భ్రాంతి) కలుగుచున్నదో అట్టి ఈ స్థూలశరీరము, గృహమేధినః = గృహస్థాశ్రమములోనున్న కుటుంబవంతునకు, గృహమువంటిది అని తెలిసికొనుము. ముందుగ ఒక ఇల్లు సంపాదించుకొనియున్నవాడు భార్యాదులను స్వీకరించును అను విషయము లోకప్రసిద్ధము. గృహముకూడ లేనివాడు వివాహాదులకై ప్రయత్నింపడు కదా? అట్లే స్థూలశరీరమే ఆత్మ (తాను) అని తలచుచున్నవాడు మాత్రమే దాని ధర్మములగు జరామరణాదికములు తనకు సంబంధించినవని భావించి దుఃఖమనుభవించుచుండును. అట్లు కానిచో దుఃఖాదికము లేదు. స్థూలదేహాభిమానము లేని సుషుప్త్యవస్థలో జరారోగాదులవలన కలుగు పీడ కనబడుట లేదు కదా? కావున గృహమువలె అత్యంతము భిన్నమైనదిగ గ్రహింపదగిన స్థూలదేహమునందు అహంభావము యుక్తము కాదని అభిప్రాయము.

అవ. ఆ బాహ్యసంసారమునే విశదీకరించుచున్నాడు—

స్థూలస్య సంభవ జరామరణాని ధర్మాః
స్థౌల్యాదయో బహువిధాః శిశుతాద్యవస్థాః,
వర్ణాశ్రమాది నియమా బహుధామయాః స్యుః
పూజావమాన బహుమానముఖా విశేషాః. 93

సంభవజరామరణాని=పుట్టుక, ముసలితనము, మరణము, స్థౌల్యాదయః = స్థూలత్వము మొదలగు, బహువిధాః = అనేకవిధములైన, ధర్మాః = ధర్మములు, శిశుతాద్యవస్థాః = బాల్యము మొదలగు అవస్థలు, వర్ణాశ్రమాదినియమాః = వర్ణాశ్రమాదినియమములు, బహుధామయాః = అనేకవిధములగు రోగములు, పూజావమాన బహుమానముఖాః = పూజ, అవమానము, సంమానము మొదలగు, విశేషాః = విశేషములును, స్థూలస్య = స్థూలశరీరమునకు, స్యుః = అగును (సంబంధించినవి).

ఉత్పత్తి వార్ధక్యమరణములు, స్థౌల్యం = అవయవములవృద్ధి, ఆదిపదముచే అవయవాపచయ (తగ్గుట) రూపమగు కృశత్వము, తెలుపు నలుపు మొదలగు వర్ణములును, అనేకప్రకారములు గల ధర్మములు, శిశుత్వము ఆదియందు వేటికో అట్టి కౌమారము, యౌవనము, వార్ధక్యము అను అవస్థలును, జరాశబ్దముచే వృద్ధత్వము వెనుక చెప్పబడియున్నను మరల దానిని ఇచట శైశవముమొదలగు అవస్థలమధ్య పేర్కొనుటలో దోషము లేదు. వర్ణాశ్రమాది నియమాః_ వర్ణాః = బ్రాహ్మణత్వ క్షత్రియత్వ వైశ్యత్వ శూద్రత్వములు, ఆశ్రమాః_ బ్రహ్మచర్య - గార్హస్థ్య - వానప్రస్థ - సంన్యాసములు. ఆదిపదముచే గోత్రము సూత్రము మొదలగునవి, వాటికి సంబంధించిన నియమములు అనగా బ్రాహ్మణత్వ బ్రహ్మచర్యాదులకు తగిన ధర్మములు, కులాద్యాచారములు. బహుధా అమయాః = అనేకవిధములగు జ్వరము, శిరోవేదన మొదలగు రోగములు. పూజ, అవమానము, బహుమానము మొదలగు విశేషములును, స్యుః = అగును. పూజా = గంధపుష్పాదులతో చేయబడిన పూజ. అవమానః = వాక్కుచేతగూడ ఆదరింపకపోవుట, కంటితోగూడ చూడకపోవుట మొదలగు తిరస్కారము. బహుమానః = ఉచ్చాసనముపై కూర్చుండబెట్టుట మొదలగునది. ఈ విధములగు విశేషములును అగును. జాతకర్మాది సంస్కారములు శరీరమునకే చేయబడును. ఆ యా ఆశ్రమములకు సంబంధించిన చిహ్నములుగూడ శరీరమునందే కనబడును. అందుచే

వర్ణాశ్రమాదినియమములు శరీరమునకే అని చెప్పబడినది. అంతరంగమునకు గూడ కొన్ని ఆంతరనియమము లున్నమాట వాస్తవమే; అయినను ప్రత్యక్షములగు నియమములన్నియు ఈ స్థూలశరీరమునకే అని అభిప్రాయము. లేదా- ఏ నియమములను బట్టి 'ఈతడు బ్రాహ్మణుడు; ఈతడు బ్రహ్మచారి' ఇత్యాదికము పరునిచే గూడ తెలియుటకు వీలగునో అవి నియమము లని యర్థము. ఆ నియమములు శరీరసంస్కారముద్వారా చిత్తమునుగూడ సంస్కరించును; తద్ద్వారా జ్ఞానమునకై ఉపయోగించును. కావున అధ్యాసచేతనైనను వాటిని తప్పక ఆదరించవలెను. పూజావమానాదులగు ఇతరధర్మములు మాత్రము బంధహేతువులుగాన ఆదరింపతగినవి కావు.

అవ. ఈ విధముగ అనాత్మయగు స్థూలదేహమును, తన్మూలకమగు సంసారబంధమును, వర్ణాశ్రమాది ధర్మానుష్ఠానముచే ఆ సంసారబంధమును విదలించుకొనవలసిన పద్ధతిని నిరూపించి, ఇపుడు ఐదు శ్లోకములలో సూక్ష్మశరీరమును నిరూపించుటకై ప్రారంభించుచున్నాడు-

## దశేంద్రియములు

బుద్ధీంద్రియాణి శ్రవణం త్వగక్షి
ఘ్రాణం చ జిహ్వా విషయావబోధనాత్,
వాక్పాణిపాదా గుద మప్యుపస్థం
కర్మేంద్రియాణి ప్రవణాని కర్మసు. 94

శ్రవణం = చెవి, త్వక్ = చర్మము, అక్షి = కన్ను, ఘ్రాణం చ = ముక్కు, జిహ్వా = నాలుక, ఇవి, విషయావబోధనాత్ = విషయములను గ్రహించుటవలన, బుద్ధీంద్రియాణి = బుద్ధీంద్రియములు, వాక్పాణిపాదాః =

వాక్కు, హస్తములు, పాదములు. గుదం=గుదస్థానము, ఉపస్థం= ఉపస్థయు, కర్మసు ప్రవణాని=ఆ యా పనులుచేయుటయందు ఆసక్తిగల, కర్మేంద్రియాణి = కర్మేంద్రియములు,

శ్రవణం=శష్కులి (చేగోణి) ఆకారముతోనున్న కర్ణముచే అవచ్ఛిన్నమగు ఆకాశమైన శ్రోత్రము, త్వక్=చర్మమందున్న ఇంద్రియము, అక్షి=నేత్రగోళావచ్ఛిన్నమైన (నేత్రగోళములోనుండు) చక్షురింద్రియము, ఘ్రాణం=నాసాప్రదేశమునందున్న ఘ్రాణేంద్రియము. జిహ్వా=రసనేంద్రియము, ఈ అయిదును, శబ్ద-స్పర్శ-రూప-గన్ధ-రసాత్మకములగు విషయముల జ్ఞానమును కలిగించుట వలన, జ్ఞానేంద్రియములని, "కథ్యన్తే"=చెప్పబడుచున్నవి అని అధ్యాహారము. వాక్=మాటలాడెడుస్వభావముగల వాగింద్రియము పాణిః=గ్రహించు స్వభావముగల హస్తేంద్రియము, పాదః=నడచు స్వభావముగల పాదేంద్రియము, శరీరమునందలి కఠినద్రవరూపములగు హేయభాగములను విడచుటకు హేతువులగు గుద-ఉపస్థములు, ఇవి, ఈమాటలాడుటమొదలగు కర్మలకు హేతుభూతములగు కర్మేంద్రియములని, 'ఉచ్యన్తే="చెప్పబడుచున్నవి" అని అధ్యాహారము. వచనాదికర్మలయందు వ్యగ్రములైయుండుట వీటి కాపేరు వచ్చుటకు కారణము.

అవ. ఈ విధముగ పది బాహ్యేంద్రియములనుగూర్చి చెప్పి, ఈ యింద్రియము లన్నియు దేని సంబంధముచే పనిచేయుటకును, జ్ఞానమును కలిగించుటకును సమర్థము లగుచున్నవో, ఏదిలేనిచో అవి పనిచేయజాలకున్నవో, అట్టి ప్రధానమగు అంతఃకరణమును, అది నాల్గువిధములను విషయమును, ఇందులకు కారణమును చెప్పుచున్నాడు—

## అంతఃకరణచతుష్టయము

నిగద్యతేఽన్తఃకరణం మనో ధీరహం
కృతిశ్చిత్తమితి స్వవృత్తిభిః,
మనస్తు సంకల్పవికల్పనాదిభి
ర్బుద్ధిః పదార్థాధ్యవసాయధర్మతః. 95

అత్రాభిమానాదహ మిత్యహంకృతిః
స్వార్థానుసన్ధానగుణేన చిత్తమ్. 96

అన్తఃకరణం = అంతఃకరణము, స్వవృత్తిభిః = తనయొక్క వేరు వేరు వృత్తులచేత, మనః = మనస్సనియు, ధీః = బుద్ధియనియు, అహంకృతిః = అహంకారమనియు చిత్తమితి = చిత్తమనియు, నిగద్యతే = చెప్పబడుచున్నది, సంకల్పవికల్పనాదిభిః = సంకల్పవికల్పాదులచే, మనః = మనస్సనియు, పదార్థాధ్యవసాయధర్మతః = పదార్థనిర్ణయమువలన, బుద్ధిః = బుద్ధియనియు, అత్ర = ఈ శరీరాదులందు, అభిమానాత్ = అభిమానము వలన అహంకృతిః = అహంకారమనియు, స్వార్థానుసంధానగుణేన = తనవిషయమును మరల స్మరించుట అను గుణముచే, చిత్తం = చిత్తమనియు చెప్పబడుచున్నది.

అంతఃకరణమే చెప్పనున్న వేరువేరు వృత్తులనుబట్టి వేరువేరు పేర్లతో చెప్పబడుచున్నది. ఈ నాలుగుపేర్లకును నిమిత్తభూతములగు వృత్తులను 'మనస్తు' ఇత్యాది వాక్యమున చెప్పుచున్నాడు. 'ఇది బాగుగ నున్నది' అను అభిప్రాయము సంకల్పము. 'ఇది ఇట్లా అట్లా?' అను సంశయము వికల్పము. ఆ యా పదార్థముల స్వరూప స్వభావములను నిర్ణయించువృత్తి బుద్ధి. ఈ శరీరాదులందు 'నేను' అను అధ్యాసముచే అహంకారము. పూర్వము తనకు విషయమైన వస్తువులను స్మరించునపుడు అంతఃకరణమునకే చిత్తమని పేరు.

అవ. సత్త్వాంశముతోగూడిన పంచభూతములలో ఒక్కొక దానినుండి క్రమముగ జనించిన జ్ఞానేంద్రియములనుగూర్చియు,

రజోగుణోపేతములగు భూతములనుండి జనించిన కర్మేంద్రియములను, సత్త్వప్రధానములగు ఆ అన్ని భూతముల సమష్టికార్యమగు అంతఃకరణమునుగూర్చియు నిరూపించి, ఇపుడు రజోగుణాంశముతో కూడిన భూతముల సమష్టికార్యమైనదియు, సూక్ష్మశరీరముతో సంబంధించినదియు అగు ప్రాణమునుగూర్చి చెప్పుచున్నాడు—

## పంచప్రాణములు

ప్రాణాపానవ్యానోదానసమానా భవత్యసౌ ప్రాణః,
స్వయమేవ వృత్తిభేదాత్ వికృతేర్భేదాత్సువర్ణసలిలమివ.97

అసౌ = ఈ, ప్రాణః = ప్రాణము, స్వయమేవ = తానే, వృత్తిభేదాత్ = వృత్తిభేదమువలన, వికృతేః భేదాత్ = వికారముయొక్క భేదమువలన, సువర్ణసలిలమివ = బంగారము, నీరునువలె, ప్రాణాపానవ్యానోదానసమానాః = ప్రాణముగను, అపానముగను, వ్యానముగను, ఉదానముగను, సమానముగను, భవతి = అగుచున్నది.

ఒకే బంగారము వికారభేదముచే కటకము, కేయూరము, కుండలము మొదలగు విభిన్నాకారనామములను పొందుచున్నదో, ఒకే జలము వికారభేదముచే నది, కాలువ, చెరువు మొదలగు భేదములను పొందుచున్నదో, అట్లే అసౌ = శరీరములోపల సంచరించుచున్న ప్రాణమే, ప్రాణనము, అపాననము, వ్యాననము, ఉదాననము సమాననము, అనెడు వృత్తులభేదముచేత ప్రాణాపానవ్యానోదానసమానములుగ, వేరుగ, అగుచున్నది. "సువర్ణసహితం జలం = సువర్ణజలమ్" అని విగ్రహవాక్యము. బంగారము, జలము అను పదార్థములు అని యర్థము. కార్యభేదమువలన ఒకే సువర్ణము ఎట్లు వేరువేరుగ వ్యవహరింపబడుచున్నదో, వికృతభేదమువలననే, ఏ విధముగ, ఒకేజలము తరంగములు, నురుగు, బుడగలు మొదలగు

వేరువేరునామములతో వ్యవహరింపబడుచున్నదో అట్లు అని యర్థము. ముఖనాసికలనుండి ప్రవేశనిర్గమనములు చేయుచుండుట ప్రాణనము. మలాదులను క్రిందికి నెట్టుట అపాననము. తిని త్రాగిన అన్న-రసాదులు నాడీముఖములందు వ్యాపించునట్లు చేయుట వ్యాననము. వమనకాలమున పైకి తీసికొనిపోవుట ఉదాననము. భుజించిన అన్నరసాదులను అరిగించుటకై జాఠరాగ్నిని ప్రేరేపించుట సమాననము. ఇవి ప్రాణముచేయు ఐదు వృత్తులు.

అవ. దేని స్వరూపమును నిరూపించుటకై జ్ఞానేంద్రియాదులు చెప్పబడినవో అట్టి విశిష్టమగు సూక్ష్మశరీరమునుగూర్చి ఇపుడు చెప్పచున్నాడు-

## సూక్ష్మశరీరము

వాగాది పంచ శ్రవణాది పంచ
ప్రాణాదిపంచా భ్రముఖాని పంచ,
బుద్ధ్యాద్యవిద్యాపి చ కామకర్మణీ
పుర్యష్టకం సూక్ష్మశరీర మాహుః. 98

వాగాదిపంచ=వాక్కు-మొదలైన ఐదు, శ్రవణాదిపంచ=శ్రవణముమొదలైన ఐదు, ప్రాణాదిపంచ=ప్రాణముమొదలైనఐదు, అభ్రముఖాని పంచ=ఆకాశముమొదలైన ఐదు, బుద్ధ్యాది=బుద్ధ్యాదిచతుష్టయము, అవిద్యాపి=అవిద్యయు, కామకర్మలును, పుర్యష్టకం=పుర్యష్టకమును (ఎనిమిది సముదాయములను) సూక్ష్మశరీరం=సూక్ష్మశరీరమునుగా, ఆహుః=చెప్పచున్నారు.

1. వాగాది కర్మేంద్రియపంచకము, 2. శ్రవణాది జ్ఞానేంద్రియ పంచకము, 3. ప్రాణాది ప్రాణపంచకము, 4. ఆకాశాది సూక్ష్మభూత పంచకము, 5. బుద్ధ్యా ద్యన్తఃకరణచతుష్టయము, 6. అవిద్యా=

అధ్యాసము, కామకర్మణీ 7. ఇచ్ఛయు, 8. ధర్మాధర్మనామకమగు కర్మయు, ఈ విధముగ కలసిన అష్టసముదాయరూపములగు పదార్థములతో కూడినదానిని పుర్యష్టక మనియు, సూక్ష్మశరీరమనియు వేదాంతులు చెప్పుదురు.

అవ. ఈ సూక్ష్మశరీరముకూడ అనేకపదార్థ సంఘాతరూపమగుటవలనను, సంహతములైనవి (కలసినవి) గృహములవలె ఇతరుల ఉపయోగమునకై ఉద్దిష్టము లగుటవలనను, ఈ సూక్ష్మశరీరముకూడ ఆత్మభిన్నమే యని చెప్పుచున్నాడు-

ఇదం శరీరం శృణు సూక్ష్మసంజ్ఞితం
లింగంత్వపంచీకృత భూతసంభవమ్,
సవాసనం కర్మఫలానుభావకం
స్వాజ్ఞానతోఽనాది రుపాధిరాత్మనః. 99

శృణు = వినుము, అపంచీకృతభూతసంభవమ్ = పంచీకృతములు కాని భూతములనుండి పుట్టినదియు, లింగం తు = లింగమైనట్టిదియు, సవాసనం = వాసనలతో కూడినదియు, కర్మఫలానుభావకం = కర్మఫలమును అనుభవింపజేయునదియు, సూక్ష్మసంజ్ఞితం = సూక్ష్మమను పేరు గల, ఇదం శరీరం = ఈ శరీరము, ఆత్మనః = జీవాత్మకు, స్వాజ్ఞానతః = స్వరూపజ్ఞానములేకపోవుటచే ఏర్పడిన, అనాదిః = అనాదియగు, ఉపాధిః = ఉపాధి.

సూక్ష్మసంజ్ఞితం = సూక్ష్మమను పేరు దేనికి కలిగినదో అట్లే ఇదం శరీరం = ఈ శరీరము. ఇది జన్యముకాన నిత్యాత్మస్వరూపము కాజాలదని చెప్పుటకై "అపంచీకృతభూతసంభవం" అను విశేషణము. పంచీకృతములుకాని గగనము మొదలు పృథ్వి వరకును గల ఏ భూతములు కలవో వాటినుండి పుట్టినది. కావుననే దీనికి సూక్ష్మమని పేరు. "లింగం". ఇది 'లిగి' ధాతువునుండి నిష్పన్న మైనది.

ఆత్మకు జ్ఞాపకమని యర్థము. జడములగు వాగాదికరణములు చేతనమగు ఒక అధిష్ఠాతలేకున్నచో ఆ యా కార్యములను చేయుటకై ప్రవర్తింపవు. 'అచేతనమైన వన్నియు చేతనాధిష్ఠితములైన యెడలనే కార్యముచేయును' అను వ్యాప్తి రథాదులయందు కనబడుచున్నది కదా ? బాహ్యేంద్రియములతోడను, అంతరింద్రియములతోడను గూడిన ఈ శరీరమునకే లింగశరీరమనికూడ పేరు అని అర్థము. 'తు' అనునది అవధారణమును అనగా 'ఇదియే లింగము' అను నిర్ధారణను తెలుపుచున్నది. సుషుప్త్యవస్థయందుగూడ జ్ఞానమున్నదను విషయమును కొందరు మాత్రమే అంగీకరింతురు; జాగరస్వప్నావస్థలలో కలుగు జ్ఞానము మనోమూలముననే కలుగుచున్నది; మనస్సు జడపదార్థము గాన దీనియందు ఆత్మచైతన్యము ప్రతిబింబించినగాని అది ఇతర వస్తువులను ప్రకాశింపజేయజాలదు; ఆత్మప్రతిబింబమును గ్రహించి ఆత్మజ్ఞాపకమగు— అనగా ఆత్మయొక్క ఉనికిని సూచించెడు మనస్సు ఈ సూక్ష్మశరీరముతో సంబంధించియున్నది; ఈ కారణములచే సూక్ష్మశరీరమే లింగశరీరమని చెప్పబడుచున్నది. ఈ విధమగు లింగత్వము—ఆత్మసూచకత్వము— స్థూలశరీరకారణశరీరములకు సంభవింపదు. ఆత్మ ధర్మరహితము; స్థూలశరీరములు అప్పుడప్పుడు నశించుచుండును. కావున అనేకము లుండును; అందుచే మోక్షము కలుగువరకును ఒక స్థూలశరీరము స్థిరముగ నుండదు.

అందుచే పూర్వాపూర్వసంస్కారము, రాబోవు అనుభవముల వలన కలుగు సంస్కారములకును ఆశ్రయమై మోక్షము కలుగువరకును స్థిరముగ నుండునది లింగశరీరమే యని 'సవాసనం' ఇత్యాదికముచే చెప్పుచున్నాడు. వాసనాభిః సహ=అనుభవజన్యములగు సంస్కారములతో కూడ, వర్తతే=ఉండునది గాన సవాసనము; భోగహేతువుకూడ ఈ లింగశరీరమే అని చెప్పుచున్నాడు— కర్మఫలానుభావకం=పుణ్యకర్మకును పాపకర్మకును ఫలములగు ఏ

సుఖదుఃఖములుకలవో, వాటియొక్క భోగమును కలిగించునది. సుషుప్త్యవస్థలో వాసనాసహితమగు లింగశరీరము విలీనమగుటచే కర్మవలనకలిగిన సుఖదుఃఖముల అనుభవముండదు. జాగ్రత్స్వప్నములలో అట్టి లింగశరీర ముండును గాన సుఖదుఃఖానుభవము గూడ ఉండును. ఈ విధముగ అన్వయవ్యతిరేకములచే, లింగశరీరమే భోగహేతువని తెలిసికొనవలెను. 'ఇది ఉన్నప్పుడే అది ఉండును' అని చెప్పుట అన్వయము; "ఇది లేనిచో అది ఉండదు" అని చెప్పుట వ్యతిరేకము. ఈ లింగశరీరము ఆత్మకు అనాదియగు ఉపాధి, ఇది సూక్ష్మభూతములవలన జనించినదైనను మహాప్రలయాదులలోకూడ అనభివ్యక్తరూపమున నుండును. సృష్టికాలమున అభివ్యక్తమగు చుండును; ఈ విధముగ విదేహకైవల్యము కలుగువరకును ఇది నిలచియుండును గాన ఇది స్థూలశరీరమువలె సాది (క్రొత్తగ పుట్టునది) కాదు.

(ఆశంక) అధ్యాసకామకర్మలకు అవిద్య యనిపేరు. అప్పుడప్పుడు వేరువేరు అధ్యాస-కామ-కర్మలు పుట్టుచుండును కదా? వాటితో సంబంధించిన ఒకే లింగశరీరము స్థిరముగ నుండుననుట ఎట్లు సంభావ్యము?

(సమాధానము) ఆ అధ్యాసాదులు మారుచున్నను బాహ్యములగు వాగాదీంద్రియములును, బుద్ధ్యాదిరూపమగు అంతఃకరణమును మోక్షము కలుగునంతవరకును ఒకే విధముగ భేద మేమియు లేకుండ నుండుటచే తత్సంబద్ధమగు లింగశరీరము కూడ ఆ ఒక్కటే అని గ్రహింపవలెను. ప్రతిజన్మయందును వాగాదీంద్రియములు గూడ వేరువేరుగనే జనించుచుండునని అంగీకరింప బనిలేదు; ఇది (అనావశ్యకకల్పనారూపమగు) గౌరవము. అట్లైన మూకత్వాదులు ఎట్లు వచ్చుచున్నవి అను ప్రశ్నకు సమాధానముగ, అందులకు పూర్వకర్మప్రతిబంధమే కారణమని చెప్పవచ్చును. సర్వకర్మల సంస్కారము

లకును నిలయమగు అంతఃకరణము ప్రతిజన్మకు వేరువేరుగ పుట్టును అని చెప్పుటకు ఏ మాత్రము వీలులేదు. అట్లు అంతఃకరణభేదము నంగీకరించినచో చేసినది పోవుట, చేయనిది వచ్చుట అను దోషము వచ్చును. పూర్వజన్మలోచేసిన కర్మాదులకు ఆశ్రయమైన అంతఃకరణము నష్టమైపోయినచో, పూర్వకర్మజన్మవాసన నూతనాంతఃకరణమునందు ఉండుటకు అవకాశములేదు గాన ఈ సంసారము ఎట్లు వచ్చినదో చెప్పుటకు తగు సమాధాన ముండదు. పూర్వ సంస్కారములేనిచో బాలకుడు స్తన్యపానమున ఎట్లు ప్రవర్తించును? ఆత్మ ధర్మవిహీనము గాన ఈ సంస్కారములు దాని నంటియుండును అని చెప్పవీలులేదు. అవిద్య నాశ్రయించి ఈ సంస్కారము లుండునని చెప్పినచో, అవిద్య ఒక్కటే గాన దానితో అనేకములగు అంతఃకరణములు సంబంధించి అందలి సంస్కారములచే సుఖదుఃఖాదులను పొందుచుండుటచే సుఖము రావలసినచోట దుఃఖము, దుఃఖము కలుగవలసినచోట సుఖము, రెండును ఒక్కమారు కలుగుట, అనేకులకు ఒకే విధములగు సుఖదుఃఖాదులు కలుగుట మొదలగు సాంకర్య మేర్పడును. సుషుప్త్యవస్థలో కూడ భోగస్మృత్యాదులు కలుగవలసియుండును. ఈ విధముగ గౌరవమువలనను, పూర్వోక్తములగు దోషములవలనను, విదేహకైవల్యము కలుగువరకు వాగాదులును, అంతఃకరణమును అభిన్నములుగనే ఉండునని తెలిసికొనవలెను. అనాది యనగా ప్రాగభావప్రతియోగి కానిది_ అనగా కొంతకాలము లేక కాలాంతరమున పుట్టినది అని యర్థము. అట్టి అనాదిత్వము అవిద్యకు ఉన్నది. కాని వాగాదులకు అట్టి అనాదిత్వము లేదు. అయినను ఒకమారు జన్మించి అవి చివరివరకును అభిన్నములుగనే ఉండును అను నుద్దేశముతో అవిగూడ అనాది యని చెప్పబడినవి. వాస్తవమున ఆత్మ ఒక్కటేయైనను, జ్ఞానుల విషయమున గూడ భూమికాభేదమునుబట్టి కనబడుచున్న, బ్రహ్మవేత్త, "బ్రహ్మవిద్వరుడు" 'బ్రహ్మవిద్వరీయాంసుడు', 'బ్రహ్మవిద్వరిష్ఠుడు' అను విభిన్న

వ్యవహారమును అంతఃకరణభేదమును బట్టియే సమర్థించవలసి యున్నది. కావున "యావత్కార్యమవస్థాయి భేద హేతో రుపాధితా"- కార్య మున్నంతవరకును ఉండి, భేదమునకు కారణభూతమైనదానికి ఉపాధి యనిపేరు అను లక్షణముగల ఉపాధిత్వము లింగశరీరము విషయమున నిస్సంశయముగ కుదురును. అసంగమగుటచే దేని చేతను ఉపహితముకాని ఆత్మకు లింగశరీరము ఉపాధి యెట్లగును- అను నాశంకకు సమాధానముగ స్వాజ్ఞానతః అని చెప్పబడినది. స్వస్వరూపము ఇపుడు తెలియకుండుటచే, తన్మూలకముగ ఉపాధి కల్పితమైనదని అభిప్రాయము.

అవ. ఈ సూక్ష్మశరీరమునకుమాత్రమే ఉన్న అసాధారణా వస్థను చెప్పుచున్నాడు-

స్వప్నో భవత్యస్య విభక్త్యవస్థా
స్వమాత్రశేషేణ విభాతి యత్ర,
స్వప్నే తు బుద్ధిః స్వయమేవ జాగ్రత్-
కాలీన నానావిధవాసనాభిః,
కర్త్రాదిభావం ప్రతిపద్య రాజతే
యత్ర స్వయంజ్యోతి రయం పరాత్మా. 100

స్వప్నః = స్వప్నము, అస్య = ఈ సూక్ష్మశరీరముయొక్క, విభక్త్యవస్థా = విశిష్టమైన (దీనికి మాత్రమే చెందిన) అవస్థగా, భవతి = అగుచున్నది. యత్ర = దేనియందు, స్వమాత్రశేషేణ విభాతి = తాను ఒక్కటిమాత్రమే మిగిలి, ప్రకాశించుచున్నదో. బుద్ధిస్తు = బుద్ధియైతే, స్వప్నే = స్వప్నమునందు, జాగ్రత్కాలీన నానావిధ వాసనాభిః = జాగ్రత్కాల మునకు సంబంధించిన అనేకవిధములగు వాసనలచే, స్వయమేవ = తానే, కర్త్రాదిభావం = కర్తృత్వము మొదలగువాటిని, ప్రతిపద్య = పొంది, రాజతే = ప్రకాశించును, యత్ర = ఎచట, అయం = ఈ, పరాత్మా = పరమాత్మ, స్వయంజ్యోతిః = స్వయంజ్యోతి స్వరూపమై ప్రకాశించుచున్నదో.

అస్య = ఈసూక్ష్మశరీరముయొక్క, విభక్త్యవస్థా = భేదకమగు అవస్థ, స్వప్నజాగ్రదవస్థలలో స్థూలశరీరమునకు గూడ ప్రవృత్తి యుండుటవలనను, సుషుప్త్యవస్థలో ఈ సూక్ష్మశరీరముగూడ లీనమై పోవుటవలనను, సూక్ష్మశరీరమునకు స్వప్నమునందే ప్రాధాన్యమని అర్థము. స్వమాత్రేత్యాదికముచే అందులకు హేతువు చెప్పుచున్నాడు. స్వమాత్రమనగా తానే అని యర్థము. దానియొక్క, శేషః = అవశిష్టత్వము. అభిమానాస్పదమగు తనచే మాత్రమే అని యర్థము. ఆ అవస్థలో స్థూలదేహాభిమానము ఉండదు గాన సూక్ష్మదేహ మొక్కటి మాత్రమే అభిమానవిషయ మగును. 'ఆత్మా' అని అధ్యాహారము. ఆత్మ ఏ స్వప్నమునందు స్థూలాభిమానమును విడచి సూక్ష్మశరీరమును మాత్రమే (తాను అని) అభిమానించుచు ప్రకాశించుచుండునో, సంగ్రహముగ చెప్పిన విషయమును, స్వమాత్రశేషత్వమును 'స్వప్నే' ఇత్యాదివాక్యముచే వివరించుచున్నాడు. స్వప్నావస్థయందు, బుద్ధిః = అంతఃకరణము, స్వయమేవ = ఇతరకారకముల అపేక్ష లేనిదై తాను మాత్రమే, జాగ్రదవస్థయందు కలిగిన బహువిధసంస్కారములచే, కర్త్రాదిభావం = కర్తృత్వము, కర్మత్వము, క్రియాత్వము, కరణత్వము, అధికరణత్వము మొదలగు దానిని, అనగా సకలక్రియాకారక భావమును పొంది ప్రకాశించుచుండును.

(ఆశంక) జడమైన అంతఃకరణమునకు ఇట్టి శక్తి ఎట్లు వచ్చినది? శరీరములోపలనున్న హితమనుపేరుగల నాడులయందు మనస్సు సంచరించునపుడు స్వప్నము కలుగును అని శ్రుతి చెప్పుటచే అచట ప్రకాశమున కేమాత్రము అవకాశము లేదుకదా?

(సమాధానము) 'యత్ర స్వయంజ్యోతిః' ఇత్యాది వాక్యముచే సమాధానము చెప్పుచున్నాడు.

న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం
నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః

తమేవభాన్త మనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి.
యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్,
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్.

ఆ ఆత్మతేజస్సునెదుట సూర్యుడు భాసించడు; చంద్రనక్షత్రములు భాసించవు; ఈ మెరుపులు భాసించవు. ఈ అగ్ని ఎట్లు భాసించును? భాసించుచున్న ఆ ఆత్మనే అనుసరించి అన్నియు భాసించుచున్నవి; దాని కాంతిచే ఇది అంతయు భాసించుచున్నది. "సూర్యునియందలి ఏ తేజస్సు జగత్తునంతను భాసింపజేయుచున్నదో, చంద్రునియందేది యున్నదో, అగ్నియందేది యున్నదో ఆ తేజస్సు నా సంబంధమైనది అని గ్రహింపుము" అను శ్రుతిస్మృతులచే కొనియాడబడుచున్న మహిమకలదియు, ఇతరప్రకాశ్యము కానిదియు, జ్యోతీరూపమును, అగు పరమాత్మకు సంబంధించిన చైతన్యజ్యోతిస్సు యొక్క సంబంధముచే, జాగ్రదవస్థలో నేర్పడిన వాసనలతో కూడిన అంతఃకరణమునకు ఈ శక్తి కలుగుచున్నది.

(ఆశంక) "సత్యం జ్ఞానమ్", "విజ్ఞానమానన్దం బ్రహ్మ", "అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః", "ప్రజ్ఞానం బ్రహ్మ", "కృత్స్నః ప్రజ్ఞాన ఘన ఏవ" ఇత్యాదిశ్రుతుల ననుసరించి ఆత్మ యెల్లప్పుడును చైతన్యజ్యోతీరూపమై స్వయంజ్యోతిస్స్వభావమే కదా? అట్టిచో 'యత్ర స్వయంజ్యోతి రయం పరాత్మా' అని స్వప్నవిషయముననే ఉన్న ఒక విశేషముగ ఏల చెప్పబడినది?

(సమాధానము) ఇందులకు కారణము చెప్పుచున్నాను వినుము. బృహదారణ్యకములోనున్న జ్యోతిర్బ్రాహ్మణమును ఆమూలచూడముగ పరిశీలించినచో ఈ విషయమును సులభముగ తెలిసికొనవచ్చును. అచట "కిం జ్యోతిరయం పురుషః"_ ఈ పురుషునకు ఏది జ్యోతి? అని జనకుడు ప్రశ్నింపగా భగవంతుడగు యాజ్ఞవల్క్యుడు

ముందుగ సర్వలోకప్రసిద్ధుడగు సూర్యుని జ్యోతిస్సుగా చెప్పి, ఆ సూర్యుడస్తమించినపుడు చంద్రుని, చంద్రు డస్తమించినపుడు అగ్నిని, అగ్ని శాంతమైనపుడు వాక్కును, వాక్కు శాంతమైనపుడు ఆత్మను జ్యోతిస్సుగా "శాన్తాయాం వాచి కిం జ్యోతిరేవాయం పురుష ఇత్యాత్మైవాస్య జ్యోతిర్భవతీతి ఆత్మనైవాయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మ కురుతే విపల్యేతి"-వాక్కు శాంతించినపుడు పురుషునకు ఏది జ్యోతిస్సు? అపుడు ఆత్మయే జ్యోతిస్సు. ఈ ఆత్మజ్యోతిస్సుతోడనే వెళ్లుచుండును, పనులు చేయుచుండును, తిరిగి వచ్చుచుండును అను నంతవరకును గల వాక్యములలో చెప్పెను. ఈ జ్యోతిష్ట్వము ఆత్మకు సర్వదా ఉన్నను, జాగ్రదవస్థలో ఇంద్రియాదులకు సాహాయ్యకారులగు ఆదిత్యాది బాహ్యజ్యోతిస్సులు ఉన్నపుడును, అంతరింద్రియ బాహ్యేంద్రియ సముదాయము యొక్క వ్యాపారములు కలసిపోయి ఉన్నపుడును ఈ ఆత్మజ్యోతిష్ట్వమును వేరుగ ఎత్తిచూపుటకు అవకాశము ఉండదు. సుషుప్త్యవస్థలోగూడ ఈ ఆత్మజ్యోతిస్సు వివిక్తముగ (వేరుగ) ఉన్నను ఆ సమయమున దృశ్యవస్తువులన్నియు లీనమైపోవుటచే ప్రకాశ్యవస్తువేదియు లేదు గాన ఈ ఆత్మజ్యోతిస్సును విడిగా చూపుటకు శక్యము కాదు. ఆ సమయమున అజ్ఞానమున్నను అది భావపదార్థమా, అభావపదార్థమా యని చర్చకు ఆస్పదమగుటచే సుషుప్తియందు ఆత్మ అజ్ఞానప్రకాశమని చెప్ప వీలుండదు. ఇక స్వప్నావస్థలో వ్యవహారమంతయు జాగ్రత్కాలమునందువలెనే జరుగుచుండును. కాని బాహ్యములగు జ్యోతిస్సులుగాని, స్థూలశరీరముగాని అపు డుండవు. బాహ్యేంద్రియము లన్నియు వ్యాపార ముడిగి ఉండును. అపుడు జాగ్రద్వాసనలతోగూడిన ఒక్క మనస్సు మాత్రమే, ఆత్మజ్యోతిస్సు ప్రతిబింబించుటచే సర్వాకారమై భాసించుచు, వ్యవహరించుచుండును. కావున వివిక్తమగు ఆ అవస్థలో ఆత్మ స్వయం జ్యోతిస్స్వరూపము అను విషయమును బోధించినచో సులభముగ

అర్థమగును గాన "అత్రాయం పురుషః స్వయంజ్యోతిః" అని చెప్పబడినది. ఉదాహరణమునకు జగత్తు ఎల్లప్పుడును అనగా సృష్టికి పూర్వమందును సృష్ట్యనంతరమునను గూడ సజాతీయ విజాతీయ స్వగత భేదరహిత బ్రహ్మరూపముననే ఉన్నది. అయినను శ్రోతల బుద్ధికి అనాయాసముగ అర్థమగుటకై ఛాందోగ్యోపనిషత్తు - "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్"—ఓ సౌమ్యా! సృష్టికి పూర్వము ఇది యంతయు కేవలము సన్మాత్రముగను ద్వితీయరహితముగను ఉండెను అని చెప్పుచున్నది. అట్లే స్వప్నమునందు మనస్సు కూడ జాగ్రత్సంస్కారయుక్తమైనను జడముకాన, జడము అన్యవస్తువుచే ప్రకాశింపజేయబడును గాని స్వయముగ ప్రకాశింపజాలదు గాన, స్వయముగ ప్రకాశింపజాలదు. అందుచే చైతన్య జ్యోతిఃస్వరూపమగు ఆత్మ ప్రతిబింబించుటచేతనే స్వప్నమున వస్తుప్రకాశకములగు సూర్యచంద్రాదిజ్యోతీరూపమునను, ప్రకాశ్యములగు ఘటపటాదిరూపమునను పరిణతిచెందుటకు అర్హమైయుండునని చెప్పబడినది. కావుననే అంధాదులుకూడ స్వప్నమునందు పదార్థమును చూడగలుగుచున్నారు. అట్లుకానిచో అనగా మనస్సే ప్రకాశప్రకాశ్యరూపమున పరిణమించుచున్నది అని చెప్పుకొన్నచో, జాగ్రదవస్థలో నేత్రములులేని ఆ అంధులు స్వప్నావస్థలో పదార్థములనెట్లు చూడగలుగుచున్నారు? అందుచే ఆత్మశక్తిచే, మనస్సే, నేత్రరూపమున గూడ పరిణమించుచున్నదని చెప్పవలసియున్నది. ఈ విధముగ నేత్రముగాని, ఆదిత్యాదిజ్యోతిస్సులుగాని లేని సమయమునగూడ కనబడుచున్న సకల పదార్థములను భాసింపజేయగల శక్తి ఆత్మకు మాత్రమే ఉన్నది అను విషయము శ్రోతల బుద్ధియందు చక్కగ నిలుచుటకై, శ్రుతివాక్యానుసారముగా, "యత్ర స్వయంజ్యోతి రయం పరాత్మా" అని మూలమునందు చెప్పబడినది.

అవ. సూర్యుడు వెలుతురును ఇచ్చుటద్వారా సకలప్రాణులను ప్రేరేపించుచున్నను వాటి కర్మ లేవియు ఆతనికి అంటవు.. అట్లే ఆత్మకూడ జ్యోతిస్సే కావున, బుద్ధికృతమగు కర్మచే లిప్తుడుకాడు అని ప్రసంగవశమున చెప్పుచున్నాడు_

ధీమాత్రకోపాధిరశేషసాక్షీ
న లిప్యతే తత్కృత కర్మలేపైః,
యస్మాదసంగస్తత ఏవ కర్మభిః
న లిప్యతే కించిదుపాధినా కృతైః. 101

అశేషసాక్షీ = సమస్తమునకును సాక్షియైనట్టియు, ధీమాత్రకోపాధిః = బుద్ధిమాత్రమే ఉపాధిగాగల ఆత్మ, తత్కృత = ఆ బుద్ధిచే చేయబడిన కర్మలయొక్క లేపములచే, న లిప్యతే = లిప్తుడు కాడు, యస్మాత్ = ఏ కారణమువలన, అసంగః = సంగరహితుడో, తత ఏవ = ఆ కారణమువలననే, ఉపాధినా కృతైః = ఉపాధిచే చేయబడిన, కర్మభిః = కర్మలచే, న లిప్యతే = లిప్తుడు కాడు.

'ధీమాత్రక' అనునపుడు కప్రత్యయము స్వార్థమునందు వచ్చినది. అనగా 'ధీమాత్ర' అన్న ఎంత అర్థమో 'ధీమాత్రక' అన్నను అంత అర్థమే. స్వప్నమునందు ఏ ఆత్మకు ధీమాత్రమే ఉపాధిగానుండునో అట్టి ఆత్మ ధీమాత్రకోపాధి. అట్టి ఆత్మ బుద్ధిచే చేయబడిన కర్మలయొక్క లేపములతో_సంబంధములతో, సంబంధింపదు. 'అశేషసాక్షీ' అనునది అందులకు హేతువు. సాక్షి యనగా విషయము తెలిసినవాడు; కాని కర్తృత్వము లేనివాడు. కర్మసంబంధము కర్తకు మాత్రమే ఉండును కదా? లోకమునందు గూడ వాది ప్రతివాదులుచేయు కర్మలతో సాక్షికి ఎట్టి సంబంధము ఉండదు. అట్లే ఆత్మకును "అసంగో హ్యాయం పురుషః"; "అసంగో న హి సజ్జతే" అని శ్రుతివాక్యములు గూడ ఆత్మ అసంగమని చెప్పుచున్నవి.

సంభవజరామరణాని=పుట్టుక, ముసలితనము, మరణము, స్థౌల్యాదయః = స్థూలత్వము మొదలగు, బహువిధాః = అనేకవిధములైన, ధర్మాః = ధర్మములు, శిశుతాద్యవస్థాః = బాల్యము మొదలగు అవస్థలు, వర్ణాశ్రమాదినియమాః = వర్ణాశ్రమాదినియమములు, బహుధామయాః = అనేకవిధములగు రోగములు, పూజావమాన బహుమానముఖాః = పూజ, అవమానము, సంమానము మొదలగు, విశేషాః = విశేషములును, స్థూలస్య = స్థూలశరీరమునకు, స్యుః = అగును (సంబంధించినవి).

ఉత్పత్తి వార్ధక్యమరణములు, స్థౌల్యం = అవయవములవృద్ధి, ఆదిపదముచే అవయవాపచయ (తగ్గుట) రూపమగు కృశత్వము, తెలుపు నలుపు మొదలగు వర్ణములును, అనేకప్రకారములు గల ధర్మములు, శిశుత్వము ఆదియందు వేటికో అట్టి కౌమారము, యౌవనము, వార్ధక్యము అను అవస్థలును, జరాశబ్దముచే వృద్ధత్వము వెనుక చెప్పబడియున్నను మరల దానిని ఇచట శైశవము మొదలగు అవస్థలమధ్య పేర్కొనుటలో దోషము లేదు. వర్ణాశ్రమాది నియమాః- వర్ణాః = బ్రాహ్మణత్వ క్షత్రియత్వ వైశ్యత్వ శూద్రత్వములు, ఆశ్రమాః- బ్రహ్మచర్య - గార్హస్థ్య - వానప్రస్థ - సంన్యాసములు. ఆదిపదముచే గోత్రము సూత్రము మొదలగునవి, వాటికి సంబంధించిన నియమములు అనగా బ్రాహ్మణత్వ బ్రహ్మచర్యాదులకు తగిన ధర్మములు, కులాద్యాచారములు. బహుధా ఆమయాః = అనేకవిధములగు జ్వరము, శిరోవేదన మొదలగు రోగములు. పూజ, అవమానము, బహుమానము మొదలగు విశేషములును, స్యుః = అగును. పూజా = గంధపుష్పాదులతో చేయబడిన పూజ. అవమానః = వాక్కుచేతగూడ ఆదరింపకపోవుట, కంటితోగూడ చూడకపోవుట మొదలగు తిరస్కారము. బహుమానః = ఉచ్చాసనముపై కూర్చుండబెట్టుట మొదలగునది. ఈ విధములగు విశేషములును అగును. జాతకర్మాది సంస్కారములు శరీరమునకే చేయబడును. ఆ యా ఆశ్రమములకు సంబంధించిన చిహ్నములుగూడ శరీరమునందే కనబడును. అందుచే

వర్ణాశ్రమాదినియమములు శరీరమునకే అని చెప్పబడినది. అంతరంగమునకు గూడ కొన్ని ఆంతరనియమము లున్నమాట వాస్తవమే; అయినను ప్రత్యక్షములగు నియమములన్నియు ఈ స్థూలశరీరమునకే అని అభిప్రాయము. లేదా- ఏ నియమములను బట్టి 'ఈతడు బ్రాహ్మణుడు; ఈతడు బ్రహ్మచారి' ఇత్యాదికము పరునిచే గూడ తెలియుటకు వీలగునో అవి నియమము లని యర్థము. ఆ నియమములు శరీరసంస్కారముద్వారా చిత్తమునుగూడ సంస్కరించును; తద్ద్వారా జ్ఞానమునకై ఉపయోగించును. కావున అధ్యాసచేతనైనను వాటిని తప్పక ఆదరించవలెను. పూజావమానాదులగు ఇతరధర్మములు మాత్రము బంధహేతువులుగాన ఆదరింపతగినవి కావు.

అవ. ఈ విధముగ అనాత్మయగు స్థూలదేహమును, తన్మూలకమగు సంసారబంధమును, వర్ణాశ్రమాది ధర్మానుష్ఠానముచే ఆ సంసారబంధమును విదలించుకొనవలసిన పద్ధతిని నిరూపించి, ఇపుడు ఐదు శ్లోకములలో సూక్ష్మశరీరమును నిరూపించుటకై ప్రారంభించుచున్నాడు-

## దశేంద్రియములు

బుద్ధీంద్రియాణి శ్రవణం త్వగక్షి
ఘ్రాణం చ జిహ్వా విషయావబోధనాత్,
వాక్పాణిపాదా గుద మప్యుపస్థం
కర్మేంద్రియాణి ప్రవణాని కర్మసు. 94

శ్రవణం = చెవి, త్వక్ = చర్మము, అక్షి = కన్ను, ఘ్రాణం చ = ముక్కు, జిహ్వా = నాలుక, ఇవి, విషయావబోధనాత్ = విషయములను గ్రహించుటవలన, బుద్ధీంద్రియాణి = బుద్ధీంద్రియములు, వాక్పాణిపాదాః =

వాక్కు, హస్తములు, పాదములు. గుదం=గుదస్థానము, ఉపస్థం=ఉపస్థయు, కర్మసు ప్రవణాని=ఆ యా పనులుచేయుటయందు ఆసక్తిగల, కర్మేంద్రియాణి = కర్మేంద్రియములు,

శ్రవణం=శష్కులి (చేగోణి) ఆకారముతోనున్న కర్ణముచే అవచ్ఛిన్నమగు ఆకాశమైన శ్రోత్రము, త్వక్=చర్మమందున్న ఇంద్రియము, అక్షి=నేత్రగోళావచ్ఛిన్నమైన (నేత్రగోళములోనుండు) చక్షురింద్రియము, ఘ్రాణం=నాసాప్రదేశమునందున్న ఘ్రాణేంద్రియము. జిహ్వా=రసనేంద్రియము, ఈ అయిదును, శబ్ద-స్పర్శ-రూప-గన్ధ-రసాత్మకములగు విషయముల జ్ఞానమును కలిగించుట వలన, జ్ఞానేంద్రియములని, "కథ్యన్తే"=చెప్పబడుచున్నవి అని అధ్యాహారము. వాక్=మాటలాడెడుస్వభావముగల వాగింద్రియము పాణిః=గ్రహించు స్వభావముగల హస్తేంద్రియము, పాదః=నడచు స్వభావముగల పాదేంద్రియము, శరీరమునందలి కఠినద్రవరూపములగు హేయభాగములను విడచుటకు హేతువులగు గుద-ఉపస్థములు, ఇవి, ఈమాటలాడుటమొదలగు కర్మలకు హేతుభూతములగు కర్మేంద్రియములని, 'ఉచ్యన్తే="చెప్పబడుచున్నవి" అని అధ్యాహారము. వచనాదికర్మలయందు వ్యగ్రములైయుండుట వీటికాపేరు వచ్చుటకు కారణము.

అవ. ఈ విధముగ పది బాహ్యేంద్రియములనుగూర్చి చెప్పి, ఈ యింద్రియము లన్నియు దేని సంబంధముచే పనిచేయుటకును, జ్ఞానమును కలిగించుటకును సమర్థము లగుచున్నవో, ఏదిలేనిచో అవి పనిచేయజాలకున్నవో, అట్టి ప్రధానమగు అంతఃకరణమును, అది నాల్గువిధములను విషయమును, ఇందులకు కారణమును చెప్పుచున్నాడు_

## అంతఃకరణచతుష్టయము

నిగద్యతేఽన్తఃకరణం మనో ధీరహం
కృతిశ్చిత్తమితి స్వవృత్తిభిః,
మనస్తు సంకల్పవికల్పనాదిభి
ర్బుద్ధిః పదార్థాధ్యవసాయధర్మతః. 95

అత్రాభిమానాదహ మిత్యహంకృతిః
స్వార్థానుసన్ధానగుణేన చిత్తమ్. 96

అన్తఃకరణం = అంతఃకరణము, స్వవృత్తిభిః = తనయొక్క వేరు వేరు వృత్తులచేత, మనః = మనస్సనియు, ధీః = బుద్ధియనియు, అహం కృతిః = అహంకారమనియు చిత్తమితి = చిత్తమనియు, నిగద్యతే = చెప్పబడుచున్నది, సంకల్పవికల్పనాదిభిః = సంకల్పవికల్పాదులచే, మనః = మనస్సనియు, పదార్థాధ్యవసాయధర్మతః = పదార్థనిర్ణయమువలన, బుద్ధిః = బుద్ధియనియు, అత్ర = ఈ శరీరాదులందు, అభిమానాత్ = అభిమానము వలన అహంకృతిః = అహంకారమనియు, స్వార్థానుసంధానగుణేన = తనవిషయమును మరల స్మరించుట అను గుణముచే, చిత్తం = చిత్తమనియు చెప్పబడుచున్నది.

అంతఃకరణమే చెప్పనున్న వేరువేరు వృత్తులనుబట్టి వేరువేరు పేర్లతో చెప్పబడుచున్నది. ఈ నాలుగుపేర్లకును నిమిత్తభూతములగు వృత్తులను 'మనస్తు' ఇత్యాది వాక్యమున చెప్పుచున్నాడు. 'ఇది బాగుగ నున్నది' అను అభిప్రాయము సంకల్పము. 'ఇది ఇట్లా అట్లా ?' అను సంశయము వికల్పము. ఆ యా పదార్థముల స్వరూప స్వభావములను నిర్ణయించువృత్తి బుద్ధి. ఈ శరీరాదులందు 'నేను' అను అధ్యాసముచే అహంకారము. పూర్వము తనకు విషయమైన వస్తువులను స్మరించునపుడు అంతఃకరణమునకే చిత్తమని పేరు.

అవ. సత్త్వాంశముతోగూడిన పంచభూతములలో ఒక్కొక దానినుండి క్రమముగ జనించిన జ్ఞానేంద్రియములనుగూర్చియు,

రజోగుణోపేతములగు భూతములనుండి జనించిన కర్మేంద్రియ ములను, సత్త్వప్రధానములగు ఆ అన్నిభూతముల సమష్టికార్యమగు అంతఃకరణమునుగూర్చియు నిరూపించి, ఇపుడు రజోగుణాంశముతో కూడిన భూతముల సమష్టికార్యమైనదియు, సూక్ష్మశరీరముతో సంబం ధించినదియు అగు ప్రాణమునుగూర్చి చెప్పుచున్నాడు—

## పంచప్రాణములు

ప్రాణాపానవ్యానోదానసమానా భవత్యసౌ ప్రాణః,
స్వయమేవ వృత్తిభేదాత్ వికృతేర్భేదాత్సువర్ణసలిలమివ.97

అసౌ = ఈ, ప్రాణః = ప్రాణము, స్వయమేవ = తానే, వృత్తి భేదాత్ = వృత్తిభేదమువలన, వికృతేః భేదాత్ = వికారముయొక్క భేదము వలన, సువర్ణసలిలమివ = బంగారము, నీరునువలె, ప్రాణాపానవ్యానో దానసమానాః = ప్రాణముగను, అపానముగను, వ్యానముగను, ఉదానము గను, సమానముగను, భవతి = అగుచున్నది.

ఒకే బంగారము వికారభేదముచే కటకము, కేయూరము, కుండలము మొదలగు విభిన్నాకారనామములను పొందుచున్నదో, ఒకే జలము వికారభేదముచే నది, కాలువ, చెరువు మొదలగు భేదములను పొందుచున్నదో, అట్లే అసౌ = శరీరములోపల సంచరించుచున్న ప్రాణమే, ప్రాణనము, అపాననము, వ్యాననము, ఉదాననము సమా నసము, అనెడు వృత్తులభేదముచేత ప్రాణాపానవ్యానోదానసమాన ములుగ, వేరుగ, అగుచున్నది. "సువర్ణసహితం జలం = సువర్ణ జలమ్" అని విగ్రహవాక్యము. బంగారము, జలము అను పదార్థములు అని యర్థము. కార్యభేదమువలన ఒకే సువర్ణము ఎట్లు వేరువేరుగ వ్యవహరింపబడుచున్నదో, వికృతభేదమువలననే, ఏ విధముగ, ఒకేజలము తరంగములు, నురుగు, బుడగలు మొదలగు

వేరువేరునామములతో వ్యవహరింపబడుచున్నదో అట్లు అని యర్థము. ముఖనాసికలనుండి ప్రవేశనిర్గమనములు చేయుచుండుట ప్రాణనము. మలాదులను క్రిందికి నెట్టుట అపాననము. తిని త్రాగిన అన్న-రసాదులు నాడీముఖములందు వ్యాపించునట్లు చేయుట వ్యాననము. వమనకాలమున పైకి తీసికొనిపోవుట ఉదాననము. భుజించిన అన్నరసాదులను అరిగించుటకై జాఠరాగ్నిని ప్రేరేపించుట సమాననము. ఇవి ప్రాణముచేయు ఐదు వృత్తులు.

అవ. దేని స్వరూపమును నిరూపించుటకై జ్ఞానేంద్రియాదులు చెప్పబడినవో అట్టి విశిష్టమగు సూక్ష్మశరీరమునుగూర్చి ఇపుడు చెప్పుచున్నాడు-

## సూక్ష్మశరీరము

వాగాది పంచ శ్రవణాది పంచ
ప్రాణాదిపంచా భ్రముఖాని పంచ,
బుద్ధ్యాద్యవిద్యాపి చ కామకర్మణీ
పుర్యష్టకం సూక్ష్మశరీర మాహుః. 98

వాగాదిపంచ=వాక్కు-మొదలైన ఐదు, శ్రవణాదిపంచ=శ్రవణము మొదలైన ఐదు, ప్రాణాదిపంచ=ప్రాణము మొదలైనఐదు, అభ్రముఖాని పంచ=ఆకాశము మొదలైన ఐదు, బుద్ధ్యాది=బుద్ధ్యాదిచతుష్టయము, అవిద్యాపి=అవిద్యయు, కామకర్మలును, పుర్యష్టకం=పుర్యష్టకమును (ఎనిమిది సముదాయములును) సూక్ష్మశరీరం=సూక్ష్మశరీరమునుగా, ఆహుః=చెప్పుచున్నారు.

1. వాగాది కర్మేంద్రియపంచకము, 2. శ్రవణాది జ్ఞానేంద్రియ పంచకము, 3. ప్రాణాది ప్రాణపంచకము, 4. ఆకాశాది సూక్ష్మభూత పంచకము, 5. బుద్ధ్యా ద్యన్తఃకరణచతుష్టయము, 6. అవిద్యా=

అధ్యాసము, కామకర్మణీ 7. ఇచ్ఛయు, 8. ధర్మాధర్మనామకమగు కర్మయు, ఈ విధముగ కలసిన అష్టసముదాయరూపములగు పదార్థములతో కూడినదానిని పుర్యష్టక మనియు, సూక్ష్మశరీరమనియు వేదాంతులు చెప్పదురు.

అవ. ఈ సూక్ష్మశరీరముకూడ అనేకపదార్థ సంఘాతరూపమగుటవలనను, సంహతములైనవి (కలసినవి) గృహములవలె ఇతరుల ఉపయోగమునకై ఉద్దిష్టము లగుటవలనను, ఈ సూక్ష్మశరీరముకూడ ఆత్మభిన్నమే యని చెప్పుచున్నాడు-

ఇదం శరీరం శృణు సూక్ష్మసంజ్ఞితం
లింగంత్వపంచీకృత భూతసంభవమ్,
సవాసనం కర్మఫలానుభావకం
స్వాజ్ఞానతోఽనాది రుపాధిరాత్మనః. 99

శృణు = వినుము, అపంచీకృతభూతసంభవమ్ = పంచీకృతములు కాని భూతములనుండి పుట్టినదియు, లింగం తు = లింగమైనట్టిదియు, సవాసనం = వాసనలతో కూడినదియు, కర్మఫలానుభావకం = కర్మఫలమును అనుభవింపజేయునదియు, సూక్ష్మసంజ్ఞితం = సూక్ష్మమనుపేరు గల, ఇదం శరీరం = ఈ శరీరము, ఆత్మనః = జీవాత్మకు, స్వాజ్ఞానతః = స్వరూపజ్ఞానములేకపోవుటచే ఏర్పడిన, అనాదిః = అనాదియగు, ఉపాధిః = ఉపాధి.

సూక్ష్మసంజ్ఞితం = సూక్ష్మమనుపేరు దేనికి కలిగినదో అట్లే ఇదం శరీరం = ఈ శరీరము. ఇది జన్యముకాన నిత్యాత్మస్వరూపము కాజాలదని చెప్పుటకై "అపంచీకృతభూతసంభవం" అను విశేషణము. పంచీకృతములుకాని గగనము మొదలు పృథ్వి వరకును గల ఏ భూతములు కలవో వాటినుండి పుట్టినది. కావుననే దీనికి సూక్ష్మమని పేరు. "లింగం". ఇది 'లిగి' ధాతువునుండి నిష్పన్నమైనది.

ఆత్మకు జ్ఞాపక మని యర్థము. జడములగు వాగాదికరణములు చేతన మగు ఒక అధిష్ఠాతలేకున్నచో ఆ యా కార్యములను చేయుటకై ప్రవర్తింపవు. 'అచేతనమైన వన్నియు చేతనాధిష్ఠితములైన యెడలనే కార్యముచేయును' అను వ్యాప్తి రథాదులయందు కనబడుచున్నది కదా ? బాహ్యేంద్రియములతోడను, అంతరింద్రియములతోడను గూడిన ఈ శరీరమునకే లింగశరీరమనికూడ పేరు అని అర్థము. 'తు' అనునది అవధారణమును అనగా 'ఇదియే లింగము' అను నిర్ధారణను తెలుపుచున్నది. సుషుప్త్యవస్థయందుగూడ జ్ఞానమున్నదను విషయమును కొందరు మాత్రమే అంగీకరింతురు ; జాగరస్వప్నావస్థలలో కలుగు జ్ఞానము మనోమూలముననే కలుగుచున్నది ; మనస్సు జడ పదార్థము గాన దీనియందు ఆత్మచైతన్యము ప్రతిబింబించినగాని అది ఇతర వస్తువులను ప్రకాశింపజేయజాలదు ; ఆత్మప్రతిబింబమును గ్రహించి ఆత్మజ్ఞాపకమగు— అనగా ఆత్మయొక్కఉనికిని సూచించెడు మనస్సు ఈ సూక్ష్మశరీరముతో సంబంధించియున్నది ; ఈ కారణములచే సూక్ష్మశరీరమే లింగశరీరమని చెప్పబడుచున్నది. ఈ విధమగు లింగత్వము—ఆత్మసూచకత్వము— స్థూలశరీరకారణశరీరములకు సంభవింపదు. ఆత్మ ధర్మరహితము ; స్థూలశరీరములు అప్పుడప్పుడు నశించుచుండును. కావున అనేకము లుండును ; అందుచే మోక్షము కలుగువరకును ఒక స్థూలశరీరము స్థిరముగ నుండదు.

అందుచే పూర్వపూర్వసంస్కారము, రాబోవు అనుభవముల వలన కలుగు సంస్కారములకును ఆశ్రయమై మోక్షము కలుగు వరకును స్థిరముగ నుండునది లింగశరీరమే యని 'సవాసనం' ఇత్యాదికముచే చెప్పుచున్నాడు. వాసనాభిః సహ=అనుభవజన్యములగు సంస్కారములతో కూడ, వర్తతే=ఉండునది గాన సవాసనము; భోగహేతువుకూడ ఈ లింగశరీరమే అని చెప్పుచున్నాడు— కర్మ ఫలానుభావకం=పుణ్యకర్మకును పాపకర్మకును ఫలములగు వి

సుఖదుఃఖములుకలవో, వాటియొక్క భోగమును కలిగించునది. సుషుప్త్యవస్థలో వాసనాసహితమగు లింగశరీరము విలీనమగుటచే కర్మవలనకలిగిన సుఖదుఃఖముల అనుభవముండదు. జాగ్రత్స్వప్నము లలో అట్టి లింగశరీర ముండును గావ సుఖదుఃఖానుభవము గూడ ఉండును. ఈ విధముగ అన్వయవ్యతిరేకములచే, లింగశరీరమే భోగ హేతువని తెలిసికొనవలెను. 'ఇది ఉన్నప్పుడే అది ఉండును' అని చెప్పుట అన్వయము; "ఇది లేనిచో అది ఉండదు" అని చెప్పుట వ్యతిరేకము. ఈ లింగశరీరము ఆత్మకు అనాదియగు ఉపాధి, ఇది సూక్ష్మభూతములవలన జనించినదైనను మహాప్రలయాదులలోకూడ అనభివ్యక్తరూపమున నుండును. సృష్టికాలమున అభివ్యక్తమగు చుండును; ఈ విధముగ విదేహకైవల్యము కలుగువరకును ఇది నిలచియుండును గాన ఇది స్థూలశరీరమువలె సాది (క్రొత్తగ పుట్టునది) కాదు.

(ఆశంక) అధ్యాసకామకర్మలకు అవిద్య యనిపేరు. అప్పు డప్పుడు వేరువేరు అధ్యాస-కామ-కర్మలు పుట్టుచుండును కదా? వాటితో సంబంధించిన ఒకే లింగశరీరము స్థిరముగ నుండుననుట ఎట్లు సంభావ్యము?

(సమాధానము) ఆ అధ్యాసాదులు మారుచున్నను బాహ్య ములగు వాగాదింద్రియములును, బుద్ధ్యాదిరూపమగు అంతఃకరణ మును మోక్షము కలుగునంతవరకును ఒకే విధముగ భేద మేమియు లేకుండ నుండుటచే తత్సంబద్ధమగు లింగశరీరము కూడ ఆ ఒక్కటే అని గ్రహింపవలెను. ప్రతిజన్మయందును వాగాదింద్రియములు గూడ వేరువేరుగనే జనించుచుండునని అంగీకరింప బనిలేదు; ఇది (అనా వశ్యకకల్పనారూపమగు) గౌరవము. అట్లైన మూకత్వాదులు ఎట్లు వచ్చుచున్నవి అను ప్రశ్నకు సమాధానముగ, అందులకు పూర్వ కర్మప్రతిబంధమే కారణమని చెప్పవచ్చును. సర్వకర్మల సంస్కారము

లకును నిలయమగు అంతఃకరణము ప్రతిజన్మకు వేరువేరుగ పుట్టును అని చెప్పుటకు ఏ మాత్రము వీలులేదు. అట్లు అంతఃకరణభేదము నంగీకరించినచో చేసినది పోవుట, చేయనిది వచ్చుట అను దోషము వచ్చును. పూర్వజన్మలోచేసిన కర్మాదులకు ఆశ్రయమైన అంతఃకరణము నష్టమైపోయినచో, పూర్వకర్మజన్మవాసన నూతనాంతఃకరణమునందు ఉండుటకు అవకాశములేదు గాన ఈ సంసారము ఎట్లు వచ్చినదో చెప్పుటకు తగు సమాధాన ముండదు. పూర్వ సంస్కారములేనిచో బాలకుడు స్తన్యపానమున ఎట్లు ప్రవర్తించును? ఆత్మ ధర్మవిహీనము గాన ఈ సంస్కారములు దాని నంటియుండును అని చెప్పవీలులేదు. అవిద్య నాశ్రయించి ఈ సంస్కారము లుండునని చెప్పినచో, అవిద్య ఒక్కటే గాన దానితో అనేకములగు అంతఃకరణములు సంబంధించి అందలి సంస్కారములచే సుఖదుఃఖాదులను పొందుచుండుటచే సుఖము రావలసినచోట దుఃఖము, దుఃఖము కలుగవలసినచోట సుఖము, రెండును ఒక్కమారు కలుగుట, అనేకులకు ఒకే విధములగు సుఖదుఃఖాదులు కలుగుట మొదలగు సాంకర్య మేర్పడును. సుషుప్త్యవస్థలో కూడ భోగస్మృత్యాదులు కలుగవలసియుండును. ఈ విధముగ గౌరవమువలనను, పూర్వోక్తములగు దోషములవలనను, విదేహకైవల్యము కలుగువరకు వాగాదులును, అంతఃకరణమును అభిన్నములుగనే ఉండునని తెలిసికొనవలెను. అనాది యనగా ప్రాగభావప్రతియోగి కానిది— అనగా కొంతకాలము లేక కాలాంతరమున పుట్టినది అని యర్థము. అట్టి అనాదిత్వము అవిద్యకు ఉన్నది. కాని వాగాదులకు అట్టి అనాదిత్వము లేదు. అయినను ఒకమారు జన్మించి అవి చివరివరకును అభిన్నములుగనే ఉండును అను నుద్దేశముతో అవిగూడ అనాది యని చెప్పబడినవి. వాస్తవమున ఆత్మ ఒక్కటేయైనను, జ్ఞానుల విషయమున గూడ భూమికాభేదమునుబట్టి కనబడుచున్న, బ్రహ్మవేత్త, "బ్రహ్మవిద్వరుడు" 'బ్రహ్మవిద్వరీయాంసుడు', 'బ్రహ్మవిద్వరిష్ఠుడు' అను విభిన్న

వ్యవహారమును అంతఃకరణభేదమును బట్టియే సమర్థించవలసి యున్నది. కావున "యావత్కార్యమవస్థాయి భేద హేతో రుపాధితా"– కార్య మున్నంతవరకును ఉండి, భేదమునకు కారణభూతమైనదానికి ఉపాధి యనిపేరు అను లక్షణముగల ఉపాధిత్వము లింగశరీరము విషయమున నిస్సంశయముగ కుదురును. అసంగమగుటచే దేని చేతను ఉపహితముకాని ఆత్మకు లింగశరీరము ఉపాధి యెట్లగును– అను నాశంకకు సమాధానముగ స్వాజ్ఞానతః అని చెప్పబడినది. స్వస్వరూపము ఇపుడు తెలియకుండుటచే, తన్మూలకముగ ఉపాధి కల్పితమైనదని అభిప్రాయము.

అవ. ఈ సూక్ష్మశరీరమునకుమాత్రమే ఉన్న అసాధారణా వస్థను చెప్పుచున్నాడు–

స్వప్నో భవత్యస్య విభక్త్యవస్థా
స్వమాత్రశేషేణ విభాతి యత్ర,
స్వప్నే తు బుద్ధిః స్వయమేవ జాగ్రత్-
కాలీన నానావిధవాసనాభిః,
కర్త్రాదిభావం ప్రతిపద్య రాజతే
యత్ర స్వయంజ్యోతి రయం పరాత్మా. 100

స్వప్నః = స్వప్నము, అస్య = ఈ సూక్ష్మశరీరముయొక్క, విభక్త్యవస్థా = విశిష్టమైన (దీనికి మాత్రమే చెందిన) అవస్థగా, భవతి = అగుచున్నది. యత్ర = దేనియందు, స్వమాత్రశేషేణ విభాతి = తాను ఒక్కటిమాత్రమే మిగిలి, ప్రకాశించుచున్నదో. బుద్ధిస్తు = బుద్ధియైతే, స్వప్నే = స్వప్నమునందు, జాగ్రత్కాలీన నానావిధ వాసనాభిః = జాగ్రత్కాల మునకు సంబంధించిన అనేకవిధములగు వాసనలచే, స్వయమేవ = తానే, కర్త్రాదిభావం = కర్తృత్వము మొదలగువాటిని, ప్రతిపద్య = పొంది, రాజతే = ప్రకాశించును, యత్ర = ఎచట, అయం = ఈ, పరాత్మా = పరమాత్మ, స్వయంజ్యోతిః = స్వయంజ్యోతి స్వరూపమై ప్రకాశించుచున్నదో.

అస్య = ఈసూక్ష్మశరీరముయొక్క, విభక్త్యవస్థా = భేదకమగు అవస్థ, స్వప్నజాగ్రదవస్థలలో స్థూలశరీరమునకు గూడ ప్రవృత్తి యుండుటవలనను, సుషుప్త్యవస్థలో ఈ సూక్ష్మశరీరముగూడ లీనమై పోవుటవలనను, సూక్ష్మశరీరమునకు స్వప్నమునందే ప్రాధాన్యమని అర్థము. స్వమాత్రేత్యాదికముచే అందులకు హేతువు చెప్పుచున్నాడు. స్వమాత్రమనగా తానే అని యర్థము. దానియొక్క, శేషః = అవశిష్టత్వము. అభిమానాస్పదమగు తనచే మాత్రమే అని యర్థము. ఆ అవస్థలో స్థూలదేహాభిమానము ఉండదు గాన సూక్ష్మదేహ మొక్కటి మాత్రమే అభిమానవిషయ మగును. 'ఆత్మా' అని అధ్యాహారము. ఆత్మ ఏ స్వప్నమునందు స్థూలాభిమానమును విడచి సూక్ష్మశరీరమును మాత్రమే (తాను అని) అభిమానించుచు ప్రకాశించుచుండునో, సంగ్రహముగ చెప్పిన విషయమును, స్వమాత్రశేషత్వమును 'స్వప్నే' ఇత్యాదివాక్యముచే వివరించుచున్నాడు. స్వప్నావస్థయందు, బుద్ధిః = అంతఃకరణము, స్వయమేవ = ఇతరకారకముల అపేక్ష లేనిదై తాను మాత్రమే, జాగ్రదవస్థయందు కలిగిన బహువిధసంస్కారములచే, కర్త్రాదిభావం = కర్తృత్వము, కర్మత్వము, క్రియాత్వము, కరణత్వము, అధికరణత్వము మొదలగు దానిని, అనగా సకలక్రియాకారక భావమును పొంది ప్రకాశించుచుండును.

(ఆశంక) జడమైన అంతఃకరణమునకు ఇట్టి శక్తి ఎట్లు వచ్చినది? శరీరములోపలనున్న హితమనుపేరుగల నాడులయందు మనస్సు సంచరించునపుడు స్వప్నము కలుగును అని శ్రుతి చెప్పుటచే అచట ప్రకాశమున కేమాత్రము అవకాశము లేదుకదా?

(సమాధానము) 'యత్ర స్వయంజ్యోతిః' ఇత్యాది వాక్యముచే సమాధానము చెప్పుచున్నాడు.

న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం
నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః

తమేవభాన్త మనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి.
యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్,
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్.

ఆ ఆత్మతేజస్సునెదుట సూర్యుడు భాసించడు; చంద్రనక్షత్రములు భాసించవు; ఈ మెరుపులు భాసించవు. ఈ అగ్ని ఎట్లు భాసించును? భాసించుచున్న ఆ ఆత్మనే అనుసరించి అన్నియు భాసించుచున్నవి; దాని కాంతిచే ఇది అంతయు భాసించుచున్నది. "సూర్యునియందలి ఏ తేజస్సు జగత్తునంతను భాసింపజేయుచున్నదో, చంద్రునియందేది యున్నదో, అగ్నియందేది యున్నదో ఆ తేజస్సు నా సంబంధమైనది అని గ్రహింపుము" అను శ్రుతిస్మృతులచే కొనియాడబడుచున్న మహిమకలదియు, ఇతరప్రకాశ్యము కానిదియు, జ్యోతీరూపమును, అగు పరమాత్మకు సంబంధించిన చైతన్యజ్యోతిస్సు యొక్క సంబంధముచే, జాగ్రదవస్థలో నేర్పడిన వాసనలతో కూడిన అంతఃకరణమునకు ఈ శక్తి కలుగుచున్నది.

(ఆశంక) "సత్యం జ్ఞానమ్", "విజ్ఞానమానన్దం బ్రహ్మ", "అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః", "ప్రజ్ఞానం బ్రహ్మ", "కృత్స్నః ప్రజ్ఞాన ఘన ఏవ" ఇత్యాదిశ్రుతుల ననుసరించి ఆత్మ యెల్లప్పుడును చైతన్యజ్యోతీరూపమై స్వయంజ్యోతిస్స్వభావమే కదా? అట్టిచో 'యత్ర స్వయంజ్యోతి రయం పరాత్మా' అని స్వప్నవిషయముననే ఉన్న ఒక విశేషముగ ఏల చెప్పబడినది?

(సమాధానము) ఇందులకు కారణము చెప్పుచున్నాను వినుము. బృహదారణ్యకములోనున్న జ్యోతిర్బ్రాహ్మణమును ఆమూల చూడముగ పరిశీలించినచో ఈ విషయమును సులభముగ తెలిసికొనవచ్చును. అచట "కిం జ్యోతిరయం పురుషః"– ఈ పురుషునకు ఏది జ్యోతి? అని జనకుడు ప్రశ్నింపగా భగవంతుడగు యాజ్ఞవల్క్యుడు

ముందుగ సర్వలోకప్రసిద్ధుడగు సూర్యుని జ్యోతిస్సుగా చెప్పి, ఆ సూర్యుడస్తమించినపుడు చంద్రుని, చంద్రు డస్తమించినపుడు అగ్నిని, అగ్నిశాంతమైనపుడు వాక్కును, వాక్కు శాంతమైనపుడు ఆత్మను జ్యోతిస్సుగా "శాన్తాయాం వాచి కిం జ్యోతిరేవాయం పురుష ఇత్యాత్మైవాస్య జ్యోతిర్భవతీతి ఆత్మనైవాయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మ కురుతే విపల్యేతి"-వాక్కు శాంతించినపుడు పురుషునకు ఏది జ్యోతిస్సు? అపుడు ఆత్మయే జ్యోతిస్సు. ఈ ఆత్మజ్యోతిస్సుతోడనే వెళ్లుచుండును, పనులు చేయుచుండును, తిరిగి వచ్చుచుండును అను నంతవరకును గల వాక్యములలో చెప్పెను. ఈ జ్యోతిష్ట్వము ఆత్మకు సర్వదా ఉన్నను, జాగ్రదవస్థలో ఇంద్రియాదులకు సాహాయ్యకారులగు ఆదిత్యాది బాహ్యజ్యోతిస్సులు ఉన్నపుడును, అంతరింద్రియ బాహ్యేంద్రియ సముదాయము యొక్క వ్యాపారములు కలసిపోయి ఉన్నపుడును ఈ ఆత్మజ్యోతిష్ట్వమును వేరుగ ఎత్తిచూపుటకు అవకాశము ఉండదు. సుషుప్త్యవస్థలోగూడ ఈ ఆత్మజ్యోతిస్సు వివిక్తముగ (వేరుగ) ఉన్నను ఆ సమయమున దృశ్యవస్తువులన్నియు లీనమైపోవుటచే ప్రకాశ్యవస్తువేదియు లేదు గాన ఈ ఆత్మజ్యోతిస్సును విడిగా చూపుటకు శక్యము కాదు. ఆ సమయమున అజ్ఞానమున్నను అది భావపదార్థమా, అభావపదార్థమా యని చర్చకు ఆస్పదమగుటచే సుషుప్తియందు ఆత్మ అజ్ఞానప్రకాశమని చెప్ప వీలుండదు. ఇక స్వప్నావస్థలో వ్యవహారమంతయు జాగ్రత్కాలమునందువలెనే జరుగుచుండును. కాని బాహ్యములగు జ్యోతిస్సులుగాని, స్థూలశరీరముగాని అపు డుండవు. బాహ్యేంద్రియము లన్నియు వ్యాపార ముడిగి ఉండును. అపుడు జాగ్రద్వాసనలతోగూడిన ఒక్క మనస్సు మాత్రమే, ఆత్మజ్యోతిస్సు ప్రతిబింబించుటచే సర్వాకారమై భాసించుచు, వ్యవహరించుచుండును. కావున వివిక్తమగు ఆ అవస్థలో ఆత్మ స్వయం జ్యోతిస్స్వరూపము అను విషయమును బోధించినచో సులభముగ

అర్థమగును గాన "అత్రాయం పురుషః స్వయంజ్యోతిః" అని చెప్ప బడినది. ఉదాహరణమునకు జగత్తు ఎల్లప్పుడును అనగా సృష్టికి పూర్వ మందును సృష్ట్యనంతరముననును గూడ సజాతీయ విజాతీయ స్వగత భేదరహిత బ్రహ్మరూపముననే ఉన్నది. అయినను శ్రోతల బుద్ధికి అనాయాసముగ అర్థమగుటకై ఛాందోగ్యోపనిషత్తు - "సదేవ సోమ్యే దమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్"—ఓ సౌమ్యా! సృష్టికి పూర్వము ఇది యంతయు కేవలము సన్మాత్రముగను ద్వితీయరహితముగను ఉండెను అని చెప్పుచున్నది. అట్లే స్వప్నమునందు మనస్సు కూడ జాగ్రత్సంస్కారయుక్తమైనను జడముకాన, జడము అన్యవస్తువుచే ప్రకాశింపజేయబడును గాని స్వయముగ ప్రకాశింపజాలదు గాన, స్వయముగ ప్రకాశింపజాలదు. అందుచే చైతన్య జ్యోతిఃస్వరూప మగు ఆత్మ ప్రతిబింబించుటచేతనే స్వప్నమున వస్తుప్రకాశకములగు సూర్యచంద్రాదిజ్యోతీరూపముననను, ప్రకాశ్యములగు ఘటపటాదిరూప మునను పరిణతిచెందుటకు అర్హమైయుండునని చెప్పబడినది. కావుననే అంధాదులుకూడ స్వప్నమునందు పదార్థమును చూడగలుగుచున్నారు. అట్లుకానిచో అనగా మనస్సే ప్రకాశప్రకాశ్యరూపమున పరిణమించు చున్నది అని చెప్పుకొన్నచో, జాగ్రదవస్థలో నేత్రములులేని ఆ అంధులు స్వప్నావస్థలో పదార్థములనెట్లు చూడగలుగుచున్నారు? అందుచే ఆత్మశక్తిచే, మనస్సే, నేత్రరూపమున గూడ పరిణమించు చున్నదని చెప్పవలసియున్నది. ఈ విధముగ నేత్రముగాని, ఆది త్యాదిజ్యోతిస్సులుగాని లేని సమయమునగూడ కనబడుచున్న సకల పదార్థములను భాసింపజేయగల శక్తి ఆత్మకు మాత్రమే ఉన్నది అను విషయము శ్రోతల బుద్ధియందు చక్కగ నిలుచుటకై, శ్రుతివాక్యాను సారముగా, "యత్ర స్వయంజ్యోతి రయం పరాత్మా" అని మూల మునందు చెప్పబడినది.

అవ. సూర్యుడు వెలుతురును ఇచ్చుటద్వారా సకలప్రాణులను ప్రేరేపించుచున్నను వాటి కర్మ లేవియు ఆతనికి అంటవు.. అట్లే ఆత్మకూడ జ్యోతిస్సే కావున, బుద్ధికృతమగు కర్మచే లిప్తుడుకాడు అని ప్రసంగవశమున చెప్పుచున్నాడు—

ధీమాత్రకోపాధిరశేషసాక్షీ
న లిప్యతే తత్కృత కర్మలేపైః,
యస్మాదసంగస్తత ఏవ కర్మభిః
న లిప్యతే కించిదుపాధినా కృతైః. 101

అశేషసాక్షీ = సమస్తమునకును సాక్షియైనట్టియు, ధీమాత్రకోపాధిః = బుద్ధిమాత్రమే ఉపాధిగాగల ఆత్మ, తత్కృత = ఆ బుద్ధిచే చేయబడిన కర్మలయొక్క లేపములచే, న లిప్యతే = లిప్తుడు కాడు, యస్మాత్ = ఏ కారణమువలన, అసంగః = సంగరహితుడో, తత ఏవ = ఆ కారణమువలననే, ఉపాధినా కృతైః = ఉపాధిచే చేయబడిన, కర్మభిః = కర్మలచే, న లిప్యతే = లిప్తుడు కాడు.

'ధీమాత్రక' అనునపుడు కప్రత్యయము స్వార్థమునందు వచ్చినది. అనగా 'ధీమాత్ర' అన్న ఎంత అర్థమో 'ధీమాత్రక' అన్నను అంత అర్థమే. స్వప్నమునందు ఏ ఆత్మకు ధీమాత్రమే ఉపాధిగానుండునో అట్టి ఆత్మ ధీమాత్రకోపాధి. అట్టి ఆత్మ బుద్ధిచే చేయబడిన కర్మలయొక్క లేపములతో — సంబంధములతో, సంబంధింపదు. 'అశేషసాక్షీ' అనునది అందులకు హేతువు. సాక్షి యనగా విషయము తెలిసినవాడు; కాని కర్తృత్వము లేనివాడు. కర్మసంబంధము కర్తకు మాత్రమే ఉండును కదా? లోకమునందు గూడ వాది ప్రతివాదులుచేయు కర్మలతో సాక్షికి ఎట్టి సంబంధము ఉండదు. అట్లే ఆత్మకును "అసంగో హ్యాయం పురుషః"; "అసంగో న హి సజ్జతే" అని శ్రుతివాక్యములు గూడ ఆత్మ అసంగమని చెప్పుచున్నవి.

"యస్మాదసంగః" ఇత్యాదివాక్యముచే_ బుద్ధిచేతగాని, తదితరము లగు వాగాదికములగు ఉపాధులచేగాని చేయబడు కర్మలతో గూడ ఈ ఆత్మకు సంబంధము లేదని చెప్పుచున్నాడు. తతః ఏవ = ఆత్మ అసంగము అను కారణమువలననే, ఉపాధినా కృతైః=శరీరముచేగాని, వాక్కుచేగాని, మనస్సుచేగాని, మఱి యే యితరములగు ఉపాధులచే గాని చేయబడిన, కర్మభిః=సదసత్కర్మలచే, ఏ మాత్రము, న లిప్యతే= సంబద్ధుడు కాడు.

అవ. సంగము ఉపాధికల్పితము; అసంగత్వము వాస్తవికము అని నిరూపించుచున్నాడు_

సర్వవ్యాపృతికరణం లింగమిదం స్యాచ్చిదాత్మనః పుంసః,
వాస్యాదికమివ తక్షః తేనైవాత్మా భవత్యసంగోఽయమ్.102

వాస్యాదికం=బాడిత మొదలగునది, తక్షః ఇవ = వడ్రంగికి వలె, ఇదం = ఈ, లింగం=లింగశరీరము, చిదాత్మనః పుంసః = చిదాత్ముడగు పురుషునకు, సర్వవ్యాపృతికరణం = సమస్తమైన వ్యాపారములకు సాధనముగా, స్యాత్ = అగును, తేనైవ = ఆ కారణముచేతనే, అయం ఆత్మా= ఈ ఆత్మ, అసంగః భవతి = సంగము లేనిది అగుచున్నది.

చిదాత్మనః = జ్ఞానస్వరూపుడగు, పుంసః = పురుషునకు- ఆత్మకు, ఇదం లింగం = బుద్ధ్యాదులతో కూడిన ఈ లింగశరీరము, తక్షః = వడ్రంగికి, వాస్యాదికమివ = చెక్కుటకు ఉపయోగించు బాడిత మొదలగునది వలె, సర్వవ్యాపృతికరణం = సకలవ్యాపారములకు అసాధారణ కరణముగా అగును. వడ్రింగికికూడ కట్టను చెక్కెడు సామర్థ్యము బాడిత మొదలగు సాధనము లుండుటవలన వచ్చినది కాని స్వాభావికము కాదు; అట్లే ఆత్మకు అజ్ఞానకృతమగు లింగశరీర సంబంధ మున్నపుడే సకల వ్యవహారములును ఏర్పడుచుండును. కావుననే సుషుప్త్యవస్థయందు లింగశరీరసంబంధము లేదు గాన వ్యవహారముకూడ ఉండదు. తేనైవ = లింగశరీరసంబంధ మున్నపుడు

వ్యాపారముండుట, అది లేనపుడు వ్యాపారము లేకపోవుట అను లోకప్రసిద్ధమగు హేతువుచేతనే, అయం = ఈ ఆత్మ, అసంగః = వాస్తవమున ఎట్టి వ్యవహారములతోడను సంబంధములేనివాడుగా అగుచున్నాడు.

అవ. (ఆశంక) 'అహం'-నేను అను ప్రతీతికి విషయమైనదే కదా ఆత్మ? 'నేను అంధుడను', 'నేను చెవిటివాడను', నేను మూగ వాడను' 'నేను నిట్టూర్చుచున్నాను', "నేను ఆకలిదప్పికలతో బాధ పడుచున్నాను", "నేను సుఖవంతుడను', "నేను దుఃఖవంతుడను" ఇత్యాది ప్రతీతుల ననుసరించి ఆత్మకు అనేకధర్మములతో సంబంధ మున్నట్లు కనబడుచున్నపుడు ఆత్మ అసంగమని చెప్పుట ఎట్లు పొస గును?

(సమాధానము) ఆ ధర్మము లన్నియు ఆ యా ఉపాధులకు సంబంధించినవి; సాంసారికధర్మము లేవియు ఆత్మకు లేవు అని చెప్పుటకై ఆ యా ఉపాధులకుగల ఆ యా ధర్మములను వివరించు చున్నాడు-

అన్ధత్వ మన్దత్వ పటుత్వ ధర్మాః
సౌగుణ్యవైగుణ్యవశాద్ధి చక్షుషః,
బాధిర్య మూకత్వ ముఖాస్తథైవ
శ్రోత్రాదిధర్మా న తు వేత్తు రాత్మనః. 103

చక్షుషః = నేత్రముయొక్క, సౌగుణ్యవైగుణ్యవశాత్ = సరిగా నుండుట, చెడిపోవుట అనుకారణములవలన, అంధత్వ-మందత్వ-పటుత్వ ధర్మాః = గ్రుడ్డితనము, చూపుమందముగా నుండుట, చూపు బాగుగా నుండుట అను ధర్మములు కలుగుచున్నవి. తథైవ = అట్లే, బాధిర్య మూకత్వ ముఖాః = చెవుడు, మూగతనము మొదలగునవి, శ్రోత్రాది ధర్మాః = శ్రోత్రాదులధర్మములు, వేత్తుః = జ్ఞాతయైన, ఆత్మనస్తు = ఆత్మ యొక్క ధర్మములైతే, న = కాదు.

ముందుగ బాహ్యేంద్రియధర్మములను చెప్పుచున్నాడు. నేత్రముః బాగున్నచో పటుత్వము, చెడిపోయినచో అంధత్వము, మందత్వము కలుగును. ఈ విధముగ శ్రోత్రవైగుణ్యమువలన బాధిర్య మందత్వములు, దాని సౌగుణ్యమువలన పటుత్వము, వాగింద్రియ వైగుణ్యమువలన మూకత్వము, సౌగుణ్యమువలన పటుత్వము. త్వక్-ఘ్రాణ-రసనారూపములగు జ్ఞానేంద్రియముల విషయమునను, పాణి పాదాదులగు కర్మేంద్రియముల విషయమునను ఇట్లే గ్రహించవలెను. ఇది అంతయు ఆత్మకు సంబంధించినదికాదు. 'వేత్తుః' ఇత్యాదివాక్యముచే ఇందులకు కారణము చెప్పుచున్నాడు. చక్షు రాదుల యందున్న మందత్వ పటుత్వాదికము సాక్షియగు ఆత్మచే తెలియబడుచున్నది గాన వేద్యమగు అది (మందత్వాదికము) వేత్త యొక్క ధర్మము కాజాలదు. 'తు' అనునది నిశ్చయార్థకము.

అవ. ఉచ్ఛ్వాస క్షుత్పిపాసాదులు ప్రాణధర్మములని చెప్పుచున్నాడు–

## ప్రాణధర్మములు

ఉచ్ఛ్వాస నిఃశ్వాస విజృంభణ క్షుత్
ప్రస్పన్దనాద్యుత్క్రమణాదికాః క్రియాః,
ప్రాణాదికర్మాణి వదన్తి తద్జ్ఞాః
ప్రాణస్య ధర్మావశనా పిపాసే. 104

ఉచ్ఛ్వాస.... ఆదికాః... ఉచ్ఛ్వాస=ఊపిరి పీల్చుకొనుట, నిఃశ్వాస=ఊపిరి విడచుట, విజృంభణ=ఆవులింత, క్షుత్=ఆకలి, ప్రస్పన్దన=కదలుట, ఆది=మొదలగునవియు, ఉత్క్రమణాదికాః=పైకివెడలుట మొదలగు, క్రియాః=క్రియలను, తద్జ్ఞాః=వాటినిగూర్చి తెలిసినవారు, ప్రాణాది కర్మాణి=ప్రాణాదులయొక్క కర్మలనుగా, వదన్తి=చెప్పుదురు, అశనా పిపాసే=ఆకలి దప్పికలు, ప్రాణస్య=ప్రాణముయొక్క, ధర్మౌ=ధర్మములు.

'ప్రాణాది' అను పదమునందలి 'ఆది' పదముచే అపానాదులను నాగాదులను గ్రహింప వలెను. ఉచ్ఛ్వాసము ప్రాణముయొక్క క్రియ. నిఃశ్వాసము అపానక్రియ. విజృంభణము దేవదత్తక్రియ. తుమ్ము కృకరక్రియ. ప్రస్పన్దన మనగా ఎక్కువ చలనము. ఇది వ్యానముయొక్క లేదా ధనంజయముయొక్క క్రియ. ఆది పదములచే ఉన్మీలనము గ్రహింపబడును. అది కూర్మక్రియ. పైకి వెడలుట ఉదానక్రియ. ఆదిపదముచే వమనముకూడ కూర్మక్రియయే. ఈ క్రియలు ప్రాణాదులక్రియలని అనగా ఈ క్రియ ఈ వాయువునకు చెందినదని, వాటినిగూర్చి తెలిసినవారు చెప్పుచున్నారు. ఇట్లు ఆకలి దప్పికలుగూడ ప్రాణముయొక్క ధర్మములు కావుననే, నిద్రా సమయమున ప్రాణాభిమాన ముండదు గాన క్షుత్పిపాస లుండవు.

అవ. అంధత్వాదులు అనాత్మలగు చక్షురాదుల ధర్మములైనచో ఆత్మ వీటిని తన ధర్మములని ఏల భావించుచున్నది అని ఆశంకించి సమాధానము చెప్పుచున్నాడు_

## అహంకారము

అన్తఃకరణమేతేషు చక్షురాదిషు వర్ష్మణి,<br>
అహమిత్యభిమానేన తిష్ఠత్యాభాసతేజసా 105

అన్తఃకరణం = మనస్సు, ఏతేషు = ఈ, చక్షురాదిషు = చక్షురాదీంద్రియములయందును, వర్ష్మణి = దేహమునందును, ఆభాసతేజసా = జీవునితోకూడ, అహమితి = నేను అని, అభిమానేన = అభిమానముతో, తిష్ఠతి = ఉంటున్నది.

మనస్సు ఈ జ్ఞానేంద్రియ కర్మేంద్రియప్రాణాదులయందును, వర్ష్మణి = స్థూలశరీరమునందును, ఆభాసతేజసా = చిత్తు ప్రతిబింబింపగా నేర్పడిన తేజస్సుతో అనగా జీవునితోకూడ, అహమిత్యభి

మానేన=అజ్ఞానకృతమగు తాదాత్మ్యాభిమానముతో ఉండును. ఆత్మా నాత్మవివేకశూన్యమైన అంతఃకరణము ఆత్మప్రతిబింబమును గ్రహించి తద్ద్వారా చేతనమై, చక్షురాదీంద్రియములు మొదలు దేహము వరకును ఉన్నవాటి నన్నింటిని 'నేను' అని అనుకొనును. అందుచే ఆ అంతఃకరణకు వశమైయున్న ఆత్మకూడ అంధత్వాదిధర్మములను తనపై ఆరోపించుకొని 'నేను అంధుడను' ఇత్యాదివిధమున వ్యవహరించుచుండును అని భావము. సుషుప్త్యవస్థలో ఆత్మ అంతఃకరణమునందు ప్రతిబింబించుట లేదు. అందుచే 'నేను అంధుడను' ఇత్యాది వ్యవహారముకూడ అపుడు లేదు. స్వప్నమునందు ఆత్మ అంతఃకరణ ప్రతిబింబితమైనను, ఆ యవస్థలో బాహ్యేంద్రియములన్నియు లీనములగుటచే, అంతఃకరణము ఆభాసతేజస్సుతో బాహ్యేంద్రియముల యందుండుట అనునది లేదు. అందుచేతనే జాగ్రత్తునందువలె స్వప్నమునందు అంధత్వాది వ్యవహారము లేదని గ్రహింపవలెను.

అవ. ఈ విధముగ ఆత్మయొక్క బాహ్యసంసారమంతయు అంతఃకరణమూలకమే అని చెప్పి, ఆంతరములగు కర్తృత్వ-సుఖ-దుఃఖాదికము కూడ దానికే—అంతఃకరణమునకే చెందును అని చెప్పుచున్నాడు—

> అహంకారః స విజ్ఞేయః కర్తా భోక్తాభిమాన్యయమ్,
> సత్త్వాదిగుణయోగేనావస్థాత్రితయ మశ్నుతే. 106

సః=ఆ అంతఃకరణమే, అహంకారః=అహంకారమనియు, కర్తా=కర్తయనియు, విజ్ఞేయః=తెలియదగినది, అయం=ఇదియే, భోక్తా=భోక్తయనియు, అభిమానీ=కర్తృత్వభోక్తృత్వాభిమానము కలది, సత్త్వాది గుణయోగేన=సత్త్వము మొదలగు గుణముల సంబంధముచే, అవస్థా త్రితయం=అవస్థాత్రయమును, అశ్నుతే=పొందుచున్నది.

ఈ విధముగ చక్షురాదీంద్రియములయందును, శరీరము నందును 'అహం' అను అభిమానముతో ప్రవర్తించుచున్న, చిత్ప్రతిబింబవిశిష్టమైన అంతఃకరణమే అహంకారమని తెలియదగినది. విధేయప్రాధాన్యము ననుసరించి 'సః' అని పుంలింగప్రయోగము. ఇదియే కర్తయనియు భోక్తయనియు అభిమానముకలది. ఈ అంతఃకరణము సత్త్వరజస్తమోరూపమగు ప్రకృతియొక్క కార్యమగుటచే సత్త్వాదిగుణత్రయ సంబంధమునుబట్టి జాగ్రత్స్వప్నసుషుప్తి రూపములగు మూడు అవస్థలను, అశ్నుతే=పొందుచున్నది. రజోగుణ సంబంధముచే జాగరము, సత్త్వగుణయోగముచే స్వప్నము, తమోగుణయోగముచే సుషుప్తి అని విభేదము గుణత్రయసంబంధము ఎల్లప్పుడును ఉన్నను ఆ యా సమయములలో ఆ యా గుణము ఉత్కటముగ ఉండునని తెలియవలెను.

అవ. ఈ విధముగ ఆంతరములగు కర్తృత్వభోక్తృత్వములు అన్తఃకరణధర్మములే యని చెప్పి, ఇపుడు, సుఖదుఃఖములు గూడ దాని ధర్మములే యని చెప్పుచున్నాడు—

విషయాణామానుకూల్యే సుఖీ దుఃఖీ విపర్యయే,
సుఖం దుఃఖం చ తద్ధర్మః సదానన్దస్య నాత్మనః. 107

విషయాణాం ఆనుకూల్యే = విషయములు అనుకూలముగ నుండునపుడు, సుఖీ = సుఖవంతుడని: విపర్యయే = అందుకు విపరీతముగనున్నపుడు, దుఃఖీ = దుఃఖవంతుడు, సుఖం = సుఖము, దుఃఖం చ = దుఃఖము, తద్ధర్మః = అంతఃకరణముయొక్క ధర్మము, సదానన్దస్య=సర్వదా ఆనంద స్వరూపుడగు, ఆత్మనః = ఆత్మయొక్క ధర్మము, న = కాదు.

విషయాణాం = శబ్దాదివిషయముల యొక్క, అనుకూల్యే = తన ఇచ్ఛననుసరించి ప్రాప్తికలిగినపుడు, సుఖీ = నేను సుఖవంతుడను అను ప్రతీతి కలుగును. విపర్యయే = అందులకు విరుద్ధముగ, తన

ఇచ్ఛకు విరుద్ధముగ ప్రాప్తి కలిగినపుడు, దుఃఖీ=నేను దుఃఖవంతుడను అని అభిమానము (కలుగును), ఈ విధముగ సుఖదుఃఖములు రెండును అంతరకరణముయొక్క ఇచ్ఛను అనుసరించి యుండుట వలన, సదానన్దస్య="ఆనన్దో బ్రహ్మ" "విజ్ఞానమానన్దం బ్రహ్మ" "రసో వై సః" "యదేష ఆకాశః" ఇత్యాదిశ్రుతులచే ఎల్లప్పుడును ఆనందస్వరూపుడగు ఆత్మయొక్క ధర్మము కాదు. బాగుగ పరిశీలించినచో ఇది యుక్తమే. ఒకసమయమున సుఖమును కలిగించిన శబ్దమే మరియొక సమయమున దుఃఖజనకమగుట లోకప్రసిద్ధము. అందులకు కారణము మనోభేదముతక్క మరియొకటి ఏదియు చెప్పుటకు వీలులేదు. శబ్దరూపమగు ఆ విషయము, కాలముగూడ ఒకే విధముగ నున్నవి కదా. అదే శబ్దముచే మరియొకనికి సుఖము కలుగుచున్నది గాన ఆ కాలమునం దుండుటచే ఆ శబ్దము సుఖహేతువు కాలేదు అని చెప్పుట గూడ యుక్తము కాదు, మనస్సునకు పూర్వము ఈ శబ్దము సుఖహేతువని తోచినది; ఇపుడు ప్రతికూలమని తోచినది. అందుచే సుఖదుఃఖములు రెండును మనోధర్మములే యని చెప్పవలెను.

అవ. ఇపుడు, ఆత్మ సదానందస్వరూపమని శ్రుతిప్రసిద్ధమగు విషయమును యుక్తిచే ప్రతిపాదించుచున్నాడు—

## అన్నిప్రియములు ఆత్మకొఱకే

**ఆత్మార్థత్వేన హి ప్రేయాన్ విషయో న స్వతః ప్రియః,**<br>**స్వత ఏవ హి సర్వేషా మాత్మా ప్రియతమో మతః. 108**

హి=ఎందువలన ననగా, విషయః=విషయము, స్వతః=స్వతఃసిద్ధముగ, న ప్రియః=ప్రియముకాదు, ఆత్మార్థత్వేన=ఆత్మకొఱకైన దగుటచే, ప్రేయాన్=ప్రియమైనది, హి=ఏ కారణమువలన, ఆత్మా=ఆత్మ, స్వత ఏవ=స్వతఃసిద్ధముగనే, సర్వేషాం=అందరికిని, ప్రియతమః=ఎక్కువ ప్రియమైనదిగా, మతః=అంగీకరింపబడినదో.

హి=ఏ కారణమువలన, విషయము, స్వతః=అది విషయము అనే కారణముచేత, ప్రీతిగోచరముకాదు. కాని, ఆత్మార్థత్వేన=ఆత్మకు సుఖమునుగాని, దుఃఖనివృత్తినిగాని, కలిగించుచున్నది గాన ప్రేమ విషయ మగుచున్నది. విషయమైనంత మాత్రముననే, ప్రియమైనచో అది ఎల్లప్పుడును ప్రియముగనే ఉండవలెను. కాని అట్లు కనబడుట లేదు. ఒకకాలమున చాలఇష్టమైన శబ్దాదివిషయములను మిత్రపుత్రకళత్రాదులనుగూడ జనులు విడచివేయుచున్నారు; తమ శరీరమును గూడ దండించుచున్నారు; ప్రాణమును నిరోధించుచున్నారు; మనస్సును కూడ లయ మొందించుచున్నారు. ఇక చెప్పవలసినది ఏమున్నది? ఆనందమయకోశమని ప్రసిద్ధమైన అజ్ఞానమునుకూడ భంజింపచేయుచున్నారు. ఇందుల కేమికారణము? ఆత్మభిన్నము లన్నియు ఆనందరూపములు కాకుండుట, తప్పక ఆనందమును కలిగించునను నిశ్చయము లేకుండుట. కాని ఆత్మ ఆనందరూపమగుట స్వతఃసిద్ధము గాన అది ఎల్లప్పుడును ప్రియతమమే. కావుననే_"మా నభూవం హి భూయాసమితి ప్రేమాత్మనీక్ష్యతే" అని చెప్పుదురు. "నేను లేకుండ పోవుదును గాక అను అభిప్రాయ మెన్నడును కలుగదు. నేను ఎల్లప్పుడును ఉందును గాక అను ప్రేమ ఆత్మవిషయమున ఉండును" అని ఈ వాక్యమున కర్థము. ఇట్టి ప్రేమ ఒక్క ఆత్మవిషయముననే ఉండుటకు అవకాశమున్నది. స్థూలశరీరము స్వప్నమునందు భాసించుట లేదు; సూక్ష్మశరీరము సుషుప్తిలో భాసించుట లేదు; కారణశరీరము సమాధిలో భాసించుటలేదు. సుషుప్తిసమాధ్యవస్థలలో శబ్దాదివిషయములు గూడ భాసించుటలేదు. అవి భాసించెడు జాగ్రత్స్వప్నావస్థలలోకూడ తప్పక ఆనందజనకములే అని చెప్పుటకు అవకాశము లేదు. ఈ విషయము వెనుక చూపబడినది కాన సర్వావస్థలయందును అనువర్తించుచున్నదియు, సుషుప్తిలో విషయాదులు లేకున్నను ఆనందరూపముగ సకలప్రాణుల అనుభవములో నున్నదియు, జ్ఞానుల అనుభవముప్రకా

రము, సమాధ్యవస్థలోగూడ ఆనందరూపమున నున్నట్లు గోచరించు నదియు అగు ఆత్మ, ఉపాధిసంబంధ మేమియు లేకుండగనే ప్రాణుల కెల్లరకును ప్రియతమము కదా.

తత ఆత్మా సదానన్దో నాస్య దుఃఖం కదాచన,
యత్సుషుప్తౌ నిర్విషయ ఆత్మానన్దోఽనుభూయతే,
శ్రుతిః ప్రత్యక్ష మైతిహ్య మనుమానం చ జాగ్రతి. 109

యత్ = ఏ కారణమువలన, సుషుప్తౌ = సుషుప్తియందు, నిర్వి షయః = విషయశూన్యమగు, ఆత్మానన్దః = ఆత్మానందము, అనుభూయతే = అనుభవింపబడుచున్నదో, తతః = ఆ కారణమువలన, ఆత్మా = ఆత్మ, సదానన్దః = ఎల్లప్పుడును ఆనందస్వరూపుడు; అస్య = ఈ ఆత్మకు, కదా చన = ఎన్నడును, దుఃఖం = దుఃఖము, న = లేదు, శ్రుతిః = వేదము, ప్రత్యక్షం = ప్రత్యక్షము, ఐతిహ్యం = ఐతిహ్యము (అప్తవచనము), అనుమానం చ = అనుమానము, జాగ్రతి = ఉన్నవి.

తతః = ఎల్లప్పుడును సర్వప్రాణులకును ప్రియతమ మైనదగుటచే, ఆత్మా = ఆత్మ, సదానన్దః = ఎల్లప్పుడును ఆనందస్వరూపుడు, అస్య = ఆనందరూపమగు ఈ ఆత్మకు, ఎన్నడును దుఃఖము లేదు. ఇందులకు అనుభవమును ప్రమాణముగ చూపుచున్నాడు_ఏ కారణము వలన సుషుప్త్యవస్థయందు, నిర్విషయః = ఆనంద హేతువులుగా భావింపబడుచున్న శబ్ద_స్పర్శ_రూప_రస_గంధాది సకలవిషయ సంబంధరహితమైన, ఆత్మానన్దః = స్వభావసిద్ధమగు స్వరూపానందము, సర్వైః = అని అధ్యాహారము; ఎల్లరచేతను అనుభవింపబడుచున్నదో, దేహాత్మానుభవమువలె ఈ అనుభవము కూడ భ్రాంతియే యను శంకను నిరాకరించుటకై 'శ్రుతిః' ఇత్యాదివాక్యమును చెప్పుచున్నాడు "ఏషోఽస్య పరమ ఆనందః"_ఈతని కిదియే పరమానందము, "ఏషోఽస్య పరమా సంపత్"_ఈతని కిదియే పరమసంపద ఇత్యాది శ్రుతులు అజ్ఞానావస్థలోనున్న ప్రాణులకు సుషుప్తియందు కలుగు

ఆనందమే పరమానందమని చెప్పుచున్నవి. ఇది యుక్తమే. విషయానందము ఆమయముతో(దుఃఖముతో) మిశ్రమైనది; ఈ సుషుప్త్యవస్థలోని ఆనందము నిరామయము. కావుననే వేలకొలది విషయములను సంపాదించుకొని అనుభవింప సామర్థ్యముగల సార్వభౌముడు కూడ నిద్రలేనిదే జీవింప జాలడు. అందులకు కారణమేమి? స్వరూపానందము దుఃఖలిప్తము కాకుండుటయే. "కో హ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్; యదేష ఆకాశ ఆనన్దో న స్యాత్"–ఆకాశమువలె నిర్లిప్తమగు ఈ ఆనందము లేకున్నచో ఎవడు జీవింపగలడు, ఎవడు చూపగలడు? అను శ్రుతి ఈ విషయమునే చెప్పుచున్నది. సుషుప్త్యవస్థలో సుఖము తమస్సుచే ఆవృతమైనను, అది జాగ్రత్స్వప్నసుఖములకంటె ఉత్తమ మైనది అని చెప్పినచో, ఆ తమస్సుకూడ జ్ఞానముచే నశించి ఆవరణము తొలగిపోవగనే, మంచుతెర తప్పుకొనిన వెంటనే ప్రకాశించు సూర్యుడువలె స్వయంప్రకాశమానమగు ఆత్మానందము ఇట్టిదని ఏమి చెప్పవలెను? ఈ విధముగ శ్రుతియు, సర్వజనానుభవగోచరమగు సాక్షి ప్రత్యక్షము, ఐతిహ్యం = పెద్దలవచనము, అనుమానం = ఆత్మా సదానన్దరూపః; సదా నిరతిశయ ప్రేమాస్పదత్వాత్; యన్నైవం తన్నైవం; యథా శబ్దాదిః"–ఆత్మ నిరతిశయప్రేమాస్పదము గాన సదానందరూపమైనది; ఇట్లు కానిచో అట్లుకాజాలదు. ఇందులకు వ్యతిరేకోదాహరణము నిరతిశయప్రేమాస్పదములు కాని, కావుననే సదానందరూపములు కాని శబ్దాదులు మొదలగు అనుమాన ప్రమాణము, ఆత్మ సదానందమయ మను విషయమున ప్రమాణములుగ ఉన్నవి.

అవ. ఈ విధముగ ఇంతవరకును ఉన్న ప్రబంధముచే, ఆత్మ భిన్నములగు స్థూలదేహమును, శబ్దాదివిషయములను, సూక్ష్మ దేహమును విభజించి, ధర్మరహితము, అసంగము అగు ఆత్మయొక్క తత్త్వము తెలియుటకై స్థూలదేహాదిధర్మములను గూడ వివేచించి, ఇపుడు ఈ అనాత్మలకన్నింటికిని హేతువగు కారణదేహమును నిరూపించుటకై ప్రారంభించుచున్నాడు–

# మాయానిరూపణము

అవ్యక్తనామ్నీ పరమేశశక్తి
రనాద్యవిద్యా త్రిగుణాత్మికా పరా,
కార్యానుమేయా సుధియైవ మాయా
యయా జగత్సర్వమిదం ప్రసూయతే. 110

అవ్యక్తనామ్నీ = అవ్యక్తమను పేరు కలదియు, పరమేశశక్తిః = పరమేశ్వరుని శక్తియైనదియు, అనాద్యవిద్యా = ఆదిరహితమగు అవిద్యయు, త్రిగుణాత్మికా = త్రిగుణస్వరూపము కలదియు, పరా = పరమైనదియు అగు, మాయా = మాయ, సుధియైవ = మంచిబుద్ధి కలవానిచేతనే, కార్యానుమేయా = కార్యమునుబట్టి ఊహింపదగినది, యయా = ఏ మాయచే, ఇదం = ఈ, సర్వం = సమస్తమైన, జగత్ = జగత్తు, ప్రసూయతే = పుట్టింపబడుచున్నదో.

అది ప్రత్యక్షముగ కనబడకుండుటచే అవ్యక్తము. అందులకు రూపాదిరహితత్వము కారణము. పరమేశ్వరుడగు బ్రహ్మయొక్క అచింత్యము అద్భుతమునగు శక్తి. ఆదిలేని అవిద్య, వాస్తవమున ఏది లేదో అది అవిద్య. “న విద్యతే ఇతి అవిద్యా.” సత్త్వరజస్తమస్సులను మూడుగుణములు గల ఏ స్వరూపమున్నదో అట్టి స్వరూపము కలది. లేదా మూడుగుణములే ఆత్మగా కలది. గుణత్రయస్వరూప అని యర్థము. పరా = హిరణ్యగర్భుడు మొదలగు కార్యములుగూడ దీని నుండియే జనించిన వగుటచే వాటికంటె ఉత్కృష్టమైనది. ఇది అవ్యక్త మనుటకు కారణమును ‘కార్యానుమేయా’ అను పదముచే చెప్పుచున్నాడు. రూపాదులు లేకపోవుటచే ప్రత్యక్షగోచరము కాదు. అయినను శబ్దాదులచే గగనాదికమును ఊహించినట్లు కార్యము లనెడు హేతువుచే ఊహింపదగినది. ఈ శక్తిని అంగీకరించనిచో నిర్గుణుడగు బ్రహ్మకు స్రష్టృత్వము కుదరదు. కారణములేకుండ కార్యము జనించుట అసంభావ్యము. అందుచే ఆకాశాదిసకలవికారము

లకును హేతువుగను, శ్రుతిబోధితములగు ఈక్షణ-సంకల్పాది పరిణామములకు ఆశ్రయముగను మాయ సిద్ధించుచున్నది అని భావము. శబ్దప్రామాణ్యము నంగీకరింపని వారు జగదుత్పత్తిని గూర్చి వేరు వేరు విధముల తర్కించుచున్నారు. అది అసంగతమని 'సుధియా' ఇత్యాదికముచే సూచించుచున్నాడు. బుద్ధిగా సుష్ఠుగా ఉన్నదనగా శ్రుత్యనుసారిగ ఉన్నదని యర్థము. అది 'పరమేశశక్తి' పదముచే సూచితము. ఇట్లు చెప్పుటచే సాంఖ్యాభిమతమగు, జడమును, స్వతంత్రమును, సత్యమును అగు ప్రధానము జగన్మూల మనునది నిరస్తమైనదిగ తెలియవలెను. ఈ విషయమును శ్రుతులు కూడ ప్రతిపాదించుచున్నవి "మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్"-ప్రకృతిని మాయయని మహేశ్వరుని మాయ కలవానినిగను తెలుసుకొనవలెను, "జీవేశావాభాసేన కరోతి; మాయాఽవిద్యా చ స్వయమేవ భవతి" చిదాభాసచే జీవుని ఈశ్వరుని కల్పించుచున్నది. తానే మాయగాను అవిద్యగాను అగుచున్నది, "ఇన్ద్రో మాయాభిః పురురూప ఈయతే" -ఆత్మయే మాయలచే వివిధరూపములు కలదగుచున్నది. శ్రుతిని అనుసరించిన బుద్ధి యెవనికో అట్టి వానిచే, కార్యమును బట్టి ఊహించదగిన మాయ మహత్తత్త్వము మొదలు బ్రహ్మాండము వరకును గల ఈ ప్రపంచము నంతను, సృజించుచున్నది. దీనికి 122వ శ్లోకములోని "తత్కారణం నామ శరీరమాత్మనః" అను వాక్యముతో అన్వయము.

అవ. దాని స్వరూపమును నిరూపించుచున్నాడు-

సన్నాప్యసన్నాప్యుభయాత్మికా నో
భిన్నాప్యభిన్నాప్యుభయాత్మికా నో,
సాంగాప్యనంగాప్యుభయాత్మికా నో
మహాద్భుతానిర్వచనీయరూపా. 111

(ఆ మాయ) సత్ = సత్స్వరూపమైనది, న = కాదు, అసదపి = అసత్స్వరూపమైనదికూడ, న = కాదు, ఉభయాత్మికాపి = సదసదుభయ స్వరూపమైనదికూడ, నో = కాదు, భిన్నాపి = వేరైనదిగాని, అభిన్నా = అభిన్నమైనదిగాని, ఉభయాత్మికాపి = ఉభయరూపమైనదిగాని, నో = కాదు, సాంగాపి = అవయవములు కలది గాని, అనంగాపి = అవయవములులేనిది గాని, ఉభయాత్మికా = ఉభయరూపమైనది గాని, నో = కాదు. మహాద్భుతా = చాల ఆశ్చర్యకరమైనది, అనిర్వచనీయరూపా = నిర్వచింప శక్యముకాని రూపము కలది.

అబాధితమైనది సత్తనియు, బాధితమైనది అసత్తనియు లోకమున ప్రసిద్ధము. ఇందులకు క్రమముగ సత్యాసత్యపదార్థములు ఉదాహరణములు. కుందేటి కొమ్ము, ఆకాశపుష్పము మొదలగునవి ఎప్పుడును, ఎవ్వనికిని కనబడునవి కావు. అందుచే అవి అసత్పదార్థములు. కాని ఈ మాయ, జ్ఞానముచే బాధ్యమగునని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి_ "భూయశ్చాన్తే విశ్వమాయా నివృత్తిః" -అంతమునందు మాయలన్నియు నివర్తించును,

తరత్యవిద్యాం వితతాం హృది యస్మిన్నివేశితే,
యోగీ మాయామమేయాయ తస్మై విద్యాత్మనే నమః.

ఎవ్వడు హృదయమునందు నిలుపబడినంతనే యోగి, విస్తృతమగు అవిద్యను మాయను దాటునో అట్టి విద్యాస్వరూపుడగు అప్రమేయునకు నమస్కారము, "మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే" -నన్నే శరణుపొందెడువారు ఈ మాయను దాటగలరు. కావున మాయ ఆత్మవలె సత్ పదార్థమని చెప్పుటకు వీలులేదు. 'సత్ అయినది ఎన్నడును లేకుండ పోదు.' "నా భావో విద్యతే సతః" అను గీతావాక్యము ననుసరించిగూడ, జ్ఞానానంతరము తప్పక అభావమును పొందనున్న ఈ మాయకు సత్త్వము లేదు. జ్ఞానము కంటె పూర్వము కార్యరూపమున ప్రతీయమాన మగుటచేతను,

కార్యరూపమున పరిణతి చెందుటచేతను, అనుమితికి విషయమగుట చేతను, ఈ మాయ శశవిషాణమువలె అసత్తని చెప్పుటకు కూడ వీలు లేదు. ఇది సదసదుభయాత్మకము కూడ కాదు. ఏలయన - సదసత్త్వములు వ్యాప్యవృత్తులు. అనగా సత్త్వము ఉన్నచోట ఎన్నటికి అసత్త్వ ముండుటకు అవకాశము లేదు, అసత్త్వమున్నచోట ఎన్నటికి సత్త్వము ఉండుటకు అవకాశము లేదు. అందుచే మాయయందు కాల భేదముచే సత్త్వాసత్త్వములను అంగీకరించుటకు అవకాశము లేదు. అనగా మాయ కొంతకాలము పాటు 'సత్'గ ఉండి, తరువాత 'అసత్' అగునని చెప్పి దానికి సదసదుభయాత్మకత్వమును అంగీకరింప వీలు లేదు. మరియు సద్రూపత్వము అసద్రూపత్వము అనునవి వేరువేరుగ లేనపుడు తదుభయరూపత్వము అత్యంతము అసంభావ్యము కదా? స్వప్నమునందు కనబడు పదార్థములు, ఇంద్రజాలముచే సృజింపబడిన పదార్థములును దృష్టనష్టరూపము లగుటచే- అనగా కనబడి నశించున వగుటచే, అవి సదసద్విలక్షణములై (సత్ గాని అసత్ గాని కాక) మిథ్యాభూతము లని చెప్పబడుచున్నవి. అట్లే మాయకూడ మిథ్యాభూత మైనది. కావుననే భగవద్గీతలో

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః,
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః.

అసత్తుకు సత్త్వములేదు, సత్తుకు అసత్త్వములేదు. తత్త్వవేత్తలు ఈ రెండింటియొక్క నిర్ణయమును బాగుగ చూడగలరు అని చెప్పబడినది. కేవల లౌకిక దృష్టికలవారు ఉత్పత్తికి పూర్వము అసత్తుగ నున్న ఘటాదికము ఉత్పన్నమై సత్తుగా అగుచున్నదనియు, ఇదియే నశించి మరల అసత్తుగా అగుచున్న దనియు అనుకొనుచుండవచ్చును. కాని అది అయుక్తము అని భగవంతుడే "ఈ రెండింటియొక్క నిర్ణయము తత్త్వవేత్తలచే చూడబడినది" అని చెప్పుచున్నాడు. కావున ఈ మాయ సద్వస్తువు కాదు, అసద్వస్తువు కాదు. ఉభయాత్మకము కూడ కాదు.

సత్త్వాసత్త్వములచే నిర్వచింప శక్యముకానిది గాన అనిర్వచనీయము. ఈ మాయ సద్వస్తువా అసద్వస్తువా అని నిర్వచించుటకు ఎట్లు శక్యము కాదో అట్లే ఇది బ్రహ్మకంటె భిన్నమైనదా అభిన్నమైనదా అని కూడ నిర్వచింప శక్యముకాదు. ఇది బ్రహ్మకంటె పూర్తిగ భిన్నము అని చెప్పినచో అద్వైతబోధకములగు శ్రుతులతో విరోధము వచ్చును. లోకములో కూడ శక్తికిని శక్తికలదానికిని అత్యంతభేదము కానరాదు కదా? అట్లని బ్రహ్మకంటె అభిన్నము అని అంగీకరించినచో బ్రహ్మవలెనే ఇది కూడ కాలత్రయాబాధ్యము కావలసియుండును. కావున అభిన్నము కాదు. భిన్నాభిన్నత్వములు పరస్పరవిరుద్ధ ధర్మములు గాన ఇది భిన్నాభిన్న యని కూడ చెప్ప శక్యము కాదు. ఈ మాయ అనాది. అందుచే ఇది సావయవము అని చెప్ప శక్యము కాదు. సావయవమైనచో జన్యమని చెప్పవలసి వచ్చును కదా? నిరవయవమని కూడ చెప్పుటకు వీలులేదు; నిరవయవమైనచో పరిణామము అసంభావ్యము కదా? సావయవత్వ-నిరవయవత్వములు పరస్పరవిరుద్ధములు గాన ఉభయాత్మకముకూడ కాజాలదు. ఈ విధముగ సత్ అనిగాని అసత్ అనిగాని, బ్రహ్మభిన్నము అనిగాని, బ్రహ్మాభిన్నము అనిగాని, సావయవ మనిగాని నిరవయవ మనిగాని నిర్వచించుటకు శక్యము కాకుండుటచే ఇది అనిర్వచనీయము, అత్యంతాశ్చర్యకరము అని యర్థము.

అవ. ఇది పూర్తిగ తొలగిపోవుటకు హేతువు ఉన్నది. అందుచేతగూడ ఇది అసత్ కాదు అని చెప్పుచున్నాడు_

శుద్ధాద్వయబ్రహ్మవిబోధనాశ్యా
సర్పభ్రమో రజ్జువివేకతో యథా,
రజస్తమః సత్త్వమితి ప్రసిద్ధా
గుణాస్తదీయాః ప్రథితాః స్వకార్యైః. 112

రజ్జువివేకతః = రజ్జుసాక్షాత్కారమువలన, సర్పభ్రమః = సర్ప భ్రాంతి, యథా = ఎట్లు నాశ్యమైనదో, (తథా = అట్లే) శుద్ధాద్వయబ్రహ్మ విబోధనాశ్యా = శుద్ధమగు అద్వితీయబ్రహ్మయొక్క సాక్షాత్కారముచేత నశింపచేయుటకు శక్యమైనది. రజః = రజోగుణము, తమః = తమో గుణము, సత్త్వం ఇతి=సత్త్వగుణము అని, తదీయాః=దానిసంబంధమైన, గుణాః = గుణములు, ప్రథితైః = ప్రసిద్ధములైన, స్వకార్యైః = వాటి కార్యములచే, ప్రసిద్ధములు.

శుద్ధం = నిర్గుణమగు, అద్వయం = సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యమైన, ఏ, బ్రహ్మ = బ్రహ్మకలదో, దానియొక్క విబోధః = అభేదరూపమున సాక్షాత్కారము, దానిచే, నాశ్యా = (నశింపచేయదగినది) దానివలన కలుగు ధ్వంసాభావమున ప్రతి యోగియైనది. ఆ విషయమున దృష్టాంతమును చెప్పుచున్నాడు- సర్పభ్రమః=రజ్జువునుచూచినపుడు 'ఇదిసర్పము' అని కలిగిని భ్రమ, రజ్జువివేకతః యథా = కల్పితమగు సర్పమునకు అధిష్ఠానమగు రజ్జువు యొక్క సాక్షాత్కారముచేతవలె, "ఇది సర్పము కాదు, త్రాడు మాత్రమే" అనెడు జ్ఞానముచేతవలె; ఈ విధముగ నిర్గుణమును అద్వితీయమును అగు బ్రహ్మమునందు కల్పితమగు మాయ అధిష్ఠా నముయొక్క తత్త్వమును సాక్షాత్కారముచే బాధ్యమనువిషయము చెప్పబడినది. "కార్యానుమేయా సుధియైవ మాయా" అని పూర్వము చెప్పబడిన విషయమునే దాని (మాయ యొక్క) ధర్మము లగు గుణముల కార్యములను ప్రతిపాదించుటద్వారా 'రజ' ఇత్యాది వాక్యమున చెప్పుచున్నాడు. తదీయాః = మాయకు సంబంధించిన, గుణాః = ధర్మములు, రజస్సు, తమస్సు సత్త్వము అని ప్రసిద్ధమైనవి ఈ గుణములు అప్రత్యక్షములు గాన అవి కార్యములద్వారా ప్రసిద్ధము లని చెప్పుచున్నాడు. ప్రథితైః=ప్రసిద్ధములగు, చెప్పనున్న ఆ యా గుణకార్యములచేత.

అవ. రజస్తమస్సత్త్వగుణముల కార్యములను క్రమముగ చెప్ప నున్నవాడై ముందుగ రజోగుణకార్యములను చెప్పుచున్నాడు—

## రజోగుణము

విక్షేపశక్తి రజసః క్రియాత్మికా యతః
ప్రవృత్తిః ప్రసృతా పురాణీ,
రాగాదయోఽస్యాః ప్రభవన్తి నిత్యం
దుఃఖాదయో యే మనసో వికారాః. 113

విక్షేపశక్తిః = విక్షేపశక్తి, రజసః = రజోగుణమునకు సంబంధించిన, క్రియాత్మికా = క్రియాత్మకమగు శక్తి, యతః = దేనివలన, పురాణీ = ప్రాచీనమైన-అనాదికాలసిద్ధమైన, ప్రవృత్తిః = ప్రవృత్తి, ప్రసృతా = విస్తృతమైనదో, అస్యాః = దీనివలన, రాగాదయః = రాగము మొదలగునవియు, మనసః = మనస్సుయొక్క, వికారాః = వికారములగు, యే = ఏ, దుఃఖాదయః = దుఃఖము మొదలగునవియు కలవో, అవి నిత్యం = ఎల్లప్పుడును, ప్రభవన్తి = పుట్టుచున్నవి.

మాయయందు, విక్షేపశక్తి, ఆవరణశక్తి, జ్ఞానశక్తి అను మూడు శక్తు లున్నవి. వీటిలో మొదటి రెండును బంధహేతువులు. మూడవది మోక్షహేతువు. వాటిలో విక్షేపశక్తి రజోగుణమునకు సంబంధించినది, క్రియాత్మికా = కార్యరూపమైనది, రజోగుణము ఉద్రిక్తమైనపుడు అనేకవిధములగు విక్షేపములు కలుగునని తెలియవలెను. యతః = రజఃకార్యమగు ఏ విక్షేపశక్తివలన, పురాణీ = అనాదికాలసిద్ధమగు, ప్రవృత్తిః = సంసారహేతువగు ప్రవృత్తి, ప్రసృతా = విస్తృతమైనదో, ఆ ప్రవృత్తి జీవునకు సంబంధించినది కావచ్చును. లేదా ప్రపంచసృష్టికి హేతువైన ఈశ్వరసంబంధి ప్రవృత్తి కావచ్చును ప్రపంచసృష్టి కూడ విక్షేపశక్తివలననే కలుగును కదా? కాని ఈశ్వరుడు శుద్ధసత్త్వ ప్రధానమగు మాయచే ఉపహితుడు. ఆ మాయ కూడ

స్వాధీనమై యుండుటచే ఈశ్వరునకు బంధప్రసక్తి లేదు. మలిన సత్త్వప్రధానమగు అవిద్య జీవునకు ఉపాధిగ నున్నది. అందుచే జ్ఞానశక్తి రజస్తమోగుణములచే ప్రతిహతమగుటచే జీవుడు ఉపాధ్యధీనుడై తత్కృతమగు బంధము కల్గియుండును. 'రాగాదయః' ఇత్యాదికము కేవలము జీవుని విషయముననే, అస్యాః=రజఃకార్యమగు ఈ విక్షేపశక్తి వలన, రాగాదయః=ప్రవృత్తి హేతువులగు రాగద్వేషాది దోషములు, జీవునకు నిత్యము కలుగుచుండును. వాటివలన, మనస్సుయొక్క వికారములగు ఏ, దుఃఖాదయః=దుఃఖ-హర్ష-తర్షా-మర్షాదులు కలవో అవి యన్నియు, "కామః సంకల్పో విచికిత్సా శ్రద్ధాశ్రద్ధా ధృతిరధృతిః హ్రీర్ధీర్భీరిత్యేతత్సర్వం మన ఏవ"-కామము సంకల్పము, సంశయము, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, సిగ్గు, బుద్ధి, భయము ఇది యంతయు మనస్సే, అను శ్రుతి ననుసరించి మనస్సునకు సంబంధించినవే కాని నిర్వికారమగు ఆత్మయొక్క ధర్మము లెన్నడును కాజాలవు అని చెప్పుటకై 'మనసః' అను పదము ప్రయోగింపబడినది. ఆ మనస్సుతో తాదాత్మ్యాధ్యాసముచే జీవునిపై కల్పింపబడుచున్నవి. వాస్తవమున జీవునియందు లేవు. "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ"-సాక్షిభూతము, చైతన్యరూపము, అద్వితీయము, నిర్గుణము, "నాన్యోఽతోఽస్తి ద్రష్టా"-ఆత్మకంటె భిన్నుడగు ద్రష్ట లేడు, "నిష్కలం నిష్క్రియం శాన్తమ్"- నిరవయవము, నిష్క్రియము, శాన్తము అని శ్రుతులు చెప్పుచున్నవి.

అవ. ఇపుడు "రాగాదయః" అను పదమునందలి 'ఆది' శబ్దముచే గ్రహింపదగినవియు, రజఃకార్యమగు విక్షేపశక్తివలన కలిగిన వగుటచే రాజసములును అగు ధర్మములను, అవి ఘోరములగుటచే దుఃఖహేతువు లను విషయమును, ఈ ధర్మములు నిరంతర ప్రవృత్తి హేతువు లగుటచే వాటి కారణమగు రజస్సు బంధక మను విషయమును చెప్పుచున్నాడు-

కామః క్రోధో లోభదమ్భాభ్యసూయా
హంకారేర్ష్యా మత్సరాద్యాస్తు ఘోరాః,
ధర్మా ఏతే రాజసాః పుంప్రవృత్తి
ర్యస్మా దేతత్త్ద్రజో బన్ధహేతుః. 114

కామః = కామము, క్రోధః = క్రోధము, లోభ....మత్సరాద్యాః లోభ = లోభము, దంభ = దంభము, అభ్యసూయా = అసూయ, అహం కార = అహంకారము, ఈర్ష్యా = ఈర్ష్య, మత్సరాద్యాః = మత్సరము మొదలగు, ఏతే = ఈ, ఘోరాః = ఘోరములైన, ధర్మాః = ధర్మములు, రాజసాః = రజోగుణజన్యములు, యస్మాత్ = ఏ రజోగుణమువలన, పుంప్రవృత్తిః = పురుషప్రవృత్తి కలుగుచుండునో, ఏతత్ = ప్రసిద్ధమగు, తద్రజః = ఆ రజోగుణము, బన్ధహేతుః = బంధమునకు హేతువు.

కామః = విషయాభిలాష, క్రోధః = కామమునకు అడ్డుతగిలి నపుడు కలుగు కోపమను నామాన్తరముగల మనోవృత్తి, లోభః = లభించిన ధనమును రక్షించుకొనవలె ననెడి బుద్ధి, దంభః = ధర్మాత్ముడనని పైకి ఆడంబరము చూపుట, అభ్యసూయా = పరుల ఉత్కర్షను చూచి సహింపలేకపోవుట, అహంకారః = తానే గొప్పవాడనను అభిప్రాయము, ఈర్ష్యా = పరగుణములను దోషములుగ చిత్రించుట, మత్సరః = క్షీణింపనివస్తువును పరిత్యజింపకుండుటకై ఇచ్ఛ. ఉదాహరణమునకు రాజకీయమగు ఉదకప్రాప్తిస్థానమునుండి నీరుత్రాగ వద్దు అను ప్రవృత్తి. ఆది పదముచే మదదర్పాదులను గ్రహింపవలెను. ఇవి ఇహలోకపరలోకముల రెండింటియందును భయహేతువులగుటచే ఘోరములని చెప్పబడినవి. కామక్రోధాదులు కలవాడు ఎన్నటికిని ప్రవృత్తినుండి విరమింపజాలడు; ఎల్లప్పుడును ఏదియో యొక పని చేయుచునే ఉండును; అందుచే ఈ ధర్మములు రాజసములు. "రజః కర్మణి భారత సంజయతి"—అర్జునా! రజోగుణము కర్మయందు ఆసక్తుడగునట్లు చేయును అని భగవద్గీతలో చెప్పబడుటచే

ఎల్లపుడును ఏదియో ఒక కర్మ చేయుటకు కారణభూతములగు ఈ ధర్మములు రాజసములు. "ప్రవర్తనాలక్షణా దోషాః" -ప్రవర్తింప చేయుటయే దోషముల లక్షణము అని న్యాయసూత్రము చెప్పుచున్నది. అన్నింటినుండియు నివర్తించినచో సుఖము కలుగును. వీటిలో (కామాదులలో) ఏ ఒక్కటియు నివృత్తిప్రయోజకము కాదు.

"లోభః ప్రవృత్తి రారంభః కర్మణామశమః స్పృహా,
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ."

—ఓ అర్జునా! రజోగుణము వృద్ధి పొందినపుడు లోభము, ప్రవృత్తి, కర్మల నారంభించుట, శాంతి లేకపోవుట, ఆసక్తి అనునవి జనించును అని కూడ గీత చెప్పుచున్నది. దేనివలన పురుషప్రవృత్తి కలుగుచున్నదో, ఏతత్ =సర్వజనానుభవసిద్ధమైన; తత్ =మాయాగుణముగ చెప్పబడిన, రజోగుణము బంధహేతువు. కార్యకరణ (శరీరేంద్రియాది) సంఘాతాధ్యాసమే బంధమును కలిగించును. అధ్యాసము లేనిచో కర్మయే యుండదు. అందుచే రజోగుణమే బంధహేతువని గ్రహింపవలెను. ఆత్మత్వమును అధ్యసింపని దేహముతో ఏ ఒక్కడును వ్యాపారప్రవృత్తుడగుట లేదు కదా? అని అధ్యాసభాష్యమున చెప్పబడినది.

అవ. ఇపుడు సకలసంసారమునకును ఆదికారణమైనదియు, విక్షేపశక్తి విజృంభించుటకు హేతువైనదియు అగు తమోగుణసంబంధియగు ఆవరణశక్తిని నిరూపించుచున్నాడు—

## తమోగుణము

ఏషావృతిర్నామ తమోగుణస్య
శక్తి ర్యయా వస్త్వవభాసతేఽన్యథా,
సైషా నిదానం పురుషస్య సంసృతేః
విక్షేపశక్తేః ప్రసరస్య హేతుః. 115

యయా = ఏ ఆవరణశక్తిచే, వస్తు=వస్తువు, అన్యథా = మరియొక విధముగా, అవభాసతే = భాసించుచున్నదో; ఏషా = ఇది, తమోగుణస్య= తమోగుణముయొక్క, ఆవృతిర్నామ = ఆవృతియనెడు, శక్తిః = శక్తి, ఏషా = ఇది, పురుషస్య = పురుషునియొక్క, సంసృతేః=సంసారమునకు, నిదానం=మూలకారణము విక్షేపశక్తేః=విక్షేపశక్తియొక్క, ప్రసరస్య= ప్రసారమునకు, హేతుః = కారణము.

ఏ శక్తిచే, వస్తు అన్యథా అవభాసతే = సచ్చిదానందరూపమగు వస్తువు అంతఃకరణదేహాదిరూపమున భాసించునో, ఇది, తమో గుణమునకు సంబంధించిన ఆవరణశక్తి. ఇది దుఃఖజన్మజరామరణాది రూపమగు పురుషుని సంసారమునకు ఆదికారణము. ఏలయన పురుషుడు భ్రాంతిచే అనాత్మధర్మములను అసంసారియగు ఆత్మ యందు ఆరోపించుచున్నాడు. అందుచేత, యథార్థముకాని వస్తువు భాసించుట అనెడు ఆకారముగల భ్రాంతికి హేతువగు ఈ ఆవరణ శక్తియే సంసారమునకు మూలకారణము. ఈ ఆవరణశక్తి లేకున్నచో విక్షేపశక్తి ఏమియు చేయజాలదని 'విక్షేపశక్తేః' ఇత్యాదివాక్యముచే చెప్పుచున్నాడు. రజ్జుస్వరూపము ఆవరణశక్తిచే కప్పబడినపుడే దాని యందు సర్పరూపవిశేషము జనించు భయాదికమును కలిగించును గాని మరియొకవిధము కాదు అని భావము. కావుననే జ్ఞానుల విషయమున ఆవరణము భగ్నమైపోవుటవలన ప్రారబ్ధకర్మాత్మకమగు విక్షేప మున్నను వారికి బంధములేదు. ఈ విషయము 'కబలితదిననాథే' ఇత్యాదిశ్లోకమున (145) స్పష్టము కాగలదు. లోకములోగూడ ఏదైన ఒక వస్తువువిషయమున సంశయము గాని, విపర్యయబుద్ధి గాని యెవ్వనికుండునో ఆతడే విక్షోభముచే కలతచెందుచుండును. నిశ్చిత మగు జ్ఞానము కలవానికి అట్టి విక్షేపమే కలుగదు. కావున తమోగుణ శక్తి వస్తుస్వరూపమును కప్పివేసి, ఆ వస్తువును మరియొకవిధమున చూపుచు, విక్షేపమును కలిగించుటద్వారా బంధహేతు వగుచున్నదని యభిప్రాయము.

అవ. బంధహేతువులగు రెండుశక్తులలో ఈ శక్తి ప్రబలమైనదని చెప్పుచున్నాడు-

ప్రజ్ఞావానపి పండితోఽపి చతురోఽ ప్యత్యన్తసూక్ష్మార్థదృ
గ్వ్యాలీఢ స్తమసా న వేత్తి బహుధా సంబోధితోఽపి స్ఫుటమ్,
భ్రాన్త్యారోపితమేవ సాధు కలయత్యాలంబతే తద్గుణాన్
హంతాసౌ ప్రబలా దురన్తతమసః శక్తిర్మహత్యావృతిః. 116

ప్రజ్ఞావానపి = ప్రజ్ఞకలవాడైనను, పండితోఽపి = పండితుడైనను, చతురోఽపి = నేర్పుకలవాడైనను, అత్యన్తసూక్ష్మార్థదృక్ = మిక్కిలి సూక్ష్మములగు విషయములను చూడగల్గినవాడైనను మానవుడు, బహుధా సంబోధితోఽపి=అనేకవిధముల బోధింపబడినవాడైనను, తమసా=తమోగుణముచే, వ్యాలీఢః = ఆక్రమింపబడినవాడై, స్ఫుటం = స్పష్టముగా, న వేత్తి=తెలిసికొనడు. భ్రాన్త్యా = భ్రాంతిచే, ఆరోపితమేవ =ఆరోపింపబడినదానినే, సాధు = మంచిదానినిగా, కలయతి = భావించును. తద్గుణాన్= దానియొక్క గుణములను, ఆలంబతే = అవలంబించును, హన్త = ఎంత కష్టము! దురన్తతమసః = దుఃఖాంతమైన తమోగుణముయొక్క, అసౌ= ఈ, అవృతిః = అవృతియనెడు, మహతీ శక్తిః = గొప్పశక్తి, ప్రబలా = గాల బలము కలది.

ప్రజ్ఞావాన్="ప్రజ్ఞా త్రైకాలికీ మతా" అను ప్రమాణము ననుసరించి కాలత్రయమందును నిశ్చలమగు బుద్ధికలవాడు. అట్టివాడైనను పణ్డితోఽపి=శాస్త్రజన్యమగు పరోక్షజ్ఞానమునకు 'పండ' అనిపేరు. అట్టి పండ కలిగినవాడైనను - చతురోఽపి = ఊహాపోహలు చేయు సామర్థ్యము కలవాడైనను, అత్యన్తసూక్ష్మార్థదృక్ = ప్రజ్ఞాపాండిత్య చాతుర్యములు అత్యంతసూక్ష్మవిషయములను చూచుటయందు హేతువులు. ఏలయన ఎల్లప్పుడును నిశ్చలమగు బుద్ధికలవాడు, శాస్త్రసాహాయ్యముచే ఊహాపోహకుశలుడై అత్యంతసూక్ష్మములగు

విషయములను గూడ గ్రహించుటకు సమర్థుడగును. ఇట్టి పురుషుడు కూడ తమస్సుచే, వ్యాలీఢః = విశేషముగ అంతటను ఆవృతమగు స్వరూపముకలవాడై, మంచి దృష్టికలవాడైనను గాఢాంధకారమున ఏమి చేయగలడు అని అభిప్రాయము. అనేకవిధముల బో ంపబడినను స్పష్టముగ తెలియజాలడు. "శృణ్వన్తోఽపి బహవోయం విద్యుః" -దేనినిగూర్చి వినుచున్నను ఛాలమంది తెలిసికొనజాలరో, "నాయ మాత్మా బలహీనేన లభ్యః"-ఈ ఆత్మ బలహీనునిచే లభ్యమగునది కాదు, "న మేధయా న బహునా శ్రుతేన"-మేధాశక్తిచేగాని, అధికశాస్త్రాభ్యాసముచేగాని లభ్యమగునదికాదు, "ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమ్" ఈ ఆత్మను ఎవ్వడో ఒకడు ఆశ్చర్యకరమగు వస్తువును వలె చూచును అని శ్రుతులుకూడ చెప్పుచున్నవి. భ్రాన్త్యా = అట్లు కాని దానిని అట్లుగా భావించుట అను ఆకారముగల భ్రాంతిచే, ఆరోపితమగు స్థూలదేహాదికమునే, సాధు = అబాధితమైనదానినిగా, తెలిసికొనుచున్నాడు. దాని గుణములగు పూజావమానాదులను, దృఢత్వ-ఆరోగ్యాదులను సూక్ష్మదేహధర్మములగు కర్తృత్వాదులను తనకు సంబంధించిన వాటినిగా గ్రహించుచున్నాడు. ఆత్మవ్యతిరిక్తమైన దంతయు మిథ్యయని శ్రుతులు ఆచార్యులు బోధించుచున్నను జనుల భ్రాంతి తొలగకుండుట అనుభవసిద్ధమే కదా? హంత=ఎంత కష్టము! దురంతతమసః=దుష్టమైన పర్యవసానముగల, అనగా అనర్థమునకు దారితీయునదియగు తమోగుణముయొక్క ఆవృతియనెడు మహాశక్తి సత్త్వోత్కర్ష లేనిదే తొలగింప శక్యము కానిది. ఇది అత్యంత మోహహేతు వగుటచే విక్షేపశక్తికంటె ప్రబలమైనది.

అవ. ఈ ఆవరణశక్తి శ్రవణ-మనన-నిదిధ్యాసన జన్యమగు జ్ఞానముచే నాశ్య మను విషయమును ప్రతిపాదింపనున్నవాడై, ఆ మూడింటిచేతను తొలగింపదగిన దోషములకు హేతువగు ఇది ప్రత్యగభిన్నమగు బ్రహ్మవిషయమున అసంభావనను (దాని జ్ఞానము

లేకుండుటను) శరీరాద్యనాత్మలవిషయమున విపరీతాత్మత్వభావనను, శ్రుతులును ఆచార్యులును బోధించిన విషయములపై సంశయమును కలిగించుచు, అనేకవిధముల మానసవిక్షేపమును కలిగించుచు పురుషుని భాసింపని స్వరూపముకలవానినిగా చేయుచు నశింప చేయుచున్నదని చెప్పుచున్నాడు—

**అభావనా వా విపరీతభావనా**
**సంభావనా విప్రతిపత్తి రస్యాః,**
**సంసర్గయుక్తం న విముంచతి ధ్రువం**
**విక్షేపశక్తిః క్షపయత్యజస్రమ్.** 117

అస్యాః=దీనివలన, అభావనా వా=అభావన, విపరీతభావనా=విపరీతభావన, విప్రతిపత్తిః=విరుద్ధజ్ఞానరూపమగు, సంభావనా=సంశయము, ఈ త్రయము, అస్యాః=ఈ ఆవరణశక్తియొక్క, సంసర్గయుక్తం=సంబంధము ఏర్పరచుకొనిన వానిని, న విముఞ్చతి=విడువదు ధ్రువం=నిశ్చయము, విక్షేపశక్తిః=విక్షేపశక్తి, అజస్రం=ఎల్లప్పుడును, క్షపయతి=నశింప జేయును.

అభావనా=శాస్త్రములో చెప్పిన జీవబ్రహ్మైక్యము, ప్రపంచ మిథ్యాత్వము కూడ సంభావ్యములుకావు అను భావన, లేదు లేదు అను భావన; నాస్తిక్యమని యర్థము. విపరీతభావనా=శరీరాదికమే ఆత్మ యనెడు భావన. విప్రతిపత్తిః=విరుద్ధజ్ఞానరూపమగు సంభావనా=సంశయజ్ఞానము. ఒక ధర్మియందు విరుద్ధములగు వేరు వేరు ధర్మములను చూచుట సంశయమని సంశయలక్షణము. ఈ త్రయము, అస్యాః=ఈ ఆవరణశక్తియొక్క, సంసర్గయుక్తం=సంబంధముతో కూడిన మనుష్యుని, ధ్రువం న విముఞ్చతి=విడువనే విడువదు. అట్టి పురుషుని "అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి"—అజ్ఞుడు, శ్రద్ధాహీనుడు, సంశయాత్ముడు అయిన పురుషుడు నశించును అని గీతలో చెప్పిన విధముగ, విక్షేపశక్తి ఎల్లప్పుడును నశింపజేయును.

అవ. ఇపుడు తమోగుణకార్యములను విశదీకరించుచున్నాడు_

అజ్ఞాన మాలస్య జడత్వ నిద్రా
ప్రమాద మూఢత్వ ముఖా స్తమోగుణాః,
ఏతైః ప్రయుక్తో న హి వేత్తి కించి
న్నిద్రాళువత్ స్తంభ్భవదేవ తిష్ఠతి. 118

అజ్ఞానం = అజ్ఞానము, ఆలస్య.... ముఖాః = అలసత్వము, జడత్వము, నిద్ర, ప్రమాదము, మూఢత్వము మొదలగునవి, తమోగుణాః = తమస్సుయొక్క గుణములు, ఏతైః = వీటిచే, ప్రయుక్తః = కూడినవాడు, కించిత్ = ఏమియు, న హి వేత్తి = తెలియజాలడు, నిద్రాళువత్ = నిద్రలోనున్నవాడువలె, స్తంభవదేవ = స్తంభమువలె, తిష్ఠతి = ఉండును.

అజ్ఞానం=చెప్పిన విషయమునుగూడ అర్థము చేసికొనజాలక పోవుట. లేదా_ "ఏతద్ జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా" ఇది -అమానిత్వాదికము - జ్ఞానము. ఏతద్భిన్నమైనది అజ్ఞానము అని గీతలో చెప్పిన మానిత్వాదికము అజ్ఞానము. ఆలస్యం=ప్రయత్నము చేయకుండుట. జడత్వం = పనులుచేయుటయందు సామర్థ్యము లేకుండుట. నిద్రా = ప్రసిద్ధమైన నిద్ర; అభావప్రత్యయాలంబనా వృత్తిర్నిద్రా" అని యోగసూత్రములో చెప్పిన లక్షణము కలది. ఏ తమస్సు ఆవారకమైయున్నపుడు వస్తువుల అభావము గోచరించునో అట్టి తమస్సే అభావ ప్రత్యయము. దానిని విషయముగా చేసికొను చున్న వృత్తి నిద్ర. ప్రమాదః = చేయుటకు సామర్థ్యమున్నను ఆ పనిని చేయకుండుట; మెలకువతో సంచరింపకపోవుట 'ప్రమాదోఽనవధానతా' - పనియందు సరిగా దృష్టినుంచకుండుట ప్రమాదము అని నిఘంటువు. మూఢత్వం- ఒక విధముగనున్న దానిని మరియొక విధముగ గ్రహించుట. ఈ ఆలస్యాదులు ఏ సంశయాదులకు ప్రారంభమున నున్నవో అవి తమోగుణము యొక్క కార్యములు.

ఈ విషయమునే ఉపపాదించుచున్నాడు - ఏతైః = ఈ అజ్ఞానాది ధర్మ ములతో, ప్రయుక్తః = కూడినవాడు, ఏమియు తెలియజాలడు. నిద్రాళువత్ = నిద్రపోవుచున్నవాడు ఎట్లు ఏమియు తెలిసికొన జాలడో అట్లే స్తంభమువలె ఉండును. శ్రేయస్సుకొరకై ప్రయత్న మేమియు చేయడు లేదా తెలిసికొనుటకు అవకాశమున్న విషయ ములను తెలిసికొనకుండుట ప్రమాదము, చేయవలసియున్న కార్యమును చేయకుండుట ఆలస్యము అని ఈ రెండింటికిని భేదము చెప్పవచ్చును.

అవ. ఈ విధముగ రాజసతామస ధర్మములు మిక్కిలి శ్రేయో విఘాతకములని చెప్పుటచే, సత్త్వగుణమును బాగుగ ఆశ్రయించి ఆ రెండుగుణములను పూర్తిగ విడనాడవలెనని చెప్పినట్లైనది. 'పరిహ రించుటకై అధర్మమునుగూర్చి కూడ బాగుగ తెలిసికొనవలెను' అను న్యాయము ననుసరించి ఆ రజస్తమోధర్మములను ఈ విధముగ విస్తృత ముగ వివరించుట జరిగినది. ఇపుడు సత్త్వకార్యములు ఉపాదేయము లను విషయమును చెప్పుటకై, సత్త్వగుణస్వభావమును వర్ణించు చున్నాడు-

## సత్త్వగుణము

సత్త్వం విశుద్ధం జలవత్తథాపి
తాభ్యాం మిలిత్వా సరణాయ కల్పతే,
యత్రాత్మబింబః ప్రతిబింబితః సన్
ప్రకాశయత్యర్క ఇవాఖిలం జడమ్. 119

సత్త్వం = సత్త్వగుణము, జలవత్ = జలమువలె, (యద్యపి) విశుద్ధం = పరిశుద్ధమైనదే యైనను, తథాపి = అట్లైనను, తాభ్యాం = ఆ రెండింటితో, మిలిత్వా = కలిసియే, సరణాయ = సంసారమునకై, కల్పతే = సమర్థ మగుచున్నది. యత్ర = దీనియందు, ఆత్మబింబః = ఆత్మబింబము,

ప్రతిబింబితః సన్ = ప్రతిబింబించినదై, అర్కః ఇవ = సూర్యుడువలె, అఖిలం = సమస్తమైన, జడం = జడపదార్థమును, ప్రకాశయతి = ప్రకాశింప జేయును.

ముందు 'తథాపి' అని యుండుటచే మొదట 'యద్యపి' అని చేర్చవలెను. స్వభావముచే జలము నిర్మలమైనట్లే సత్త్వగుణముగూడ నిర్మలమైనదే యైనను ఆ రజస్తమోగుణములతో కలిసి సంసారహేతు వగుచున్నది. 'యత్ర' ఇత్యాదివాక్యముచే ఆ సత్త్వముయొక్క పరిశుద్ధత్వమును స్పష్టీకరించుచున్నాడు. ఆత్మబింబః = ఆత్మయే, ముఖాదికమువలె, బింబము, నిర్మలమగు ఆకాశమున మేఘనక్షత్రసహితమగు ఆకాశము ప్రతిబింబించినట్లును, నిర్మలమగు అద్దమునందు ముఖము ప్రతిబింబించునట్లును, ఆత్మ శుద్ధమగు సత్త్వమునందు ప్రతిబింబించి, నిర్మలమగు అద్దమునందు ప్రతిబింబించిన సూర్యుడువలె, అఖిలం జడం = సమస్తమగు అనాత్మపదార్థమును, ప్రకాశయతి = తెలియబడిన స్వరూపము కలదానినిగా చేయుచున్నాడు. "సత్త్వాత్ సంజాయతే జ్ఞానమ్"-సత్త్వమువలన జ్ఞానము కలుగును.

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వమిత్యుత.

ఈ దేహమునందలి అన్ని ద్వారములయందును, ఎప్పుడు ప్రకాశము, జ్ఞానము కలుగునో అప్పుడు సత్త్వము వృద్ధిపొందినదని గ్రహింపవలెను అని స్మృతివాక్యము.

అవ. రజస్తమోగుణము లున్నను వాటిచే తిరస్కరింపబడని సత్త్వముయొక్క గుణములను చెప్పుచున్నాడు.

మిశ్రస్య సత్త్వస్య భవన్తి ధర్మా
స్త్వమానితాద్యా నియమా యమాద్యాః,
శ్రద్ధా చ భక్తిశ్చ ముముక్షుతా చ
దైవీ చ సంపత్తి రసన్నివృత్తిః. 120

అమానిత్వాద్యాః = అమానిత్వము మొదలగునవియు, యమాద్యాః= యమము మొదలైనవియు, నియమాః=నియమములు, శ్రద్ధాః=శ్రద్ధయు, భక్తిశ్చ=భక్తియు, ముముక్షుతా = మోక్షేచ్ఛ, దైవీసంపత్తిః=దైవ సంపద, అసన్నివృత్తిః=అసురసంపన్నివృత్తియు, మిశ్రస్య=మిశ్రమ మైన, సత్త్వస్య = సత్త్వగుణముయొక్క, ధర్మాః = ధర్మములుగా, భవన్తి = అగుచున్నవి.

మిశ్రస్య = ఏ మాత్రము తమోగుణసంపర్కము లేనిదియు, కొంచెము రజోగుణమిశ్రితమును అగు సత్త్వముయొక్క, ఆ రెండింటి చేత సత్త్వము అభిభూతమైనచో చెప్పనున్న గుణము లుండుటకు వీలులేదు. 'తు' శబ్దము మిగిలిన రజస్తమోగుణములను, వాటిచే అభిభూతమగు సత్త్వగుణమును వ్యావర్తింప జేయును (అనగా వాటికి ఈ ధర్మము లుండవు). అమానిత్వాద్యాః = ఏ అదంభిత్వాదులకు అమానిత్వము మొదటనున్నదో అట్టి గీతోక్తములగు ధర్మములు—

అమానిత్వమదంభిత్వ మహింసా క్షాన్తిరార్జవమ్,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః.
ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ,
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్.
అసక్తిరనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు,
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు.
మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ,
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది.
అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్.

వాస్తవముగా తనయందున్నవి. లేదా లేనివి అగు గుణములనుబట్టి తనను తాను శ్లాఘించుకొనుట మానిత్వము. అది లేకపోవుట 'అమానిత్వము'. కీర్తికొరకు లేదా పూజకొరకు తను చేయు ధర్మమును ప్రకటింపజేసికొనుట దంభము. అది లేకుండుట అదంభిత్వము.

మనోవాక్కాయములచే పరపీడను చేయకుండుట 'అహింస'. ఇతరులు అవమానించుచున్నను వారి విషయమున చిత్తవికారమేమియు లేకుండుట 'క్షాన్తి' మనోవాక్కాయములలో ఒక విధమగు ప్రవృత్తి యుండుట ఆర్జవము. నమస్కరించుట, ప్రశ్నించుట, సేవచేయుట మొదలగు వాటిచే ఆచార్యుని అనుసరించుట ఆచార్యోపాసనము. మట్టిచేతను జలముచేతను బాహ్యమలములను, మైత్ర్యాదివాసనచేతను విషయదోషములను చూచుటయందు అభ్యాసముచేతను రాగాదులగు అంతర్మలములను క్షాళనచేసికొని బైటను, లోపలనుగూడ శుచిగా ఉండుట శౌచము. ముక్తిని సాధించుటకై ప్రయత్నించునపుడు విఘ్నములు వచ్చినను ఆ ప్రయత్నము వీడక మాటిమాటికిని అధికప్రయత్నముచేయుట స్థైర్యము. ఆత్మశబ్దవాచ్యమగు దేహేంద్రియాదికమును, దానికి గల మోక్షసాధనమునకు ప్రతికూలముగనుండుట అనెడు స్వభావమును తొలగించి అందులకు అనుకూలముగ నుండునట్లు ఉంచుకొనుట 'ఆత్మవినిగ్రహము', ఇన్ద్రియార్థేషు = చూడబడుచున్నవి, వినబడినవి అగు శబ్దస్పర్శరూపాదులయందు వైరాగ్యము. అనహంకారః = నేనే అందరికంటెను గొప్పవాడను అనెడు గర్వములేకుండుట. గర్భవాసముచేసి గర్భవాసయోనిద్వారా బైటకు వచ్చుట జన్మ. సకలమర్మస్థానముల భేదనము మృత్యువు. బుద్ధి-బల తేజస్సులు నశించి అందరి తిరస్కారమునకు పాత్రమగు అవస్థ జర. జ్వరాదులు వ్యాధులు. అనిష్టప్రాప్తి, ఇష్టవియోగమువలన కలిగిన ఆధ్యాత్మికాది దుఃఖములు, వాతపిత్తశ్లేష్మములు, మలమూత్ర దుర్గంధాది రూపములు ఐన దోషములు. ఈ జన్మాదుల, అనుదర్శనం= పునఃపునరాలోచనము. అసక్తిః = పుత్రాదులపై ప్రేమను విడచుట. వారియందు, అనభిష్వంగః = వారికి సుఖముగాని దుఃఖముగాని కలిగినపుడు నేనే సుఖవంతుడను, నేనే దుఃఖవంతుడను అను అధ్యాస లేకుండుట, ఇష్టానిష్టముల, ఉపపత్తిషు=ప్రాప్తియందు, ఎల్లప్పుడును

సమచిత్తత్వం=హర్ష విషాదములు లేకుండుట. అనన్యయోగేన=భేద రహితమగు సమాధిచే, నేనే భగవంతుడగు వాసుదేవుడను అను నిశ్చయముచే, స్వాత్మభూతుడనగు నా విషయమున తిరుగులేని భక్తి, వివిక్త....సేవిత్వం=పరిశుద్ధము, మనస్సునకు ప్రసాదమును కల్గించునదియు అగు ఏ ప్రదేశమున్నదో దానిని సేవించుట. విషయాభిలాషులగు జనుల సముదాయమునందు ఆసక్తి లేకపోవుట. ఆత్మను గూర్చి ప్రవర్తించు ఆత్మానాత్మ వివేకజ్ఞానము 'అధ్యాత్మజ్ఞానము'. దానియందు నిత్యత్వం=స్థిరముగనుండుట. ఎల్లప్పుడును త్వంపదార్థమును శోధించుటయందే ఆసక్తి అని యర్థము. ఏలయన పదార్థవివేకము చేయగల్గినవాడు మాత్రమే వాక్యార్థజ్ఞానమును పొందగల్గును. వాక్యార్థజ్ఞానరూపమగు తత్త్వజ్ఞానముయొక్క ఫలమగు మోక్షము చూచుట "తత్త్వజ్ఞానార్థదర్శనము". తత్త్వజ్ఞానమునకు ఫల మేదియో బాగుగ తెలిసికొనినపుడే దాని విషయమున ప్రవృత్తి కలుగునని భావము. యమములలో అంతర్గతమగు అహింసయు, నియమాన్తర్గతమగు శౌచమును ఇచట చెప్పబడినది. కావున "నియమా యమాద్యాః" అనునపుడు అహింసాభిన్నములగు యమములు, శౌచభిన్నములగు నియమములును గ్రాహ్యములు. "శౌచసన్తోషతపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః" అను సూత్రమునందు చెప్పిన శౌచాదులు నియమములు. ఇవి జన్మహేతువగు కామ్యధర్మము నుండి మరల్చి మోక్షహేతువగు నిష్కామధర్మమునందు మానవుని నిలుపును గాన నియమములని చెప్పబడుచున్నవి. శౌచము వెనుక వివరింపబడినది. లభించిన దానితో తృప్తిచెందుట సంతోషము. శరీరమును ఎండింప జేయుట తపస్సు.

విధినోక్తేన మార్గేణ కృచ్ఛ్రచాన్ద్రాయణాదిభిః,
శరీరశోషణం ప్రాహుః తాపసాస్తప ఉత్తమమ్.

శాస్త్రోక్తమార్గమున కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతముల నాచరించి శరీరమును శుష్కింపజేయుట ఉత్తమతపస్సు అని తాపసులు చెప్పుదురు

అని యోగయాజ్ఞవల్క్యోక్తి, స్వాధ్యాయః = ఓంకార-గాయత్రీ మంత్రాదులజపము, ఈశ్వరప్రణిధానం = చెప్పబడినవి, చెప్పబడనివి అగు అన్ని క్రియలను ఫలాపేక్షలేక పరమేశ్వరునికి సమర్పించుట.

కామతోఽకామతో వాపి యత్కరోమి శుభాశుభమ్,
తత్సర్వం త్వయి విన్యస్య త్వత్ప్రయుక్తః కరోమ్యహమ్.

కామముతోకాని, కామములేకుండకాని ఏ శుభాశుభకర్మలను చేయుచున్నానో దాని నంతను నీయందే సమర్పించి, నీచే ప్రేరేపింపబడిన వాడనై నేను చేయుచున్నాను" అని చెప్పబడినది.

అపి ప్రయత్నసంపన్నం కామేనోపహతం తపః,
న తుష్టయే మహేశస్య శ్వలీఢమివ పాయసమ్.

ఎంత ప్రయత్నముతో చేసిన తపస్సైనను, అది కామముచే దూషితమైనచో, కుక్కముట్టిన పాయసమువలె, పరమేశ్వరప్రీతికరము కాజాలదు అను శ్లోకమున, ఫలాభిసంధి తపోవినాశకరమని పెద్దలు చెప్పియున్నారు. ఈ ఐదును నియమములు. "అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహా యమాః" అను సూత్రమునందు చెప్పిన అహింసాదులైదును యమములు. వాటిలో అహింస పూర్వమే వివరింపబడినది. ఎన్నడును అసత్యమును పలుకకుండుట సత్యము. పరధనమును అపహరింపకుండుట అస్తేయము. అష్టవిధములగు మైథునమును విడచుట బ్రహ్మచర్యము. శరీరమాత్రస్థితికి ఏవి అవశ్యకములో వాటిని మించిన భోగసాధనములను స్వీకరింపకుండుట అపరిగ్రహము. ఏ ఆసన-ప్రాణాయామ-ప్రత్యాహార-ధారణా-ధ్యాన-సమాధులకు యమములు మొదటనున్నవో ఆ ఆసనము మొదలు సమాధి వరకును ఉన్న యోగాంగములు 'యమాద్యాః' లోని ఆదిపదముచే గ్రహింపబడును.

సకల శ్రేయస్సులకును మూలకారణమగు ఆస్తిక్యబుద్ధి 'శ్రద్ధ' పరభక్తియనియు అపరభక్తియనియు భక్తి రెండు విధములు. అపర భక్తికే సాధనభక్తియని నామాంతరము, "భక్త్యా సంజాతయా భక్త్యా బిభ్రత్యుత్పులకాం తనుమ్" — అపరభక్తిచే కలిగిన పరభక్తిచే గగుర్పొడిచిన శరీరమును ధరించుచున్నారు అను భాగవతవాక్య మిందులకు ప్రమాణము.

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్,
అర్చనం వన్దనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్.

అను నవవిధభక్తి పరమ ప్రేమరూపమగు పరభక్తికి సాధనము. ముముక్షుతా = స్వస్వరూపసాక్షాత్కారమును పొంది, అవిద్యాకృతములగు అహంకారాది దేహాన్త బంధములను తొలగించుకొనవలె ననెడు ఇచ్ఛ. దైవీసమ్పత్తిః = గీతలోని షోడశాధ్యాయమున "అభయం సత్త్వసంశుద్ధిః" ఇత్యాదిశ్లోకములలో చెప్పబడిన దైవసంపద.

అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగ వ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్.
అహింసా సత్యమక్రోధ స్త్యాగః శాన్తి రపైశునమ్,
దయా భూతేష్వ లోలుత్వం మార్దవం హ్రీ రచాపలమ్.
తేజః క్షమా ధృతిః శౌచ మద్రోహో నాతిమానితా,
భవన్తి సంపదం దైవీ మభిజాతస్య భారత.

అభయ మనగా ఇష్టవియోగమును అనిష్టసంయోగమును కలిగించు హేతువులను చూచుటచే కలుగు ఏ దుఃఖభయము కలదో అట్టి భయము లేకుండుట లేదా శాస్త్రోక్తవిషయములను సందేహబుద్ధి లేకుండ అనుష్ఠించుటకై నిష్ఠ. సత్త్వసంశుద్ధిః = అంతఃకరణము చాల నిర్మలముగ నుండుట. చాల నిర్మలముగ నుండుట యనగా భగవత్తత్త్వము స్ఫురించుటకు యోగ్యముగ నుండుట. శాస్త్రాచార్యోప

దేశములద్వారా ఆత్మతత్త్వమును తెలిసికొనుట జ్ఞానము. తెలిసిన విషయముపై మనస్సును ఏకాగ్రముగ నిలిపి ఆ విషయము స్వానుభవములోనికి వచ్చునట్లు చేసికొనుట యోగము. ఈ జ్ఞానయోగములు రెండింటియందును అధికముగ నిలచియుండుట, అనగా ఎల్లపుడును వాటియందే మనస్సు నిలుపుట 'జ్ఞానయోగవ్యవస్థితి'. తన ద్రవ్యమును అధికారానుసారముగా సత్పాత్రులకు ఇచ్చుట దానము. బాహ్యేంద్రియ నిగ్రహము దమము. అగ్నిహోత్ర దర్శపూర్ణమాసాదికము శ్రుతివిహితమగు యజ్ఞము. దేవయజ్ఞ పితృయజ్ఞ భూతయజ్ఞ మనుష్యయజ్ఞము లను చతుర్విధయజ్ఞము స్మృతివిహితము. 'స్వాధ్యాయ' పదముచే బ్రహ్మయజ్ఞమును వేరుగ చెప్పుటచే 'యజ్ఞ' శబ్దముచే పై యజ్ఞములకే గ్రహణము. స్వాధ్యాయ మనగా- అదృష్టముకొరకై ఋగ్వేదాద్యధ్యయనరూపమగు బ్రహ్మయజ్ఞము. శారీరాదిభేదముచే తపస్సు మూడువిధములు.

దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్,
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే.
అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే.
మనఃప్రసాదః సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః,
భావసంశుద్ధి రిత్యేతత్తపో మానస ముచ్యతే.

దేవతలను, గురువులను, జ్ఞానవంతులను పూజించుట, శౌచము, ఋజుస్వభావము, బ్రహ్మచర్యము, అహింస అనునవి శారీరతపస్సు. ఇతరులను నొప్పింపనిదియు, సత్యము, ప్రియము, హితము అగు వాక్యము, స్వాధ్యాయాభ్యాసము అనునవి వాఙ్మయతపస్సు. మనస్సుయొక్క నైర్మల్యము, సౌమ్యత్వము, మౌనము, మనోనిగ్రహము, భావశుద్ధి అనునవి మానసతపస్సు అని త్రివిధములగు తపస్సులు చెప్పబడినవి. ఆర్జవం = వక్రత్వము లేకపోవుట. మనోవాక్కాయ

ప్రవృత్తులు ఒకే విధముగ నుండుట యని తాత్పర్యము. పరులను పీడింపకుండుట అహింస. చూచినట్లు చెప్పుట సత్యము. పరులు నిందించినను, కొట్టినను వెంటనే కలిగిన కోపమును అప్పుడే శాంతింప చేసికొనుట అక్రోధము. దానము వెనుక చెప్పబడినది గాన త్యాగమనగా దుఃఖసంగమును విడచుట. శాంతిః = అంతరింద్రియముల నిగ్రహము. పైశున మనగా పరదోషములను చాటుట. అది లేకపోవుట 'అపైశునము'. ప్రాణులు దుఃఖపడుచున్నపుడు వాటి దుఃఖమును సహింపజాలకుండుట 'దయ'. అలోలుత్వం = ఇంద్రియములకు విషయములు సమీపమునందున్నను వికారము చెందకుండుట. 'అలోలుపత్వం' అను పదములోని 'ప'కు లోపముచేసి 'అలోలుత్వం' అని ప్రయోగించుట ఆర్షము. లేదా 'అలోలుప్త్వం' అని పాఠము. మృదుత్వం సాధుజనుల సంబంధమును పొందుటకు అర్హత కల్గియుండుట. 'హ్రీ' అనగా అకార్యము చేయుటకు లజ్జ. అచాపలం = వ్యర్థచేష్టలు చేయకుండుట. ప్రాగల్భ్యం = తేజస్సు; స్త్రీ బాలాది మూఢజనులచే తిరస్కరింప శక్యముకాకుండుట అని యర్థము. సామర్థ్యమున్నను అవమానించిన వాని విషయమున కోపము కలుగకుండుట క్షమ. పుట్టిన కోపము వెంటనే శాంతించుట 'అక్రోధము' అని ఈ రెండింటికిని భేదము. దుఃఖాదులచే క్రుంగిపోవుచున్న చిత్తమును స్థిరముగ నిల్పుట 'ధృతి'. బాహ్యాభ్యంతరశుద్ధి శౌచము. పరులను హింసింపవలె నను అభిప్రాయముతో శస్త్రాదులను గ్రహింపకుండుట అద్రోహము. "నేను ఎంతయు పూజ్యుడను" అను భావనకు అతిమానిత అని పేరు. అది లేకపోవుట నాతిమానిత. దానిచే దాని కార్యములగు పూజ్యుల విషయమున నమ్రత్వము మొదలగునవి గూడ గ్రహింపబడును. పుణ్యకర్మచే, శరీరారంభకాలమునందు, అభివ్యక్తమైనదియు, దేవతలకు యోగ్యమైన సాత్త్వికశుభవాసనారూపమును అగు సంపత్తిని పొంది జనించిన పురుషునకు అభయము మొదలగు ఈ ఇరువదియారు ధర్మములును కలుగును.

"తం విద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వప్రజ్ఞా చ"

విద్యాకర్మలును పూర్వప్రజ్ఞయు ఆ పురుషుని ప్రారంభించుచున్నవి (సృజించుచున్నవి).

"పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన"

పుణ్యకర్మచే పుణ్యాత్ముడగును, పాపకర్మచే పాపాత్ముడగును అని శ్రుతి చెప్పుచున్నది. అసన్నివృత్తిః=బ్రహ్మవ్యతిరిక్తమైన దానినుండి నివర్తించుట. 'నావిరతో దుశ్చరితాత్'-దుశ్చరితమునుండి విరమింపని వాడు ఈ ఆత్మను పొందజాలడు అను శ్రుతిచే 'పాపరహితత్వము' అని యర్థము.

అవ. ఈ విధముగ రజస్తమోగుణము లున్నను వాటిచే తిరస్కరింప శక్యముకాని సత్త్వధర్మములను చెప్పి, ఏ మాత్రము సంపర్కము లేని సత్త్వగుణముయొక్క ధర్మములను చెప్పుచున్నాడు—

విశుద్ధసత్త్వస్య గుణాః ప్రసాదః
స్వాత్మానుభూతిః పరమా ప్రశాన్తిః,
తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా
యయా సదానన్దరసం సమృచ్ఛతి. 121

ప్రసాదః=మనోనైర్మల్యము, స్వాత్మానుభూతిః=స్వాత్మానుభవము, పరమా ప్రశాన్తిః=గొప్పశాంతియు, తృప్తిః=తృప్తియు, ప్రహర్షః=ఆనందము, యయా=దేనిచే, సదా=ఎల్లప్పుడును, ఆనన్దరసం=ఆనన్దరసమును, సమృచ్ఛతి=పొందునో, అట్టి, పరమాత్మనిష్ఠా=పరమాత్మయందు ఏకాగ్రస్థితియు, ఇవి, విశుద్ధసత్త్వస్య=విశుద్ధమగు సత్త్వగుణముయొక్క గుణాః=గుణములు.

విశుద్ధత్వ మనగా రజస్తమోగుణములతో కలియకుండుట. కేవల సత్త్వగుణముయొక్క గుణాః=కార్యములగు ధర్మములు. ప్రసాదః=మనస్సు నిర్మలముగా నుండుట. ఆవరకమగు తమస్సు

విక్షేపకమగు రజస్సు లేకపోవుటచే ఎట్టి ప్రతిబంధము లేకుండగ స్వాత్మానుభూతి. ఆత్మతత్త్వము తమస్సుచే ఆవరింపబడినపుడు, అది స్పష్టముగ భాసింపక అన్నమయాదులు భాసించును. కేవల సత్త్వమే ఉన్నపుడు మాత్రము స్వస్వరూపము నిర్విఘ్నముగ అనుభవింపబడును. కావుననే, పరమా = నిరతిశయమైన, ప్రకృష్టమగు శాన్తియు; ముందుగూడ "కస్తాం పరానన్దరసానుభూతిమ్" ఇత్యాది శ్లోకమున (523) చెప్పనున్నాడు. మొదట సాధకదశలో ప్రయత్నపూర్వకముగ సంపాదింపదగిన శాన్తి ఆత్మదర్శనము కలిగిన పిమ్మట స్వభావముగ అయిపోవును అని భావము. కావుననే నీచమగు ఈ ప్రపంచమున సంచారము లేకపోవుటచే మనస్సునకు తృప్తి, అనగా 'చాలును' అనెడు బుద్ధి నిరంకుశముగ కలుగును. ప్రహర్షః = ఇతర సాధనములపై ఆధారపడనిదియు, ఎల్లప్పుడును స్వయముగనే భాసించుచున్న ఆనందము. లేదా - "చేయదగినపని చేసితిని; పొందదగినది పొందితిని" అని తనను ధన్యునిగా తలచుచు సంతసించునుగాన ప్రకృష్టమగు హర్షము. దేనిచే ఎల్లప్పుడును ఆనందరసమును బాగుగ పొందునో అట్టి పరమాత్మనిష్ఠ, స్వరూపానందమును సాక్షాత్కరించుకొనుటచే మనస్సు మరల లేచుటకు అశక్తమై, లీనమై నిర్వికల్పసమాధిని అనుభవించునని భావము.

అవ. ఇపుడు, గుణత్రయమయము, 'మాయ' 'అవిద్య' మొదలగు శబ్దములచే వాచ్యము, కార్యమునుబట్టి ఊహింపదగినదియు అగు ఈ అవ్యక్తమే, స్థూలసూక్ష్మాది సకలకార్యములకు హేతువగుటవలనను, జ్ఞాననాశ్యమగుటవలనను, "శీర్యతే ఇతి శరీరమ్"-నశించునది గాన శరీరము అను వ్యుత్పత్తి ననుసరించి 'కారణశరీరము' అని చెప్పుచు 'అవ్యక్తనామ్నీ' ఇత్యాదిశ్లోకమునందు (110) ఉపక్రమింపబడిన మాయను 'అవ్యక్తమేతత్' ఇత్యాది శ్లోకమునందు ఉపసంహరించుచున్నాడు-

## కారణశరీరము

అవ్యక్త మేతత్త్రిగుణై ర్నిరుక్తం
తత్కారణం నామ శరీరమాత్మనః,
సుషుప్తి రేతస్య విభక్త్యవస్థా
ప్రలీన సర్వేన్ద్రియ బుద్ధివృత్తిః. 122

ఏతత్త్రిగుణైః=ఈ గుణత్రయముచే, నిరుక్తం=నిర్వచింపబడిన, తత్=ఆ, అవ్యక్తం=అవ్యక్తము, ఆత్మనః=ఆత్మయొక్క, కారణం నామ శరీరం=కారణ మను పేరుగల శరీరము. ప్రలీనసర్వేన్ద్రియబుద్ధివృత్తిః= అణగిపోయిన సకలేంద్రియవృత్తులును బుద్ధివృత్తియుగల, సుషుప్తిః= సుషుప్త్యవస్థ, ఏతస్య=ఈ కారణశరీరముయొక్క, విభక్త్యవస్థా= విశిష్టమగు అవస్థ.

అవ్యక్తం = దాని స్వరూపముచే సాక్షాత్తుగ అస్పష్టమైనది. కామ-క్రోధ-జ్ఞాన-ఆలస్య-అమానిత్వాది ధర్మములచే ఊహింపదగిన ఈ రజస్తమఃసత్త్వగుణములచే, నిరుక్తం=త్రిగుణాత్మిక, కార్యాను మేయ అని పూర్వము చెప్పబడిన నిర్వచనము కలది. తత్ అవ్యక్తం= అవిద్యాదిశబ్దములచే చెప్పబడు ఆ అవ్యక్తము, ఆత్మకు కారణశరీరము. ఇది శాస్త్రమునందు కారణశరీర మని ప్రసిద్ధము. 'సుషుప్తిః' ఇత్యాది వాక్యముచే ఈ కారణశరీరముయొక్క అసాధారణమగు అవస్థను చెప్పుచున్నాడు. ఏతస్య=కారణశరీరమైన ఈ అవ్యక్తమునకు 'ప్రలీన సర్వేంద్రియబుద్ధివృత్తిః' అనునది సుషుప్తికి విశేషణము. ఏ సుషుప్తి యందు సర్వేంద్రియవృత్తులును, బుద్ధివృత్తియు లీనమై పోయినవో అది. దీనిచే సర్వేంద్రియముల వృత్తులతో కూడిన జాగ్రదవస్థయు, కేవల బుద్ధివృత్తియేగల స్వప్నావస్థయు వ్యావర్తింపబడినవి. విభక్త్యవస్థా=విభాజకమగు-అనగా ఇతర అవస్థలకంటె దీనిని వేరుచేయు అవస్థ. అజ్ఞానము అవస్థాత్రయమునందును ఉండును. ఐనను

జాగ్రత్స్వప్నావస్థలు అజ్ఞానమునకును, ఇంద్రియబుద్ధి వృత్తులకును గూడ సాధారణములు. సుషుప్తిమాత్రము ఒక్క అజ్ఞానమునకే (అవ్యక్తమునకే) సంబంధించిన దగుటచే దాని అసాధారణావస్థయని భావము.

అవ. నాల్గవ పాదముయొక్క అర్థమును అనుభవముచే స్పష్టీకరించు చున్నాడు—

సర్వప్రకార ప్రమితిప్రశాన్తి ర్బీజాత్మనావస్థితిరేవ బుద్ధేః,
సుషుప్తి రత్రాస్యకిలప్రతీతిః కించిన్న వేద్మీతి జగత్ప్రసిద్ధేః. 123

సర్వప్రకారప్రమితిప్రశాన్తిః=సర్వవిధములగు జ్ఞానముల ప్రశాంతి గల, (సుషుప్తికి విశేషణము) బుద్ధేః = బుద్ధియొక్క, బీజాత్మనా = బీజ స్వరూపమున, **అవస్థితిరేవ**=ఉండుటయే, సుషుప్తిః=సుషుప్తి, అత్ర= ఈ అవస్థయందు, అస్య=పురుషునకు, "కించిత్ న వేద్మి" ఇతి=ఏమియు ఎరుగను అని, జగత్ప్రసిద్ధేః = జగత్తులోని ప్రసిద్ధినిబట్టి, ప్రతీతిః కిల = ప్రతీతియుండును కదా?

ప్రత్యక్షత్వము, అనుమితిత్వము మొదలగు అనేకప్రకారములు గల ప్రమితులు ఏ సుషుప్తియందు పూర్తిగ శాంతించుచున్నవో అది "సర్వప్రకారప్రమితి ప్రశాంతి". అట్లైనచో మరునాడు వ్యవహారమెట్లు జరుగుచున్నది అని ఆశంకించుకొని 'బీజాత్మనా' ఇత్యాది వాక్యముచే సమాధానము చెప్పుచున్నాడు. బుద్ధేః = అంతఃకరణమునకు; బీజాత్మనా = సంస్కారరూపమున, అనగా కారణాజ్ఞానరూపమున, మాత్రమే, అవస్థితిః=ఉనికి, అంతియేకాని ఆ సమయమున తనవలన కలిగిన వృత్తిస్వరూపముతో బుద్ధికి ఉనికి లేదు అను విషయము 'ఏవ' కారముచే తెలియుచున్నది. అదియే సుషుప్తి. ఆ సమయమున ఏ విధమగు జ్ఞానము లేకుండుటకు అనుభవమును ప్రమాణముగ

చూపుచున్నాడు. అత్ర = ఈ సుషుప్తి విషయమున, అస్య = నిద్రించి మేల్కొన్న జీవునియొక్క, 'నాకేమియు తెలియలేదు' అను ప్రతీతి, కిల = ప్రసిద్ధమైనది. ఆ సమయమున అంతఃకరణ వృత్తి కూడ ఉన్నచో అపుడు నాకేమియు తెలయలెదు' అను ప్రతితి ఉండుటకు వీలులెదు. జాగ్రత్స్వప్నావస్థలలో అట్లు లేదు కదా? ఈ అనుభవమును గూర్చి వివాదము చేయువానినిగూర్చి 'జగత్ప్రసిద్ధేః' అని చెప్పుచున్నాడు. ఈ విధముగ సకల ప్రసిద్ధమగు ప్రతీతి యున్నప్పుడు వివాదము చేయుట అసంగతమని అభిప్రాయము.

అవ. ఆత్మానాత్మ వివేచనమునకై చెప్పదలచిన అనాత్మ విషయము నిపుడు ఉపసంహరించుచున్నాడు-

## అనాత్మనిరూపణము

దేహేన్ద్రియప్రాణమనోఽహమాదయః
సర్వే వికారా విషయాః సుఖాదయః,
వ్యోమాది భూతాన్యఖిలం చ విశ్వ
మవ్యక్తపర్యన్తమిదం హ్యనాత్మా. 124

దేహేంద్రియ ప్రాణమనోఽహమాదయః = దేహము, ఇంద్రియములు, ప్రాణములు, మనస్సు, అహంకారము మొదలగు, సర్వే వికారాః = సమస్తమైన వికారములు, విషయాః = విషయములు, సుఖాదయః = సుఖాదులు, వ్యోమాదిభూతాని = ఆకాశము మొదలగు భూతములు, అవ్యక్త పర్యంతం = అవ్యక్తమువరకును గల, ఇదం విశ్వం = ఈ ప్రపంచము అనాత్మా హి = అనాత్మయే కదా?

దేహము, ఇంద్రియములు, ప్రాణము, మనస్సు, అహంకారము అనునవి ఏ బుద్ధ్యాది వికారముల ఆదియందున్నవో అట్టి, సర్వే వికారాః = సమస్తమైన భౌతికపదార్థములు, విషయాః = శబ్దస్పర్శ

రూపరసగంధములు, సుఖాదయః=సుఖము మొదటిది వేటికో, అట్టి మనఃపరిణామ రూపములైన, భయాంతములగు దుఃఖమోహ సంకల్పాదివృత్తులును, వ్యోమాదిభూతాని = ఆకాశము ఏ.పృథివి వరకును గల ఏ భూతములకు ఆదియో అట్టి భూతములును, అధిక ముగ చెప్ప నేల? ఈ దృశ్యమగు అవ్యక్తపర్యంతమైన సకలజగత్తును అనాత్మయే. దానిచే "కో సావనాత్మా" అను దానికి ప్రత్యుత్తర మీయబడినది.

అవ. అన్తిమకార్యమగు దేహము మొదలు ఆదిమ పరిణామ్యు పాదానకారణమగు అవ్యక్తము వరకును ఉన్నవన్నియు అనాత్మలే యని చెప్పబడినది. ఇపుడు, దీనికి విపరీతముగ, ఆదిమ పరిణామ్యు పాదానకారణమగు అవ్యక్తము మొదలు అన్తిమకార్యమగు దేహము వరకును గల సమస్తదృశ్యప్రపంచమును అనాత్మయే యని దార్ఢ్యము కొరకై చెప్పుచు, అది మిథ్య యను విషయమును గూడ చెప్పు చున్నాడు -

మాయా మాయాకార్యం సర్వం మహదాది దేహపర్యన్తమ్,
అసదిద మనాత్మతత్త్వం విద్ధి త్వం మరుమరీచికాకల్పమ్. 125

మాయా = మాయయు, మహదాది = మహత్తు మొదలుకొని, దేహ పర్యన్తం = దేహమువరకును గల, సర్వం = సమస్తమైన, మాయా కార్యం = మాయాకార్యము, ఇదం = ఈ, అనాత్మతత్త్వం = అనాత్మ తత్త్వము, అసత్ = అసత్తనియు, మరుమరీచికాకల్పం = మరుమరీచికతో సమానమైన దనియు, త్వం = నీవు, విద్ధి = తెలిసికొనుము.

మాయా = మూలప్రకృతి, మహత్ = మహత్తత్త్వము, 'తదైక్షత'—అది చూచెను అను.శ్రుతియందు ప్రసిద్ధమగు ఈక్షణము.

అది దేహపర్యంతమగు ఏ మాయాకార్యమునకు ఆదియో అట్టి మహదాదికము. అహంకారః = 'సోఽకామయత'– ఆ ఈశ్వరుడు కోరెను అను శ్రుతియందు చెప్పిన ఈశ్వరసంకల్పము. తరువాత పంచ సూక్ష్మభూతములు, తరువాత పంచీకృతస్థూలభూతములు, తరువాత బ్రహ్మాండము, అందలి చతుర్దశభువనములు, వాటిలో నున్న స్థూల దేహాదులు. ఈ దేహపర్యంతమగు సమస్తమైన, మాయాకార్యం = మాయయు, దాని కార్యము అయిన, అనాత్మతత్త్వం = 'కోఽసావనాత్మా' అను ప్రశ్నకు సమాధానముగ చెప్పబడిన ఆత్మవ్యతిరిక్తపదార్థమును, అసత్ = సద్రూపమగు ఆత్మకంటె భిన్నమైనదనియు, కావుననే పూర్వోక్తమగు శుద్ధాద్వితీయబ్రహ్మజ్ఞానముచే నాశత్వము మొదలగు హేతువుచే, మరుమరీచికాకల్పం = కనబడి నశించిన స్వరూపము కలదగుటచే ఎండమావులతో సమానమైన దానినిగా మిథ్యాభూతమైన దానినిగా, విద్ధి = తెలిసికొనుము. గ్రీష్మమునందు మరుభూమిపై ప్రసరించిన సూర్యకిరణములు మహాజలప్రవాహబుద్ధిని కలిగించును. పరిశీలించి చూచినచో అచట జల మేమియు ఉండదు. అట్లే బ్రహ్మజ్ఞానము కలుగుటకు పూర్వము మాయయు, తత్కార్యములును భాసించును. బ్రహ్మసాక్షాత్కారము కలుగగనే, మెలకువ వచ్చిన పిమ్మట స్వప్నమువలె, అది యంతయు సమూలముగ నశించును. ఈ విధముగ మాయా-మాయాకార్యములు దృష్టనష్టస్వరూపము లగుటచే మరుమరీచికలవలె మిథ్యాభూతములు. మరుమరీచిక లనగా ఎడారిప్రదేశమున ప్రసరించిన సూర్యకిరణములు.

అవ. ఈ విధముగ అనాత్మను గూర్చి పూర్తిగ వివరించి 'పరమః క ఆత్మా' అను ప్రశ్నకు సమాధానము చెప్పుటకు ప్రారంభించుచున్నాడు–

## ఆత్మనిరూపణము

అథ తే సంప్రవక్ష్యామి స్వరూపం పరమాత్మనః,
యద్విజ్ఞాయ నరో బన్ధాన్ముక్తః కైవల్యమశ్నుతే. 126

అథ = అటు తరువాత, పరమాత్మనః = పరమాత్మ యొక్క స్వరూపం=స్వరూపమును, తే = నీకు, సంప్రవక్ష్యామి = చెప్పెదను, యత్ = దేనిని, విజ్ఞాయ = తెలిసికొని, నరః = నరుడు, బంధాత్ = బంధము నుండి, ముక్తః = ముక్తుడై, కైవల్యం = మోక్షమును, అశ్నుతే = పొందునో.

'అథ' శబ్దమునకు 'అనాత్మను గూర్చి చెప్పిన తరువాత' అని యర్థము, యత్ = ఏ పరమాత్మస్వరూపమును, విజ్ఞాయ = సాక్షాత్కరింప జేసికొని, నరః = విద్యాధికారముగల పురుషుడు, బన్ధాత్ = అహంకారాది దేహాన్త బంధమునుండి, ముక్తః = విడువబడినవాడై, అనగా దేహాదితాదాత్మ్యాధ్యాసమును విడచినవాడై, కైవల్యం = సర్వోపాధి వినిర్ముక్తుడగుటచే కేవల దృగ్రూపత్వమును, భేదరహితమగు సచ్చిదానంద రూపత్వమును, అశ్నుతే = పొందునో, అట్టి పరమాత్మ యొక్క స్వరూపమును, పరమాత్మను గూర్చిన సత్యమును, నీకు స్పష్టముగను, విస్తరముగను చెప్పెదను.

అవ. ఆత్మనుగూర్చి చెప్పుటకు ఉపక్రమించుచున్నాడు-

అస్తి కశ్చిత్స్వయం నిత్యమహంప్రత్యయలంబనః,
అవస్థాత్రయసాక్షీ సన్ పంచకోశవిలక్షణః. 127

స్వయం = స్వయముగనే, అహంప్రత్యయలంబనః = 'అహం' అనువృత్తికి ఆశ్రయభూతుడును, అవస్థాత్రయసాక్షీ సన్ = అవస్థాత్రయమునకు సాక్షియై, పంచకోశవిలక్షణః = ఐదు కోశములకంటె భిన్నుడైన, కశ్చిత్ = ఒకానొకడు, నిత్యం = ఎల్లప్పుడును, అస్తి = ఉన్నాడు.

స్వయం = సత్తాస్ఫూర్తి విషయమున ఇతరాపేక్షలేకుండగనే, అహంప్రత్యయలంబనః = 'అహం' అను ఆకారముగల మనోవృత్తితో

తాదాత్మ్యమును పొందుటచే అహంవృత్తికి ఆశ్రయభూతుడును, అహంప్రత్యయః=అహంవృత్తి, లంబనః=బింబమునుగ్రహించునదిగా ఎవనికి ఉన్నదో అతడు-అనగా అహంవృత్తికి విషయభూతుడు ('నేను' అనబడేవాడు అని అర్థము). అవస్థాత్రయసాక్షీ సన్=జాగ్రత్స్వప్న సుషుప్తులనెడు అవస్థాత్రయమునకు సాక్షాద్ద్రష్టయై, పంచకోశవిల క్షణః = అన్నమయ-ప్రాణమయ-మనోమయ-విజ్ఞానమయ-ఆనంద మయకోశములకంటె వ్యతిరిక్తుడు అగువాడు, ఎల్లప్పుడును ఒక డున్నాడు ,"అతడే ఆత్మ" యని అధ్యాహారము. ఈ ఆత్మ కాల త్రయాబాధ్యసద్రూపమని చెప్పినట్లైనది.

అవ. ఆత్మ అవస్థాత్రయసాక్షి యను విషయమును ఉపపా దించుచున్నాడు—

**యో విజానాతి సకలం జాగ్రత్స్వప్న సుషుప్తిషు,**
**బుద్ధితద్వృత్తిసద్భావ మభావ మహ మిత్యయమ్. 128**

**యః = ఎవడు, అహమితి = "నేను నేను" అని, జాగ్రత్స్వప్న సుషుప్తిషు= జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందు, బుద్ధితద్వృత్తిసద్భా వం=బుద్ధియొక్కయు, దాని వృత్తులయొక్కయు ఉనికిని, అభావం=వాటి యొక్క అభావమును, సకలం = ఈ సమస్తమును, విజానాతి =తెలిసికొను చున్నాడో, అయం = ఇది ఆత్మ అని అన్వయము.**

"నేను" దానిని చూచుచున్నాను; దీని అనుమితి చేయుచు న్నాను; శబ్దముద్వారా తెలిసికొనుచున్నాను, స్మరించుచున్నాను ఇత్యాదివిధమున జాగ్రత్స్వప్నములయందు, బుద్ధియొక్కయు దానికి సంబంధించిన వృత్తులయొక్కయు ఉనికిని, సుషుప్త్యనంతరము కలుగు "నాకేమియు తెలియలేదు" అను స్మృతి ననుసరించి, సుషుప్త్యవస్థయందు బుద్ధియొక్కయు, దాని వృత్తులయొక్కయు అభావమును, 'నేను దీనిని తెలిసికొనుచున్నాను; దీనిని తెలిసి

కొంటిని; దీనిని తెలిసికొనగలను" అను అనుభవము వలన, సకలములగు జాగ్రదవస్థలోని పదార్థములను, స్వాప్నపదార్థములను, సుషుప్తియందు అజ్ఞానమును తెలిసికొనుచున్నాడో అతడు ఆత్మ అని అన్వయము.

అవ. అన్నింటిని చూచున దగుటచేతను దీనిని చూచునది మరియొకటి ఏదియు లేకుండుటచేతను, ఆత్మ జ్ఞానస్వరూపము అని చెప్పుచున్నాడు

యః పశ్యతి స్వయం సర్వం యం న పశ్యతి కించన,
య శ్చేతయతి బుద్ధ్యాది న తద్ యం చేతయత్యయమ్. 129

యః = ఏది, స్వయం = తాను, సర్వం = సమస్తమును, పశ్యతి = చూచునో, యం = దేనిని, కించన = ఏదియు, న పశ్యతి=చూడదో, యః= ఏది, బుద్ధ్యాది=బుద్ధిమొదలగు దానిని, చేతయతి=చైతన్యవంతము చేయుచున్నదో, తత్=ఆ బుద్ధ్యాదికము, యం=దేనిని, న చేతయతి=చైతన్యవంతముగ చేయజాలదో, అయం = ఇది (ఆత్మ).

"నాన్యోఽతోఽస్తి ద్రష్టా"-ఈ ఆత్మకంటె భిన్నమగు చూచునది మరియొకటి ఏదియును లేదు అను శ్రుతి ననుసరించి ఏది సర్వమును చూచుచున్నదో, దేనిని మరెవ్వరును చూడజాలరో; "న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనః"-అచటకు నేత్రము, వాక్కు, మనస్సు వెళ్లజాలవు; "న చక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యైర్దైవైః"-నేత్రముచేతగాని, వాక్కుచేతగాని, ఇతరములగు ఇంద్రియములచేతగాని గ్రహింపబడదు. "నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా"-వాక్కుచేగాని, మనస్సుచేగాని, నేత్రముచేగాని పొందుటకు శక్యముకాదు అని శ్రుతి చెప్పుచున్నది. ఏది బుద్ధ్యాది జడపదార్థమును తన ప్రతిబింబముచే చేతనముకల దానినిగా చేయు

చున్నదో, ఆ బుద్ధ్యాదికము స్వతః చేతనస్వభావమగు దేనిని చేతన వంతముచేయజాలదో, జడవస్తువు తనకార్యమును నిర్వర్తింపవలె నన్నచో దానికి చేతనాపేక్షయుండును గాని, చేతనమునకు పరాపేక్షయుండదు_ఇది ఆత్మ అని అన్వయము.

యేన విశ్వ మిదం వ్యాప్తం యం న వ్యాప్నోతి కించన,
అభారూప మిదం సర్వం యం భాన్త మనుభాత్యయమ్.
130

యేన = దేనిచేత, ఇదం విశ్వం = ఈ ప్రపంచము, వ్యాప్తం = వ్యాపింపబడినదో, యం = దేనిని, కించన = ఏదియు, న వ్యాప్నోతి = వ్యాపించదో, అభారూపం = అప్రకాశమగు, ఇదం సర్వం = ఇదియంతయు, భాన్తం = ప్రకాశించుచున్న, యం = దేనిని, అనుభాతి = అనుసరించి ప్రకాశించుచున్నదో, అయం = ఇది (ఆత్మ).

అంతకును ఉపాదానకారణ మగుటచే సర్వాంతరమగు దేనిచే ఈ జగత్తు అంతయు, వ్యాప్తం=విశేషముగ సంబద్ధమైనదో, ఏ వస్తువు కూడ ఏ ఆత్మను వ్యాపింపజాలదో, ఈ వస్తువు లన్నియు బాహ్యములు గాన దీనిని వ్యాపింపజాలవు. "విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్"_నేను జగత్తునంతను ఒక్క అంశతో నిలిపియున్నాను. "వికారావర్తి చ తథా హి స్థితిమాహ"_పరమేశ్వర వికార మాత్రగోచరమే కాక అవికారముగ కూడ నున్నది. అమ్నాయము వికారభూతములగు సవితృమండలాదులం దున్నదియు తదతీతము నగు ద్విరూపమగుస్థితిని చెప్పుచున్నది.

"పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి"_భూతము లన్నియు ఈతనిలో నాల్గవవ తు మాత్రమే. అమృతమగు ఈతని మిగిలిన పాదత్రయము పైన ఉన్నది అని స్మృతి_సూత్ర_శ్రుతులు చెప్పుచున్నవి. "జ్యాయాన్ పృథివ్యాః జ్యాయానన్తరిక్షాత్

జ్యాయానేభ్యో లోకేభ్యః"-ఈ ఆత్మ ఈ భూమికంటెను, అన్తరిక్షము కంటెను, అన్నిలోకముల కంటెను పెద్దది అని కూడ శ్రుతులు చెప్పు చున్నవి. అభారూపం=అప్రకాశరూపమైన-జడమైన, "తమేవ భాన్త మను భాతి సర్వమ్" - ప్రకాశించుచున్న ఈ ఆత్మను అనుసరించియే మిగిలిన వన్నియు భాసించుచున్నవి, అను శ్రుతి ననుసరించి ఇది యంతయు, చిద్రూపమైన, ప్రకాశించుచున్న దేనిని అనుసరించి భాసించుచున్నదో అది ఆత్మయని అన్వయము. ఈ శ్లోకమున - 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' అను శ్రుతిచే చెప్పబడిన అనన్తత్వము దేశపరిచ్ఛేదములేదు అని చెప్పుటద్వారా చెప్పబడినది.

అవ. 'య శ్చేతయతి బుద్ధ్యాది' అను వాక్యములో చెప్పిన విషయమునే వివరించుచున్నాడు-

యస్య సన్నిధి మాత్రేణ దేహేంద్రియ మనో ధియః,
విషయేషు స్వకీయేషు వర్తన్తే ప్రేరితా ఇవ. 131

యస్య=దేనియొక్క, సన్నిధిమాత్రేణ=సన్నిధిమాత్రము చేతనే, దేహేంద్రియమనోధియః=దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ఇవి యన్నియు, ప్రేరితా ఇవ=ప్రేరేపింపబడినవి వలె, స్వకీయేషు= తమకు సంబంధించిన, విషయేషు=విషయములయందు, వర్తన్తే= ప్రవర్తించుచున్నవో.

"కేనేషితం పతతి ప్రేషితం మనః కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః కేనేషితాం వాచమిమాం వదన్తి చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి"-మనస్సు ఎవనిచే ప్రేరేపింపబడినదై వెళ్లుచున్నది? ప్రథమ ప్రాణము ఎవనిచే ప్రేరితమై బయల్వెడలుచున్నది? ఎవనిచే ప్రేరేపితమగు ఈ వాక్కును పలుకుచున్నారు? చక్షుఃశ్రోత్రములను ఏ దేవుడు ప్రేరేపించుచున్నాడు? అని ప్రశ్నించి, "శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచో హ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః చక్షు

షశ్చక్షుః"-ఆత్మ శ్రోత్రమునకు శ్రోత్రము; మనస్సునకు మనస్సు; వాక్కునకు వాక్కు; ప్రాణమునకు ప్రాణము; నేత్రమునకు నేత్రము అని (కేనోపనిషత్తునందు) ప్రత్యుత్తరముగ చెప్పబడిన విషయమును చెప్పుచున్నాడు. ఏ ఆత్మయొక్క, సంనిధిమాత్రేణ = అభిమానరూప సంబంధవశముచేత, దేహేంద్రియ మనోధియః = ఇచట దేహ శబ్దముచే వాక్పాణిపాదాది కర్మేంద్రియములు గ్రహింపబడును. ఇంద్రియశబ్దముచే శ్రోత్రాది జ్ఞానేంద్రియములు గ్రహింపబడును. మనః = అన్తఃకరణము. ధీః = కర్త్రియగు బుద్ధి. మాటలాడుట, గ్రహించుట, నడచుట, వినుట, చూచుట, స్పృశించుట, సంకల్పించుట మొదలగు తమతమ విషయములయందును, లౌకికవైదిక కార్యములయందును ప్రేరేపింపబడినవివలె - జడములకు స్వతః వ్యాపారము ఉండదు కదా? - ప్రవర్తించుచున్నాడో అది ఆత్మ అని అన్వయము.

అహంకారాది దేహాన్తా విషయాశ్చ సుఖాదయః,
వేద్యన్తే ఘటవద్యేన నిత్యబోధ స్వరూపిణా. 132

నిత్యబోధస్వరూపిణా = నిత్యజ్ఞానస్వరూపియగు, యేన = దేనిచే, అహంకారాది దేహాన్తాః = అహంకారము మొదలు దేహముపరకునుగల పంచకోశములును, విషయాశ్చ = శబ్దాదివిషయములును, సుఖాదయః = సుఖాదులును, ఘటవత్ = ఘటమువలె, వేద్యన్తే = తెలియబడుచున్నవో -

దృశ్యము ద్రష్టయొక్క ధర్మము కాజాలదు. అందుచే అహంకారాది దేహాంతములగు పంచకోశములును, శబ్దాదివిషయములు, వాటివలన కలుగు సుఖాదులును, నిత్యబోధస్వరూపిణా = స్వతఃసిద్ధమగు జ్ఞానస్వరూపముగల, దేనిచే, ఘటమువలె తెలియబడుచున్నవో అది ఆత్మయని అన్వయము. సుఖాదులు దృశ్యములు గాన అవి ద్రష్టయొక్క ధర్మములు కాజాలవు. అందుచే ఆత్మ అసంగ మను విషయము చెప్పినట్లైనది. అహంకారాది దేహాన ములగు

ఐదుకోశములును వేద్యములని చెప్పుటచే సూత్రస్థానీయమగు (ఈ ఘట్టములోని) మొదటి శ్లోకమున (127) చెప్పబడిన పంచకోశ విలక్షణత్వము ఇచట సంగ్రహముగ చెప్పబడినది. ఈ విషయమే మున్ముందు 'దేహోఽయమన్నభవన' ఇత్యాదిశ్లోకమున (156) స్పష్టము చేయబడును.

ఏషోఽన్తరాత్మా పురుషః పురాణో
నిరన్తరాఖణ్డసుఖానుభూతిః,
సదైకరూపః ప్రతిబోధమాత్రో
యేనేషితా వాగసవశ్చరన్తి. 133

యేన = దేనిచే, ఇషితాః = ప్రేరేపింపబడినవై, వాగసవః = వాక్ప్రాణములు, చరన్తి = సంచరించుచున్నవో, ఏషః = ఈ, అన్తరాత్మా = అన్తరాత్మ, పురాణః పురుషః = ప్రాచీనుడైన పురుషుడు; నిరన్తరాఖణ్డ సుఖానుభూతిః = నిరంతరములు అఖండములు అగు ఆనంద-అనుభవములే స్వరూపముగా కలది, సదా = ఎల్లప్పుడును, ఏకరూపః = ఒకేవిధమగు రూపము గలది, ప్రతిబోధమాత్రః = అన్ని జ్ఞానములయందును భాసించునది.

దేనిచే, ఇషితాః = సన్నిధిమాత్రముచేతనే ప్రేరితములై, వాగసవః = వాక్కును, ప్రాణములును, ఇది సకలకార్యకరణసంఘాతమునకును ఉపలక్షణము. 'వాక్', 'అసవః' అని భిన్నపదములుగనైన తీసికొనవచ్చును. వాగింద్రియము, ప్రాణములును, చరన్తి = శబ్దోచ్చారణము ఉచ్ఛ్వాసనిఃశ్వాసములు మొదలగు తమతమ కర్మలను చేయుచున్నవో, అది, అన్తరాత్మా = లోకప్రసిద్ధములును, బ్రహ్మసాక్షాత్కారమునకు హేతువుగ శ్రుతిచేత గూడ కల్పితములును, బాహ్యములును అగు అన్నమయాది - ఆనందమయాంత పంచకోశముల కల్పనకు అధిష్ఠానముగ నుండుటచే సర్వానుగతమై, నీలనీరద, సర్పము, దండము, జలధారాదుల కల్పనకు అధిష్ఠానమై భాసించు రజ్జువువలె భాసించు అంతరాత్మ. పురుషః = పూర్ణుడు లేదా 'పురి శేతే'

అను వ్యుత్పత్తిచే శరీరమునందు శయనించువాడు. పురాణః=పూర్వము కూడ ఉన్నను క్రొత్తవాడే; అనగా సనాతనుడు. నిరన్తరానన్త సుఖానుభూతిః - నిరన్తరం = నిరవధికమైనది. కావుననే, అఖణ్డం= అపరిచ్ఛిన్నమైన, యే సుఖముకలదో, మరియు నిరంతరము, అఖండము నగు నే యనుభూతి కలదో, తత్స్వరూపుడు. 'యత్ సాక్షాదపరోక్షాద్ బ్రహ్మ' - ఏది సాక్షాత్తు అపరోక్షమైనదో అది బ్రహ్మ అని శ్రుతివాక్యము. ఎల్లప్పుడును ఒకే రూపముకలవాడు. అనగా నిర్వికారుడు. ప్రతిబోధమాత్రః:- "బోధే బోధే ప్రతిబోధమ్. ప్రతి బోధం మీయతే ఇతి ప్రతిబోధమాత్రః." సకలబుద్ధివృత్తులయందును, కాష్ఠాదులయందు అగ్నివలె, అనుగతరూపమున తెలియబడువాడు అని యర్థము. "ప్రతిబోధవిదితం మతమ్" - ప్రతిజ్ఞానమునందును తెలియదగినది అని శ్రుతివాక్యము. జ్ఞానరూపత్వము 'నిరన్తరానన్త సుఖానుభూతిః' అను పదముచే చెప్పబడినది (గాన ఇచట అర్థము గ్రహింపపనిలేదు) లేదా ప్రతిబోధమనగా గురూపదేశజన్య జ్ఞానము- దానియందు విషయమగువాడు. 'గురువుచే బోధింపబడినవాడై' (గురుణా ప్రతిబోధితః) అని ప్రసిద్ధము. లేదా నిద్రపోయి మేల్కొనిన వాడు (సుప్తప్రతిబుద్ధః) అను ప్రసిద్ధి ననుసరించి, అవిద్యారూపమగు నిద్రను తొలగించు మహావాక్యజన్యమగు అఖండాకారవృత్తిరూప మగు జ్ఞానము ప్రతిబోధము—దానియందు విషయమైనవాడు అని యర్థము.

అవ. "సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వాభి వదన్యదాస్తే" -ధీరుడైన ఈ ఆత్మ సమస్తరూపములను వేరువేరుగచేసి, నామముల నేర్పరచి వాటియం దుండును, మొదలగు శ్రుతుల నను సరించియు, "అవస్థితేరితి కాశకృత్స్నః" పరమాత్మయే విజ్ఞానాత్మ రూపమున ఉన్నాడు అని కాశకృత్స్నుడు, అను బ్రహ్మసూత్రము ననుసరించియు పరమాత్మయే జీవరూపమున ఉండుటచే శోధిత 'త్వం' పదార్థముగ ఆత్మను చెప్పి, "అనశ్నన్నన్యోఽభిచాక

శీతి" - పరమాత్మ కర్మఫలమును అనుభవింపకుండగ ప్రకాశించు చున్నాడు అను శ్రుతిచే తత్పదార్థముగ బోధితమగు ఆత్మనుగూర్చి చెప్పుచున్నాడు-

అత్రైవ సత్త్వాత్మని ధీగుహాయా
మవ్యాకృతాకాశ ఉరుప్రకాశః,
ఆకాశ ఉచ్చైః రవివత్ప్రకాశతే
స్వతేజసా విశ్వమిదం ప్రకాశయన్. 134

అత్రైవ = ఈ శరీరమునందే, సత్త్వాత్మని= సత్త్వప్రధానమగు ధీగుహాయాం = బుద్ధియనెడు గుహాయందు, అవ్యాకృతాకాశే = మాయ యందు, ఉరుప్రకాశః = అధికప్రకాశముగల, ఆకాశః= పరమాత్మ, స్వ తేజసా = తన తేజస్సుచే, ఇదం విశ్వం = ఈ ప్రపంచమును, ప్రకాశ యన్ = ప్రకాశింపజేయుచు, రవివత్ = సూర్యుడువలె, ఉచ్చైః ప్రకాశతే= సర్వోత్కర్షముతో ప్రకాశించుచున్నాడు.

అత్రైవ = ఈ సాధకశరీరమునందే, సత్త్వప్రధానమగు బుద్ధి యనెడు గుహయందు; 'గుహా' శబ్దము గుహూ సంవరణే అనుధాతువు నుండి నిష్పన్నమైనది. బుద్ధి విజ్ఞానకోశముగనుండి ఆత్మను కప్పి వేయుచున్నది గాన 'ధీగుహ' అని చెప్పబడినది. దానియందు, ఉపా ధాన కారణ మగుటచే అనుస్యూతముగనున్న ఏ అవ్యాకృతాకాశము కలదో దానియందు, అనగా మాయయందు, ఉరుప్రకాశః = అధిక ప్రకాశరూపమైనది. జ్ఞానరూపమై సర్వావభాసకమగుటచే, ఇది ఉరు ప్రకాశము. "తద్దేవా జ్యోతిషాం జ్యోతిః"-దేవతలు జ్యోతిస్సులకు జ్యోతిస్సైన ఆ ఆత్మస్వరూపమును అని శ్రుతి వాక్యము. ఆకాశః = పర మాత్మ, స్వతేజసా = సూర్యాదిసకలజ్యోతిస్సులను ప్రకాశింపజేయు జ్ఞానరూపమగు ప్రకాశముచేత, "యేన సూర్య స్తపతి తేజసేద్ధః" - ఏ పరమాత్మచే తేజస్సుచే ప్రదీప్తుడై సూర్యుడు తపించుచున్నాడో అని శ్రుతి వాక్యము. ఇదం విశ్వం = దృశ్యమగు సకలప్రపంచమును, ప్రకాశింప

జేయుచు, సూర్యుడువలె, ఉచ్చైః = సర్వోత్కర్షముతో ప్రకాశించు చున్నాడు లేదా 'ఉచ్చైః రవివత్' అని అన్వయించి, 'ఆకాశమధ్యవర్తి యగు సూర్యుడువలె' అని అర్థము చెప్పవచ్చును. ఈ విధముగ పూర్వశ్లోకమున 'ఏషోఽన్తరాత్మా పురుషః' అను వాక్యమున "పురి, శరీరే, శేతే ఇతి పురుషః" అను వ్యుత్పత్తిచే, 'శరీరమున నివసించు వాడు' అని చెప్పిన ఆత్మనుగూర్చి ఈ శ్లోకమున-అత్ర=ఈ స్థూలశరీరమునందు అనియు, ధీగుహాయాం='సూక్ష్మశరీరమునందు' అనియు, అవ్యాకృతాకాశే = 'కారణశరీరమునందు' అనియు వివరింపబడినది. (అనగా ఆత్మ స్థూల-సూక్ష్మ-కారణశరీరాంతరాత్మ యని యర్థము) ఆకాశమధ్యవర్తియగు రవి సకలదిక్కులందును ఉన్న వస్తువులను ప్రకాశింపజేయుట అనునది లోకప్రసిద్ధము. అట్లే సర్వాంతరుడగు ఆత్మ సకలవస్త్వవభాసకమని అభిప్రాయము.

జ్ఞాతా మనోహంకృతివిక్రియాణాం
దేహేన్ద్రియప్రాణకృతక్రియాణామ్,
అయోఽగ్నివత్తాననువర్తమానో
న చేష్టతే నో వికరోతి కించన. 135

మనోఽహంకృతివిక్రియాణాం = మనస్సుయొక్కయు, అహంకారముయొక్కయు వికారములకును, దేహేన్ద్రియప్రాణకృతక్రియాణాం = దేహేంద్రియ ప్రాణములచే చేయబడిన క్రియలకును, జ్ఞాతా = జ్ఞాతయైన ఈ ఆత్మ, అయః = ఇనుమును, అగ్నివత్ = అగ్నివలె, తాన్ = వాటిని, అనువర్తమానః = అనుసరించుచున్నవాడై, న చేష్టతే=చేష్టచేయుట లేదు; కించన = దేనినికూడ, నో వికరోతి= వికారము కలదానినిగ చేయుటలేదు.

అంతరములగు కామము సంకల్పము మొదలగు మనోవిక్రియలను, గర్వము, దర్పము మొదలగు అహంకారవికారములను తెలిసికొనునది, అట్లే బాహ్యములైన, దేహేన్ద్రియప్రాణాకృతక్రియాణాం-దేహశబ్దముచే కర్మేంద్రియములు వివక్షితములు గాన వాటి క్రియలగు

వచనాదులను, దర్శనశ్రవణాదికములగు చక్షురాది జ్ఞానేంద్రియ వ్యాపారములను, ఉచ్ఛ్వాసనిశ్వాసాదులగు ప్రాణవ్యాపారములను తెలిసికొనునది. ఈ విధముగ సకలమైన అంతర-బాహ్యవికారములకు సాక్షియైన ఈ యాత్మ నిర్వికారమని చెప్పుచున్నాడు. పొడవుగగాని, గుండ్రముగగాని ఉన్న ఇనుమును ఆశ్రయించియున్న అగ్ని ఏ విధముగ ఆ యా ఆకారములలో నున్నట్లు వ్యవహరింపబడునో, వాస్తవమున అగ్నికే విధముగ దీర్ఘత్వ వర్తులత్వాదు లుండవో అట్లే మనోహంకృతిదేహేంద్రియ ప్రాణములను, అనువర్తమానః=వ్యాపించుచున్నదగుటచేతను, స్వచ్ఛమగుటచేతను అంతటను ప్రతిబింబించుచున్నను. వాటివాటికి సంబంధించిన వ్యాపారములు కలదిగ వ్యవహరింపబడుచున్నను వాస్తవమున, న చేష్టతే=తాను వికారమునుపొందుట లేదు. నో వికరోతి కించన=దేనియందును వికారమును పుట్టించుట లేదు. ఆత్మ సూర్యుడు సాన్నిధ్యమాత్రముచేతనే జడపదార్థములను ప్రవర్తించునట్లు చేయుచున్నది కాని తన వ్యాపారము ద్వారా కాదు అని భావము.

అవ. ఈ విషయముననే సహేతుకముగ విశదీకరించుచున్నాడు-

న జాయతే నో మ్రియతే న వర్ధతే
న క్షీయతే నో వికరోతి నిత్యః,
విలీయమానేఽపి వపుష్యముష్మిన్
న లీయతే కుంభ ఇవాంబరం స్వయమ్. 136

ఈ పరమాత్మ, నిత్యః=నిత్యుడు, న జాయతే=పుట్టుట లేదు, న మ్రియతే=మరణించుటలేదు, న వర్ధతే=వృద్ధిపొందుటలేదు, న క్షీయతే=క్షీణించుటలేదు, నో వికరోతి=వికారముకలిగించుటలేదు, అముష్మిన్=ఈ, వపుషి=శరీరము, విలీయమానేఽపి=నశించుచున్నను, కుంభే=కుంభము నశించుచున్నను, అంబరం ఇవ=ఆకాశమువలె, స్వయం=తాను, న లీయతే=నశించుటలేదు.

'జాయతే, అస్తి, విపరిణమతే, వర్ధతే, అపక్షీయతే, నశ్యతి' అని (యాస్కాదులు) చెప్పిన విధమున శరీరాదులకు జన్మ, స్థితి, విపరిణామము, వృద్ధి, క్షీణించుట, వినాశము అను ఆరువికారములు కనబడుచున్నవి. ఈ పరమాత్మ, నిత్యః = ఉత్పత్తివినాశాదిశూన్యుడు, కాన న జాయతే = పుట్టుటలేదు. నో మ్రియతే = నశించుటలేదు, అతః = ఆ కారణమువలన-అనగా మొదటివికారము చివరివికారము లేనివాడగుటచే, న వర్ధతే = వృద్ధిరూపమగు వికారము కలవాడు కాదు. న క్షీయతే = అపక్షయరూపమగు వికారము కలవాడుకూడ కాదు. ఉత్పత్తి లేదుగాన దీని తరువాత కలుగు 'స్థితి' అనునది కూడ లేదు. నిత్యుడగుటచే అవయవరహితుడు గాన విపరిణామముకూడ లేదు. తనకు వికారమున్ననే ఇతరులకు వికారముకలిగించుటకు అవకాశముండును. పరమాత్మ సర్వవిధవికార శూన్యుడగుటచే ఇతర పదార్థములందుగూడ వికారమును కలిగింపడు అని పూర్వశ్లోకోక్తమగు అర్థమే ఇచట సహేతుకముగ ప్రతిపాదింపబడినది. 'నో వికరోతి' అనగా ఇతర పదార్థములయందు వికారమును కలిగింపడు అని యర్థము. ఈ శరీరము నశించుచున్నను, కుంభము నశించుచున్నను ఆకాశ మెట్లు నశింపదో, అట్లే ఈ ఆత్మ నశించుటలేదు. ఈ విధముగ ఆత్మయందు స్వతః గాని పరతః గాని వికారము లేదు అని యర్థము.

అవ. సరియగు జ్ఞానము కలుగుటకై విజ్ఞానాత్మ పరమాత్మల స్వరూపమును ఏకముచేసి చెప్పుచున్నాడు_

ప్రకృతివికృతిభిన్నః శుద్ధబోధస్వభావః
సదసదిద మశేషం భాసయన్నిర్విశేషః,
విలసతి పరమాత్మా జాగ్రదాదిష్వవస్థా
స్వహమహమితి సాక్షాత్సాక్షిరూపేణ బుద్ధేః. 137

ప్రకృతివికృతిభిన్నః = ప్రకృతివికృతులకంటె భిన్నుడును, శుద్ధ బోధస్వభావః = శుద్ధజ్ఞానస్వరూపుడును, సదసత్ = మూర్తము అమూర్తము అయిన, ఇదం అశేషం = ఈ సమస్త ప్రపంచమును, భాసయన్ = భాసింపజేయుచున్నవాడును, నిర్విశేషః = ధర్మరహితుడును అగు, పరమాత్మా = పరమాత్మ, జాగ్రదాదిష్వవస్థాసు = జాగ్రదాద్యవస్థలయందు, బుద్ధేః = బుద్ధికి, సాక్షిరూపేణ = సాక్షిగా, అహం అహం ఇతి = నేను నేను అని, సాక్షాత్ = ప్రత్యక్షముగ, విలసతి = ప్రకాశించుచున్నాడు.

ప్రకృతిః = అవిద్య, వికృతయః = ఆకాశాదులు, వాటికంటె భిన్నమైనవాడు; అనగా కార్యకారణవ్యతిరిక్తుడు. శుద్ధబోధస్వభావః = శుద్ధః = విషయశూన్యమగు, ఏ జ్ఞానముకలదో అదియే స్వభావముగా స్వరూపముగా కలవాడు, అనగా కేవలదృక్‌స్వరూపుడు-జ్ఞానస్వరూపుడు-అని యర్థము. ఇదం = ప్రత్యక్షాదిగోచరమగు, సత్ = తేజస్సు మొదలగుమూర్తపదార్థమును. అసత్ = ఆకాశాదికమగు అమూర్తపదార్థమును, సమస్తమును ప్రకాశింపజేయుచున్నవాడు. నిర్విశేషః = ధర్మశూన్యుడు. అట్టి పరమాత్మ, జాగ్రత్స్వప్నసుషుప్త్యాద్యవస్థలయందు బుద్ధికి సాక్షిగా; సుషుప్త్యవస్థలోకూడ బుద్ధి బీజరూపమున ఉండును గాన. ఆ అవస్థలో పరమాత్మ బుద్ధి సాక్షిగా ఉండును. 'నేను' 'నేను' అని ప్రత్యగ్రూపమున (తానుగా) ప్రకాశించుచున్నాడు.

అవ. పరమాత్మను స్వాభిన్ననిగా తెలిసికొనుటకు మనోనియమనము, తద్ద్వారా బుద్ధిప్రసాదము అనునవి హేతువులని చెప్పుచు "బ్రహ్మసంస్థోఽమృతత్వమేతి" అను శ్రుతివాక్యార్థమును శిష్యునకుపదేశించుచున్నాడు—

నియమితమనసాముం త్వం స్వమాత్మానమాత్మ
న్యయమహమితి సాక్షాద్విద్ధి బుద్ధిప్రసాదాత్,
జనిమరణతరంగాపారసంసారసింధుం
ప్రతర భవ కృతార్థో బ్రహ్మరూపేణ సంస్థః. 138

త్వం=నీవు, ఆత్మని=ఆత్మయందు, నియమితమనసా=స్థాపిత మగు మనస్సుతో, బుద్ధిప్రసాదాత్=బుద్ధియొక్క అనుగ్రహమువలన, స్వం = స్వస్వరూపభూతుడగు, ఆత్మానం = పరమాత్మను, అయం అహం ఇతి=ఈ పరమాత్మయే, నేను అని, సాక్షాత్=ప్రత్యక్షముగ, విద్ధి=తెలిసికొనుము, జనిమరణతరంగాపారసంసారసిన్ధుం=జన్మమర ణములనెడు తరంగములు కలదియు, అపారమును అగు సంసారసముద్ర మును,ప్రతర=దాటుము, బ్రహ్మరూపేణ=బ్రహ్మరూపముతో, సంస్థః = ఉన్నవాడవై, కృతార్థః = కృతార్థుడవు, భవ = కమ్ము.

నీవు ఆత్మయందు, నియమితమనసా=పంచకోశములనుండి మరల్చబడి పరమాత్మయందు మాత్రమే, శ్రవణమననిదిధ్యాసనము లచే స్థాపితమగు మనస్సు అనెడు సాధనముతో "మనసైదమాప్తవ్యమ్" -ఈ పరమాత్మస్వరూపము మనస్సుతో మాత్రమే పొందదగినది అని శ్రుతి. బుద్ధిప్రసాదాత్=అసంభావన. సంశయభావన, విపరీతభావన అనెడు దోషములు నశించుటచే విశుద్ధమైన, సకలవిధదోషశూన్యమైన బుద్ధియొక్క అనుగ్రహమువలన, "దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా"-ఈ యాత్మ ఏకాగ్రమును సూక్ష్మమును అగు బుద్ధిచే కనుగొనబడును అనియు, "జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వః తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః"-జ్ఞానప్రసాదముచే (నైర్మల్యముచే) విశుద్ధమైన అంతఃకరణముకలవాడై, నిర్గుణుడగు ఆ పరమాత్మను ధ్యానించుచు సాక్షాత్కరించుకొనును అనియు శ్రుతి చెప్పుచున్నది. "స ఆత్మా తత్త్వమసి"- అదియే ఆత్మ, నీవు ఆ బ్రహ్మమే, "అస న్నేవ స భవతి అసద్బ్రహ్మేతి చేద్వేద చేత్"-బ్రహ్మ 'అసత్' అని గ్రహించినవాడు అసత్తుగానే అగును. బ్రహ్మ లేదా అన్నచో 'నేనే లేను' అని చెప్పినట్లు అగునని యర్థము అను శ్రుతుల ననుసరించి పరమా త్మయే ముఖ్యము గాన, స్వస్వరూపమగు ఆ పరమాత్మను, అయమహ మితి సాక్షాద్విద్ధి=ఇంతవరకును ఉన్న, "పరమాత్మ వేరు, నేను వేరు" అనెడు బుద్ధిని విడిచి అభేదబుద్ధితో సాక్షాత్కరించుకొనుము. దానికి

ఫలమును చెప్పుచున్నాడు. 'పునరపి జననం పునరపి మరణం' అని చెప్పిన విధమున బ్రహ్మజ్ఞానము కలుగనంతవరకును అవిచ్ఛిన్నముగ నున్న జన్మమరణము లనెడు తరంగములతో కూడినదియు, అపారః = బ్రహ్మయనెడు పారము-అవ్వలి ఒడ్డు-తెలియక పోవుటచే అపారమును అగు ఏ సంసారమున్నదో అదియే సముద్రము; దానిని పూర్తిగ దాటుము. సద్యోముక్తిని పొందుము అని యర్థము. ఎల్లప్పుడును బ్రహ్మరూపమున నున్నవాడవై కృతార్థుడవు, ఇక చేయవలసిన దేదియు లేనివాడవు కమ్ము.

"జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః,
నైవాస్తి కించిత్కర్తవ్యం అస్తి చేన్న స తత్త్వవిత్."

జ్ఞానామృతముచే తృప్తుడును, కృతకృత్యుడును అగు యోగికి కర్తవ్యమేదియు ఉండదు. ఉన్నచో అతడు తత్త్వవేత్తకాడు అను వాక్యమిటు ప్రమాణము.

అవ. 'అస్తి కశ్చిత్ స్వయం నిత్యం' అను శ్లోకము మొదలు పదునొకండు శ్లోకములచే ఇంతవరకును, 'పరమః క ఆత్మా' అను ప్రశ్నకు సమాధానము చెప్పి, 'కో నామ బంధః' అను శిష్యుని మొదటి ప్రశ్నకు రెండు శ్లోకములతో సమాధానము చెప్పుచున్నాడు-

## అధ్యాస

అత్రానాత్మన్యహమితిమతి ర్బన్ధ ఏషోఽస్య పుంసః,
ప్రాప్తోఽజ్ఞానా జ్జననమరణక్లేశసంపాతహేతుః,
యేనైవాయం వపురిద మసత్సత్యమిత్యాత్మబుద్ధ్యా
పుష్యత్యుక్షత్యవతి విషయై స్తన్తుభిః కోశకృద్వత్. 139

అస్య పుంసః = ఈ పురుషునకు, అత్ర = ఈ, అనాత్మని = అనాత్మయైన, జననమరణక్లేశహేతుః = జననమరణాదిక్లేశములు వచ్చుటకు

హేతువగు, అహం ఇతి మతిః = 'నేను' అనెడు బుద్ధి, అజ్ఞానాత్ = అజ్ఞానమువలన, ప్రాప్తః = వచ్చినది, ఏషః = ఇదియే, బన్ధః = బంధము, యేనైవ = ఏ బంధముచేతనే, అయం = ఈ పురుషుడు, ఇదం = ఈ, అసత్ వపుః = అసత్తైన శరీరమును, సత్యమితి = సత్యమైనది అని, ఆత్మబుద్ధ్యా = ఆత్మబుద్ధిచే, విషయైః = విషయములతో, తంతుభిః = దారములతో కోశకృద్వత్ = సాలెపురుగువలె, పుష్యతి = పోషించుచున్నాడో, ఉక్షతి = తడుపుచున్నాడో, అవతి = రక్షించుచున్నాడో.

వెనుక చెప్పిన విధమున, వాస్తవమున పరమాత్మయే స్వస్వరూపమైనను, ఈ పురుషునకు అనాదిసిద్ధావిద్యావశముచే, అనాత్మని = అనాత్మయందు-దేహాదికమునందు, అహమితి మతిః = "నేను మనుష్యుడను, నేను క్షుత్పిపాసాదులు కలవాడను, నేను ఇచ్ఛించుచున్నాను, చేయుచున్నాను, అనుభవించుచున్నాను" మొదలగు ఏ బుద్ధియున్నదో అదియే బంధము. 'అజ్ఞానాత్ప్రాప్తః' అనునది అందులకు హేతువు. ఏ భ్రమమైనను దోషమువలననే కలుగును. శరీరాదుల విషయమున కలుగు ఆత్మత్వభ్రమమునకు కూడ స్వరూపాజ్ఞానమే దోషమై కారణమగుచున్నది. అత్ర = ప్రత్యక్షమైన దేహాద్యనాత్మపదార్థమునందు అని యర్థము. సాంఖ్యాదిమతమున మూలాజ్ఞానమే అంగీకరింపబడలేదు; అందుచే వారిమతమున బంధమోక్షము కుదురదు అని గ్రహింపవలెను. బంధము అజ్ఞానమువలన కలుగుచున్నది అని అంగీకరించు పక్షమున జ్ఞానముచే అజ్ఞానము నివర్తింపగనే దానివలనవచ్చు బంధము కూడ తొలగిపోవును అని చెప్పవచ్చును. అట్లు కానిచో, బంధము సత్యమైనచో, అది జ్ఞానమాత్రముచే నివర్తించును అని చెప్పుట కుదురదు దోషములేకుండ భ్రమ జనించుటకూడ అనుపపన్నము. (కావున బంధమునకు అజ్ఞానము కారణమని చెప్పుటయే యుక్తము.) బంధమునకు కార్యమును చెప్పుచున్నాడు - జననమరణముల వలన కలుగు దుఃఖమునందు సంపాతము, అనగా మునుగుట దానికి కారణము. 'జననమరణ' అనునది దుఃఖహేతువులగు క్షుత్పిపాసాదు లన్నిటికిని

ఉపలక్షణము లేదా 'జననమరణక్లేశసంపాతహేతుః' అనుదానికి - జననము, మరణము, క్లేశములు వీటియొక్క సంపాతము, తన ధర్మ ములుగా గ్రహించుట, అందులకు కారణము అని యర్థము. ఈ పక్ష మున 'క్లేశ'పదముచే అస్మితా - రాగ - ద్వేష - అభినివేశములనుగూడ గ్రహింపవలెను. ఐదుక్లేశములలో మొదటిదగు అవిద్యయే ఇచట 'అనాత్మన్యహామతి మతిర్బన్ధ' అను పదమున బంధముగా చెప్పబడినది. "అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మత్వఖ్యాతి రవిద్యా" - అనిత్యములను నిత్యము లనియు, అశుచిని శుచియనియు, దుఃఖ మును సుఖమనియు, అనాత్మను ఆత్మయనియు భావించుట అవిద్య అని యోగసూత్రము చెప్పుచున్నది. స్థూలశరీరాభిమానము వలన జననమరణసంపాతము, ఆనందమయాదులయందు అభిమానము వలన రాగద్వేషాభినివేశముల సంపాతము కలుగును. ఈ విధముగ క్లేశములలో మొదటిదియు, బంధనామధేయము కలదియుఅగు కార్యా విద్య సకలవిధ దుఃఖహేతు వగుచున్నది. యేనైవ=అనాత్మను ఆత్మగ గ్రహించుట అను ఏ బంధముచే పురుషుడు అసత్తైన ఈ శరీరమును, సత్యమైనది అనియు, ఆత్మబుద్ధ్యా = నేను అనెడు అభిమానముచేతను, విషయైః = బంధకములైనను అనుకూలమైనవి వలె కనబడుచున్న రసాదివిషయములచే, పోషించుచున్నాడు, తడుపుచున్నాడు, రక్షిం చుచున్నాడు. "తంతుభిః కోశకృద్వత్" అనునది ఇందులకు తగిన దృష్టాన్తము. కోశమును నిర్మించు ఒకవిధమగు పురుగు తనదేహము నందున్న లాలాజలముయొక్క వ్యయముతో దారములను నిర్మించి, వాటిచే రక్షింపబడుదు ననెడు భ్రాంతితో దానిమధ్య లగ్నమై బైటకు రాజాలక వ్యర్థముగ ఎట్లు మరణించునో అట్లే జీవుడుకూడ శరీరమును ఆత్మగ తలచి, విషయములచే దానిని పోషించుచు, దానికి వశుడై జన్మమరణాది సకల దుఃఖములను అనుభవించుచుండును అని భావము. కావుననే చెప్పబడినది -

కోశక్రిమిస్తన్తుభిరాత్మదేహమావేష్ట్య చావేష్ట్య చ గుప్తిమిచ్ఛన్,
స్వయం వినిర్గన్తుమశక్త ఏవ సన్ తతస్తదన్తమ్రియతే చ లగ్నః.

కోశక్రిమి ఆత్మరక్షణ చేసికొనవలె ననెడు అభిలాషతో తన దేహమును దారములతో చుట్టి చుట్టి తాను బయటకు రాజాలక చివరకు దాని లోనే తగుల్కొని మరణించును. అవన మనగా రక్షణము, అనగా ఉన్నదానిని పాలించుకొనుట. పోషణం అనగా ఉన్నదానిని పెంచుట అని భేదము.

అవ. అధిష్ఠానమునకును ఆరోప్యవస్తువునకుగల భేదమును గ్రహించినచో అధ్యాసమే అసంభావ్యము గాన మూలకారణమగు అజ్ఞానము అవివేకముద్వారా బంధహేతు వగుచున్నది అను విషయ మును దృష్టాంతపూర్వకముగ విశదీకరించుచు, అధ్యాసమును గూర్చియు, బంధశబ్దార్థమును చెప్పుచున్నాడు—

అతస్మింస్తద్బుద్ధిః ప్రభవతి విమూఢస్య తమసా
వివేకాభావాద్వై స్ఫురతి భుజగే రజ్జుధిషణా,
తతోఽనర్థవ్రాతో నిపతతి సమాదాతు రధికః
తతో యోఽసద్గ్రాహః స హి భవతి బన్ధశ్శృణు సఖే. 140

తమసా = అజ్ఞానముచే, విమూఢస్య = మూఢుడైనవానికి, అత స్మిన్ = అది కాని దానియందు, తద్బుద్ధిః = అదియనెడు బుద్ధి, ప్రభవతి = కలుగుచున్నది, వివేకాభావాద్వై = వివేకములేకపోవుటచేత, స్ఫురతి = స్ఫురించు, భుజగే = సర్పమునందు, రజ్జుధిషణా = రజ్జువనెడు బుద్ధి, (కలుగుచున్నది). తతః = అటుపిమ్మట, సమాదాతుః = దానిని తీసికొన్న వానికి, అధికః = అధికమైన, అనర్థవ్రాతః = అనర్థసముదాయము, నిప తతి = వచ్చిపడుచున్నది. తతః = ఆ కారణమువలన, యః = ఏ, అస ద్గ్రాహః = అసద్జ్ఞానముగలదో, సః = అదియే, బన్ధః = బంధముగా, భవతి హి = అగుచున్నది కదా? హే సఖే! = ఓ మిత్రుడా! శృణు = వినుము.

అజ్ఞానముచే, విమూఢస్య = వివేకరహితమైనచిత్తముకల పురుషునకు అతస్మిన్ = అనాత్మయగు దేహాదికమునందు, తద్బుద్ధిః = ఆత్మబుద్ధి, ప్రభవతి = కలుగుచున్నది. అది యెట్లనగా_ వివేకము లేకపోవుటవలన భాసించుచున్న సర్పమునందు ఇది రజ్జువు కాదు అను భేదజ్ఞానము లేకపోవుట వలన, వై = దానివలననే, రజ్జువనెడు బుద్ధి కలుగుచున్నది. తతః = ఆ రజ్జుబుద్ధి కలిగిన తరువాత, అది గ్రహింపతగినదే అను అభిప్రాయముతో, సమాదాతుః = ఆ సర్పమును గ్రహించిన వానికి, అధికః అనర్థవ్రాతః = మరణపర్యంతమగు బహువిధ దుఃఖసముదాయము, వచ్చిపడుచున్నది. తతః = ఆ కారణము వలన, ఏ, అసద్గ్రాహః = ఒకవిధముగనున్నదానిని మరియొక విధముగ గ్రహించుట అనునది ఏది కలదో, అదియే బంధము. హి = నిశ్చయము. అనాత్మయందు ఆత్మాధ్యాసము అత్యన్తానర్థకరమను విషయమును సూచించుటకై రజ్జువునందు కలుగు సర్పబుద్ధిని దృష్టాంతముగ చెప్పక, సర్పమునందు కలుగు రజ్జుబుద్ధి దృష్టాంతముగ చెప్పబడినది.

అవ. ఇపుడు "ఈ బంధ మెట్లు వచ్చినది?" అను ప్రశ్నకు ప్రత్యుత్తరముచెప్పుటకు ప్రారంభించుచున్నాడు_

అఖణ్డనిత్యాద్వయబోధశక్త్యా
స్ఫురన్తమాత్మాన మనన్తవైభవమ్,
సమావృణో త్యావృతిశక్తి రేషా
తమోమయీ రాహు రివార్కబిమ్బమ్. 141

అఖణ్డనిత్యాద్వయ బోధశక్త్యా = అఖండము, నిత్యము, ద్వితీయరహితము అగు బోధరూపమైన శక్తితో, స్ఫురన్తం = ప్రకాశించుచున్న, అనన్తవైభవం = అనన్తమైనవైభవముగల, ఆత్మానం = ఆత్మను, తమోమయీ = తమోమయమైన, ఏషా = ఈ, ఆవృతిశక్తిః = ఆవరణశక్తి, రాహుః = రాహువు, అర్కబిమ్బం ఇవ = సూర్యబింబమును వలె, సమావృణోతి = కప్పివేయుచున్నది.

అజ్ఞానమునందు ఆవరణశక్తి, విక్షేపశక్తి అను బంధహేతువు లగు రెండు శక్తు లున్నవి. అవి ఎట్లు బంధహేతువు లగుచున్నవో క్రమముగ చెప్పుచున్నాడు. అఖండా=అపరిచ్ఛిన్నమును, కావుననే, నిత్యా=ఉత్పత్తినాశశూన్యమును, అద్వయా=ద్వితీయశూన్యమగు, ఏ బోధరూపమగు శక్తి కలదో. "స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"- స్వభావసిద్ధమగు జ్ఞానబలక్రియయు, "అయమాత్మా బ్రహ్మ సర్వాను భూః"-ఈ ఆత్మయే సర్వాత్మరూపమున అన్నింటిని అనుభవించుచున్న బ్రహ్మ, "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ", "విజ్ఞాన మానన్దం బ్రహ్మ", కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ" అని శ్రుతి చెప్పుచున్నది; అట్టి శక్తితో ప్రకాశించుచున్నది. అనన్తవైభవమ్ - విభువు (సర్వవ్యాప్తము) యొక్క ధర్మము వైభవము. 'అనన్త' అను విశేషణముచే ఆ వైభవము గగనాదులందువలె ఆపేక్షికము కాదని చెప్పుచున్నాడు. నిరపేక్షమైన వైభవము కలది అని యర్థము. అతిపరిచ్ఛిన్నము లగు దేహాదులందు అహంకారము అత్యంతము అయుక్త మని చెప్పుటకై దానిచే నిరతిశయమహత్త్వము చెప్పబడినది. ఇట్టి ఆత్మయందు, అజ్ఞానమువలన, పరిచ్ఛిన్నత్వ - సద్వయత్వ - నిత్యత్వ - జడత్వాదికము ఆరోపింపబడు చున్నది. అందులకు హేతువును విశదీకరించుచున్నాడు. అనంత వైభవముకలదియు, అఖండనిత్యాద్వయ బోధశక్తితో ప్రకాశించు నదియు ఆత్మను, తమోమయీ=తమఃప్రచురమైన, ఏషా=ఈ, వివేకవంతులకు ప్రత్యక్షమైన ఆవృతిశక్తి, అర్కబింబం=గొప్ప ప్రకాశముతో ప్రకాశించుచున్న సూర్యమండలమును, తమోమయు డగు రాహువువలె, సమావృణోతి=భాసింపని తన అసాధారణ ధర్మములు కలదానినిగా, చేయుచున్నది. మహాప్రకాశవంతుడైనను సూర్యు డేవిధముగ రాహువుచే ఆవృతుడై ప్రకాశించుట లేదు అని చెప్పబడుచున్నాడో, అట్లే అట్టిదైనను ఆత్మ ఆవృతిశక్తిచే కప్పబడినదై, తెలియబడని వాస్తవస్వరూపముగలదై ఉన్నది అని భావము.

అవ. 'తిరోభూత' ఇత్యాదిశ్లోకముచే పూర్వార్ధమున ఆవరణ కార్యమును, ఉత్తరార్ధముచే విక్షేపశక్తికార్యమును క్రమముగ చెప్పుచున్నాడు—

తిరోభూతే స్వాత్మ న్యమలతర తేజోవతి పుమాన్
అనాత్మానం మోహా దహమితి శరీరం కలయతి,
తతః కామక్రోధప్రభృతిభి రముం బన్ధకగుణైః
పరం విక్షేపాఖ్యా రజస ఉరుశక్తి ర్వ్యథయతి. 142

అమలతరతేజోవతి=అతిస్వచ్ఛమగు తేజస్సుగల, స్వాత్మని=స్వాత్మస్వరూపము, తిరోభూతే సతి=కప్పబడిన దగుచుండగా, పుమాన్=పురుషుడు, మోహాత్=అజ్ఞానమువలన, అనాత్మానం=అనాత్మయైన శరీరం=శరీరమును, అహమితి='నేను' అని, కలయతి=చూచుచున్నాడు, తతః=అటుపిమ్మట, రజసః=రజోగుణముయొక్క, విక్షేపాఖ్యా=విక్షేపమను పేరుగల, ఉరుశక్తిః=గొప్పశక్తి, కామక్రోధప్రభృతిభిః=కామము క్రోధము మొదలగు, బన్ధకగుణైః=బంధకరములగు గుణములచే, పరం=మిక్కిలి, వ్యథయతి=బాధించును.

అతిస్వచ్ఛప్రకాశముగల స్వస్వరూపమైన పరమాత్మ అజ్ఞానమునందలి ఆవరణశక్తిచే కప్పబడి స్పష్టముగ కనబడకుండగా, పుమాన్=జీవుడు, మోహాత్=అవివేకమువలన, అనాత్మానం=ఆత్మభిన్నమైన శరీరమును 'నేను' అను తాదాత్మ్యబుద్ధితో గ్రహించుచున్నాడు; అభిమానించుచున్నాడు. తతః=శరీరముపై తాదాత్మ్యాభిమానము కలిగిన పిమ్మట, ఈ పురుషుని, రజోగుణమునకు సంబంధించిన విక్షేప మను ప్రబలమగు శక్తి, కామక్రోధములు ఏ లోభ - దంభ - అసూయా - అహంకార - ఈర్ష్యా - మత్సరాదులకు ఆదియందున్నవో అట్టి, బన్ధకగుణైః=అధ్యాసము వృద్ధిపొందుటకు కారణభూతములగు ధర్మములచేత మిక్కిలి, వ్యథయతి=దుఃఖింపజేయును, దుఃఖజటిలునిగ చేయుచున్నది. శరీరాభిమానముకలవానికి, ఆ శరీరమునకు అనుకూల

మగు వస్తువువిషయమున కామము. అది లభించనిచో క్రోధము, లభించినచో లోభము మొదలగునవి ఉండుట ప్రసిద్ధమే కదా? గీతలో కూడ చెప్పబడినది—

"త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేతత్త్రయం త్యజేత్."

కామము, క్రోధము, లోభము అను ఈ మూడును ఆత్మనాశ హేతువగు మూడువిధములైన నరకద్వారములు. కావున ఈ మూడింటిని విడువవలెను.

అవ. ఈ విధముగ ఆవరణవిక్షేపశక్తులచే సర్వానర్థమూలముగ చెప్పబడిన అజ్ఞానమునుగూర్చి మరల విశదీకరించుచున్నాడు—

మహామోహ గ్రాహగ్రసన గలితాత్మావగమనో
ధియో నానావస్థాః స్వయ మభినయం స్తద్గుణతయా,
అపారే సంసారే విషయవిషపూరే జలనిధౌ
నిమజ్జ్యోన్మజ్జ్యాయం భ్రమతి కుమతిః కుత్సితగతిః. 143

మహామోహ.....అవగమనః=మహామోహ=గొప్పమోహమనెడు, గ్రాహ=మొసలియొక్క, గ్రసన=మ్రింగుటచే, గలిత=తొలగిపోయిన, ఆత్మావగమనః=ఆత్మజ్ఞానముకలవాడై, స్వయం=తాను, తద్గుణతయా=ఆ బుద్ధిని ఉపాధిగా కలిగియుండుటచే, ధియః=బుద్ధియొక్క, నానావస్థాసు=వివిధావస్థలయందు, అభినయన్=అభినయించుచు, కుమతిః=చెడ్డబుద్ధి గలవాడై, కుత్సితగతిః=కుత్సితమైన గతి కలవాడై, విషయవిషపూరే=విషయము లనెడు విషప్రవాహము గల, అపారే=అనంతమైన, సంసారే జలనిధౌ=సంసారమనెడు సముద్రమునందు, అయం=ఈ జీవుడు, నిమజ్జ్య=మునిగి, ఉన్మజ్జ్య=తేలి, భ్రమతి=తిరుగుచున్నాడు.

దృఢతరమగు అవివేకమనెడు మకరముయొక్క గ్రసనము, అనగా మకరముచే మ్రింగబడుట, దానిచే నష్టమైన ఆత్మయొక్క

సమ్యగ్జ్ఞానముకలవాడై, అనగా ఆత్మయొక్క యథార్థస్వరూపమును తెలియజాలనివాడై, బుద్ధియొక్క, నానావస్థాః = వివిధపరిణామములను, తద్గుణతయా = ఆ బుద్ధియొక్కగుణములు కలవా డగుటచే, అనగా దానిచే ఉపహితుడగుటచే, ఉపాధి ప్రతిబింబ పక్షపాతి గాన ఉపాధిభూతమగు బుద్ధికి లొంగిపోయినవాడై, నీరు కదలినపుడు దానిలో ప్రకాశించు సూర్యప్రతిబింబము గూడ కదలుట ప్రసిద్ధము కదా?

సమానః సన్ ఉభౌ లోకే అనుసంచరతి,
ధ్యాయతీవ లేలాయతీవ, స ధీః స్వప్నో
భూత్వా ఇమం లోక మతిక్రామతి.

-బుద్ధితోసమానుడై రెండులోకములనుగూర్చి సంచరించుచుండును. ధ్యానముచేయుచున్నట్లు, కదలుచున్నట్లు కనబడును. బుద్ధితో కూడినవాడై స్వప్నముగ అయి ఈ లోకమును అతిక్రమించును అని శ్రుతి చెప్పుచున్నది. స్వయం అభినయన్ = తనయందు ఆరోపించుకొనుచు, అపారే = అవధులులేని విషయము లనెడు విషప్రవాహము గల సంసారసముద్రమునందు. ఇచట సప్తమికి సామానాధికరణ్యము అర్థము. (అందుచే సంసారమే సముద్రము అను అర్థము వచ్చును.) కుమతిః = కుత్సితమైన, అనగా బ్రహ్మనుపొందని, బుద్ధికలవాడై కుత్సితగతిః = కుత్సితమైన అవగతి (జ్ఞానము) కలవాడై లేదా నరకాద్యధోలోకగతి కలవాడై, ఈ పురుషుడు, స్వాతంత్ర్యవిహీనుడై క్రిందికిపోవుచు పైకివచ్చుచు తిరుగుచుండును. బుద్ధిని వశములో నుంచుకొనజాలనివాడు ఇంద్రియలోలుడై విషయాధీను డగుటచే ఆతనికి భ్రాంతిపరంపరయేగాని సంసారపారమగు బ్రహ్మయొక్క ప్రాప్తి యుండదు అని భావము.

అవ. ఒకదానివలన పుట్టినది దానినే కప్పివేయునను విషయమును దృష్టాంతపూర్వకముగ చెప్పుచున్నాడు-

భానుప్రభా సంజనితాభ్రపంక్తి
ర్భానుం తిరోధాయ యథా విజృమ్భతే,
ఆత్మోదితాహంకృతి రాత్మతత్త్వం
తథా తిరోధాయ విజృమ్భతే స్వయమ్. 144

భానుప్రభాసంజనితా=సూర్యకాంతివలన జనించిన, అభ్రపంక్తిః= మేఘపంక్తి, యథా=ఏ విధముగా, భానుం=సూర్యుని, తిరోధాయ=కప్పి విజృమ్భతే = విజృంభించునో, తథా = అట్లే, ఆత్మోదితా = ఆత్మనుండి జనించిన, అహంకృతిః=అహంకారము, ఆత్మతత్త్వం = ఆత్మతత్త్వ మును, తిరోధాయ=కప్పివేసి, స్వయం=తాను, విజృమ్భతే=విజృం భించును.

సూర్యకిరణముల వలన జనించిన; అప్పులను - ఉదకమును ధరించునవి అభ్రములు, అనగా మేఘములు-వాటియొక్క మాల, గ్రీష్మమున సూర్యకిరణములచే పైకిలాగబడిన జలము లీ మేఘములుగ అగునని ప్రసిద్ధము. ఆ మేఘమాల తనను పుట్టించిన సూర్యుని కప్పివేసి ఏ విధముగ, విజృమ్భతే=తాను ముందుకు వచ్చునో; ఆ సూర్యుని కిరణముల నుండియే జనించుట, ఆ సూర్యుని కప్పివేసి తాను భాసిం చుట అని సర్వాంశములందును దృష్టాంతము. అట్లే ఆత్మవలన జనిం చిన ఏ, అహంకృతిః=దేహాదులయందు నేను అను బుద్ధికలదో అది, అది ఆత్మాధీనమగు సత్తయు స్ఫూర్తియు కలదైనను, ఆత్మతత్త్వం= ఆత్మయాథాత్మ్యమును, అనగా ఆత్మయొక్క నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్త- స్వభావత్వమును, తిరోధాయ=దానియొక్క స్ఫుటభానమును ప్రతి బంధించి, తాను, విజృమ్భతే=ఎదుట స్ఫూర్తి కలదిగ అగును. అహంకృతిః అనుపదమునకు 'బుద్ధి' అనియైనను అర్థము చెప్ప వచ్చును. అది కూడ ఆత్మనుండియే జనించి విజ్ఞానమయ కోశ రూపమున ఆత్మను ఆవరించుచున్నది.

అవ. ఇపుడు ఆవరణవిక్షేపకార్యమును దృష్టాంతపూర్వకముగ చెప్పుచున్నాడు-

## ఆవరణశక్తి - విక్షేపశక్తి

కబలితదిననాథే దుర్దినే సాన్ద్రమేఘై
ర్వ్యథయతి హిమఝంఝావాయు రుగ్రో యథైతాన్,
అవిరత తమసాత్మన్యావృతే మూఢబుద్ధిం
క్షపయతి బహుదుఃఖై స్తీవ్ర విక్షేపశక్తిః. 145

సాన్ద్రమేఘైః = దట్టమైన మేఘములచే, కబలితదిననాథే = మ్రింగి వేయబడిన సూర్యుడుకల, దుర్దినే = దుర్దినమునందు, ఉగ్రః = ఉగ్రమైన, హిమ ఝంఝావాయుః = హిమముతో కూడిన ఝంఝావాయువు, యథా = ఏ విధముగా, ఏతాన్ = ఈ పాంథులను వ్యథయతి = పీడించునో, (అట్లే) అవిరతతమసా = గాఢమైన తమస్సుచే, ఆత్మని = ఆత్మ, ఆవృతే = ఆవరింపబడగా, మూఢబుద్ధిం = మూఢబుద్ధికలవానిని, తీవ్రవిక్షేపశక్తిః = తీవ్రమైన విక్షేపశక్తి, బహుదుఃఖైః = అనేక దుఃఖములతో, క్షపయతి = నశింపజేయును.

దట్టమైన మేఘములచే మ్రింగివేయబడిన సూర్యుడుగల దుర్దినమునందు, "మేఘచ్ఛన్నే ౽హ్ని దుర్దినమ్" అను కోశము నను సరించి మేఘచ్ఛన్నమగు రోజునకు దుర్దిన మని పేరు. సూర్యుడు ప్రకాశింపకపోవుటచే అప్రకాశమయముగనున్న దివసమునందు, భయంకరమైన, హిమఝంఝావాయుః - "ఝంఝావాతః సవృష్టికః" అను కోశము ననుసరించి హిమముతో గూడిన, వృష్టిసహితమగు వాయువు, ఏ విధముగ, ఏతాన్ = పథికులైన ఈ జనులను, వ్యథయతి = దుఃఖింపజేయునో; సూర్యప్రకాశము లేదు; మార్గమధ్యమున స్థితి; హిమవర్షములతో గూడిన మహావాయువు - అపుడు పాంథుల బాధ చెప్ప శక్యము కాదు. ఇట్లే, అవిరత తమసా = దట్టమైన మేఘమువలె గాఢమైన తమస్సుచే సూర్యస్థానీయమగు ఆత్మ కబళితముకాగా, స్ఫుటముగ కానరాక నష్టప్రాయమై యుండగా, కామక్రోధాది రూపమున పరిణమించుచున్నదియు, రజోగుణమునకు సంబంధించి

నదియు అగు ప్రబలమైన విక్షేపశక్తి, మూఢబుద్ధిం = తామసమగు ఆవరణశక్తిచే, తెలిసికొను అవకాశము ఉన్నను తెలిసికొనజాలని బుద్ధిగల పురుషుని, బహుదుఃఖైః = జన్మమృత్యుజరారోగాదిజన్యము లగు అనేక దుఃఖములచే, నశింపజేయును. ఎల్లప్పుడును దుఃఖ పరంపరలో మునిగియున్నవానికి ఆనందరూప స్వాత్మజ్ఞాన మెట్లు కలుగును? అదిలేనిచో స్వాత్మదర్శనము లేకుండుటచే ఆత్మ నష్ట మైనదివలె అగును అని భావము.

'ఈ బంధ మెట్లువచ్చినది?' అనుప్రశ్నకు చెప్పిన ప్రత్యుత్తర మును, స్పష్టముగ తెలియుట కొరకై ఉపసంహరించుచున్నాడు –

ఏతాభ్యా మేవశక్తిభ్యాం
బన్ధః పుంసః సమాగతః,
యాభ్యాం విమోహితో దేహం
మత్వాత్మానం భ్రమత్యయమ్. 146

**ఏతాభ్యాం = ఈ, శక్తిభ్యామేవ = శక్తులచేతనే, పుంసః = పురుషునకు, బన్ధః = బంధము, సమాగతః = వచ్చినది, యాభ్యాం = వేటిచే, విమోహితః = మోహింపజేయబడినవాడై, అయం = ఈ పురుషుడు, దేహం = దేహమును, ఆత్మానం = ఆత్మనుగా, మత్వా = తలచి, భ్రమతి = తిరుగుచున్నాడో.**

ఈ గుణత్రయమయమైన అజ్ఞానమునందున్న రజస్తమోగుణ ములకు సంబంధించిన ఆవృతి విక్షేపరూపములగు శక్తులచేతనే, పురుషునకు, బన్ధః = అది కాని దానిని అది అనిభావించుట అను రూపము గల అధ్యాసము వచ్చినది. ఇది స్థిరతరమైన సాధనచతుష్టయము పురఃసరముగాగల వేదాన్తవిచారముచే జన్యమగు ఆత్మసాక్షాత్కారము లేకుండ తొలగింప శక్యముకానిది. యాభ్యాం = పూర్వోక్తములగు

ఏ శక్తులచేత, విమోహితః = తెలియదగిన దానియొక్క జ్ఞానముతో శూన్యుడై, దేహం = స్థూలాదిదేహమును, ఆత్మానం మత్వా = 'నేను' అని అనుకొనుచు, ఈ పురుషుడు, భ్రమతి = సంసారరూపదీర్ఘాటవిలో సంచరించుచున్నాడో

అవ. ముముక్షువులకు సుఖముగ తెలియుటకై సమూలమగు సమగ్రసంసారమును వృక్షముగ వర్ణించుచున్నాడు—

## బంధనిరూపణము

బీజం సంసృతిభూమిజస్య తు
తమో దేహాత్మధీ రఙ్కురః
రాగః పల్లవ మమ్బు కర్మ తు
వపుః స్కంధోఽసవః శాఖికాః,
అగ్రా ణీన్ద్రియసంహతిశ్చ
విషయాః పుష్పాణి దుఃఖం ఫలం
నానాకర్మసముద్భవం బహు
విధం భోక్తాత్ర జీవః ఖగః. 147

సంసృతిభూమిజస్య = ఈ సంసారవృక్షమునకు, బీజం = మూలకారణము, తమః = అజ్ఞానము, దేహాత్మధీః = దేహమే 'నేను' అనెడు బుద్ధి, అంకురః = అంకురము, రాగః = రాగము, పల్లవం = చిగురు, కర్మ తు = కర్మయే, అమ్బు = ఉదకము, వపుః = శరీరము, స్కంధః = మాను, అసవః = ప్రాణములు, శాఖికాః = కొమ్మలు, ఇన్ద్రియసంహతిశ్చ = ఇంద్రియసముదాయము, అగ్రాణి = అగ్రములు, విషయాః = విషయములు, పుష్పాణి = పుష్పములు, నానాకర్మసముద్భవం = వివిధకర్మల వలన కలిగిన, బహువిధం = అనేకవిధములైన, దుఃఖం = దుఃఖము, ఫలం = ఫలము, అత్ర = వృక్షమునందు, జీవః = జీవుడు, భోక్తా ఖగః = ఫలమును భక్షించు పక్షి.

సంసారమే వృక్షము. దీనికి మూలకారణము అజ్ఞానమే. 'తు' శబ్దము అవధారణార్థకము. అజ్ఞానమే మూలము; మరియొకటి కాదు అని యర్థము. అనాత్మయందు ఆత్మత్వబుద్ధి కేవలము అజ్ఞానమువలన మాత్రమే కలుగును గాన దేహాత్మబుద్ధి అంకురము. అంకురములు జనించిన వెంటనే చిగురు జనించును. అట్లే శరీరాత్మత్వబుద్ధి కలిగిన వెంటనే శరీరానుకూలములగు పదార్థములే తనకు అనుకూలము లనెడు అభిప్రాయముతో విషయములయందు ఇచ్ఛ కలుగును. అదియే రాగము; ఆ రాగమే పల్లవము, అంబు=వృక్షము పెరుగుటకు హేతువగు నీరు, కర్మ తు=కర్మయే, 'తు' వెనుకటివలెనే అవధారణార్థకము, "కుర్వతే కర్మ భోగాయ కర్మ కర్తుం చ భుఞ్జతే" భోగముకొరకై కర్మ చేయుచుందురు, కర్మచేయుటకై అనుభవించుచుందురు అని అభియుక్తోక్తి. శరీరమే స్కంధము. ఏ భాగమునుండి కొమ్మలు బయలుదేరునో ఆ వృక్షమధ్యభాగమునకు స్కంధమని పేరు. అసవః=ప్రాణాది పంచవాయువులు, స్కంధమునుండి విస్తరించుటచే, కొమ్మలు, చక్షురాదిజ్ఞానేంద్రియములయొక్క, వాగాది కర్మేంద్రియముల యొక్కయు. స్థితి ప్రాణాధీనమైనది గాన వాటి సముదాయమే అగ్రములు. ఇంద్రియములు ప్రాణాధీనములను విషయము ఇంద్రియప్రాణసంవాదశ్రుతియందు ప్రసిద్ధము. అగ్రములు శాఖాధీనస్థితికములను విషయము లోకప్రసిద్ధమే. విషయాః=శబ్దస్పర్శరూపరసగంధములు, పుష్పాణి=అగ్రముతో సంబంధించిన వగుటచే పుష్పములు. విషయేంద్రియసంబంధమునకు పిమ్మట కల్గున దగుటచే దుఃఖమే ఫలము. శాఖాగ్రములయందు పుష్పోత్పత్త్యనన్తరమే ఫలము పుట్టును కదా? వెనుక 'కర్మ' శబ్దము పుణ్యాపుణ్యరూపకర్మను చెప్పుచున్నది గానను, అప్పుడప్పుడు సుఖము కూడ కనబడుచున్నది కావునను సుఖమును గూడ ఫలమని చెప్పుట యుక్తమైనట్లు తోచవచ్చును. కాని వివేకవంతులు వైషయికసుఖమును గూడ దుఃఖము

గనే పరిగణింతురు. ఈ సుఖమును సాధించునపుడును, అ సుఖము పోయినపుడును దుఃఖమే కనబడుచున్నది కదా? కావుననే గీతలో_

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే,
ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః.

విషయేంద్రియసంబంధమువలన కలుగు భోగములన్నియు దుఃఖకారణములే; అవి ఆద్యంతములు కలవి. ఓ అర్జునా! పండితుడైనవాడు వాటియందు రమింపడు అని చెప్పబడినది. న్యాయశాస్త్రమునందు గూడ, ఆరు ఇంద్రియములు, ఆరు ఇంద్రియవిషయములు, ఆరు బుద్ధులు, శరీరము, సుఖము, దుఃఖము అనువాటిని ఇరువదియొక్క దుఃఖములు అని చెప్పుచు సుఖముగూడ దుఃఖమధ్యమున చేర్చబడినది. (కావున ఇచట గూడ సుఖము కూడ దుఃఖమే అను నభిప్రాయముతో ఒక్క దుఃఖమే ఫలముగ చెప్పుట జరిగినది.) ఈ దుఃఖము నానావిధములగు కర్మలవలన కలుగునది. హేతువైన కర్మ అనేకవిధములైన దగుటచే ఫలముకూడ అనేకప్రకారముల నుండును. ఈ వృక్షమున, భోక్త=దుఃఖరూపఫలమును అనుభవించు జీవుడే పక్షి. ఈ విధముగ అజ్ఞానమూలకమును దుఃఖమనునది యొక్కటియే ఫలము కలదియు అగు ఈ సంసారవృక్షమును విషవృక్షమునువలె విడువవలెను అని భావము. ఇట్లు వర్ణించుటచే_దేహాత్మబుద్ధిరూపమగు బంధము రాగద్వేషాదిదోషములను కలిగించుట ద్వారా ధర్మాధర్మరూపములగు కర్మలకు హేతువు; ఆ కర్మలచే శరీరపరంపరకలుగుచు దానియందు 'అహం' అను అభిమానము జనించుచుండును. ఈ విధముగ దృఢమూలముగ ఈ బంధము నిలచి యున్నది అని _ 'కథం ప్రతిష్ఠాస్య' అను ప్రశ్నకు సమాధానము చెప్పినట్లైనది.

అవ. "కథం విమోక్షః" అను ప్రశ్నకు సమాధానము చెప్పుటకై, ఇపుడు, హేతు_ఫలసహితమగు పూర్వోక్తబంధమును అనువదించుచున్నాడు_

అజ్ఞానమూలోఽయ మనాత్మబన్ధో
నైసర్గికోఽనాది రనన్త ఈరితః,
జన్మాప్యయవ్యాధి జరాదిదుఃఖ
ప్రవాహతాపం జనయత్యముష్య. 148

అయం = ఈ, అనాత్మబంధః = అనాత్మబంధము, అజ్ఞానమూలః = అజ్ఞానమే మూలముగా కలది, నైసర్గికః = స్వభావసిద్ధమైనది, అనాది = అనాది యనియు, అనన్తః = అనంత మనియు; ఈరితః = చెప్పబడినది, అముష్య = ఈ జీవునకు, జన్మా....తాపం-జన్మ = జన్మము, అప్యయ = మరణము, వ్యాధి= వ్యాధులు, జరాది = ముసలితనము మొదలైన, దుఃఖ ప్రవాహమువలన, తాపం = తాపమును, జనయతి = కలిగించుచున్నది.

అయం = సర్వలోకప్రసిద్ధమగు ఈ, అనాత్మబన్ధః = శరీరము మొదలగు అనాత్మపదార్థములతో ఏర్పడిన తాదాత్మ్యాభిమానము, అజ్ఞానమూలః=స్వరూపాజ్ఞానమే మూలముగా కలది. నైసర్గికః=పూర్వ పూర్వాధ్యాసముల వలన ఏర్పడిన సంస్కారము హేతువుగా కలది. అనాదిః = అనాదియగు అజ్ఞానముయొక్క కార్యమగుటవలన ఎప్పుడు పుట్టినదో చెప్ప శక్యము కానిది. అనన్తః = జ్ఞానములేకుండ నాశము లేనిది. ఈరితః = చెప్పబడినది అభియుక్తులచేత, అని అధ్యాహారము "నాన్తో నచాదిః" అని స్మృతికూడ చెప్పుచున్నది. ఇట్టి ఈ బంధము అముష్య = ఈ జీవునకు, జన్మా........తాపం-జన్మ = శరీరోత్పత్తి, అప్యయః = మరణము, వ్యాధిః = రోగము, జరా = వార్ధక్యము, ఆది పదముచే ఆధిభౌతికాధిదైవికతాపములను గూడ పరిగ్రహింప వలెను. వాటిచే కల్గు ఏ దుఃఖములుకలవో వాటియొక్క ప్రవాహః=పరంపర ఒకదాని తరువాత ఒకటి వచ్చిపడుట, దానిచే, తాపం=ఉద్వేగమును పుట్టించును. 'పాతమ్' అను పాఠమున 'ఆ ప్రవాహములో పడు టను' అను అర్థము స్పష్టము.

పరమేశ్వరానుగ్రహ లబ్ధమగు దృఢతర వివేకముచే కలుగు స్వస్వరూపానుభవము తప్ప మరి దేనిచేతను ఈ బంధమును తొలగింప శక్యము కాదని చెప్పుచున్నాడు—

## ఆత్మానాత్మ వివేకము

నాస్త్రై ర్న శస్త్రై రనిలేన వహ్నినా
ఛేత్తుం నశక్యో న చ కర్మకోటిభిః,
వివేకవిజ్ఞానమహాసినా వినా
ధాతుః ప్రసాదేన శితేన మంజునా. 149

ఈ బంధము, ధాతుః ప్రసాదేన=ఈశ్వరప్రసాదముచే(లభించిన) **శితేన**=వాడియైన, మంజునా=సుందరమైన, వివేకవిజ్ఞానమహాసినా=వివేకజ్ఞాన మనెడు మహాఖడ్గముచేత తప్ప, అస్త్రైః=అస్త్రములచేత, ఛేత్తుం=ఛేదించుటకు, శక్యః న=శక్యమైనది కాదు, శస్త్రైః=ఆయుధములచేత గాని, వహ్నినా=అగ్నిచేత గాని, న=శక్యము కాదు, కర్మకోటిభిః చ=కర్మకోటులచేత కూడ, న=కాదు.

ఈ బంధము, ఈశ్వరానుగ్రహముచే (లభించిన), శితేన=తీక్ష్ణము దృఢమునైన, "యమేవైష వృణుతే తేన లభ్యః"-ఈ పరమేశ్వరుడు ఎవనిని అనుగ్రహింపవలెనని కోరునో ఆతనిచేత మాత్రమే ఈ ఆత్మ లభ్యమైనది అని శ్రుతి. సుందరమైన, వివేకవిజ్ఞాన మహాసినా=ఆత్మానాత్మవివేచనమువలన కలిగిన ఏ బ్రహ్మసాక్షాత్కారము కలదో అదియే గొప్పఖడ్గము, అది లేకుండగా ఆగ్నేయాద్యస్త్రములచేతగాని, లోహమయములగు బాణాద్యాయుధములచేతగాని, నశింపజేయుటకు శక్యము కాదు. ఇట్లే వాయువుచేత నశింపజేయ శక్యము కాదు. అగ్నిచే కాల్చ శక్యము కాదు. వేదోక్తములగు కర్మకోటులచేత గూడ నశింపజేయ శక్యము కాదు. ఇది అజ్ఞానమూలకము గాన ఒక జ్ఞానముచేతనే తొలగింప శక్యమైనదని భావము. ఇట్లు,

'ఈ బంధమునకు విమోక్ష మెట్లు?' అను ప్రశ్నకు, "ఈశ్వర ప్రసాదమువలన కలుగు పరమాత్మాభేదసాక్షాత్కారమువలననే విమోక్షము కలుగును" అని సమాధానము చెప్పినట్లైనది.

అవ. "న చ కర్మకోటిభిః" అని చెప్పుటచే వైదికకర్మలు ఏమాత్రమును అపేక్షితములు కావా అను శంక ఉదయించుటచే, ఆ కర్మలు బుద్ధిశుద్ధికొరకు అపేక్షితము లనియు, ఆ బుద్ధిశుద్ధి బన్ధోచ్ఛేదకమగు విజ్ఞానమునకు హేతువనియు చెప్పుచున్నాడు—

శ్రుతిప్రమాణైకమతేః స్వధర్మ
నిష్ఠా తయైవాత్మవిశుద్ధి రస్య,
విశుద్ధబుద్ధేః పరమాత్మవేదనం
తేనైవ సంసారసమూలనాశః. 150

శ్రుతిప్రమాణైకమతేః = శ్రుతిరూప ప్రమాణ మొక్కదానియందే స్థిరమైన బుద్ధికలవానికి, స్వధర్మనిష్ఠా=స్వధర్మమునందు నిష్ఠ (ఉండును), తయైవ = ఆ స్వధర్మనిష్ఠచేతనే, అస్య = ఈతనికి. ఆత్మవిశుద్ధిః = బుద్ధియొక్క శుద్ధికలుగును, విశుద్ధబుద్ధేః = శుద్ధమైన బుద్ధికలవానికి, పరమాత్మవేదనం = పరమాత్మజ్ఞానము కలుగును; తేనైవ = ఆ పరమాత్మజ్ఞానముచేతనే, సంసారసమూలనాశః=సమూలముగా సంసారముయొక్క నాశము (కలుగును).

శ్రుతిప్రమాణైకమతేః —

"తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి."

ఇది కార్యము, ఇది అకార్యము అను వ్యవస్థయందు, నీకు శాస్త్రమే ప్రమాణము. శాస్త్రవిధానోక్తమగు కర్మను తెలిసికొని ఆచరింపుము అని భగవద్గీతలో చెప్పిన విధమున శ్రుతియే ప్రమాణము. దానియందు, ఏకా = అనన్యసక్తము, ముఖ్యము అగు బుద్ధి యెవ్వనికో

వానికి; తన శ్రేయస్సుకొరకై చేయదగిన కర్మవిషయమున శ్రుతి యొక్కటియే శరణముగా కలవానికి అని యర్థము. స్వధర్మనిష్ఠా= తన వర్ణమునకును, ఆశ్రమమునకును విహితమగు కర్మకలాపము స్వధర్మము. దానిని తాత్పర్యబుద్ధితో అనుష్ఠించుట స్వధర్మనిష్ఠ; మరి దేనియందును ఆసక్తిలేక స్వధర్మమునందే స్థితియని యర్థము; దానిచే, అస్య=సాధకుడగు జీవునకు, ఆత్మవిశుద్ధిః=అంతఃకరణము యొక్క విశేషశుద్ధి, అనగా పాపక్షయము.

"జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః,
కషాయపక్తిః కర్మాణి జ్ఞానం తు పరమా గతిః,
కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే."

కర్మవలన పాపము క్షీణించి పురుషులకు జ్ఞానము ఉదయించును. పాపములు పక్వమగుట, కర్మలు, జ్ఞానము పిమ్మట పరమగతి. పాపము కర్మలచే పక్వమైన పిదప జ్ఞానము ప్రవర్తించును అను ప్రమాణము ననుసరించి, విశుద్ధ=రాగద్వేషాదిసకలవిధదోషములును నశించిన, బుద్ధికలవాడు విశుద్ధబుద్ధి, వానికి; పరమాత్మవేదనం= అభేదరూపమున పరమాత్మసాక్షాత్కారము. ఆ పరమాత్మవేదనము చేతనే, సమూలముగ సంసారనాశము; అజ్ఞానము మొదలు దుఃఖము వరకును గల బంధముయొక్క అత్యన్తచ్ఛేదము (కలుగును).

అవ. "వివేకవిజ్ఞానమహాసినా" అనునపుడు వివేకజన్యమగు విజ్ఞానము అని చెప్పబడినది "తయోర్వివేకః కథమేతదుచ్యతామ్." అని శిష్యుడు కూడ అడిగి యున్నాడు. పూర్వము స్థూలసూక్ష్మ కారణశరీరములను గూర్చి సామాన్యరూపమున సంగ్రహముగ జెప్పిన ఆ విషయమునే సవిస్తరముగ విశదీకరించుటకు ప్రారంభించు చున్నాడు—

కోశై రన్నమయాద్యైః పఞ్చభి రాత్మా న సంవృతో భాతి,
నిజశక్తిసముత్పన్నైః శైవలపటలై రివాంబు వాపీస్థమ్.151

నిజశక్తిసముత్పన్నైః=తనయొక్కశక్తిచే కల్పితములైన, అన్నమయాద్యైః=అన్నమయము మొదలైన, పంచభిఃకోశైః=ఐదుకోశములచే సంవృతః=కప్పబడినదై, ఆత్మా=ఆత్మ, నిజశక్తిసముత్పన్నైః=తనయొక్కశక్తివలనపుట్టిన, శైవలపటలైః=నాచుయొక్కసముదాయములచే, కప్పబడిన, వాపీస్థం=దిగుడుబావిలోనున్న, అంబు ఇవ=జలమువలె, న భాతి=భాసించుట లేదు.

"సలిల ఏకో ద్రష్టా"-ఆత్మ ఉదకమువలె నిర్మలమైనది; ఒక్కటి; ద్రష్ట మొదలగు శ్రుతులచే నిర్మలజలమువలె స్వచ్ఛమగు ఆత్మ ఏల భాసించుట లేదు అను ఆశంకకు సమాధానముగ ఆ ఉదకమునే దృష్టాంతముగ చూపుచు, స్ఫుటముగ ప్రకాశింప కుండుటకు కారణము చెప్పుచున్నాడు. నిజశక్తిసముత్పన్నైః:- నిజ=స్వకీయమైన; తనయందుకల్పితమైన, శక్తి=అవిద్యచే, పుట్టిన, వక్ష్యమాణములగు ఐదు అన్నమయాదికోశములచే; కత్తికి ఒరవలె ఆవరకములుగ నున్న అన్నమయకోశము మొదలు ఆనందమయకోశము వరకును గల కోశములచే, ఆ కోశములు ఆత్మజ్ఞానమునకు ప్రతిబంధకమగు జ్ఞానమున విషయములుగ నుండును. అట్టి వాటిచే, కప్పబడినదై ఆత్మ భిన్నముగ, స్పష్టముగ, భాసించుటలేదు. అందుకు దృష్టాన్తము నిజశక్తిసముత్పన్నైః=జలములోనున్న ద్రవత్వరూపధర్మము వలన జనించిన, శైవలపటలైః=నాచులయొక్క పంక్తులచేత, దిగుడుబావిలో నున్న నీరువలె, వాపీగతమైన జలము ఏ విధముగ దానినుండియే పుట్టిన నాచుచే ఆచ్ఛాదితమై స్ఫుటముగ భాసింపదో ఆ విధముగనే అని భావము.

అవ. దృష్టాన్తస్థలమున, అది స్థూలముగ భాసించుటకు హేతువు చెప్పుచున్నాడు-

తచ్ఛైవాలాపనయే సమ్యక్సలిలం ప్రతీయతే శుద్ధమ్,
తృష్ణాసంతాపహరం సద్యః సౌఖ్యప్రదం పరం పుంసామ్.152

తచ్ఛైవాలాపనయే=ఆ నాచును తొలగింపగనే, శుద్ధం=పరిశుద్ధమైనదియు, తృష్ణాసంతాపహరం=దప్పికవలన కలిగెడు తాపమును హరించునదియు, పుంసాం=పురుషులకు, సద్యః=వెంటనే, సౌఖ్యప్రదం=సౌఖ్యమును ఇచ్చెడు, పరం=శ్రేష్ఠమైన, సలిలం=జలము, సమ్యక్=బాగుగ, ప్రతీయతే=కనబడును.

ఆవరకమైయున్న నాచును బాగుగ తొలగింపగనే, నిర్మలమగు నీరు, సమ్యక్=ప్రతిబంధము లేవియు లేకుండగ, ప్రతీయతే=కనబడును. దానివలన ఫలము చెప్పుచున్నాడు-తృష్ణాసంతాపమును పోగొట్టునది, పుంసః=పానముచేసెడు పురుషునకు, వెంటనే, దర్శన-స్నాన-పానాదులచే మిక్కిలి ఆనందము కలిగించునది. పరం=శ్రేష్ఠమైనది.

అవ. ఈ విషయమును దార్ష్టాన్తికమునందు కూడ చెప్పుచున్నాడు-

పంచానామపి కోశానా మపవాదే విభా త్యయం శుద్ధః,
నిత్యానన్దైకరసః ప్రత్యగ్రూపః పరః స్వయంజ్యోతిః. 153

పంచానామపి కోశానాం=ఐదుకోశములయొక్క, అపవాదే=నిషేధము జేయబడినదగుచుండగా, నిత్యానందైకరసః=నిత్యానందమాత్రరూపమును, ప్రత్యగ్రూపమైనదియు, పరః=శ్రేష్ఠమును, స్వయంజ్యోతిః=స్వయంజ్యోతిఃస్వభావమును అగు, శుద్ధః=శుద్ధమైన, అయం=ఈ, ఆత్మ, విభాతి=ప్రకాశించును.

'పంచానామపి' అను నపుడు 'అపి' శబ్దము కోశములు ఐదింటిని పూర్తిగ అను నర్థమును సూచించుచున్నది. కోశానాం=

ఆవరకములగు, అన్నమయకోశము మొదలు ఆనన్దమయకోశము వరకు గల అన్ని కోశములయొక్క, అపవాదే=నిషేధముచేయబడిన దగుచుండగా, నిత్యానన్దైకరసః=ఉత్పత్తినాశశూన్యమును దుఃఖామిశ్రితమును అగు ఆనందమొక్కటే స్వభావముగాగల, ప్రత్యగ్రూపః=అన్నింటికంటెను లోపలనున్న, స్వయంజ్యోతిః=పరప్రకాశ్యము కానిదియు, కేవలజ్ఞానస్వరూపమును అగు, పరః=సర్వోత్కృష్టమైన, అయం=ఈ ఆత్మ, శుద్ధః=స్వాభావికములు లేదా ఆగంతుకములు అగు మలములచే స్పృశింపబడనిది, విభాతి=విశేషముగ భాసించును; అనాత్మసంబంధరహితముగా భాసించును.

అవ. అందుచే-

ఆత్మానాత్మవివేకః కర్తవ్యో బన్ధముక్తయే విదుషా,
తేనైవానన్దీ భవతి స్వం విజ్ఞాయ సచ్చిదానన్దమ్. 154

విదుషా=విద్వాంసునిచే, బన్ధముక్తయే=బన్ధముక్తికొరకు, ఆత్మానాత్మవివేకః=ఆత్మానాత్మవివేకము, కర్తవ్యః=చేయదగినది, తేనైవ=ఆ ఆత్మానాత్మవివేకముచేతనే, స్వం=స్వస్వరూపమును, సచ్చిదానన్దం=సత్తునుగాను, జ్ఞానమునుగాను, ఆనందమునుగాను, విజ్ఞాయ=తెలిసికొని, ఆనన్దీ భవతి=ఆనందవంతు డగును.

విదుషా=శాస్త్రజన్యజ్ఞానముగల పురుషునిచే, బన్ధముక్తయే=అధ్యాసనివృత్తికొరకు, ఆత్మానాత్మల వివేకము, అసంకీర్ణమగు జ్ఞానము, కర్తవ్యః=ప్రయత్నపూర్వకముగా సంపాదింపదగినది. దానిచేతనే, స్వస్వరూపమును, సచ్చిదానన్దం=కాలత్రయాబాధ్యమును గాను, జ్ఞానమునుగాను, ఆనందమును గాను, విజ్ఞాయ=సాక్షాత్కరించుకొని, "ఆత్మానాత్మవివేచనం స్వనుభవః" అని ద్వితీయ శ్లోకమున చెప్పబడిన విధమున సాక్షాత్కరించుకొని. ఆనన్దీ=నిత్యము, నిరతిశయము, సర్వదా ఉండునదియు అగు ఆనందము కలవాడుగా అగును.

అవ. వివేచనమెట్లు చేయవలెనో బాగుగ మనస్సులో పట్టుటకై దృష్టాంతమును చూపుచు, వివేచనానంతరము 'బ్రహ్మాత్మనాస్థితి' రూపమగు ముక్తికొరకు ఏమి చేయవలెనో చెప్పుచున్నాడు–

ముఞ్జాదిషీకా మివ దృశ్యవర్గాత్
ప్రత్యఞ్చమాత్మాన మసంగ మక్రియమ్,
వివిచ్య తత్ర ప్రవిలాప్య సర్వం
తదాత్మనా తిష్ఠతి యః స ముక్తః. 155

ముంజాత్=ముంజమనెడు తృణమునుండి, ఇషీకామివ=ఇషీకను వలె, దృశ్యవర్గాత్=దృశ్యవర్గమునుండి, అసంగం=సంగరహితమును, అక్రియం=క్రియారహితమును అగు, ప్రత్యంచ మాత్మానం=ప్రత్యగాత్మను, వివిచ్య=వేరుచేసి, తత్ర=దానియందే, సర్వం=సమస్తమైన దానిని, ప్రవిలాప్య=విలీనముచేసి, యః=ఎవడు, తదాత్మనా=దాని రూపముతో, తిష్ఠతి=ఉండునో, సః=అతడు, ముక్తః=ముక్తుడు.

ముంజమునుండి. ఇషికామివ=ఇషికమనగా ముంజతృణము మధ్య నుండునదియు, తామరతూడులోని దారమువలె సన్నగనుండు నదియునగు ఒక సూక్ష్మాంశము, దానినివలె; అంతటను తృణముచే ఆవృతమై అతిసూక్ష్మముగా నున్న అది తెగిపోకుండగ, పూర్తిగ పైకి వచ్చునట్లు దానిని వేరుచేయవలెనన్నచో ప్రయత్నవిశేషము అపేక్షిత మగుచున్నది. ఆ విధముగనే,

ఏష సర్వేషు భూతేషు గూఢోఽత్మా న ప్రకాశతే,
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః.

సకలభూతములందును గూఢమగు ఈ ఆత్మ ప్రకాశింపదు. కాని సూక్ష్మదృష్టికలవారిచే సూక్ష్మమును, ఏకాగ్రమును అగు బుద్ధిచే చూడబడును అను శ్రుతి ననుసరించి, విహితకర్మానుష్ఠానముచేతను, ఉపాసనచేతను సంస్కృతమగు బుద్ధిచే, దృశ్యవర్గాత్ = అనాత్మ

సమూహమునుండి, ప్రత్యఞ్చం=“ప్రాతిలోమ్యేన అంచతీతి ప్రత్యక్” దృశ్యపదార్థములకు ప్రతికూలముగ ఒప్పునది, అసత్తు, జడము, దుఃఖరూపము అగు అహంకారాదులకంటె విలక్షణముగ సచ్చిత్సుఖ రూపము ప్రకాశించుచున్నది అని యర్థము. అసంగం = అద్వితీయ మగుటచే సర్వసంగరహితము. అక్రియం = అపరిచ్ఛిన్నమగుటచే క్రియారహిత మైనది. అట్టి ఆత్మను వేరుచేసి, ఆ ప్రత్యగాత్మయందు దృశ్యవర్గమునంతను, ప్రవిలాప్య=పునఃస్మరణము లేకుండ పూర్తిగ విలీనముచేసి, అనగా ప్రత్యగాత్మకంటె భిన్నముగ ఏదియు లేదు అని నిశ్చయించి, తదాత్మనా = అధిష్ఠానభూతమగు ప్రత్యగాత్మ రూపమున, ఎవ్వడు, ఎల్లప్పుడును ఉండునో, అతడు సకలవిధ బంధముల నుండి ముక్తుడు. ఈ విధముగ, ఆత్మానాత్మవివేకముచే ఆత్మపై ఆరోపితమగు అనాత్మపదార్థములను బాధించి, ‘బ్రహ్మాత్మనా సంస్థితి’ పొందదగినది అనియు, వివేకవంతుడు ప్రపంచవిలాపనము చేయవలెననియు చెప్పినట్లైనది.

అవ. “అస్మాల్లోకాత్ప్రేత్య, ఏత మన్నమయమాత్మాన ముప సంక్రామతి” – ఈ లోకమునుండి బయలుదేరి, అన్నమయాత్మను దాటిపోవును అను శ్రుతియందు చెప్పబడిన క్రమముచే సర్వాంతర మగు ఆత్మను గ్రహింపజేయుటకై, ఇపుడు, పంచకోశములలో (ఆత్మ సామీప్యమునుబట్టి) చివరిదైనను, స్థూలమగుటచే వివేకార్హమైన (అన్నమయ)కోశమును “దేహోఽయం” మొదలైన పదిశ్లోకములచే వివేచించుచున్నాడు–

## అన్నమయ కోశము

దేహోఽయ మన్నభవనోఽన్నమయస్తు కోశో
హ్యన్నేన జీవతి వినశ్యతి తద్విహీనః,
త్వక్చర్మమాంస రుధిరాస్థిపురీషరాశిః
నాయం స్వయం భవితు మర్హతి నిత్యశుద్ధః. 156

అన్నభవనః=అన్నమునుండి జన్మించిన, అయం=ఈ, దేహః= దేహము, అన్నమయః కోశః=అన్నమయ కోశము, హి=ఎందుచేత ననగా, అన్నేన=అన్నముచే, జీవతి=జీవించును, తద్విహీనః=అది లేనిదై, వినశ్యతి=నశించును, త్వక్చర్మ....రాశిః=త్వక్=త్వక్కు, చర్మ=చర్మము, మాంస=మాంసము, రుధిర=రక్తము, అస్థి= ఎముకలు, పురీష=మలము వీటియొక్క, రాశిః=రాశియైన, అయం= ఈ దేహము, స్వయం=తాను, నిత్యశుద్ధః=నిత్యశుద్ధమైన ఆత్మ, భవితుం= అగుటకు, న అర్హతి=అర్హము కాదు.

అన్నమునుండి ఉత్పత్తి దేనికో అది అన్నభవనము. తలి దండ్రులచే భుజింపబడిన అన్నముయొక్క వికారమునుండి దాని యుత్పత్తి అగుచున్నది గాన ఇది అన్నభవనము. అట్టి, అయందేహః= కనబడుచున్న స్థూలదేహము, అన్నమయకోశము. 'తు' శబ్దము అన్యవ్యావర్తకము. పంచకోశములలో స్థూలదేహమే అన్నమయ కోశము; ఇతరముకాదు అని యర్థము. "అన్నాద్వై ప్రజాః ప్రజా యన్తే, అథో అన్నేనైవ జీవన్తి" - ప్రజలు అన్నము నుండియే పుట్టు చున్నారు; తరువాత అన్నముచేతనే జీవించుచున్నారు అని శ్రుతి వాక్యము. ఇది కేవలము ఉత్పత్తిచేతనే అన్నవికారము కాదు; ఉత్పత్త్య నంతరముగూడ అన్నముచేతనే జీవించుచున్నది; ప్రాణధారణము చేయుచున్నది. అది లేనిచో మరణించుచున్నది; దీనినుండి ప్రాణములు పోవుచున్నవి. కావున అన్వయవ్యతిరేకములచే అది అన్నాధీనమైన స్థితి కలది. 'హి'=నిశ్చయము. ఇది పరాధీనమైన ఉత్పత్తిస్థితులు కలదగుట మాత్రము చేతనే కాదు; అశుద్ధ మగుటచే గూడ ఆత్మ కాజాలదని 'త్వక్' ఇత్యాదిపదమున చెప్పుచున్నాడు. ఈ దేహము, "అజో నిత్యః" - పుట్టుకలేనిది, నిత్యము 'శుద్ధ మపాపవిద్ధమ్'- పవిత్రమైనది, పాపవిద్ధము కానిది అని శ్రుతులచే బోధితము లగు నిత్యత్వశుద్ధత్వాది ధర్మములుగల ఆత్మ కాజాలదు. "దేహోఽనాత్మా, అనిత్యత్వాత్, అశుద్ధత్వాత్, కేశాదివత్" – అని అనుమాన ప్రయో

గము. అనిత్యము, అశుద్ధము అగు కేశాదికము ఎట్లు ఆత్మ కాజాలదో, అట్లే అనిత్యము, అశుద్ధము అగు దేహముకూడ ఆత్మ కాజాలదు.

అవ. ఇది అనిత్యమను విషయమును స్పష్టముగ ఉపపాదించు చున్నాడు_

పూర్వం జనేరపి మృతేరథ నాయమస్తి
జాతక్షణక్షణగుణోఽనియతస్వభావః,
నైకో జడశ్చ ఘటవ త్పరిదృశ్యమానః
స్వాత్మా కథం భవతి భావవికారవేత్తా. 157

జనేః=జన్మకంటె, పూర్వం=పూర్వము, మృతేః=మృతికంటె, అథ=అనంతరము, అయం=ఈ శరీరము, నాస్తి=లేదు. జాతక్షణక్షణ గుణః=క్షణక్షణమునందు పుట్టిన గుణము కలది, అనియత స్వభావః= అనియతమైన స్వభావముకలది. నైకః=అనేకమైనది. జడశ్చ=జడము, ఘటవత్=ఘటమువలె. పరిదృశ్యమానః=ప్రత్యక్షముగ చూడదగినది. ఇట్టి శరీరము, భావవికారవేత్తా=భావవికారములను గ్రహించెడు, స్వాత్మా=స్వాత్మగా, కథం భవతి=ఎట్లగును?

ఉత్పత్తికంటె పూర్వము, మరణముకంటె అనంతరము, 'అపి' శబ్దము ఉభయత్ర అన్వయించును. "ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా" _ఏది ఆదియందును అంతమందును లేదో, అది వర్తమానమునందు కూడ అంతే అని మాండూక్యకారికలో చెప్పినట్లుగ, ఈ దేహము దృష్టనష్టస్వరూప మగుటచే అనిర్వచనీయము. ఈ విషయమునే 'జాతక్షణక్షణగుణః' అనుపదముచే ఉపపాదించు చున్నాడు. క్షణక్షణమునందును గుణము క్షణక్షణగుణము. పుట్టిన క్షణక్షణగుణము కలది జాతక్షణక్షణ గుణము. ప్రతిక్షణమునందును ఉపచయాపచయ రూపధర్మములు కలది అని యర్థము. ఈ ఉపచయ

(వృద్ధి) అపచయ (క్షయము) ములు వాయుసంయోగాదులచేతను, అంతరవాయు సంచారముచేతను, అంతఃశోషము మొదలగు వాటి చేతను కలుగుచుండును. అందుచేతనే మాటిమాటికి భోజనము, జలపానాదికము చేయవలసియుండును. కావుననే నిశ్చితమైన స్వభావము లేనిది. అనగా ఏకరూపమున వ్యవస్థితము కానిది.

నైకః=అనేకమైనది. ఒక్క జన్మయందే బాల్యయౌవనాదులలో భిన్నభిన్నముగ కానవచ్చునది అని యర్థము. ఘటమువలె దృశ్య మైనది. కావుననే జడము; అనగా పరాధీనప్రకాశము కలది. ఇట్టి దేహము, భావవికారవేత్తా='ఇపుడు చిక్కినాను, ఇపుడు స్థూలముగా నున్నాను' ఇత్యాది విధమున భావవికారములను తెలిసికొను స్వాత్మ ఎట్లగును? తనలోనున్న ధర్మమును తానే గ్రహించుట అనునది అశక్యము కదా? ఘటమే ఘటమును చూడజాలదు కదా? ఈ విధముగ 'దేహోఽనాత్మా; దృశ్యత్వాత్, ఘటవత్'-దేహము ఆత్మకాదు; దృశ్యము కావున; ఘటమువలె అని చెప్పినట్లైనది. కాని ఆత్మ నిత్యము, నిర్గుణము ఏకరూపము, ఏకము, మరియు ద్రష్ట (చూచునది).

అవ. ఈ విషయముననే మరియొక హేతువును గూడ చెప్పు చున్నాడు-

పాణిపాదాదిమాన్ దేహో నాత్మా వ్యంగేపి జీవనాత్,
తత్తచ్ఛక్తే రనాశాచ్చ న నియమ్యో నియామకః. 158

పాణిపాదాదిమాన్=హస్తపాదాదులు గల, దేహః=దేహము, ఆత్మా న=ఆత్మ కాదు, వ్యంగేపి=పాణిపాదాదులు లేనివానియందుగూడ, జీవనాత్=ప్రాణధారణము ఉండుటవలన, తత్తచ్ఛక్తేః=ఆ యా పాణి పాదాదులశక్తి, అనాశాచ్చ=నశింపకపోవుటవలనను, నియమ్యః=నియ మింపదగినది (దేహము), నియామకః=నియామకము (ఆత్మ), న= కాజాలదు.

పాణిపాదములు ఏ ప్రక్కలు, పొట్ట మొదలగు వాటికి అది యందున్నవో అవి పాణిపాదాదికము. అట్టి పాణిపాదాదికము గల దేహము ఆత్మ కాదు. పాణిపాదాదులు లేనివానియందు గూడ ఆత్మ కార్యమైన ప్రాణధారణము కనబడుచున్నది కదా? లోకమున చేతులు లేనివాళ్లును పాదములు లేనివాళ్ళును జీవించుచునే యున్నారు కదా? కఱ్ఱతోను, చర్మముతోను నిర్మితములగు హస్తపాదాదులతో గ్రహించుట, నడచుట మొదలగు కార్యములు కూడ చేయుచుందురు గాన పాణిపాదాదులశక్తి నశింపకపోవుట వలనను; 'పాణ్యాదులు గల దేహము ఆత్మ కాదు' అని అన్వయము.

న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన,
ఇతరేణ తు జీవన్తి యస్మి న్నేతావుపాశ్రితౌ.

ఏ మర్త్యుడును ప్రాణముచేతగాని, అపానముచేతగాని జీవించుటలేదు. ఈ రెండును దేనిపై ఆధారపడియున్నవో అట్టి మరియొక దానిచేత (ఆత్మచేత) జీవించుచున్నాడు అని కఠోపనిషత్తు ఆత్మ సర్వశక్త్యాశ్రయమని చెప్పుచున్నది. నియమ్యమగు దేహము దేహేంద్రియాదు లన్నింటికిని నియామకమగు ఆత్మ కాజాలదు. దేహము జడముకాన నియమ్యమే, ఇతరులచే నియమింపదగినదే. దీనికి నియామకత్వము కూడ లేదు. ఈ విధముగ సావయవము, నియమ్యమును అగు శరీరము, నిరవయవము, నియామకము అగు ఆత్మ కాజాలదు అని సముదాయార్థము.

అవ. దేహము ఆత్మభిన్నమను విషయమును సాధించి ఆత్మ తద్విలక్షణమైనది అను విషయమును, వివేకము దృఢపడుటకై ఉపదేశించుచున్నాడు.

దేహ తద్ధర్మ తత్కర్మ తదవస్థాది సాక్షిణః,
సత ఏవ స్వతః సిద్ధం తద్వైలక్షణ్య మాత్మనః. 159

దేహ.... సాక్షిణః—దేహ = దేహమునకు, తద్ధర్మ = దాని ధర్మములకు, తత్కర్మ = దాని కర్మలకు, తదవస్థాది = దాని అవస్థలు మొదలగు వాటికిని, సాక్షిణః = సాక్షియైనదియు, సతః ఏవ = ఎల్లప్పుడును ఉండెడు ఆత్మనః = ఆత్మకు, తద్వైలక్షణ్యం = దేహవిలక్షణత్వము, స్వతః సిద్ధం = స్వతస్సిద్ధము.

దేహమునకు, దాని ధర్మము లగు రూపస్పర్శగంధాదులకు, దాని కర్మలకు అనగా హితప్రాప్తి కొరకును అహితపరిహారము కొరకును చేయు గమనాది క్రియలకును, ఉపవేశనము, స్థానము, శయనము మొదలగు దాని అవస్థలకును, ఆదిపదముచే-స్థౌల్యము, కృశత్వము మొదలగు వికారములకును సాక్షియైన, అనగా ప్రత్యక్షముగ చూచువాడైనట్టియు, సత ఏవ=వేరువేరు కాలములకు సంబంధించిన బాల్యాద్యవస్థ లన్నింటియందును వికారరహితుడుగను, కాలత్రయాబాధ్యుడుగను ఉంటున్న ఆత్మ దేహాదివిలక్షణుడు అను విషయము, స్వతః = ఆత్మసాక్షిగా నుండుటచేతనే; మరియొక హేతు వేదియు లేకుండగనే, సిద్ధం = నిశ్చితము. "ఆత్మా దేహాదివిలక్షణః, తత్సాక్షిత్వాత్, యన్నైవం తన్నైవం; యథా దేహాది" అని అనుమాన ప్రయోగము. ఆత్మ దేహాదులకంటె విలక్షణమైనది; వాటికి సాక్షి కనుక; ఏది ఇట్లు (సాక్షి) కాదో అది ఇట్లు (దేహాదివిలక్షణము) కాదు. దేహాదికమువలె అని యర్థము.

అవ. దేహము అనిత్యము కావునను, దృశ్యము కావునను అనాత్మయని ఉపపాదించి, ఇపుడు, అశుద్ధత్వహేతువుచే ఆత్మ భిన్నత్వమును ఉపపాదించుచున్నాడు—

శల్యరాశి ర్మాంసలిప్తో మలపూర్ణోఽతికశ్మలః,
కథం భవే దయం వేత్తా స్వయ మేతద్విలక్షణః. 160

శల్యరాశిః = ఎముకల రాశి కలదియు, మాంసలిప్తః = మాంసముచే పూయబడినదియు, మలపూర్ణః = పురీషముతోడను, పుసులు, చీమిడి, గులిమి మొదలగు వాటితోను నిండినదియు, కావుననే, అతికశ్మలః = చెమట దుర్గంధము మొదలగువాటితో కూడియుండుటచే మిక్కిలి అశుద్ధమైనదియు అగు, అయం = ఈ శరీరము, ఏతద్విలక్షణః = దీనికంటె విలక్షణమై నిర్మలమైన, స్వయం = ఆత్మగా, కథం భవేత్ = ఎట్లగును? అనుమానము పూర్వము చూపబడినది.

అవ. ఇట్టి వివేకమునకు ఫలమును చెప్పుచున్నాడు —

త్వఙ్మాంసమేదోఽస్థి పురీషరాశా
వహంమతిం మూఢజనః కరోతి,
విలక్షణం వేత్తి విచారశీలో
నిజస్వరూపం పరమార్థభూతమ్. 161

మూఢజనః = విచారవిహీనుడును భ్రాన్తిచెందిన బుద్ధికలవాడును అగు మనుష్యుడు, త్వఙ్మాంసమేదోఽస్థిపురీషరాశౌ = త్వక్కు, మాంసము, క్రొవ్వు, ఎముకలు, పురీషము వీటియొక్క రాశియైన దేహమునందు, అహంమతిం = 'నేను' అనెడు తాదాత్మ్యబుద్ధిని, కరోతి = చేయుచున్నాడు, విచారశీలః = విచారముచేయు స్వభావముకల పురుషుడైతే, విలక్షణం = దేహవిలక్షణమును, పరమార్థభూతం = పరమార్థమైనదియు అగు, అనగా కాలత్రయమునందును అబాధ్యమగు, నిజస్వరూపం = వాస్తవికమైన తన యొక్క స్వరూపమును, తానే పరమాత్మ యనెడు విషయమును, వేత్తి = తెలిసికొనుచున్నాడు,

అవ. అందును —

దేహోఽహ మిత్యేవ జడస్య బుద్ధి
ర్దేహే చ జీవే విదుష స్త్వహంధీః,
వివేకవిజ్ఞానవతో మహాత్మనో
బ్రహ్మాహ మిత్యేవ మతిః సదాత్మని. 162

జడస్య=పామరునకు, దేహ ఏవ=దేహమే, అహం=నేను, ఇతి=అని, బుద్ధిః=బుద్ధియుండును, విదుషస్తు=పండితునకైతే, దేహే చ=దేహమునందును, జీవే=జీవునియందును, అహంధీః= అహం' అను బుద్ధి ఉండును, వివేకవిజ్ఞానవతః=వివేకజన్యమగు విజ్ఞానము కల, మహాత్మనః=మహాత్మునకు, ఆత్మని=ఆత్మవిషయమున, అహమేవ=నేనే, బ్రహ్మ ఇతి=బ్రహ్మను అని, సదా=ఎల్లప్పుడును, మతిః=బుద్ధియుండును.

జడస్య=పామరునకు, నేను. దేహఏవ=దేహమునే, తద్వ్యతిరిక్తమగు మరి యేదియును లేదు అను బుద్ధియుండును. విదుషస్తు=శాస్త్రజన్యమగు పరోక్షజ్ఞానము కలవానికైతే, దేహమునందును జీవునియందునుగూడ అహంకార ముండును. లౌకికవ్యవహారములయందు దేహమునందును, వైదికవ్యవహారమునందు స్వర్గముకొరకై యాగాదులను చేయుటకై, దేహవ్యతిరిక్త జీవునియందును, అహంకారముండును. వివేకవిజ్ఞానవతః_వివేకమనగా ఆత్మానాత్మవివేచనము, అట్టివివేకముచే, ఆత్మయందు అనాత్మను లీనముచేయుటచే, జనించిన, విజ్ఞానము, అనగా సాక్షాత్కారముకల, మహాత్మనః=పరిచ్ఛేదత్రయశూన్యమగు ఆత్మకలవానికి. పూర్వము పరిచ్ఛిన్నములును, అనాత్మలును అగు కోశములను ఆత్మగ భావించుటచే అల్పుడుగ ఉండెను. కాని ఇపుడు సమ్యగ్జ్ఞానవంతుడై తనను త్రివిధపరిచ్ఛేదశూన్యునిగ, అనగా దేశతః, కాలతః, వస్తుతః పరిచ్ఛేదము లేనివానినిగా గ్రహించును. "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా"_ఏ స్థితియందు ఇతరమును చూడడో, ఇతరమును వినడో, ఇతరమును తెలిసికొనడో అదియే భూమ- అనగా సర్వాత్మత్వము అనియు, "యత్ర తస్య సర్వమాత్మైవాభూత్త త్కేన కం పశ్యేత్"_ అతనికి సర్వమును ఆత్మయే యైనపుడు ఎవనిని దేనితో చూచును? అనియు శ్రుతులు చెప్పుచున్నవి. అట్టి వానికి, ఎల్లప్పుడును, ఆత్మని స్వవిషయమున, 'నేనే బ్రహ్మను' అను, మతిః=అనుభవముండును.

అవ. అందువలన-

అత్రాత్మబుద్ధిం త్యజ మూఢబుద్ధే
త్వఙ్మాంసమేదోఽస్థి పురీషరాశౌ,
సర్వాత్మని బ్రహ్మణి నిర్వికల్పే
కురుష్వ శాన్తిం పరమాం భజస్వ. 163

హే మూఢబుద్ధే=ఓ మూఢబుద్ధీ, త్వఙ్మాంస . రాశౌ=త్వఙ్మాంస మేదోఽస్థిపురీషముల రాశియైన, అత్ర = ఈ దేహమువిషయమున, ఆత్మ బుద్ధిం = ఆత్మయనెడు బుద్ధిని, త్యజ = విడువుము, సర్వాత్మని = సర్వా త్మయు, నిర్వికల్పే = వికల్పశూన్యమును అగు, బ్రహ్మణి = బ్రహ్మ యందు, కురుష్వ = ఆత్మబుద్ధిని చేయుము, పరమాం = గొప్పదైన, శాన్తిం = శాన్తిని, భజస్వ = పొందుము.

మూఢబుద్ధే = వివేచనారహితమగు అంతఃకరణము కలవాడా! లేదా మూఢైః బుద్ధః మూఢబుద్ధః - తస్మిన్ - మూఢబుద్ధే = మూఢులచే ఆత్మగా గ్రహింపబడిన, ఈ త్వగాదిరాశియైన స్థూలదేహమునందు ఆత్మబుద్ధిని విడువుము. సర్వాత్మని = ఇదం సర్వం యదయమాత్మా -ఇదియంతయు ఆత్మయే "సర్వం ఖల్విదం బ్రహ్మ"-ఇది యంతయు బ్రహ్మయే అని శ్రుతిచే సర్వవస్తువులకును ఉపాదాన మగుటచేతను, కల్పిత సకలప దార్థములకును అధిష్ఠాన మగుటచేతను, సకలపదార్థ ములయొక్క వాస్తవికరూపమైనట్టిదియు, నిర్వికల్పే = వివిధకల్పనా శూన్యమగు, బ్రహ్మణి = పరమాత్మయందు, ఇపుడు దేహవిషయ మున ఉన్న ఆత్మబుద్ధిని, అనగా 'అహం' అను బుద్ధిని చేయుము. నేనే పరబ్రహ్మమునని తెలిసికొనుము. దానికి ఫలమును చెప్పుచు న్నాడు - పరమాం = ముక్తిసుఖమునొసగెడు, శాన్తిం = బుద్ధ్యుపశాం తిని, అనగా బ్రహ్మసంస్థను పొందుము. "శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి" అని భగవద్గీతాస్మృతి చెప్పుచున్నది.

అవ. దేహాదులయందు అభిమానమును త్యజించనంతవరకును కేవల శాస్త్రజన్య జ్ఞానమువలన ముక్తి లేదు అని చెప్పుచున్నాడు—

దేహేన్ద్రియాదావసతి భ్రమోదితాం
విద్వా నహంతాం న జహాతి యావత్
తావన్న తస్యాస్తి విముక్తివార్తా
వ్యస్త్వేష వేదాన్తనయాన్తదర్శీ. 164

విద్వాన్ = వివేచనకుశలుడు, అసతి = మిథ్యాభూతమగు, దేహేన్ద్రియాదౌ = దేహేంద్రియప్రాణమనోబుద్ధ్యాదులయందు, యావత్ = ఎంతవరకు, భ్రమోదితాం = భ్రాన్తివలనకలిగిన, అహంతాం = ఆత్మబుద్ధిని, న జహాతి = విడిచిపెట్టడో తావత్ = అంతవరకును, తస్య = ఆ పురుషునకు, విముక్తివార్తాపి = మోక్షమనెడుమాటయైనను, నాస్తి = లేదు, అట్టిచో మోక్ష మెట్లువచ్చును అని భావము. ఏషః = ఇతడు, వేదాన్తనయాన్తదర్శీ = వేదాన్తశాస్త్రముయొక్క అంతమును చూచినవాడైనను, అస్తు = అగుగాక. వేదాంతాంతమును చూచినవాడైనను అభిమానమును విడువనంత వరకును ముక్తికి అర్హుడుకాడు. అందుచే నిరంతర నిదిధ్యాసనముచే విపరీతభావనను విడువవలెను అని అభిప్రాయము.

అవ. అహంకారమును విడనాడుటకు సులభోపాయమగు విచారమును (ఆలోచనను) చెప్పుచున్నాడు—

ఛాయాశరీరే ప్రతిబింబగాత్రే
యత్స్వప్నదేహే హృది కల్పితాంగే,
యథాత్మబుద్ధి స్తవ నాస్తి కాచిత్
జీవచ్ఛరీరే చ తథైవ మాస్తు. 165

యత్ = ఏకారణమువలన, ఛాయాశరీరే = ఛాయారూపమైన శరీరమునందును, శరీరముయొక్క నీడయందును, ప్రతిబింబగాత్రే = అద్దము మొదలైన వాటిలో కనబడుచున్న దేహప్రతిబింబమునందును, స్వప్న

దేహే=స్వప్నావస్థలో కనబడు దేహమునందును, హృది=మనస్సునందు, కల్పితాంగే=కల్పితమగు శరీరమునందును, జాగ్రదవస్థయందే మనస్సుచే కల్పించుకొనిన దేహమునందును, యథా=ఎట్లు, తవ=నీకు, ఆత్మబుద్ధిః=ఆత్మయనెడు బుద్ధి, కాచిత్=ఏదియు, నాస్తి=లేదో, తథైవ=అట్లే, జీవచ్ఛరీరే చ=ప్రాణములతోనున్న శరీరము విషయమున గూడ, మాస్తు=లేకుండుగాక, ద్రష్టయగు తనకంటె వేరుగ ప్రతీయమానమగుట అనునది అన్నిదేహముల విషయమునకు సమానమే కదా యని భావము.

అవ. అన్నమయకోశమును ఉపసంహరింప దలచినవాడై సర్వానర్థకరమగు దేహాత్మబుద్ధి త్యాజ్యమైనది అని చెప్పుచున్నాడు —

దేహాత్మధీరేవ నృణా మసద్ధియాం
జన్మాదిదుఃఖప్రభవస్య బీజమ్,
యతస్తత స్త్వం జహి తాం ప్రయత్నాత్
త్యక్తే తు చిత్తే న పునర్భవాశా. 166

యతః=ఏ కారణమువలన, అసద్ధియాం=అసత్తులగు బ్రహ్మభిన్నానాత్మవస్తువులయందు బుద్ధిగల, నృణాం=మనుజులకు, దేహాత్మధీరేవ=దేహమే ఆత్మ యను బుద్ధియే, జన్మాదిదుఃఖప్రభవస్య=జన్మమరణాదులచే దుఃఖముయొక్క ఉత్పత్తికి, బీజం=కారణమో; జన్మమరణాదులు శరీరమునకు సంబంధించినవి. ఆ శరీరమే నేను అనుకొనువాడు జన్మమరణాదులు గూడ తనవే అనుకొనుటచే దుఃఖము అనుభవింపక తప్పదు అని భావము. తతః=ఆ కారణమువలన, సకలదుఃఖహేతువగుటవలన, తాం=దేహాత్మబుద్ధిని, ప్రయత్నాత్=శ్రవణమనననిదిధ్యాసనరూప శాస్త్రీయప్రయత్నము వలన, జహి=విడువుము, లేదా నశింపజేయుము. చిత్తే=చిత్తమునందు, దేహాదౌ=దేహాదికము, త్యక్తే తు=విడువబడినదైతే, అనగా దేహాదివిషయమున మనస్సంచారము లేకపోవుటతో వాసనారూపమునగూడ అభిమానము లేనప్పుడు, పునః=మరల, భవాశా=సంసారాశ, న=లేదు. "అహంభావస్య దేహేఽస్మిన్" అని చెప్పనున్నాడు (286వ శ్లోకము).

"దేహాత్మజ్ఞానవద్ జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకమ్,
ఆత్మన్యేవ భవేద్యస్య స జీవన్నపి ముచ్యతే."

అను వాక్యముకూడ ఇట ప్రమాణము. "దేహమునందు ఆత్మయను జ్ఞానమున్నట్లుగనే ఎవనికి, దేహాత్మజ్ఞాన బాధకమగు, ఆత్మజ్ఞానము ఆత్మ విషయముననే కలుగునో, అతడు జీవించియున్నను ముక్తుడగును" అని దీని యర్థము.

అవ. అన్నమయకోశమును నిరూపించి, శ్రుత్యుక్తక్రమము ననుసరించి, దానికంటె అంతరమును, అనాత్మయునగు ప్రాణమయ కోశమును రెండు శ్లోకములచే నిరూపించుచున్నాడు—

## ప్రాణమయ కోశము

కర్మేన్ద్రియైః పంచభి రంచితోఽయం
ప్రాణో భవేత్ప్రాణమయస్తు కోశః,
యేనాత్మవా నన్నమయోఽనుపూర్ణః
ప్రవర్తతేఽసౌ సకలక్రియాసు. 167

పంచభిః = ఐదు, కర్మేన్ద్రియైః=కర్మేంద్రియములతో, అంచితః = కూడిన, అయం=ఈ, ప్రాణః=ప్రాణము, ప్రాణమయః కోశః భవేత్ = ప్రాణమయకోశ మగును, యేన ఆత్మవాన్ = దేనిచేత ఆత్మకలదిగానున్న (ఏది ఆత్మగా కలిగిన)దియు, అనుపూర్ణః=నిండినదియు అగు, అసౌ=ఈ అన్నమయః = అన్నమయకోశము, సకలక్రియాసు = సమస్త క్రియల యందు, ప్రవర్తతే=ప్రవర్తించుచున్నదో.

పంచభిః కర్మేంద్రియైః =వచనాదానవిహరణోత్సర్గానందరూపములగు కర్మలను చేయు, క్రమముగ ఆకాశాది పంచభూతముల రజోంశమువలన పుట్టిన వాక్పాణిపాదపాయూపస్థలను పేరుగల కర్మేంద్రియములతో, అంచితః=కూడిన, ప్రాణః=భూతపంచకసమష్టియొక్క

రజఃకార్యము వలన జనించినదియు, శరీరాంతస్సంచారియు నగు వాయువు, ప్రాణమయః కోశః=ప్రాణమయకోశము. ఇది, క్షుత్పి పాసారహితమగు ఆత్మయొక్క ఉపలబ్ధికి ప్రతిబంధకమగు "నేను దప్పికతో బాధపడుచున్నాను; నేను ఆకలిచే పీడింపబడుచున్నాను" అనెడు జ్ఞానమునకు విషయ మగుచున్నది. "తేనైష పూర్ణః స వా ఏష పురుషవిధ ఏవ; తస్య పురుషవిధతామ్; అన్వయం పురుషవిధః"- అనెడు ప్రాణమయకోశవర్ణకమగు శ్రుతియొక్క అర్థమును చెప్పు చున్నాడు - యేన=ఆనందమయ-విజ్ఞానమయ - మనోమయ కోశ ముల ద్వారా ఆత్మప్రతిబింబమును గ్రహించుటచే ఆత్మవంతమైన ఏ ప్రాణకోశముచే, అన్నమయః=అన్నమయకోశము, "తస్మాద్వా ఏతస్మా దన్నరసమయాత్ అన్యో౽న్తర ఆత్మా ప్రాణమయః"-అన్నరస మయమగు దీనికంటె అంతరమైన మరియొక ప్రాణమయాత్మ అను శ్రుతి ననుసరించి, ఆత్మవాన్=ఆత్మ ప్రతిఫలనము కలది. 'అను పూర్ణః' అనునది అందులకు హేతువు. 'స ఏష ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః' - ఈ ఆత్మ నఖాగ్రము వరకును ఈ శరీరములో ప్రవేశించియున్నది అను శ్రుతి ననుసరించియు, "తస్య పురుషవిధతా మన్వయం పురుష విధః"-ప్రాణమయముయొక్క పురుషవిధత్వమునుబట్టి అన్నమయము గూడ పురుషవిధముగ నున్నది అను శ్రుతి ననుసరించియు, ప్రాణము యొక్క పూర్ణత్వము ననుసరించి ఇది పూర్ణమైనది. ఈ విధమైన హిత ప్రాప్త్యహిత పరిహారార్థములగు సకల క్రియలయందును ప్రవర్తించు చున్నది. చేతనాధిష్ఠితమైననే కదా అచేతనము కార్యము చేయును? ఏ భాగమునందు ప్రాణసంబంధ ముండదో ఆ భాగము నిర్వ్యాపార ముగ నుండుట లోకప్రసిద్ధముగాన ప్రాణసంబంధమువలననే శరీరము నందు వ్యాపార ముండును. మృతశరీరమునందు ప్రాణసంబంధము లేకపోవుటచే ఆత్మసంబంధమును కల్పించు ద్వారము లేకపోవుటచే అచేతనత్వము వచ్చుచున్నది. ప్రాణము సమష్టికార్యము, కర్మేంద్రి

యములు వ్యష్టికార్యములు అను భేదమున్నను రజోగుణకార్యత్వమను నది సమానమే గావున కర్మేంద్రియములు ప్రాణమయాన్తర్భూతము లని గ్రహింపవలెను.

అవ. ఇపుడు - ఈ ప్రాణమయకోశముకూడ అనాత్మయే అని చెప్పుచున్నాడు -

నైవాత్మాయం ప్రాణమయో వాయువికారః
గన్తాగన్తా వాయువ దన్తర్బహి రేషః,
యస్మాత్కించి త్క్వాపి న వేత్తీష్ట మనిష్టం
స్వం వాన్యం వా కించన నిత్యం పరతన్త్రః. 168

వాయువికారః = వాయువికారమైన, అయం = ఈ, ప్రాణమయః = ప్రాణమయము, ఆత్మా = ఆత్మ, నైవ = కాదు, ఏషః = ఇది, వాయువత్ = వాయువువలె, అంతర్బహిః = లోపలికిని వెలుపలకును, గన్తా అగన్తా = వెళ్ళుచు వచ్చుచు ఉంటునది. యస్మాత్ = ఏ కారణమువలన, ఈ ప్రాణమయము, క్వాపి = ఎచ్చటను, ఇష్టం = ఇష్టమునుగాని, అనిష్టం = అనిష్టమునుగాని, న వేత్తి = తెలిసికొనదో, నిత్యం = ఎల్లప్పుడును, పరతంత్రః = పరాధీనమై, స్వం వా = తననుగాని, అన్యం వా = అన్యమును గాని తెలిసికొనదో.

వాయువికారః = వాయువుయొక్క కార్యమైన, అయం = ఈ ప్రాణమయకోశము, ఆత్మ కాజాలదు అని ప్రతిజ్ఞ. అందులకు కారణము - బాహ్యవాయువువలె ఈ ప్రాణమయము ఉచ్ఛ్వాస సమయమున లోపలికి వచ్చును, నిఃశ్వాస సమయమున బయటకు వెళ్ళును. ఈ విధముగ సక్రియము పరిచ్ఛిన్నము అగు ఇది, సర్వ వ్యాపియు, నిష్క్రియము అగు ఆత్మ కాజాలదు అని భావము బాహ్యవాయువువలె, సక్రియము కావునను, పరిచ్ఛిన్నము కావునను అని దృష్టాంతసహితమగు హేతువు చూపబడినది అట్లే

ఉత్తరార్ధమునందు అచేతనత్వము. పరతంత్రత్వము అను వాటిని ప్రాణమయము అనాత్మ యనుటకు హేతువులుగ చూపుచున్నాడు. యస్మాత్ = ఏ కారణమువలన, అయం = ఈ ప్రాణమయము, ఇష్ట మునుగాని అనిష్టమునుగాని, అనగా సుఖమునుగాని దుఃఖమును గాని క్వాపి—ఏ కాలమునందైనను లేదా ఏ దేశమునందైనను, స్వం వా = తననుగాని, అన్యం = ఇతరమైనదానినిగాని, న వేత్తి = తెలిసికొనుట లేదు. ఇది నిత్యము పరతంత్రమైనది. జీవనమునకు కారణభూత మగు యత్నమువలన కలిగిన సంచారము కలదగుటచే ఇది పర తంత్రము. ప్రాణాయామాది సమయములయందు అది నిరోధింప బడుట ప్రసిద్ధమే. కావున సక్రియత్వ-పరిచ్ఛిన్నత్వ-అచేతనత్వ-పరా ధీనత్వము లను హేతువులచే ప్రాణమయము, ఏతద్విలక్షణమగు, అనగా అక్రియము, అపరిచ్ఛిన్నము, చేతనము, స్వతంత్రము అగు ఆత్మ కాజాలదు. ప్రాణమయము ఆత్మయేయైనచో, అది సుషుప్త్య వస్థలో జాగరూకమై యున్నదిగాన చోరాదులబాధను తెలిసికొన వలెను. ఆత్మ సర్వప్రధానము గాన తన భృత్యులగు చక్షురాదులు నిద్రపోవుచున్నపుడు తాను వ్యాపారముచేయుట విరుద్ధము. కావున ఈ ప్రాణమయము ఆత్మ కాదు.

అవ. ఇపుడు మనోమయమును నిరూపించుచున్నాడు-

## మనోమయ కోశము

జ్ఞానేన్ద్రియాణి చ మనశ్చ మనోమయః స్యాత్
కోశో మమాహమితి వస్తువికల్పహేతుః,
సంజ్ఞాది భేదకలనాకలితో బలీయాన్
తత్పూర్వకోశ మనుపూర్య విజృమ్భతే యః. 169

జ్ఞానేన్ద్రియాణి చ = జ్ఞానేంద్రియములును, మనశ్చ = మనస్సును, మమ అహమితి = 'నాది' 'నేను' అనెడు, వస్తువికల్ప హేతుః = వస్తు వికల్పమునకు హేతువైన, మనోమయః కోశః = మనోమయకోశముగ, స్యాత్ = అగును, సంజ్ఞాది భేదకలనాకలితః = సంజ్ఞాదులయొక్క భేద జ్ఞానముతో కూడిన, బలీయాన్ = బలవత్తరమైన, యః = ఏది, తత్పూర్వ కోశం = దానికంటె పూర్వమైన ప్రాణమయకోశమును, అనుపూర్య = పూరించి, విజృమ్భతే = విజృంభించుచున్నదో.

శ్రవణదర్శనాది కార్యములకు సాధనములును, జ్ఞానేంద్రియ ములును అగు శ్రోత్రచక్షుస్త్వగ్జిహ్వాఘ్రాణములును, కామ సంకల్ప విచికిత్సాశ్రద్ధాదివృత్తులుగల మనస్సును, మనోమయమను కోశము. సర్వేంద్రియ వ్యాపారమును మనస్సుకు అధీన మగుటవలనను, ఇంద్రియములు పనిచేయని స్వప్నావస్థలోకూడ మనస్సు ఉండుట వలనను ఈ కోశమునకు 'శ్రోత్రమయకోశము' ఇత్యాదినామ ధేయములు కాక, మనోమయకోశ మను పేరు ఈయబడినది. జ్ఞానేంద్రియములలో ఒక్కొక్కటి ఆకాశాది పంచభూతములలో ఒక్కొక్కదాని సత్త్వగుణకార్యము. మనస్సు పంచకముల సమష్టి సత్త్వగుణముయొక్క కార్యము. అందుచే ఈ జ్ఞానేంద్రియమనస్సు లకు మనోమయకోశమున అనుప్రవేశము. నేను వినుచున్నాను, నేను చూచుచున్నాను, నేను స్పృశించుచున్నాను, నేను రుచి చూచుచున్నాను, నేను వాసన చూచుచున్నాను, నేను కోరు చున్నాను. నేను సంకల్పించుచున్నాను ఇత్యాది విధమున వాటి అన్నింటియందును ఆత్మబుద్ధి యుండుటవలనను, "తస్మాద్వా ఏతస్మా త్ప్రాణమయాత్ అన్యోఽన్తర ఆత్మా మనోమయః"- ఈ ప్రాణమయముకంటె భిన్నమైన మనోమయ మను మరియొకటి అంతరమైనది; అది ఆత్మ అను శ్రుతి ననుసరించి, ఈ మనోమయము కూడా, తన జ్ఞానముద్వారా ఆత్మయాథాత్మ్య జ్ఞానమును ప్రతిబద్ధము చేయుచున్నది గాన ఇదికూడ కోశము అని చెప్పబడుచున్నది. దాని

యొక్క కార్యమును చెప్పుచున్నాడు - 'నాది' 'నేను' అను వస్తు వికల్పమునకు హేతువైనది; మనస్సు సంకల్ప వికల్పాత్మక మగుట వలన, దేహేంద్రియాదుల విషయమున 'నేను' అనెడు బుద్ధిని, గృహక్షేత్రాదుల విషయమున 'నాది' అను బుద్ధిని కలిగించు చున్నదని అర్థము. దాని స్వరూపమును చెప్పుచున్నాడు:- సంజ్ఞాది భేదకలనాకలితః .- సంజ్ఞా=నామము. ఆదిపదముచే రూపమును గ్రహించవలెను. సంజ్ఞారూపాది భేదమును గ్రహించునది. ఈ వస్తువునకు ఘటము, కలశము, కుంభము మొదలగు పేర్లు. లావైన పొట్ట, మొదలైన ఆకార ముండును. నీలపీతాదివర్ణ ముండును; ఇత్యాదిరీతిచే సర్వపదార్థములందును వేరు వేరుగా నున్న నామ రూపాదులను గ్రహించు శక్తి కలది అని యర్థము. లేదా శబ్దవిషయ ములు అర్థవిషయకములు ఐన సకలవృత్తులును మనస్సును ఆశ్ర యించుకొని యుండును. శబ్దములు అర్థములు ఈ రెండిటికంటె భిన్నమగు ప్రపంచము లెదు. కావున ప్రపంచ మంతయు తనకు సంబంధించిన వృత్తిగల - అనగా తనను గ్రహించు - మనస్సునందు ఉన్నది గాన ఈ కోశము బలవత్తరము. బంధమోక్షములు రెండును ఈ కోశముపై ఆధారపడి యున్నవి. అన్నమయ ప్రాణమయములకు జ్ఞానశక్తి లేదు గావునను, దీనితో సంబంధము లేనిచో ఆ రెండింటికిని ఆత్మసంబంధము లేదు కావునను, ఇది వాటికంటె బలీయము. ఈ విషయమునే 'తత్కోశ మనుపూర్య' అని చెప్పుచున్నాడు. దాని యొక్క పూర్వకోశ మనగా ప్రాణమయ కోశము. తాను విజ్ఞాన మయముచే పూరితమై ప్రాణమయకోశమును పూరించుచు, విజృమ్భతే=నిరర్గళముగ తన కార్యమును చేయుచున్నది. "స వా ఏష పురుషవిధ ఏవ, తస్య పురుషవిధతామ్, అన్వయం పురుషవిధః" అను శ్రుతి 'విజ్ఞానమయముయొక్క పురుషవిధత్వము ననుసరించి మనోమయము పురుషవిధ మగుచున్నది' అని చెప్పుచున్నది.

అవ. 'పంచేంద్రియైః' మొదలగు నాలుగు శ్లోకములచే మనోమయ మెట్లు బంధహేతువో చెప్పుచున్నాడు-

పంచేంద్రియైః పంచభిరేవ హోతృభిః
ప్రచీయమానో విషయాజ్యధారయా,
జాజ్వల్యమానో బహువాసనేన్ధనై
ర్మనోమయోఽగ్నిర్దహతి ప్రపఞ్చమ్. 170

పంచేంద్రియైః=ఐదు ఇంద్రియము లనెడు, పంచభిరేవ=ఐదుగురైన హోతృభిః=హోమము చేయు ఋత్విక్కులచే, విషయాజ్యధారయా=విషయములనెడు ఆజ్యముయొక్క ధారచేత, ప్రచీయమానః=వృద్ధిపొందింపబడుచున్నట్టియు, బహువాసనేన్ధనైః=అనేకవిధములగు వాసనలనెడు ఇంధనములచే, జాజ్వల్యమానః=ఎక్కువగ మండుచున్న, మనోమయః అగ్నిః=మనోరూపమగు అగ్ని, ప్రపంచం=ప్రపంచమును, దహతి=కాల్చివేయుచున్నది,

సులభముగ తెలియుటకై, మనోమయకోశమును అగ్నిగను, శ్రోత్రాదీంద్రియములను హోతలుగను, మాటిమాటికి వచ్చిపడుచున్న విషయములను ఆజ్యధారలనుగను, విషయవాసనలను కట్టెలనుగను ఆరోపించుచున్నాడు. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణము లనెడు ఐదు ఇంద్రియములే, హోతృభిః=హవిస్సునకు అగ్నికి సంయోగమును కలిగించు వ్యాపారము చేయు హవిస్సు వేయువారిచే (హోమము చేయువారిచే), విషయాజ్యధారయా=శబ్దస్పర్శరూపరసగంధములనే ఆజ్యము; దానియొక్క ధారచే, ప్రచీయమానః=వృద్ధిపొందింపబడుచున్న, ఆ యా ఇంద్రియములు ఆ యా విషయములను నిరంతరము మనస్సునకు అందజేయుటచే, ఈ అగ్ని వృద్ధిపొందింపబడుచున్నది. ఇంధనములుండగా ఆజ్యధార కూడ ఉన్నచో అగ్ని అధికమగును; అందుచే 'బహువాసనేన్ధనైః', అని చెప్పుచున్నాడు. అనేకములగు, వాసనాః=వాసనలు

"దృఢభావనయా త్యక్తపూర్వాపర విచారణమ్,
యదాదానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా."

దృఢమగు భావనచే-మాటిమాటికి వాటినిగూర్చియే ఆలోచించుటచే-పూర్వాపరవిచారములేక, పదార్థములను స్వీకరించుటకు వాసన యని పేరు, అని చెప్పిన విధమున, విషయములు బంధహేతువులైనను సుఖకరము లనెడు భ్రాంతిచే అవి ఉపాదేయములే అని భావించుట. అట్టి వాసనలే ఇంధనములు, అనగా శుష్కకాష్ఠములు. ఇంధనములు లేనిచో ఆజ్యధార చాలకాలముపాటు జ్వాలను కలిగింప జాలదు. అట్లే వాసనలు లేనిచో విషయములుకూడ బంధకములు కాజాలవు. అట్టి బహువాసనేంధనములచే, జాజ్వల్యమానః=మాటిమాటికిని నిరంతరముగ మండుచున్న, మనోమయః=మనోరూపమగు, అగ్ని ప్రపంచమును, దహతి=భస్మముచేయుచున్నది. పురుష లందరిని పురుషార్థమునకు అయోగ్యులనుగ చేయుచున్నది అని తాత్పర్యము.

అవ. మనస్సు బంధక మను విషయమును అన్వయ వ్యతిరేకములచే చెప్పుచున్నాడు—

న హ్యస్త్యవిద్యా మనసోఽతిరిక్తా
మనో హ్యవిద్యా భవబన్ధహేతుః,
తస్మి న్వినష్టే సకలం వినష్టం
విజృమ్భితేఽస్మిన్ సకలం విజృమ్భతే. 171

మనసః=మనస్సుకంటె, అతిరిక్తా=భిన్నమైన, అవిద్యా=అవిద్య, నాస్తి హి=లేదు కదా (ఇది నిశ్చితము). హి=ఎందువలన అనగా, భవబన్ధహేతుః=సంసారబంధమునకు హేతువగు, అవిద్యా=అవిద్య, మనః=మనస్సే, తస్మిన్=ఆ మనస్సు, వినష్టే=నష్టమైన దగుచుండగా, సకలం=సమస్తము, వినష్టం=వినష్టమైనది, అస్మిన్=ఈ మనస్సు,విజృమ్భితే=విజృంభించగా, సకలం = సమస్తము, విజృమ్భతే=విజృంభించును,

సుషుప్తియందు కారణావిద్య ఉన్నను బంధము లేదు. కావున ఆ కారణావిద్యయొక్క కార్యమగు మనస్సే బంధకము; అపుడు మనస్సు లీనమగుటచే బంధము లేదు అను అభిప్రాయముతో మనస్సుకంటె అతిరిక్తమగు అవిద్య లేదు అని చెప్పబడినది, హి=నిశ్చితముగా. హి= ఏ కారణమువలన, భవబంధమునకు హేతువగు అవిద్య, తత్కార్యమగు మనస్సే. మనస్సు ఉన్నపుడే దేహాద్యభిమానరూపమగు బంధమున్నది. మనస్సు లేనపుడు అది లేదు. కావున మనో భవబంధములకు అన్వయవ్యతిరేకములు. ఈ విషయమునే ఉపపాదించుచున్నాడు — ఆ మనస్సు నిర్వాసనముగ, పూర్తిగ నశించినచో సకలము నశించును. సుషుప్త్యవస్థయందు జగత్తు లే దను విషయము స్పష్టమే కదా? ఈ మనస్సు, విజృమ్భితే=వృద్ధిపొందినపుడు, సమస్తము వృద్ధిపొందును అని యర్థము.

అవ. ఈ విషయమునే విపులీకరించుచున్నాడు—

స్వప్నేఽర్థశూన్యే సృజతి స్వశక్త్యా
భోక్త్రాది విశ్వం మన ఏవ సర్వమ్,
తథైవ జాగ్రత్యపి నో విశేషః
తత్సర్వమేత న్మనసో విజృమ్భణమ్. 172

అర్థశూన్యే=పదార్థశూన్యమగు, స్వప్నే=స్వప్నమునందు, మనః ఏవ=మనస్సే, స్వశక్త్యా=తనయొక్క శక్తిచేత, సర్వం=సమస్తమైన, భోక్త్రాది=భోక్త మొదలగు, విశ్వం=ప్రపంచమును, సృజతి=సృజించుచున్నది, తథైవ=అట్లే, జాగ్రత్యపి=జాగ్రదవస్థయందు కూడ సృజించుచున్నది, విశేషః నో=భేదమేమియు లేదు, తత్ ఏతత్ సర్వం= ఇది యంతయు, మనసః=మనస్సుయొక్క విజృమ్భణం=విజృంభణమే.

ఈ శ్లోకమున అన్వయమును చెప్పుచున్నాడు, అర్థశూన్యే— మనసు శరీరములోపలనున్న నాడులలో సంచరించు అవస్థ అని శ్రుతి బోధించుచున్నది. కేశముకంటె గూడ సూక్ష్మములైన నాడులలో,

ఆ సమయమున గిరినదీసముద్రాదులు కనబడుట. అసంభావ్యము - ఆ సమయమున చక్షురాదుల వ్యాపారము ఉపరతమగుటచే వాటి ద్వారా మనస్సు బైటకు వెళ్లుట అనునది ఉండదు. బాహ్యపదార్థముల ప్రతీతికూడ ఉండదు. కావున, మనస్సులో నున్న వాసనలను బట్టియే, ఆ సమయమున పదార్థములు బాహ్యములవలె కనబడుచున్నవి. వాస్తవమున అవి లేవు. కావున 'అర్థశూన్యే' అని చెప్పబడినది. అట్టి పదార్థశూన్యమగు స్వప్నమునందు స్వశక్త్యా=కేవలము వాసనలచేతను, తనయందు ఆత్మ ప్రతిఫలనముయొక్క సామర్థ్యము చేతను, మనస్సే భోక్త్రాది సకలప్రపంచమును సృజించుచున్నది.

(ఆశంక) ఆ సమయమునందు గూడ భోక్తయగు జీవుడు ఉన్నాడు కదా? మనస్సు భోక్తనుకూడ సృజించుట అనునది ఎట్లు అని ఆశంక కలుగవచ్చును.

(సమాధానము) కాని భోగ్యవస్తువులులేనిచో భోక్తృత్వము కూడ ఉండదు గాన, భోగ్యపదార్థముల సృష్టికి కారణభూతమగు మనస్సే భోగ్యముల నందించుట ద్వారా జీవునకు భోక్తృత్వమును కల్పించుచున్నది గాన భోక్తృస్రష్టయని గూడ చెప్పబడుచున్నది. తథైవ=స్వప్నమునందు వలెనే, జాగ్రదవస్థలో గూడ, మనస్సే సర్వము ను సృజించుచున్నది. విశేషమేమియు లేదు. కావున, ఏతత్ సర్వం= ఈ జగత్తు అంతయు, మనస్సుయొక్క, విజృంభణం= విలాసమే.

అవ. ఈ విషయమునే వ్యతిరేకముఖమున దృఢీకరించుచున్నాడు-

సుషుప్తికాలే మనసి ప్రలీనే
నైవాస్తి కించిత్ సకలప్రసిద్ధేః,
అతో మనఃకల్పిత ఏవ పుంసః
సంసార ఏతస్య న వస్తుతోఽస్తి. 173

సుషుప్తికాలే = సుషుప్త్యవస్థయందు, మనసి = మనస్సు, ప్రలీనే= పరిణామములను విడచి కారణస్వరూపమున ఉన్నదగుచుండగా, జగత్= జగత్తు, కించిత్ = ఏమియు, నైవాస్తి = లేదు, సకలప్రసిద్ధేః = నాకు అపు డేమియు తెలియలేదు, అని సర్వప్రాణుల అనుభవ మున్నది కదా? అతః=ఆ కారణమువలన, ఏతస్య = బద్ధుడైన, పుంసః =పురుషునియొక్క, సంసారః = సంసారము, మనఃకల్పితఏవ = మనస్సుచే కల్పింపబడినదే, వస్తుతః= పరమార్థమున, నాస్తి = లేదు. స్వప్నజాగ్రదవస్థలలో మనస్సు ఉన్నపుడు సంసారము కనబడుచున్నది; సుషుప్తిలో అది లేనపుడు, కన బడుట లేదు, కావున మట్టియొక్క అన్వయవ్యతిరేకములను అనుసరించు (మట్టిఉన్నపుడే ఉండి, లేనపుడు లేని) ఘటము మట్టికంటె వేరుగ లేనట్లు మనస్సుకంటె భిన్నముగ సంసారము లేదు అని "తస్మిన్వినష్టే" ఇత్యాదివాక్యముచే పూర్వము (171 శ్లో) చెప్పబడిన విషయమే విశదీకరింప బడినది.

అవ. వాయుదృష్టాంతముచే, ఒక్క మనస్సే రెండు విరుద్ధ కార్యములకు హేతువని చెప్పుచున్నాడు—

వాయునా నీయతే మేఘః పునస్తేనైవ లీయతే,
మనసా కల్ప్యతే బన్ధః మోక్ష స్తేనైవ కల్ప్యతే. 174

మేఘః = మేఘము, వాయునా = వాయువుచేత, నీయతే = తీసికొని వెళ్లబడుచున్నది(ఒకచోట ఏర్పరుపబడుచున్నది) పునః=మరల, తేనైవ= ఆ వాయువుచేతనే, లీయతే =అణగిపోవుచున్నది. (చెదరగొట్టబడుచున్నది) బన్ధః = బంధము, మనసా = మనస్సుచే, కల్ప్యతే = కల్పింపబడుచున్నది. మోక్షః = మోక్షము, తేనైవ= దానిచేతనే, కల్ప్యతే= కల్పింపబడుచున్నది. (వ్యా. శ్రీచరణులు దానిని స్పష్టార్థమని వ్యాఖ్యానింప లేదు.)

అవ. దార్ష్టాంతికమగు మనస్సునందు మోక్షహేతుత్వమును ఉపపాదించుచున్నాడు—

దేహాదిసర్వవిషయే పరికల్ప్య రాగం
బధ్నాతి తేన పురుషం పశువద్గుణేన
వైరస్య మత్ర విషవత్సు విధాయ పశ్చా
దేనం విమోచయతి తన్మన ఏవ బన్ధాత్. 175

దేహాదిసర్వవిషయే = దేహాదులును, శబ్దస్పర్శాదులును, పుత్రాదులును అగు సకలవిషయములందును, శబ్దాదులయందు రాగమునకుకూడ దేహమే మూలముగాన 'దేహాది' అని చెప్పబడినది. రాగం = ఆసక్తిని, పరికల్ప్య = దృఢముగ కలిగించి, తేన = ఆ రాగముతో, గుణేన = త్రాడుతో పశువత్ = పశువునువలె, పురుషం = పురుషుని, బధ్నాతి = బంధించుచున్నది. తనకు ఇష్టమైన పరమపదమును పొందుటకు అయోగ్యునిగ చేయుచున్నది. పశ్చాత్ = అనంతరము, తత్ మనః ఏవ = ఏ మనస్సు బంధమును కల్పించినదో ఆ మనస్సే, అత్ర = ఈ దేహాదివిషయమునందు, వైరస్యం = వైరాగ్యమును, అనాసక్తిని, విషే ఇవ = విషమునందువలె, అనర్థకరమని తెలుపుటద్వారా, సువిధాయ = బాగుగ పుట్టించి, ఏనం = ఈ పురుషుని, బంధాత్ = దేహాదులందు అభిమానరూపమగు బంధమునుండి, విమోచయతి = పూర్తిగ విడిపించుచున్నది. ఎల్లప్పుడును బ్రహ్మయందు ఉండుటచే దేహాదికమునందు మరల అభిమానము కలుగకుండునట్లు చేయును అని యర్థము.

అవ. ఇంతవరకును చెప్పబడిన బంధమోక్షహేతుత్వమును ముగించుచున్నాడు

తస్మాన్మనః కారణ మస్య జన్తో
ర్బన్ధస్య మోక్షస్య చ వా విధానే,
బన్ధస్య హేతు ర్మలినం రజోగుణై
ర్మోక్షస్య హేతు ర్విరజస్తమస్కమ్. 176

తస్మాత్ = ఆ కారణమువలన, అస్య = ఈ, జన్తోః = ప్రాణియొక్క, బన్ధస్య = బంధముయొక్కగాని, మోక్షస్య చ వా = మోక్షముయొక్కగాని,

విధానే = ఉత్పాదనమునందు, మనః = మనస్సు. కారణం – "మన ఏవ మనుష్యాణాం" ఇత్యాది శ్రుతి ననుసరించి, కారణము. ఒకే పదార్థము విరుద్ధములగు రెండు కార్యములకు ఎట్లు కారణమగును అను ఆశంకకు సమాధానము చెప్పుచున్నాడు – రజోగుణైః=రజోగుణములచేత, రజస్సు వలన బహువిధములగు ప్రవృత్తులు కలుగుచుండునుగాన 'రజోగుణైః' అను బహువచనము ప్రయుక్తమైనది. లేదా నానావిధము లగుటచే బహిర్ముఖత్వమును కల్పించు కామక్రోధలోభాదులగు రజోధర్మములచేత అని అర్థము. మలినం = కలుషితమైన మనస్సు, బన్ధస్య = బంధమునకు, హేతుః= హేతువు, విరజస్తమస్కం= రజస్తమోగుణరహితమగు నిర్మల మైన మనస్సు, మోక్షస్య హేతుః = మోక్షమునకు హేతువు. కావున మనస్సు ఒక్కటే యైనను గుణభేదమునుబట్టి కాలభేదముచే, విరుద్ధము లగు రెండింటికి హేతువుగానుండుట విరుద్ధము కాదని భావము.

అవ. మోక్షహేతువగు మనశ్శుద్ధిని సంపాదించుట ఎట్లు అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు—

వివేకవైరాగ్య గుణాతిరేకా
చ్ఛుద్ధత్వ మాసాద్య మనో విముక్త్యై,
భవత్యతో బుద్ధిమతో ముముక్షో
స్తాభ్యాం దృఢాభ్యాం భవితవ్య మగ్రే. 177

వివేకవైరాగ్యగుణాతిరేకాత్=వివేకవైరాగ్యగుణములయొక్క అతి శయమువలన. శుద్ధత్వం = శుద్ధత్వమును, ఆసాద్య = పొంది, మనః= మనస్సు, విముక్త్యై=మోక్షముకొరకు, భవతి= అగును, అతః = ఆ కార ణమువలన, బుద్ధిమతః = బుద్ధిమంతుడగు, ముముక్షోః= మోక్షేచ్ఛ కల వానికి, తాభ్యాం = ఆ రెండును, అగ్రే = ముందుగనే, దృఢాభ్యాం = దృఢ మైనవిగ, భవితవ్యం = కాదగినది (కావలెను.)

వివేకవైరాగ్యములే గుణములు, అనగా సత్ఫలము నిచ్చెడి ధర్మములు. వాటియొక్క, అతిరేకః=అతిశయము—అనగా దృఢమైన

వివేకము. తీవ్రతరమైన వైరాగ్యము. దానివలన బ్రహ్మయే సత్యము, జగత్తు మిథ్యాభూతము అను నిశ్చయము కలిగిన పిమ్మట మిథ్యాభూతమగు వస్తువునందు కామము కలుగదు గాన బ్రహ్మలోకము వరకును అన్నివిషయములయందును అధికమగు వైరాగ్యము కలుగును. ఎట్టి కామముల బెడద లేకుండుటయే శుద్ధి' యను శబ్దమున కర్థము. ఆ గుణద్వయముతో గూడిన మనస్సు నిర్మలత్వమును పొంది, విముక్త్యై = బహిర్ముఖత్వము లేకుండుటచే ఏకాగ్రతతో బ్రహ్మయందు స్థిరమై ఆత్యన్తికబన్ధ నివృత్తికి హేతు వగును. అతః= వివేక వైరాగ్యాతిరేకములతో గూడిన మనస్సు విముక్తికి కారణమగుటవలన, బుద్ధిమతః = బుద్ధిమంతుడైన, అనగా ఉపాయ కుశలుడైన, మోక్షరూపఫలమును కోరువానికి, ముందుగ, ఆ వివేక వైరాగ్యములు రెండును, దృఢాభ్యాం=శిథిలముకానివై, ప్రకృష్టములై ఉండవలెను. ఫలేచ్ఛ ఉపాయేచ్ఛకు కారణము గాన ఆ ఉపాయము దృఢముగ నుండవలెను. మోక్షేచ్ఛగలవాడు ముందుగ వివేకవైరాగ్యములను ప్రయత్నపూర్వకముగ సంపాదించినచో ఫలము తప్పక కలుగునని చెప్పినట్లైనది.

అవ. మోక్షముకొరకై మనస్సును నిర్విషయము చేయుటకై, అనగా విషయములనుండి మరల్చుటకై, వివేకవైరాగ్యములు హేతువులని చెప్పి,

"రత్నే యది శిలాబుద్ధి ర్జాయతే వా భయం తతః,
సమీచీనత్వధీర్నైతి నోపాదేయత్వధీరపి."

రత్నమునందు రాతిముక్కయను బుద్ధిగాని, దానివలన భయముగాని కలిగినచో ఇది మంచిది అను బుద్ధిగాని, ఇది గ్రహింపదగినది అను బుద్ధిగాని కలుగదు అని చెప్పినవిధముగ వస్తువిచారమువలె భయము గూడ భయహేతువునుండి మరలిపోవుటకు కారణముగాన, 'మనః' ఇత్యాదిశ్లోకమున, వాటియందు (విషయములయంద) భయమును

చెప్పుచు, భయము కల్గించుటద్వారా దయచే, వాటినుండి మరల్చు చున్నాడు-

మనో నామ మహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు,
చరత్యత్ర న గచ్ఛన్తు సాధవో యే ముముక్షవః. 178

విషయారణ్యభూమిషు=అనేకములైన అనర్థములతో సంకుల మగుటచేతను, "విషయాంస్తేషు గోచరాన్"- విషయములను ఇంద్రియ ములు సంచరించు మార్గములనుగా తెలిసికొనుము అను శ్రుతిచేతను, విషయములే అరణ్యభూములు, వాటియందు; మనో నామ=మనస్సు అను పేరుగల, మహావ్యాఘ్రః=గొప్పవ్యాఘ్రము, చరతి=సంచరించు చున్నది. 'పరాంచి ఖాని' ఇంద్రియములను బహిర్ముఖములనుగ సృజించెను అను శ్రుతి ననుసరించి, జలమునకు పల్లమువైపు ప్రవహించుట ఎట్లు స్వభావమో అట్లే మనస్సునకు విషయములపై ఆసక్తి స్వాభావి కము. అందుచే "బంధాయ విషయాసక్తమ్" అను శ్రుతి ననుసరించి జీవునకు గొప్ప అనర్థము కలుగును. ఈ విషయము-

సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే,
క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్స్మృతి విభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశః, బుద్ధినాశాత్ప్రణశ్యతి.

అని భగవద్గీతలో చెప్పబడినది. ఆ కారణమువలన, యే=ఏ, సాధవః= సత్పురుషులు, ముముక్షవః=మోక్షేచ్ఛ కలవారో వారు, అత్ర=ఈ విషయా రణ్యభూములయందు, న గచ్ఛన్తు=వెళ్లకుందురుగాక. మోక్షముకొరకై, విషయములనుండి మనస్సును మరల్చుకొందురుగాక అని అభిప్రాయము. "కశ్చిద్ధీరః ప్రత్యాగాత్మానమైక్ష దావృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్" — మోక్షమునుకోరు ఎవ్వడో ఒక ధీరుడు వెనుకకు మరల్చబడిన దృష్టిగల వాడై ప్రత్యగాత్మను చూచెను అని శ్రుతి చెప్పుచున్నది.

అవ. "మనస్సుకంటె భిన్నమైన అవిద్య లేదు" అని పూర్వోక్త మగు విషయమును ఉపపాదించుచు మనస్సు ఎట్లు బంధకమో నాలుగు శ్లోకములచే విశదీకరించుచున్నాడు-

మనః ప్రసూతే విషయానశేషాన్
స్థూలాత్మనా సూక్ష్మతయా చ భోక్తుః,
శరీరవర్ణాశ్రమజాతిభేదాన్
గుణక్రియా హేతుఫలాని నిత్యమ్. 179

మనః=మనస్సే, భోక్తుః=భోక్తయైనజీవునకు, స్థూలాత్మనా= స్థూలస్వరూపముననను, సూక్ష్మతయా చ=సూక్ష్మరూపముననను, శరీరవర్ణాశ్రమజాతిభేదాన్ =శరీరము, వర్ణములు, ఆశ్రమములు, జాతులు మొదలగు భేదములు కలవియు, గుణక్రియాహేతుఫలాని = గుణములు, క్రియలు, వాటి హేతువులు, ఫలములు అనెడు, అశేషాన్ = సమస్తమైన, విషయాన్=విషయములను, ప్రసూతే = కనుచున్నది.

జీవునకు, జాగ్రదవస్థయందు, స్థూలాత్మనా=ఆ యా దేవతలచే అనుగృహీతములగు ఆ యా ఇంద్రియములవలన కలిగిన అనుభవములకు విషయములగు విధమున స్థూలరూపముననను, స్వప్నావస్థయందు ఇంద్రియములు ఉపరతములగుటచే, సూక్ష్మతయా చ= కేవల సాక్షిమాత్ర వేద్యరూపముననను, సమస్త భోగ్యపదార్థములను మనస్సే పుట్టించుచున్నది. ఆ విషయములు ఏవి అను ఆకాంక్షతో చెప్పుచున్నాడు. శరీర .... భేదాన్=శరీరములు, వర్ణములు, ఆశ్రమములు, జాతులు, వాటియొక్క భేదములను, అనగా - దేవతిర్యఙ్మనుష్యాది శరీరములను, బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రరూప వర్ణములను, బ్రహ్మచారిగృహస్థవానప్రస్థ సంన్యాసాశ్రమములను, దేవమనుష్యాది శరీరములను, దేవతాదిజాతులను పుట్టించుచున్నది. సుషుప్త్యాదులలో మనస్సు లేనపుడు ఈ భేదములు కూడ లేవు గాన ఇదియంతయు మనస్సుచేతనే కల్పితమని అభిప్రాయము. ఇట్లే, గుణక్రియా హేతుఫలాని- గుణాః=శబ్దాదిగుణములు, క్రియాః= పైకి ఎత్తుట మొదలగు క్రియలు, హేతవః=ఆ యా కార్యముల నిమిత్తకారణోపాదాన కారణములు; ఫలాని = ఘటాదులైన ఆ యా కార్యములు, దీనినంతను మనస్సే ఎల్లపుడును పుట్టించుచున్నది.

దీనికి మరియొక నిమిత్తమేదియును లేదు. మనస్సులేనిచో ఏదియు ఉండుటలేదుకదా? కావున మనస్సే అంతకును మూలకారణమని భావము. 'శరీర....భేదాన్' అనునపుడు 'భిద్యన్తే ఇతి భేదాః' భేదించునవి కాన భేదములు అను వ్యుత్పత్తి ననుసరించి 'వేరువేరుగనుండు పదార్థములు,' అను నర్థము వచ్చును గాన 'శరీరములు, వర్ణములు, ఆశ్రమములు, జాతులు, భేదములు అని కర్మధారయ సమాసమైనను చెప్పుకొనవచ్చును.

అసంగచిద్రూప మముం విమోహ్య
దేహేన్ద్రియప్రాణగుణై ర్నిబధ్య,
అహం మమేతి భ్రమయత్యజస్రం
మనః స్వకృత్యేషు ఫలోపభుక్తిషు. 180

మనః = మనస్సు, అసంగ చిద్రూపం = సంగరహితమగు చిత్ అనగా అఖండజ్ఞానమే రూపముగాగల, అముం = ఈ ఆత్మను, దేహేన్ద్రియప్రాణగుణైః = దేహము యొక్కయు, ఇంద్రియములయొక్కయు, ప్రాణము యొక్కయు గుణములచే, విమోహ్య = తన వాస్తవరూపమును తెలిసికొనుటకు అసమర్థునిగచేసి, ఆ దేహేంద్రియ ప్రాణగుణములయందే నిబధ్య=బంధించి, దేహేంద్రియములయందు 'నేను' అను అభిమానమును, వాటిధర్మములయందు 'నావి' అను అభిమానమును కల్పించి, అజస్రం= ఎల్లప్పుడును, స్వకృత్యేషు=తన కృత్యములయందు, లౌకికవైదికకర్మలయందును, ఫలోపభుక్తిషు=ఆ యా కర్మలవలన కలుగు ఫలముల భోగములయందును, భ్రమయతి = పైకిని క్రిందకును తీసికొనిపోవుచున్నది.

"కుర్వతే కర్మ భోగాయ కర్మ కర్తుం చ భుంజతే"-భోగములకొరకై కర్మ చేయుచున్నారు, కర్మచేయుటకై అనుభవించుచున్నారు అని చెప్పబడినది. శ్రుతి కూడ -

ఆత్మానం చేద్విజానీయా దహమస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్.

ఆ పరమాత్మయే నేను అని పురుషుడు తెలిసికొన్నచో, ఏమి కోరుచు, ఏ కామముకొరకై, తపించుచున్న శరీరమును అనుసరించి తాపముచెందును? అని చెప్పుచున్నది. కావున అసంగము, చిదానందరూపము అగు తన స్వరూపమును తెలిసికొనిన పురుషుడు ఏమియు కోరడు; ఏ కర్మలను ఆచరింపడు. కావున కర్తృత్వమైనను, భోక్తృత్వమైనను దేహేంద్రియాద్యభిమానమునుబట్టి వచ్చినదే. సుషుప్తిలో మనస్సు లీనమై పోవుటచే ఆ సమయమున ఈ అభిమానము లేదు. అందుచే అభిమానమునకు మూలకారణముమనస్సే. కావున అవిద్య అనునది ఒకటి ఉన్నను అది మనస్సు లేనిచో బంధహేతువు కాజాలదు. అందుచే మనస్సే సర్వబంధహేతువని అభిప్రాయము.

అవ. ఇపుడు, ఆ మనస్సు బంధముద్వారా దుఃఖహేతువని చెప్పుచున్నాడు-

అధ్యాసయోగాత్పురుషస్య సంసృతిః
అధ్యాసబన్ధస్త్వమునైవ కల్పితః,
రజస్తమోదోషవతోఽవివేకినో
జన్మాదిదుఃఖస్య నిదానమేతత్. 181

రజస్తమోదోషవతః = రజోగుణము, తమోగుణము అనెడు దోషము కలిగినట్టియు, అనగా ఆవరణవిక్షేపములకు హేతువులగు దోషద్వయముతో కూడినట్టియు, కావుననే, అవివేకినః = ఆత్మానాత్మభేదజ్ఞాన శూన్యుడైన, పురుషస్య = పురుషునకు, అధ్యాసయోగాత్ = అనాత్మలయందు ఆత్మబుద్ధి వలన, సంసృతిః = అవిచ్ఛిన్నమగు జన్మమరణ పరంపర, కలుగుచున్నది. సంసృతికి కారణమగు అధ్యాసకు మూలము మనస్సు అని చెప్పుచున్నాడు:- అధ్యాసబన్ధః తు = అధ్యాసరూపమగు బంధముకూడ, అమునైవ = ఈ మనస్సుచేతనే, కల్పితః = కల్పితమైనది. 'మనః ప్రసూతే' ఇత్యాది వాక్యమున (శ్లో. 179) శరీరేంద్రియాదులు మనస్సుచే పుట్టింపబడుచున్నవి అని చెప్పబడినది. ఇపుడు వాటిపై అధ్యాసము కూడ మనస్సుచేతనే కల్పితమగుచున్నది అని 'అపి' శబ్దార్థకమగు 'తు' శబ్దముచే ఇచట చెప్పబడినది. ఈ విధముగ అవిచ్ఛిన్న జన్మమరణపరంపరా

రూపమైన సంసారమునకు హేతువగు అధ్యాసకు హేతువగుటచే, ఏతత్ = ఈ మనస్సే, జన్మాదిదుఃఖస్య = జన్మమరణ జరారోగాదులవలన కలిగిన సకలవిధదుఃఖమునకు, నిదానం = ఆదికారణము.

అతః ప్రాహు ర్మనోఽవిద్యాం పణ్డితాస్తత్త్వదర్శినః,
యేనైవ భ్రామ్యతే విశ్వం వాయునేవాభ్రమణ్డలమ్. 182

తత్త్వదర్శినః = తత్త్వము చూచెడుస్వభావముగల, పండితాః = వేదాన్తశ్రవణముచేసిన పురుషశ్రేష్ఠులు, అతః = సంసారమునకు మూల కారణ మగుటవలన, మనః = మనస్సును, అవిద్యాం = అవిద్యనుగా, ప్రాహుః = చెప్పుచున్నారు. మనస్సు అవిద్యాకార్యమగుట వలనను, మనస్సహాయములేని అవిద్య సంసారహేతువు కాజాలదు కావునను, మనస్సే అవిద్యయని చెప్పుట యుక్తమే యని సూచించుటకై 'ప్ర' అను ఉపసర్గ ప్రయోగింపబడినది. ఇందులకు కారణము, యేనైవ = ఏ మనస్సుచేతనే, విశ్వం = సమస్తమైన జగత్తు, అనగా అందరు జీవులును, వాయునా = వాయువుచేత, అభ్రమండలమివ = మేఘసముదాయమువలె, భ్రామ్యతే = భ్రాంతికలవారగుటచే పైకిని క్రిందికిని త్రిప్పబడుచున్నదో.

అవ. ఇపుడు ముముక్షుజనులు చేయవలసిన పని చెప్పుచున్నాడు-

తన్మనఃశోధనం కార్యం ప్రయత్నేన ముముక్షుణా,
విశుద్ధే సతి చైతస్మిన్ ముక్తిః కరఫలాయతే. 183

తత్ = పూర్వోక్తకారణమువలన, అనగా రజస్తమోదోషముగల మనస్సు పురుషునకు అధ్యాసద్వారా సంసృతికి కారణమగుటవలన, ముముక్షుణా = మోక్షేచ్ఛగలపురుషునిచేత, ప్రయత్నేన = అత్యధికమగు యత్నముచే, మనఃశోధనం = మనస్సులోనున్న రజస్తమోరూపములగు దోషముల అపనయనము, కార్యం = చేయదగినది. 'చ' అనుదానికి 'ఏ కారణమువలన' అని యర్థము. ఏతస్మిన్ = ఈ మనస్సు, విశుద్ధే = రజస్తమోవిహీనమైనదై కేవలసత్త్వప్రధానమైనదగుచుండగా, ముక్తిః = మోక్షము, కరఫలాయతే = అరచేతిలోని పండువంటిదగును. స్పష్టముగ వేద్యమగునని యర్థము

అవ. మనఃశుద్ధికై ప్రయత్నమెట్లుచేయవలెనో చెప్పు చున్నాడు-

మోక్షైకసక్త్యా విషయేషు రాగం
నిర్మూల్యసంన్యస్య చ సర్వకర్మ,
సచ్ఛ్రద్ధయా యః శ్రవణాదినిష్ఠో
రజస్స్వభావం స ధునోతి బుద్ధేః. 184

మోక్షైకసక్త్యా = ఒక్క మోక్షమునందే ఆసక్తిచేత, అనగా తీవ్ర మగు మోక్షేచ్ఛచేత, విషయేషు = దేహాది విషయములయందు, రాగం = **అవిసుఖజనకములు అనెడు భ్రాంతిచే వాటిపైకలిగిన ఆసక్తిని, నిర్మూల్య** = అహంకారమును పరిత్యజించుటచే నిర్మూలించి, సర్వకర్మ = నిష్కామ కర్మలను నైమిత్తికకర్మలను, సంన్యస్య = విడచి, సచ్ఛ్రద్ధయా = సత్తు నందు అనగా కాలత్రయాబాధ్యమగు బ్రహ్మమునందు శ్రద్ధచే, లేదా గురువేదాన్తవాక్యములయందు అచంచలమైన శ్రద్ధతో, యః = ఏ పురుషుడు, శ్రవణాదినిష్ఠః = శ్రవణాదులయందు స్థిరముగ నుండునో, బుద్ధేః = బుద్ధి యొక్క, (బుద్ధియందున్న) రజఃస్వభావం = రజోగుణముయొక్క స్వభావమైన విక్షేపమును, ధునోతి = విదల్చుకొనును, అనగా పూర్తిగ **నశింపజేసికొనును.**

దేహాదులపై రాగమున్నపుడు కర్మచేయును, కర్మయున్నచో విక్షేపము. రాగనిర్మూలనముచే సకలకర్మను విడచి శ్రవణాదులచే అన్తర్నిష్ఠుడగు శ్రద్ధావంతునకు బుద్ధివిక్షేపము కలుగుటకు అవకా శమే ఉండదు. కావున విరక్తుడగు సంన్యాసి బుద్ధిదోషములను తొల గించుకొనుటకై, శ్రద్ధగ శ్రవణాదికము చేయవలెనని చెప్పినట్లైనది.

అవ. ఇపుడు మనోమయము అనాత్మయను విషయమును ముగించుచున్నాడు-

మనోమయో నాపి భవేత్పరాత్మా
హ్యాద్యన్తవత్త్వాత్ పరిణామిభావాత్,
దుఃఖాత్మకత్వా ద్విషయత్వహేతోః
ద్రష్టా హి దృశ్యాత్మతయా న దృష్టః. 185

ఆద్యన్తవత్త్వాత్ = ఆద్యన్తములుకలిగి యుండుటవలన, పరిణామిభావాత్ = పరిణామము పొందుచుండుటవలనను, దుఃఖాత్మకత్వాత్ = దుఃఖస్వరూపమగుటవలనను, విషయత్వహేతోః = విషయమగుటవలనను, మనోమయోఽపి = మనోమయము కూడ, పరాత్మా = పరమాత్మ, న భవేత్ = కాజాలదు.

'మనోమయము కూడ పరమాత్మ కాదు' అని అన్వయము. అందులకు హేతువులు సంగ్రహింపబడుచున్నవి. ఆద్యన్తవత్త్వాత్ = సుషుప్తియందు లయమును పొందుచు జాగ్రదాదులయందు పుట్టుచు మనోమయము ఆద్యన్తము కలదగుటచే, అది ఆద్యన్తశూన్యమగు ఆత్మ కాజాలదు. ఇట్లే, పరిణామిభావాత్ = పరిణామమును చెందుటవలనను, అనగా కామసంకల్పాది రూపమున పరిణామమును (వికారమును) చెందుటచే ఇది వికారరహితమగు ఆత్మ కాజాలదు. దుఃఖాత్మకత్వాత్ = దుఃఖముస్వరూపముగా కలదగుటవలనను, కావుననే ఇది నిరోధింపబడుచుండును; శోధింపబడుచుండును. మనస్సు అధ్యాసద్వారా ఎట్లు దుఃఖహేతు వగుచున్నదో వెనుక ఉపపాదింపబడినది. కావున ఇది ఆనందరూపమైన ఆత్మ కాజాలదు. విషయత్వహేతుః = విషయమగుచున్నది అనెడు హేతువువలనను.

అన్యత్రమనా అభూవం నాద్రాక్షమ్,
అన్యత్రమనా అభూవం నాశ్రౌషమ్.

నా మనస్సు ఎచటనో ఉండెను, అందుచే వినలేదు; నా మనస్సు ఎచటనో ఉండెను, అందుచే వినలేదు అను శ్రుతిననుసరించి మనస్సు

సాక్షిచే విషయముగ చేసికొనబడుచున్నది గాన ఈ విషయత్వరూప హేతువువలనగూడ, ఇది, సర్వసాక్షియైన ఆత్మ కాజాలదు. హి= ఎందువలనఅనగా, ద్రష్టా=చూచువాడు అనగా జ్ఞాత, దృశ్యాత్మతయా=విషయస్వరూపుడుగ, న దృష్టః=లోకప్రసిద్ధుడుకాడు. ఈ విధముగ మనస్సు ఉన్నపుడును అది లేనపుడును, ఎల్లప్పుడునుగూడ, సాక్షిచే దానియొక్క ఉనికియు, లేకపోవుటయు తెలియబడుచుండుటచేతను, కర్మకర్తృవిరోధముచే తన్ను తానే చూచుట అనునది విరుద్ధముకావునను, దృశ్యమైనమనస్సు ద్రష్టృస్వరూపమగు ఆత్మ కాజాలదు గాన అది అనాత్మయను విషయము సిద్ధము.

అవ. ఇపుడు విజ్ఞానమయకోశమును నిరూపించుచున్నాడు—

## విజ్ఞానమయకోశము

బుద్ధిర్బుద్ధీన్ద్రియైః సార్థం సవృత్తిః కర్తృలక్షణః,
విజ్ఞానమయకోశః స్యాత్ పుంసః సంసారకారణమ్. 186

బుద్ధీన్ద్రియైః సార్థం=బుద్ధీంద్రియములతోకూడ, సవృత్తిః=నిశ్చయాత్మకమగు వృత్తిగల, బుద్ధిః=బుద్ధి, కర్తృలక్షణః=కర్తృత్వలక్షణముకలదియు, పుంసః=పురుషునియొక్క, సంసారకారణం=సంసారమునకు కారణమైన, విజ్ఞానమయ కోశః=విజ్ఞానమయకోశముగ, స్యాత్=అగును.

బుద్ధీన్ద్రియైః సార్థం=శ్రోత్రాది పంచేంద్రియములతోకూడ, సవృత్తిః=నిశ్చయాత్మకవృత్తితో కూడిన, బుద్ధిః=బుద్ధి, కర్తృలక్షణః=జ్ఞానేచ్ఛాకర్తృత్వము లక్షణముగాగల, విజ్ఞానమయకోశమగును. 'పుంసః' ఇత్యాదివాక్యముచే దానికార్యమును చెప్పుచున్నాడు. పుంసః=ఆత్మయొక్క, సంసారకారణం=సంసారమునకు కారణమైనది. "స సమానస్సన్నుభౌ లోకావనుసంచరతి, స ధీః

స్వప్నో భూత్వా ధ్యాయతీవ లేలాయతీవ” ఇత్యాదిశ్రుతుల ననుసరించి ఒకే అన్తఃకరణము సంశయాత్మకవృత్తి కలదై యున్నపుడు మనస్సు అనియు, నిశ్చయాత్మకవృత్తికలదై యున్నపుడు బుద్ధి యనియు చెప్పబడుచున్నది. అందును, నిశ్చయించిన పిమ్మట క్రియ చేయుదురుగాన మనస్సు కరణము, బుద్ధి కర్త, కావున పూర్వాపరభావముండుటచే (అనగా బుద్ధిముందు, మనస్సు తరువాత ఉండుటచే) మనస్సు బాహ్యము, బుద్ధి ఆంతరము. కావున మనోమయము తరువాత బుద్ధ్యాత్మకమగు విజ్ఞానమయము వేరుగ చెప్పబడినది. అట్లుకానిచో ఐదు జ్ఞానేంద్రియములును మనోమయ బుద్ధిమయములు రెండింటియందును భేదము లేకుండనుండుటచే ఈ రెండునుకూడ అభిన్నములని చెప్పవలసివచ్చును. ఈ విషయమును బోధించు-“తస్మాద్వా ఏతస్మాన్మనోమయాత్ అన్యోఽన్తర ఆత్మా విజ్ఞానమయః” అను శ్రుతికి కూడ ఇదే అభిప్రాయము.

అనువ్రజచ్చిత్ప్రతిబిమ్బశక్తిః
విజ్ఞానసంజ్ఞః ప్రకృతేర్వికారః,
జ్ఞానక్రియావా నహమిత్యజస్రం
దేహేన్ద్రియాదిష్వభిమన్యతే భృశమ్. 187

అనువ్రజచ్చిత్ప్రతిబిమ్బశక్తిః=అనుసరించుచున్నచిత్ప్రతిబింబము యొక్క శక్తి కలదియు, జ్ఞానక్రియావాన్=జ్ఞానము క్రియయుగలదియు అగు, విజ్ఞానసంజ్ఞః=విజ్ఞానమనెడు సంజ్ఞగల, ప్రకృతేర్వికారః=ప్రకృతి యొక్క వికారమైన ఈ కోశము, అజస్రం=ఎల్లప్పుడును, దేహేన్ద్రియాదిషు=దేహేంద్రియాదులయందు, అహమితి=అహం అని, భృశం= మిక్కిలి, అభిమన్యతే=అభిమానముచెందుచుండును.

బుద్ధి భూతపంచకమునందలి సత్త్వముయొక్క సమష్టికార్యమగుటచే స్వచ్ఛమైనది. అందుచే దానియందు చిత్తు తప్పక ప్రతి

బింబించును. ఈ విధముగ అనుసరించుచున్న చిద్రూపమగు పరమాత్మయొక్క ప్రతిబింబమైన ఏ జీవుడు గలడో ఆ జీవునియొక్క భానకత్వశక్తి కలది. ప్రకాశకమగు దాని ప్రతిబింబము గూడ ప్రకాశకముగనే ఉండునుకదా? అద్దము మొదలైన వాటియందు ప్రతిబింబించిన సూర్యప్రతిబింబము, సూర్యకిరణములు ప్రవేశింప శక్యముకాని అంధకారావృతములగు భూవివరాదులందున్న వస్తువులను ప్రకాశింపజేయుట లోకప్రసిద్ధమే కదా? కావున 'అనువ్రజచ్చిత్ప్రతిబింబశక్తిః' అనగా చిత్తు అనుప్రవేశముచేయుటవలన చిద్విశిష్టమైనది అని యర్థము. కావుననే, విజ్ఞానసంజ్ఞః = "విజ్ఞానం యజ్ఞం తనుతే" అను శ్రుతిననుసరించి విజ్ఞానమను పేరుగలది. ప్రకృతేః = మూలప్రకృతియొక్క అవిద్యయొక్క, వికారః = వికారమైనది. సూక్ష్మభూతపంచకము అవిద్యాకార్యము. బుద్ధి సూక్ష్మభూతపంచకమునందలి సత్త్వముయొక్క సమష్టికార్యము. ఈ విధముగ బుద్ధి (విజ్ఞానమయకోశము) పరంపరయా అవిద్యాకార్యము. జ్ఞానక్రియావాన్ = వృత్త్యాత్మకమగు జ్ఞానము; విషయవిచారము, ధ్యానము, లోకాన్తరగమనాదిరూపము అగు క్రియ; ఈ రెండును కలది. దేహేంద్రియాదులయందు; "అన్తఃకరణమేతేషు" ఇత్యాదిశ్లోకమునందు (105) చెప్పినవిధమున జీవునకు దేహాదులందు అభిమానము బుద్ధిలేనిచో కలుగదుగాన జీవత్వమే బుద్ధిరూపమగు ఉపాధినిబట్టి ఏర్పడుచున్నది. అందుచే ఈ కోశము అధ్యాసచే జీవునితో తాదాత్మ్యమునుపొందియున్నదిగాన (జీవాభిన్నముగ వివక్షితమైనది). కావున, అజస్రం = ఎల్లప్పుడును, జాగ్రత్స్వప్నములయందు, భృశం = మిక్కిలి, అహమిత్యభిమన్యతే = నేను మనుష్యుడను, స్థూలముగనున్నాను, నడచుచున్నాను, నిలచియున్నాను, దాటుచున్నాను, నేను చూచుచున్నాను, నేను వినుచున్నాను, నేను ఊపిరి పీల్చుచున్నాను, ఊపిరి విడచుచున్నాను ఇత్యాదివిధమున తాదాత్మ్యాభిమానము కలవాడగుచున్నాడు గాన ఈ కోశము జ్ఞానముకలది అను విషయము ఉపపాదితమైనది.

అవ. క్రియావత్త్వమును ఉపపాదించుచున్నాడు –

అనాదికాలోఽయ మహంస్వభావో
జీవ స్సమస్తవ్యవహారవోఢా,
కరోతి కర్మాణ్యనుపూర్వవాసనః
పుణ్యాన్యపుణ్యాని చ తత్ఫలాని. 188

భుజ్క్తే విచిత్రాస్వపి యోనిషు వ్రజ
న్నాయాతి నిర్యాత్యధ ఊర్ధ్వమేషః;
అస్యైవ విజ్ఞానమయ స్యజాగ్ర
త్స్వప్నాద్యవస్థాః సుఖదుఃఖభోగః. 189

అనాదికాలః = అనాదియైనకాలము కలవాడును, అహంస్వభావః = దేహేంద్రియాదులందు అహంవాసనకలవాడును, సమస్తవ్యవహారవోఢా = సమస్తవ్యవహారములను నిర్వహించు, అయం జీవః = ఈ జీవుడు, అనుపూర్వవాసనః = అనుసరించిన పూర్వవాసనలుకలవాడై పుణ్యాని = పుణ్యములైనవి, అపుణ్యాని చ = అపుణ్యములైనవి అగు, కర్మాణి = కర్మలను, కరోతి = చేయుచున్నాడు. తత్ఫలాని చ = వాటియొక్క ఫలములనుకూడ, విచిత్రాసు = విచిత్రములైన, యోనిషు = యోనులయందు, వ్రజన్ = వెళ్ళుచు, భుజ్క్తేఽపి = అనుభవించుచున్నాడుకూడ, ఏషః = ఈ జీవుడు, అధః అయాతి = క్రిందికి వచ్చును. ఊర్ధ్వం నిర్యాతి = పైకి వెడలును జాగ్రత్స్వప్నాద్యవస్థాః = జాగ్రత్స్వప్నాద్యవస్థలును, సుఖదుఃఖభోగః = సుఖదుఃఖముల భోగము, అస్య = ఈ, విజ్ఞానమయస్యైవ = విజ్ఞానమయమునకే సంబంధించినవి.

ఈ విజ్ఞానమయము ప్రకృతియొక్క వికారము అనిచెప్పుటచే ఇది సాదియనియే చెప్పవలసియున్నను ఇది అనాది యని చెప్పుటకు కారణ మేమనగా – మహాప్రళయసమయమునందు గూడ ఇనె కారణస్వరూపముతో అవ్యక్తముగ నుండును. అట్లుకాక పూర్వకర్మవాసనలకు ఆశ్రయమగు ఈ బుద్ధి పూర్తిగ నశించిపోవును అని చెప్పినచో

మరల సృష్టి అనుపపన్నమగును. మరియు సృష్టికాలమునందే 'అనేన జీవేనాత్మనా' - ఈ జీవరూపముతో ప్రవేశింతును ఇత్యాది శ్రుతిననుసరించి పరదేవత నామరూపములను వ్యాకరించుటకై అనగా అవ్యక్తముగనున్నవాటిని వ్యక్తము చేయుటకై చూచినట్లుగ చెప్పుటచేతను విదేహకైవల్యము కలుగునంతవరకును బుద్ధికి ఆత్యంతికవినాశముండదు. ఈ విధముగ పురుషుని సంసారమునకు కారణమైన బుద్ధికూడ అనాదియేయని తప్పక చెప్పవలసియున్నది. దీనివలన కలుగు దేహేంద్రియాభిమానము గూడ అనాదియే. అనగా ఈ సమయముననున్న దేహేంద్రియాభిమానము పూర్వము లేకున్నను, ఇపుడున్న అభిమానమువంటి అభిమానము ఉండెడిది. అట్టిది ముందు గూడ విదేహకైవల్యము కలుగువరకును ఉండగలదు. ఈ విధముగ ఈ దేహేంద్రియాభిమానము అనాది యని యర్థము. అనాదికాలః = అనాదియైనకాలము గలది. ఇది ఈ సమయమున ప్రారంభమైనది అని చెప్పుటకు శక్యము కాదు గాన అనాది. అయం = ఈ, అహం స్వభావః = దేహేంద్రియాదులయందు 'నేను' అనెడు స్వభావము, అనగా అభిమానము, అనగా వాసనకల, జీవుడు, సమస్తవ్యవహారవోఢా = "విజ్ఞానం యజ్ఞం తనుతే, కర్మాణి తనుతేఽపి చ"_ఈ విజ్ఞానాత్మయే యజ్ఞమును, కర్మలను చేయుచున్నది అను శ్రుతి ననుసరించి సమస్తములగు లౌకిక వైదిక వ్యవహారములను నిర్వహించువాడు. దీని ఉపపాదన చేయుచున్నాడు - అనుపూర్వవాసనః = పూర్వవాసనలు ఎవనిని అనుసరించుచున్నవో అట్టివాడు. "తం విద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వప్రజ్ఞా చ"_ఆ జీవుని పూర్వజన్మకు సంబంధించిన విద్యాకర్మలును, పూర్వప్రజ్ఞయు ఆరంభించుచున్నవి_ వేరువేరుస్వభావము కల వానినిగ చేయుచున్నవి అనియు, "పుణ్యోవై పుణ్యేన కర్మణా భవతి, పాపః పాపేన"_పుణ్యకర్మచే పుణ్యాత్ముడగును; పాపకర్మచే పాపాత్ముడగును అనియు శ్రుతి చెప్పుచున్నది. పుణ్యాని = శాస్త్రవిహితములు. అపుణ్యాని = శాస్త్రనిషిద్ధములు. శాస్త్ర

విహితములుకాని నిషిద్ధములుకాని యగు భోజనస్వాపాదులు ఉదాసీన కర్మలు. వీటి నన్నింటిని చేయుచున్నాడు. భోక్తృత్వమును చెప్పుచున్నాడు – తత్ఫలాని = చేయబడిన ఆ విహిత నిషిద్ధ కర్మలయొక్క ఫలములను, విచిత్రాసు = విచిత్రములైన, అనగా దేవతిర్యఙ్మనుష్యాదు లగు ఎనుబదిలక్షల భేదములుగల, యోనిషు = యోనులయందు, వ్రజన్ = సంచరించుచు, భుంక్తేఽపి = సుఖదుఃఖానుభవము కల వాడగుచున్నాడు. అందునిమిత్తమై, అధః = నరకాదులందు, ఆయాతి = వచ్చుచున్నాడు, ఊర్ధ్వం = స్వర్గాదిలోకములందు, నిర్యాతి = పైకివెళ్లుచున్నాడు. ఏషః = ఈ జీవుడు, నేను మెలకువగ నున్నాను, నేను నిద్రపోవుచున్నాను, నేను నిద్రించితిని, నేను సుఖవంతుడను, నేను దుఃఖవంతుడను ఇత్యాదివిధమున ఆత్మయందున్నట్లు కనబడుచున్న ధర్మము లన్నియు ఈ బుద్ధితో ఏర్పడిన తాదాత్మ్యాభిమానముచేతనే ఏర్పడుచున్నవి అని బోధించి దీని నుండి ధర్మశూన్యమగు ఆత్మను వేరుచేయుచున్నాడు. జాగ్రత్స్వప్నాద్యవస్థలు, ఆదిపదముచే సుషుప్తి సమాధ్యవస్థలు గ్రహింపబడును. సుఖదుఃఖానుభవము ఇవి యన్నియు, అస్యైవ = ఈ విజ్ఞానమయ కోశమునకే చెందినవి.

దేహాదినిష్ఠాశ్రమ ధర్మకర్మ
గుణాభిమానః సతతం మమేతి,
విజ్ఞానకోశోఽయమతిప్రకాశః
ప్రకృష్టసాన్నిధ్యవశాత్పరాత్మనః,
అతో భవత్యేష ఉపాధిరస్య
యదాత్మధీః సంసరతి భ్రమేణ. 190

సతతం = ఎల్లపుడును, మమేతి = నాది అని, దేహాదినిష్ఠాశ్రమ ధర్మకర్మగుణాభిమానః = దేహాదులకుసంబంధించిన ఆశ్రమములు, ధర్మములు, కర్మలు, గుణములు వీటియందు అభిమానముకల, అయం విజ్ఞానకోశః = ఈ విజ్ఞానమయకోశము, పరాత్మనః = పరమాత్మయొక్క, ప్రకృష్టసాన్నిధ్యవశాత్ = అత్యధికమగు సాంనిధ్యమువలన, అతిప్ర

కాశః = అధికమైనప్రకాశముకలది, అతః = ఆ కారణమువలన, ఏషః = ఈః కోశము, అస్య = ఈ ఆత్మకు, ఉపాధిః భవతి = ఉపాధిగా అగుచున్నది. యదాత్మధీః = దేని విషయమున 'నేను' అను బుద్ధికలవాడై, భ్రమేణ = భ్రాంతిచే, సంసరతి = సంసారమును పొందుచున్నాడో.

'దేహాది' అనునపుడు 'ఆది' పదముచే చక్షురాదీంద్రియములను, ప్రాణములను గ్రహింపవలెను. ఆ దేహాదులకు సంబంధించిన, ఏ, ఆశ్రమాః = బ్రహచర్యాద్యాశ్రమములు, ధర్మాః = మనుష్యత్వబ్రాహ్మణత్వాది ధర్మములు, కర్మాణి = స్థితి గతి మొదలగు లౌకిక కర్మలు, మన్త్రోచ్చారణాదివైదికకర్మలు, గుణాః = హ్రస్వత్వదీర్ఘత్వాదులు లేదా సుగుణ దుర్గుణములు, వీటి విషయమున, ఎల్లప్పుడును 'నావి' అను అభిమానముకలది. ఆత్మ ప్రతిబింబముతో గూడిన బుద్ధి ఇంద్రియములతోడను, ప్రాణములతోడను, దేహముతోడను సంబంధించినదై వాటిధర్మములను తనపై ఆరోపించుకొనుచున్నది. స్వతః జడమైనను ఈ బుద్ధి చేతనమువలె నుండుటకు నిమిత్తమును చెప్పుచున్నాడు. పరాత్మనః = 'చేతనశ్చేతనానామ్' అను శ్రుతి ననుసరించి కేవలము, నిర్మలము, అసంగము, చిద్రూపము అగు పరమాత్మయొక్క ప్రకృష్టసాన్నిధ్యవశాత్ = ఇతరవస్తువుల అపేక్షలే ని ప్రతిఫలనముయొక్క మహిమచే, అయం విజ్ఞానకోశః = ఈ బుద్ధి కోశము, అతిప్రకాశమైనది. ఇతరములగు ఇంద్రియములయందు సాక్షాచ్చైతన్యసంబంధము లేకుండుటచే వాటికి అతిప్రకాశము లేదు. అతః = ప్రకృష్టసాన్నిధ్యముండుటవలన, అస్య = ఈ ఆత్మకు, ఏషః = ఈ కోశము, ఉపాధిః = జీవుడు అను భేదమునకు హేతువగు ఉపాధి అగుచున్నది. కర్తృత్వభోక్తృత్వములతో గూడిన జీవత్వ మను ధర్మమునకు ఇది మూలకారణము, యదాత్మధీః = ఏ ఉపాధియందు 'నేను' అనెడు బుద్ధికలవాడై, భ్రాంతిచే, సంసరతి = కర్తృత్వాది దుఃఖమును అనుభవించుచున్నాడో.

అవ. ఈవిషయమునే 'యో౽యం' ఇత్యాది శ్లోకత్రయముచే విశదీకరించుచున్నాడు_

## ఉపాధిగతమైనను ఆత్మ నిస్సంగమె

యో౽యం విజ్ఞానమయః
ప్రాణేషు హృది స్ఫురత్స్వయం జ్యోతిః,
కూటస్థస్సన్నాత్మా
కర్తా భోక్తా భవత్యుపాధిస్థః. 191

ప్రాణేషు=చక్షురాదీంద్రియముల సమీపమున, హృది స్ఫురత్స్వయం జ్యోతిః=హృదయమునందు ప్రకాశించుచున్న స్వయంజ్యోతిః స్వరూపమగు, యః=ఏ, అయం=ఈ, విజ్ఞానమయః=విజ్ఞానమయమైన ఆత్మా=ఆత్మకలదో, అది. కూటస్థః సన్=కూటస్థమైనను, ఉపాధిస్థః=ఉపాధియందున్నదై, కర్తా=కర్తగాను, భోక్తగాను, భవతి=అగుచున్నది.

పాషాణ సమీపమునందున్న వృక్షమును పాషాణే, వృక్షః- 'పాషాణముపై వృక్షము' అని చెప్పినవిధమున 'ప్రాణేషు' అనునపుడు సామీప్యార్థమున సప్తమీ. ప్రాణేషు=చక్షురాదిసమీపమున ఇట్లు చెప్పుటచే-'అహం' అను ప్రతీతిలో అనేక వస్తువులు విషయమగుచున్నవి. కావున వాటిలో ఆత్మ ఏది అని జనకుడు ప్రశ్నింపగా దానికి ప్రత్యుత్తరముగ చెప్పిన 'ప్రాణేషు' అను పదముచే ప్రాణశబ్ద బోధితమగు ఇంద్రియముల ముఖ్యప్రాణత్వము ఆత్మకు లేదు అనగా ఇంద్రియముల ముఖ్యప్రాణము ఆత్మ కాదు అని చెప్పినట్లైనది. ప్రాణసామీప్యము బుద్ధికి కూడ ఉన్నది. దాని వ్యావృత్తి చేయుటకై 'హృది స్ఫురత్స్వయం జ్యోతిః' అని చెప్పబడుచున్నది. హృదయ పుండరీకావచ్ఛిన్నమగు బుద్ధియందు ప్రకాశించుచున్నదియు, ఇతర ప్రకాశ్యము కానిదియు అగు ఏ జ్యోతిస్సు అనగా సర్వావభాసకమగు

చైతన్యము కలదో; తద్రూపమైన విజ్ఞానమయము కలదో; మోక్షము కలుగువరకును ఈ ఆత్మ బుద్ధిలేకుండ ఉండదు గాన తత్ప్రచురమగుటచే విజ్ఞానమయమని చెప్పబడుచున్నది. లేదా ఇచట 'మయట్' ప్రత్యయము స్వార్థము. కావున 'విజ్ఞానమయః' అనగా విజ్ఞానస్వరూపము అని యర్థము. ఇట్టి ఆత్మ, కూటస్థః = కూట మనగా అయోఘనము, ఇనుపదిమ్మ; దానివలె నిర్వికారమైనను- ఇచట 'అపి' శబ్దమును చేర్చుకొనవలెను. ఉపాధిస్థః = ఉపాధియందు, అనగా జ్ఞానము క్రియయును గల బుద్ధియందు అవిద్యాకల్పితమగు తాదాత్మ్యముతో ఉన్నదై, స్ఫటికము భ్రమచే ఎఱ్ఱగ కనబడినట్లు కర్తగను, భోక్తగను అగుచున్నది.

అవ. ఈ విషయమునే స్పష్టికరించుచున్నాడు —

స్వయం పరిచ్ఛేదముపేత్య బుద్ధేః
తాదాత్మ్యదోషేణ పరం మృషాత్మనః,
సర్వాత్మకః సన్నపి వీక్షతే స్వయం
స్వతః పృథక్త్వేన మృదో ఘటానివ. 192

మృషాత్మనః = అసత్యమైన స్వరూపముగల బుద్ధియొక్క, తాదాత్మ్యదోషేణ పరం = తాదాత్మ్యదోషముచేతమాత్రమే, స్వయం = తాను, పరిచ్ఛేదం = అల్పత్వమును, ఉపేత్య = పొంది; "ఇదం సర్వం యదయమాత్మా" "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాది శ్రుతుల ననుసరించి తాను సర్వాత్మకుడైనను అల్పత్వమును పొంది, తెలివితక్కువవాడు, మృదః = మట్టికంటె భిన్నములుగ, ఘటానివ = కుండలనువలె, అతడు, మట్టియే ఉపాదానకారణముగ కలిగియుండుటచే మట్టికంటె వేరుకాని కుండలను వేరైనవాటినిగా చూచునో, అట్లే సర్వోపాదానమగు తనకంటె భిన్నమైనదేదియు లేకున్నను, స్వతః = తనకంటె, పృథక్త్వేన = వేరుగ, వీక్షతే = చూచుచున్నాడు. నేను, వాడు, ఇది, నీవు మొదలగు భేదబుద్ధి కలవాడగుచున్నాడని అర్థము.

అవ. ఈ విషయమును, "కూటస్థస్సన్ ఆత్మా" (191 శ్లో) అను వాక్యమున చెప్పిన నిర్వికారమగు ఆత్మకు సవికారత్వమును, దృష్టాంతపూర్వకముగ చెప్పుచున్నాడు —

ఉపాధిసంబన్ధవశాత్పరాత్మా
ప్యుపాధిధర్మాననుభాతి తద్గుణః,
అయోవికారా నవికారివహ్నివత్
సదైకరూపోఽపి పరః స్వభావాత్. 193

అయోవికారాన్=ఇనుముయొక్క ధర్మములైన దీర్ఘత్వవర్తుల త్వాదులను, అవికారివహ్నివత్=వాస్తవమున అట్టి ధర్మము లేవియులేని అగ్నివలె; ఇనుము పొడవుగనున్నచో అగ్ని పొడవుగనున్నదనియు, అది వర్తులముగ నున్నచో అగ్నివర్తులమనియు లోకమున జనులు భ్రాంతి చెందుదురు. అట్లే, సదా=ఎల్లప్పుడును, స్వభావాత్=తనయొక్క సచ్చిదానందస్వరూపమువలన, పరః = నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుడైనను, ఈ కారణముచే, ఏకరూపోఽపి = వికారశూన్యుడైనను, పరాత్మాపి = పరమాత్మకూడ, ఉపాధిసంబంధవశాత్=తనచే ప్రకాశ్యమైనదైనను, తనకు ఉపాధిగానున్న అవిద్యచే కల్పితమై తాదాత్మ్యసంబంధమువలన, ఉపాధి ధర్మాన్ = కర్తృత్వము, భోక్తృత్వము మొదలైన ఉపాధిధర్మములను, "ధ్యాయతీవ లేలాయతీవ" అని శ్రుతి చెప్పుచున్నది. బుద్ధి ధ్యానించునపుడు (ఆత్మకూడ) ధ్యానించుచున్నదివలె నుండును; అది చలించునపుడు చలించుచున్నట్లు ఉండును అని దీని యర్థము. అనుసృత్య=అనుసరించి, తద్గుణః='నేను చేయుచున్నాను, నేను సుఖవంతుడను, దుఃఖవంతుడను' ఇత్యాదివిధమున ఉపాధిధర్మములైన కర్తృత్వాదులు కలవాడువలె, భాతి= ప్రకాశించుచున్నాడు. దృష్టాంతముగ చూపబడిన ప్రకాశకమగు వహ్నియు సర్వప్రకాశకమగు దార్ష్టాంతికమైన అగ్నియు వికారశూన్యములే గాన ఏకరూపములగుట సమానము.

## మోక్ష మెట్లు కలుగును?

శిష్య ఉవాచ :

భ్రమేణాప్యన్యథా వాస్తు జీవభావః పరాత్మనః,
తదుపాధే రనాదిత్వా న్నానాదేర్నాశ ఇష్యతే. 194

అతోఽస్య జీవభావోఽపి నిత్యో భవతి సంసృతిః,
న నివర్తేత తన్మోక్షః కథం మే శ్రీగురో వద. 195

శిష్యుడుపల్కెను. పరాత్మనః = సంసార రహితుడగుటచే సర్వోత్కృష్టుడగు పరమాత్మకు, జీవభావః = జీవత్వము, భ్రమేణ వా = భ్రాన్తి చేతగాని, అన్యథా వా = వాస్తవముగాగాని, అస్తు = అగుగాక, తదుపాధేః = ఏ ఉపాధిచే జీవత్వము చెప్పబడుచున్నదో ఆ ఉపాధియైన విజ్ఞానమయ కోశము, అనాదిత్వాత్ = 'అనాదికాలోఽయమహంస్వభావో జీవః' ఇత్యాది శ్లోకమున (188) చెప్పినవిధముగ అనాదియగుటవలన, అనాదేః = ఆత్మ వలె అనాదియగు దీనికిని, నాశః = నాశము, నేష్యతే = అంగీకరింపబడదు. అతః = ఆ కారణమువలన, అనగా జీవభావమునకు హేతువగు ఉపాధి అనాదియగుటవల ను, దానికి నాశము అసంభావ్యము కావునను, అస్య = ఈ పరమాత్మయొక్క, జీవభావోఽపి = జీవత్వముకూడ, నిత్యో భవతి = నిత్యమే యగును, నశింపదు. సంసృతిః = సంసారము, న నివర్తేత = నివర్తింపదు. జీవభావము నిత్యమైనచో సంసారముకూడ నిత్యమేగాన అది నశించదు. తత్ = ఆ కారణమువలన, మే = నాకు, మోక్షః = మోక్షము, కథమ్ = ఎట్లు? శ్రీగురో = పూజ్యుడైనగురూ, వద = చెప్పుము.

## ఆత్మజ్ఞానమే మోక్షోపాయము

శ్రీగురు రువాచ :

సమ్యక్ పృష్టం త్వయా విద్వన్ సావధానేన తచ్ఛృణు,
ప్రామాణికీ న భవతి భ్రాన్త్యా మోహితకల్పనా. 196

శ్రీగురువుచెప్పెను. హే విద్వన్ = ఓబుద్ధిమంతుడా! త్వయా = నీచేత, సమ్యక్ = బాగుగా, పృష్టం = ప్రశ్నింపబడినది, తత్ = ప్రశ్నించిన ఆ విషయమును, సావధానేన = విషయాంతరసంచారము లేని మనస్సుతో, శృణు = వినుము, విని నిర్ధారణ చేసికొనుము అని యర్థము. భ్రాన్త్యా = భ్రాన్తిచేత, మోహితకల్పనా = మోహము కలిగినవానియొక్క కల్పన; మోహ మనగా తెలియవలసియున్న విషయమును తెలిసికొనకుండుట. ఇది తమోధర్మము. వాస్తవమున నిర్మలజ్ఞానస్వరూపుడైనను దృఢమైన అజ్ఞానజనితభ్రాంతిచే పూర్వోక్తవిధమున జనించి మోహము కల పురుషుడు తాను సంసారి కాకపోయినను సంసారియని చేసిన కల్పన, ప్రామాణికీ = యథార్థము కాజాలదు. అట్టి కల్పన భ్రమవలన కలిగిన మోహమువలన జనించును. ముగ్ధునకు సమ్యగ్జ్ఞానసామర్థ్యముండదు.

భ్రాన్తిం వినా త్వసంగస్య నిష్క్రియస్య నిరాకృతేః,
న ఘటేతార్థసంబన్ధో నభసో నీలతాదివత్. 197

అసంగస్య = సంగరహితమును, నిష్క్రియస్య = క్రియాశూన్యము, నిరాకృతేః = ఆకారరహితమునగు ఆత్మకు, నభసః = ఆకాశమునకు, నీలతాదివత్ = నైల్యము మొదలగునదివలె, భ్రాన్తిం వినా = భ్రాంతిలేకుండ, అర్థసమ్బన్ధః = వస్తువులతో సంబంధము, న ఘటేత = కుదరదు.

'తు' శబ్దమునకు అవధారణము అర్థము. ఇది నఞ్‌తో సంబంధించును. అసంగస్య "అసంగోఽహ్యాయం పురుషః"–ఈ పురుషుడు సంగరహితుడుకదా అను శ్రుతివలనను, సుషుప్తిలోని అనుభవము వలనను సంగరహితమును, నిష్క్రియస్య = "నిష్కలం నిష్క్రియం" అను శ్రుతి ననుసరించి క్రియారహితమును, నిరాకృతేః = "న తస్య కార్యం కరణం చ విద్యతే; అస్థూలం అనణు" – ఆత్మకు కార్యము (శరీరము) గాని కరణముగాని (ఇంద్రియాదిసాధనము) లేదు. ఇది స్థూలముకాదు, అణువుకాదు అను శ్రుతి ననుసరించి, ఆకారరహితమైనదియు అగు ఆత్మకు, భ్రాన్తిం వినా = స్థూలసూక్ష్మకారణశరీరముల యందు తాదాత్మ్యాభిమానములేకుండగ, అర్థసంబంధః = దృశ్యవస్తు

వుల సంబంధము, న తు ఘటేత = కుదరనే కుదరదు. అసంగము, నిష్క్రియము, నిరాకృతియు అగు ఆకాశమునకు నీలతాదికమువలె. కావున భాష్యమున - "అప్రత్యక్షమైనను ఆకాశమునందు వివేకరహితులు మలినతాదికమును అధ్యసింతురు" అని చెప్పబడినది. అవివేకవంతులు ఆకాశమునుగూడ నీలమనియు, పీతమనియు, ఇంద్రనీల మాణిక్యములుపొదిగిన గంగాళమువలె నున్నదనియు కల్పించినను అప్రామాణికమగు ఈ నీలత్వాదికము గగనమునకు ఏ విధముగ ఉపపన్నము కాదో, అట్లే పరమాత్మయొక్క జీవత్వము గూడ అప్రామాణికమే యని అభిప్రాయము. గగనము కల్పనామాత్రముచే ఏ విధముగ నీలాదిరూపము కాజాలదో ప్రకృతమున గూడ అట్లే అని గ్రహింపవలెను.

అవ. ఈ విషయమునే స్పష్టీకరించుచు రెండు శ్లోకములతో సంసారనివృత్తిని ఉపపాదించుచున్నాడు. అందు జీవుడు మిథ్యాభూతుడనువిషయము సిద్ధించుటకై శ్రుతి ప్రతిపాదితమును, విద్వదనుభవ సిద్ధమును అగు ఆత్మయథార్థస్వరూపమును తెలుపుచున్నాడు-

స్వస్య ద్రష్టు ర్నిర్గుణస్యాక్రియస్య
ప్రత్యగ్బోధానన్దరూపస్య బుద్ధేః,
భ్రాన్త్యా ప్రాప్తో జీవభావో న సత్యో
మోహాపాయే నాస్త్యవస్తు స్వభావాత్. 198

ద్రష్టుః = ద్రష్టయైనట్టియు, నిర్గుణస్య = నిర్గుణమైనట్టియు, అక్రియస్య=క్రియాశూన్యమైనట్టియు, ప్రత్యగ్బోధానన్దరూపస్య=ప్రత్యగ్బోధ రూపము ఆనందరూపమును అగు, స్వస్య = ఆత్మకు, బుద్ధేః భ్రాన్త్యా = బుద్ధియొక్క తాదాత్మ్యభ్రాన్తిచే, ప్రాప్తః=వచ్చిన, జీవభావః=జీవత్వము, సత్యః న = సత్యముకాదు. మోహాపాయే = మోహము తొలగిపోయిన వెంటనే, స్వభావాత్=స్వభావమువలన, అవస్తు = కాల్పనికమైన వస్తువు, న = లేదు.

ద్రష్టుః=సాక్షియు, నిర్గుణస్య=ఏ ధర్మముతోడను శూన్యమును, అక్రియస్య=క్రియారహితమును, వికారశూన్యమును, ప్రత్యగ్బోధానన్దరూపస్య=అన్నిటికంటెను అంతరమగు బోధమునకు (జ్ఞానమునకు) ప్రత్యగ్బోధ మనిపేరు. అట్టి ఆనందమే రూపముగాగల, స్వస్య=ఆత్మకు, బుద్ధితో తాదాత్మ్యాభిమానముచే కల్పితమైన జీవభావము, సత్యః=అబాధ్యము, న=కాదు. స్వస్వరూపసాక్షాత్కారము కలుగగనే భ్రాంతి నివర్తించునుగాన అది బాధ్యము. ఆ విషయమునే చెప్పుచున్నాడు. మోహాపాయే=శ్రుతియొక్కయు, ఆచార్యుని యొక్కయు ఉపదేశమువలన కలిగిన తత్త్వసాక్షాత్కారముచే అజ్ఞానము నశింపగనే, తజ్జన్యమగు భ్రాంతి లేకపోవుటచే మోహము దూరముగ తొలగిపోయిన దగుచుండగా, అవస్తు=కల్పితమగువస్తువు, స్వభావాత్=వానిధర్మమువలన, అనగా కల్పనావిషయము, నాస్తి=లేదు, లేదా, స్వభావాత్=మోహము తొలగిపోయినవెంటనే కల్పితములు కనబడవు. అందుచే నాస్తిత్వము వాటి స్వభావ మగుటవలన; ఆరోపితవస్తువులస్వభావ మేమనగా భ్రాన్తి తొలగిపోయినచో అవి పూర్వమువలె కనబడవు అని యర్థము.

అవ. పై శ్లోకమునందలి చతుర్థపాదార్థమును ఉపపాదించుచున్నాడు-

యావద్భ్రాన్తిస్తావదేవాస్య సత్తా
మిథ్యాజ్ఞానోజ్జృమ్భితస్య ప్రమాదాత్,
రజ్వ్వాం సర్పో భ్రాన్తికాలీన ఏవ
భ్రాన్తేర్నాశే నైవ సర్పోఽపి తద్వత్. 199

మిథ్యాజ్ఞానోజ్జృమ్భితస్య=మిథ్యాభూతమగు అజ్ఞానముచేజనించిన అస్య=ఈ అవస్తువునకు, ప్రమాదాత్=అవివేకమువలన, యావత్=ఎంతవరకును, భ్రాన్తిః=భ్రాన్తియుండునో, తావదేవ=అంతవరకు

మాత్రమే, సత్తా = ఉనికి, రజ్జ్వాం = రజ్జువునందు, సర్పః = సర్పము, భ్రాంతికాలీన ఏవ = భ్రాంతికాలమునందు మాత్రమే, ఉండును, భ్రాన్తేః = భ్రాంతియొక్క, నాశే = నాశముకలిగిన దగుచుండగా, సర్పః = సర్పము నైవాస్తి = లేదు, తద్వత్ = అటులనే (ఇచటగూడ తెలియవలెను).

కార్యము మిథ్యాభూతమైనది అను విషయమును చెప్పుటకై కారణముయొక్క విశేషమును చెప్పుచున్నాడు. మిథ్యాజ్ఞానోజ్జృమ్భి తస్య = మిథ్యాభూతమైన అనగా అధిష్ఠానముయొక్క సాక్షాత్కారముచే తొలగింపదగిన, ఏ అజ్ఞానముకలదో దానివలన జనించిన, ఈ అవస్తువునకు, ప్రమాదాత్ = అధిష్ఠానముయొక్క ఆరోప్యమాణము యొక్క భేదము తెలియకపోవుటచే, ఎంతవరకు, భ్రాంతిః = విపరీతజ్ఞాన ముండునో, అంతవరకు మాత్రమే, సత్తా = ప్రతీతి. అందులకు దృష్టాంతము- రజ్జ్వాం సర్పః = రజ్జ్వజ్ఞానమువలన అనగా రజ్జుసాక్షాత్కారముచే బాధింపదగిన ప్రమాదమువలన, ఎదుటనున్న వస్తువునందు 'ఇది సర్పముకాదు' అను వివేకము లేకపోవుటవలన, జనించిన సర్పము, భ్రాన్తికాలీన ఏవ = 'ఇది సర్పము' అనెడు భ్రాంతి ఎంతవరకును ఉండునో అంతవరకు మాత్రమే సర్పము అచట నున్నట్లు భాసించును. 'ఇది సర్పము కాదు; త్రాడుమాత్రమే' అను విశేషజ్ఞానముకలిగి 'ఇది సర్పము' అనెడు భ్రాంతి నశింపగనే అచట సర్పము లేదు. అట్లే 'అహం బ్రహ్మాస్మి' అను సాక్షాత్కారము కలుగు వరకును మూలాజ్ఞానమువలన కలిగిన ప్రమాదమువలన సంసారిత్వ భ్రాంతి కలుగుచున్నది. వాస్తవమున సంసారము ఎన్నడును లేదు. రజ్జువునందు భ్రాంతిచే సర్పము భాసించినట్లు సంసారము మొదట భాసించెను. యథార్థజ్ఞానము కలిగిన పిమ్మట ఆ సంసారభ్రాంతి యుండదు. స్వరూపసాక్షాత్కారము అజ్ఞానమును తత్కార్యముల నన్నింటిని నశింపజేయును గాన అపుడు బ్రహ్మమాత్రమే మిగిలి

యుండును. ఇందులకు– "అధిష్ఠానావశేషో హి నాశః కల్పితవస్తునః" -కల్పితవస్తువు యొక్క నాశము అధిష్ఠానమే అవశేషముకలది గదా? అను వాక్యము ప్రమాణము.

అవ. ఇంతచెప్పినను– "తదుపాధే రనాదిత్వా న్నానాదే ర్నాశ ఇష్యతే" అనుప్రశ్నకు స్పష్టమగు ఉత్తరము లభించనివాడువలె కనబడుచున్న శిష్యుని చూచి, శ్రీగురువు, ఆ ప్రశ్ననే అనువదించి, సార్ధశ్లోకద్వయముతో సమాధానము చెప్పుచున్నాడు–

అనాదిత్వమవిద్యాయాః కార్యస్యాపి తథేష్యతే,
ఉత్పన్నాయాం తు విద్యాయా మావిద్యక మనాద్యపి.200
ప్రబోధే స్వప్నవత్సర్వం సహమూలం వినశ్యతి.
అనాద్యపీదం నో నిత్యం ప్రాగభావ ఇవ స్ఫుటమ్,
అనాదేరపి విధ్వంసః ప్రాగభావస్య వీక్షితః. 201

అవిద్యాయాః=అవిద్యయొక్క, కార్యస్యాపి=కార్యమైన విజ్ఞానమయకోశమునకు గూడ, తథా=ఆ అవిద్యకువలెనే, అనాదిత్వం=అనాదిత్వము, ఇష్యతే=అంగీకరింపబడును. తు=కాని, విద్యాయాం=విద్య, ఉత్పన్నాయాం=పుట్టినదగుచుండగా, ఆవిద్యకం సర్వం=అవిద్యాసంబద్ధమైనదంతయు, అనాద్యపి=అనాదియైనను, ప్రబోధే=మెలకువ వచ్చినపుడు, స్వప్నవత్=స్వప్నమువలె, సహమూలం=మూలసహితముగ, వినశ్యతి=నశించును, ఇదం=ఈ అవిద్యాసంబద్ధమైనది, అనాద్యపి=అనాదియే యైనను, ప్రాగభావ ఇవ=ప్రాగభావమువలె, నిత్యం నో=నిత్యము కాదు, స్ఫుటం=ఈ విషయము స్పష్టము. అనాదేరపి=అనాదియైనను, ప్రాగభావస్య=ప్రాగభావముయొక్క, విధ్వంసః=నాశము, వీక్షితః=చూడబడినది కదా?

ఉపాధి అనాది యని నీవు చెప్పిన విషయము సత్యమే. అవిద్యా కార్యమైన విజ్ఞానమయకోశము గూడ, తథా=ఆ అవిద్యవలెనే,

అనాదిత్వము అంగీకరింపబడుచున్నది. అవిద్య అనునది ఒకేరూపమున నుండును. కాని సృష్టి విచిత్రరూపమున నుండుటచే దాని ఉపాధికూడ విచిత్రముగ ఉండవలెను. సర్వసముడును, పరమకృపాళువును అగు ఈశ్వరుడు కూడ సృష్టిచేయుట యందు, విచిత్రమగు కర్మకు ఆశ్రయమైన బుద్ధిరూపమగు ఉపాధియొక్క సహాయము లేనిదే విచిత్రసృష్టి చేయజాలడు. కావున ఈ విచిత్రసృష్టికి కారణభూతమగు బుద్ధికూడ అనాది యని ఇష్టమున్నను లేకున్నను అంగీకరింపవలసియే యుండును అని భావము. ఇపుడు దానికి నివృత్తిని చెప్పుచున్నాడు- విద్యాయాం=ఉపనిషజ్జన్యమైనదియు, అధిష్ఠానసాక్షాత్కారరూపమును అగు జ్ఞానము, ఉత్పన్నాయాం సత్యాం = పుట్టినదగుచుండగా; 'సత్యామ్' అని అధ్యాహారము. 'తు' శబ్దము 'అనాదికి నాశములేదు' అను పక్షమును వ్యావర్తింప జేయుచున్నది. అవిద్యకం=అవిద్యవలన కలిగిన, అనాద్యపి = సృష్ట్యాదివ్యవహారసిద్ధికొరకు అనాదియని అంగీకరింపబడినదైనను, ప్రబోధే=నిద్రపోయి మెలకువవచ్చినపుడు స్వప్నమువలె సహమూలం వినశ్యతి= కేవలము తానే కాదు, తనకు మూలమగు అవిద్యతోకూడ- మెలకువ వచ్చినపుడు స్వప్నకల్పితములగు వస్తువులసముదాయము మూలభూతమగు నిద్రతోకలిసి తొలగిపోయినట్లు నశించును. విద్యావిద్యలకు తేజస్తమస్సులకు వలెను, నిద్రాజాగ్రదవస్థలకు వలెను పరస్పరము విరోధము. విద్యచే అవిద్య నశింపజేయబడగనే "తత్ర కో మోహః కః శోకః ఏకత్వ మనుపశ్యతః" -ఆత్మయందు ఏకత్వమును చూచువానికి మోహ మేమి యుండును? శోకమేమి యుండును? "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూ త్తత్కేన కం పశ్యేత్"-సర్వము ఆత్మయే యైన దశలో దేనిని దేనితో చూడవలెను, "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా" -ఏ స్థితియందు మరియొకదానిని చూడడో, మరియొకదానిని వినడో, మరియొకదానిని గుర్తించడో అది భూమస్థితి,

ఇత్యాది శ్రుతి ననుసరించి, అట్టి భూమవిద్యయందు ఉంచి, సంసార హేతువగు అవిద్యను సమూలముగా నశింపజేయుటచే, మొదలు నరికి వేసిన పిమ్మట వృక్షమువలె, అవిద్యాకార్యమగు బుద్ధ్యాదికమునకు వినాశమే కలుగును అని తాత్పర్యము. నిద్రతొలగిపోయిన పిమ్మట మేల్కొన్నవానికి, ఆ నిద్రాకాలమునందు అనుభవించిన సుఖ దుఃఖాదికము ఉండదుకదా? అట్లే సమ్యగ్జ్ఞానము కలవానికి గూడ, సంసారనిమిత్తము నశించిపోవుటచే, అజ్ఞానకాలమునందున్న సంసారిత్వము ఉండదు. అనాదియగుదానికి కూడ నాశ ముండును అను విషయమున పరమతరీత్యా దృష్టాంతమును చూపుచున్నాడు. ఇదం= ఈ అవిద్యాకార్యము, ఆదిరహితమైనను, నశింపనిది కాదు అను విషయము స్ఫుటమ్=స్పష్టము తార్కికులు ప్రాగభావము అనాది యని, ఉత్పత్తి శూన్యమని, అంగీకరింతురు. ఐనను ఈ ప్రాగభావము తన ప్రతియోగియగు కార్యము పుట్టగనే నశించునని వారంగీక రింతురు. ప్రకృతమునకూడ అట్లే అని భావము.

(ఆశంక) అవిద్యాతత్కార్యములు భావపదార్థములు, అనాదు లగు వీటికి నాశమెట్లు అని ప్రశ్నించినపుడు ప్రాగభావమును దృష్టాన్తముగ చూపుట యుక్తముకాదు. అది అనాదియైనను భావపదార్థము కాదు కదా? అందుచే దృష్టాన్తదార్ష్టాంతికములకు వ్యతిరేకమున్నది.

(సమాధానము) ఘటము ఇంకను పుట్టనపుడు ఆ అవస్థను ఘటప్రాగభావమని యందురు. కాని ఆ అవస్థలోకూడ ఘటము అస్పష్టరూపమున ఉండనే ఉన్నది. కార్యము పుట్టగనే ఆ అవస్థలు మార్పువచ్చి అది కనబడుటలేదు. కావున అనాదిగా ఉన్నది కనబడ కుండుట అనునంతవరకును ఈ దృష్టాన్తమును చూపుటలో దోష మేమియు లేదు. ప్రాగభావమును నిరూపించు ప్రసంగమున తార్కి కులు-"అది ఒక అతిరిక్తపదార్థమని అంగీకరించినను అది స్వప్రతి

యోగిక మనుటలో ప్రమాణము లేదు" అని చెప్పియున్నారు. సత్పదార్థమున కెన్నడును అభావముండుటకు వీలులేదని భగవద్గీతలో గూడ "నాభావో విద్యతే సతః" అని చెప్పబడినది. (అందుచే సత్తుకానున్న కార్యమునకు పూర్తిగ అభావమును అంగీకరింప వీలులేదని యభిప్రాయము.) మరియు వినాశస్వభావములగు అవిద్యాతత్కార్యములకు సత్త్వరూపమగు భావత్వమును అంగీకరింప పనికూడ లేదు. వాస్తవమున శ్రుత్యనుసారముగ అవిద్యాతత్కార్యములకు అనాదిత్వమును అంగీకరించువారికి లోకప్రసిద్ధితో పనిలేదు. ఏదైన ఒకపదార్థమునకు ఉత్పత్తి లేదనియు, నాశముకూడ లేదనియు మనకు తెలియవలె నన్నచో శాస్త్రముతప్ప మరియొక ఆధార మేమియు లేదు. దృష్టాంతమగు ఆత్మ ఉత్పత్తివినాశశూన్యమని శాస్త్రమే చెప్పుచున్నది. అట్లే అవిద్యాదుల విషయమున గూడ, అవి అనాదియను విషయము "జీవేశావాభాసేన కరోతి", "మాయా విద్యా చ స్వయమేవ భవతి" అనుశ్రుతులవలనను నాశముకలదను విషయము "భూయశ్చాన్తే విశ్వమాయా నివృత్తిః" అనుశ్రుతివలనను తెలియుచున్నది. కావున ఇటు సంశయమునకు తావులేదు. లోకములోకూడ 'నాకీవిషయము ఇంతవరకును తెలియ లేదు; ఇపుడే తెలిసినది' అని వ్యవహారమున్నది. ఇట్టి స్థలములలో 'ఎప్పుడు లేదా ఎప్పటినుండి తెలియలేదు?' అను ప్రశ్నకు అవకాశములేదుగాన అజ్ఞానము అనాది యను విషయము, అది జ్ఞానమువలన నశించును అను విషయము, రెండును అనుభవసిద్ధములే. మరియు అనాదిభావత్వ మనునది ఒకఆత్మకు తప్ప మరిదేనికిని లేదుగాన చెప్పినదంతయు ఉచితముగనే యున్నది. కార్యోత్పత్తికి పూర్వము 'ఈ కపాలమునందు ఘటములేదు' అనుప్రతీతికి విషయమైన అభావము ప్రాగభావము. ఆ ప్రాగభావము ఘటము పుట్టగనే నశించును. ఈ విధముగ ఘటోత్పత్తికి పూర్వము అనాదికాలమునుండియు ఉన్న ఘట ప్రాగభావము ఘటరూపకార్యము పుట్టి

గనే నశించుట కనబడుచున్నది. అట్లే జ్ఞానము ఉత్పన్నమైన పిదప అనాదియైనను అజ్ఞానము నశించును. అజ్ఞానము నశించిన పిమ్మట తత్కార్యము ఎక్కడ నుండును అని అభిప్రాయము.

అవ. ఉపాధి నివర్తింపగనే ఔపాధికమగు జీవత్వము గూడ నివర్తించును అని రెండుశ్లోకములచే చెప్పుచున్నాడు —

యద్బుద్ధ్యుపాధిసమ్బన్ధాత్పరికల్పిత మాత్మని,
జీవత్వం న తతోఽన్యత్తు స్వరూపేణ విలక్షణమ్. 202

ఆత్మని=పరమాత్మయందు, బుద్ధ్యుపాధిసమ్బన్ధాత్=బుద్ధియనెడు ఉపాధియొక్క సంబంధమువలన, అనగా అజ్ఞానకృతమగు బుద్ధితాదాత్మ్యమువలన, యత్ =ఏ, జీవత్వం=జీవత్వము, పరికల్పితం=కల్పింపబడినదో, తతః=దానికంటె, అన్యత్ =భిన్నమైన అనగా సత్యమైన, స్వరూపేణ=అసంసారిత్వాదిరూపముచే, విలక్షణం=భిన్నమైనది, న తు=లేదు.

శిష్యుడు "భ్రమేణా ప్యన్యథా వాస్తు జీవభావః పరాత్మనః" అని పల్కుచు పసుపు, సున్నము కలిపినపుడు వాస్తవికమగు ఎరుపు వచ్చినట్లు జీవభావముకూడ వాస్తవికము కావచ్చును అను అభిప్రాయము వెలిపుచ్చినట్లుండుటచే దానిని నిరాకరించుటకై, శ్రీగురువు, ఆత్మకు బుద్ధ్యాద్యుపాధి సంబంధముచే పరికల్పితమగు జీవత్వము తప్ప దానికంటె విలక్షణమైనది ఏదియు, స్వరూపతః లేదని చెప్పియున్నాడు.

అవ. "అసంగో హ్యయం పురుషః" అను శ్రుతి ననుసరించి ఆత్మకు బుద్ధితో సంబంధముకూడ అవాస్తవికమే అని చెప్పుచున్నాడు—

సమ్బన్ధః స్వాత్మనో బుద్ధ్యా మిథ్యాజ్ఞానపురస్సరః,
వినివృత్తిర్భవేత్తస్య సమ్యగ్జ్ఞానేన నాన్యథా. 203

స్వాత్మనః=ఆత్మకు, బుద్ధ్యా=బుద్ధితో, సమ్బన్ధః=సంబంధము, మిథ్యాజ్ఞానపురస్సరః=మిథ్యాజ్ఞానమునుబట్టి వచ్చినది, సమ్యగ్జ్ఞానేన=సమ్యగ్జ్ఞానముచేతనే, తస్య=ఆ బంధముయొక్క, వినివృత్తిః=నివృత్తి భవేత్=అగును, అన్యథా=మరియొక విధముగ, న=కాదు.

ఆత్మ నిరవయవము గాన దీనికి బుద్ధితో సంయోగాది సంబంధము కలుగునని చెప్పుటకు వీలులేదు. సంయోగస్థలమున ఒకదాని ధర్మము మరియొకదానియందు భాసించుటగూడ ఉండదు. ఇనుమునకును అగ్నికిని సంయోగమున్నను 'ఇనుము కాల్చుచున్నది' 'నిప్పు పొడవుగా ఉన్నది ఇత్యాది వ్యవహారము పరస్పరాధ్యాసమున్ననే కుదురును. కావున బుద్ధియందు చైతన్యాదికము ఆత్మయందు కర్తృత్వాదికము కనబడుటకు అన్యోన్యాధ్యాసమే మూలమని చెప్పవలెను. ధర్మితాదాత్మ్యాధ్యాసము ధర్మముల అధ్యాసమునకు కారణము. ఈ విధముగ ఆత్మకు బుద్ధితోగల సంబంధము అధ్యాసకృతమగు తాదాత్మ్యసంబంధమే. దీనికి మిథ్యాభూతమగు అజ్ఞానమే మూలము. అజ్ఞానమూలకమగు ఈ సంబంధము కేవలము సమ్యగ్జ్ఞానమువలన మాత్రమే నివర్తించును. రజ్జ్వాదులయందు ప్రతీతమగు సర్పతాదాత్మ్యము రజ్జుభ్రమచేతనే బాధింపబడుచున్నది కదా ? నాన్యథా=అజ్ఞానకల్పితమగు సంబంధము తొలగుటకు మరియొకమార్గము లేదు అని అర్థము. "మిథ్యాజ్ఞానపురస్సరః" అనునపుడు 'మిథ్యా చ తత్ అజ్ఞానం' అను విగ్రహముచే మిథ్యాభూతమగు అజ్ఞానము పూర్వమందు కలది, అనగా మూలముగా కలది, అను నర్థము లభించును. 'మిథ్యా చ తత్ జ్ఞానం అను విగ్రహము చెప్పినచో అపుడు మిథ్యాజ్ఞానపదమునకు భ్రమమను అపరనామధేయముగల అధ్యాసమని యర్థము. అట్టి అధ్యాసముతో ముందుగ దేనికి సంబంధమున్నదో అట్టి తాదాత్మ్యసంబంధము అను నర్థము వచ్చును. రెండర్థములును యుక్తములే.

అవ. భ్రమ-ప్రమాదిదోషదూషితులగు పురుషులు సమ్యగ్జ్ఞానమనగా ఇది అని తెలిసికొనజాలరు; అందుచే నిర్దోషమగు శ్రుతిని అనుసరించి సమ్యగ్జ్ఞానమనగా ఏమియో చెప్పుచున్నాడు-

బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం సమ్యగ్జ్ఞానం శ్రుతేర్మతమ్. 204

బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం=బ్రహ్మయు జీవాత్మయు ఒక్కటే అను విజ్ఞానము, సమ్యగ్జ్ఞానం=సమ్యగ్జ్ఞానముగా, శ్రుతేః=శ్రుతికి, మతమ్=అంగీకార్యమైనది.

బ్రహ్మాత్మల అభేదజ్ఞానమే సమ్యగ్జ్ఞానము. 'తత్త్వమసి' 'అహం బ్రహ్మాస్మి' 'అయమాత్మా బ్రహ్మ' 'ప్రజ్ఞానం బ్రహ్మ' 'స ఏతమేవ పురుషం తతమపశ్యత్'-ఆతడు ఈ పురుషుని సర్వత్ర వ్యాపించియున్న వానినిగా చూచెను, 'స యశ్చాయం పురుషే, యశ్చాసావాదిత్యే, స ఏకః'-ఈ పురుషునియందును, ఆ ఆదిత్యుని యందు ఏ ఆత్మ ఉన్నదో అది ఒక్కటియే. "ఏష త ఆత్మా అన్తర్యా మ్యమృతః" -ఈ ఆత్మ నీ అంతరాత్మయే; నాశరహితము. 'ఏష త ఆత్మా సర్వాన్తరః, నాన్యోఽతోఽస్తి ద్రష్టా నాన్యోఽతోఽస్తి శ్రోతా నాన్యోఽతోఽస్తి మన్తా, నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా. స వా ఏష మహానజ ఆత్మా యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుషః"-ఈ ఆత్మయే సర్వాంతరమైనది. దీనికంటె భిన్నుడైన ద్రష్టగాని, శ్రోతగాని, మన్త (తలచువాడు) గాని, విజ్ఞాత (తెలిసి కొనువాడు)గాని లేడు హృదయాన్తర్గతమగు ఈ జ్యోతియే గొప్ప దియు జన్మరహితమును అగు ఆత్మ ఇత్యాది శ్రుతులు జీవబ్రహ్మల భేదమును నిరాకరించుచున్నవి.

అవ. అందులకు హేతువును చెప్పుచున్నాడు-

తదాత్మానాత్మనోః సమ్యగ్వివేకేనైవ సిధ్యతి,
తతో వివేకః కర్తవ్యః ప్రత్యగాత్మాఽసదాత్మనోః. 205

ఆత్మానాత్మనోః = ఆత్మానాత్మలయొక్క, సమ్యగ్ = బాగుగా, వివేకేనైవ = వివేకముచేతనే, తత్ = ఆ సమ్యగ్జ్ఞానము, సిధ్యతి = సిద్ధించును, తతః = ఆ కారణమువలన, ప్రత్యగాత్మాఽసదాత్మనోః = ప్రత్యగాత్మయొక్కయు, జీవాత్మయొక్కయు, వివేకః = వివేకము, కర్తవ్యః = చేయదగినది.

ఆ సమ్యగ్జ్ఞానము నీరక్షీరములనువలె ఆత్మానాత్మలను వేరు వేరుగ గ్రహించుటచేతనే సిద్ధించును. ఈ ఆత్మానాత్మలభేదమును గ్రహింపగనే, అధ్యాసవ్యాపకమగు (అధ్యాస మున్నచోటనెల్ల ఉన్న) భేదాగ్రహణము (భేదమును గ్రహింపకుండుట) అసంభావ్యము. భేదాగ్రహణములేనిచో దానికి వ్యాప్యమగు, భ్రమరూపమైన అధ్యాసము ఉండదు. అదిలేనిచో మనస్సు విక్షేపశూన్యమై బహిర్ముఖము కాకుండ నుండును. అపుడు శ్రవణమనననిదిధ్యాసనములచే సర్వాన్తరమగు బ్రహ్మను సాక్షాత్కరించుకొనును అని భావము. తతః = వివేకము సమ్యగ్జ్ఞానహేతువుగాన, ప్రత్యగాత్మాఽసదాత్మనోః - సర్వాంతరమగు ఆత్మ ప్రత్యగాత్మ అనగా పరమాత్మ, అసత్తైన, అనగా మిథ్యాభూతమైన ఆత్మ అసదాత్మ, అనగా జీవాత్మ. శ్రుతియు ఆచార్యుడు చూపిన యుక్తిచే ఈ రెండింటిని వేరువేరుగ తెలిసికొనుటకు అనుకూలమగు మననరూపమగు వ్యాపారము, ఇదియే వివేకము. చేయదగినది.

అవ. అట్లు చేసినపుడు ఆత్మ ఎట్లు స్ఫుటముగ భాసించునో దృష్టాన్తపూర్వకముగ చెప్పుచున్నాడు—

జలం పంకవదస్పష్టం పంకాపాయే జలం స్ఫుటమ్.
యథా భాతి తథాత్మాపి దోషాభావే స్ఫుటప్రభః. 206

పంకవత్ = పంకముగల, జలం = జలము, అస్పష్టం = విజాతీయమగు భూమికి సంబంధించిన పంకముతో మిశ్రమగుటచే అస్పష్టముగ నుండును. పంకాపాయే = పంకమును దానినుండి తీసిపారవేయగానే,

జలం = నీరు, స్ఫుటం = ఇతరామిశ్రమై శుద్ధమైనదై యథా భాతి = ఎట్లు ప్రకాశించునో, తథా = అట్లే, ఆత్మాపి = పరమాత్మగూడ, దోషాభావే = దోషముపోయినతోడనే, స్ఫుటప్రభః = స్ఫుటమైన అఖండచైతన్యప్రకాశముకలదై అగును, 'సలిల ఏకోద్రష్టా'—సలిలమువలె శుద్ధమగు ఆ ఆత్మ ఒక్కటియే ద్రష్టగ ఉన్నది అను శ్రుతిచే నిర్మలజలమువలె, అనాత్మవిషయకము కాకుండ భాసించును అని అర్థము.

అవ. ఈ విషయమునే స్పష్టీకరించుచు అనాత్మవిషయకము కాకుండ భాసించుటకై ప్రయత్నింపవలెను అని చెప్పుచున్నాడు—

అసన్నివృత్తౌ తు సదాత్మనః స్ఫుట
ప్రతీతిరేతస్య భవేత్ప్రతీచః,
తతో నిరాసః కరణీయ ఏవా
సదాత్మనః సాధ్వహమాది వస్తునః. 207

ఏతస్య = ఈ, ప్రతీచః = సర్వాన్తరమైన, సదాత్మనః = పరమాత్మయొక్క, స్ఫుటప్రతీతిః = స్ఫుటమైనజ్ఞానము, అసన్నివృత్తౌ = అసత్తులగు అన్నమయాదులు నివర్తించిన పిమ్మట, భవేత్ = అగును, తతః = ఆ కారణమువలన, అసదాత్మనః = అనాత్మయైన, అహమాదివస్తునః = అహంకారాదివస్తువుయొక్క, నిరాసః = నిరాసము, సాధు = బాగుగా, కరణీయః ఏవ = చేయదగినదే.

(యతః = ఏ కారణమువలన), ఏతస్య = సమీపమునందున్నదియు, ప్రతీచః = సర్వాంతరమును అగు, సదాత్మనః = కాలత్రయాబాధ్యమగు పరమాత్మయొక్క, స్ఫుటప్రతీతిః = ఇతరపదార్థమిశ్రితముకానివిధమున స్పష్టముగ ప్రతీతి, అసన్నివృత్తౌ = అసత్తులగు అన్నమయాద్యనాత్మలు నివర్తించిన పిమ్మటనే, భవేత్ = కలుగునో, అవి కూడ ప్రతీయమానము లగునపుడు కాదో, తతః = ఆ కారణమువలన అసదాత్మనః = మిథ్యాభూతమగు స్వరూపముగల, అహమాదివస్తునః = ఆత్మయనెడుభ్రాంతికి గోచరమగుటచే స్వరూపమును కప్పివేయుచున్న

అహంకారము మొదలు దేహమువరకును గల పదార్థములయొక్క, సాధు=ఇవి మరల అహంకారగోచరముకాకుండు విధమున, నిరాసః= ఒక్కొక్కకోశమును గూర్చి 'ఇది ఆత్మకాదు' అను దృఢతమమగు వివేచనముచే కలిగిన నిరాసము, చేయతగినది. 'పంచానామపి' (శ్లో. 153) అని పూర్వముకూడ చెప్పబడినది. ఈ జనుడు ఏదో విధముగ మోక్షము పొందవలెను అను నభిప్రాయముతో శ్రీగురువు అనేకవిధముల ఉపదేశించుచున్నాడు. ఆ ఘటమున నాచు కప్పిన జలము దృష్టాంతముగ చూపబడినది. ఇచట విజాతీయమగు పంకము కలిసిన జలము చూపబడినది. ఇది యంతయు ప్రత్యగాత్మకును, అనాత్మకును గల భేదమును స్పష్టీకరించుటకే చెప్పబడినది.

అవ. ఇపుడు విజ్ఞానమయము అనాత్మ యను విషయమును ముగించుచున్నాడు—

అతో నాయం పరాత్మా స్యాద్విజ్ఞానమయ శబ్దభాక్,
వికారిత్వా జ్జడత్వాచ్చ పరిచ్ఛిన్నత్వ హేతుతః.
దృశ్యత్వాద్వ్యభిచారిత్వాన్నాఽనిత్యో నిత్య ఇష్యతే .208

అతః = అందువలన, విజ్ఞానమయశబ్దభాక్ = విజ్ఞానమయ మను పేరుగల, అయం = ఈ కోశము, వికారిత్వాత్ = వికారమును చెందున దగుటవలనను, జడత్వాత్ = జడ మగుటవలనను, పరిచ్ఛిన్నత్వహేతుతః = పరిచ్ఛిన్నమనెడు కారణమువలనను, దృశ్యత్వాత్ = దృశ్యమగుట వలనను, వ్యభిచారిత్వాత్ = వ్యభిచరించుచున్నదగుటవలనను, పరమాత్మా న స్యాత్ = పరమాత్మ కాజాలదు, నిత్యః = నిత్యమైన ఆత్మ, అనిత్యః = అనిత్యమైన, విజ్ఞానమయకోశముగ, నేష్యతే = అంగీకరింపబడదు.

అతః = వికారిత్వ- జడత్వ- పరిచ్ఛిన్నత్వ - దృశ్యత్వ-వ్యభిచారిత్వము లనెడు చెప్పనున్న హేతువులవలన, విజ్ఞానమయమను పేరుగల

ఈకోశము ముఖ్యాత్మ కాజాలదు. ఇది మరుస్థలమున కనబడిన ఉద కమువలె(ఎండమావులలోని జలమువలె)ఉన్నట్లుగ కనబడుటయేకాని వాస్తవమున లేదు. "నిత్యోఽనిత్యానామ్"-ఆత్మ అనిత్యపదార్థముల మధ్యనున్న ఏకైక నిత్యపదార్థము, ఇత్యాదిశ్రుతివలనను, "నిత్యత్వా చ్చ తాభ్యః" (బ్ర.సూ. 2.3.17)-శ్రుతులవలన ఆత్మ నిత్యమని తెలి యుటవలనను ఆత్మ జనించునది కాదు అను సూత్రముచేతను, నిత్య మగు ముక్తితో సంబంధించుటచే ఈ ఆత్మ నిత్యము అను యుక్తిచేతను నిత్యమగు ఆత్మ, వికారిత్వాది హేతువులచే అనిత్యమైన విజ్ఞానమయ కోశముగ, నేష్యతే=అంగీకరింపబడదు. విజ్ఞానమయః కోశః ఆత్మ భిన్నః, వికారిత్వాత్, జడత్వాత్, పరిచ్ఛిన్నత్వాత్, దృశ్యత్వాత్, వ్యభిచారిత్వాత్ ; స్థూలదేహవత్ " అని అనుమానప్రయోగము. విజ్ఞానమయకోశము, స్థూలదేహమువలె, వికారియగుటవలనను, జడ మగుటవలనను, పరిచ్ఛిన్న మగుటవలనను, దృశ్యమగుటవలనను, వ్యభిచారియగుటవలనను. ఆత్మకంటె భిన్నము, అని దీని యర్థము. ఇది అనాత్మ యను విషయము దృఢమగుటకు అనేక హేతువులు చెప్పబడినవి. ఇన్ని హేతువు లున్నను మోహమువలన దీనిని ఆత్మ అని అనుకొనుచున్నారు ; కావున మాటిమాటికిని బహువిధముల భావన చేసి ఇది అనాత్మ యను విషయమును దృఢము చేసికొనవలెను అని ఈ విధముగ చెప్పుటలోని స్వారస్యము. వికారిత్వమనగా జన్మ నాశములు కలిగియుండుట. జడత్వ మనగా తనంతట తానుగ ప్రకా శింపజాలకుండుట. పరిచ్ఛిన్నత్వమనగా సర్వవ్యాప్తము కాకుండుట. దృశ్యత్వమనగా జ్ఞానగోచరమగుట, తెలియబడుట. వ్యభిచారిత్వము అనగా అభావములో ప్రతియోగిగ ఉండుట ; అనగా లేకుండుట.

అవ. ఇపుడు ఆనందమయకోశమును నిరూపించుచున్నాడు-

# ఆనందమయ కోశము

ఆనన్దప్రతిబిమ్బచుమ్బితతనుః వృత్తి స్తమోజృమ్భితా
స్యాదానన్దమయః ప్రియాదిగుణకః స్వేష్టార్థలాభోదయః,
పుణ్యస్యానుభవే విభాతి కృతినా మానన్దరూపః స్వయం
భూత్వా నన్దతి యత్ర సాధుతనుభృన్మాత్రః ప్రయత్నం వినా.

ఆనన్దప్రతిబిమ్బచుమ్బితతనుః=ఆనందముయొక్క ప్రతిబింబముచే స్పృశింపబడిన శరీరము కలదియు, తమోజృమ్భితా=అవిద్యాపరిణామ రూపమైనదియు అగు, వృత్తిః=వృత్తి, ప్రియాదిగుణకః=ప్రియము మొదలగు గుణములు కలదియు, స్వేష్టార్థలాభోదయః=తనకు ఇష్టమైన అర్థము లభించునపుడు ఉదయించునదియు అగు, ఆనన్దమయః=ఆనంద మయకోశము, స్యాత్=అగును, కృతినాం=పుణ్యాత్ములయొక్క, పుణ్యస్య అనుభవే=పుణ్యమును అనుభవించు సమయమున, విభాతి = భాసించును, యత్ర=దేనియందు, తనుభృన్మాత్రః=ప్రాణిమాత్రము, ప్రయత్నం వినా=ప్రయత్నము లేకుండగనే, స్వయం=తాను, ఆనన్దరూపం=ఆనందరూపుడై, భూత్వా=అయి, సాధు=బాగుగా, నన్దతి=సంతోషించునో.

ఆనన్దస్య=పరమాత్మస్వరూపానందముయొక్క, ప్రతిబింబ ముచే, చుంబితా=వ్యాప్తమైన, తనుః=శరీరము, స్వరూపము దేనికో అది="ఆనందప్రతిబింబచుంబితతనుః". తమోజృమ్భితా= అవిద్యవలన పుట్టినది; అవిద్యాపరిణామరూపమైనది. అట్టి వృత్తి ఆనందమయకోశము. అది స్పష్టముగ బుద్ధికి గోచరించుటకు చెప్పు చున్నాడు; ప్రియాదిగుణకః— "తస్య ప్రియమేవ శిరః, మోదో దక్షిణః పక్షః, ప్రమోద ఉత్తరః పక్షః, ఆనన్ద ఆత్మా, బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా"—ఈ ఆనందమయకోశమునకు ప్రియమే శిరస్సు. మోదము కుడిప్రక్క. ప్రమోదము రెండవప్రక్క. ఆనందము ఆత్మ. బ్రహ్మ ప్రతిష్ఠాహేతువగు పుచ్ఛము అను శ్రుతి ననుసరించి ఇష్టవస్తువుల

దర్శనము, లాభము, భోగము, వీటివలన కలిగిన సుఖవిశేషమే అవయవముగా గల ప్రియము మొదలు ప్రమోదము వరకు నున్నది గుణముగా, అనగా అవయవముగా గలది. ఇది అప్పుడప్పుడు మాత్రమే ఉండునని చెప్పుచున్నాడు — "స్వేష్టార్థలాభోదయః" — తనకు ఇష్టమైన పుత్రమిత్రాదులు, శబ్దాదికము; అది లభించినపుడు; లాభ పదము ఉపలక్షణముగాన దర్శనభోగములనుగూడ గ్రహింపవలెను. అనగా వాని దర్శనలాభభోగములు కలిగినపుడు ఉత్పత్తి కలది అనగా పుట్టునది. కృతినాం = ధీమంతులయొక్క, పుణ్యస్య = పూర్వజన్మ కృతమును, ఫలోన్ముఖమును అగు పుణ్యమును అనుభవించు సమయమున, విభాతి = విశేషరూపమున భాసించును. ఈ విషయమునే స్పష్టీకరించుచున్నాడు- యత్ర = ఏ సమయమున, తనుభృన్మాత్రః = సర్వప్రాణియు, ప్రయత్నం వినా = ప్రయత్నము లేకుండగనే, అనగా ఆ సమయమున ఏ ప్రయత్నము చేయకపోయినను; దీనికి పూర్వపుణ్యమే హేతువని 'పుణ్యస్యానుభవే' అను పదముచే చెప్పబడినది. తానే ఆనందరూపుడుగ అయి ఆనందించునో, అపుడు ఆనందమయ కోశముతో సంబంధ మేర్పడినదని గ్రహింపవలెను. ఈ విషయమునే 'దేహప్రాణేన్ద్రియ' ఇత్యాదిశ్లోకమున (371) చెప్పనున్నాడు. ఈ విధముగ జాగ్రత్స్వప్నావస్థలలో, పుణ్యవశముచే కలుగు సుఖాకారమైన, తామసవృత్తి ఆనందమయకోశమని చెప్పినట్లైనది. ఆ కోశము కూడ స్వరూపమును ఆవరించునదే. దానితో సంబంధమేర్పడిన సమయమున దుఃఖమిశ్రితము కానిదియు, నిత్యము, నిరుపాధికము అగు సుఖస్వరూపమును తెలిసికొనుటకు శక్యము కాదుకదా? కావు ననే — "న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య" — ప్రియము లభించినపుడు సంతసింప కూడదు. "ఆత్మానం హర్షశోకాభ్యాం శత్రుభ్యామివ నార్పయేత్" — తనను శత్రుతుల్యములైన హర్షశోకములకు అర్పింప గూడదు, "హృష్టో దృప్యతి, దృప్తో ధర్మమతిక్రామతి" — ఆనందములో నున్న వానికి గర్వము కలుగును, గర్వించినవాడు ధర్మమును అతి

క్రమించును, "హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో యః స చ మే ప్రియః"- సంతోషము, అసూయ, భయము, ఉద్వేగము వీటిచే ముక్తుడైన వాడు నాకు ప్రియుడు, ఇత్యాది వాక్యములు ఈ ఆనందముకూడ హేయమని చెప్పుచున్నవి. ఇచట పుణ్యశబ్దముచే కామ్యకర్మలవలన కలిగిన అపూర్వమును గ్రహింపవలెను. యోగమువలన కలిగిన పుణ్యమును గ్రహింపరాదు. అట్టి పుణ్యము జ్ఞానము ద్వారా అనావృతానందమును అభివ్యక్తము చేయును, అనగా ఆనందావరకముగనుండు తమస్సును భంజింపచేయును గాన, అట్టిది ఆనందము కోశము కాదు. అపుడు వృత్తి తమోజృంభితము కాదు. ఈ విషయమును ఈ క్రింది వాక్యములు సూచించుచున్నవి. "ముక్తిర్నో శతకోటిజన్మను కృతైః పుణ్యైర్వినా లభ్యతే". "కర్మాశుక్లాకృష్ణం యోగిన స్త్రివిధమితరేషామ్" -యోగియొక్క కర్మ అశుక్లముగను అకృష్ణముగను, ఉండును. అనగా పుణ్యమునకు గాని పాపమునకు గాని హేతువు కాదు. ఇతరుల కర్మ పుణ్య-పాప-ఉభయరూపమై త్రివిధముగా నుండును.

వృత్తీనామనువృత్తిస్తు ప్రయత్నాత్ప్రథమాదపి,
అదృష్టాచ సకృదభ్యాస సంస్కార సచివా ద్భవేత్ .

ప్రథమప్రయత్నమువలననే గాని, అనేకపర్యాయములు చేసిన అభ్యాసముయొక్క సంస్కారముతో గూడిన అదృష్టమువలన గాని (ఆత్మవిషయకవృత్తులు అవిచ్ఛిన్నముగ కొనసాగును). వీటిని బట్టి ఆనందమయ కోశమును భాసింపజేయునది కామ్యకర్మలవలన కలిగిన పుణ్యమేయనియు, యోగజపుణ్యము జ్ఞానముద్వారా ఆనందమయ కోశభిన్నమగు స్వరూపానందమునే భాసింపజేయు ననియు స్పష్టమగుచున్నది.

అవ. తామసి యగు సుఖాకారవృత్తియే ఆనందమయకోశము గాన సుషుప్త్యవస్థలో అది ఉత్కటముగ నుండునని చెప్పుచున్నాడు.

ఆ సమయమున, పుణ్యజనితముకాని స్వరూపసుఖమే అవిద్యావృత్తికి విషయమగును. పతిదినమందును, ఫలమునిచ్చుటకు ప్రారంభించిన పుణ్యము క్షీణించినపుడు మాత్రమే సుషుప్తి కలుగు చుండును. ఇది దైనందిన ప్రలయము. అనగా ప్రతిదినమునను జీవునకు కలుగు ప్రలయము. "అదృష్టము (పుణ్యమైనను పాపమైనను) భోగమును కలిగించునుకాని ప్రలయమును కాదు" "అదృష్టమపి భోగ ప్రసిద్ధ్యర్థం, న ప్రలయప్రసిద్ధ్యర్థమ్" అని సూత్రభాష్యమునందు గూడ చెప్పబడినది.

ఆనన్దమయకోశస్య సుషుప్తౌ స్ఫూర్తిరుత్కటా,
స్వప్నజాగరయో రీష దిష్టసందర్శనాదినా. 210

సుషుప్తౌ=సుషుప్తియందు, ఆనందమయకోశస్య=ఆనందమయ కోశముయొక్క, ఉత్కటా=ఉత్కటమైన, స్ఫూర్తి=స్ఫురణము, ఉండును. ఆ సమయమున దుఃఖమిశ్రముకాని సుఖముండును గాన అపుడు ఆనందమయకోశ స్ఫురణము అధిక మని యభిప్రాయము. స్వప్నజాగర యోః = స్వప్నజాగరావస్థలలో, ఇష్టసందర్శనాదినా = ఇష్టవస్తువుల సందర్శనము మొదలగువాటిచే: ఆదిపదముచే లాభ-భోగములను గూడ గ్రహింపవలెను. ఈషత్=స్వల్పమగు స్ఫురణ ముండును. ఆ అవస్థలలో భిన్నవిషయకములగు వృత్తులు ఈ వృత్తిని నశింపజేయు చుండును. కాని సుషుప్తియందు ఇతరవృత్తు లేవియు ఉండవు గాన, అపుడది ఉత్కటముగ ఉండునని భావము.

అవ. ఆనందమయకోశము కూడ అనాత్మయే యని చెప్పు చున్నాడు-

నైవాయమానన్దమయః పరాత్మా
సోపాధికత్వా త్ప్రకృతేర్వికారాత్,
కార్యత్వహేతోః సుకృతక్రియాయా
వికారసంఘాత సమాహితత్వాత్. 211

అయం = ఈ, ఆనన్దమయః = ఆనందమయకోశము, సోపాధికత్వాత్ = కారణము కలదగుటవలనను, ప్రకృతేః = ప్రకృతియొక్క, వికారాత్ = వికారమగుటవలనను, సుకృతక్రియాయాః = పుణ్యముయొక్క, కార్యత్వహేతోః = కార్యమగుటవలనను, వికారసంఘాతసమాహితత్వాత్ = అవయవసముదాయముతో కూడినదగుటవలనను, పరాత్మా = పరమాత్మ, నైవ = కాదు.

ఈ ఆనందమయము ముఖ్యాత్మ కాజాలదు. అందులకు హేతువులు- సోపాధికత్వాత్ = నిమిత్తము కలదగుటవలన అని యర్థము. అనగా ఇష్టసందర్శనాదులవలన కలిగినదని యర్థము. ప్రకృతేః = మూలప్రకృతియొక్క, అవిద్యయొక్క, వికారాత్ = వికారమగుటవలనను, తమోజృంభితమగు వృత్తి ప్రకృతివికారమే కదా? ఇది పుణ్యకర్మయొక్క కార్యము అనెడు హేతువువలనను "పుణ్యస్యానుభవే" అని చెప్పిన విధమున (శ్లో. 209) జాగర స్వప్నావస్థలలో కలిగిన సుఖాకారమగు అవిద్యావృత్తికూడ పుణ్య జన్యమే, వికారసంఘాతసమాహితత్వాత్ - 'ప్రియాదిగుణకః' అని చెప్పినవిధమునను (శ్లో. 209), 'తస్య ప్రియమేవ శిరః' ఇత్యాది శ్రుత్యుక్తవిధమునను, దర్శనము, లాభము, భోగము వీటివలన జనించిన సుఖరూపములైన అవయవముల సముదాయమునుండి జనించుటవలనను, పుణ్యవశముచే ఇష్టవస్తువును చూచినపుడును, అది లభించినపుడును తమోమిశ్రమగు సత్త్వము ఉద్భవింపగా 'నేను సుఖవంతుడను' అను విధమున సుఖాకారమగు వృత్తి జనించును. భోగము కలిగినపుడు - "కోఽన్యోఽస్తి సదృశో మయా యక్ష్యే దాస్యామి మోదిష్యే" -నా అంతటి వాడు ఎవడున్నాడు? యాగము చేసెదను; దానము ఇచ్చెదను, ఆనందించెదను, ఇత్యాదిరూపమున ఆ వృత్తి ఉత్కర్షను పొందుచున్నది. ఈ విధముగ ఈ వృత్తి పుణ్యము, ఇష్టవిషయములు మొదలగు వికారములవలన జనించుచున్నది అని కూడ "వికారసంఘాతసమాహితత్వాత్" అను పదమునకు అర్థము చెప్పవచ్చును.

అవ. కోశపంచక వివేకము చేసిన పిమ్మట చేయవలసిన కృత్యమును చెప్పుచున్నాడు-

పంచానామపి కోశానాం నిషేధే యుక్తితః కృతే,
తన్నిషేధావధిః సాక్షీ బోధరూపోఽవశిష్యతే. 212

పంచానామపి కోశానాం = ఐదుకోశములయొక్కయు, నిషేధే = ప్రతికోశము విషయమునను 'ఇది ఆత్మకాదు', 'ఇది ఆత్మకాదు' అను నిషేధము చేయబడిన దగుచుండగా, తన్నిషేధావధిః = వాటియొక్క నిషేధమునకు ఆధారభూతమైనట్టియు, అనగా దేనివరకును నిషేధము చేయబడునో అట్టి అవధి అని యర్థము, సాక్షీ=సాక్షియైన, బోధరూపః= నిర్విషయమగు కేవలజ్ఞానరూపమగు వస్తువు, అవశిష్యతే = శేషించును.

అవ. అదియే ముఖ్యాత్మయని తెలియవలెనని చెప్పుచున్నాడు -

యోఽయమాత్మా స్వయంజ్యోతిః పఞ్చకోశవిలక్షణః,
అవస్థాత్రయసాక్షీ సన్నిర్వికారో నిరంజనః,
సదానన్దః స విజ్ఞేయః స్వాత్మత్వేన విపశ్చితా. 213

యః = ఏది, అవశిష్యతే = శేషించునో, అయం = ఇది, ఆత్మా = ఆత్మ, స్వయంజ్యోతిః = స్వయముగ ప్రకాశించునదియు, పంచకోశ విలక్షణః = పంచకోశములకంటె భిన్నమైనదియు, అవస్థాత్రయ సాక్షీ= జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకు సాక్షియు, సన్=అబాధితమును, సర్వదా ఉండునదియు, నిర్వికారః = వికారరహితమును, నిరంజనః = ఇతరవస్తు సంబంధరహితమును, సదానన్దః = ఎల్లప్పుడును ఆనందస్వరూపుడును, సః=ఆ ఆత్మయే, విపశ్చితా=పండితునిచే, స్వాత్మత్వేన=స్వస్వరూపముగా విజ్ఞేయః = తెలియదగినది.

ఏది శేషించునో అది ఆత్మ అని పూర్వశ్లోకముతో సంబంధము.

ఉపక్రమముతో ఏకవాక్యత్వ ముండు విధమున, పరమాత్మనిరూపణ మును ఉపసంహరించుచున్నాడు.

అస్తి కశ్చిత్స్వయం నిత్య మహంప్రత్యయలమ్బనః,
అవస్థాత్రయసాక్షీ సన్ పంచకోశవిలక్షణః.

ఇత్యాదిశ్లోకముచే (127) ఏ ఆత్మనుగూర్చి చెప్పుటకు ఉపక్రమము చేయబడెనో, ఇంతవరకును పంచకోశవిలక్షణముగ ఉపపాదింప బడెనో, అట్టిదియు, జాగ్రదాద్యవస్థలకు సాక్షియు, అబాధ్యమును, వికారశూన్యమును, నిర్లేపమును, ఎల్లప్పుడును ఆనందస్వరూపమును అగు ఆ ఆత్మ, విపశ్చితా=వివేకకుశలుడగు వానిచే, స్వాత్మత్వేన= స్వస్వరూపముగా, తెలియదగినది. ఏ దేహాదులయందు ఆత్మత్వము కల్పితమో వాటి నన్నింటిని నిరసింపగా, అట్టి నిషేధమునకును, ఆరోపితములగు వాటి కన్నింటికిని ఆధారభూతమును, "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అను శ్రుతిచే సర్వాధారముగ బోధింపబడినదియు అగు పరబ్రహ్మయే వాస్తవరూపము. కావుననే శ్రుతి

అసన్నేవ స భవతి, అసద్బ్రహ్మేతి వేద చేత్,
అస్తి బ్రహ్మేతి చేద్వేద; సన్తమేనం తతో విదురితి.

'బ్రహ్మలేదు' అని అనుకొనువాడు 'నేనే లేను' అని చెప్పినట్లగును. 'బ్రహ్మ ఉన్నది' అని గ్రహించినచో అట్లు గ్రహించువాడు ఉన్నవా డగును అని చెప్పుచున్నది. అనగా బ్రహ్మయే స్వస్వరూపము గాన బ్రహ్మ 'అసత్' అని అన్నచో తానే 'అసత్' అని చెప్పినట్లగును. తాను బ్రహ్మకంటె వేరన్నచో తనచే ఆత్మగా గృహీతములగు కోశములను నిషేధించినపుడు నైరాత్మ్యము, అనగా 'తానే లేదు' అని చెప్పవలసివచ్చును, అని యర్థము.

## ఆత్మస్వరూప విషయకప్రశ్న

శిష్య ఉవాచ :

మిథ్యాత్వేన నిషిద్ధేషు కోశే ష్వేతేషు పఞ్చసు,
సర్వాభావం వినా కించిత్ న పశ్యామ్యత్ర హే గురో,
విజ్ఞేయం కిము వస్త్వస్తి స్వాత్మనాత్ర విపశ్చితా. 214

శిష్యుడు పలికెను : హే గురో=ఓ గురూత్తమా! ఏతేషు=ఈ, పంచసు=ఐదు, కోశేషు=కోశములలో, మిథ్యాత్వేన=మిథ్యాభూతముగా నిషిద్ధేషు=నిషేధింపబడిన వగుచుండగా, సర్వాభావం వినా=సర్వశూన్యత్వము తప్ప, కించిత్=ఏమియు, న పశ్యామి=చూడజాలకున్నాను. అత్ర=ఇచట, విపశ్చితా=విద్వాంసునిచే, స్వాత్మనా=స్వయముగ లేదా స్వస్వరూపముగ, విజ్ఞేయం=తెలియదగిన, వస్తు=వస్తువు, కిము అస్తి=ఏది ఉన్నది?

అవ. స్పష్టార్థ మగుటచే శ్రీచరణులు దానిని వ్యాఖ్యానింపలేదు.

## ఆత్మస్వరూపనిరూపణము

శ్రీ గురురువాచ :

సత్యముక్తం త్వయా విద్వన్ నిపుణోఽసి విచారణే,
అహమాదివికారాస్తే తదభావోఽ యమప్యథ. 215

సర్వే యేనానుభూయన్తే యస్స్వయం నానుభూయతే,
తమాత్మానం వేదితారం విద్ధి బుద్ధ్యా సుసూక్ష్మయా. 216

హే విద్వన్=ఓ విద్వాంసుడా!, త్వయా=నీ చేత, సత్యం=నీకు ఏ విధముగ అర్థమైనదో ఆ విధముగ, ఉక్తం=చెప్పబడినది. విచారణే=ఆలోచించుటయందు, నిపుణః అసి=నేర్పుకల వాడవుగా ఉన్నావు. పూర్వము అనేకవిధములుగా కనబడుచున్న అన్నియు ఆత్మ

యని భాసింపకుండునట్లు విచారణము చేయుటచే నీవు విచారణనిపుణుడ వని శ్లాఘించి, ఆతనికి ఉత్సాహముకలిగించి ఇపుడు చెప్పవలసిన సూక్ష్మ విషయమును చెప్పుచున్నాడు. తే = పూర్వము అనుభవింపబడిన, అహ మాది వికారాః = అహంకారము మొదలగు వికారములును, అథ = ఇపుడు తెలిసికొనబడుచున్న అయం = ఈ, తదభావోఽపి = పూర్వప్రతీతములగు అన్నింటియొక్కయు అభావమును, సర్వే = ఇవి యన్నియు, యేన = దేని చేత, అనుభూయన్తే = అనుభవింపబడుచున్నవో, పూర్వము తాదాత్మ్య బుద్ధితోడను, ఇపుడు భిన్నములుగను ఆ పదార్థములన్నియును, లేదా వాటి యొక్క అభావము దేనిచేత అనుభవింపబడుచున్నదో, యః = ఏది, స్వయం = తాను, నానుభూయతే = అనుభవింపబడదో, తం = అట్టి, వేది తారం = సర్వసాక్షియైన దానిని, సుసూక్ష్మయా = మిక్కిలి సూక్ష్మమైన అనగా ఏకాగ్రమును, ఇతర విషయరహితమును అగు, బుద్ధ్యా = బుద్ధితో, ఆత్మానం = ఆత్మనుగా, విద్ధి = తెలిసికొనుము.

అవ. ఆ విషయమునే స్పష్టముగ తెలియుటకై, మరల నిరూపించుచున్నాడు -

తత్సాక్షికం భవేత్తత్త ద్యద్య ద్యేనానుభూయతే,
కస్యా ప్యననుభూతార్థే సాక్షిత్వం నోపపద్యతే. 217

యద్యత్ = ఏది ఏది, యేన = ఎవనిచే, అనుభూయతే = తెలియబడు చున్నదో, తత్తత్ = అది యంతయు, తత్సాక్షికం = అతడే సాక్షిగా కలది, అననుభూతార్థే = అనుభవగోచరము కాని దానివిషయమున, కస్యాపి = ఎవ్వ నికిని, సాక్షిత్వం = సాక్షిత్వము, నోపపద్యతే = కుదరదు.

ఏది యేది, ఎవనిచే, అనుభూయతే = తన అనుభవములో విష యముగ చేయబడుచున్నదో, అదియంతయు, అతడే సాక్షిగా కలదై యుండును (దానికంతకును అతడే సాక్షిగ నుండును). 'సర్వా భావముతప్ప నాకేమియు కనబడుట లేదు' అని నీవు చెప్పియున్నావు. కావున నీవు సర్వాభావమును చూచుచున్నట్లు చెప్పినట్లైనది. ఈ విధ

ముగ నీవు చూచుచున్న సర్వాభావమునకు నీవే సాక్షివిగాన, తత్సాక్షియైన నీవే ఆత్మవుఅని భావము. అందులకు హేతువు చెప్పుచున్నాడు– అననుభూతార్థే=స్వకీయానుభవగోచరము కాని విషయమున, ఏ పురుషునకును సాక్షిత్వము కుదురదు. కర్తృత్వము లేకుండ, కేవలము తెలిసికొనువాడు మాత్రమే సాక్షియని ప్రసిద్ధము కదా?

అవ. సామాన్యముగ నిరూపించి, ప్రకృతమున చెప్పుచున్నాడు –

**అసౌ స్వసాక్షికోఽభావో యతః స్వేనానుభూయతే,**
**అతఃపరం స్వయం సాక్షాత్ ప్రత్యగాత్మా న చేతరః. 218**

**అసౌ = ఈ, అభావః = అభావము, స్వ సాక్షికః = తానే (ఆత్మయే) సాక్షిగాగలది, యతః=ఏ కారణమువలన, స్వేన=తనచే, అనుభూయతే = తెలియబడుచున్నదో, అతః = ఆ కారణమువలన, ప్రత్యగాత్మా=జీవాత్మ, స్వయం = తానే, సాక్షాత్= ప్రత్యక్షమైన, పరం=పరబ్రహ్మము, ఇతరః న చ = బ్రహ్మభిన్నము కాదు.**

ఈ, అహమాదిసర్వవికారముల అభావము, స్వసాక్షికః=తానే సాక్షిగా కలది. అందులకు కారణము–యతః=ఏ కారణమువలన, స్వేన=ఐదుకోశములను నిషేధించిన పిమ్మట గూడ శేషించిన తనచే, తెలియబడుచున్నదో, 'సర్వాభావము తప్ప మరేమియు నాకు కనబడుటలేదు' అను నీ మాటయే ఇందులకు ప్రమాణము. ఇట్లు చెప్పుటలో 'సర్వాభావమును చూచుచున్నాను' అని చెప్పినట్లైనది. కావున అభావము దర్శనవిషయ మనియు, నీవు ద్రష్ట అనియు తెలియుటచే ప్రత్యగాత్మయే, స్వయముగ, "యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ" అను శ్రుతి ననుసరించి, నిత్యాపరోక్షమైన సర్వోత్కృష్టమైన బ్రహ్మ. బ్రహ్మ భిన్నము కాదు.

అవ. ఈ చెప్పిన విషయమునే మరల స్పష్టముగను, విపులముగను తెలుపుచున్నాడు—

జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరం యోఽసౌ సముజ్జృమ్భతే
ప్రత్యగ్రూపతయా సదాహమహమిత్యంతఃస్ఫురన్నైకధా,
నానాకారవికారభాజిన ఇమాన్ పశ్యన్నహంధీముఖాన్
నిత్యానన్దచిదాత్మనా స్ఫురతి తం విద్ధి స్వమేతం హృది. 219

ప్రత్యగ్రూపతయా = సర్వాంతరముగ (అన్నిటికంటె లోపలనున్నదిగ), సదా = ఎల్లప్పుడును, అహమహమితి = నేను నేను అని, ఏకధా = ఒకేవిధముగ, ప్రత్యగ్రూపతయా = ప్రత్యగ్రూపముగ, అంతః = లోపల, స్ఫురన్ = స్వయముగ ప్రకాశించుచు, అహంకారప్రముఖాన్ = అహంకారము మొదలు దేహాంతములగు కోశములను, నానాకారవికారభాజినః = అనేకవిధములగు ఆకారములను, జన్మ-స్థితి-విపరిణామ-వృద్ధ్యపక్షయ-నాశరూపములగు అనేక వికారములను పొందుచుండెడు, అన్తఃకరణపదవాచ్యమగు అహంకారముగూడ దేహాద్యాకారమున పరిణమించుచున్నది గాన అది నానాకారమని చెప్పబడుచున్నది: ఇమాన్ = ఈ దృశ్యపదార్థములను, పశ్యన్ = విషయములను చేసికొనుచు, జాగ్రత్స్వప్నసుషుప్తిషు = సకలప్రాణులకు ప్రసిద్ధములగు జాగ్రదాదులగు మూడు అవస్థలయందును, స్ఫుటతరం = అతిస్ఫుటముగ, యః = ఏ, అసౌ = ఆ ఆత్మ: వివేకరహితునకు ఆత్మ దూరముగ నున్నట్లు కనబడుటచే విప్రకృష్టార్థబోధకమగు 'అదః' శబ్దము ప్రయోగింపబడినది, సముజ్జృమ్భతే = అన్యాపేక్షారహితమై భాసించుచున్నదో, నిత్యానన్దచిదాత్మనా = స్వయంప్రకాశమగు నిత్యానందస్వరూపముతో, హృది స్ఫురతి = హృదయమునందు స్ఫురించుచున్నదో, తం = అట్టి, ఏతం = దీనిని, వివేకరహితులకు దూరముగనున్నను, వివేకవంతులకు ప్రత్యగ్రూపమున సమీపముననున్న దీనిని, స్వం = స్వాత్మనుగా, విద్ధి = తెలిసికొనుము.

అవ. ఈ విధముగ సర్వసాక్షియై స్పష్టముగ నున్న ఆత్మను, వివిక్తరూపమున (వేరుగ) ఏల తెలిసికొనలేకున్నారు అని ఆశంకించుకొని ఇందులకు మూఢత్వమే కారణమని సదృష్టాన్తముగ చెప్పుచున్నాడు—

ఘటోదకే బిమ్బితమర్కబిమ్బ
మాలోక్యమూఢో రవిమేవ మన్యతే,
తథా చిదాభాస ముపాధిసంస్థం
భ్రాన్త్యాహమిత్యేవ జడో౽భిమన్యతే. 220

మూఢః=మూఢుడు, ఘటోదకే=ఘటములోనున్న ఉదకమునందు బిమ్బితం=ప్రతిబింబించి కనబడుచున్న, అర్క-బిమ్బం=సూర్యమండలమును, ప్రతిబింబమును, ఆలోక్య=చూచి, రవిమేవ=సూర్యునిగనే, మన్యతే=తలచునో; సూర్యుడు వేరు, ఇది ఆ సూర్యుని ప్రతిబింబము మాత్రమే అని ఆతనికి తెలియదో, తథా=అట్లే, ఉపాధిసంస్థం=బుద్ధ్యాద్యుపాధులయందు కనబడుచున్న, చిదాభాసం=చిత్ప్రతిబింబమును, భ్రాన్త్యా=అవివేకముచే, అహమిత్యేవ='నేనే' అని, అభిమన్యతే=తలచుచున్నాడు, భ్రాంతిపడుచున్నాడు; అనగా విపరీతజ్ఞానము కలవాడగుచున్నాడు.

అవ. వాస్తవమునందైతే –

ఘటం జలం తద్గతమర్కబిమ్బం
విహాయ సర్వం దివి వీక్ష్యతే౽ర్కః,
తటస్థితస్త త్త్రితయావభాసకః
స్వయంప్రకాశో విదుషో యథా తథా. 221

ఘటం=ఘటమును, జలం=జలమును, తద్గతం=ఘటములోని జలమునందున్న, అర్క-బిమ్బం=సూర్యప్రతిబింబమును, సర్వం=దీని నంతను, విహాయ=విడచి, తటస్థితః=ఉదాసీనుడును, అనగా ఈ మూడింటికంటె వేరుగ నున్నవాడును, అందులకు హేతువు-తత్త్రితయావభాసకః=ఘటము, అందలి జలము, అందలి సూర్యప్రతిబింబము అను మూడింటిని ప్రకాశింపజేయువాడును, స్వయంప్రకాశః=తనకంటె వేరైన దేనిచేతను భాసింపబడక తానుగనే భాసించువాడును అగు, అర్కః=సూర్యుడు, యథా=ఏ విధముగ, దివి=అంతరిక్షమునందు, విదుషా=బుద్ధిమంతునిచే, వీక్ష్యతే=చూడబడునో, తథా=అట్లే.

దేహం ధియం చిత్ప్రతిబిమ్బమేతం
విసృజ్య బుద్ధౌ నిహితం గుహాయామ్,
ద్రష్టారమాత్మాన మఖండబోధం
సర్వప్రకాశం సదసద్విలక్షణమ్. 222

నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మ
మన్తర్బహిఃశూన్య మనన్యమాత్మనః,
విజ్ఞాయ సమ్యఙ్నిజరూప మేతత్
పుమాన్విపాప్మా విరజా విమృత్యుః. 223

దేహః = దేహమును, ధియం = బుద్ధిని, గుహాయాం = గుహతో సమానమైన, బుద్ధౌ = బుద్ధియందు, నిహితం = ఉంచబడిన, ఏతం = ఈ, చిత్ప్రతిబింబం = చిత్తుయొక్క ప్రతిబింబమును, విసృజ్య = విడచి, ద్రష్టారం = ద్రష్టయు, అఖండబోధం = అపరిచ్ఛిన్నజ్ఞానస్వరూపమును, సర్వప్రకాశం = అన్నింటిని ప్రకాశింపజేయునదియు, సదసద్విలక్షణం = ప్రత్యక్షాప్రత్యక్షములకంటె భిన్నమును, నిత్యం = నిత్యమైనదియు, విభుం=సర్వవ్యాప్తమును, సర్వగతం = అన్నింటియందును ఉన్నదియు, సుసూక్ష్మం = బాగుగ సూక్ష్మమైనదియు, అన్తర్బహిఃశూన్యం = లోపల బైట అను నవి లేనిదియు, ఆత్మనః = బ్రహ్మకంటె, అనన్యం = భిన్నము కానిదియు అగు, ఏతత్ = ఈ, నిజరూపం = తనస్వరూపమును, విజ్ఞాయ=తెలిసికొని, పుమాన్ = పురుషుడు, విపాప్మా = పాపరహితుడై, విరజాః = రజఃశూన్యుడై, విమృత్యుః = మృత్యురహితుడై (అగును).

దేహం = ఘటమువలెనున్న స్థూలదేహమును, ధియం = స్వచ్ఛమగుటచేతను సూక్ష్మమగుటచేతను జలమువలె లోపలనున్న బుద్ధిని, గుహాయాం = కప్పివేయునదగుటచే అనేకములగు అనర్థములతో గూడినదియు, గుహతో సమాన మైనదియు అగు, బుద్ధౌ = బుద్ధియందు, నిహితం = ఉంచబడిన, ఏతం = భ్రాంతిచేత 'అహం' అని ప్రతీయమానమగుచున్న, ఈ చిత్ప్రతిబింబమును, విడచి, ద్రష్టారం = వెనుకచెప్పిన విధమున తటస్థమై ఆ మూడింటిని భాసింప

జేయుచు సర్వసాక్షిగ నున్నదియు, ఆత్మానం = అన్నింటికంటెను అంతరమైనదియు, అఖణ్డబోధం = అపరిచ్ఛిన్న జ్ఞానస్వరూపమును, కావుననే. సర్వప్రకాశం=అన్నిటికిని ప్రకాశమును ఇచ్చునదియు, సద సద్విలక్షణం= ప్రత్యక్షములు (సత్) అగు తేజోజలాన్నములకంటెను అప్రత్యక్షములగు (అసత్) వాయ్వాకాశాదులకంటెను భిన్నమైనదియు లేదా వ్యక్తావ్యక్తములకంటె భిన్నమని యర్థము. నిత్యం = కాల పరిచ్ఛేదశూన్యమును, విభుం = దేశపరిచ్ఛేదము లేనిదియు, సర్వ గతం = అన్నింటికిని ఉపాదానకారణమగుటచే అన్నింటితోడను సమ న్వయించునదియు, ఐనను, సుసూక్ష్మం = రూపాదిరహితమగుటచే తెలియశక్యము కానిదియు, "ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే"- అన్నిభూతములయందును గూఢమై ఉన్న ఆత్మ స్పష్ట ముగ ప్రకాశింపదు అని శ్రుతి చెప్పుచున్నది. అన్తర్బహిఃశూన్యం = 'అనన్తర మబాహ్యమ్' అను శ్రుతి ననుసరించి లోపల బైట అనునవి లేనిదియు, ఆత్మనః అనన్యం = 'అయమాత్మా బ్రహ్మ' అను శ్రుతి ననుసరించియు, పూర్వోక్తయుక్తి ననుసరించియు, బ్రహ్మకంటె భేదములేనిదియు, లేదా 'అనన్యం' అనుపదమునకు 'అద్వితీయము' అని యర్థము. ఆత్మనః = తనయొక్క, నిజరూప=వాస్తవిక స్వరూప మును, తెలిసికొని, పుమాన్ = పూర్వము మరియొక విధముగ గ్రహించిన ఈ పురుషుడే, విపాప్మా =పోయిన పాపములు కలవాడై, "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి" ఇత్యాది స్మృతి జ్ఞానాగ్ని సర్వకర్మలను దహించునని చెప్పుచున్నది. అందులకు కారణము, విరజాః = నిర్గుణ బ్రహ్మనిష్ఠుడగుట చేతను తత్స్వరూపుడగుట చేతను తాపహేతువగు రజస్సు లేనివాడు ఇచట పాపపదము పుణ్యమునకు ఉపలక్షకము. పుణ్యముగూడ ముముక్షువునకు అనిష్టముకదా? ఈ విధముగ జన్మకు నిమిత్తమగు కర్మ లేకపోవుటచే, విమృత్యుః = మృత్యువుతో కూడిన సంసారములేనివాడు అని యర్థము. అనగా స్వరూపమునుండి చ్యుతి

లేనివాడు అని భావము. 'భవతి' అని అధ్యాహారము. "ప్రమాదం వై మృత్యుమహం బ్రవీమి"-ప్రమాదమే అనగా స్వస్వరూపమును తెలిసికొనకుండుటయే, "మృత్యువని" నేను చెప్పుచున్నాను అని సనత్సుజాతవాక్యము.

అవ. కావుననే_

విశోక ఆనన్దఘనో విపశ్చి
త్స్వయం కుతశ్చిన్న బిభేతి కశ్చిత్,
నాన్యోఽస్తి పన్థా భవబన్ధముక్తే
ర్వినాస్వతత్త్వావగమం ముముక్షోః. 224

(ఈ ఆత్మ) విశోకః = దుఃఖము లేనిది. కావుననే ఆనన్దఘనః = ఆనందమే మూర్తిగా గలది, దుఃఖమిశ్రము కాని ఆనందస్వరూపము, విపశ్చిత్ = సర్వాత్మభూతమగు బ్రహ్మను తెలిసికొనిన వా డగుటచే సర్వజ్ఞము, స్వయం = తాను, కుతశ్చిత్ = ఎవరివలనను, న బిభేతి = భయపడదు, రెండవవారెవరును లేకపోవుటచే భయప్రసక్తి లేదు. ఈ కారణమువలన, ముముక్షోః = నిత్యము, నిరతిశయము, నిరామయము, స్వయంప్రకాశము అగు సుఖరూపమోక్షేచ్ఛకలవానికి, స్వతత్త్వావగమం వినా = తనయొక్క యాథాత్మ్యమును తెలిసికొనుటతప్ప, భవబన్ధముక్తేః = సంసారబంధముక్తికి, అన్యః పన్థాః = మరియొక మార్గము, కశ్చిత్ = ఏదియు, నాస్తి = లేదు.

అవ. ఈ విధముగ 'త్వం' పదార్థమైన జీవుని అవస్థాత్రయమునకు సాక్షిగను, పంచకోశవిలక్షణునిగాను, అసంగునిగను శోధించి, ప్రపంచసహితముగా కన్పట్టుచున్న 'తత్' పదవాచ్యార్థమునుగూడ పరిశోధించి, సర్వోపనిషత్తుల తాత్పర్యమైన ఆ రెండింటియొక్క ఐక్యమును సంప్రదాయానుసారముగ, సవిస్తరముగ చెప్పనున్నవాడై, ముందుగ భూమికను ఏర్పరచుచున్నాడు_

బ్రహ్మాభిన్నత్వవిజ్ఞానం భవబన్ధస్య కారణమ్,
యేనాద్వితీయమానన్దం బ్రహ్మ సమ్పద్యతే బుధః. 225

బ్రహ్మాభిన్నత్వ విజ్ఞానం='అహం బ్రహ్మాస్మి' అను అపరోక్షజ్ఞానము, భవమోక్షస్య=సంసారవిముక్తికి, కారణం=కారణము. యేన=ఏ విజ్ఞానముచే, బుధః=పండితుడు, అద్వితీయం=భేదరహితమును, ఆనన్దం=సుఖరూపమును, బ్రహ్మ=బ్రహ్మను, సమ్పద్యతే=పొందునో, లేదా బ్రహ్మగా అగునో, 'బ్రహ్మవిదాప్నోతి పరమ్'-బ్రహ్మవేత్త బ్రహ్మను పొందును 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి'-బ్రహ్మవేత్త బ్రహ్మగానే అగును అని శ్రుతివాక్యములు, "అసతో మా సద్గమయ; మృత్యుర్వా అసత్, సదమృతం, మృత్యోర్మా అమృతం గమయ అమృతం మా కురు ఇత్యేవైతదాహ"-నన్ను అసత్తునుండి సత్తు చేర్చుము. అసత్తు అనగా మృత్యువు, సత్ అనగా అమృతము అనగా మోక్షము. కావున ఈ వాక్యము-నన్ను మృత్యువునుండి అమృతమును చేర్చుము; నన్ను మరణరహితుని చేయుము- అని చెప్పుచున్నది అను శ్రుతి ననుసరించి బ్రహ్మభావమే మోక్షము.

అవ. బ్రహ్మభావము కలిగినచో భవమోక్షము ఎట్లు కలుగును అని శంకించువానిని గూర్చి చెప్పుచున్నాడు-

బ్రహ్మభూతస్తు సంసృత్యై విద్వాన్నావర్తతే పునః,
విజ్ఞాతవ్యమతః సమ్యగ్ బ్రహ్మాభిన్నత్వ మాత్మనః. 226

బ్రహ్మభూతః=బ్రహ్మగా అయిన, విద్వాన్=విద్వాంసుడు, పునః=మరల, సంసృత్యై=సంసారముకొరకు, న తు ఆవర్తతే=తిరిగి రానే రాడు. 'న స పునరావర్తతే'-అతడు మరల తిరిగి రాడు అని శ్రుతి చెప్పుచున్నది. 'తు' శబ్దమునకు అవధారణము (నిశ్చయము) అర్థము. అతః=ఆ కారణమువలన, ఆత్మనః=ఆత్మయొక్క, బ్రహ్మాభిన్నత్వం=బ్రహ్మకంటె అభిన్నత్వము, సమ్యక్=బాగుగ, విజ్ఞాతవ్యం=తెలియదగినది.

అవ. ప్రపంచము మిథ్యాభూతము అని ప్రతిపాదించుటద్వారా బ్రహ్మనిష్ప్రపంచము అను విషయమును చెప్పుటకు ఉపక్రమించు చున్నాడు-

సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ విశుద్ధం పరం స్వతఃసిద్ధమ్,
నిత్యానన్దైకరసం ప్రత్యగభిన్నం నిరన్తరం జయతి. 227

సత్యం=కాలత్రయమునందును బాధలేనిదియు, జ్ఞానం=జ్ఞాన స్వరూపమైనదియు అనగా స్వయంప్రకాశమును, అనన్తం=అంతటను వ్యాపించినదగుటచే దేశతః పరిచ్ఛేదము లేనిదియు, నిత్య మగుటచే కాలతః పరిచ్ఛేదములేనిదియు, అద్వితీయ మగుటచే వస్తుతః పరిచ్ఛేదము లేనిదియు, విశుద్ధం=స్వాభావికములుగాని ఆగన్తుకములుగాని అగు సకల మలములతో శూన్యమగు నదియు, పరం=మాయాతీతమును, స్వతఃసిద్ధం= ఉనికి విషయమునగాని, ప్రకాశించు విషయమునగాని పరాపేక్షలేనిదియు, నిత్యానన్దైకరసం=దుఃఖస్పర్శలేని నిత్య సుఖస్వరూపమును, ప్రత్యగ భిన్నం=జీవాభిన్నమును, నిరంతరం=భేదరహితమును అనగా అఖండ స్వరూపమును అగు, బ్రహ్మ=బ్రహ్మ, జయతి=సర్వోత్కర్షతో ఉంటు న్నది. ఇది వస్తూపక్షేపము. ('ఒకానొకవస్తువు ఉన్నది' అని ప్రారం భముననే చెప్పుటకు వస్తూపక్షేపమని పేరు)

అవ. 'అనన్త' పదమునకు అర్థమైన దేశతః, కాలతః, వస్తుతః పరిచ్ఛేదము లేనిది అను దానిలో ఒకభాగమైన వస్తుపరిచ్ఛేద శూన్యత్వమును ఉపపాదించుచున్నాడు-

## బ్రహ్మ - జగత్తులకు ఏకత్వము

సదిదం పరమాద్వైతం స్వస్మా
దన్యస్య వస్తునోఽభావాత్,
న హ్యన్యదస్తి కించిత్ సమ్యక్పర
తత్త్వబోధ సుదశాయామ్. 228

ఇదం=ఈ బ్రహ్మ, సత్=సత్తు (సర్వదా ఉండునది). స్వస్మాత్= తనకంటె, అన్యస్య=భిన్నమైన, వస్తునః=వస్తువుయొక్క, అభావాత్= లేకపోవుటవలన, పరమాద్వైతం=పరమమైన ద్వితీయవస్తుశూన్యము. సమ్యక్=బాగుగా, పరతత్త్వబోధసుదశాయాం = పరతత్త్వజ్ఞానము కలిగిన దశయందు, అన్యత్=మరియొకటి, కించిత్=ఏదియు, నాస్తి హి= లేదు కదా?

ఇదం=ప్రకృతమైన ఈ బ్రహ్మ, సత్= అస్తీతి సత్ ' అనగా సర్వదా ఉనికి గలది. పరమాద్వైతం=పరమమైన అద్వైతము. పరమమైన అద్వైతమనగా గుణాగుణభావాదులచే ఏర్పడిన తాదాత్మ్యము కూడ ఎన్నడును లేకుండుట. ద్వయోర్భావః=ద్వితా- అనగా రెండుగ నుండుట ద్వితమే ద్వైతము. ద్వైతము లేనిది అద్వైతము_భేదశూన్యము అని యర్థము. అందులకు కారణము- తనకంటె మరియొకవస్తువు లేకపోవుటవలన. మరియొక వస్తువు ఉన్నచో భేదము ప్రసక్తమయ్యెడిది. అది లేదుకాన అద్వైతము.

(ఆశంక) అనేకభేదములుగల ప్రపంచము, అనేకజీవులు ఉండగా తనకంటె అన్యమైనదేదియు లేదని చెప్పుట ఎట్లు?

(సమాధానము) అను ఆశంకకు అవకాశము లేదు. 'వస్తు' పదముచే అవి యన్నియు వాస్తవములు కావని సూచింపబడినది. కాలన్పికవస్తువునుబట్టి భేదమునకు అవకాశము లేదు. కల్పితసర్పమును బట్టి రజ్జువు సద్వితీయత్వము- అనగా రజ్జువుతోపాటు మరియొక వస్తువుకూడ ఇక్కడ ఉన్నది అని చెప్పుట యుక్తము కాదు కదా? జగత్తు మొదలగునవి పారమార్థికములైనచో అవి ఎల్లప్పుడును భాసించెడివి. అట్లు భాసింపకుండుటచే వాటికి వస్తుత్వము లేదు. ఈ విషయమునే 'సమ్యక్ పరతత్త్వబోధసుధాయాం' ఇత్యాది వాక్యమున చెప్పుచున్నాడు. ఇపుడు అవిద్యచే మరియొక విధముగ కనబడుచున్నది గాన 'సమ్యక్' అని చెప్పబడినది. ఏ అవస్థయందు-

"నాన్యత్పశ్యతి" ఇత్యాది శ్రుత్యుక్త విధమున పరతత్త్వవిషయకమగు సమ్యగ్జ్ఞానము కలుగునో అట్టి శోభనమగు అవస్థయందు అని యర్థము. హి = ఏ కారణమువలన, మరియొకటి ఏదియును లేదో ఆ కారణమువలన, అనగా తనకంటె భిన్నమగు వస్తువేదియును లేకపోవుటవలన, ఈ సత్తు పరమాద్వైతము అని అన్వయము.

అవ. 'తదనన్యత్వమారమ్భణ శబ్దాదిభ్యః' - శ్రుతులలోని ఆరంభణ శబ్దాదులను బట్టి ప్రపంచము బ్రహ్మకంటె అభిన్నము ఇత్యాది న్యాయములచే నిర్ణయించిన విధమున, అజ్ఞానదశలో గూడ ప్రపంచము బ్రహ్మాభిన్నమే- అనగా బ్రహ్మకంటె వేరుగా ప్రపంచము లేదు- అను విషయమును నిరూపించుచున్నాడు-

యదిదం సకలం విశ్వం నానారూపం ప్రతీతమజ్ఞానాత్,
తత్సర్వం బ్రహ్మైవ ప్రత్యస్తాశేషభావనాదోషమ్. 229

అజ్ఞానాత్ = అజ్ఞానమువలన, నానారూపం = అనేకవిధములగు రూపముకలదియు, సకలం = సమస్తమైన, యత్ = ఏ, ఇదం = ఈ, విశ్వం = ప్రపంచము, ప్రతీతం = కల్పితమైనదో, తత్ సర్వం = అది యంతయు, ప్రత్యస్తాశేషభావనాదోషమ్ = నిరస్తములగు సకలభావనా రూపములైన దోషములుగల, అనగా కల్పనారూపములగు సకలదోషము లతో శూన్యమైన, బ్రహ్మైవ = బ్రహ్మయే.

అవ. ఈ విషయమును దృష్టాంతపూర్వకముగ ఉపపాదించు చున్నాడు-

మృత్కార్యభూతోఽపి మృదో న భిన్నః
కుమ్భోఽస్తి సర్వత్ర తు మృత్స్వరూపాత్,
న కుమ్భరూపం పృథగస్తి కుమ్భః
కుతో మృషా కల్పితనామమాత్రః. 230

మృత్కార్యభూతోఽపి = మట్టియొక్క కార్యమైనను, మృదః = మట్టికంటె, భిన్నః = వేరైన, కుమ్భః = కుంభము, నాస్తి = లేదు. సర్వత్ర తు = అంతటను, మృత్స్వరూపాత్ = మృత్తుకంటె అభిన్నమగుట వలన, కుమ్భరూపం = కుంభముయొక్క రూపము, పృథక్ = వేరుగ, నాస్తి = లేదు, మృషాకల్పితనామమాత్రః = అసత్యముగా కల్పితమగు నామమాత్రముగల, కుమ్భః = కుంభము, కుతః = ఎట్లు వేరుగ నుండును?

మృత్తుయొక్క కార్యమైనను కుంభము మృత్తుకంటె వేరుగ లేదు. సర్వత్ర = మూలమునందును, అగ్రభాగమునందును, పార్శ్వములయందును అంతటను గూడ, మృత్స్వరూపాత్ = మృత్తుకంటె అభిన్నమగుటవలన, విశాలమైన మట్టు ఉదరమువంటి ఆకారవిశేషము గల మృత్తే కుంభమని చెప్పబడుచున్నది. న కుంభరూపం పృథగస్తి = కుంభమునకు మృత్తుకంటె భిన్నమైన నీలాదిరూపము గాని, మృత్తు యొక్క ఆకారము యొక్క రూపముకంటె వ్యతిరిక్తమగు ఆకారము గాని లేదు. ఆకారవిశేషముతో కూడిన మృత్తునే కుంభమందురు. కుంభమునకు వేరుగ ఆకార మేదియును లేదు. "వాచారమ్భణం వికారో నామధేయమ్" - వికారము వాఙ్మాత్రకల్పితమగు నామధేయము అను శ్రుతి ననుసరించి కుంభము మిథ్యాకల్పితనామమాత్రమే. కుతః = ఏ హేతువువలన వేరుగ నున్నది? మృత్తుయొక్క ఆకారముకంటె భిన్నమగు ఆకారము లెదు; కేవలము 'కుంభము' అనెడు శబ్దము కల్పింపబడినది. ఒకే దేవదత్తుడు కాళ్లు చేతులు మడిచి పెట్టుకొనినపుడును, అవి చాపుకొని యున్నప్పుడును ఎట్లు వేరువేరు వ్యక్తి కాడో అట్లే కుంభము గూడ మృత్తుకంటె భిన్నము కాదని యర్థము.

అవ. ఈ విషయమునే స్పష్టముగ తెలియుటకై మరల ప్రతిపాదించుచున్నాడు-

కేనాపి మృద్భిన్నతయా స్వరూపం
ఘటస్య సందర్శయితుం న శక్యతే,
అతో ఘటః కల్పిత ఏవ మోహాత్
మృదేవ సత్యం పరమార్థరూపమ్. 231

కేనాపి=ఏ పురుషునిచేతనైనను, లేదా బ్రహ్మచేత గూడ అని యర్థము ఘటస్య = ఘటముయొక్క, స్వరూపం=స్వరూపము, మృద్భిన్నతయా= మట్టికంటె భిన్నముగ, సందర్శయితుం=చూపుటకు, న శక్యతే=శక్యము కాదు, అతః=ఆ కారణమువలన, ఘటం=ఘటము, మోహాత్=అజ్ఞానము వలన, భిన్నతయా=వేరుగా, కల్పిత ఏవ=కల్పింపబడినది మాత్రమే, మృదేవ=మట్టిమాత్రమే, సత్యం=నిజమైనది, పరమార్థభూతం=ఘటము యొక్క ముఖ్యార్థమైనది. 'మృత్తికేత్యేవ సత్యమ్' అను శ్రుతి ననుసరించియు, ఆదియందును అంతమునందును ఉన్నదగుట వలనను మృత్తికయే ఘటముయొక్క యథార్థస్వరూపము.

అవ. ఈ విధముగ మృద్ఘటముల దృష్టాంతముచే ఉపాదాన కారణముకంటె భిన్నముగ ఉపాదేయమగు కార్యము లేదు అని చెప్పి దీనిని దార్ష్టాంతికమునందు సమన్వయించుచున్నాడు -

సద్బ్రహ్మకార్యం సకలం సదైవ
సన్మాత్రమేత న్న తతోఽన్యదస్తి,
అస్తీతి యో వక్తి న తస్య మోహో
వినిర్గతో నిద్రితవత్ప్రజల్పః. 232

సద్బ్రహ్మకార్యం=సద్రూపమైన బ్రహ్మయొక్క కార్యమైన, ఏతత్=ఈ, సకలం=సమస్తమైన వియదాదికము, సన్మాత్రం=బ్రహ్మ రూపమే, తతః=దానికంటె, అన్యత్=వేరైనది, నాస్తి=లేదు, యః= ఎవడు, అస్తీతి=బ్రహ్మభిన్నముగ వియదాదికార్యము ఉన్నదని, వక్తి= చెప్పునో, తస్య=వానియొక్క, మోహః=అజ్ఞానము, న వినిర్గతః= తొలగిపోలేదు, నిద్రితవత్=నిద్రించిన వానియొక్కవలె, ప్రజల్పః= ప్రేలుటమాత్రమే.

సద్రూపమైన బ్రహ్మయొక్క కార్యమైన సకలమగు వియదాదికము ఎల్లప్పుడును బ్రహ్మరూపమే. నైయాయికాదిమతమున సత్తులగు కపాలాదుల కార్యమైన ఘటాదికము కారణభిన్నమైన దనియు, అదికూడ 'సత్' అనియు చెప్పబడును. ఇచట ఆ విధముగ కాదని చెప్పుచున్నాడు-ఏ విధముగ ఘటము మృణ్మాత్రమో అట్లే వియదాది కూడ బ్రహ్మరూపమే కాని తద్భిన్నముగ లేదు. ఆ యా ఉపాదేయములు (కార్యములు) ఆ యా ఉపాదానకారణములకంటె భిన్నముగ ఉండవు. బ్రహ్మ సర్వోపాదానము. కావున దానికంటె భిన్నముగ ఏమియు లేదు అని యర్థము. కావుననే "మృత్తికేత్యేవ సత్యమ్" అను శ్రుతియందు 'ఇతి' శబ్దము ప్రయుక్తమైనది. మృణ్మయమైనవి అన్నియు సత్యములైనచో అవి మృత్తికారూపములుగనే సత్యములు; మరొకరూపమున, అనగా ఘటాదిరూపమున కావు-అని దాని యర్థము. ఇట్లే మృత్తు కూడ, తన ఉపాదానముయొక్క రూపముచేతనే సత్యము. అనగా మృత్తుకు ఉపాదానకారణము, పంచీకృతమహాభూతములు. వీటి కార్యమగుటచే మృత్తుగూడ వీటికంటె భిన్నముగలేదు. వీటి రూపముననే మృత్తు సత్యము.

"యదగ్నే రోహితం రూపం తేజసస్తద్రూపం
యచ్ఛుక్లం తదపాం, యత్కృష్ణం తదన్నస్య
అపాగాదగ్నే రగ్నిత్వం వాచారమ్భణం
వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్"

అగ్నిలోని ఎఱ్ఱనిరూపము తేజస్సుకు సంబంధించినది, తెల్లనిరూపము ఉదకమునకు సంబంధించినది; నల్లనిరూపము పృథివికి సంబంధించినది; ఈ విధముగ విడదీసి చూచినచో అగ్నియొక్క అగ్నిత్వము తొలగిపోయినది. నామధేయము నామమాత్రకల్పితమగు వికారము. మూడురూపములు అనునది మాత్రమే సత్యము అను శ్రుతిననుసరించి ఆ భూతములను అపంచీకృతభూతముల రూపమున వేరువేరుగ చేసి

చూపగా, పృథివి జలరూపమగును; జలము తేజోరూపమగును, తేజస్సు వాయురూప మగును; వాయువు వియద్రూప మగును; వాయువు సద్రూపమగును. ఈ విధముగ చివరకు వెళ్లుసరికి సద్రూపమగు బ్రహ్మ కంటె భిన్నముగ సత్యమైన దేదియు లేదు గాన 'ఇదియంతయు సన్మాత్రమే' అని చెప్పబడినది. ఆ విషయమునే స్పష్టీకరించుటకు 'తతోఽన్యన్నాస్తి' అని చెప్పబడినది. ఇట్లున్నను, అస్తీతి యో వక్తి = బ్రహ్మకంటె భిన్నముగ వియదాదిజగత్తు ఉన్నది అని ఎవడు చెప్పునో, వానియొక్క, మోహః = భ్రమ లేదా అజ్ఞానము, న వినిర్గతః = నష్టము కాలేదు. అది, నిద్రితవత్ ప్రజల్పః = నిద్రలోనున్నవాడు అసంబద్ధముగ ఏమేమియో ఎట్లు మాటలాడుచుండునో అట్లే, ఉపాదానముకంటె భిన్నమైన కార్యమున్నదను మాటగూడ, విచారజన్యమగు జ్ఞానములెకుండ చెప్పినదే.

అవ. శ్రుతు లన్నిటికిని ఐకమత్య మున్నదని సూచించుటకై ఛాందోగ్యశ్రుత్యనుసారముగ చెప్పిన విషయమును మరల ఆథర్వణిక శ్రుత్యనుసారముగకూడ చెప్పుచున్నాడు -

బ్రహ్మైవేదం విశ్వమిత్యేవ వాణీ
శ్రౌతీ బ్రూతేఽథర్వనిష్ఠా వరిష్ఠా,
తస్మాదేత ద్బ్రహ్మమాత్రం హి విశ్వం
నాధిష్ఠానాద్భిన్నతారోపితస్య. 233

అథర్వనిష్ఠా = అథర్వవేదముతో సంబంధించినదియు, వరిష్ఠా = శ్రేష్ఠమైన, శ్రౌతీ = వేదసంబంధమైన, వాణీ = వాక్కు, ఇదం = ఈ, విశ్వం = ప్రపంచము, బ్రహ్మైవ = బ్రహ్మయే, ఇత్యేవ = అనియే, బ్రూతే = చెప్పుచున్నది, తస్మాత్ = ఆ కారణమువలన, ఏ తత్ = ఈ, విశ్వం = ప్రపంచము, బ్రహ్మమాత్రం = కేవల బ్రహ్మస్వరూపమే, అధిష్ఠానాత్ = అధిష్ఠానముకంటె, ఆరోపితస్య = ఆరోపితమైనదానికి, భిన్నతా = భిన్నత్వము న = లేదు.

సామాన్యరూపమున 'శ్రౌతి' అనియు విశేషరూపమున అథర్వనిష్ఠా అనియు చెప్పుచున్నాడు. అథర్వనిష్ఠా=అథర్వవేదముతో సంబంధించిన, లేదా బ్రహ్మయొక్క జ్యేష్ఠపుత్రుడగు అథర్వుడనువాని యందుఉన్న, వైదికమైన, అత్యుత్తమమైన "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్" అనువాక్కు, ఈ జగత్తు అంతయు, బ్రహ్మైవ=బ్రహ్మయే, దానికంటె భిన్నమైనది కాదు అని 'ఏవ' కారముచే ప్రపంచమునకు వేరుగ సత్తను నిషేధించి, చెప్పుచున్నది గాన ఈ విశ్వమంతయు బ్రహ్మమాత్రమే. హి=నిశ్చయము. కల్పితమైనదానికి అధిష్ఠానము కంటె భిన్నత్వము లేదు. ఇట్లు చెప్పుటచే- అనాదియగు అజ్ఞానాదికమునకు బ్రహ్మ ఉపాదానకారణము కాదు కావున అది బ్రహ్మకంటె భిన్నము, అనెడు ఆశంక నిరాకృతమైనది. (అజ్ఞానాదికము గూడ బ్రహ్మపై కల్పితము గాన, దానికి, అధిష్ఠానభూతమగు బ్రహ్మకంటె భిన్నమగు సత్త లేదు అని భావము.)

అవ. ఈ విధముగ శ్రుతిచే ప్రపంచసత్యత్వమును నిరాకరించి శ్రుత్యనుసారిణియగు యుక్తి ననుసరించిగూడ ప్రపంచము సత్యము కాదని చెప్పుచున్నాడు-

సత్యం యది స్యాజ్జగదేతదాత్మనోఽ
నన్తత్వహాని ర్నిగమాప్రమాణతా,
అసత్యవాదిత్వ మపీశితుః స్యాత్ నైత
త్త్రయం సాధుహితం మహాత్మనామ్. 234

ఏతత్=ఈ, జగత్=జగత్తు, సత్యం స్యాద్యది=సత్యమైనచో, ఆత్మనః=ఆత్మయొక్క, అనన్తత్వహానిః=అనంతత్వమునకు హానియు, నిగమాప్రమాణతా=వేదమునకు అప్రామాణ్యమును, ఈశితుః=ఈశ్వరునకు, అసత్యవాదిత్వమపి=అసత్యము పల్కుట యను దోషమును, స్యాత్= సంభవించును. మహాత్మనాం=మహాత్ములకు, ఏతత్=ఈ, త్రయం= మూడును, సాధుహితం=పరమహితమైనవి, న=కాదు.

ఏతత్ జగత్ = కనబడుచున్న ఈ విశ్వము. సత్యం యది స్యాత్ = అకల్పితమైనచో, ఆత్మకు అనంతత్వహాని కలుగును. అనగా ఈ పక్షమున అకాల్పనికమును, వాస్తవమును అగు జగత్తుచే బ్రహ్మ పరిచ్ఛిన్న మగుచున్నది గాన అన్యోన్యాభావములో ప్రతియోగి కాకుండుట అనెడు వస్తుపరిచ్ఛేదశూన్యత్వము ఉండదు. 'ఘటము పటము కాదు; పటము ఘటము కాదు" అను అన్యోన్యాభావములో ఘటపటములు ప్రతియోగులని చెప్పబడును. అనగా ఘటము పటము కంటె భిన్నమగుటచే పటమున్న స్థలములో ఘటముండదు; ఘటమున్న స్థలములలో పటముండదు. ఈ విధముగ రెండువస్తువులును యథార్థములే యైనచో ఆ వస్తువున్నచోట ఈ వస్తువుండదు. ఈ వస్తువున్నచోట అది ఉండదు ఈ విధముగ ఒకదానిచోట మరి యొకటి ఉండకపోవుటయే వస్తుతః పరిచ్ఛేదము. బ్రహ్మవలెనే జగత్తు కూడ సత్య మైనచో జగత్తు ఉన్నచోట బ్రహ్మ ఉండజాలదు గాన శ్రుతిప్రతిపాదితమగు బ్రహ్మయొక్క అనంతత్వము, అనగా వస్తుతః అపరిచ్ఛిన్నత్వము, అసంగతమగును అని యభిప్రాయము. బ్రహ్మ యొక్క అనంతత్వమునకు హానివచ్చినచో రానిమ్ము అని అన్నచో, 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' ఇత్యాదివేదము ప్రత్యక్షవిరుద్ధమగు అర్థమును బోధించుటచే అప్రమాణము కావలసివచ్చును. అందులకు గూడ ఇష్టాపత్తియే యన్నచో, ఈశితురపి = పరమాప్తుడును, సర్వజ్ఞుడును అగు పరమేశ్వరునకు గూడ అసత్యవాదిత్వము వచ్చును. అదికూడ వచ్చిన రానిమ్ము అనినచో, మహాత్మనా = ఆస్తికులకు, లేదా, శ్రుత్యుపదేశముచేతను, ఆచార్యోపదేశముచేతను, పరిచ్ఛిన్నము లగు పంచకోశముల విషయమున ఆత్మబుద్ధిని విడచి బ్రహ్మసాక్షాత్కారమును పొందినవా డగుటచే అఖండాకారవృత్తిగల అంతఃకరణము కలవారికి అని యర్థము. ఈ త్రయమును, సాధు = హితమైనది, అంగీకారయోగ్యమైనది కాదు. ఇది స్వానుభవమునకు విరుద్ధము.

అవ. ప్రపంచమిథ్యాత్వ విషయమున భగవద్గీతను గూడ ప్రమాణముగ చూపుచున్నాడు-

ఈశ్వరో వస్తుతత్త్వజ్ఞో న చాహం తేష్వవస్థితః,
న చ మత్స్థాని భూతానీ త్యేవమేవ వ్యచీకథత్. 235

వస్తుతత్త్వజ్ఞః = వస్తుతత్త్వము తెలిసినవాడగు, ఈశ్వరః = శ్రీకృష్ణుడు, "అహం = నేను, తేషు = ఆ భూతములందు, న చావస్థితః = లేను, భూతానిచ = భూతములుగూడ, మత్స్థాని = నాలో నున్నవి, న = కాదు", ఇత్యేవమేవ = అని, వ్యచీకథత్ = చెప్పెను.

అజ్ఞానము లేకపోవుటచే భ్రమాదిదోషములు లేనివాడును, వస్తుయాథాత్మ్యమును ఎరిగినవాడును అగు శ్రీకృష్ణుడు

మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః,
న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్.

అను ఒకవాక్యమున "సర్వభూతములును నాయందే ఉన్నవి; నాయందు లేవు" అని చెప్పి, సర్వభూతములును, వాటియొక్క అభావమును ఒకేచోట ఉండుట అనునది ఎట్లు అని ఆశంక కలుగగా- "పశ్య మే యోగమైశ్వరమ్" అను వాక్యముచే, ఈశ్వరుడనగు నాయొక్క, అఘటితఘటనారూపమగు యోగమును అనగా మాయను చూడుము అని చెప్పినాడు. అనగా ఇది యంతయు మాయాకల్పితమని యర్థము. ఇదియే మిథ్యాత్వము. "ప్రతిపన్నోపాధౌ అభావప్రతియోగిత్వం మిథ్యాత్వమ్" అని మిథ్యాత్వలక్షణము. ఒకవస్తువునకు ఏది ఆధారమని భావింపబడుచున్నదో దానియందే ఆ వస్తువు లేకుండుట మిథ్యాత్వము అని దీని యర్థము. ఈ విషయము-"ఈ భూతములు నాయందున్నవి; ఇవి నాయందు లేవు" అను మాటలచే చెప్పబడినది. పైని చెప్పిన మిథ్యాత్వలక్షణమునకు- ఒకవస్తువు తనకు ఆధారమని భావింపబడు దేనియందును లేకుండుట, అనగా

అత్యంతాభావమునందు ప్రతియోగిగ ఉండుట, అనగా ఎచటను లేకుండుట (స్వప్రకారక ధీవిశేష్యతా వ్యాపకాత్యన్తాభావప్రతి యోగిత్వం) అని యర్థము. 'మత్స్థాని సర్వభూతాని' అను వాక్యముచే ఈశ్వరుడు భూతములకు ఆశ్రయభూతుడని తెలియు చున్నదని. కాని "న చ మత్ స్థాని భూతాని" అను వాక్యముచే ఈశ్వరునియందు భూతములు లేనే లేవు అను విషయము తెలియు చున్నది. ఈ విధముగ "సర్వేషామేవ భావానాం స్వాశ్రయత్వేన సమ్మతే, ప్రతియోగిత్వ మత్యన్తాభావం ప్రతి మృషాత్మతా" ('ప్రతి పన్నోపాధౌ' ఇత్యాదిపూర్వోక్త మిథ్యాత్వలక్షణము ఇదియును సమా నార్థకములు) అని చిత్సుఖాచార్యులు చెప్పిన మిథ్యాత్వము జగత్తున కున్నది. ఘటము కాని దానిని చూచి 'ఇది ఘటము' అని భ్రాంతి కలిగినపుడు, విశేష్యమగు ఇదం పదార్థమునందు (ఇది అని నిర్దేశింప బడినదాని యందు) ఘటాభావ మున్నదిఅని ఇతరులు కూడ అంగీకరింతురు గాన అర్థాంతరము వచ్చును- అనగా సాధింపదలచిన మిథ్యాత్వమును సాధించినట్లు కాక భ్రమమెుదలగు ఏదియో మరి యొకవిషయమును గూర్చి చెప్పినట్లగును. ఆ దోషము రాకుండుటకై "ఇది ఘటము; ఇది ఘటము" అని కల్గెడు అన్ని జ్ఞానములందును విశేష్యముగ నున్న ఇదం పదార్థమునందున్న అభావమునందు ప్రతి యోగిగ ఉండుట (స్వప్రకారక ధీవిశేష్యతా వ్యాపకాత్యన్తాభావ ప్రతియోగిత్వం), అనగా ఎచ్చటను లేకపోవుట మిథ్యాత్వము అని చెప్పబడినది. అందుచే ఘటమున్న స్థలమునందు కలిగిన 'ఇది ఘటము' అను జ్ఞానమునందు గూడ వాస్తవమున ఘటము లేకుండు టచే దానికి మిథ్యాత్వము లభించుచున్నది. "మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా" - అవ్యక్తమూర్తియగు నాచే ఈ జగత్తు అంతయు వ్యాపింపబడినది, అను వాక్యముచే ఈ జగత్తున కంతకును పరమేశ్వరుడు అధిష్ఠానముగ వ్యాపించియున్నాడు. కాని పరమేశ్వరు నకు జగత్తు అధిష్ఠానము కాదు. "స భగవః కస్మిన్ ప్రతిష్ఠితః ఇతి;

స్వే మహిమ్ని, యది వా న మహిమ్ని" - పరమేశ్వరు డెక్కడ ప్రతిష్ఠితుడై యున్నాడు? తన మహిమయందే; లేదా తన మహిమ యందు కూడ ఆధారపడియుండలేదు అను వాక్యము పరమేశ్వరుడు ఆధారశూన్యుడని చెప్పుచున్నది. కావుననే భగవంతుడు తనకు జగత్తు ఆధారము అనెడు భ్రమను తొలగించుటకై "న చాహం తేష్వవస్థితః" అని చెప్పియున్నాడు. 'గృహము ధూమముచే వ్యాప్తమై యున్నది' అని చెప్పినపుడు ధూమమునకు గృహము ఆధారము అని తెలియుచున్నది. 'మయా తతమిదం సర్వం' అని చెప్పినపుడు గూడ అట్టి భావము రాకుండుటకై "న చాహం తేష్వవస్థితః" అని చెప్పబడినది. ఈ విధముగ ఆరోపితము అధిష్ఠానముకంటె భిన్నముగ ఉండదు గాన బ్రహ్మయందు ఆరోపితమై, బ్రహ్మయే అధిష్ఠానముగా గల ప్రపంచము బ్రహ్మకంటె భిన్నముగ లేదు గాన అది మిథ్యయే అని శ్రీకృష్ణుడు చెప్పినాడు అని యర్థము.

అవ. జగత్తు మిథ్యయనుటకు యుక్తి చెప్పుచున్నాడు-

**యది సత్యం భవేద్విశ్వం సుషుప్తా వుపలభ్యతామ్,**
**యన్నోపలభ్యతే కించి దతోఽసత్ స్వప్నవన్మృషా. 236**

సత్యమైన వస్తువు, ఆత్మవలె, సర్వదా భాసింప వలెను. అందుచే విశ్వం = జగత్తు, సత్యం యది = సత్యమైనచో, సుషుప్తౌ = సుషుప్త్యవస్థయందుగూడ, ఉపలభ్యతామ్ = చూడబడవలెను, యత్ = ఏ కారణము వలన, కించిత్ = ఏమియు, నోపలభ్యతే = చూడబడుటలేదో, అతః = ఆ కారణము వలన, స్వప్నవత్ = స్వప్నమువలె, అసత్ = సత్యము కాదు. జాగ్రదవస్థలో కనబడని స్వప్నము ఏ విధముగ అసత్యమో అట్లే ఇది అసత్యము. 'అసత్' అనుదాని యర్థమునే 'మృషా' అనుపదముచే వివరించుచున్నాడు. మృషా = మిథ్యయైనది. ఇది కుందేటి కొమ్మువలె అసత్తుకాదు; కనబడి నష్టమైపోయిన స్వరూపము కలదగుటచే మిథ్యా భూతము అని యభిప్రాయము.

అవ. ఇపుడు, బ్రహ్మవ్యతిరిక్తముగ జగత్తు లేదను విషయ మును ముగించుచున్నాడు—

అతః పృథఙ్నాస్తి జగత్పరాత్మనః
పృథక్ప్రతీతిస్తు మృషా గుణాహివత్,
ఆరోపితస్యాస్తి కిమర్థవత్తా
ధిష్ఠాన మాభాతి తథా భ్రమేణ. 237

అతః = ఆ కారణమువలన, పరమాత్మనః = పరమాత్మకంటె, పృథక్ = వేరుగా, జగత్ = జగత్తు, నాస్తి = లేదు, పృథక్ ప్రతీతిః = వేరుగ కనబడుచుండుట, గుణాహివత్ = త్రాటిపై సర్పమువలె, మృషా తు = అసత్యమే, ఆరోపితస్య = ఆరోపింపబడినదానికి, అర్థవత్తా = ప్రయోజనము, అస్తి కిమ్ = ఉన్నదా? అధిష్ఠానం = అధిష్ఠానభూతమగు వస్తువే, భ్రమేణ = భ్రమచేత, తథా = ఆ విధముగ, ఆభాతి = ప్రకాశించుచున్నది.

అతః = స్వప్నమువలె సర్వదా కనబడకపోవుటచే, జగత్తు బ్రహ్మకంటె వేరుగ లేదు. వ్యవహారదశల, పృథక్ = వేరుగ ఘటాదిరూపముతో, ప్రతీతిః = కనబడుట, గుణాహివత్ = రజ్జువు నందు సర్పముయొక్క ప్రతీతివలె, మృషాతు = అసత్యమే. రజ్జువుపై ఆరోపితమగు సర్పము ఎట్లు అసత్యమో అట్లే జగత్తు కూడ అసత్యము. ఇది అర్థక్రియాకారి (ప్రయోజనమును నిర్వహించునది) కాకపోవుటచే గూడ మిథ్యాభూతము అని చెప్పుచున్నాడు. ఆరోపితస్య = కల్పిత మైన దానికి, అర్థవత్తా = ప్రయోజనమును సాధించుట యనునది, ఉండునా? ఉండదని యర్థము. అట్లైనచో ప్రతీతి ఎట్లు కలుగు చున్నది అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు - అధిష్ఠానభూతమగు వస్తువే భ్రమచే ఆ విధముగ భాసించుచున్నది. భ్రమస్థలమునందు ఇట్లు ప్రతీతి కలుగుటకు ప్రయోజన మేమి అను ప్రశ్నకు అవకాశము లేదు. లోకమున భ్రాంతిస్థలములందు నిష్ప్రయోజనమగు ప్రవృత్తి కనబడుచునే యున్నదికదా?

అవ. బ్రహ్మకంటె వ్యతిరిక్తముగ జగత్తు లేదు అను విషయ మును మరియొక దృష్టాంతముతో విశదీకరించుచున్నాడు_

భ్రాన్తస్య యద్భ్రమతః ప్రతీతం
బ్రహ్మైవ తత్తద్రజతం హి శుక్తిః,
ఇదంతయా బ్రహ్మ సదేవ రూప్యతే
త్వారోపితం బ్రహ్మణి నామమాత్రమ్. 238

భ్రాన్తస్య = భ్రాంతిచెందినవానికి, భ్రమతః = భ్రమవలన, యద్యత్ = ఏయేవస్తువు, ప్రతీతం = కనబడునో, తత్తత్ = ఆ యా వస్తువు, బ్రహ్మైవ = అధిష్ఠానభూతమగు బ్రహ్మయే. హి = ఎందువల్ల ననగా, రజతం = శుక్త్యజ్ఞానముచే శుక్తియందు భాసించుచున్న రజతము, శుక్తిరేవ = శుక్తియే; అట్లే, బ్రహ్మణి = బ్రహ్మయందు, ఆరోపితం = ఆరోపించ బడిన జగత్తు (బ్రహ్మరూపము). వాస్తవమున విచారణచేయగా, సత్ బ్రహ్మైవ = సత్తైన బ్రహ్మయే, ఇదంతయా = ఇదం పదార్థముగ, రూప్యతే = గ్రహింపబడుచున్నది. ఆ ఆరోపితవస్తువు, నామమాత్రం = 'వాచారంభణ' శ్రుతి ననుసరించి కేవలము పేరు మాత్రమే.

అవ. ప్రపంచము మిథ్యగాన 'తత్' పదార్థమునకు అర్థమైన ప్రపంచకారణత్వముగూడ (బ్రహ్మ ప్రపంచమునకు కారణము అను విషయము గూడ) మిథ్యయే యని చెప్పుచు శోధితమగు 'తత్' పదార్థమును నాలుగు శ్లోకములచే ఉపసంహరించుచున్నాడు_

## బ్రహ్మనిరూపణము

అతః పరం బ్రహ్మ సదద్వితీయం
విశుద్ధవిజ్ఞానఘనం నిరంజనమ్,
ప్రశాన్త మాద్యన్తవిహీన మక్రియం
నిరన్తరానన్దరసస్వరూపమ్. 239

అతః = జగత్తునకు వేరుగ సత్త్వము లేకుండుటవలనను, అది ఆరోపితమగుటచే నామమాత్రమే యగుటవలనను, పరంబ్రహ్మ = పరమైన బ్రహ్మ, సత్ = అబాధ్యము అనగా ఎల్లపుడును ఉండునది; అద్వితీయం= విజాతీయరహితము, విశుద్ధ విజ్ఞాన ఘనం = నిర్విషయ విజ్ఞానరూపమైనది, నిరంజనం = అజ్ఞానస్పర్శలేనిది, ప్రశాన్తం = పరిణామములేనిది, ఆద్యన్త విహీనం = జన్మనాశములులేనిది, అక్రియం = అమూర్త మగుటచే క్రియాశూన్యమైనది, నిరంతరానన్దరసస్వరూపమ్ = అవిచ్ఛిన్నమైన ఆనందరసమే స్వరూపముగా కలది.

నిరస్తమాయాకృతసర్వభేదం
నిత్యం ధ్రువం నిష్కల మప్రమేయమ్,
అరూప మవ్యక్త మనాఖ్య మవ్యయం
జ్యోతిః స్వయం కించి దిదం చకాస్తి. 240

నిరస్తమాయాకృతసర్వభేదం=మాయాకల్పితములగు సమస్తభేదములును దేనినుండి లేదా దేనియందు తొలగింపబడినవో అట్టిది, అనగా సజాతీయభేదముగాని, స్వగతభేదముగాని లేనిది, నిత్యం = ఆద్యన్తరహితమగుటచే నిత్య మైనది. ధ్రువం = క్రియారహితమగుటచే కూటస్థమైనది అనగా కూటమువలె స్థిరమైనది. (స్వర్ణకారుడు సువర్ణాదులను సాగదీయుటకై ఉపయోగించు ఇనుపదిమ్మకు కూట మని పేరు). నిష్కలం = అవయవములులేనిది, అప్రమేయం = ఫలవ్యాప్తిలేనిది అనగా మనోవృత్తికి గోచరము కానిది. అరూపం = 'అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం' ఇత్యాదిశ్రుత్యనుసారముగను, 'న చక్షుషాగృహ్యతే'–నేత్రముచే గ్రహింపబడదు అను వాక్యము ననుసరించియు రూపము లేనిది, కావుననే–అవ్యక్తం=వ్యక్తము కానిది, వాక్కునకుకూడ గోచరము కాదని చెప్పుచున్నాడు. అనాఖ్యం=నామశూన్యమైనది. ఒకపదము ఒక అర్థమును బోధింపవలె నన్నచో అట్లు బోధింపబడు దానికి జాతికాని, గుణము కాని, క్రియగాని సంకేతితమగు సంబంధము కాని ఉండవలెను. అట్టివి ఏవియు లేకపోవుటచే నామరహితమైనది. అవ్యయం=క్షయము లేనిది, స్వయం జ్యోతిః = స్వయముగనే ప్రకాశించున దగుటచే ఇతరములచే ప్రకాశింపబడనిది. కించిత్ ఇదం=అట్టి ఇది, చకాస్తి=అపరోక్షమై ప్రకాశించుచున్నది.

అవ. దానియందు బుద్ధిని నిశ్చలముగ నిలుపుటకు అక్కడక్కడ శ్రుత్యుక్తములగు కొన్నివిశేషణములను మరల చెప్పుచున్నాడు—

జ్ఞాతృజ్ఞానజ్ఞేయశూన్య మనన్తం నిర్వికల్పకమ్,
కేవలాఖండచిన్మాత్రం పరం తత్త్వం విదుర్బుధాః. 241

జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయశూన్యం = జ్ఞాత (తెలిసికొనువాడు), జ్ఞానము, జ్ఞేయము (తెలియదగినది) అను త్రిపుటితో శూన్యమైనది, కావుననే, అనన్తం = దేశకాలవస్తుపరిచ్ఛేదములు లేనిది, కావుననే, నిర్వికల్పకం = వికల్ప (భేదాది) శూన్యమైనది, కేవలాఖండచిన్మాత్రం = సర్వోపాధి సంబంధరహితమైన అపరిచ్ఛిన్నజ్ఞానమాత్రరూపమైనది అగు పరం తత్త్వం = ఆ పరతత్త్వమును, బుధాః = పండితులు, విదుః = తెలిసికొనుచున్నారు.

అహేయ మనుపాదేయం మనోవాచామగోచరమ్,
అప్రమేయ మనాద్యన్తం బ్రహ్మ పూర్ణం మహన్మహః. 242

బ్రహ్మ = బ్రహ్మ, స్వాత్మయగుటచే, అహేయం = విడచుటకు శక్యముకానిది, అనుపాదేయం = గ్రహించుటకు శక్యముకానిది, మనోవాచాం అగోచరం = "యతో వాచః" ఇత్యాది శ్రుతి ననుసరించి మనస్సునకును వాక్కులకును గోచరము కానిది, అప్రమేయం = తెలిసికొన శక్యము కానిది. అయినను శ్రవణమనననిదిధ్యాసన సంస్కృతమగు మనోవృత్తికి వ్యాప్యమైనది, అనాద్యన్తం = కాలదేశపరిచ్ఛేదములు లేనిది అనగా కాలమునుబట్టిగాని దేశమునుబట్టిగాని ఆది, అంతము అనునవి లేనిది. కావుననే, పూర్ణం = పరిపూర్ణమైనది, మహత్ = గొప్పదైన, సూర్యాదులనుగూడ భాసింపజేయు, జ్యోతిః = తేజస్సు, ఈ విధముగ తత్పదార్థశోధనము, తత్పదార్థమగు బ్రహ్మయొక్క యథార్థస్వరూపము చెప్పబడినది.

అవ. తత్పదార్థ-త్వంపదార్థములను శోధించి వాక్యార్థమును చెప్పుటకు ప్రారంభించుచున్నాడు—

## మహావాక్యవిచారము

తత్త్వం పదాభ్యా మభిధీయమానయో
ర్బ్రహ్మాత్మనోః శోధితయోర్యదిత్థమ్;
శ్రుత్యా తయోస్తత్త్వమసీతిసమ్య
గేకత్వమేవ ప్రతిపాద్యతే ముహుః. 243

తత్త్వంపదాభ్యాం = 'తత్త్వమసి' అనువాక్యమునందలి 'తత్' పదముచే జగత్కర్తృత్వము మొదలగుధర్మములతోగూడిన వాడుగను, 'త్వం' పదముచే జాగ్రదాద్యవస్థలు కలవాడుగను, అభిధీయమానయోః= అభిధాశక్తిచే బోధింపబడుచున్నట్టియు, ఇత్థం = వెనుకచూపినవిధముగ, శోధితయోః = శోధింపబడిన, తయోః = ఆ కేవల చిన్మాత్రస్వరూపులైన, బ్రహ్మాత్మనోః=ఈశ్వరునకు జీవునకును, 'తత్త్వమసి' ఇతిశ్రుత్యా = 'తత్త్వమసి' అను శ్రుతిచేత, యత్ = ఏ, ఏకత్వ మేవ=ఏకత్వమే, ముహుః = అనేకపర్యాయములు, తొమ్మిదిపర్యాయములు, ఇట్టివారికి భేదముండుటలో ప్రమాణము లేదు గాన, ఛాందోగ్యోపనిషత్తునందు, సమ్యక్ = బాగుగా, ప్రతిపాద్యతే = ప్రతిపాదింపబడుచున్నదో, 'అట్టి ఐక్యము' అని ఉత్తర శ్లోకముతో అన్వయము.

ఐక్యం తయో ర్లక్షితయో ర్న వాచ్యయో
ర్నిగద్యతేఽన్యోన్య విరుద్ధధర్మిణోః,
ఖద్యోతభాన్వో రివ రాజభృత్యయోః
కూపాంబురాశ్యోః పరమాణుమేర్వోః. 244

ఐక్యం = ఆ ఐక్యము, లక్షితయోః = లక్షణచే బోధింపబడుచున్న, తయోః=జీవేశ్వరులకు మాత్రమే, చెప్పబడుచున్నది. ఖద్యోతభాన్వోరివ= మెరుగుడుపురుగు సూర్యుడువలెను, రాజభృత్యయోః = రాజు భృత్యుడు వలెను, కూపాంబురాశ్యోః = కూపము సముద్రమువలెను, పరమాణు మేర్వోః = పరమాణువు మేరుపర్వతమువలెను, అన్యోన్యవిరుద్ధ

ధర్మిణోః = పరస్పరము విరుద్ధములైన ధర్ములగు, వాచ్యయోః = అభిధా వృత్తిచే బోధింపబడుచున్న జీవేశ్వరులకు, న నిగద్యతే = చెప్పబడుట లేదు.

మెరుగుడు పురుగు యొక్క ప్రకాశము అతిస్వల్పమైనది; సూర్యుని ప్రకాశము అపరిచ్ఛిన్నమైనది. అందుచే 'ఖద్యోతభాన్వోః' అనునది జీవుడు కించిద్జ్ఞుడు, ఈశ్వరుడు సర్వజ్ఞుడు అను విషయమును సూచించు దృష్టాంతము. "భీషాస్మాద్వాతః పవతే" ఇత్యాది శ్రుతుల ననుసరించి జీవుడు నియమ్యుడు అనగా నియమింపదగినవాడనియు, ఈశ్వరుడు నియమింపజేయు వాడనియు సూచించుటకు 'రాజభృత్యయోః' అనునది దృష్టాంతము. జీవుని యానందము అత్యల్పము; ఈశ్వరుని ఆనందము అపారము అని సూచించుటకు 'కూపాంబురాశ్యోః' అనునది దృష్టాంతము. జీవుడు పరిమితమగు ప్రదేశమున ఉండువాడు; ఈశ్వరుడు సర్వగతుడు అను విషయమునకు 'పరమాణుమేర్వోః' అనునది దృష్టాంతము. ఈ విధముగ అన్యోన్య విరుద్ధ ధర్మిణోః = ఐక్యమునకు యోగ్యము కాని పరస్పర విరుద్ధధర్ములగు, వాచ్యయోః = అభిధావృత్తిచే బోధింపబడు, ఆ జీవేశ్వరులకు, ఐక్యము బాధితము గాన చెప్పబడుటలేదు. కాని, లక్షితయోః = లక్షణావృత్తిచే బోధింపబడిన ఆ జీవేశ్వరులకు, ఉపక్రమాదిలింగములచే తెలియబడుచున్న తాత్పర్యము ననుసరించి, చెప్పబడుచున్నది.

అవ. అన్యోన్యవిరోధమునకు కారణము చెప్పుచున్నారు—

తయోర్విరోధోఽయ ముపాధికల్పితో
న వాస్తవః కశ్చిదుపాధిరేషః,
ఈశస్య మాయా మహదాదికారణం
జీవస్య కార్యం శృణు పంచకోశాః. 245

తయోః = ఆ జీవేశ్వరులయొక్క, అయం = ఈ, విరోధః = విరోధము, ఉపాధికల్పితః = ఉపాధిచే కల్పింపబడినది. వాస్తవః = యథార్థమైన, కశ్చిత్ = విరోధ మేదియు, న = లేదు, మహదాదికారణం = మహత్తు మొదలగువాటికి కారణమైన, మాయా = మాయ, ఈశస్య = ఈశ్వరునకు, ఏషః ఉపాధిః = ఈ ఉపాధి, కార్యం = కార్యమైన, పంచకోశాః = పంచకోశములు, జీవస్య = జీవునకు ఉపాధి, శృణు = వినుము.

తయోః = వాచ్యులగు జీవేశ్వరులకు, ఐక్యమునకు యోగ్యులు కాకుండుట అనెడు ఈ విరోధము, ఉపాధిచే కల్పితము. వాస్తవః = స్వతఃసిద్ధమైన విరోధ మేదియు లేదు. అందు తత్పదార్థమైన ఈశ్వరునకు ఉపాధిని చెప్పుచున్నాడు - ఈశ్వరునకు మాయ ఉపాధి. దాని స్వరూపమును చెప్పుచున్నాడు. మహదాదికారణం = మహత్తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు మొదలగు సకలజగత్తునకును కారణభూతమగు మాయ ఈశ్వరుని ఉపాధి. జీవస్య = త్వంపదార్థమైన జీవునకు, కార్యము ఉపాధి. అది యేదియో వినుము-పంచకోశాః = ఐదు కోశములు. కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః - కార్యము ఉపాధిగా కలవాడు జీవుడు; కారణము ఉపాధిగా కలవాడు ఈశ్వరుడు అని శ్రుతి చెప్పుచున్నది.

ఏతావుపాధీ పరజీవయోస్తయోః
సమ్యఙ్నిరాసే న పరో న జీవః,
రాజ్యం నరేన్ద్రస్య భటస్య ఖేటకః
తయో రపోహే న భటో న రాజా. 246

ఏతౌ = మాయయు కోశపంచకమును, పరజీవయోః = పరమాత్మకును జీవునకును, ఉపాధీ = ఉపాధులు, సమ్యక్ = బాగుగా, తయోః = వాటియొక్క, నిరాసే = నిరాసము చేయబడగా (వాటిని తొలగింపగా), పరః న = ఈశ్వరుడు లేడు; జీవః న = జీవుడును లేడు. నరేంద్రస్య = రాజునకు, రాజ్యం = రాజ్యము, ఉపాధి. భటస్య = యోధునకు, ఖేటకః =

ఆయుధము (ఉపాధి). తయోః అపోహే=అవి తొలగిపోయిన వెంటనే, భటః న=భటుడు లేడు, రాజా న=రాజును లేడు.

ఈశ్వరునకును జీవునకును, మాయయు, పంచకోశములును ఉపాధి. "నాత్ర కాచన భిదాస్తి" "నేహ నానాస్తి కించన" "అసంగోఽహ్యాయం పురుషః", "అసంగో న హి సజ్జతే" మొదలగు తత్త్వం పదార్థశోధకములగు శ్రుతులచే ఆ ఉపాధులు బాగుగ తొలగింపబడగా కేవలచిన్మాత్రరూపమే శేషించుటవలనను, ఆ చిత్తు నందు భేదకారణ మేదియు లేకపోవుట వలనను, ఈశ్వరుడును లేడు, జీవుడును లేడు. అందులకు దృష్టాంతము చెప్పుచున్నాడు-రాజునకు రాజ్యము ఉపాధి. భటునకు ఆయుధవిశేషము ఉపాధి, అనగా భేద హేతువగు ధర్మము. అవి తొలగిపోయినచో రాజును లేడు, భటుడును లేడు.

అవ. ఉపాధినిరాస మెట్లు చేయవలెనో చెప్పుచున్నాడు-

అథాత ఆదేశ ఇతి శ్రుతిః స్వయం
నిషేధతి బ్రహ్మణి కల్పితం ద్వయమ్,
శ్రుతిప్రమాణానుగృహీత యుక్త్యా
తయోర్నిరాసః కరణీయ ఇత్థమ్. 247

అథాత ఆదేశః ఇతిశ్రుతిః="అథాత ఆదేశో నేతినేతి" అనుశ్రుతి, స్వయం=స్వయముగ, బ్రహ్మణి=బ్రహ్మయందు, కల్పితం=కల్పితమైన, ద్వయం=ద్వైతమును, నిషేధతి=నిషేధించుచున్నది. శ్రుతిప్రమాణానుగృహీతయుక్త్యా=శ్రుతిరూపమగు ప్రమాణముచే అనుగ్రహింపబడిన యుక్తిచేత, తయోః=ఆ ఉపాధులయొక్క, నిరాసః=నిరాకరణము, ఇత్థం=చెప్పనున్న విధమున, కరణీయః=చేయదగినది.

"అథాత ఆదేశో నేతి నేతి" అనుశ్రుతి, స్వయముగ, బ్రహ్మయందు కల్పితమగు ద్వైతవస్తువును నిషేధించుచున్నది. ('నేతి' అను

నపుడు) 'ఇతి' శబ్దమునకు 'ఇది' అని యర్థము. దృశ్యములగు సకలపదార్థములను నిషేధించుటకై 'నేతి' అనునది ఆవృత్తి చేయబడినది. ఇది, ఇది అని ఏ ఏ వస్తువు భాసించుచున్నదో, అది యంతయు అధిష్ఠానముకంటె భిన్నముగ లేదు; దానికి స్వతఃసిద్ధముగ సత్త యనునది లేదు అని యర్థము. ఈ విధముగ సాక్షాత్తు శ్రుతియే నిషేధించుచున్నది గాన, సకలప్రమాణమూర్ధన్యమగు శ్రుతిచేత అనుగ్రహింపబడిన యుక్తిచే, మాయయు, కోశపంచకము అనెడు ఉపాధులను, చెప్పనున్న విధముగ నిరాకరింపవలెను.

నేదం నేదం కల్పితత్వాన్న సత్యం
రజ్జౌ దృష్టవ్యాలవత్స్వప్నవచ్చ,
ఇత్థం దృశ్యం సాధుయుక్త్యా వ్యపోహ్య
జ్ఞేయః పశ్చాదేకభావస్తయోర్యః. 248

ఇదం=ఇది, న=లేదు, ఇదం=ఇది, న=లేదు. రజ్జౌ=త్రాడుపై దృష్టవ్యాలవత్=చూడబడిన సర్పమువలెను, స్వప్నవచ్చ=స్వప్నమువలెను కల్పితత్వాత్=కల్పితమైనదగుటచే, సత్యం న=సత్యముకాదు, ఇత్థం=ఈ విధముగా, దృశ్యం=దృశ్యమగు జగత్తును, యుక్త్యా=యుక్తిచే, సాధు=బాగుగా, వ్యపోహ్య=తొలగించి, పశ్చాత్=పిమ్మట, తయోః=వాటికి, యః=ఏ, ఏకభావః=ఏకత్వమున్నదో, అది, జ్ఞేయః=తెలియదగినది.

మొదటి 'ఇదం' శబ్దముచే ఈశ్వరోపాధియగు మాయయు, రెండవ 'ఇదం' పదముచే జీవోపాధియగు కోశపంచకమును గ్రహింపవలెను. వాటిని ఒక్కొక్కదానిని నిషేధించుటకు రెండు 'నఞ్'లు ప్రయోగింపబడినవి. కారణమైన మాయ గాని, కార్యమైన కోశపంచకముగాని కల్పితమగుటచేత సత్యము కాదు. 'భూయశ్చాన్తే విశ్వమాయా నివృత్తిః' అంతమునందు మాయయంతయు నశించును అని శ్రుతి మాయ నశించునని చెప్పుచున్నది. కోశపంచకము అవస్థా

త్రయమునందు అనువర్తించకపోవుటచే అది దృష్టనష్టస్వరూప మను విషయము - అనగా కనబడి నశించిపోవునది అను విషయము కూడ ఉపపాదింపబడినది.

"మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే"

నన్ను శరణుపొందువారు మరల ఈ మాయను అతిక్రమింప గలరు అను గీతావచనము ననుసరించియు,

"తే ధ్యానయోగానుగతా అపశ్యన్
దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్"

వారు ధ్యానయోగముచే, నిగూఢముగ నున్న ఆ పరమేశ్వర శక్తిని (మాయను) చూచిరి అను శ్రుతి మాయకూడ దృశ్యమని చెప్పుట చేతను మాయకూడ అసత్యమే. అందుచే, ఇదం=ఈ కారణము అనగా మాయరూపమగు ఉపాధి. న=వాస్తవమున లేదు. దానికి వాస్తవమున సత్త్వమున్నచో నివృత్తి కుదరదు. "నాభావో విద్యతే సతః"- సత్తైన పదార్థమునకు అభావము లేదు అని భగవద్గీత చెప్పుచున్నది కదా? ఇట్లే బాగుగా విచారణచేయు వానికి కోశపంచకము కూడ లేదు. ధీమంతుడగు శిష్యుడు "సర్వాభావం వినా కించిన్న పశ్యామి" (శ్లో. 214) అని చెప్పియున్నాడుకదా? కావున పూర్వోక్తమగు ఉపాధి ద్వయము రజ్జువుపై కనబడిన సర్పమువలెను, స్వప్నమువలెను సత్యము కాదు. ఈ విధముగ దృశ్యమును, యుక్త్యా=శ్రుత్యనుసారియగు యుక్తిచే, బాగుగ, తొలగించి, పిమ్మట, తయోః=ఉపాధి రహితులును చిన్మాత్రస్వరూపులును అగు ఆ జీవేశ్వరులకు, ఏ, ఏక భావః=అభేదముఉన్నదో అది తెలిసికొనదగినది.

తతస్తు తౌ లక్షణయా సులక్ష్యౌ
తయో రఖండైక రసత్వ సిద్ధయే,
నాలం జహత్యా న తథాఽజహత్యా
కింతూభయార్థైకతయైవ భావ్యమ్. 249

తతః = ఆ కారణమువలన, తౌ=శుద్ధరూపులైన, జీవేశ్వరులు, లక్షణయా=లక్షణచేత, సులక్ష్యౌ= బాగుగ బోధింపతగినవారు, తయోః= ఆ ఇద్దరియొక్క, అఖండైకరసత్వసిద్ధయే=అఖండమగు ఏకరసత్వము సిద్ధించుటకు, అనగా భేదలేశశూన్యమగు ఐక్యమును ప్రతిపాదించుటకు, జహతా=జహల్లక్షణచేత, నాలం=చాలదు, తథా=మరియు, అజహత్యా= అజహల్లక్షణచేతను, న=చాలదు, ఉభయార్థైకతయైవ=రెండు అర్థములకును ఏకత్వమును ప్రతిపాదించు జహదజహల్లక్షణయే, భావ్యం= ఉండవలెను.

తతః=దృశ్యములగు ఉపాధులను నిషేధించిన ఆ జీవాత్మపరమాత్మల ఐక్యము శబ్దమువలననే తెలియదగియుండుటవలన, తౌ= శుద్ధచైతన్యరూపులైన జీవేశ్వరులు, లక్షణయా=లక్షణ యనగా శక్యార్థముతో సంబంధము, అట్టి లక్షణావృత్తిచేత; అర్థస్మృతికి అనుకూలమగు పదపదార్థముల సంబంధమునకు వృత్తియని పేరు. సులక్ష్యౌ= బాగుగ బోధింపదగినవారు. ఈ సందర్భముననే స్వాత్మనిరూపణము నందు ఈ విధముగ చెప్పబడినది-

"మానాన్తరోపరోధాన్ముఖ్యార్థస్యాపరిగ్రహే జాతే,
ముఖ్యా వినాకృతేఽర్థే యా వృత్తిస్సైవ లక్షణా ప్రోక్తా."

ప్రమాణాన్తరమునకు విరోధముండుటవలన, ముఖ్యార్థస్య = వాచ్యార్థముయొక్క స్వీకారము లేనపుడు, అనగా వాచ్యార్థముయొక్క అన్వయము కుదరనపుడు, ముఖ్యావినాకృతే=వాచ్యార్థముతో సంబంధించిన అర్థమునందు వృత్తికి లక్షణావృత్తి యనిపేరు, అని దీనియర్థము. ప్రకృతమునందు, సర్వజ్ఞత్వ కించిద్జ్ఞత్వాది విశిష్టములగు ఆత్మలకు అభేదము కుదరదుగాన 'తత్', 'త్వం' పదములు లక్షణచే శుద్ధములగు ఆత్మలను బోధించును. ఈ శుద్ధాత్మలకు, శక్తిచే బోధితములైన విశిష్టములగు ఆత్మలతో తాదాత్మ్య ముండుటచే లక్షణయందు ఆవశ్యకమగు శక్యార్థసంబంధ మున్నది. ఈ విషయము గూడ 'స్వాత్మ నిరూపణము'నందు స్పష్టముగ చెప్పబడినది.

"దేహేన్ద్రియాది ధర్మానాత్మన్యారోపయన్న భేదేన,
కర్తృత్వాద్యభిమానీ బోధః స్యాత్ త్వం పదస్య వాచ్యోఽర్థః
దేహస్య చేన్ద్రియాణాం సాక్షీ తేభ్యో విలక్షణత్వేన,
ప్రతిభాతియోఽవబోధః ప్రోక్తోఽసౌ త్వం పదస్య లక్ష్యోఽర్థః."

దేహేంద్రియాదులను, వాటికి చెందిన ధర్మములను అభేదబుద్ధితో తనయందు ఆరోపించుకొనుచు కర్తృత్వాద్యభిమానముగల చిత్స్వరూపము 'త్వం' పదమునకు వాచ్యార్థము. దేహేంద్రియములకు సాక్షిగానుండి ఏ చిత్స్వరూపము వాటికంటె విలక్షణముగ భాసించుచున్నదో అది 'త్వం' పదమునకు లక్ష్యార్థము.

"వేదావసానవాచా సంవేద్యం సకలజగదుపాదానమ్,
సర్వజ్ఞతాద్యుపేతం చైతన్యం తత్పదస్య వాచ్యోఽర్థః."

సకలజగత్తునకును ఉపాదానకారణముగా ఉపనిషద్వాక్యములచే బోధింపబడునదియు, సర్వజ్ఞత్వాదులతో కూడినదియు అగు చైతన్యము తత్పదముయొక్క వాచ్యార్థము.

"వివిధోపాధివిముక్తం విశ్వాతీతం విశుద్ధ మద్వైతమ్,
అక్షర మనుభవవేద్యం చైతన్యం తత్పదస్య లక్ష్యోఽర్థః."

వివిధములగు ఉపాధులతో శూన్యమైనదియు, విశ్వమును అతిక్రమించియున్నదియు, విశుద్ధమైనదియు, అద్వైతస్వరూపమైనదియు, నాశరహితమును, అనుభవైకవేద్యమును అగు చైతన్యము 'తత్' పదమునకు లక్ష్యార్థము.

"ప్రత్యక్త్వపరోక్షత్వే పరిపూర్ణత్వంచ సద్వితీయత్వమ్,
ఇతరేతరం విరుద్ధం తత ఇహ భవితవ్యమేవ లక్షణయా."

ప్రత్యక్త్వము అనగా దగ్గరగానుండి ప్రత్యక్షగోచరమగుట, పరో

క్షత్వము, పరిపూర్ణత్వము, సద్వితీయత్వము అనగా ఇతరవస్తువులు కూడ కలిగియుండుట మొదలగు ధర్మములు పరస్పరము విరుద్ధమైనవి. అందుచే – అట్టి ధర్మములు కలవాటికి అభేదము చెప్పుట కుదరదు గాన లక్షణావృత్తిని అంగీకరింపవలెను, అనియు అచట చెప్పబడినది. 'త్వం' పదార్థమునందు ప్రత్యక్త్వము, అనగా ప్రత్యక్షత్వము ఉన్నది. తత్పదముచే వాచ్యమగు స్వరూపము 'అహం' అనునది బుద్ధిలో గోచరము కాదు గాన అది పరోక్షము. ఇట్లే ఈశ్వరుని యందు పరిపూర్ణత్వ మున్నది; జీవునియందు సద్వితీయత్వము అనగా అల్పత్వ మున్నది. ఈ ధర్మములు పరస్పరవిరుద్ధములు. ఈ ఈ రెండింటికిని ఐక్యము ఎట్లు కుదురును? ఈ విధముగ ప్రమాణాంతరముతో (ప్రత్యక్షప్రమాణముతో) విరోధము ప్రాప్తించినది. కాని ఉపక్రమోపసంహారాది లింగములచే ఉపనిషత్తులకు తత్త్వంపదార్థముల అభేదమునందు తాత్పర్య మున్నట్లు తెలియుచున్నది. ముఖ్యార్థమును గ్రహించినచో ఈ తాత్పర్యమునకు భంగము కలుగును గాన, లక్షణచేత శుద్ధచైతన్యరూపములను మాత్రమే బోధింపవలెను. జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహల్లక్షణ అని లక్షణ మూడు విధములు. ప్రకృతమున జహదజహల్లక్షణను గ్రహింపవలెను అని చెప్పుచున్నాడు – తయోః = ఆ తత్త్వం పదార్థములకు, అఖండైకరసత్వసిద్ధయే = సంసర్గావిషయకమగు అనగా సంబంధవిశిష్టముకాని, జ్ఞానమునందు గోచరమగుటకు అని యర్థము. ఈ విషయము వాక్యవృత్తియందు చెప్పబడినది.

సంసర్గో వా విశిష్టో వా వాక్యార్థో నాత్ర సంమతః,
అఖండైకరసత్వేన వాక్యార్థో విదుషాం మతః.

'తత్త్వమసి' అను వాక్యమునందు సంబంధరూపమైన వాక్యార్థము గాని, సంబంధవిశిష్టవాక్యార్థము గాని అభిమతము కాదు. అఖండైక

రసరూపమగు వాక్యార్థమును పండితులు అంగీకరింతురు జహల్లక్షణా స్వరూపము స్వాత్మనిరూపణమునందు ఈ విధముగ చెప్పబడినది-

నిఖిలమపి వాచ్యమర్థం త్యక్త్వా వృత్తి స్తదన్వితేఽన్యార్థే,
జహతీతి లక్షణాస్యాద్గఙ్గాయాం ఘోషవదిహ న గ్రాహ్యా.

వాచ్యార్థమును పూర్తిగ వదలివేసి, 'గంగాయాం ఘోషః' ఇత్యాదు లందువలె, వాచ్యార్థముతో సంబంధించిన మరియొక అర్థమును బోధించినచో అది జహల్లక్షణ. ఆ జహల్లక్షణనుకూడ ఇచట గ్రహింపరాదు. వాచ్యార్థమునకు సంబంధించినదియు, లక్ష్యార్థము నకు మాత్రమే సంబంధించినదియు అగు ఏ బోధకలదో అట్టి బోధను కలిగించునట్టిదియు, శక్యసంబంధరూపమైనదియు అగు ఏ వృత్తి కలదో. అనగా పదముయొక్కయు పదార్థముయొక్కయు సంబంధము కలదో అది జహల్లక్షణ. ఉదా:- 'గంగాయాం ఘోషః' — గంగలో గొల్లపల్లె ఉన్నది అను వాక్యమున ఘోషపదవాచ్యమగు గొల్లపల్లె గంగా పదవాచ్యమగు ప్రవాహమునం దుండుట అనునది అసం భావ్యముగాన 'గంగా' పదము ప్రవాహముతో సంబంధించిన తీరమును బోధించును. ఆ వాక్యమునందు గూడ 'గంగాతీరమునందు ఘోషము' అను నర్థమే అంగీకరించినచో అపుడు "గంగాయాం ఘోషః" అనునది గూడ అజహల్లక్షణకే ఉదాహరణము. అట్లు కాక 'తీరమునందు గొల్లపల్లె' అను అర్థమునే అంగీకరించినచో అట్టి అర్థజ్ఞానమునందు అట్టి అర్థజ్ఞానమును కలిగించు అర్థోపస్థితియందు గాని వాచ్యార్థమునకు ప్రవేశము లేదు గాన ఇది జహల్లక్షణయే. ప్రకృతమున 'వాచ్యార్థములో ఒక అంశమగు చిద్రూప విశేష్యమును స్వీకరించుటచే వాచ్యార్థమును పూర్తిగ విడిచిపెట్టుట' అను లక్షణము పట్టదుగాన జహల్లక్షణ కుదరదు అని చెప్పబడినది. అట్లే అఖండైకర సత్వరూపమగు అర్థము లభింపవలె నన్నచో అజహత్యా=అజహల్లక్షణ

చేత కూడ, నాలం = సరి కాదు. ఏలయన-వాచ్యార్థలక్ష్యార్థములు రెండింటికిని సంబంధించిన బోధను కలిగించు నదియు, శక్యార్థముతో సంబంధము అను రూపముగలదియు అగు వృత్తికి అజహల్లక్షణయని పేరు. కావుననే ఈ విధముగ చెప్పబడినది.

వాచ్యార్థ మత్యజన్త్యా యస్యావృత్తేః ప్రవృత్తిరన్యార్థే,
ఇయ మజహతీతి కథితా శోణో ధావతి వదత్ర న గ్రాహ్యా.

'శోణ' శబ్దమునకు 'ఎరుపు' అని అర్థము. ఎరుపు అనునది గుణము. అది పరుగెత్తుట అనునది అశక్యము గాన 'శోణః ధావతి' అనునపుడు, శోణశబ్దమునకు ఎరుపు అను గుణముగల అశ్వమునందు లక్షణ. ఇట్లు శోణగుణముతో గూడిన అశ్వము విషయముగల జ్ఞానమునందు వాచ్యార్థమగు శోణగుణము కూడ భాసించుచున్నది. అందుచే వాచ్యార్థమును విడువకుండుటచే ఈ లక్షణకు అజహల్లక్షణ యని పేరు. ప్రకృతమున విశేషణాంశమగు (సర్వజ్ఞత్వకించిద్జ్ఞత్వాదిరూప) వాచ్యార్థము త్యజింపబడుచున్నదిగాన ఇది అజహల్లక్షణకాదు. కావున ఉభయార్థైకతయైవ = రెండు అర్థములకును ఏకత్వము ఏ లక్షణచే బోధింపబడునో అట్టి జహదజహల్లక్షణగానే, భావ్యం = కావలసి యున్నది. అట్లు కానిచో వాటికి అఖండైక రసత్వము సిద్ధింపదు. జహదజహల్లక్షణా లక్షణము ఈ క్రిందివిధమున చెప్పబడినది.

జహదజహతీతి సా స్యాత్ యా వాచ్యార్థైకదేశ మపహాయ,
బోధయతి చైకదేశం సోఽయం ద్విజఇతివదాశ్రయే దేనామ్.
సోఽయం ద్విజ ఇతి వాక్యం త్యక్త్వా ప్రత్యక్పరోక్షదేశాద్యమ్,
ద్విజమాత్ర లక్షకత్వాత్ కథయత్యైక్యం పదార్థయోరుభయోః.
తద్వత్తత్త్వమసీతి త్యక్త్వా ప్రత్యక్పరోక్షతాదీని,
చిద్వస్తు లక్షయిత్వా బోధయతి స్పష్టమసి పదేనైక్యమ్.

ఏ లక్షణ 'సోఽయం ద్విజః'_ఆ బ్రాహ్మణుడు ఇతడే అను వాక్యము నందువలె, వాచ్యార్థమునందలి కొంత భాగమును విడచి కొంత భాగమును బోధించునో అది జహదజహల్లక్షణ. 'సోఽయంద్విజః' అనువాక్యము తచ్ఛబ్దార్థమగు పరోక్షత్వాదికమును, ఇదంశబ్దార్థము ప్రత్యక్షత్వాదికమును (తత్కాల ఏతత్కాల తద్దేశ ఏతద్దేశాదికమును) విడచి ద్విజుడు అను నర్థమును మాత్రమే లక్షణద్వారా బోధించుటచే ఆ రెండుపదార్థములకును ఏ విధముగ ఏకత్వమును బోధించుచున్నదో అట్లే 'తత్త్వమసి' అనువాక్యముగూడ ప్రత్యక్షత్వ పరోక్షత్వాది రూపార్థములను విడచి, శుద్ధచిత్స్వరూపమును మాత్రమే లక్షణచే బోధించుచు, 'అసి' పదముచే ఐక్యమును స్పష్టముగ బోధించు చున్నది. కావున వాచ్యార్థములోని కొంత భాగమును విషయముగ గ్రహించి, కొంత భాగమును గ్రహింపక ఏర్పడు ఉపస్థితిని (అర్థ బోధను) జనింపజేయు శక్యసంబంధరూపమగువృత్తి జహదజహల్లక్షణ. ప్రకృతమున తత్త్వంపదార్థములు సంబంధరహితమగు యథార్థ జ్ఞానములో విషయము కావలెనన్నచో, అట్టి జహదజహల్లక్షణను అంగీకరింపవలెను.

అవ. ఈ విషయమునే దృష్టాన్తపూర్వకముగ చెప్పుచున్నాడు_

స దేవదత్తోఽయ మితీహ చైకతా
విరుద్ధధర్మాంశ మపాస్య కథ్యతే,
యథా తథా తత్త్వమసీతి వాక్యే
విరుద్ధధర్మా నుభయత్ర హిత్వా. 250

సంలక్ష్య చిన్మాత్రతయా సదాత్మనో
రఖణ్డభావః పరిచీయతే బుధైః,
ఏవం మహావాక్యశతేన కథ్యతే
బ్రహ్మాత్మనోరైక్య మఖణ్డభావః 251

"స దేవదత్తోఽయం" ఇతి ఇహ = 'ఆ దేవదత్తుడు ఇతడే' అను ఈ వాక్యమునందు యథా = ఏ విధముగా, విరుద్ధధర్మాంశం = విరుద్ధ ధర్మాంశములను, అపాస్య = విడచి, ఏకతా = ఏకత్వము, కథ్యతే = చెప్పబడుచున్నదో, తథా = అట్లే, 'తత్త్వమసి' ఇతివాక్యే = 'ఆ పరమాత్మయే నీవు' అను వాక్యమునందు, ఉభయత్ర = తత్పదార్థ త్వం పదార్థములకు సంబంధించిన, విరుద్ధధర్మాన్ = విరుద్ధధర్మములను, హిత్వా = విడచి, చిన్మాత్రతయా = చిన్మాత్రరూపముగ, సంలక్ష్య = లక్షణచే గ్రహించి, సదాత్మనోః = సద్రూపములగు ఆ పరమాత్మ జీవాత్మలయొక్క, అఖండ భావః = వస్తుపరిచ్ఛేదశూన్యత్వము, బుధైః = పండితులచే, పరిచీయతే = అనుభవింపబడుచున్నది. ఏవం = ఈ విధముగ, మహావాక్యశతేన = ఇతరములైన వందలకొలది మహావాక్యములచే, బ్రహ్మాత్మనోః = బ్రహ్మ యొక్కయు, జీవాత్మయొక్కయు, ఐక్యం = ఏకత్వము, అఖణ్డభావః = అపరిచ్ఛిన్నత్వము, కథ్యతే = బోధింపబడుచున్నది.

'సోఽయం దేవదత్తః' అనునపుడు తచ్ఛబ్దమునకు ఆ దేశము నందును కాలమునందును ఉండుట అను ధర్మముతో కూడినవాడు అని అర్థము. 'అయం' అను 'ఇదం' శబ్దమునకు ఈ దేశమునందు ఈ కాలమునందు ఉండుట అను ధర్మముతో కూడినవాడు అని యర్థము. ఇచట విశేషణములు అత్యన్త విరుద్ధములగు, అర్థమును బోధించుచున్నవి గాన తద్దేశకాలాది విశిష్టదేవదత్తునకును, ఏ తద్దేశ కాలాది విశిష్టదేవదత్తునకును ఐక్యము కుదరదు. కాలాంతరమున, దేశాంతరమున ఉన్న దేవదత్తుడు ఇపుడు ఇక్కడకు వచ్చినాడు అను విషయము కూడ తెలిసినదేగాన ఆ విషయమును బోధించుట ఈ వాక్యతాత్పర్యముకాదు. ఆ వ్యక్తియే ఈ వ్యక్తి అని బోధించుటయే ఈ వాక్యముయొక్క తాత్పర్యము. కావున ఈ వాక్యము తనలోనున్న 'తత్', 'అయం' అను పదములచే బోధింపబడుచున్న, విరుద్ధమైన 'తద్దేశ తత్కాలములు', 'ఏతద్దేశ ఏతత్కాలములు' అను అర్థమును, విడచి దేవదత్తుడనెడు విశేష్యాంశమును మాత్రమే బోధించుచున్నది.

విశేష్యాంశమైన దేవదత్తునియందు మాత్రము భేదము లేదుగాన ఏ విధముగ ఈ వాక్యము ఏకత్వమును బోధించుచున్నదో, అట్లే 'తత్త్వమసి' అనువాక్యము పరమాత్మకును జీవాత్మకును సంబంధించిన కారణోపాధి కార్యోపాధులు, పరోక్షత్వాపరోక్షత్వములు, పరిపూర్ణత్వ సద్వితీయత్వములు మొదలగు విరుద్ధధర్మములను విడచి, కేవలచిద్రూపులగు ఈశ జీవులను లక్షణచే బోధించును. ఈ విధముగ పండితులు ఈశజీవులు అఖండత్వమును, అనగా, వస్తుపరిచ్ఛేద శూన్యత్వమును సాక్షాత్కరించుకొందురు. 'తత్త్వమసి' అను ఒక వాక్యము ఏకత్వమును బోధించుపద్ధతిని తెలిపి, ఇతరవాక్యములందు గూడ ఈ పద్ధతినే అనుసరింపవలెనని చెప్పుచున్నాడు- ఏవం=ఈ విధముగ, మహావాక్యశతముచే, బ్రహ్మాత్మనోః ఐక్యం=ఆ మహావాక్యముల అర్థమైన బ్రహ్మాత్మల ఐక్యము, అనగా అఖండత్వము, బోధింపబడుచున్నది.

అవ. జీవబ్రహ్మైక్యమును విధిముఖమున బోధించు వాక్యమును ఉదాహరించి ఇపుడు నిషేధముఖమున తదైక్యమును బోధించు వాక్యమును ఉదాహరించుచున్నాడు-

## బ్రహ్మభావన

అస్థూల మిత్యేత దసన్నిరస్య
సిద్ధం స్వతో వ్యోమవ దప్రతర్క్యమ్,
యతో మృషామాత్ర మిదం ప్రతీతం
జహీహి యత్స్వాత్మతయా గృహీతమ్,
బ్రహ్మాహమిత్యేవ విశుద్ధబుద్ధ్యా
విద్ధి స్వమాత్మాన మఖణ్డ బోధమ్. 252

అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘమ్'-ఆత్మ స్థూలమైనది, అణువైనది, హ్రస్వమైనది, దీర్ఘమైనది కాదు ఇత్యాది వాక్యములు, స్థూలములగు శరీరాదులపై తాదాత్మ్యాభిమానముచే 'ఈ శరీరాదులే నేను' అని భావించు చున్న జీవునకు 'నీవు శరీరాదిరూపుడవు కాదు, బ్రహ్మరూపుడవు' అని బోధించుచున్నవి. ఆ విషయమునే ఇట చెప్పుచున్నాడు- ఏతద్ = దృశ్య మగు, అసత్ = అసత్తైన స్థూలశరీరాదికమును, అస్థూల మిత్యేవ = ఆత్మ స్థూలాది భిన్నము అని, నిరస్య = నిషేధించి, స్వతః సిద్ధం = సకల నిషేధములకు సాక్షిగ స్వతఃసిద్ధ మైనదియు అనగా ఎపుడును ఉన్నదియు, వ్యోమవత్ = ఆకాశమువలె, అప్రతర్క్యం = ఊహింపరాని స్వరూపము కలదియు నగు; ఆకాశమునకు ఇంత దైర్ఘ్యవైశాల్యాదు లున్నవి అని ఊహింప శక్యము కాదు కదా? అట్లే బ్రహ్మస్వరూపమును గూడ శాస్త్ర సహాయములేనిదే, తర్కమాత్రముచే తెలిసికొనుటకు శక్యము కాదని యభిప్రాయము. బ్రహ్మ = బ్రహ్మ, అహమేవ = నేనే, ఇతి = అని, విశుద్ధబుద్ధ్యా = మనననిదిధ్యాసనములచే సంస్కృతమగు బుద్ధితో, స్వం ఆత్మానం = నీ యాత్మను, అఖండబోధం = అఖండ జ్ఞానస్వరూపమైన దానినిగా, విద్ధి = తెలిసికొనుము. అతః = ఆ కారణమువలన, యత్ = ఏ స్థూలశరీరాదికము, స్వాత్మతయా గృహీతం = నీయొక్క ఆత్మ అని గ్రహింపబడినదో, ప్రతీతం = అజ్ఞానముచే భాసించుచున్నదో, ఇదం = అట్టి ఈ శరీరాదికమును, మృషామాత్రం = మిథ్యయైనదిగా గ్రహించి, జహీహి = విడిచి పెట్టుము.

అవ. ఛాందోగ్యషష్ఠాధ్యాయమున ఉద్దాలకుడు శ్వేతకేతువునకు చేసిన ఉపదేశమును సంగ్రహముగ, శిష్యులకు సుఖముగ తెలియుటకై ఇచట చెప్పుచున్నాడు.

మృత్కార్యం సకలం ఘటాది సతతం మృన్మాత్రమేవాభిత
స్తద్వత్సజ్జనితం సదాత్మకమిదం సన్మాత్రమేవాఖిలమ్,
యస్మాన్నాస్తి సతః పరం కిమపి తత్సత్యం స ఆత్మా స్వయం
తస్మాత్తత్త్వమసి ప్రశాన్తమమలం బ్రహ్మాద్వయం యత్పరమ్.253

మృత్కార్యం=మృత్తుయొక్క కార్యమైన అనగా మృత్తు ఉపాదాన కారణముగాగల, ఘటాది = ఘటము, మూకుడు, చేదమొదలైన, సకలం= సమస్తమును, సతతం = ఎల్లప్పుడును, కాలత్రయమునందును అనగా ఉత్పత్తికి పూర్వము, ఉత్పత్త్యనంతరము, నాశానంతరము గూడ, అభితః=అన్నివైపులను అనగా ముందు, వెనుక, మీద, క్రింద, ప్రక్కల యందును గూడ, మృన్మాత్రమేవ = కేవలము మృత్తుమాత్రమే. మృత్తు కంటె వేరుగ లేదు. ఈ విషయము వెనుక 231, 232 శ్లోకములలో విస్తృతముగ వివరింపబడినది. తద్వత్ = ఆ విధముగనే, సజ్జనితం= "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయం, తదైక్షత, తత్తేజోఽసృజత, తదపోఽసృజత, తదన్న మసృజత"-ఓ సౌమ్యుడా! ప్రారంభమున ఇది యంతయు ఒక్కటియు, ద్వితీయరహితమగు సత్తుగ మాత్రమే ఉండెను; అది ఆలోచించెను. అది తేజస్సును సృజించెను; అది ఉదకమును సృజించెను. అది అన్నమును సృజించెను అని ప్రారంభించి, "సన్మూలాః సోమ్యేమాః సర్వాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠాః"-ఓ సౌమ్యుడా ! ఈ ప్రజలందరును సత్తు మూలముగా కలవారు, సత్తే స్థానముగా కలవారు, సత్తే ఆధారముగా కలవారు అనునంతవరకును గల శ్రుతి బోధించిన విధమున, సత్తునుండి పుట్టినదియు, సదాత్మకం= ఘటము సత్తు (ఉన్నది), పటము సత్తు, అని సామానాధికరణ్యమును బోధించు జ్ఞానమునుబట్టి, సదాత్మకమైన, ఇదం=ఈ, అఖిలం =సమస్తమును, సన్మాత్రమేవ=కేవలము సద్రూపమైనదే, యస్మాత్=ఏ కారణము వలన, సతః = సత్తైన పరబ్రహ్మకంటె, పరం=భిన్నమైన, కిమపి=ఏది యును, నాస్తి=లేదో, తత్=సర్వోపాదానమైన అట్టి, సత్యం=కాలత్రయాబాధితమైన, సః = అదియే, ఆత్మా=నీయొక్క స్వస్వరూపమైనదై, స్వయం=స్వతంత్రమైనదో అనగా సత్తవిషయమునను ప్రకాశవిషయమునను పరాపేక్షలేనిదో, తస్మాత్ = ఆ కారణమువలన, అద్వయం=తన యొక్కసత్తకంటె భిన్నమైన మరియొక పదార్థము లేనిదియు, ప్రశాన్తం= వికారశూన్యమును, అమలం=అజ్ఞానాదుల స్పర్శలేనిదియు అగు, యత్ = ఏ, పరం=బ్రహ్మము కలదో, త్వం = నీవు, తదేవ = ఆ బ్రహ్మముగానే, అసి = అయి ఉన్నావు.

నిద్రాకల్పితదేశకాలవిషయజ్ఞాత్రాది సర్వం యథా
మిథ్యా తద్వదిహాపి జాగ్రతి జగత్స్వాజ్ఞానకార్యత్వతః,
యస్మాదేవమిదం శరీరకరణప్రాణాహమాద్యప్యసత్
తస్మా త్తత్త్వమసి ప్రశాన్త మమలం బ్రహ్మాద్వయం
యత్పరమ్. 254

నిద్రాకల్పిత దేశ కాల విషయ జ్ఞాత్రాది=నిద్రచే కల్పితమైన దేశము, కాలము, విషయములు, జ్ఞాత మొదలగు, సర్వం=సమస్తమును, యథా=ఎట్లు, మిథ్యా=అసత్యమో, ఇహ=ఈ, జాగ్రత్యపి=జాగ్రదవస్థయందు కూడ, జగత్=జగత్తు, స్వాజ్ఞానకార్యత్వతః=తన (జీవుని) అజ్ఞానముయొక్క కార్యమగుటవలన, తద్వత్=అటులనే అసత్యమైనది. యస్మాత్ = ఏ కారణమువలన, ఏవం = ఈ విధముగ జగత్తు అంతయు మిథ్యాభూతమో, (అందువలన), ఇదం=ఈ, శరీరకరణప్రాణాహమాద్యపి= శరీరము, ఇంద్రియములు, ప్రాణములు, అహంకారము మొదలగునవి గూడ, అసత్ = మిథ్యయే, తస్మాత్ = ఆ కారణమువలన, త్వం = నీవు, ప్రశాన్తం = ప్రశాంతమైనదియు, అమలం=నిర్మలమైనదియు, అద్వయం = ద్వితీయ రహితమైనదియు అగు, యత్=ఏ, పరంబ్రహ్మ=పరమైన బ్రహ్మ కలదో, తత్ = ఆ బ్రహ్మగా, అసి = అయి ఉన్నావు.

"న తత్ర రథా న రథయోగా న పన్థానో భవన్తి అథ రథాన్ రథయోగాన్ పథః సృజతే"-ఆ స్వప్నమున రథములుగాని, రథ సంబంధములుకాని, మార్గములుగాని లేవు, కాని వాటి నన్నింటిని (జీవుడే) సృజించుచున్నాడు ఇత్యాది శ్రుతిచేత నిద్రావశముచే కల్పితములగు దేశము, కాలము, విషయములు, జ్ఞాతయు మొదలగునవి అన్నియు, మెలకువ వచ్చినపుడు భాసింపకుండుటవలనను, నిద్రారూపమగు దోషమువలన జనించిన వగుట వలనను, కనబడి నశించి పోయినస్వరూపము గలవగుట వలనను ఎట్లు మిథ్యా=బాధ్యమైనవో, అట్లే ఈ జాగ్రదవస్థయందలి జగత్తుకూడ మిథ్యయే. "స్వాజ్ఞానకార్యత్వతః" అనునది అందులకు హేతువు. 'స్వస్య

అజ్ఞానం = స్వాజ్ఞానమ్'. ప్రపంచరహితమగు ఆత్మస్వరూపమును ఆవరించు మూలాజ్ఞానము. దానియొక్క కార్యమగుట వలన. 'యదబోధాదిదం భాతి యద్బోధాద్వినివర్తతే'-ఏ ఆత్మ స్వరూపమును తెలిసికొనకపోవుటచే ఈ జగత్తు భాసించుచున్నదో, దేనిని తెలిసి కొనగనే నివర్తించుచున్నదో....' అని చెప్పబడినది. "యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూ త్తత్కేన కం పశ్యేత్"-ఈతనికి అంతయు ఆత్మ మయమే అయినపుడు దేనిని దేనితో చూడగలడు? అని శ్రుతివాక్యము

"యదజ్ఞానప్రభావేన దృశ్యతె సకలం జగత్,
యద్జ్ఞానా ల్లయమాప్నోతి తస్మై జ్ఞానాత్మనే నమః."

దేనిని తెలిసికొనకపోవుటచే ఈ సకలజగము చూడబడుచున్నదో, దేని జ్ఞానమువలన లయమును పొందుచున్నదో జ్ఞానస్వరూపుడగు అట్టి పరమాత్మకు నమస్కారము అనియు, "జ్ఞాతే ద్వైతం న విద్యతే" ఆత్మతత్త్వము తెలిసిన పిమ్మట ఇక ద్వైతప్రపంచము ఉండదు అనియు మాండూక్యకారిక చెప్పుచున్నది. యస్మాత్ = ఏ కారణమువలన, ఏవం = ఈ జగత్తుమిథ్యయో, ఇదం శరీరకరణప్రాణాహమాద్యపి = పూర్వము నీవు ఆత్మగాభావించిన శరీరేంద్రియప్రాణాహంకారాదికము గూడ, అసత్ = బాధ్యమైనది, అనగా మిథ్య. అందువలన నీవు ప్రశాంతము, అమలము, అద్వయము అగు ఏ పరబ్రహ్మ కలదో అది గానే ఉన్నావు.

అవ. శాబ్దబోధతో సంబంధించిన రూపమున అవిచ్ఛిన్నముగ బ్రహ్మానుసంధానము కలుగుటకై పదిశ్లోకములచే బ్రహ్మతత్త్వమును స్పష్టీకరించుచు, జీవబ్రహ్మైక్యమును బోధించుచున్నాడు –

జాతినీతికులగోత్రదూరగం
నామరూపగుణదోషవర్జితమ్,
దేశకాలవిషయాతివర్తి యత్
బ్రహ్మతత్త్వమసి భావయాత్మని. 255

జాతి నీతి కుల గోత్ర దూరగం=జాతి-నీతి-కుల-గోత్రములకంటె దూరమైనదియు, నామరూపగుణదోషవర్జితం = నామ-రూప-గుణ-దోషములతో శూన్యమైనదియు, దేశకాలవిషయాతివర్తి=దేశ-కాల-విషయములను దాటి ఉన్నదియునగు, యత్=ఏ, బ్రహ్మ=బ్రహ్మ కలదో, త్వం=నీవు, తత్=ఆ బ్రహ్మగా, అసి=ఉన్నావు. ఆత్మని=బుద్ధియందు, భావయ=ఈ విధముగ భావన చేయుము.

బ్రాహ్మణత్వాదిజాతియు, యుక్తముగ ప్రవర్తించుట యనెడు నీతియు, వంశము, గోత్రము అనునవి స్థూలసూక్ష్మశరీరములకు సంబంధించిన వగుటచే వాటికంటె దూరముగ నున్నదియు; "యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణమ్" - ఏ ఆత్మరూపము దృశ్యముకాదో, గ్రహింప శక్యముకాదో, గోత్ర-వర్ణములు లేనిదో అను ముండకశ్రుతి ఇందులకు ప్రమాణము. "ఆకాశో హ వై నామ రూపయోర్నిర్వహితా తే యదన్తరా తద్బ్రహ్మ" -ఆకాశమే- అనగా ఆత్మయే- నామరూపములను నిర్వహించునది. ఆ నామరూపములు దేనికంటె దూరములో అదియే బ్రహ్మ అనియు, "కేవలో నిర్గుణశ్చ"- కేవలుడు గుణరహితుడు ఇచట 'నిర్గుణశ్చ' అని 'చ' శబ్ద ప్రయోగముచే 'దోషములు కూడ లేనివాడు' అను అర్థము వచ్చును. ఇత్యాది శ్రుతులచే నామము, రూపము, గుణములు, దోషములు లేనిదియు, దేశకాలవిషయములను అతిక్రమించి యున్నదియు, అనగా 'బ్రహ్మ అనంతము' అని బోధించు శ్రుతి ననుసరించి దేశతః, కాలతః, వస్తుతః పరిచ్ఛిన్నముకానిదియు అగు ఏ బ్రహ్మ కలదో, నీవు ఆ బ్రహ్మయే. ఈ విషయమును నీ బుద్ధియందు అనుసంధానము చేసికొనుము.

యత్పరం సకలవాగగోచరం
గోచరం విమలబోధ చక్షుషః,
శుద్ధ చిద్ఘనమనాది వస్తు యద్
బ్రహ్మతత్త్వమసి భావయాత్మనా. 256

పరం = సర్వోత్కృష్టమైనదియు, సకలవాగగోచరం = సమస్తమైన వాక్కులకు గూడ గోచరము కానిదియు, "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" -వాక్కులుగూడ దేనిని పొందజాలక మనస్సుతో పాటు వెనుకకు మరలిపోవుచున్నవో అను శ్రుతి ననుసరించి ఉపనిషత్తులు కూడ ఈ బ్రహ్మను ప్రత్యక్షముగ బోధింపజాలక లక్షణావృత్తిచేతనే బోధించుచున్నవి. విమలబోధ చక్షుషః=నిర్మలమగు జ్ఞానమనెడు నేత్రమునకు గోచరమైనదియు.

"జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వః తతస్తు తం,
పశ్యతే నిష్కలం ధ్యాయమానః".

విశుద్ధమైన బుద్ధి కలవాడై, నిర్మలమగుజ్ఞానముతో అఖండరూపమగు ఆ బ్రహ్మను ధ్యానముచేయుచు చూచును అని శ్రుతి చెప్పుచున్నది. శుద్ధ చిద్ఘనం = పరిశుద్ధమైన అనగా విషయశూన్యమైన చిత్తే మూర్తిగా కలదియు, లేదా శుద్ధమును ఉపాధి రహితమును అగు జ్ఞానస్వరూపమైనదియు, అనాది = ఆది రహితమైనదియు, వస్తు = నిత్యమైనదియు యథార్థమైనదియు అగు, యద్బ్రహ్మ = ఏ బ్రహ్మకలదో, త్వం = నీవు. తత్ = ఆ బ్రహ్మగా, అసి = అయిఉన్నావు, ఆత్మని భావయ = మనస్సునందు భావన చేయుము.

షడ్భి రూర్మిభి రయోగి యోగిహృ
ద్భావితం న కరణై ర్విభావితమ్,
బుద్ధ్యవేద్యమనవద్యభూతి యద్
బ్రహ్మతత్త్వమసి భావయాత్మని. 257

షడ్భిః = ఆరు, ఊర్మిభిః = ఊర్ములతో, అయోగి = సంబంధము లేనిదియు, యోగిహృద్భావితం = యోగులయొక్క హృదయములచే ధ్యానింపబడినదియు, కరణైః = ఇంద్రియములచే, న విభావితం = గ్రహింపబడనిదియు, బుద్ధ్యవేద్యం = బుద్ధిచే తెలియబడనిదియు, అనవద్యభూతి = నిర్దుష్టమైన ఐశ్వర్యముగలదియు అగు, ఏ బ్రహ్మకలదో, నీవు ఆ బ్రహ్మగానే ఉన్నావని మనస్సులో భావన చేయుము.

ఆకలిదప్పులు, శోకమోహములు, జరామృత్యువులు అను ఈ ఆరును తరంగములవలె పైపైకి ఉప్పొంగుచుండును గాన వీటికి షడూర్మ్మ లనిపేరు. అట్టి ఆరు ఊర్మ్మలతో సంబంధించినది. ఆ మూడు జంటలును క్రమముగ ప్రాణ-మనః-శరీరములకు సంబంధించినవే కాని ఆత్మకు సంబంధించినవి కావు. యోగిహృద్భావితం=విషయములనుండీ నిరోధింపబడిన చిత్తములుగల యోగులహృదయములచే ఆదరపూర్వకముగ ధ్యానింపబడినది. న కరణైర్విభావితం=శబ్దస్పర్శ రూపాదిరహితమగుటచే ఇంద్రియములచే గ్రహింపబడనిది. శ్రుతులు కూడ "న చక్షుషా గృహ్యతే నాపి వాచా", "నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా", "న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి" – "నేత్రముచేగాని వాక్కుచేగాని గ్రహింపబడదు", "వాక్కుచేతగాని, మనస్సుచేతగాని, నేత్రముచేతగాని పొందుటకు శక్యమైనది కాదు", "ఆ ఆత్మవిషయమున నేత్రము ప్రసరించదు; వాక్కు ప్రసరించదు" అని చెప్పుచున్నవి. బుద్ధ్యవేద్యం=సూక్ష్మత్వైకాగ్రత్వములు లేని బుద్ధిచే తెలిసికొనుటకు శక్యమైనది కాదు. అనవద్యభూతి=" వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్ "–అను బ్రహ్మసూత్రము ననుసరించియు, "నిరవద్యమ్" అను శ్రుతి ననుసరించియు దోషరహితమైన ఐశ్వర్యముకలది. అట్టి ఏ బ్రహ్మ కలదో అదియే నేనని మనస్సులో భావన చేయుము.

భ్రాన్తికల్పిత జగత్కలాశ్రయం
స్వాశ్రయం చ సదసద్విలక్షణమ్,
నిష్కలం నిరుపమానమృద్ధిమత్
బ్రహ్మతత్త్వమసి భావయాత్మని. 258

భ్రాన్తికల్పిత జగత్కలాశ్రయం="పాదోఽస్య విశ్వా భూతాని" – ఈ భూతము లన్నియు పరమాత్మయొక్క ఒక్క పాదము- నాల్గవవంతు అను శ్రుతి ననుసరించి భ్రాంతిచే కల్పితమగు జగద్రూపమైన అంశమునకు

అధిష్ఠానమైనదియు, స్వాశ్రయం="స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి, స్వే మహిమ్ని"—ఓపూజ్యుడా! ఆ పరమాత్మ దేనిపై ప్రతిష్ఠితుడై యున్నాడు? సమాధానము తన మహిమపైననే ఆధారపడి యున్నాడు అను శ్రుతిచే తానే ఆధారముగా కలది; అనగా ఆధారాంతరరహితమైనది, సత్యమైనది అని యర్థము. సదసద్విలక్షణం=ప్రత్యక్షములును పరోక్షములును అగుపంచభూతములకంటె విలక్షణమైనదియు, నిష్కలం=అవయవరహితమైనదియు, నిరుపమానం='న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే' - ఆ పరమాత్మతో సమానమైనదిగాని, పరమాత్మకంటె అధికమైనదికాని కానరాదు అను శ్రుతి ననుసరించి సాటిలేనిదియు, బుద్ధిమత్="ఏష సర్వేశ్వరః సత్యకామః సత్యసంకల్పః" ఇత్యాది శ్రుతుల ననుసరించి ఐశ్వర్యము కలదియు అగు ఏ బ్రహ్మకలదో, నేను ఆ బ్రహ్మగానే ఉన్నాను అని మనస్సులో భావన చేయుము.

జన్మవృద్ధి పరిణత్యపక్షయ
వ్యాధినాశనవిహీన మవ్యయమ్,
విశ్వసృష్ట్యవన ఘాతకారణం
బ్రహ్మతత్త్వమసి భావయాత్మని. 259

జన్మ....విహీనం = జన్మ, వృద్ధి, పరిణామము, క్షీణించుట, వ్యాధులు, నాశనము- వీటితో శూన్యమైనదియు, అవ్యయం = మార్పు లేనిదియు, విశ్వ .... కారణమ్ = ప్రపంచముయొక్క సృష్టిరక్షణ వినాశములకు కారణభూత మైనదియు, అగు ఏ బ్రహ్మ కలదో, నేను ఆ బ్రహ్మయే అయిఉన్నాను అని మనస్సులో భావన చేయుము.

జన్మ = ఉత్పత్తి. ఇది తరువాత కలుగు ఉనికికి కూడ ఉపలక్షణము. వృద్ధిః = అవయవములు పెరుగుట, పరిణతిః = పరిణామము, ఆమ్రఫలాదులయందు పాకాదులచే రూపాన్తరోత్పత్తి, అపక్షయః = అవయవములు తరుగుట, వ్యాధిః = రోగము, నాశనం = అంత్యవికారమైన నాశనము. వీటితో అనగా షడ్భావవికారములతో శూన్యమైనది

కావుననే, అవ్యయం = స్వతః గాని, పరనిమిత్తముచే గాని నాశము లేనిది, నిత్యమైనది. విశ్వసృష్ట్యవనఘాతకారణం = "యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయంత్యభి సంవిశన్తి" - దేనినుండి ఈ భూతములు పుట్టుచున్నవో, పుట్టినదిదేనిచే జీవింపబడుచున్నవో, దేనిని పొంది లీనమై పోవుచున్నవో, "ఇదం సర్వమసృజత్"-ఈ ప్రపంచమునంతను సృజించెను, "ఆకాశః పరాయణమ్"-పరమాత్మయే ప్రపంచమునకు ప్రధానమైన ఆధారము, "ఆకాశం ప్రత్యస్తం యన్తి"-ఆకాశమునే, అనగా పరమాత్మనే చేరి లీనమగుచున్నవి-ఇత్యాది శ్రుతులలో చెప్పిన విధముగ సకలప్రపంచము యొక్క సృష్టి స్థితి సంహారములకు కారణభూతమైన ఏ బ్రహ్మకలదో నేను ఆ బ్రహ్మయే అయి ఉన్నాను అని మనస్సులో భావన చేయుము.

అస్తభేదమనపాస్తలక్షణం
నిస్తరంగజలరాశి నిశ్చలమ్,
నిత్యముక్తమవిభక్తమూర్తి యద్
బ్రహ్మతత్త్వమసి భావయాత్మని. 260

అస్తభేదం = దేనినుండి సమస్త భేదములును తొలగిపోయినవో అట్టిదియు, 'ఏకమేవాద్వితీయమ్' 'ఇదం సర్వం యదయమాత్మా' అని శ్రుతులుచెప్పుచున్నవి. అనపాస్తలక్షణం=ఎప్పటికిని తొలగిపోని లక్షణము అనగా సచ్చిదానందస్వరూపము కలదియు, నిస్తరంగజలరాశి నిశ్చలమ్ = తరంగములులేని సముద్రమువలె నిశ్చలమైనదియు, నిత్యముక్తం=ఎన్నడును సంబంధము లేనిదియు, అవిభక్తమూర్తి=సచ్చిదానంద స్వరూపమే యైనను తత్పదలక్ష్యమగు అఖండరూపమున భేదము లేకపోవుటచే, అవిభక్తమగు, అనగా భేదరహితమగు, మూర్తి అనగా స్వరూపము, అనగా శరీరము కలదియగు, లేదా అవయవరహితమైనది అని అర్థము చెప్పవచ్చును-ఏ బ్రహ్మకలదో నేను ఆ బ్రహ్మగనే అయి ఉన్నాను అని మనస్సులో భావన చేయుము.

ఏకమేవసదనేకకారణం
కారణాన్తర నిరాసకారణమ్,
కార్యకారణవిలక్షణం స్వయం
బ్రహ్మతత్త్వమసి భావయాత్మని. 261

ఏకమేవసత్ = తాను ఒక్కటియే యగుచు, అనేకకారణం = అనేకమైన వాటికి కారణమైనదియు, కారణాన్తరనిరాసకారణం = ఇతర కారణముల నిరాసమునకుకారణమైనదియు, కార్యకారణ విలక్షణం = కార్యకారణములకంటె విలక్షణ మైనదియు, స్వయం = స్వతఃసిద్ధమైనదియు అగు, బ్రహ్మగనే నేను అయి ఉన్నాను అని మనస్సులో భావన చేయుము.

ఒక్కటియేయైనను కల్పితములైన అనేకవస్తువులకు అధిష్ఠానమై కారణమైనదియు, కారణాన్తరనిరాసకారణం = 'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే' - ఈ పరమాత్మయొక్క గొప్పదైన శక్తి వివిధరూపములైనదిగ వినబడుచున్నది అను శ్రుతివాక్యము ననుసరించి తనకంటె భిన్నమైన కారణముయొక్క అపేక్షలేనిదియు అని యర్థము. లేదా సకలదృశ్యసాక్షియగుటచే, ఇతరకారణములగు ఆకాశాదికమును 'నేతి నేతి' అని నిషేధించుటయందు కారణము అని యర్థము. కార్యకారణవిలక్షణం = "తదేతద్బ్రహ్మ పూర్వమనపరమ్" - ఈ బ్రహ్మ పూర్వము నందున్నది - కారణము - అదిలేనిది, తరువాత వచ్చినది - కార్యము, అదిలేనిది అను శ్రుతి ననుసరించియు, "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః" - కార్యకారణములకంటె భిన్నుడైన ఆ ఉత్తమపురుషుడే పరమాత్మ యని చెప్పబడుచున్నాడు అను గీతావాక్యము ననుసరించియు కార్యమైన జగత్తుకంటెను, కార్యమైన మాయకంటెను విలక్షణమైనదియు, ఈ శ్లోకమునందే ప్రారంభమున, బ్రహ్మ అనేకవస్తువులకు ఏకైకకారణమైనది అని చెప్పబడియున్నది. అయినను, మిథ్యాభూతములగు కార్యములనుబట్టి ఏర్పడిన దగుటచే ఆ కారణత్వము

కూడ మిథ్యయే గాన వాస్తవమున కారణత్వము లేదనికూడ తెలియ వలెను. ఏలయన జగజ్జన్మాదికారణత్వము బ్రహ్మకు తటస్థలక్షణమే (కాని స్వరూపలక్షణము కాదు) లక్ష్యమున్నంతకాలము ఉండని వ్యావర్తకధర్మమునకు తటస్థలక్షణ మనిపేరు. స్వయం=స్వతఃసిద్ధ మైన ఏ బ్రహ్మ ఉన్నదో, నీవు అదియే యై ఉన్నావని మానసమున భావన చేయుము.

నిర్వికల్పక మనల్పమక్షరం
యత్క్షరాక్షరవిలక్షణం పరమ్,
నిత్యమవ్యయసుఖం నిరంజనం
బ్రహ్మతత్త్వమసి భావయాత్మని. 262

నిర్వికల్పకం= వికల్పశూన్యమైనదియు, అనల్పం= అల్పము కానిదియు, అక్షరం=నాశరహిత మైనదియు, క్షరాక్షరవిలక్షణం= క్షరా క్షరములకంటె భిన్నమైనదియు, పరం= సర్వోత్కృష్టమైనదియు, నిత్యం= నిత్యమైనదియు, అవ్యయసుఖం= అనంతసుఖరూపమైనదియు, నిరంజనం=తమోరహితమైనదియు అగు యత్=ఏ బ్రహ్మకలదో, నేను ఆ బ్రహ్మగనే అయి ఉన్నాను అని మనస్సునందు భావన చేయుము.

నిర్వికల్పకం=వికల్పము లన్నియు మాయాకల్పితములు గాన వాస్తవమున వికల్పశూన్యమైనదియు, అనల్పం='యో వై భూమా', 'జ్యాయానాకాశాత్' అను శ్రుతులచే మహాప్రమాణము కలదియు, అక్షరం=నశింపనిదియు లేదా "అశ్నుతే=వ్యాప్నోతి" అను వ్యుత్పత్తిచే సర్వవ్యాప్తమైనదియు, క్షరాక్షరవిలక్షణం=క్షరాక్షరములకంటె విలక్షణమైనది.

"ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ,
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే."

లోకమున క్షరము అక్షరము అనెడు ఇద్దరు పురుషులు కలరు. సమస్త భూతములకును క్షర మనిపేరు. కూటస్థుడు అక్షరమని చెప్పబడు

చున్నాడు-అను భగవద్గీతాస్మృతి ననుసరించి క్షరాక్షరములకంటె విలక్షణమైనది (ఇచట క్షరమనగా కార్యమైన జగత్తు. అక్షరమనగా తత్కారణమగు మాయ). పూర్వశ్లోకమున కార్యకారణవిలక్షణం' అను పదము చెప్పిన విషయమునే ఇచట మరియొక పదముచే (క్షరాక్షర విలక్షణం అను దానిచే) చెప్పుచున్నాడు. జగన్మాయలకంటె విలక్షణ మైనది, సత్యమైనది అని యర్థము. కావుననే, పరం = సర్వోత్కృష్ట మైనది. నిత్యం = అక్షరమగుటచే,'నిత్యో నిత్యానామ్'-నిత్యమైనవాటిలో కెల్ల నిత్యమైనది అను శ్రుతిచే నిత్యమైనదియు, లేదా "పరం నిత్యం"= 'అన్నిటికంటెను అధికముగ నిత్యమైనది' అని అన్వయము. అవ్యయ సుఖం = 'యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి '-ఏది అనంత ప్రమాణము కలదో అది సుఖస్వరూపమైనది. అల్పమైన దానిలో సుఖములేదు అను శ్రుతి ననుసరించి అఖండ సుఖరూపమైనదియు, నిరంజనం = తమశ్శూన్యమైన బ్రహ్మగనే నేను ఉన్నాను అని మనస్సులో భావన చేయుము.

యద్విభాతి సదనేకధా భ్రమాత్
నామరూపగుణవిక్రియాత్మనా,
హేమవత్స్వయ మవిక్రియం సదా
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 263

యత్ = ఏ, సత్ = సద్రూపమైన, బ్రహ్మ = బ్రహ్మ, స్వయం = తాను, సదా = ఎల్లప్పుడును, అవిక్రియం = వికారరహితమైనదైనను, భ్రమాత్ = భ్రమవలన, నామరూపగుణ విక్రియాత్మనా = నామ-రూప-గుణ-వికారముల రూపముతో, అనేకధా = అనేకవిధములుగా, విభాతి = భాసించుచున్నదో, నీవు ఆ బ్రహ్మయే అయి ఉన్నావు అని మనస్సులో భావన చేయుము.

ఒకే బంగారము, తాను ఏకరూపమైనదేయైనను, సువర్ణకారాది కారకముల వ్యాపారమాత్రముచే కటక-కుండలాద్యనేకరూపములతో ఎట్లు భాసించునో, అట్లే ఏ సద్రూపమగు బ్రహ్మ తాను ఎల్లప్పు

డును వికారరహితమేయైనను, భ్రమవలన, అనేకవిధములుగ నామ-రూప-గుణ-వికారముల స్వరూపమున అనేకవిధములుగ భాసించునో ఆ బ్రహ్మయే నేను అని ఆత్మయందు భావన చేయుము

యచ్ఛకాస్త్యనపరం పరాత్పరం
ప్రత్యగేకరస మాత్మలక్షణమ్,
సత్యచిత్సుఖ మనన్త మవ్యయం
బ్రహ్మతత్త్వమసి భావయాత్మని. 264

యత్=ఏది, అనపరం="తదేతత్ బ్రహ్మపూర్వమనపరమ్" అను శ్రుతి ననుసరించి పరము అనగా వాస్తవమైన కార్యమేదియు, లేనిదై, చకాస్తి=ప్రకాశించుచున్నదో, పరాత్=హిరణ్యగర్భునికంటెగూడ, పరం=పరమైనదో, లేదా, పరాత్పరం=సర్వకార్యములకును కారణమైన అజ్ఞానముకంటె పరమైనదో, 'అక్షరాత్ పరతః పరః'-పరమైన అక్షరముకంటె (అజ్ఞానముకంటె, పరమైనది) అని శ్రుతిచెప్పుచున్నది. "స ఏతస్మాజ్జీవఘనాత్పరాత్పరం పురి శయం పురుష మీక్షతే" అను శ్రుతి ననుసరించి 'పర' శబ్దముచే హిరణ్యగర్భుని కూడ గ్రహించుటకు అవకాశమున్నది. ప్రత్యగేకరసం=ప్రత్యగాత్మకంటె (జీవాత్మకంటె) అభిన్నమైనదో, అనగా అన్నిభూతముల లోపలను జీవరూపమున ప్రవేశించినదో, ఆత్మలక్షణం=

"యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ,
యచ్చాస్య సంతతో భావః తస్మాదాత్మా ప్రకీర్తితః."

సర్వత్ర వ్యాపించియున్నది కావునను - 'ఆప్నోతీత్యాత్మా'-విషయములను గ్రహించుచున్నది కావునను 'ఆదత్తే ఇతి ఆత్మా'-విషయములను అనుభవించుచున్నది కావునను, "అత్తీత్యాత్మా"-అవిచ్ఛిన్నముగ నుండునది కావునను, "అతతీత్యాత్మా" ఆత్మయని చెప్పబడుచున్నది అను ఆత్మలక్షణములతో కూడినదో, సత్యచిత్సుఖం=సచ్చిదానందరూపమైనదో, అనన్తం=అపరిచ్ఛిన్నమైనదో, అవ్యయం=నిత్యమైనదో, అట్టి బ్రహ్మగనే నీవు అయి ఉన్నావు అని మనస్సునందు భావన చేయుము.

ఉక్తమర్థమిమమాత్మని స్వయం
భావయ ప్రథితయుక్తిభిర్ధియా,
సంశయాదిరహితం కరాంబువత్
తేన తత్త్వనిగమో భవిష్యతి. 265

ఇమం = ఐక్యరూపమైన ఈ, ఉక్తం = చెప్పబడిన, అర్థం=విషయమును, ప్రథితయుక్తిభిః = ప్రసిద్ధములగు, అనగా శ్రుత్యనుసారులగు, యుక్తులచే, ధియా=నిర్మలమగు అంతఃకరణముచే. ఆత్మని=బుద్ధియందు, స్వయం =స్వయముగ, భావయ= భావన చేయుము. తేన= ఆ భావనముచేత, కరాంబువత్ = హస్తమునందున్న జలము ఏ విధముగ నిస్సంశయముగను, స్పష్టముగను గ్రహింపబడునో అట్లు, తత్త్వనిగమః = తత్త్వనిర్ణయము, సంశయాదిరహితం = సంశయాదులు లేకుండగ భవిష్యతి= కాగలదు, 'సంశయాది' అనునపుడు 'అది' పదముచే విపర్యయము, అసంభావనయు గ్రహింపబడును. అనగా సంశయముకాని, అసంభావనకాని, విపరీతభావనకాని లేకుండ తత్త్వనిశ్చయము కలుగును అని యర్థము.

స్వం బోధమాత్రం పరిశుద్ధతత్త్వం
విజ్ఞాయ సంఘే నృపవచ్చ సైన్యే,
తదాత్మనైవాత్మని సర్వదా స్థితో
విలాపయ బ్రహ్మణి దృశ్యజాతమ్. 266

సైన్యే = అనేకులైన యోధులతోకూడిన సైన్యమునందు, నృపవత్ = ఛత్రాదిచిహ్నములచే రాజునువలె, సంఘే= శరీర-ఇంద్రియ-ప్రాణ-అహంకారరూపమగు కార్యకరణ సంఘమునందు, పరిశుద్ధ తత్త్వం = పరిశుద్ధమైన యథార్థస్వరూపము గల, స్వం = ఆత్మను, బోధమాత్రం = అన్నింటిని భాసింపజేయునదియు, దృశ్యసంబంధము లేనిదియు అగు జ్ఞానమాత్రమునుగా, విజ్ఞాయ = వివేకముచే అనుభవించి, తదాత్మనైవ = ఆ జ్ఞానాత్మచేతనే, సర్వదా = ఎల్లప్పుడును, స్థితః = ఉన్నవాడవై, దృశ్యజాతం = దృశ్యసముదాయమును, బ్రహ్మణి=బ్రహ్మయందు, విలాపయ= లీనము చేయుము.

"పృథివ్యప్సు పయో వహ్నౌ వహ్నిర్వాయౌ నభస్యసౌ,
నభోఽప్యవ్యాకృతే తచ్చ శుద్ధే శుద్ధోఽస్మ్యహం హరిః".

భూమి నీటియందును, నీరు అగ్నియందును, అగ్ని వాయువునందును, వాయువు ఆకాశమునందును, ఆకాశము అవ్యాకృతమునందును, ఆ అవ్యాకృతము శుద్ధబ్రహ్మమునందును లీనము కాగా నేను ఆ శుద్ధమైన హరిగ ఉన్నాను అని చెప్పినవిధమున ఆయా ఉపాదేయములు(కార్యములు) తమ ఉపాదాన కారణములకంటె వేరుగలేవు అను విషయమును నిశ్చయించి, చివరకు అన్నింటికిని ఉపాదానకారణమగు బ్రహ్మకంటె భిన్నముగ ఏదియును లేదు అని నిశ్చయింపుము అని యర్థము.

బుద్ధౌ గుహాయాం సదసద్విలక్షణం
బ్రహ్మాస్తి సత్యం పరమద్వితీయమ్,
తదాత్మనా యోఽత్ర వసేద్గుహాయాం
పునర్న తస్యాంగగుహాప్రవేశః. 267

సదసద్విలక్షణం = సత్తుకంటెను అసత్తుకంటెను విలక్షణమైనదియు, సత్యం=సత్యమైనదియు, అద్వితీయం=ద్వితీయరహితమును అగు పరంబ్రహ్మ=పరబ్రహ్మ, బుద్ధౌ=బుద్ధియనెడు గుహాయాం=గుహయందు, అస్తి=ఉన్నది. యః=ఎవడు, తదాత్మనా=ఆ బ్రహ్మాత్మతో, అత్ర=ఈ, గుహాయాం=స్థూలసూక్ష్మదేహాత్మకమగు గుహయందు, వసేత్=నివసించునో, తస్య=వానికి, పునః=మరల, అంగగుహాప్రవేశః=స్థూలసూక్ష్మ దేహాత్మకమగు గుహయందు ప్రవేశము, న=లేదు.

సదసద్విలక్షణము, సత్యము, అద్వితీయము అగు పరబ్రహ్మ బుద్ధి యను గుహయందు ఉన్నది. "యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుషః", "స వా ఏష ఆత్మా హృది"— ఇత్యాదిశ్రుతులు ఆత్మ హృదయమునం దున్నదని చెప్పుచున్నవి. "ప్రతిబోధవిదితం మతమ్", "దృశ్యతేఽగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా" —అను శ్రుతి ననుసరించి ఆత్మ బుద్ధి సహాయములేనిదే తెలిసికొన

శక్యము కాదు. బుద్ధివృత్తి ఆవరణమును తొలగించి, ముఖమును అద్దము గ్రహించినట్లు, బ్రహ్మను గ్రహించుచున్నది. అందుచే, సర్వగతమైనను బ్రహ్మ బుద్ధియందున్నదని చెప్పుదురు. సుషుప్త్యవస్థ యందు బుద్ధి లేనపుడు ఆత్మస్వరూపము గ్రహింప శక్యము కాదు కదా? ఊతిబండ సమీపముననున్న చెట్టును గూర్చి "పాషాణే వృక్షః" అని చెప్పినట్లు ఇచట గూడ 'బుద్ధౌ బ్రహ్మ' అనునపుడు సప్తమీ విభక్తి సామీప్యార్థమును బోధించుచున్నది. వాస్తవమున 'గుహా' శబ్దముచే ఐదుకోశములను గూడ గ్రహింప వలసియున్నది. ఐనను, మనోమయాది కోశములకు ఆత్మతో సంబంధము బుద్ధి ద్వారామాత్రమే కలుగుచుండుటవలనను, ఆనందమయకోశము నందుగూడ బుద్ధిసహాయములేనిదే ఆత్మను విడదీసి తెలిసికొనుట శక్యముకానందువలనను, ఆత్మ సత్త్వప్రధానమగు బుద్ధియందే ప్రధానముగ నుండునని చెప్పబడినది. ఏ పురుషుడు, ఆ బ్రహ్మాత్మతో అనగా తానే ఆ బ్రహ్మయని భావించుచు, స్థూలసూక్ష్మదేహాత్మక గుహాయందు నివసించునో ఆతనికి మరల ఈ దేహమనెడు గుహాలో ప్రవేశము, అనగా తాదాత్మ్యాభిమానము లేదు. 'అంగ' అను పదమునకు శిష్యసంబోధనార్థము – ఓయీ! అను నర్థము చెప్ప వచ్చును. "న స పునరావర్తతే",

ఆత్మానం చేద్విజానీయా దయమస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్.

ఇత్యాది శ్రుతులు అట్టి పురుషునకు శరీర సంబంధ ముండదని చెప్పు చున్నవి.

అవ. ఇంతవరకును, ద్వితీయ శ్లోకములో చెప్పిన "ఆత్మా నాత్మవివేచనం స్వనుభవః" అను విషయము విశదీకరింపబడినది. ఇపుడు "బ్రహ్మాత్మనా సంస్థితిః ముక్తిః" అని సూచింపబడిన విషయ మును విశదీకరించుటకు ఉపక్రమించుచున్నాడు–

## వాసనాత్యాగము

జ్ఞాతే వస్తున్యపి బలవతీ వాసనానాది రేషా
కర్తా భోక్తాప్యహమితి దృఢా యాస్య సంసారహేతుః,
ప్రత్యగ్దృష్ట్యాత్మని నివసతా సాపనేయా ప్రయత్నాత్
ముక్తిం ప్రాహు స్తదిహ మునయో వాసనాతానవం యత్.268

వస్తుని = ఆత్మ, జ్ఞాతే ౽పి = పంచకోశవిలక్షణమైనదిగను, బ్రహ్మా భిన్నముగను శాస్త్రయుక్తులచే తెలియబడినను, యా = ఏ, వాసనా = వాసన, అస్య = ఈ జీవునకు, సంసారహేతుః = కర్తృత్వభోక్తృత్వాదిరూపమైన సంసారమునకు కారణమైనదో, అహం కర్తా భోక్తా ఇతి = నేనే కర్తను, నేనే భోక్తను అని, దృఢా = తొలగింప శక్యముకాక ఉన్నదో, అనాదిః = బహుకాలమునుండి అనువర్తించుచున్నదో, ఏషా = ఈ వాసన, బలవతీ = చాల బలముకలది. లోకములోకూడ, స్వప్నమునందు చాల భయపడిన వానికి బాగుగ మెలకువ వచ్చిన పిమ్మట గూడ కొంతసేపటివరకును మనస్సులోని కంగారు తగ్గదు కదా? అందువలన, ఆత్మని = బ్రహ్మయందు, ప్రత్యగ్దృష్ట్యా = బహిర్ముఖత్వమును పూర్తిగవిడచి అంతర్ముఖత్వముతో, అనగా నిర్వికల్పకసమాధితో, అభేదజ్ఞానముతో, నివసతా = నివసించువానిచే, సా = ఆ వాసన, ప్రయత్నాత్ = ప్రయత్నమువలన, అపనేయా = తొలగింపదగినది. ఏలయన, యత్ = ఏ, వాసనాతానవం = వాసనలు అనుత్కటములై తమకార్యము చేయజాలని స్థితి ఏది కలదో, తత్ = దానినే, ఇహ = ఈ లోకమునందు లేదా శాస్త్రమునందు, మునయః = శాస్త్రార్థమనన శీలులగు మునులు, ముక్తిం = ముక్తునిగా, ప్రాహుః = చెప్పుదురు.

ఈ విధముగ బ్రహ్మాత్మభావముతో స్థితియే, ప్రమాదములేని స్థితియే, ముక్తిగాన, దృఢతరమైన సాధనచతుష్టయసంపత్తి లేకపోయినను పూర్వజన్మకృతపుణ్యవశముచే బ్రహ్మజ్ఞానమును పొందినవారికి గూడ, వాసనాక్షయరూపమగు మనోనాశము కొరకై, నిరంతరసమాధిరూపమగు ప్రయత్నము అవశ్యకమే అని చెప్పినట్లైనది.

అవ. ప్రతిబంధమేదైన ఉన్నచో ప్రత్యగ్దృష్టితో ఆత్మయందు స్థితికుదరదుగాన, అట్టి ప్రతిబంధమును, దానిని తొలగించుకొనుటకు ఉపాయమును కరుణానిధి యగు గురువు విస్తరముగ ఉపదేశించుచున్నాడు.

**అహంమమేతి యో భావో దేహాక్షాదావనాత్మని,**
**అధ్యాసోఽయం నిరస్తవ్యో విదుషా స్వాత్మనిష్ఠయా. 269**

అనాత్మని = అనాత్మయైన, దేహాక్షాదౌ = దేహేంద్రియాదులందు, ఆది' పదముచే ప్రాణమనోబుద్ధ్యాదులను గూడ గ్రహింపవలెను. అహం మమ ఇతి = నేను నాది అను, యః = ఏ, భావః = భావము కలదో, అయం = ఈ, అధ్యాసః = అధ్యాసము, విదుషా = శ్రవణమననములుగల పురుష శ్రేష్ఠునిచే, స్వాత్మనిష్ఠయా = స్వాత్మయగు బ్రహ్మయందు పూర్తిగ స్థితి అనురూపముగల నిదిధ్యాసనముచే, నిరస్తవ్యః = సమూలముగ నశింప జేయదగినది.

అవ. దానిని ఎట్లు నశింపజేయవలెనో చెప్పుచున్నాడు.

**జ్ఞాత్వా స్వం ప్రత్యగాత్మానం బుద్ధి తద్వృత్తిసాక్షిణమ్,**
**సోఽహమిత్యేవ సద్వృత్త్యాఽనాత్మన్యాత్మమతిం జహి. 270**

స్వం = తనను, బుద్ధి తద్వృత్తిసాక్షిణం = బుద్ధికిని దాని వృత్తులకును, సాక్షియగు, ప్రత్యగాత్మానం = ప్రత్యగాత్మనుగా, జ్ఞాత్వా = తెలిసికొని, సోఽహమిత్యేవ = నేనే ఆ పరమాత్మను అనెడు, సద్వృత్త్యా = కాలత్రయాబాధ్యమగు అభేదజ్ఞానముచే, అనాత్మని = అనాత్మయగు, బుద్ధ్యాదికమునందు, ఆత్మమతిం = అహంకారమును, జహి = నశింప జేయుము.

అవ. భ్రాంతిపరంపరయొక్క హేతువును త్యజించుట ద్వారా భ్రాంతినికూడ తొలగింపజేసికొను ఉపాయమును చూపుచున్నాడు.

లోకానువర్తనం త్యక్త్వా త్యక్త్వా దేహానువర్తనమ్,
శాస్త్రానువర్తనం త్యక్త్వా స్వాధ్యాసాపనయం కురు. 271

లోకానువర్తనం = లోకానువర్తనమును, అనగా లోకముయొక్క ఇష్టము ప్రకారము ప్రవర్తించుటను, త్యక్త్వా = విడచి, దేహానువర్తనం= దేహానువర్తనమును, త్యక్త్వా = విడచి, శాస్త్రానువర్తనం = శాస్త్రానువర్తనమును, త్యక్త్వా = విడచి, స్వాధ్యాసాపనయం = నీయొక్క అధ్యాసముయొక్క నాశనమును, కురు = చేయుము.

'జనకృపానైష్ఠుర్య ముత్సృజ్యతామ్' - జనులవిషయమున జాలిని, నిష్ఠురత్వమును అనగా దయారాహిత్యమును విడువవలెను అనియు, "దేహేఽహంమతి రుజ్ఝ్యతామ్" = దేహమునందు అహంకారమును విడువుము అనియు 'సాధనపంచకము' నందు కూడ చెప్పబడినది. శాస్త్రానువర్తన మనగా మోక్షోపయోగి గ్రంథములను కాక ఇతరగ్రంథముల యధ్యయనాదికము చేయుట. లేదా - 'దృఢతరం కర్మాశు సంత్యజ్యతామ్' - దృఢతరమగు కర్మను వెంటనే విడువవలెను అను ఉపదేశము ననుసరించి శాస్త్రపదమునకు కర్మశాస్త్రమని అర్థము చెప్పవచ్చును. ఈ లోకానువర్తన-దేహానువర్తన-శాస్త్రానువర్తనములను మూడింటిని విడచి, స్వాధ్యాసాపనయం కురు=అహంకార మమకారములను నశింపజేసికొనుము.

అవ. లోకానువర్తనాదులను ఏల విడువవలెనో చెప్పుచున్నాడు-

లోకవాసనయా జన్తోః శాస్త్రవాసనయాపి చ,
దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే. 272

జన్తోః = మానవునకు, లోకవాసనయా = లోకవాసనచేతను, శాస్త్రవాసనయాపి చ = శాస్త్రవాసనచేతను, దేహవాసనయా = దేహవాసనచేతను, యథావత్ = యథార్థమైన, జ్ఞానం = జ్ఞానము, నైవజాయతే = కలుగదు.

లోకవాసన యనగా — "లోకులెవ్వరును నన్ను ఎన్నడును నిందింపకుండునట్లును, ఎల్లప్పుడు మెచ్చుకొనునట్లును ప్రవర్తించెదను" అను పట్టుదల. ఈ వాసన చాల ప్రతిబంధకమైనది. ఆ విధముగ ఎవ్వడును ప్రవర్తింపజాలడు కదా? ఈ విషయమును విద్యారణ్యగురుచరణులు, జీవన్ముక్తి వివేకములోని వాసనాక్షయప్రకరణము నందు విస్తరముగ ప్రతిపాదించియున్నారు.

"కో లోకమారాధయితుం సమర్థః"

లోకమును ఎవరు సంతోషపెట్టగలరు?

"విద్యతే న ఖలు కశ్చిదుపాయః సర్వలోకపరితోషకరో యః,
సర్వథా స్వహితమాచరణీయం కిం కరిష్యతి జనో బహుజల్పః."

అందరిని సంతోషపెట్టు ఉపాయ మేదియును లేదు కదా? అందుచే అన్నివిధముల తనకు ఏది హితమో అట్టిదానినే చేయవలెను. ఇష్టము వచ్చినట్లు మాటలాడెడు జనులు ఏమిచేయగలరు? అని అచట చెప్పబడినది. కావుననే భగవద్గీతలో కూడ, 'నిందాస్తుతులను తుల్యముగ తీసికొనువాడే నిజమైన భగవద్భక్తుడు' అని చెప్పబడినది. పాఠవ్యసనము, శాస్త్రవ్యసనము, అనుష్ఠానవ్యసనము అని మూడు విధములగు శాస్త్రవాసనను గూర్చి వరుసగ భారద్వాజ - దుర్వాసో - దాశూరుల దృష్టాంతములతో జీవన్ముక్తివివేకమున బాగుగ చెప్పియున్నారు. అట్లే, దేహమును ఆత్మయని భావించుట, దేహమునకు గుణములను చేకూర్చుకొనవలెనని యభిలషించుట, దోషములను తొలగింప జేసికొనవలెనని అనుకొనుట అని దేహవాసన కూడ మూడు విధములని ఆ గ్రంథమునందే వివరింపబడినది. ఆ విషయములు ఆ గ్రంథము నుండియే తెలిసికొనవలెను. ఈ మూడువాసనలు ఉన్నంతకాలము, యథార్థమైన జ్ఞానము కలుగదు.

అవ. ప్రామాణికుల వచనము ప్రకారము ఈ వాసనాత్రయమే సమ్యగ్జ్ఞానప్రతిబంధకము అని చెప్పుచున్నాడు —

సంసారకారాగృహమోక్షమిచ్ఛోః
అయోమయం పాదనిబద్ధశృంఖలమ్,
వదన్తి తద్జ్ఞాః పటువాసనాత్రయం
యోఽస్మాద్విముక్తస్స ఉపైతి ముక్తిమ్. 273

తద్జ్ఞాః=బ్రహ్మవేత్తలు, పటువాసనాత్రయం=కృశింపక బలముగానున్న లోక-శాస్త్ర-దేహవాసనలనెడు వాసనాత్రయమును, సంసారకారాగృహమోక్షం=సంసారమను కారాగృహమునుండి మోక్షమును, ఇచ్ఛోః=అభిలషించు వానికి, అయోమయః=ఇనుము వికారమైన, పాదనిబద్ధశృంఖలం=పాదములందు కట్టబడిన సంకెలనుగా, వదన్తి=చెప్పుదురు. ఇనుప సంకెళ్ళతో కట్టబడిన పాదములు కలవాడు ఏ విధముగ నడువజాలడో, అట్లే లోకాదివాసనాత్రయముతో కూడినవాడు, పరమమగు ఆ విష్ణుపదమును పొందజాలడు అని అభిప్రాయము. యః=ఎవడు, అస్మాత్=ఈ వాసనాత్రయమునుండి, విముక్తః=ముక్తుడగునో, అనగా ఆ వాసనలను దుర్బలమైన వాటినిగ చేయునో, సః=అతడు, ముక్తిం ఉపైతి=యథార్థజ్ఞానముచే మోక్షమును పొందును.

అవ. ఆత్మవాసనలను పెంపొందించుకొనుటయే ప్రతిబంధక వాసనలను తొలగించుకొనుటకు కారణమని దృష్టాంతపూర్వకముగ చెప్పుచున్నాడు -

జలాదిసంపర్కవశాత్ ప్రభూత
దుర్గన్ధధూతాగరుదివ్యవాసనా,
సంఘర్షణేనైవ విభాతి సమ్య
గ్విధూయమానే సతి బాహ్యగన్ధే. 274

జలాదిసంపర్కవశాత్=జలాదులతో సంబంధమువలన, ప్రభూతదుర్గన్ధధూతా=అధికమైన దుర్గంధముచే కప్పబడిన, అగరుదివ్యవాసనా=అగరుయొక్క సుగంధము, సంఘర్షణేనైవ=రాయుటచేతనే, బాహ్యగన్ధే=బాహ్యమగు దుర్గంధము, విధూయమానే=తొలగింపబడినదగుచుండగా, సమ్యక్=బాగుగా, విభాతి=ప్రకాశించును అని దృష్టాంతము.

అన్తః శ్రితానన్తదురన్తవాసనా
ధూళీవిలిప్తా పరమాత్మవాసనా,
ప్రజ్ఞాతిసంఘర్షణతో విశుద్ధా
ప్రతీయతే చన్దనగన్ధవత్ స్ఫుటా. 275

అన్తః శ్రితానన్తదురన్తవాసనాధూళీవిలిప్తా = లోపల నున్నదియు, బహువిధమైనదియు, దుష్ఫలముల నిచ్చునదియు అగు అనాత్మవాసన యనెడు ధూళిచే ఎక్కువగా అణగగొట్టబడిన, పరమాత్మవాసనా=పరమాత్మ వాసన, ప్రజ్ఞాతిసంఘర్షణతః = "తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః"-ధీరుడైన బ్రాహ్మణుడు ఆ పరమాత్మనే తెలిసికొని, ప్రజ్ఞను చేయవలెను అను శ్రుతిచే చెప్పబడినదియు,

"బ్రహ్మాత్మనోః శోధితయోః ఏకభావావగాహినీ,
నిర్వికల్పా చ చిన్మాత్రా వృత్తిః ప్రజ్ఞేతి కథ్యతే."

అని చెప్పబడుచున్నదియు (శ్లో. 428) అగు ప్రజ్ఞచే ఎక్కువ సంఘర్షణము వలన, అనగా మనస్సును కోశసంబంధము లేనిదానినిగ ఉంచుటవలన, విశుద్ధా=అనాత్మవాసనాబంధము లేనిదై, చన్దనగన్ధవత్=చందనగంధము వలె, స్ఫుటా=స్పష్టమైనదై, ప్రతీయతే=తెలియును. ఇది దార్ష్టాంతికము.

అవ. చెప్పబడిన విషయమునే సంగ్రహించుచున్నాడు -

అనాత్మవాసనాజాలైస్తిరోభూతాత్మవాసనా,
నిత్యాత్మనిష్ఠయా తేషాం నాశే భాతి స్వయం స్ఫుటా. 276

అనాత్మవాసనాజాలైః =అనాత్మలను గూర్చిన లోక-దేహ-శాస్త్ర వాసనలయొక్కయు, "దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ" ఇత్యాది శ్లోకములలో అసురసంపత్తిగ చెప్పనున్న వాసనల యొక్కయు సముదాయములచేత, తిరోభూతా=అణచివేయబడిన (ఆత్మవాసనా = ఆత్మవాసన), నిత్యాత్మనిష్ఠయా = నిత్యమగు బ్రహ్మనిష్ఠచే, తేషాం=ఆ వాసనాజాలములయొక్క, నాశే=నాశము జరుగగా, స్వయం= స్వయముగనే, స్ఫుటా=స్ఫుటమైనదై, భాతి=ప్రకాశించుచున్నది.

అవ. "అస్మాల్లోకాత్ప్రేత్య; ఏత మన్నమయ మాత్మాన ముప సంక్రామతి"-ఈ లోకమును విడచి, అన్నమయమైన ఈ ఆత్మను దాటి వెళ్లును-ఇత్యాది శ్రుతిచేతను,

"శనైఃశనై రుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్."

ధైర్యముతో నిగ్రహింపబడిన బుద్ధితో మెల్ల మెల్లగ వైరాగ్యమును అలవరచుకొనవలెను. మనస్సును ఆత్మపై నిలిపి, ఇతర విషయములను వేటినిగూర్చి ఆలోచింపరాదు అను గీతాస్మృతిచేతను చెప్పబడిన వాసనాక్షయోపాయమును చెప్పుచున్నాడు-

యథా యథా ప్రత్యగవస్థితం మనః
తథా తథా ముంచతి బాహ్యవాసనాః,
నిశ్శేషమోక్షే సతి వాసనానాం
ఆత్మానుభూతిః ప్రతిబన్ధశూన్యా. 276

మనః=మనస్సు, యథా యథా=ఎట్లెట్లు, ప్రత్యక్=లోపల, అవస్థితం=అభ్యాసవైరాగ్యములచే స్థిరముగ నుండునో, తథా తథా=ఆ విధముగ, బాహ్యవాసనాః=పుత్రాదులందు మమకారము, అన్నమయాదులందు అహంకారము మొదలగు వాసనలను, ముంచతి=విడచును. వాసనానాం= వాసనలయొక్క, నిఃశేషమోక్షే సతి=వేదాన్తార్థవిచారపూర్వకముగ నిరంతరమగు నిర్వికల్పకసమాధిద్వారా, 'రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే'- పరమాత్మను చూచిన పిమ్మట రసము (విషయాభిలాష) కూడ నివర్తించును అని స్మృతిలో చెప్పిన విధమున నిశ్శేషముగ అనగా సూక్ష్మరూపమున కూడ ఉండనివిధమున, ఆశ్రయమగు మూలాజ్ఞానముతోకూడ మోక్షము అనగా అత్యంతనివృత్తి కలుగగా, ఆత్మానుభూతిః=ఆత్మానుభవము, ప్రతిబన్ధశూన్యా=ప్రతిబంధ మేదియు లేనిదిగ ఉండును.

అవ. కార్యనాశనముద్వారా కారణమును నశింపజేయవలెను గాన, తొమ్మిది శ్లోకములలో, వాసనాకార్యమగు భ్రాంతియొక్క నాశనము వాసనాక్షయమున కారణమని చెప్పుచున్నాడు -

## అధ్యాసనిరాసము

స్వాత్మన్యేవ సదా స్థిత్వా మనో నశ్యతి యోగినః,
వాసనానాం క్షయ శ్చాతః స్వాధ్యాసాపనయం కురు. 278

యోగినః=యోగియొక్క, మనః=మనస్సు, సదా=ఎల్లప్పుడును, స్వాత్మన్యేవ=స్వాత్మయందే, స్థిత్వా=ఉండుటచేత, నశ్యతి=నశించును, అటుపిమ్మట, వాసనానాం=వాసనలయొక్క, క్షయశ్చ=క్షయము గూడ కల్గును. అతః=అందువలన, స్వాధ్యాసాపనయం=నీ అధ్యాసముయొక్క నాశమును, కురు=చేయుము.

యోగినః=సత్త్వోత్కర్షముచే చిత్తముయొక్క రాజసతామస వృత్తులను నిరోధించుకొనుచున్న యోగియొక్క, స్వాత్మన్యేవ=బ్రహ్మయందే. ఎల్లప్పుడును స్థితిచేత అనగా నిదిధ్యాసనముచేత, మనస్సు నశించును. అంతఃకరణము అవిచ్ఛిన్నమగు దీపజ్వాలా సంతానమువలె, నిరంతరవృత్తి ప్రవాహారూపమున పరిణమించుచుం డును. అట్టి అంతఃకరణము తన వేగమును విడచి నిరుద్ధ మగును. అటుపిమ్మట బ్రహ్మ సామీప్యబలముచే శాంతి దాంతిరూపమగు శుద్ధ వాసన దృఢ మగును. అపుడు వాసనాక్షయము కలుగును. బాహ్య నిమిత్త మున్నను క్రోధాదులు కలుగకుండుటయే వాసనాక్షయము. వాసన యనగా - పూర్వాపరవిమర్శ లేకుండ, వెంటనే కలుగు క్రోధాదివృత్తివిశేషములకు హేతువగు చిత్తసంస్కార విశేషము. కావున నీ అధ్యాసములను తొలగించుకొనుము. విపరీతభావనను నివర్తింపజేసి కొనుము. బాగుగ విచారణచేసి కోశపంచకమునందు ఆత్మబుద్ధిని విడువుము.

అవ. రాజస తామస వృత్తులను నిరోధించుట యనెడు యోగమే ఎట్లు కలుగును అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు -

తమో ద్వాభ్యాం రజః సత్త్వాత్ సత్త్వం శుద్ధేన నశ్యతి,
తస్మాత్సత్త్వమవష్టభ్య స్వాధ్యాసాపనయం కురు. 279

తమః = తమోగుణము, ద్వాభ్యాం = సత్త్వ రజోగుణములచే, నశ్యతి = నశించును, రజః = రజోగుణము, సత్త్వాత్ = సత్త్వగుణము వలన (నశించును), సత్త్వం = సత్త్వగుణము, శుద్ధేన = నిర్గుణబ్రహ్మచే (నశించును), తస్మాత్ = ఆ కారణమువలన, సత్త్వం = సత్త్వగుణమును అవష్టభ్య = ఆధారముగగొని, స్వాధ్యాసాపనయం కురు = నీ అధ్యాసములను తొలగించుకొనుము.

రజస్సత్త్వములచే తమస్సు నశించును. వ్యాయామాదులచేతను, కావ్యశాస్త్రవినోదాదులచేతను, తమోధర్మములగు ఆలస్యనిద్రాదులను తొలగించుకొనుచుండుట లోకప్రసిద్ధమే కదా? సత్త్వగుణకార్యమైన చిత్తైకాగ్ర్యముచే కర్మలయందు ప్రవృత్తిని గూడ త్యజింతురు గాన, రజోగుణము సత్త్వగుణముచే నశించుచున్నది. నిర్గుణస్వరూపము లభింపగనే సత్త్వవృత్తియగు జ్ఞానముకూడ తొలగిపోవును గాన సత్త్వము నిర్గుణముచే నశించును. అందుచే సత్త్వగుణమును ఆలంబనముగ గ్రహించి, తమోగుణముచే ఏర్పడిన ఆవరణకాలమున రజోగుణముచే కలిగిన విక్షేపరూపములగు నీ అధ్యాసములను, అనగా భ్రమలను నశింపజేసికొనుము.

అవ. శరీరము జ్ఞానసాధనము గాన, దానిని రక్షించుకొనుటకై దానియందు అభిమానము ఆవశ్యకమే కదా అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు -

ప్రారబ్ధం పుష్యతి వపురితి నిశ్చిత్య నిశ్చలః,
ధైర్య మాలంబ్య యత్నేన స్వాధ్యాసాపనయం కురు. 280

ప్రారబ్ధం=ప్రారబ్ధకర్మయే, వపుః=శరీరమును, పుష్యతి=రక్షించును, ఇతి=అని, నిశ్చిత్య=నిశ్చయించి, నిశ్చలః=నిర్వికారమైన చిత్తము కలవాడై, ధైర్యం=ధైర్యమును, వికారహేతువులున్నను మనస్సున వికారము కలుగకుండుటకు ధైర్య మనిపేరు. ఆలంబ్య = అవలంబించి యత్నేన=ప్రయత్నముతో, నీ అధ్యాసను తొలగించుకొనుము.

అవ. అధ్యాసమును ఎట్లు తొలగించుకొనవలెనో చెప్పుచున్నాడు-

నాహం జీవః పరం బ్రహ్మేత్యతద్వ్యావృత్తిపూర్వకమ్,
వాసనావేగతః ప్రాప్తస్వాధ్యాసాపనయం కురు. 281

అహం=నేను, జీవుడను, న=కాను, పరంబ్రహ్మ=పరబ్రహ్మను, ఇతి=ఈ విధముగ, అంతర్వ్యావృత్తిపూర్వకం=బ్రహ్మభిన్నములగు సమస్తములైన బుద్ధి-మనః-ప్రాణ-శరీరాదుల నిషేధమును ముందుగ చేసికొనుచు అనగా-

"నాహం దేహో నేన్ద్రియాణ్యన్తరఙ్గం
నాహంకారః ప్రాణవర్గో న బుద్ధిః,
దారాపత్యక్షేత్రవిత్తాదిదూరః
సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోఽహమ్."

నేను దేహము కాదు; ఇంద్రియములు కాదు, అంతరంగముకాదు, అహంకారము కాదు, ప్రాణవర్గము కాదు, బుద్ధి కాదు, నేను. భార్యా-పుత్ర-క్షేత్ర-ధనాదులకంటె దూరమైన సాక్షియు, నిత్యమును, శివస్వరూపమును అగు ప్రత్యగాత్మను అని చెప్పిన విధముగ దేహేంద్రియాదులను నిషేధించి, వాసనావేగతః=పూర్వవాసనల వేగమువలన, ప్రాప్తస్వాధ్యాసాపనయం=పూర్వము ప్రాప్తించిన స్వాధ్యాసల అపనయనమును, కురు=చేయుము. లేదా 'వాసనా' పదముచే అనాదికాలప్రవృత్తములగు అనాత్మ వాసనల గ్రహింపవలెను. వాటియొక్క వేగమువలన ప్రాప్తములైన స్వాధ్యాసలను, బ్రహ్మేతరదేహాదినిషేధపూర్వకముగ 'అహం బ్రహ్మ' అను నిరంతరానుసంధానముచేయుచు తొలగించుకొనుము అని అన్వయము చెప్పవచ్చును.

శ్రుత్యా యుక్త్యా స్వానుభూత్యా
జ్ఞాత్వా సార్వాత్మ్యమాత్మనః,
క్వచిదాభాసతః ప్రాప్త
స్వాధ్యాసాపనయం కురు. 282

శ్రుత్యా = శ్రుతిచేతను, యుక్త్యా = యుక్తిచేతను, స్వానుభూత్యా = స్వానుభవముచేతను, ఆత్మనః = నీయొక్క, సార్వాత్మ్యం = సర్వాత్మత్వ మును (నీవే సర్వస్వరూపుడవు అను విషయమును) జ్ఞాత్వా = తెలిసికొని, క్వచిత్ = కొన్నికోశాదులయందు, ఆభాసతః = చైతన్యాభాసమాత్రము వలన, ప్రాప్తస్వాధ్యాసాపనయం కురు = ప్రాప్తించిన స్వాధ్యాసముల నాశమును చేయుము.

"ఆత్మైవేదం సర్వమ్" -ఇదియంతయు ఆత్మయె అను శ్రుతి చేతను, దేని స్ఫురణములేనిదే ఏది స్ఫురింపదో అది దానికంటె భిన్నముకాదు; ఉదాహరణమునకు - మృత్తుయొక్క స్ఫురణములేనిదే స్ఫురింపని ఘటము మృత్తుకంటె భిన్నముకాదు; అట్లే దుందుభి-శంఖ-వీణాదులు సామాన్యశబ్దముకంటె వాటి విశేషశబ్దములు భిన్నములుకావు, అను శ్రుత్యనుసారియగు యుక్తిచేతను, అట్లే "తమేవభాన్త మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి" -ఈ సమస్తప్రపంచము కూడ భాసించుచున్న ఆ పరమాత్మనే అనుస రించి భాసించుచున్నది అను శ్రుతిచేతను; "ఈ సర్వమును ఆత్మ భానముచే భాసించుచున్నది; కావున ఇది ఆత్మకంటె భిన్నముకాదు;" "ఆత్మ సకలకల్పిత వస్తువులకును అధిష్ఠానము; ఆరోపితము అధిష్ఠానముకంటె భిన్నము కాజాలదు" ఇత్యాది యుక్తులచేతను, శ్రుతియుక్తుల ననుసరించి ఏర్పడిన స్వానుభవము చేతను, ఆత్మ సర్వాత్మకమను విషయమును, (లేదా నీవే సర్వాత్ముడవను విషయ మును), కల్పితవస్తువు లన్నియు వాస్తవమున ఆత్మస్వరూపములే యను విషయమును తెలిసికొని, చైతన్య ప్రతిఫలనమాత్రముచే

కొన్ని కోశములవిషయమున కలుగు స్వాధ్యాసమును తొలగించు కొనుము.

అన్నాదానవిసర్గాభ్యా మీషన్నాస్తి క్రియా మునేః,
తదేకనిష్ఠయా నిత్యం స్వాధ్యాసాపనయం కురు. 283

మునేః = ఎల్లప్పుడు మననముచేయు స్వభావము కలవానికి, అన్నాదాన విసర్గాభ్యాం = అన్నమును భుజించుటకంటెను, విసర్జించుట కంటెను వేరైన, క్రియా = క్రియ, ఈషత్ = కొంచెమైనను, న = లేదు, అందుచే, నిత్యం = ఎల్లప్పుడును, తదేకనిష్ఠయా = ఆ పరమాత్మ విషయమున అనన్యరూపమున పూర్తిస్థితిచే, లేదా, ఆ పరమాత్మయొక్కనియందే నిష్ఠచే, స్వాధ్యాసాపనయం = నీయొక్క అధ్యాసయొక్క నాశమును, కురు = చేయుము.

తత్త్వమస్యాది వాక్యోత్థ బ్రహ్మాత్మైకత్వ బోధతః
బ్రహ్మణ్యాత్మత్వదార్ఢ్యాయ స్వాధ్యాసాపనయం కురు.284

తత్త్వ .... బోధతః, తత్త్వమస్యాది='తత్త్వమసి' మొదలగు, వాక్య = వాక్యముల వలన, ఉత్థ = కలిగిన, బ్రహ్మాత్మైకత్వ బోధతః = బ్రహ్మయొక్కయు జీవాత్మయొక్కయు ఏకత్వజ్ఞానమువలన, అనగా దాని బలమువలన, బ్రహ్మణి = బ్రహ్మయందు, ఆత్మత్వదార్ఢ్యాయ=ఆత్మబుద్ధి దృఢముగ కలుగుటకు, అనగా దేహమే ఆత్మయను జ్ఞానము ఎంత దృఢముగ నున్నదో అంత దృఢముగ బ్రహ్మాత్మత్వజ్ఞానము కలుగుటకు, స్వాధ్యాసాపనయం కురు = అనాత్మ భ్రాంతియున్నంత కాలము మహావాక్యములవలన జ్ఞానమే కలుగదు గాన, నీయొక్క అధ్యాసమును తొలగించుకొనుము.

అవ. భ్రాంతిని తొలగించుకొను ప్రయత్నము ఎంతకాలము చేయవలెనో చెప్పుచున్నాడు-

అహంభావస్య దేహేఽస్మి న్నిశ్శేష విలయావధి,
సావధానేన యుక్తాత్మా స్వాధ్యాసాపనయం కురు. 285

అస్మిన్ దేహే = ఈ స్థూలదేహము విషయమున, అహంభావస్య= అహంకారముయొక్క, నిశ్శేషవిలయావధి = పూర్తిగ విలయము కలుగు నంతవరకును, సావధానేన = సావధానత్వముతో, యుక్తాత్మా = కూడిన యంతఃకరణము కలవాడవై, స్వాధ్యాసమును తొలగించుకొనుము.

ప్రతీతిర్జీవజగతోః స్వప్నవద్భాతి యావతా,
తావన్నిరన్తరం విద్వన్ స్వాధ్యాయాభ్యసనం కురు. 286

హే విద్వన్ = ఓ విద్వాంసుడా, యావతా = ఎంతకాలముచే, జీవ జగతోః = జీవునియొక్కయు జగత్తుయొక్కయు, ప్రతీతిః = ప్రతీతి, స్వప్నవత్ = మేల్కొన్నవానికి స్వప్నమువలె నిశ్చితమైన మిథ్యాత్వము కలదై, భాతి = భాసించునో, తావత్ = అంతకాలమువరకును, నిరంతరం = ఎడతెరపిలేకుండ, స్వాధ్యాసమును తొలగించుకొనుము.

అవ. ఈ విధముగ, అనాత్మభ్రాంతిని ఎట్లు పోగొట్టుకొన వలెనో తొమ్మిది శ్లోకములతో ఉపదేశించి, విస్మృతి కలుగుటకు హేతువులను విశదీకరించుచు, ఆత్మనాశహేతువగు విస్మృతికి ఎన్నడును అవకాశ మీయరాదని చెప్పుచున్నాడు-

నిద్రాయా లోకవార్తాయాః శబ్దాదేరపి విస్మృతేః,
క్వచిన్నావసరం దత్వా చిన్తయాత్మాన మాత్మని. 287

నిద్రాయాః = నిద్రవలనను, లోకవార్తాయాః = లోకవార్తలవలనను శబ్దాదేరపి = శబ్దాదివిషయములవలనను, కలుగు, విస్మృతేః = ఆత్మ విస్మరణమునకు (ఆత్మను మరచిపోవుటకు), క్వచిత్ = ఎన్నటికిని, అవసరం = అవకాశమును, అదత్వా = ఈయక, ఆత్మానం = పరమాత్మ స్వరూపమును గూర్చి, ఆత్మని = బుద్ధియందు, చిన్తయ = ఆలోచించుము. "దద్యాన్నావసరం కించి త్కామాదీనాం మనాగపి"-కొంచెమైనను కామా

దులకు అవకాశ మీయరాదు అని చెప్పబడినది లేదా 'నిద్రాయాః ఇత్యా దులను (పంచమ్యంతములుగ కాక) షష్ఠ్యంతములుగ గ్రహించి నిద్రకును, లోకవార్తకును, శబ్దాదులకును, విస్మృతికిని ఎన్నడును అవకాశ మీయక, ఆత్మచిన్తనము చేయుము అని యర్థము. మోక్షధర్మములందు గూడ చెప్ప బడినది.

అప్రాశన మసంస్పర్శ మసందర్శన మేవ చ,
పురుషస్యైష నియమో మన్యే నిఃశ్రేయసం వరమ్.

ఆహారము తీసికొనకుండుట, స్పృశింపకుండుట, చూడకుండుట ఇదియే పురుషునకు నియమము. ఇదే శ్రేష్ఠమైన శ్రేయోమార్గమని తలచుచున్నాను.

అవ. ఏ స్థూలదేహమునందు అభిమానము సకలదోషము లకును మూలమో, ఆ స్థూలదేహమును ఎన్నడును ఆత్మ యని భావింపకుము అని చెప్పుచున్నాడు-

మాతాపిత్రోర్మలోద్భూతం మలమాంసమయం వపుః,
త్యక్త్వా చణ్డాలవద్దూరం బ్రహ్మీభూయ కృతీ భవ. 288

మాతాపిత్రోః = తలిదండ్రుల, మలోద్భూతం = శుక్రశోణితముల వలన జనించినదియు, మలమాంసమయం = మలమాంసవికారమైన, అనగా కారణమునుబట్టియు స్వభావముచేతను గూడ ఏవగింపు కలిగించునది యని యర్థము; వపుః = శరీరమును, చణ్డాలవత్ = చండాలునివలె, దూరం = దూరముగ, త్యక్త్వా = విడచి, దానివిషయమున ఆత్మాభిమానము చేయక, బ్రహ్మీభూయ = అజ్ఞానకృతమగు బ్రహ్మత్వమును తొలగించు కొని నేనే బ్రహ్మను అని తెలిసికొని, కృతీ = కృతకృత్యుడవై లేదా ధీమంతుడవై, భవ = అగుము.

అవ. స్థూలశరీరాభిమానమును విడచి, స్థూలశరీరము పరిమిత ప్రమాణము కలదగుటచే పరిచ్ఛిన్నుడువలె ఉన్న జీవుని గూడ, ఉపాధిని లయింపజేయుటద్వారా లయింపజేయుము అని చెప్పు చున్నాడు-

ఘటాకాశం మహాకాశ ఇవాత్మానం పరాత్మని,
విలాప్యాఖండభావేన తూష్ణీం భవ సదా మునే. 289

హే మునే = ఓ మునీ, ఘటాకాశం = ఘటాకాశమును, మహాకాశ ఇవ = మహాకాశమునందువలె, ఆత్మానం = ఆత్మను, పరమాత్మని = పరమాత్మయందు, విలాప్య = విలీనముచేసి, అఖండభావేన = అఖండ రూపముతో, సదా = ఎల్లప్పుడును, తూష్ణీం భవ = ఊరకుండుము.

మహాకాశమే, ఘటముచే అవచ్ఛిన్నమైనపుడు ఘటాకాశమని చెప్పబడును. ఇట్లే బుద్ధ్యాద్యుపాధులచే పరిచ్ఛిన్నుడగు పరమాత్మ జీవుడని చెప్పబడుచున్నాడు. మనస్సులో ఘటమును వేరుచేసి ఆలోచించినచో ఘటాకాశము మహాకాశముగనే తెలియును. ఇట్లే సర్వోపాదానము, సర్వకల్పనాధిష్ఠానమును అగు బ్రహ్మకంటె వ్యతిరిక్తముగ ఉపాధులు లేవని తెలిసి వాటిని నిషేధింపగనే లభించిన అఖండభావముచేత, అనగా పరిచ్ఛేదమును కలిగించునవి ఏవియు లేకపోవుటచే అపరిచ్ఛిన్నస్వరూపముతో, తూష్ణీం భవ = కర్తవ్యాన్తరము లేవియు లేకపోవుటచే క్రియారహితుడవుగ ఉండుము.

"ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత."
ఓ అర్జునా! ఈ విషయమును తెలిసికొని బుద్ధిమంతుడై కృతకృత్యుడు కావలెను అని భగవద్గీతలో కూడ చెప్పబడినది.

స్వప్రకాశమధిష్ఠానం స్వయం భూత్వా సదాత్మనా,
బ్రహ్మాణ్డమపి పిణ్డాణ్డం త్యజ్యతాం మలభాణ్డవత్. 290

స్వయం = తాను (నీవు) స్వప్రకాశం = స్వప్రకాశస్వరూపమైన, చిద్రూపమగుటచే స్వతఃసిద్ధమైన, అధిష్ఠానం = సర్వకల్పనలకును మాయావిద్యల కల్పనకును అధిష్ఠానముగా, భూత్వా = అయి, సదాత్మనా = సద్రూపముతో, బ్రహ్మాణ్డం = చతుర్దశభువనాత్మకమైన బ్రహ్మాండము, పిణ్డాణ్డమపి = స్వశరీరము, మలభాణ్డవత్ = మలపూర్ణఘటము వలె,

త్యజ్యతాం = విడువబడుగాక అనగా వాటిని స్మరింపకుము అని యర్థము. "అధిష్ఠానావశేషో హి నాశః కల్పితవస్తునః"—కల్పిత వస్తువునకు నాశ మనగా అధిష్ఠానము మాత్రమే మిగులుట అని ప్రమాణవాక్యము. సదాత్మనా విడచుట యనగా నాస్తిత్వమును కల్పించుటయే.

చిదాత్మని సదానన్దే దేహారూఢామహం ధియమ్,
నివేశ్య లిఙ్గముత్సృజ్య కేవలో భవ సర్వదా. 291

దేహారూఢాం = దేహమునకు సంబంధించిన, అహంధియం=అహం కారమును, సదానన్దే=సదానందస్వరూపమగు, చిదాత్మని=చిదాత్మయందు, అనగా స్వయంప్రకాశనిత్యానందస్వరూపమగు పరమాత్మయందు, నివేశ్య = ఉంచి, లిఙ్గం = సూక్ష్మశరీరమును, ఉత్సృజ్య=విడచి అనగా దానియందు తాదాత్మ్యబుద్ధిని విడచి, సర్వదా=ఎల్లప్పుడును, కేవలో భవ= సంగరహితుడవు అగుము, లేదా సజాతీయ విజాతీయ స్వగతభేదరహి తుడవు కమ్ము. భేదము అజ్ఞానకల్పిత మగుటచే, నేనే పరమాత్మను, అను జ్ఞానము కలుగగనే అభేదజ్ఞానము తొలగిపోవును. అపుడు, సహజ మగు కైవల్యము అభివ్యక్త మగును అని అభిప్రాయము.

యత్రైష జగదాభాసః దర్పణాన్తః పురం యథా,
తద్ బ్రహ్మాహమితి జ్ఞాత్వా కృతకృత్యో భవిష్యసి. 292

దర్పణాన్తః = స్వచ్ఛమును, ఛిద్రరహితమును అగు అద్దము లోపల, పురం యథా = జనులు, పర్వతములు, నదులు, ప్రాసాదములు మొదలగు వాటి సమూహాత్మకమైన పట్టణము ప్రతిబింబించునో, అనగా వాస్తవమున అందు లేకున్నను ఉన్నట్లు కనబడునో, అట్లే, యత్ర = ఏ బ్రహ్మయందు, ఏషః = ఈ, జగదాభాసః = మిథ్యాభూతమగు జగత్తు యొక్క ఆభాసము కలుగుచున్నదో, తత్ = ఆ, బ్రహ్మ = బ్రహ్మను, అహం = నేనే, ఇతి = అని, జ్ఞాత్వా = తెలిసికొని, కృతకృత్యః = కృత కృత్యుడవై, భవిష్యసి = కాగలవు.

యత్సత్యభూతం నిజరూపమాద్యం
చిదద్వయానన్ద మరూప మక్రియమ్,
తదేత్య మిథ్యావపు రుత్సృజైత
చ్ఛైలూషవద్వేష ముపాత్తమాత్మనః. 293

చిత్=చిద్రూపమైనదియు, అద్వయానన్దం=అద్వితీయము ఆనంద రూపము అయినదియు, అరూపం = రూపరహితమైనదియు, అక్రియం = క్రియాశూన్యమైనదియు అగు, యత్ = ఏ, ఆద్యం = మొదటిదైన, సత్య భూతం = వాస్తవికమైన, నిజరూపం = నీయొక్క రూపము కలదో, తత్ = దానిని, ఏత్య = పొంది, ఇచట పొందుట అనగా, సువర్ణకంఠాభరణము కంఠమున ఉండగానే పోయినదని భ్రాంతిపడి పిమ్మట ఎవరో చెప్పగా తెలిసికొనినట్లు, తెలిసికొనుటమాత్రమే. ఉపాత్తం = గ్రహింపబడిన, ఆత్మనః = తనయొక్క, వేషం= వేషమును, శైలూషవత్ = నటుడువలె, ఏతత్ = ఈ, మిథ్యావపుః = అసత్యమైన శరీరమును, ఉత్సృజ = విడువుము, అనగా దేహమునందు అహంకారమును విడువుము.

అవ. జ్ఞానము దృఢమగుటకై, మరల అహంపదార్థమైన ఆత్మను శరీరాదులనుండి వేరుచేయుచున్నాడు—

## అహంపదార్థ నిరూపణము

సర్వాత్మనా దృశ్యమిదం మృషైవ
నైవాహమర్థః క్షణికత్వదర్శనాత్,
జానామ్యహం సర్వమితి ప్రతీతిః
కుతోఽహమాదేః క్షణికస్య సిధ్యేత్. 294

క్షణికత్వదర్శనాత్ = క్షణికత్వము కనబడుటవలన, ఇదం = ఈ, దృశ్యం = దృశ్యము, సర్వాత్మనా = సర్వవిధములచేతను, మృషైవ = అసత్యమే (ఇది), అహమర్థః=అహమ్‌అను దానికి అర్థము, న=కాజాలదు, క్షణికస్య = క్షణికమైన, అహమాదేః = అంతఃకరణాదికమునకు, అహం

సర్వం జానామి = నేను సర్వమును తెలిసికొనుచున్నాను, ఇతి = అని, ప్రతీతిః = ప్రతీతి, కుతః = ఎట్లు, సిధ్యేత్ = సిద్ధించును?

అహంపదార్థము సత్యమైనది, నిత్యమైనది. ఈ దృశ్యమంతయు అసత్యమే. క్షణికత్వదర్శనాత్ — ఈ క్షణమున నేను చూచుచున్నాను; ఈ క్షణమున వినుచున్నాను; ఇట్లే నేను వాసనచూచుచున్నాను; నేను రుచిచూచుచున్నాను; నేను వెళ్ళుచున్నాను ఇత్యాది విధముగ ఎక్కడెక్కడ అహంవృత్తితో సంబంధము లున్నవో ఆ సంబంధము లన్నియు, 'అహం', 'అహం' (నేను నేను) అనుదానితో అనుస్యూత ములై యున్నవి. అనేకవస్తువులు అహం ప్రత్యయగోచరమగుట పొసగదు. ఆత్మయనునది ఒక్కటియే కదా? అహంవృత్తితో సంబంధ మేర్పడినపుడు మాత్రమే దృశ్యములు భాసించుచున్నవి. వృత్తి క్షణి కము గాన దానితో సంబంధించినవి కూడ క్షణికములే. భాసింపనిది ఉన్నదని చెప్పుటకుకూడ ప్రమాణము లేదు కదా? కావున జడమగుట చేతను, క్షణిక మగుటచేతను సర్వప్రకారములచేతను గూడ ఈ దృశ్యము అసత్యమే, ఇది అహమర్థము కాజాలదు, నేను అన్నింటిని తెలిసికొనుచున్నాను అనెడు ప్రతీతి క్షణికమైన అహమాదికమునకు, అనగా అంతఃకరణాదికమునకు ఎట్లు సిద్ధించును? నేత్రము రసమును తెలిసికొనజాలదు. శ్రోత్రము రూపమును తెలిసికొనజాలదు. 'గన్ధాయ ఘ్రాణమ్' — గంధమును గ్రహించుటకు ఘ్రాణేన్ద్రియము ఇత్యాది శ్రుత్యనుసారముగ చక్షురాదులు రూపాద్యాకారవృత్తులకు కరణ ములుగ నున్నను, అవి అహమర్థములు కాజాలవు. మనస్సైనను తన వృత్తిని గ్రహింపజాలదు. అట్లైనచో కర్తృకర్మవిరోధము వచ్చును. అనగా మనస్సు మనస్సును తెలిసికొనుట అనునపుడు మనస్సే కర్తయై అదియే కర్మగ నైనట్లు అగును. ఒకే వస్తువు ఒక క్రియలో కర్తగను, కర్మగను ఉండజాలదు.

అవ. కావున ఆత్మ భిన్నమైనది అను విషయమును విశదీకరించుచున్నాడు–

అహంపదార్థస్త్వహమాదిసాక్షీ
నిత్యం సుషుప్తావపి భావదర్శనాత్,
బ్రూతే హ్యజో నిత్య ఇతి శ్రుతి స్స్వయం
తత్ప్రత్యగాత్మా సదసద్విలక్షణః. 295

అహమాదిసాక్షీ = అహంకారాదులకు సాక్షియైన, అహంపదార్థస్తు = అహం' పదవాచ్యమైనదైతే, సుషుప్తావపి = సుషుప్తియందు కూడ, భావదర్శనాత్ = ఉనికియొక్క దర్శనమువలన, నిత్యం = నిత్యమైనవస్తువు. శ్రుతిః = శ్రుతి, స్వయం = స్వయముగ, అజః నిత్యః ఇతి = ఈ ఆత్మ జన్మరహితము, నిత్యము అని, బ్రూతే హి = చెప్పుచున్నది కదా? తత్ = ఆ కారణమువలన, ప్రత్యగాత్మా = జీవాత్మ, సదసద్విలక్షణః = సత్తు కంటెను అసత్తుకంటెను విలక్షణ మైనది.

దృశ్యమగు అంతఃకరణాదికము అహంపదార్థము కాకపోయినచో ఇక అహంపదార్థమైనది ఏది అని ప్రశ్నించుకొని సమాధానము చెప్పుచున్నాడు–'తు' శబ్దము దృశ్యములు అహంపదార్థములకంటె భిన్నములని సూచించుచున్నది. అహమాదిసాక్షీ = అహమాదులకు అనగా సమస్తమైన అజ్ఞానాదిదృశ్యపదార్థములకు సాక్షియైన, నిత్యం = నిత్యమైనవస్తువు, సుషుప్తావపి = అహంవృత్తి (అంతఃకరణము) కూడ లీనమైపోయిన సుషుప్త్యవస్థయందు గూడ ఈ ఆత్మయున్నట్లు 'సుఖమహ మస్వాప్సమ్' నేను సుఖముగ నిద్రించితిని ఇత్యాది ప్రతీతిని అనుసరించి ఉండుటవలన, ఇట్టి, అనుభవమువిషయమున సందేహము కలవానిని గూర్చి చెప్పుచున్నాడు– "అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే" ఇత్యాదిశ్రుతి, ఆత్మ నిత్యమని, స్వయముగ (స్పష్టముగ) చెప్పుచున్నది. అందువలన, ప్రత్యగాత్మ అనగా సచ్చిదానందరూపమగు ఆత్మ, సదసద్విలక్షణమైనది. అనగా వ్యక్తావ్యక్తములకంటె భిన్నమైనది.

వికారిణాం సర్వవికారవేత్తా
నిత్యోఽవికారో భవితుం సమర్హతి,
మనోరథ స్వప్న సుషుప్తిషు స్ఫుటం
పునః పునర్దృష్ట మసత్త్వ మేతయోః. 296

వికారిణాం=వికారముగలపదార్థములయొక్క, సర్వవికారవేత్తా= సమస్తములైన వికారములను తెలిసికొనునది, నిత్యః=నిత్యమైనదిగను, అవికారః=వికారరహితముగను, భవితుం=అగుటకు సమర్హతి=తగి యున్నది, మనోరథస్వప్నసుషుప్తిషు=మనోరథచింతాసమయమునందును, స్వప్నమునందును, సుషుప్తియందును, ఏతయోః=ఈ శరీరతదభిమానుల యొక్క, అసత్త్వం=అసత్త్వము (లేకుండుట) స్ఫుటం=స్పష్టముగ, పునః పునః=మాటిమాటికిని, దృష్టం=చూడబడినది.

వికారముగల దేహాదులకు సంబంధించిన జన్మాదినాశాంతము లైన సర్వవికారములను తెలిసికొనుచున్న ఆత్మ నిత్యమైనదియు, వికారరహితమైనదియు కావలెను. అదికూడ అనిత్యమైనచో సర్వ వికారములను తెలిసికొనజాలదు కదా? ఆత్మకు కూడ వికారము లున్నవన్నచో, కర్మ-కర్తృత్వవిరోధమువలన (చూ. 294) ఆ వికార ములను గుర్తించుట శక్యముకాదు. ఆత్మ అనిత్యము కావలసివచ్చును. తన వికారములనే తెలిసికొనుటలో మునిగియున్నది ఇతరపదార్థముల వికారములను తెలిసికొనజాలదు కదా? కావున ఆత్మ నిత్యమనియు వికారరహిత మనియు చెప్పవలెను. ఇట్లు చెప్పుటచే, ఆత్మకు బుద్ధి-సుఖ-దుఃఖాదులు కూడ ఉన్నవి అని తార్కికులు చెప్పు ఆత్మ కా నిత్యత్వము కుదరదు అని సూచింపబడినది. దేహ-తదభిమానులకు ఆత్మత్వము కుదరదు అని చెప్పుచున్నాడు. ఒడలుమరచి ఏవేవో గాలి మేడలు కట్టుచున్నవానికి, ఆ సమయమున శరీరస్మృతి లేకపోవుటచే వర్షవాతాతపాదిబాధ తెలియదు. దేహమున్నను దానియందు అభిమానము లేకపోవుటచే అభిమాన విశిష్టుడగు అభిమాని లేడనియే చెప్పవలెను. (అనగా దేహాభిమానము కలది ఆత్మయే కాన ఆ మనో

రథసమయమునందు కూడ ఆత్మ ఉన్నది గాన అభిమాని ఉండనే ఉన్నది. లేదని చెప్పుట ఎట్లు అని శంక కలుగవచ్చును. ఆత్మయున్నను అభిమానముతోకూడిన ఆత్మ లేదు కాన అభిమానిలేడని చెప్పవచ్చును. ఉదాహరణమునకు ఒకచోట కలువ ఉండవచ్చును. కాని దానియందు ఎరుపు లేదు. అందుచే ఇచట "ఎరుపుతోకూడిన(ఎఱ్ఱని) కలువలేదు" అని చెప్పుదుము. దీనినే 'విశేషణాభావాత్ విశిష్టాభావః' అని యందురు). ఇట్లే స్వప్నమునందు దేహాన్తరమే సృజింపబడుచున్నది గాన, తద్దేహాభిమాని కూడ భిన్నుడే. ఈ అన్ని అవస్థలయందును సాక్షిగానుండు ఆత్మస్వరూపము మాత్రము ఒక్కటే. కావుననే "స్వప్నేఽర్థశూన్యే సృజతి స్వశక్త్యా భోక్త్రాదివిశ్వం మన ఏవ సర్వమ్" (శ్లో. 172) అని చెప్పబడినది. సుషుప్తియందు, దేహము అహంకారముకూడ లేవను విషయము సిద్ధమే. కావున "స్ఫుటం దృష్టమ్" అని చెప్పబడినది. ఈ విధముగ సకలవస్తువుల భావమునకును అభావమునకును సాక్షియగు, నిత్యస్వరూపము ఒక్కటే అని చెప్పినట్లైనది.

అతోఽభిమానం త్యజ మాంసపిణ్డే
పిణ్డాభిమానిన్యపి బుద్ధికల్పితే,
కాలత్రయాబాధ్య మఖణ్డబోధం
జ్ఞాత్వా స్వమాత్మాన ముపైహి శాన్తిమ్. 297

అతః = అనిత్యము, వికారియు అగుటవలన, మాంసపిణ్డే=మాంస పిండమునందును, బుద్ధికల్పితే = బుద్ధికల్పితమగు, పిండాభిమానిన్యపి = దేహాభిమానముకల చిత్ప్రతిబింబమునందును, అభిమానం = ఆత్మత్వాభిమానమును, త్యజ = విడువుము. అట్లైన నే నెవరిని అని ప్రశ్నింతువేమో - కాలత్రయాబాధ్యం = కాలత్రయమునందును అబాధ్యమైనదియు, అఖణ్డబోధం = నిత్యజ్ఞానస్వరూపమైనదియు అగు, స్వం ఆత్మానం = నీ సంబంధమైన ఆత్మను, జ్ఞాత్వా = తెలిసికొని, శాన్తిం = అత్యన్తికదుఃఖనివృత్తిని (దుఃఖములు పూర్తిగ తొలగిపోవుటను) ఉపైహి = పొందుము, ముక్తుడవు కమ్ము.

అవ. 'స్వాధ్యాసాపనయం కురు' అని చెప్పిన విషయమునే విశదీకరించుచున్నాడు_

త్యజాభిమానం కులగోత్రనామ
రూపాశ్రమేష్వార్ద్రశవాశ్రితేషు,
లింగస్య ధర్మానపి కర్తృతాదీం
స్త్యక్త్వా భవాఖణ్డసుఖస్వరూపః. 298

ఆర్ద్రశవాశ్రితేషు = తడిసిన శవములకు అనగా స్థూలశరీరములకు సంబంధించిన, కుల-గోత్ర-నామ-రూప-ఆశ్రమేషు=కులము, గోత్రము, పేరు, రూపము, ఆశ్రమము వీటియందు, అభిమానం = మమకారమును, త్యజ = విడచిపెట్టుము లింగస్య = సూక్ష్మదేహముయొక్క, ధర్మాన్ = ధర్మములైన, కర్తృతాదీన్ అపి = కర్తృత్వము మొదలైనవాటినికూడ, త్యక్త్వా = విడచి, అఖణ్డసుఖస్వరూపః = అఖణ్డసుఖస్వరూపుడవై, భవ= అగుము. ఇది ఉపదేశము ఆశీర్వాదము కూడ.

అవ. దేనిని సమూలముగ ఉన్మూలనము చేయనిదే ఆత్మానుభూతికలుగదో, అట్టి, సర్వానర్థములకును హేతువైనదియు, ఆత్మానుభూతికి ముఖ్యప్రతిబంధకమును అగు దానినిగూర్చి పదుమూడు శ్లోకములతో చెప్పుచున్నాడు-

## అహంకారనింద

సన్త్యన్యే ప్రతిబన్ధాః పుంసః సంసారహేతవో దృష్టాః,
తేషా మేషాం మూలం ప్రథమవికారో భవత్యహంకారః.299

పుంసః = పురుషునకు, సంసారహేతవః=సంసారమునకు హేతువులైన, అన్యే=అహంకారముకంటె భిన్నమైన, ప్రతిబన్ధాః=ఆత్మజ్ఞానము కలుగకుండ జేయు రాగద్వేషాదులు, సన్తి = ఉన్నవి, ప్రథమవికారః = అజ్ఞానముయొక్క మొదటి వికారమైన, అహంకారః = అహంకారము, తేషాం ఏషాం=అట్టి జ్ఞానప్రతిబంధకములగు రాగద్వేషాదులకు, మూలం= మూలకారణముగ, భవతి = అగుచున్నది.

యావత్ స్యాత్ స్వస్య సమ్బన్ధోఽహంకారేణ దురాత్మనా,
తావన్న లేశమాత్రాపి ముక్తివార్తా విలక్షణా. 300

దురాత్మనా = సకలబంధములకును హేతువగుటచే దుష్టస్వభావము గల, అహంకారేణ = అహంకారముతో, యావత్ = ఎంతకాలము వరకు, స్వస్య = తనకు (పురుషునకు), సమ్బన్ధః = సంబంధము, స్యాత్ = ఉండునో తావత్ = అంతవరకును, విలక్షణా = బంధవిరుద్ధమైన నిత్య నిరతిశయ సుఖస్వరూపమగు, ముక్తివార్తా = ముక్తియొక్క వార్త, లేశ మాత్రాపి = లేశమాత్రమైనను, న = ఉండదు. సర్వబంధములకును మూల మగు అహంకారము ఉన్నవాడు ముక్తుడు అను మాటకు ఏ మాత్రము అర్హుడు కాడు అని భావము.

అవ. అహంకారము లేనిచో ముక్తి లభించునని చెప్పు చున్నాడు—

అహంకారగ్రహాన్ముక్తః స్వరూప ముపపద్యతే,
చన్ద్రవద్విమలః పూర్ణః సదానన్దః స్వయంప్రభః. 301

అహంకారగ్రహాత్ = అహంకారమనెడు రాహువునుండి, ముక్తః = విడువబడినవాడు, చంద్రవత్ = చంద్రునివలె, విమలః = శుద్ధుడై, పూర్ణః = పరిపూర్ణుడై, సదానన్దః = సదానందస్వరూపుడై, స్వయంప్రభః = స్వయముగ ప్రకాశించువాడై, స్వరూపం = తనయొక్క రూపమును, ఉపపద్యతే = పొందును.

స్వరూపమును కప్పివేసెడి అహంకారమనెడు రాహువునుండి ముక్తుడైనవాడు, చంద్రుడువలె స్వరూపమును పొందును; అనగా తనను ప్రత్యగాత్మనుగా తెలిసికొనును. స్వస్వరూపమెట్టిదో చెప్పు చున్నాడు:— విమలము, అపరిచ్ఛిన్నము, నిత్యసుఖరూపము; చిద్రూప మగుటచే స్వయంప్రకాశము. రాహుముక్తుడగు చంద్రునియందు కూడ ఈ నాల్గు ధర్మములును సరిపడును. 'సదానందః' అనుదానికి,

చంద్రపక్షమున, ఎల్లప్పుడును ఆనందము ఎవరిచేతకలుగునో అతడు అని యర్థము. ముక్తియనగా స్వరూపప్రాప్తియేగాన, అహంకారము తొలగిపోయిన తోడనే ముక్తి సిద్ధించును అని చెప్పబడినది.

అవ. అహంకారము కల్పితము గాన, దాని నాశము సంభావ్యమే అని చెప్పుచున్నాడు-

యో వా పురై షోఽహమితి ప్రతీతః
బుద్ధ్యా వివిక్త స్తమసాతిమూఢయా,
తస్యైవ నిఃశేషతయా వినాశే
బ్రహ్మాత్మభావః ప్రతిబన్ధశూన్యః. 302

తమసా = అజ్ఞానముచే, అతిమూఢయా = ఆత్మస్వరూపమును వివేచించి తెలిసికొనుటకు అసమర్థమైన, బుద్ధ్యా =బుద్ధిచేత, అవివిక్తః = అవివిక్తమైనదై, ఏషః అహం ఇతి=ఈ నేను అని, యో వా= ఏ అహంకారము,పురా=పూర్వము,ప్రతీతః=పరిచ్ఛిన్నరూపమున తెలియబడినదో, తస్య=దానికి, నిఃశేషతయా=పూర్తిగా, వినాశే ఏవ=వినాశముకలిగినపుడు మాత్రమే, ప్రతిబన్ధశూన్యః=ప్రతిబంధరహితమగు, బ్రహ్మాత్మభావః=బ్రహ్మాత్మత్వము సిద్ధించును. అట్లు కానిచో, విపరీతభావన ఉన్నంతకాలము, అపరిచ్ఛిన్న బ్రహ్మాత్మత్వజ్ఞానము సులభము కాదు.

అవ. ఆ అహంకారము ఎట్లు నశించునో చెప్పుచున్నాడు-

బ్రహ్మానన్దనిధి ర్మహాబలవతాహంకార ఘోరాహినా
సంవేష్ట్యాత్మని రక్షతే గుణమయై శ్చణ్డైస్త్రిభిర్మస్తకైః,
విజ్ఞానాఖ్యమహాసినా ద్యుతిమతా విచ్ఛిద్య శీర్షత్రయం
నిర్మూల్యాహి మిమం నిధిం సుఖకరం ధీరోఽనుభోక్తుం
క్షమః. 303

సుఖముగ అర్థమగుటకై రూపకమును కల్పించుచున్నాడు. బ్రహ్మసన్నిధిః=బంగారునిధివలె బ్రహ్మానందమే ఒక నిధి, అది, మహాబలవతా=విషయములనెడు క్షీరమును త్రాగుటచే రూఢమూల మగుటచే మహాబలము కలదైన, అహంకార ఘోరాహినా=అహంకారమనెడు భయంకరమగు మహాసర్పముచే, గుణమయైః=సత్త్వరజస్తమోరూపములగు, త్రిభిః=మూడు, చణ్డైః=తీవ్రమైన, ఆత్మని=తనలోనున్న, మస్తకైః=శిరస్సులచే, సంవేష్ట్య=చుట్టి, (ఆవరించి), రక్ష్యతే=రక్షింపబడుచున్నది, అనుభవించుటకు అనర్హముగ చేయబడుచున్నది. ద్యుతిమతా=కాంతిగల అనగా తీక్ష్ణమైన, స్వయంప్రకాశాత్మ విషయకముగాన కాంతికలదిగ ఉన్నది. విజ్ఞానాఖ్యమహాసినా=నిదిధ్యాసనమువలన కలిగిన అనుభవమను పేరుగల గొప్ప ఖడ్గముచే, శీర్షత్రయం=సత్త్వరజస్తమోగుణాత్మకమగు శీర్షములత్రయమును, విచ్ఛిద్య=ఛేదించి, అహిం=అహంకారసర్పమును, నిర్మాల్య=నిర్మూలించి, సుఖకరం=సుఖకరమైన, ఇమం=ఈ, నిధిం=బ్రహ్మానందమనెడు నిధిని, ధీరః=వశములోనున్న బుద్ధిగలవాడు, అనుభోక్తుం=అనుభవించుటకు, క్షమః=సమర్థుడు. ఈ విధముగ అహంకారమును సమ్యగ్వివేకమువలన కలిగిన విజ్ఞానముచే నశింపజేయవచ్చును అని చెప్పినట్లైనది.

అవ. ఆ అహంకారమును వాసనారూపమున గూడ మిగులనీయరాదు అని చెప్పుచున్నాడు-

యావద్వా యత్కించిద్విషదోషస్ఫూర్తిరస్తి చేద్దేహే,
కథ మారోగ్యాయ భవేత్ తద్వదహన్తాపియోగినోముక్త్యై. 304

పూర్వశ్లోకమున 'నిర్మాల్య' అని చెప్పినదానినే వివరించుచున్నాడు- దేహే = దేహమునందు, యావత్ యత్కించిద్వా = కొంచెమైనను, (అని రెండుపదములకును అర్థము), విషదోషస్ఫూర్తిః = విషదోషము యొక్క స్ఫురణము, అస్తి చేత్ = ఉన్నట్లైతే, ఆరోగ్యాయ=ఆరోగ్యము

కొఱకు, కథంభవేత్=ఎట్లు అగును? (ఆరోగ్యమెట్లు కలుగును?) తద్వత్, అట్లే, అహన్తాపి=అహంకార మున్నచో, అనగా కొంచెమైనను అహంకారమున్నచో, యోగినః=యోగియొక్క, ముక్త్యై=ముక్తికొఱకు ఎట్లగును? అహంకారము వాసనారూపమున నున్నను యోగియొక్క ముక్తికి ప్రతిబంధము చేయుచునే ఉండును అని యర్థము.

అహమోఽత్యన్తనివృత్త్యా తత్కృతనానావికల్పసంహృత్యా,
ప్రత్యక్తత్త్వవివేకాదయమహమస్మీతి విన్దతే తత్త్వమ్. 305

అహమః=అహంకారముయొక్క, (అహంకారము) అత్యన్తనివృత్త్యా=మరల జనించని విధమున పూర్తిగ నశించుటచేత తత్కృతనానావికల్పసంహృత్యా='నిమిత్తముపోయినచో దానివలన వచ్చిన కార్యము కూడ తొలగిపోవును', అను న్యాయముచే ప్రథమ వికారమై అహంకారమువలన జనించిన నానావిధములగు కులగోత్రనామరూప ఆశ్రమాదులకు సంబంధించినవియు వివిధకల్పనారూపములును అగు అభిమానములయొక్క నాశముచే; దీనిచే సర్వభ్రాంతులును తొలగుట చెప్పబడినది. అప్పుడు, ప్రత్యక్తత్త్వ వివేకాత్=అనాత్మలలో కలసి పోవని విధమున వివేచించి ఆత్మయాథాత్మ్యమును తెలిసికొనుటవలన, అయం అహం అస్మి=ఆ ఆత్మయే నేను అని, తత్త్వం=తత్త్వమును, విన్దతే=పొందుచున్నాడు; అపరోక్షముగ తెలిసికొనుచున్నాడు.

అహంకర్తర్యస్మిన్నహమితి మతిం ముఞ్చ సహసా
వికారాత్మన్యాత్మప్రతిఫలజుషి స్వస్థితిముషి,
యదధ్యాసాత్ప్రాప్తా జని మృతి జరాదుఃఖ బహులా
ప్రతీచశ్చిన్మూర్తేస్తవ సుఖతనోః సంసృతిరియమ్. 306

ప్రతీచః=అన్నింటికంటెను లోపలనున్నట్టియు, చిన్మూర్తేః=జ్ఞానశరీరుడును, సుఖతనోః=ఆనందఘనమూర్తియు అగు, తవ=ఆత్మవైన నీకు, యదధ్యాసాత్=దేనియందు 'నేను' అనెడు తాదాత్మ్య

ధ్యాసముచే, జనిమృతిజరాదుఃఖబహులా = జననము, మరణము, వార్ధకము, దుఃఖములు అనునవి అధికముగాగల, ఇయం సంసృతిః = ఈ సంసారము, ప్రాప్తా = వచ్చినదో, ప్రాప్తించినట్లు భాసించుచున్నదో, అస్మిన్ = అట్టి ఈ, వికారాత్మని = సూక్ష్మభూతములవలన జనించినదియు, ఆత్మప్రతిఫలజుషి = ఆత్మయొక్క ప్రతిబింబమును గ్రహించునదియు, స్వస్థితిముషి = తనయొక్క సహజమగుస్థితిని, అనగా చిదానందరూపత్వమును అపహరించుచున్న, అనగా ప్రత్యగ్రూపమగు ఆత్మను పరాగ్రూపమైన దానినివలెచేసి స్వస్వరూపమునుండి చ్యుతునిగచేసిన, అహంకర్తరి = అనాత్మయగు అహంకారమునందు, అహమితి మతిం = 'నేను' అనెడు బుద్ధిని, సహసా = శీఘ్రముగ, ముఞ్చ = విడువుము అని ఇది పరమోపదేశము

అవ. మనస్సునకు బాగుగ పట్టుటకై చెప్పిన విషయమునే మరల, దయతో చెప్పుచున్నాడు-

సదైకరూపస్య చిదాత్మనో విభో
రానన్దమూర్తే రనవద్యకీర్తేః,
నైవాన్యథా క్వాప్యవికారిణస్తే
వినాహమధ్యాస మముష్య సంసృతిః. 307

అహంకారాధ్యాసముచే నానారూపత్వము, జడత్వము, పరిచ్ఛిన్నత్వము, దుఃఖము, దుర్యశస్త్వము (అపకీర్తి) వచ్చినవని సూచించుటకై ఈ శ్లోకమున హేతుగర్భములగు విశేషణములు, ప్రయోగింపబడినవి. సదా = ఎల్లప్పుడును, ఏకరూపస్య = ఒకేవిధమగు రూపము కలవాడును, లేదా 'సదేకరూపస్య' అను పాఠమును గ్రహించి 'కాలత్రయాబాధ్యమగు ఏకస్వరూపుడవు' అని అర్థము చెప్పవచ్చును. చిదాత్మనః = చిత్స్వరూపుడవును, విభోః = అపరిచ్ఛిన్నుడవును అనగా సర్వవ్యాప్తుడవును, ఆనన్దమూర్తేః = ఆనందస్వరూపుడవును, అనవద్యకీర్తేః = ఉపనిషత్తులు పరబ్రహ్మస్వరూపుడవని బోధించుటచేత నిత్యశుద్ధ బుద్ధ ముక్తస్వరూపుడవును, అవికారిణః = వికారరహితుడవును

అగు, తే = నీకు, అముష్య = పరాగ్రూపమగు (స్థూలరూపమగు) అహంకారముయొక్క, అనగా అహంకారమునకు సంబంధించిన, అహమధ్యాసం వినా = అహమధ్యాసము లేకుండగా, అనగా అదియే నేను అనెడు తాదాత్మ్యబుద్ధి లేకుండగా, సంసృతిః = జనన-మరణ-జరా-దుఃఖాదులతో జటిలమైన సంసారము, అన్యథా = మరియొకవిధముగ, అనగా వాస్తవమున, నైవ = లేదు.

తస్మా దహంకార మిమం స్వశత్రుం
భోక్తుర్గళే కణ్టకవత్ప్రతీతమ్,
విచ్ఛిద్య విజ్ఞానమహాసినా స్ఫుటం
భుఙ్క్ష్వాత్మసామ్రాజ్యసుఖం యథేష్టమ్. 308

భోక్తుః = భోజనము చేయువానియొక్క, గళే = కంఠమునందు, కణ్టకమివ = ముల్లువలె, ప్రతీతం = భావింపబడుచున్న, అనగా స్వరూపానందానుభవమునకు ప్రతిబంధకముగ నుండుటచే ఇది భోజనము చేయువాని కంఠములోని ముల్లువంటిది, స్వశత్రుం = తనశత్రువైన, ఇమం = ఈ, అహంకారం = అహంకారమును, తస్మాత్ = ఆ కారణము వలన, సంసారములేని వానికి కూడ సంసారమును కల్పించుచున్నదగుటవలన, విజ్ఞానమహాసినా = పంచకోశముల వివేకముచే గలిగిన విజ్ఞానమనెడు తీక్ష్ణమైన ఖడ్గముచే, విచ్ఛిద్య = మరల పుట్టని విధమున నశింపజేసి ఆత్మసామ్రాజ్యసుఖం = అనన్యాధీనమైన నిరంతరాఖండానందమును, యథేష్టం = స్వేచ్ఛగా, అడ్డులేకుండగా, స్ఫుటం = కరతలామలకమువలె స్పష్టముగ, భుంక్ష్వ = అనుభవింపుము.

అవ. తరువాత చేయవలసిన పనిని బోధించుచున్నాడు-

తతోఽహ మాదేర్వినివర్త్య వృత్తిం
సంత్యక్తరాగః పరమార్థలాభాత్,
తూష్ణీంసమాస్స్వాత్మ సుఖానుభూత్యా
పూర్ణాత్మనా బ్రహ్మణి నిర్వికల్పః. 309

తతః=అహంకారాదులయందలి తాదాత్మ్యభ్రాంతి నశించినపిమ్మట, అహమాదేః = అహంకారాదులనుండి, వృత్తిం వినివర్త్య = మనస్సును పరాఙ్ముఖముచేసి, పరమార్థలాభాత్ = నిత్యస్వప్రకాశానందరూపమగు ఉత్కృష్టప్రయోజనముయొక్క లాభమువలన, సంత్యక్తరాగః=విడువబడిన బాహ్యవిషయాభిలాషకలవాడై, ఆత్మసుఖానుభూత్యా = ఆత్మానందానుభవముతో, నిర్వికల్పః = నిర్వికల్పరూపుడవై, పూర్ణాత్మనా = పూర్ణస్వరూపముతో బ్రహ్మణి = బ్రహ్మయందు, తూష్ణీం సమాస్స్వ= సర్వక్రియారహితుడవై యుండుము.

అవ. చెప్పిన విషయమునే మరల మరల చెప్పుటకు కారణమును తెలుపుచున్నాడు-

సమూలకృత్తోఽపి మహానహం పున
ర్వ్యుల్లేఖితః స్యాద్యది చేతసా క్షణమ్,
సంజీవ్య విక్షేపశతం కరోతి
నభస్వతా ప్రావృషి వారిదో యథా. 310

మహాన్ = అనాదికాలమునుండి శాఖోపశాఖలుగ వృద్ధిపొంది యున్నై, అహం=అహంకారము, సమూలకృత్తోఽపి = వివేకజ్ఞానముచే తనమూలకారణమగు అజ్ఞానముతోకూడ ఛేదింపబడినదైనను, పునః = మరల, చేతసా=చిత్తముచే, క్షణం = క్షణకాలముపాటు, వ్యుల్లేఖితః స్యాద్యది=మేల్కొన్నపురుషునిచే పీడకలవలె, స్మరింపబడినచో, సంజీవ్య= మరల ఉత్పన్నమైనదై, శరదృతువుమొదలగు ఋతువులందు నష్టమై నామావశేషమైనను, వారిదః= మేఘము, ప్రావృషి=వర్షర్తువునందు, నభస్వతా =వాయువుచే, యథా =ఏ విధముగ ప్రోగుచేయబడిన ఉదకము కలదై ఏ విధముగ వర్షించునో అట్లే, విక్షేపశతం=వందలకొలది విక్షేపములను, కరోతి=చేయును.

అవ. నశించిన అహంకారము ఎట్లు మరలవచ్చును అని ఆశంకించుకొని, మరణించినవానికి అమృతసేకము వలె విషయానుచింతనమే అందులకు కారణమని చెప్పుచున్నాడు-

## క్రియా-చింతా వాసనల త్యాగము

నిగృహ్య శత్రోరహమోఽవకాశః
క్వచిన్న దేయో విషయానుచిన్తయా,
స ఏవ సంజీవనహేతురస్య
ప్రక్షీణజంబీరతరోరివామ్బు. 311

నిగృహ్య=నిగ్రహించి, శత్రోః=శత్రువైన, అహమః=అహంకారమునకు, విషయానుచిన్తయా=విషయచింతచేత, క్వచిదపి=ఎచటను అవకాశః=అవకాశము, న దేయః=ఈయదగినది కాదు, స ఏవ=ఆ విషయచింతయే, ప్రక్షీణజమ్బీరతరోః=ఎండిపోయిన నిమ్మచెట్టునకు, అమ్బు ఇవ=జలమువలె, అస్య=ఈ అహంకారముయొక్క, సంజీవన హేతుః=పునరుజ్జీవనమునకు హేతువు.

నిగ్రహించి, శత్రోః=సర్వనాశ హేతువగు, ఈ అహంకారమునకు విషయములను గూర్చి ఆలోచించుటద్వారా ఎన్నడును అవకాశమీయరాదు. విషయచింతయే అహంకారముయొక్క సంజీవనమునకు హేతువు. ప్రమాదము జ్ఞానికి ఎట్లు అనర్థకమో "న ప్రమాదాత్" ఇత్యాది శ్లోకమున (323) చెప్పనున్నాడు. విధేయమగు 'సంజీవన హేతుః' అనునది పుంలింగములో నుండుటచే దాని ననుసరించి 'సః' అని పుంలింగప్రయోగము చేయబడినది. క్షీణించినది మరల వృద్ధి పొందుటకు దృష్టాంతమును చెప్పుచున్నాడు - నీరు ఎండిపోయిన నిమ్మచెట్టును కూడ పెరుగునట్లు చేయును. అట్లే వివేకవిజ్ఞానముచే నశింపబడినదైనను అహంకారము పొరపాటుచే విషయచింత చేయగనే మరల ఉజ్జీవితమై సంసారమున పడద్రోయునని యభిప్రాయము. విషయానుచింతనము చేసినంత మాత్రమున నష్టమగు అహంకారము పునరుజ్జీవిత మగునా అని శంక కలుగ వచ్చును. ఈ శంకకు సమాధానమును "విషయేష్వావిశచ్చేతః ఆరోహ ఈక్ష్యతే" (327, 328) అను శ్లోకములలో చెప్పనున్నాడు. ఈ శ్లోకములలో చెప్పనున్న పద్ధతి ననుసరించి, సంకల్పమువలననే విషయములపై కోరిక ఉదయించును.

ఇవి మంచివి; ఆనందమును కలిగించునవి అను జ్ఞానమే సంకల్పము. ఈ వైషయికానందము మనస్సునకు సంబంధించినది. ఎల్లప్పుడును స్వరూపనిష్ఠుడైనవానికి విషయచింత ఎక్కడ ఉండును? వాటిని గూర్చి సంకల్పించుటకు అవకాశమేది? కామమునకు కొంచెమైనను అవకాశ ముండునా? కావున విషయచింతచె స్వరూపవిస్మృతి కలుగుచున్నది. స్వరూపమును విస్మరింపగనే, అహంకారమునే ఆత్మయని భావించుచున్నాడు. అహంకారమే నేను అను బుద్ధి లేనిచో దేహానుకూలముగ కన్పట్టు విషయములయందు కామమే ఉదయించదు కదా? అటుపిమ్మట అహంకారముద్వారా మనస్సు, ప్రాణము, స్థూలదేహము మొదలగు దానిని ఆత్మయని భావించుచు, వెనుకటివలెనే విషయములనుకోరుచు సంసారమున పడుచున్నాడు. ఈ విషయమే సూత్రప్రాయముగ "జ్ఞాతే వస్తున్యపి...." ఇత్యాది శ్లోకమున (268) చెప్పబడినది. దాని తరువాతి గ్రంథ మంతయు తద్వివరణరూపమై పరమార్థతత్త్వమును తెలిసికొనిన పురుషునకు నిరంతరబ్రహ్మనిష్ఠ దృఢమగునట్లు చేయుచున్నది.

అవ. 268వ శ్లోకమునందలి "యాస్య సంసారహేతుః"అను దాని అర్థమును విశదీకరించుచున్నాడు-

దేహాత్మనా సంస్థిత ఏవ కామీ
విలక్షణః కామయితా కథం స్యాత్,
అతోఽర్థసంధానపరత్వమేవ
భేదప్రసక్త్యా భవబన్ధహేతుః. 312

దేహాత్మనా=దేహమే ఆత్మయను బుద్ధితో, స్థిత ఏవ=ఉన్నవాడే, కామీ=కామవంతుడు, విలక్షణః=అట్టి బుద్ధిలేనివాడు, కథం=ఎట్లు, కామయితా స్యాత్=కామవంతు డగును ః అతః=అందువలన, అర్థసంధానపరత్వమేవ=విషయములను గూర్చిన ఆలోచనయే, భేదప్రసక్త్యా=భేదబుద్ధిని పెంచుటద్వారా, భవబన్ధహేతుః=సంసారబంధమునకు కారణము.

దేహాత్మతో ఉన్నవాడే కామనంతుడు. నిరంతరానందరూపముతో ఉన్నయెడల క్షణికానంద హేతువులగు విషయములపై కామమెట్లు కలుగును? దానిచే స్వరూపభ్రంశము చెప్పబడినది.

"ఆత్మానం చేద్విజానీయా దయమస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్."

ఆ పరమాత్మయ్యే నేను అని తెలిసికొనిన పురుషుడు ఏ కోరికలకై శరీరమునుగూర్చి తపనము చెందును? అనియు, "ఆప్తకామం ఆత్మకామం అకామం శోకాన్తరమ్"—పొందబడిన సర్వకామములుకలవాడు, ఆత్మయందే కామము కలవాడు (అందుచే) కామరహితుడు, శోకదూరుడు ఐన వానిని అనియు శ్రుతులు చెప్పుచున్నవి. కావున, విషయానుచింతనాసక్తియే పురుషుని స్వరూపమునుండి తొలగించి, దేహాదులయందు అహంకారమును కలిగించి, భేదబుద్ధి కలిగించుట ద్వారా భవబంధమునకు హేతువగుచున్నది. అట్లు కానిచో సర్వదా స్వరూపనిష్ఠుడైనవానికి కోరబడునది, కోరెడువాడు, కోరిక మొదలగు భేదము ఎక్కడిది? అని భావము.

అవ. తావన్మాత్రముచే నశించిన అహంకారము మరల ఎట్లు ఆవిర్భవించును అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు—

**కార్యప్రవర్ధనాద్బీజప్రవృద్ధిః పరిదృశ్యతే.**
**కార్యనాశా ద్బీజనాశ స్తస్మాత్కార్యం నిరోధయేత్. 313**

**కార్యప్రవర్ధనాత్=కార్యము వృద్ధిపొందుటవలన, బీజప్రవృద్ధిః=బీజములయొక్క వృద్ధి, పరిదృశ్యతే=కనబడుచున్నది. కార్యనాశాత్=కార్యముయొక్క నాశమువలన, బీజనాశః=బీజములయొక్క నాశము (కనబడుచున్నది), తస్మాత్=ఆ కారణము వలన, కార్యం=కార్యమును, నిరోధయేత్=నిరోధింపవలెను.**

లోకమున, కార్యప్రవర్ధనాత్ = కార్యమైన అంకురాదికము ప్రకర్షతో స్కంధశాఖోపశాఖాదిరూపమున వృద్ధిపొందుటవలన, బీజవృద్ధి కనబడుచున్నది. బీజము లేకున్నచో అట్టి వృద్ధి అసంభావ్యము. కీటాదిభక్షితమగు బీజమునుండి అంకురాదులుకూడ ఉత్పన్నములు కావు. కావున బీజము ఒక్కటేయున్నను, అది భూమి జలాదులతో సంబంధము, దోహదము మొదలగు వాటిచే బాగుగ వృద్ధి పొందినదై, అంకురములు, ఆకులు, మ్రాను, కొమ్మలు, పుష్పములు, ఫలములు మొదలగు ఆకారముతో వృద్ధినిపొంది వేలకొలది బీజములను జనింపజేయుటను చూచుచునేయున్నాము. కార్యము నశించుట వలన బీజముకూడ నశించుచున్నది. అంకురాదులకు నిమిత్తమగు బీజమే నశించినచో మరల ఫలములు పుట్టవు. అపుడు బీజమెట్లు వచ్చును? అను విషయములనుగూర్చిన ఆలోచన కార్యము. వికారములలో ప్రథమవికారమగు అహంకారము లేకున్నచో విషయములను గూర్చిన ఆలోచన కలుగదు. ఈ ఆలోచన వృద్ధిపొందుచున్నదనగా దానికి బీజమగు అహంకారముకూడ వృద్ధిపొందుచున్నదని యర్థము. ఈ అహంకారమును వివేకవిజ్ఞానముచే నశింపజేసినను, ఇది అనాది కాలమునుండి వచ్చుచున్నదగుటచే వాసనారూపమున శేషించి యుండును. ఎల్లప్పుడును ప్రత్యగ్దృష్టితో ఆత్మనిష్ఠ లేకున్నచో ఈ అహంకారము వృద్ధిపొంది మరల సంసారమును కలిగించును. అందుచే ఏమరుపాటులేక నిరంతరబ్రహ్మనిష్ఠతో ఉండవలెను. అపుడు విషయానుచిన్తనాదులకు అవకాశముండదుగాన వాసనారూపమున గూడ అహంకారము శేషింపదు. కావున కార్యం నిరోధయేత్ = విషయానుచింతనము చేయరాదు.

అవ. అది ఎట్లు సంసారహేతు వగునో చెప్పుచున్నాడు—

వాసనావృద్ధితః కార్యం కార్యవృద్ధ్యా చ వాసనా,
వర్ధతే సర్వథా పుంసః సంసారో న నివర్తతే. 314

వాసనావృద్ధితః=వాసనయొక్క వృద్ధివలన, కార్యం=కార్యము, వర్ధతే=వృద్ధిపొందును. కార్యవృద్ధ్యా=కార్యముయొక్క వృద్ధిచేత, వాసనా చ=వాసనకూడ, (వృద్ధిపొందును), పుంసః=పురుషునకు, సంసారః=సంసారము, సర్వథా=పూర్తిగ, న నివర్తతే=నివర్తింపదు.

చిన్ననిప్పునెరసుకూడ ఎండినగడ్డి మొదలగునవి చేరగనే మహాగ్నిగా మారి వనమునంతయుగూడ కాల్చి వేయును. అట్లే వాసనా రూపమున నున్నను అహంకారము విషయానుచింతనముచే ఆత్మను స్వస్వరూపమునుండి దూరముచేసి, ఆ ఆత్మయొక్క ప్రతిబింబబల ముచే అనేకాకారముల పరిణమించుచు, కలిగిన వివేకమును గూడ అణచివేయును. వివేకము కలుగుటకు పూర్వము ఉన్నవిధముననే ఇపుడుగూడ భ్రాంతిపరంపరను, కామకర్మాదులను విస్తరింపజేయుచు చాలవరకు నివర్తించిన సంసారమునుగూడ మరల ప్రవర్తింప జేయును. కావున జాగరూకతతో ఉండవలెనని ఈ శ్లోకమున చెప్పు చున్నాడు. 'కార్యం' అనగా విషయచింతయని అర్థము. స్వరూపా నందమును విస్మరించుటచే విషయలాభముకొరకై ప్రయత్నము; విషయములు లభింపకున్నచో దుఃఖము; లభించినచో హర్షము; హర్షము కలుగగనే దర్పము; దర్పము కలుగుటతో ధర్మాతిక్రమణము; ధర్మమార్గమును విడచుటతో బుద్ధియందు మాలిన్యము; బుద్ధిమాలి న్యము కలుగుటచే మరల ఆత్మను తెలిసికొను శక్తి లేకపోవుట; దానితో ఎల్లప్పుడును దేహాదులే ఆత్మ యను భావన; ఈ దేహాత్మ బుద్ధిచే జరా-మరణ-జన్మాదిరూప సంసారము విచ్ఛిన్నము కాకుం డుట- ఈ విధముగ పురుషునకు సంసారనివృత్తి కలుగదు అని చెప్పబడినది.

సంసారబన్ధవిచ్ఛిత్త్యై తద్ద్వయం ప్రదహేద్యతిః,
వాసనా ప్రేర్యతే హ్యన్త శ్చిన్తయా క్రియయా బహిః.315

యతిః = యతి, సంసారబన్ధవిచ్ఛిత్త్యై = సంసార హేతువులగు బంధముల విచ్ఛేదముకొరకు, తద్ద్వయం = ఆ ద్వయమును, ప్రదహేత్ = కాల్చివేయవలెను, వాసనా = వాసన, చిన్తయా = చింతచేత, అన్తః = లోపలను, క్రియయా = క్రియచేత, బహిః = వెలుపలను, ప్రేర్యతే హి = ప్రేరేపింపబడుచున్నది కదా?

యతిః = ప్రయత్నశీలుడగు పురుషుడు, సంసారబన్ధవిచ్ఛిత్త్యై = సంసార హేతువులగు దేహాత్మతేత్యాదులైన సకలబంధముల వినాశము కొరకు, తద్ద్వయం = వాసన దాని కార్యము అనెడు ద్వయమును, ప్రదహేత్ = పూర్తిగ భస్మము చేయవలెను. భస్మమైపోయిన బీజము మరల మొలవకుండునట్లు చేయవలెను. అట్టి వృత్తికి కారణమును, అది తొలగుటకు ఉపాయమును దయతో చెప్పుచున్నాడు- హి = ఏ కారణమువలన, వాసన, చింతచేత లోపలను, క్రియచే బయటను ప్రేరిత మగునో అందువలన దానిని కాల్చివేయవలెను. వెనుక 'కార్య' శబ్దముచే చెప్పిన విషయమునే 'మానసికచిన్తచేతను, బాహ్యక్రియ చేతను' అని విశదీకరించుచున్నాడు (అనగా విషయధ్యానము మానసికచింతచేతను, బాహ్యక్రియచేతను ఏర్పడుచున్నది). చింత లోపల నుండునది. క్రియ బాహ్యశరీరాదులచే జరుగునది. చిత్ప్రతి బింబబలము లేకున్నచో జడమైన మనస్సునకు క్రియకు హేతువగు చింతచేయు సామర్థ్యము లేదు. దానియందు చిత్ప్రతిబింబముకూడ అహంకారముద్వారా మాత్రమే కలుగుచున్నది. మనస్సుమొదలగు వాటిద్వారా చిత్ప్రతిబింబము ప్రవేశించుటవలననే జడమైన శరీరము నకు కర్మలనుచేయు సామర్థ్యము కలుగుచున్నది. కావున సూక్ష్మ రూపమున లోపలనున్న అహంకారము, చింతచేతను, బాహ్యక్రియ చేతను వృద్ధిపొందునని తెలియవలెను.

తాభ్యాం ప్రవర్ధమానా సా సూతే సంసృతిమాత్మనః,
త్రయాణాం చ క్షయోపాయః సర్వావస్థాసు సర్వదా. 316
సర్వత్ర సర్వతః సర్వబ్రహ్మమాత్రావలోకనమ్,
సద్భావవాసనాదార్ఢ్యే తత్త్రయం లయ మశ్నుతే. 317

తాభ్యాం=ఆ రెండింటిచేతను, ప్రవర్ధమానా = వృద్ధిపొందుచున్న, సా = ఆ వాసన, ఆత్మనః = ఆత్మకు, సంసృతిం = సంసారమును, సూతే = కలిగించుచున్నది. సర్వావస్థాసు=సమస్తమైన అవస్థలయందును, సర్వదా = ఎల్లప్పుడును, సర్వత్ర = అంతటను, సర్వతః = అన్నివైపులను, సర్వబ్రహ్మమాత్రావలోకనం=అన్నిటిని బ్రహ్మగా మాత్రమే చూచుట, త్రయాణాం = ఈ మూడింటియొక్క, క్షయోపాయః = క్షయమునకు ఉపాయము. తత్త్రియం = ఆ త్రయముకూడ, సద్భావవాసనాదార్ఢ్యే = ఆత్మభావముయొక్క వాసనయొక్క దార్ఢ్యముకలుగగా, లయం = లయమును, అశ్నుతే = పొందును.

తాభ్యాం=ఆ చింతాక్రియలచేత, వృద్ధిపొందుచున్న ఆ వాసన ఆత్మకు సంసారమును జనింపజేయును. పూర్వము చెప్పిన విధముగ వాసన, చింత, క్రియ అనెడు మూడింటియొక్క క్షయమునకు ఉపాయము, అన్ని అవస్థలయందును ఎల్లప్పుడును, అంతటను, అనగా అన్నికాలములయందును, అన్నిదేశములయందును, అన్ని వస్తువులయందును, జాగ్రదాద్యవస్థలయందును బ్రహ్మకంటె భిన్నమైనది ఏదియును లేదు. "ఇదం సర్వం యదయమాత్మా," "బ్రహ్మైవేదం విశ్వమ్" ఇత్యాది శ్రుతులచేతను, "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాన్తానుపరోధాత్", "తదనన్యత్వమారమ్భణ శబ్దాదిభ్యః" ఇత్యాది సూత్రములచేతను, మట్టి, లోహము, దుందుభి మొదలగు దృష్టాన్తములచేతను, 'దేనిని చూచి దొంగ అనుకొన్నామో అది చెట్టుమోడు', "ఏది వెండియో అది శుక్తి" ఇత్యాదులందువలె "ఏది జగత్తు అనుకొన్నామో అది బ్రహ్మయే" అను జ్ఞానముచే అంతటను అన్నింటిని

బాధించి అధిష్ఠానమైన కేవల బ్రహ్మాకరంకె భిన్నమైనది ఏదియు లేదు అని గ్రహించుటయే సర్వబ్రహ్మమాత్రావలోకనము. ఇట్టి జ్ఞానము కలిగిన పిమ్మట-"యత్ర త్వస్య సర్వమాత్మైవాభూ త్తత్కేన పశ్యేత్", "రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే" అను శ్రుతి స్మృతుల యందు చెప్పిన విధమున ఇక విషయము లెక్కడ, వాటి చింత ఎక్కడ, దానచే బాహ్యక్రియ ఎక్కడ? సర్వబ్రహ్మమాత్రావలోకనముచే సద్భావవాసన దృఢమగుటతో వాసనా-చింతా-క్రియారూపమగు ఆ త్రయము నశించును.

అవ. ఆవిధముగ 'సర్వము బ్రహ్మయే' యను జ్ఞానము కలుగుటకు ఉపాయముగ కార్యనిరోధముచేసి తద్ద్వారా కారణనిరోధము చేయవలెను అని చెప్పుచున్నాడు—

క్రియానాశే భవేచ్చిన్తానాశోఽస్మాద్వాసనాక్షయః,
వాసనాప్రక్షయో మోక్షః స జీవన్ముక్తిరిష్యతే. 318

**క్రియానాశే = క్రియ నశింపగా, చిన్తానాశః = చింతానాశము, భవేత్ = కలుగును, అస్మాత్ = ఈ చింతానాశమువలన, వాసనాక్షయః = వాసనాక్షయము కలుగును, వాసనాప్రక్షయః = వాసనాక్షయమే, మోక్షః = మోక్షము, సః = అదియే, జీవన్ముక్తిః = జీవన్ముక్తిగా, ఇష్యతే = అంగీకరింపబడును.**

పూర్వపూర్వము ఉత్తరోత్తరమును సూచించును. (అనగా క్రియానాశము కలిగినచో చింతానాశము కలిగినదనియు, చింతానాశము కలిగెనచో వాసనానాశము కలిగిన దనియు ఊహించవచ్చును). వాసన లేనిచో చింత ఉండదు. చింతలేనిచో క్రియ యుండదు. ఈ విధముగ కార్యనాశమునుబట్టి కారణనాశమును ఊహింపవచ్చునని యభిప్రాయము. అందుచే నైష్కర్మ్యస్థితి లభించు వరకును పురుషుడు ప్రయత్నము చేయవలెను. అపుడు వాసనలు

తప్పక క్షీణించును. అదియే మోక్షము, అదియే జీవన్ముక్తి యని అంగీకరింపబడుచున్నది. 'బ్రహ్మవేత్తలచేత' అని అధ్యాహారము, ఈ విషయమే వెనుక "ముక్తిం ప్రాహు స్తదిహ మునయో వాసనా తానవం యత్" (శ్లో. 268) అని చెప్పబడినది. వాసన అనగా వస్తువుయొక్క సూక్ష్మావస్థ, దానియొక్క తానవము అనగా నాశమే.

అవ. "సద్భావవాసనాదార్ఢ్యే తత్త్రియం లయమశ్నుతే" అని చెప్పిన విషయమునే దృష్టాన్తపూర్వకముగ విశదీకరించుచున్నాడు-

సద్వాసనాస్ఫూర్తి విజృమ్భణే సతి
హ్యసౌ విలీనా త్వహమాదివాసనా,
అతిప్రకృష్టా ప్యరుణప్రభాయాం
విలీయతే సాధు యథా తమిస్రా. 319

సద్వాసనాస్ఫూర్తివిజృమ్భణే సతి=శ్రవణ-మనన-నిదిధ్యాసనములచే సంస్కృతమగు మనస్సునకు, ఎల్లప్పుడును అంతటను సద్భావనచే సత్సంస్కారస్ఫురణము వృద్ధిపొందిన దగుచుండగా, అసౌ=అ, అహమాదివాసనా=అహమాదివాసన. 'ఆది'పదమును ప్రయోగించుటచే దేహేంద్రియవిషయాదివాసనను కూడ గ్రహింపవలెను. హి=నిశ్చయముగ, అతిప్రకృష్టాపి=మిక్కిలి అధికమైనను, తమిస్రా=అమావాస్యాదులందలి చీకటిరాత్రి, యథా=ఏ విధముగ, అరుణప్రభాయాం=సూర్యసారథియగు అరుణుని కాంతియందు, సాధు=పూర్తిగ, విలీయతే=అణగిపోవునో అట్లే పూర్తిగ నశించినదై, భవతి=అగును అని అధ్యాహారము.

తమ స్తమఃకార్యమనర్థజాలం
న దృశ్యతే సత్యుదితే దినేశే,
తథాఽద్వయానన్దరసానుభూతౌ
నైవాస్తి బన్ధో న చ దుఃఖగన్ధః. 320

అరుణోదయానంతరము, దినేశే = సూర్యుడు, ఉదితే సతి = ఉదయాద్రి నధిష్ఠించినవా డగుచుండగా, తమః = రాత్రిసంబంధమైన చీకటియు, తమఃకార్యం = తమస్సుయొక్క కార్యమైన, అనర్థజాలం = అనర్థ సముదాయయు, అనగా నేత్రములకు శ్రమ, చోరబాధ, మార్గమునందు తొట్రుపడుట మొదలగు దుఃఖసముదాయము, న దృశ్యతే = కనబడదు. తథా = అట్లే, అద్వయానన్దరసానుభూతౌ సతి = సచ్చిదానందైకరూపమగు ప్రత్యగ్బ్రహ్మ యొక్క సాక్షాత్కారము కలుగగా, బన్ధః = అనాత్మను ఆత్మయని భావించుట అనెడు బంధము, నైవాస్తి = లేదు. దుఃఖహేతువగు అధ్యాసము నశించుటచే, దుఃఖగన్ధశ్చ = దుఃఖలేశముకూడ, న = లేదు, "తత్ర కో మోహః కః శోకః ఏకత్వ మనుపశ్యతః"- ఆత్మైకత్వమును అనుభవించువానికి మోహముకాని శోకముగాని ఎక్కడ ఉండును అని శ్రుతి చెప్పుచున్నది.

అవ. ప్రారబ్ధవశముచే జగత్తు భాసించిన భాసింపవచ్చును. అప్పుడు గూడ-

## ప్రమాదనింద

దృశ్యం ప్రతీతం ప్రవిలాపయన్ స్వయం
సన్మాత్రమానన్దఘనం విభావయన్,
సమాహితస్సన్ బహిరన్తరం వా
కాలం నయేథా స్సతి కర్మబన్ధే. 321

ప్రతీతం = కనబడుచున్న, దృశ్యం = దృశ్యప్రపంచమును, ప్రవిలాపయన్ = నామరూపాదినిరాకరణముద్వారా విలీనము కావించుచు, స్వయం = తనను లేదా తాను. సన్మాత్రం = సత్స్వరూపమైన, ఆనన్దఘనం = ఆనందఘనస్వరూపమునుగా, విభావయన్ = భావించుచు, కర్మబంధే సతి = కర్మబంధమున్నంతవరకును, బహిః = వెలుపలగాని, అన్తరం వా = లోపలగాని, సమాహితః సన్ = ఏకాగ్రతతో కూడినవాడవై, కాలం = కాలమును. నయేథాః = కడపుము.

విపరీతార్థధీ ర్యావన్ని శ్శేషం వినివర్తతే,
స్వరూపస్ఫురణం యావన్న ప్రసిద్ధ్యత్య నర్గలమ్,
తావత్సమాధిషట్కేన నయే త్కాలం నిరన్తరమ్.

విపరీతార్థజ్ఞానము నిశ్శేషముగ నశించువరకును, స్వరూపసాక్షాత్కారము నిరాఘాటముగ కలుగనంతవరకును, నిరంతరము సమాధిషట్కముతో కాలమును గడపుము అని చెప్పిన విధమున ప్రతీయమానమగు దృశ్యజగత్తును, దాని నామరూపములను విలీనము చేయుటద్వారా, అధిష్ఠానమగు బ్రహ్మయే యని భావించుచు, నిన్ను గూర్చి సన్మాత్రమగు ఆనందఘనస్వరూపమునే నేనని తలచుచు, లోపలగాని వెలుపలగాని ఏకాగ్రచిత్తుడవై కాలమును గడపుము. కర్మబన్ధే=ప్రారబ్ధవశముచే విక్షేపమునకు అవకాశ మేర్పడినపుడు నీవు,

ఇయం భూర్న సన్నాపి తోయం న తేజో
న వాయు ర్న ఖం నాపి తత్కార్యజాతమ్,
యదేషా మధిష్ఠానభూతం విశుద్ధం
సదేకం పరం యత్తదేవాహమస్మి.

ఈ భూమి సత్తు కాదు; తోయము కాదు; తేజస్సు కాదు; వాయువు కాదు; ఆకాశము కాదు; వీటి కార్యములుగూడ సత్తులు కావు. వీటి కన్నింటికిని అధిష్ఠానమగు విశుద్ధమైన ఏ ఏకైకసత్పదార్థము ఉన్నదో అదియే నేను, ఇత్యాది విధమున వెలుపలగాని (బాహ్యపదార్థముల విషయమున గాని),

న దేహో న చాక్షాణి న ప్రాణవాయు
ర్మనో నాపి బుద్ధి ర్న చిత్తం హ్యహంధీః,
యదేషా మధిష్ఠానభూతం విశుద్ధం
సదేకం పరం యత్తదేవాహమస్మి.

నేను దేహము కాదు; ఇంద్రియములు కాదు; ప్రాణవాయువు కాదు, మనస్సు కాదు; బుద్ధి కాదు; చిత్తము కాదు; అహంకారము కాదు,

పీటి కన్నింటికిని అధిష్ఠానమగు విశుద్ధమైన ఏ ఏకైకసత్పదార్థము ఉన్నదో అదియే నేను, ఇత్యాదివిధమున లోపలగాని, శబ్దానువిద్ధము (శబ్దమును అనుసరించునది), దృశ్యానువిద్ధము (దృశ్యపదార్థములను అనుసరించునది), సవికల్పకము, నిర్వికల్పకము అనెడు భేదముచే వెలుపలగాని, లోపలగాని ఏకాగ్రమగు మనస్సుతో కాలము గడపుము.

అవ శిష్యునకు ఎన్నడును ఏ విధముగను కూడ దుఃఖము కలుగకూడదు అనెడు దయాభావముతో, వివేకవంతునకు గూడ ఏ విధముగ దుఃఖములు కలుగుటకు అవకాశ మున్నదో సవిస్తరముగ చెప్పుచున్నాడు.

ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్యః కదాచన,
ప్రమాదో మృత్యు రిత్యాహ భగవాన్ బ్రహ్మణః సుతః. 322

కదాచన=ఎప్పుడును, బ్రహ్మనిష్ఠాయాం = బ్రహ్మనిష్ఠవిషయమున, ప్రమాదః = ఏమరుపాటు, న కర్తవ్యా = చేయదగినది కాదు. ఏలయనగా, భగవాన్=సర్వజ్ఞుడును, అజానసిద్ధుడును అగు, బ్రహ్మణః సుతః=బ్రహ్మ యొక్క కుమారుడైన సనత్సుజాతుడు, ధృతరాష్ట్రునితో "ప్రమాదం వై మృత్యు మహం బ్రవీమి" అని పల్కుచు, ప్రమాదః = ఏమరుపాటు, మృత్యురితి = మృత్యువు అని, ఆహ = చెప్పుచున్నాడు.

అవ. ఈ విషయమునే సమర్థించుచున్నాడు-

న ప్రమాదాదనర్థోఽన్యో జ్ఞానినః స్వస్వరూపతః,
తతో మోహస్తతోఽహంధీ స్తతోబన్ధ స్తతోవ్యథా. 323

జ్ఞానినః = జ్ఞానికి, స్వస్వరూపతః = స్వస్వరూపమునుండి, ప్రమాదాత్ = ప్రమాదముకంటె, అన్యః = మరియొక, అనర్థః = అనర్థము, న విద్యతే=లేదు ఏలయనగా, తతః=స్వరూపప్రచ్యుతివలన, మోహః= మోహము (విస్మృతి) కల్గును, తతః = దానివలన, అనాత్మని = అనాత్మ

యైన అహంకారమునందు, అహంధీః = నేను అనెడు బుద్ధి కలుగును, తతః = దానివలన, బన్ధః = దేహాదులయందు అధ్యాసరూపమగు బంధము కలుగును, తతః = దానివలన, వ్యథా = జరామరణాదిజన్యమగు దుఃఖము కలుగును.

అవ. అజ్ఞానికి ఈ విధముగ జరిగిన జరుగవచ్చును. జ్ఞానికి కూడ ఇట్లేల జరుగును అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు–

విషయాభిముఖం దృష్ట్వా విద్వాంసమపి విస్మృతిః,
విక్షేపయతి ధీదోషైః యోషా జారమివ ప్రియమ్. 324

యోషా=స్త్రీ, ప్రియం = ప్రియుడైన, జారం = జారునివలె, లేదా– జారం = అన్యాసక్తుడగు, ప్రియమివ = ప్రియునివలె, విస్మృతిః = బ్రహ్మ విస్మృతి, విద్వాంసమపి = వివేకవంతునిగూడ, విషయాభిముఖం = విషయాభిముఖునిగా అనగా బహిర్ముఖునిగా, దృష్ట్వా = చూచి, ధీదోషైః = "పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః" –బ్రహ్మదేవుడు ఇంద్రియములను పరాఙ్ముఖము లగునట్లుగా హింసించెను అనుశ్రుతి ననుసరించి, 'విషయేష్వావిశచ్చేతః' ఇత్యాది శ్లోకములలో (327) చెప్పనున్న బుద్ధి దోషములచే, విక్షేపయతి = నష్టమైన ఆత్మబోధకలవానినిగ చేయును; అధికముగ చలింపజేయును; దూరము తీసికొనుపోవును; త్రిప్పలు పెట్టును.

అవ. ఈ చెప్పిన విషయమునే బాగుగ తెలియుటకై మరి యొక దృష్టాంతముతో చెప్పుచున్నాడు–

యథాపకృష్టం శైవాలం క్షణమాత్రం న తిష్ఠతి,
ఆవృణోతి తథా మాయా ప్రాజ్ఞం వాపి పరాఙ్ముఖమ్. 325

వెనుక "తచ్ఛైవాలాపనయే సమ్యక్ సలిలం ప్రతీయతే శుద్ధమ్" అనుశ్లోకమున (152) నాచును దృష్టాంతముగ చూపుచు కోశపంచకము ఏ విధముగ అపరకమగునో చెప్పియున్నాడు. అపకృష్టం = లాగబడిన, తొలగింపబడిన, శైవాలం నాచు, యథా = ఏ విధముగ, క్షణమాత్రం=

క్షణముపాటైనను, న తిష్ఠతి = నిలబడదో, అనగా మరల ఉదకమును కప్పివేయునో, తథా = అట్లే, మాయా = మాయ, ప్రాజ్ఞం వాపి = కోశ పంచకమును నిషేధించినవాడైనను, పరాఙ్ముఖం = బహిర్ముఖుడుగా నున్నవానిని, ఆవృణోతి = కప్పబడిన స్వరూపము కలవానినిగ చేయును.

అవ. 'న ప్రమాదా దనర్థోఽన్యః' అని చెప్పిన విషయమునే మరియొక దృష్టాంతముతో విశదీకరించుచున్నాడు-

లక్ష్యచ్యుతం చేద్యది చిత్తమీషద్
బహిర్ముఖం సన్నిపతేత్తతస్తతః,
ప్రమాదతః ప్రచ్యుతకేలికన్దుకః
సోపానపఙ్క్తౌ పతితో యథా తథా. 326

యథా = ఏ విధముగ, ప్రమాదతః = ఆడుకొనుచున్నవానికి ఇచ్ఛలేక పోయినను ప్రమాదవశమున, ప్రచ్యుతకేలికన్దుకః = జారినబంతి, సోపాన పఙ్క్తౌ = మెట్లయొక్క పంక్తిపై, పతితః = పడినదై క్రిందికి పోవుచు పట్టుకొనుటకు శక్యముకాదో, తథా = అట్లే, చిత్తం = చిత్తము, ఈషద్యది = కొంచెమైనను, లక్ష్యచ్యుతం చేత్ = లక్ష్యమగు బ్రహ్మనుండి తొలగినచో, బహిర్ముఖం సత్ = అనాత్మవస్తువులయందు సక్తమై, తతస్తతః = అహంకార-బుద్ధి-ప్రాణ-ఇంద్రియ-దేహ-విషయాదులందు, నిపతేత్ = పడును.

అవ. ప్రమాదమే మృత్యువు అను విషయమును రెండున్నర శ్లోకములచే బాగుగ విశదీకరించుచున్నాడు-

విషయేష్వావిశచ్చేతః సంకల్పయతి తద్గుణాన్,
సమ్యక్సఙ్కల్పనాత్కామః కామాత్ పుంసః ప్రవర్తనమ్. 327

తతః స్వరూప విభ్రంశో విభ్రష్టస్తు పతత్యధః,
పతితస్య వినా నాశం పునర్నారోహ ఈక్ష్యతే,

సఙ్కల్పం వర్జయేత్తస్మాత్సర్వానర్థస్య కారణమ్. 328
అపథ్యాని హి వస్తూని వ్యాధిగ్రస్తో యథోత్సృజేత్.

విషయేషు = శబ్దాదివిషయములయందు, చేతః = చిత్తము, ఆవిశత్ సత్ = ఆసక్తి కలదగుచు, తద్గుణాన్ = భోగహేతువు లగుటచే వాటియందు ఉన్న ఆనంద జనకత్వము మొదలగు గుణములనుగూర్చి, సంకల్పయతి = ఆలోచనలు చేయుచుండును. సమ్యక్ = బాగుగా, అధికముగా, సంకల్పనాత్ = సంకల్పించుటవలన, కామః = ఆ విషయములయందు ఇచ్ఛ కలుగును. కామాత్ = కామమువలన, పుంసః = పురుషునకు, ప్రవర్తనం = వాటిని సంపాదించుటయందు యత్నము కలుగును. "యద్యద్ధి కురుతే జన్తుః తత్తత్కామస్య చేష్టితమ్" - ప్రాణి చేయు పను లన్నియు కామ ప్రవృత్తములే అని స్మృతివాక్యము. తతః = అట్టి ప్రయత్నమువలన, స్వరూపవిభ్రంశః = స్వరూపమునుండి ప్రచ్యుతి అనగా స్వస్వరూప విస్మృతి కలుగును. విభ్రష్టస్తు = స్వరూపమునుండి భ్రష్టుడైనవాడైతే, అధః = క్రిందికి, అనగా, అనాత్మలగుకోశములందును తద్ద్వారా దూర దూరములగు విషయములందును, పతతి = పడును, వాటివైపు పోవును. పతితస్య = అతిదూరముపోయినవానికి, నాశం వినా = నాశము లేకుండగ, స్వరూపజ్ఞానము లేకుండుటయే నాశము. స్వరూప నములేక దేహాదులే ఆత్మయని ఎల్లప్పుడును భావించుచుండువానికి మరణాదులుండును. ఈతడు కూడ, 'సర్వము ఉన్నది' అను భ్రాంతిలో ఉండుటచే ఎల్లప్పుడును సంసారములో చిక్కుకొనును. కావున ఈ పతితునకు, పునః = మరల, ఆరోహః = బ్రహ్మలాభము, న ఈక్ష్యతే = కనబడదు. తస్మాత్ = ఆ కారణమువలన, వ్యాధిగ్రస్తః = వ్యాధిగ్రస్తుడు, అపథ్యాని = అనారోగ్య కరములగు, వస్తూని = వస్తువులను, యథా = ఏ విధముగ, ఉత్సృజేత్ = విడచునో ఆ విధముగనే, సర్వానర్థస్య = సకలములైన అనర్థములకును, కారణం = కారణమైన. సంకల్పం = సంకల్పమును, పర్జయేత్ = విడువ వలెను; సంకల్పము చేయరాదు, స్వరూపమునుండి చ్యుతుడైనవానికి చివరకు నాశమువంటి మహానర్థము కూడ కలుగును.

అతః ప్రమాదాన్న పరోఽస్తి మృత్యుః
వివేకినో బ్రహ్మవిదః సమాధౌ,
సమాహితః సిద్ధిముపైతి సమ్యక్
సమాహితాత్మా భవ సావధానః. 329

అతః = అందువలన, వివేకినః=వివేకవంతుడైన, బ్రహ్మవిదః= బ్రహ్మవేత్తకు, సమాధౌ=సమాధివిషయమున, ప్రమాదాత్ = ప్రమాదము కంటె, పరః=ఇతరమైన, మృత్యుః=మృత్యువు, నాస్తి=లేదు. సమ్యక్= బాగుగ, సమాహితః = బ్రహ్మసంస్థుడైనవాడు, సిద్ధిం=ముక్తిని, ఉపైతి= పొందును. నీవుకూడ, సావధానః=ప్రమాదరహితుడవై, సమాహితాత్మా= ఎల్లప్పుడును బ్రహ్మపై నిలుపబడిన మనస్సుకలవాడవై, భవ = అగుము.

## అసత్పరిహారము

జీవతో యస్య కైవల్యం
విదేహే చ స కేవలః,
యత్కించిత్ పశ్యతో భేదం
భయం బ్రూతే యజుశ్శ్రుతిః. 330

యస్య = ఎవనికి, జీవతః = జీవించియుండగనే, కైవల్యం = బంధవినిర్ముక్తత్వముండునో, సః = అతడు, విదేహే చ = దేహపాతము తరువాతకూడ, కేవలః = ముక్తుడే, యత్కించిత్ = ఏ కొంచెమైనను, భేదం = భేదమును, పశ్యతః = చూచువానికి, యజుః శ్రుతిః = యజుర్వేదము, భయం = భయమును, బ్రూతే = చెప్పుచున్నది.

ఏ పురుషునకు, జీవించియుండగనే కైవల్యము, అనగా సర్వోపాధివినిర్ముక్తత్వము లభించునో, ఆ పురుషశ్రేష్ఠుడు, దేహ పాతానంతరము గూడ కేవలుడు అనగా ముక్తుడు అగును. ఏ మాత్రమైనను భేదమును చూచువానికి భయముండునని. "యదా హ్యేవైష ఏతస్మి న్నుదర మన్తరం కురుతే, అథ తస్య భయం భవతి" అను తైత్తిరీయోపనిషద్వాక్యము చెప్పుచున్నది. "ఎప్పుడు ఈతడు, దానియందు, ఉత్ + అరం = కొంచెమైనను భేదమును చూచునో అప్పుడు ఆతనికి భయము కలుగును" అని ఈ వాక్యమున కర్థము. కైవల్యము కలుగుటకు హేతువు నిర్వికల్పకసమాధినిష్ఠయే. ఈ విషయమును "ఉపాధిభేదాత్...." ఇత్యాది శ్లోకమున (358) చెప్పనున్నాడు.

అవ. "తత్త్వేవ భయం విదుషోఽమన్వానస్య"- మననరహితుడగు విద్వాంసునకు ఆ భేదదర్శనమే భయము అను యజుఃశ్రుతి వాక్యార్థమును చెప్పుచున్నాడు-

యదా కదా వాపి విపశ్చిదేషః
బ్రహ్మణ్యనన్తేఽప్యణుమాత్రభేదమ్,
పశ్యత్యథాముష్య భయం తదేవ
యదీక్షితం భిన్నతయా ప్రమాదాత్. 331

ఏషః = ఈ, విపశ్చిత్ = వివేకియగు బ్రహ్మవేత్త, అనన్తే = త్రివిధ పరిచ్ఛేదశూన్యమగు, బ్రహ్మణి = బ్రహ్మయందు, అణుమాత్రభేద మపి = కొంచెము భేదమునైనను, కదా వాపి = ఎప్పుడైనను, యదా పశ్యతి = చూచినట్లైతే ('యదా' = యది.) అథ = అపుడు, ప్రమాదాత్ = ఏమరుపాటువలన, భిన్నతయా = భేదముతో, యద్ ఈక్షితం = ఏ చూచుటగలదో, త దేవ = అదియే, అముష్య = మననశూన్యుడగు ఈ విద్వాంసునకు భయం = భయజనకము. "ద్వితీయాద్వై భయం భవతి" -రెండవదానివలననే భయము కలుగును, "సర్వం తం పరాదాత్ యోఽన్యత్రాత్మనః సర్వం వేద" -ఆత్మకంటె భిన్నముగ సర్వమును ఉన్నదని భావించువానిని ఆ సర్వమే నశింపజేయును, "యేఽన్యథాతో విదుః అన్యరాజానః తే క్షయ్యలోకా భవన్తి" -ఎవరు ఇందులకు భిన్నముగ తెలిసికొందురో, అన్యరాజులగువారు క్షీణించులోకము కలవా రగుదురు అని శ్రుతులు చెప్పుచున్నవి.

శ్రుతిస్మృతిన్యాయ శతైర్నిషిద్ధే
దృశ్యేఽత్ర యః స్వాత్మమతిం కరోతి,
ఉపైతి దుఃఖోపరి దుఃఖజాతం
నిషిద్ధకర్తా స మలిమ్లుచో యథా. 332

శ్రుతిస్మృతిన్యాయశతైః = "నేతి నేతి" "నేహ నానాస్తి కించన", "నాత్ర కాచన భిదాస్తి" ఇత్యాది శ్రుతులచేతను శ్రుత్యనుసారులగు "అనాది

మత్పరం బ్రహ్మ న సన్నాసదుచ్యతే" -బ్రహ్మ అనాది, నేనే పరముగా గలది: అది సత్ అని గాని అసత్ అని గాని చెప్పబడదు ఇత్యాది స్మృతుల చేతను, పంచకోశవివేచనసమయమున చూపబడిన శతాధికములగు యుక్తుల చేతను, నిషిద్ధే = దేహము మొదలు అహంకారమువరకును ఉన్న ఈ దృశ్యము ఆత్మ కాదు అని నిషేధింపబడిన, అత్ర = ఈ, దృశ్యే = దేహాది దృశ్యజాతమునందు, యః = ఎవడు, స్వాత్మమతిం = నేను అనెడు బుద్ధిని, కరోతి = చేయునో, సః = ఆ, నిషిద్ధకర్తా = పాపాత్ముడు, మలిమ్లుచః = మలినమైన అంతఃకరణము కలవాడు, యథా = ఏ విధముగ ఇతికర్తవ్యతామూఢుడై దుఃఖముపై దుఃఖమును పొందుచుండునో, తథా = అట్లే, అసత్తు, జడము, దుఃఖాత్మకము అగు అనాత్మయందు ఆత్మత్వబుద్ధిచే, దుఃఖోపరి = ఒకదుఃఖముపై, దుఃఖజాతం = మరికొన్ని దుఃఖముల సముదాయమును, ఉపైతి = పొందును.

అవ. ఈ విషయమునే విశదీకరించుచున్నాడు—

సత్యాభిసన్ధానరతో విముక్తో
మహత్త్వమాత్మీయ ముపైతి నిత్యమ్,
మిథ్యాభిసన్ధానరతస్తు నశ్యే
ద్దృష్టంతదేత ద్యదచోరచోరయోః. 333

సత్యాభిసన్ధానరతః = తదేకదృష్టితో సత్యనిష్ఠయందు ఆసక్తుడగు, పురుషుడు, విముక్తః = బంధవిముక్తుడై, నిత్యం = నిత్యమైన, ఆత్మీయ మహత్త్వం = తనకు సంబంధించిన మహత్త్వమును, అనగా వికారశూన్యమగు మనస్సు కలిగియుండుటను, సర్వపూజ్యత్వమును, ఉపైతి = పొందును. మిథ్యాభిసన్ధానరతస్తు = మిథ్యాభూతములగు పదార్థముల ధ్యానమునందు ఆసక్తుడైనవాడైతే, నశ్యేత్ = నశించును అసత్యమైనదానిని అవలంబనముగ చేసికొనినవానికి సత్త్వము ఎట్లు లభించును? అతడు నశింపక తప్పదు. యత్ = ఏ విషయము ఇచట చెప్పబడినదో, తత్ ఏతత్ = అట్టి ఈవిషయము, అచోరచోరయోః = దొంగయైనవాని విషయమునను, దొంగ కానివాని విషయమునను, దృష్టం = చూడబడినది. ఈ విషయము ఛాందోగ్యోపనిషత్తులో షష్ఠాధ్యాయమున తప్తపరశుగ్రహణ

దృష్టాంతము ద్వారా చెప్పబడియున్నది. ఒకసత్యవాదిపై చోరుడని ఆరోపము వచ్చినపుడు అతడు న్యాయస్థానములో కాల్చిన ఇనుపగొడ్డలిని పట్టుకొనును, అతడు సత్యమును ఆశ్రయించిన వాడగుటచే ఆతని హస్తము కాలదు; ఆతడు విడుదల పొందును: నిజమైన చోరుడు నేను చోరుడను కానని అసత్యమును చెప్పుచు, ఆ అసత్యమును విడువకున్నచో ఆతనిచేతిలో తప్తపరశువును ఉంచినపుడు అతని చేయి కాలును. దానితో ఆతనిని బంధింతురు, ఇదియే 'మలిమ్లుచ' శబ్దార్థము. చౌర్యమే ఒక పాపకర్మ. ఆ పాపకర్మచేయుటతో అసత్యముపల్కుట మొదలగుఎన్నియో పాపముల పరంపర చేయవలసివచ్చును. ఈ విధముగ చేయుచు మిథ్యా వస్తుధ్యానాసక్తుడైన వానికి అసత్యజ్ఞానము ఎట్లు కలుగును? అట్టివాడు లోకద్వయమునుండియు భ్రష్టుడగును గాన "దుఃఖోపరి దుఃఖజాతం ఉపైతి" అని చెప్పబడినది.

యతి రసదనుసన్ధిం బన్ధహేతుం విహాయ
స్వయమయమహమస్మీత్యాత్మదృష్ట్యైవ తిష్ఠేత్,
సుఖయతి నను నిష్ఠా బ్రహ్మణి స్వానుభూత్యా
హరతి పరమవిద్యాకార్యదుఃఖం ప్రతీతమ్. 334

యతిః = సంన్యాసి, బ్రహ్మసంస్థత్వమనునది సంన్యాసికి మాత్రమే కుదురును గాన 'యతిః' అని చెప్పబడినది. బన్ధహేతుం=బంధమునకు హేతువైన, అసదనుసన్ధిం = బ్రహ్మభిన్నమైనదాని చింతను, స్వయం = తాను, విహాయ = విడచి, అయం = ఈ పరమాత్మ, అహం అస్మి = నేనే అయి ఉన్నాను, ఇతి=అనీ, ఆత్మదృష్ట్యైవ =ఆత్మదృష్టితోడనే, తిష్ఠేత్= ఉండవలెను. అట్లు చేయుటలో పరమపురుషార్థమే ఫలమని చెప్పుచున్నాడు, నను = ఏలయన, బ్రహ్మణి = బ్రహ్మయందు, నిష్ఠా = అన్యాసక్తిలేని విధమున స్థితి, స్వానుభూత్యా = స్వానుభవముచే, అనగా, స్వస్వరూపము, స్వయంప్రకాశము అగు సదానందముయొక్క అనుభవముచే, సుఖయతి = ఆనందింపజేయును. ప్రతీతం = పూర్వము అనుభవింపబడిన, అవిద్యాకార్యదుఃఖం = అవిద్యవలనను, దాని కార్యముల వలనను కలుగు

దుఃఖమును, లేదా - అవిద్యయొక్క కార్యమైన (అనగా అవిద్యవలన కలుగు) దుఃఖమును, పరం = పూర్తిగ, హరతి = హరించును. "తరతి శోకమాత్మవిత్", "యత్ర నాన్యత్పశ్యతి....స భూమా", "యో వై భూమా తత్సుఖమ్" అని శ్రుతులు చెప్పుచున్నవి. ఎల్లప్పుడును అట్టి బ్రహ్మయందు ఉన్నవానికి అవిద్య కాని, దాని కార్యమగు దుఃఖము కాని ఎట్లుండును అని అభిప్రాయము.

అవ. సమూలముగ దుఃఖమును తొలగించుకొనవలె నన్నచో బ్రహ్మయందు ఏకాగ్రస్థితి ఉండవలెను. అది లభింపవలెనన్న బహిర్ముఖత్వ మనునది కొంచెముకూడ ఉండరాదని చెప్పుచున్నాడు—

బాహ్యాభిసన్ధిః పరివర్ధయేత్ఫలం
దుర్వాసనా మేవ తతస్తతోఽధికామ్,
జ్ఞాత్వా వివేకైః పరిహృత్య బాహ్యం
స్వాత్మానుసన్ధిం విదధీత నిత్యమ్. 335

బాహ్యాభిసంధిః = విషయసంగము, తతస్తతః = క్రమక్రమముగా, అధికాం = అధికమైన, దుర్వాసనామేవ = పునర్జన్మను కలిగించు దుర్వాసననే, ఫలం = ఫలమునుగా, పరివర్ధయేత్ = వృద్ధిపొందునట్లు చేయును. "వాసనావృద్ధితః కార్యం కార్యవృద్ధ్యా చ వాసనా" (314) అని వెనుకనే చెప్పబడియున్నది. జ్ఞాత్వా = ఈ విషయమును తెలిసికొని, వివేకైః = ప్రమాదము మృత్యురూపమని చెప్పుసందర్భమున చెప్పిన, విషయసంగము మహానర్థమునకు కారణము అని బోధించు హేతువులచే, (మూ. శ్లో. 327-328), బాహ్యం = అనాత్మయైన బాహ్యపదార్థమును, పరిహృత్య = బాధించి నిత్యం = ఎల్లప్పుడును. స్వాత్మానుసన్ధిం = బ్రహ్మానుసన్ధానమును, విదధీత = చేయవలెను.

అవ. బాహ్యపదార్థానుసంధానము బంధక మను విషయమును చెప్పి, దానిని నిరోధించినచో పరమపురుషార్థరూపమగు ఫలము లభించునని చెప్పుచున్నాడు—

బాహ్యే నిరుద్ధే మనసః ప్రసన్నతా
మనఃప్రసాదే పరమాత్మదర్శనమ్,
తస్మిన్ సుదృష్టే భవబన్ధనాశః
బహిర్నిరోధః పదవీవిముక్తేః. 336

బాహ్యే=బాహ్యానుసంధానము, నిరుద్ధే సతి=నిరోధింపబడినదగు చుండగా, మనసః=మనస్సునకు, ప్రసన్నతా=ప్రసన్నత్వము లభించును. మనఃప్రసాదే=మనస్సునకు ప్రసాదము కలుగగా, పరమాత్మదర్శనం= పరమాత్మ సాక్షాత్కారము కలుగును. తస్మిన్=ఆ పరమాత్మ, సుదృష్టే= బాగుగ చూడబడగా, భవబన్ధనాశః= సంసారబంధనాశము కలుగును. బహిర్నిరోధః=బాహ్యానుసంధానమును అరికట్టుట అనునది, విముక్తేః= ముక్తికి, పదవీ=మార్గము.

ఎక్కువపనులు చేసినవానికి గూడ నిద్రపోయి మేల్కొన్న పిదప మనస్సు ప్రసన్నమగును. సుషుప్త్యవస్థయందు బాహ్యవస్తువు లేవియు ఉండవు గాన మనఃప్రసాదము నిచ్చు సుషుప్తికి సంప్రసాద మని పేరు. బంధహేతువగు బాహ్యమును ప్రయత్నపూర్వకముగ నిరోధింపగా, ఆనంద మావిర్భవించి ప్రసన్నత్వము లభించునని వేరుగ చెప్పవలెనా? మనస్సుకు ప్రసాదము కలిగిన పిమ్మట,

"ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే,
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే."

ప్రసాదము కలిగినపిమ్మట వీనికి సర్వదుఃఖములును తొలగిపోవును. ఏలయన ప్రసన్నచేతస్కుడగు వాని బుద్ధి వెంటనే స్థిరముగ నిల చును అను గీతావాక్యము ననుసరించి దుఃఖముక్తమై నిర్మలమగు మనస్సు, సూక్ష్మమై, ఏకాగ్రమై, పరమాత్మదర్శన సమర్థమగును. 'మనసైవేద మాప్తవ్యం', 'మనసైవానుద్రష్టవ్యమ్', 'దృశ్యతే త్వ గ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా' _ "దీనిని మనస్సుచేతనే పొందవలెను, "ఇది మనస్సుచేతనే చూడదగినది", "ఇది ఏకాగ్రము, సూక్ష్మము

అగు బుద్ధిచే చూడబడును'' అని శ్రుతులు చెప్పుచున్నవి. ఆ పరమాత్మ, సుదృష్టే=అనన్యరూపమున నిరంతరము సాక్షాత్కరింప చేసికొనబడగా, భవబన్ధనాశః=సంసార హేతువులగు అన్ని అధ్యాసముల యొక్కయు సమూలనాశము కలుగును. కావున, బహిర్నిరోధః=వృత్తికి బాహ్యాలంబనము లేకుండుట, విముక్తేః=మోక్షమునకు, పదవీ=మార్గము; మోక్షమును పొందించు మార్గము.

అవ. ఈ విధముగ బహుప్రకారములచే విషయచింతయందు గల దోషములను జూపి విషయచింతనుండి పూర్తిగ మరల్చుటకును, విషయచింత కలవారికి సిగ్గు కలుగుటకును విషయనింద చేయుచున్నాడు -

కః పణ్డితః సన్ సదసద్వివేకీ
శ్రుతిప్రమాణః పరమార్థదర్శీ,
జానన్హి కుర్యా దసతోఽవలమ్బం
స్వపాత హేతోః శిశువన్ముముక్షుః. 337

పరమార్థదర్శీ=పరమార్థమును చూచెడు స్వభావము కలవాడును, కావుననే, శ్రుతిప్రమాణః=శ్రుతిప్రమాణము కలవాడును, అతీంద్రియములగు విషయములను తెలిసికొనుటకు శ్రుతియొక్కటియే ప్రమాణముకదా? అందువలన, "యో వై భూమా తదమృతమ్; అతోఽన్యదార్తమ్" ఇత్యాది శ్రుతులచే, సదసద్వివేకీ=బ్రహ్మయే సత్యమైనది, జగత్తు అసత్యమైనది అను జ్ఞానము గలవాడును, అందుచే, పండితః=వస్తుయాథాత్మ్యజ్ఞానము కలవాడును, ముముక్షుః=బంధనివృత్తిని కోరుచున్నవాడును అగు, కః=ఎవడు, శిశువత్=శిశువువలె, స్వపాత హేతోః=తన యొక్క పతనమునకై, జానన్=తెలిసియుండి కూడ, అసతః=అసత్తైన దానియొక్క, అవలంబం=ఆశ్రయమును, కుర్యాత్=చేయును? శిశువు అజ్ఞానముచే పైనుండి క్రిందికి పడవచ్చును. సర్పదీపాదులను ముట్టవచ్చును. కాని ఇతడు జ్ఞానవంతుడు కదా? కావున వివేకవంతుడు ప్రమాద రహితుడై, బ్రహ్మసంస్థుడై ఉండవలెను.

అవ. సుషుప్తియందు పదార్థజ్ఞాన ముండదు. జాగ్రదవస్థయందు పదార్థజ్ఞాన ముండును. ఈ విధముగ పరస్పర విరుద్ధధర్మములగు సుప్తిజాగరణములు ఒకనియందు, ఒకే సమయమున ఎట్లుండవో అట్లే దేహాద్యభిమానము, ముక్తి యనునవి ఒకేసమయమున, ఒక వ్యక్తియందు ఉండజాలవు అని చెప్పుచున్నాడు-

దేహాదిసంసక్తిమతో న ముక్తి
ర్ముక్తస్య దేహాద్యభిమత్యభావః,
సుప్తస్య నో జాగరణం న జాగ్రతః
స్వప్నస్తయో ర్భిన్నగుణాశ్రయత్వాత్. 338

దేహాదిసంసక్తిమతః=దేహాద్యభిమాన మున్నవానికి, ముక్తిః=ముక్తి, న=లేదు, ముక్తస్య=ముక్తునకు, దేహాద్యభిమత్యభావః=దేహాద్యభిమానముండదు, తయోః=జాగ్రత్స్వప్నములు, భిన్నగుణాశ్రయత్వాత్=వేరువేరు ధర్మములకు ఆశ్రయ మగుటవలన, సుప్తస్య=నిద్రపోవుచున్నవానికి, జాగరణం=జాగరణము, నో=లేదు. జాగ్రతః=మేల్కొన్నవానికి, స్వప్నః=స్వప్నము, న=లేదు.

'న స పునరావర్తతే' - జ్ఞాని మరల తిరిగిరాడు అను శ్రుతి ననుసరించి ముక్తునకు మరల దేహాదులందు అభిమానము కలుగనే కలుగదు. కలిగినచో అతడు ముక్తుడు కాడు. ఈ విషయమును 'విజ్ఞాత బ్రహ్మతత్త్వస్య' ఇత్యాది శ్లోకమున (443) చెప్పనున్నాడు-

అవ. ముక్తుని స్వరూపమును చెప్పుచున్నాడు-

## ఆత్మనిష్ఠా విధానము

అన్తర్బహిః స్వం స్థిరజఙ్గమేషు
జ్ఞానాత్మనాధారతయా విలోక్య,
త్యక్తాఖిలోపాధి రఖణ్డరూపః
పూర్ణాత్మనా యః స్థిత ఏష ముక్తః. 339

స్థిరజఙ్గమేషు=చరాచరవస్తువులయందు, అన్తః=లోపలను, బహిః=వెలుపలను, జ్ఞానాత్మనా=జ్ఞానరూపమున, ఆధారతయా=ఆధారముగ, స్వం=ఆత్మను, విలోక్య=సాక్షాత్కరించుకొని, త్యక్తాఖిలోపాధిః=విడువబడిన సమస్త ఉపాధులు, అనగా అజ్ఞానము తత్కార్యములు కలవాడై, కావుననే అఖణ్డరూపః=దేశకాలవస్తుపరిచ్ఛేద శూన్యమైన సచ్చిదానంద రూపుడై, యః= ఎవడు, పూర్ణాత్మనా =అపరిచ్ఛిన్నస్వరూపముతో; స్థితః=ఉన్నవాడో, ఏషః=ఇతడే, ముక్తః=ముక్తుడు.

అవ. ముక్తికి హేతువును, ఆ హేతువునకు హేతువును చెప్పుచున్నాడు -

సర్వాత్మనా బన్ధవిముక్తి హేతుః
సర్వాత్మభావాన్న పరోఽస్తి కశ్చిత్,
దృశ్యాగ్రహే సత్యుపపద్యతేఽసౌ
సర్వాత్మభావోఽస్య సదాత్మనిష్ఠయా. 340

సర్వాత్మభావనా = సర్వవిధముల, బన్ధవిముక్తిహేతుః = బంధమోక్షమునకు హేతువు, సర్వాత్మభావాత్=సర్వాత్మభావముకంటె, పరః=మరియొకటి, కశ్చిత్=ఏదియు, నాస్తి=లేదు, సదా=ఎల్లప్పుడును, ఆత్మనిష్ఠయా=ఆత్మనిష్ఠచేత, దృశ్యాగ్రహే సతి=దృశ్యములు తెలియనివగుచుండగా, అస్య=ఈతనికి, అసౌ=ఆ, సర్వాత్మభావః=సర్వాత్మభావము ఉపపద్యతే=కలుగును.

"యతో యతో నివర్తతే తతస్తతో విముచ్యతే,
నివర్తనాద్ధి సర్వతో న వేత్తి దుఃఖ మణ్వపి."

ఏ యే వస్తువునుండి మరలునో ఆ యా వస్తువునుండి విముక్తుడగును. అన్నింటినుండియు నివర్తించుటవలన, అణుమాత్రమైనను దుఃఖమును అనుభవింపడు అని చెప్పిన విధమున, పూర్తిగ బంధము తొలగిపోవలెనన్నచో దానికి సర్వాత్మభావ మొక్కటియే హేతువు. దానికంటె వేరైన హేతువు ఏదియును లేదు.

"అహం బ్రహ్మాస్మి యో వేద స సర్వం భవతి త్విదమ్,
నాభూత్యా ఈశతే దేవా స్తేషామాత్మా భవేద్ధి సః."

నేనే బ్రహ్మాను అని ఎవడు తెలిసికొనునో ఆతడు సర్వస్వరూపుడగును. దేవతలకుకూడ ఈతనిపై అధికారముచేయు శక్తి యుండదు. ఆతడు ఆ దేవతలకుగూడ ఆత్మయై యున్నాడు కదా అని చెప్పబడినది. బంధకమైనది, తనకంటె భిన్నమైన దానిని మాత్రమే బంధింపగలదు గాని తననే బంధింపజాలదు. కర్తయే కర్మయగుట అనునది విరుద్ధము కదా! "ఎంత నేర్పరియైనను నటుడు తన భుజమునే ఎక్కజాలడు కదా", "అగ్ని తననే కాల్చజాలదు కదా" అని భాష్యకారులు కూడ చెప్పియున్నారు. కావున, సర్వాత్మభావము లభించిన పిదప, ఏది బంధకమో తదాత్మత్వముకూడ తప్పక లభించును గాన, బంధమెట్లు కలుగును?

"సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని,
సంపశ్యన్ బ్రహ్మ పరమం యాతి నాన్యేన హేతునా."

తనను సర్వభూతములయందును, సర్వభూతములను తనయందును చూచెడువాడే బ్రహ్మను పొందును; ఇతర హేతువుచే పొందజాలడు అని కైవల్యశ్రుతి చెప్పుచున్నది. "సర్పమునకు అధిష్ఠానమగుటచే దానియందు అనుస్యూతముగ రజ్జువు ఉన్నట్లు, సర్వభూతములకు ఉపాదానమగుటచే వాటియందు అనుస్యూతముగ నున్న ఆత్మను, రజ్జువుపై కల్పితమగు సర్పమున్న విధమున, ఆత్మయందున్న సర్వభూతములను చూచువాడు" అని శ్రుతికి అర్థము. అందుచే, సర్వాత్మభావ మనగా సర్వోపాధివిముక్తుడై కేవలముగ ఉండుటయే. ఉపాధిసంబంధముచే పరిచ్ఛిన్నుడై యున్నంతకాలము సర్వాత్మత్వము అసంభావ్యము కదా?

(ఆశంక) మాయ వ్యాపకము గాన, దానితో కూడిన (తదవచ్ఛిన్నమైన) ఆత్మ మాయాకార్యము లన్నింటికిని అధిష్ఠానమని చెప్పవచ్చును.

(సమాధానము) కాని అపుడు మాయ మిగిలియున్నది గాన దానికి కూడ అధిష్ఠానము కావలెనన్నచో అది (అధిష్ఠానత్వము) శుద్ధము, నిరవచ్ఛిన్నమును అనగా చైతన్యమునకు మాత్రమే సంభావ్యము. అందుచే సర్వాత్మభావమనగా కైవల్యమే. ఇట్టి సర్వాత్మభావమునకు హేతువును చెప్పుచున్నాడు - ఈ సర్వాత్మభావము, అస్య = ఈ జ్ఞానికి ఎల్లప్పుడును ఆత్మనిష్ఠచే దృశ్యప్రపంచభానము లేకున్నచో కలుగును.

అవ. దృశ్యాగ్రహణమనునది సదాత్మనిష్ఠ యున్నపుడే లభించును గాని మరియొక విధముగ లభింపదని చెప్పుచున్నాడు-

దృశ్యస్యాగ్రహణం కథం ను ఘటతే దేహాత్మనా తిష్ఠతః
బాహ్యార్థానుభవప్రసక్తమనసః తత్తత్క్రియాం కుర్వతః,
సంన్యస్తాఖిల ధర్మకర్మవిషయై ర్నిత్యాత్మనిష్ఠాపరై
స్తత్త్వజ్ఞైః కరణీయమాత్మని సదానన్దేచ్ఛుభిర్యత్నతః.341

దేహాత్మనా=దేహాత్మబుద్ధితో, తిష్ఠతః=ఉన్నవాడును, కావుననే, బాహ్యార్థానుభవప్రసక్తమనసః = బాహ్యవిషయముల అనుభవమునందు మిక్కిలి ఆసక్తమైన మనస్సు కలవాడును, ఈ విశేషణముచే విషయచిన్తనము, సంకల్పము, కామము సూచితములైనవి. తత్తత్క్రియాం కుర్వతః=విషయములను సంపాదించుటకు ఆ యా పనులను చేయుచున్న పురుషునకు, దృశ్యస్య అగ్రహణం=దృశ్యమును చూడకుండుట అనునది కథం=ఎట్లు, ఘటతే=కుదురును? అందుచే-సంన్యస్తాఖిల ధర్మకర్మ విషయైః=వైదికధర్మమును, లౌకికకర్మలను, శబ్దాదివిషయములను విడచిన వారును, నిత్యాత్మనిష్ఠాపరైః=ఎల్లప్పుడును ఆత్మనిష్ఠయందు ఆసక్తి కల

వారును, ఇందులకు హేతువు- ఆత్మని సదానన్దేచ్ఛుభిః=ఆత్మయందు ఎల్లప్పుడును ఆనందమును అభిలషించు, తత్త్వజ్ఞైః=తత్త్వవేత్తలచే, యత్నతః=ప్రయత్నపూర్వకముగ, కరణీయం = దృశ్యాగ్రహణము చేయదగినది.

అవ. నిత్యాత్మనిష్ఠవలన సర్వాత్మత్వము సిద్ధించును అను విష యమున శ్రుతి ప్రమాణమని చెప్పుచున్నాడు -

సార్వాత్మ్యసిద్ధయే భిక్షోః కృతశ్రవణకర్మణః,
సమాధిం విదధాత్యేషా శాన్తో దాన్త ఇతి శ్రుతిః. 342

కృతశ్రవణకర్మణః=బ్రహ్మనిష్ఠుడగు గురువుద్వారా, వేదాన్త వాక్యములను, తదర్థములను వినియున్న, భిక్షోః = సంన్యాసికి, సార్వాత్మ్య సిద్ధయే=సర్వాత్మత్వము సిద్ధించుటకు, ఏషా=ఈ, శాన్తోదాన్త ఇతిశ్రుతిః= "తస్మా దేవంవిచ్ఛాన్తో దాన్త ఉపరత స్తితిక్షుః సమాహితః శ్రద్ధావిత్తో భూత్వాత్మన్యేవాత్మానం పశ్యేత్" అనెడు శ్రుతి, సమాధిం విదధాతి= 'సమాహితః' అనుశబ్దముచే-అన్తఃకరణము బైటకుపోకుండ నిరోధించి బాహ్యవృత్తులను అవలంబింపక ఆత్మసాక్షాత్కారముకొరకై నిరంతరము సమాధిచేయవలెను అని బోధించుచున్నది.

అవ. అందులకు యుక్తిని చెప్పుచున్నాడు-

ఆరూఢశక్తే రహమో వినాశః
కర్తుం న శక్యః సహసాపి పణ్డితైః,
యే నిర్వికల్పాఖ్యసమాధినిశ్చలా
స్తానన్తరానన్తభవా హి వాసనాః. 343

యే = ఎవరు, నిర్వికల్పాఖ్యసమాధినిశ్చలాః=నిర్వికల్పకసమాధి యందు నిశ్చలముగ నుండువారో, తాన్ అన్తరా=వారుతప్ప, పండితైః అపి = పండితులచేత గూడ, ఆరూఢశక్తేః = అత్యధికమైన శక్తిగల, అహమః=అహంకారముయొక్క, వినాశః=వినాశము, సహసా=శీఘ్ర

ముగ, కర్తుం=చేయుటకు, న శక్యః=శక్యమైనదికాదు. వాసనాః=అనాత్మ వాసనలు, అనన్తభవాః హి=అనంతమైన పుట్టుకలు కలవి కదా?

సవికల్పకము, నిర్వికల్పకము అని సమాధి రెండు విధములు.

"జ్ఞాత్రాద్యవిలయేనైవ జ్ఞేయే బ్రహ్మణి కేవలే,
తదాకారాకారితయా చిత్తవృత్తే రవస్థితిః,
సద్భిః స ఏవ విజ్ఞేయః సమాధిః సవికల్పకః."

జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము అను మూడును (త్రిపుటి) విలీనము కాకుండగనే కేవలమగు బ్రహ్మయందు చిత్తవృత్తి నిలచి, బ్రహ్మాకారాకారితమైయుండుట సవికల్పకసమాధి యనిపేరు.

"మృద ఏవావభానేఽపి మృణ్మయద్విపభానవత్
సన్మాత్రవస్తుభానేఽపి త్రిపుటీ భాతి సన్మయీ,
సమాధి రత ఏవేయం సవికల్ప ఇతీర్యతే."

మృత్తుమాత్రమే భాసించుచున్నను, మృణ్మయమగు ఏనుగు వేరుగ (ద్విపముగ) భాసించుచున్నట్లు, సన్మాత్రమగు బ్రహ్మ భాసించు సమయమున, సన్మయమగు త్రిపుటి కూడ భాసించుచుండును గాన దానికి సవికల్పకసమాధి యనిపేరు.

"జ్ఞాత్రాదిభావముత్సృజ్య జ్ఞేయమాత్రస్థితి ర్దృఢా,
మనసో నిర్వికల్పః స్యాత్ సమాధిర్యోగసంజ్ఞితః."

మనస్సు జ్ఞాత్రాదిభేదమును వదలి జ్ఞేయమునందు మాత్రమే స్థిరముగ నుండుట నిర్వికల్పసమాధి.

"జలే నిక్షిప్తలవణం జలమాత్రతయా స్థితమ్,
పృథఙ్నాభాతి కిన్త్వమ్బ ఏకమేవావభాసతే,
యథా తథైవ సా వృత్తిః బ్రహ్మమాత్రతయా స్థితా.
పృథఙ్నాభాతి బ్రహ్మైవాద్వితీయ మవభాసతే,
జ్ఞాత్రాదికల్పనాభావాన్మతోఽయం నిర్వికల్పకః."

జలమునందు ఉప్పువేసినచో అది కేవలము జలరూపముననే ఉండును. వేరుగ కనబడదు. నీరుమాత్రమే భాసించును. అట్లే మానసప్రవృత్తి బ్రహ్మరూపముననే ఉండును. వేరుగ భాసింపదు. అద్వితీయమగు బ్రహ్మ మాత్రమే భాసించును. ఈ విధముగ జ్ఞాత్రాదిభేదము లేక పోవుటచే దీనికి నిర్వికల్ప మనిపేరు. "వృత్తేః సద్భావబాధాభ్యా ముభయోర్భేద ఇష్యతే"-మానసవృత్తి ఉండుట లేకపోవుట అనునదే సవికల్ప-నిర్వికల్ప సమాధులకు భేదము. ఇది దృష్టాంతప్రదర్శన పూర్వకమగు సవికల్పనిర్వికల్పసమాధుల లక్షణము. నిర్వికల్పసమాధి యందు లేదా నిర్వికల్పసమాధిచేత నిశ్చలమైన వారిచే తప్ప, ఆరూఢశక్తేః=వృద్ధిపొందిన నానావిధభ్రమజనకమగు శక్తిగల, అహంకారముయొక్క వినాశము, పణ్డితైరపి=వేదాన్తశ్రవణము చేసిన పండితులచేత గూడ, శీఘ్రముగ చేయ శక్యము కాదు. హి=ఏల యన, వాసనాః=అనాత్మసంస్కారములు, అనన్తభవాః=అసంఖ్యాకములైన సంసారములు గలవి లేదా అనంతములగు పదార్థములచే ఉత్పన్నములైనవి. కావున సకలవిధములగు వాసనలును క్షీణింప వలెనన్నచో నిర్వికల్పసమాధి యొక్కటియే శరణము.

అవ. సమూలముగ నశించని విక్షేపశక్తి ఏ విధముగ బంధక మగునో చెప్పుచున్నాడు-

అహంబుద్ధ్యైవ మోహిన్యా యోజయిత్వా వృతేర్బలాత్,
విక్షేపశక్తిః పురుషం విక్షేపయతి తద్గుణైః. 344

అనాత్మయందు ఆత్మబుద్ధి ఎప్పుడు చేయునో అప్పుడు స్వరూపము "యథాపకృష్టం శైవాలమ్" అని పూర్వము చెప్పిన విధమున కప్పబడి పోవును. కావున, మోహిన్యా=స్వరూపమునుండి తొలగించు, అహంబుద్ధ్యైవ=అహంకారముతోడనే, యోజయిత్వా=సంబంధమును ఏర్పరచి, అవృతేర్బలాత్=దానివలన కలుగు స్వరూపాపరణముయొక్క, బలాత్=బలమువలన, పురుషం=పండితుడైన పురుషునికూడ, విక్షేపశక్తిః=భ్రమ

పరంపరను కలిగించునదియు, సంకల్పకామాదివృత్తులను జనింపజేయు నదియు అగు విక్షేపశక్తి, తద్గుణైః=తనవలన కలుగు సంకల్పాదులచే, విక్షేపయతి=ఎక్కువ బైటకు తీసికొనివచ్చి ఆత్మకు దూరముచేయును.

విక్షేపశక్తివిజయో విషమో విధాతుం
నిశ్శేష మావరణశక్తినివృత్త్యభావే,
దృగ్దృశ్యయోః స్ఫుటపయోజలవద్విభాగే
నశ్యేత్తదావరణ మాత్మని చ స్వభావాత్,
నిస్సంశయేన భవతి ప్రతిబన్ధశూన్యో
విక్షేపణం న హి తదా యది చేన్మృషార్థే. 345

నిఃశేషం = పూర్తిగా, ఆవరణశక్తినివృత్త్యభావే=ఆవరణశక్తి నివర్తింపకపోయినచో, విక్షేపశక్తివిజయః=విక్షేపశక్తియొక్క జయము, విధాతుం=చేయుటకు, విషమః=కష్టమైనది, అనగా అసాధ్యము, స్ఫుట పయోజలవత్=స్పష్టమగు క్షీరనీరములకువలె. దృగ్దృశ్యయోః=ఆత్మానాత్మలకు, విభాగే=పరమహంసలచే మనస్సుఅనెడు ముక్కుతో విభాగము చేయబడగా, ఆత్మని=ఆత్మయందు, తదా=అపుడు, స్వభావాత్=అప్రయత్నముగనే, ఆవరణం=ఆవరణము, నశ్యేత=నశించును. ఆ విధముగ వివేకము కలిగినపిమ్మట ఆవరణభంగము కొరకై చేయవలసినది మరి ఏమియు ఉండదు. తదా=అపుడు, మృషార్థే=మిథ్యాభూతమగు అనాత్మయందు, మనసః=మనస్సుయొక్క, విక్షేపణం న చేద్యది=ప్రవృత్తి లేకున్నచో, అపుడు, విక్షేపశక్తివిజయము, నిస్సంశయేన=అసంశయముగ, ప్రతిబన్ధశూన్యః=ప్రతిబంధరహితమై, భవతి=అగును.

అవ. ఇట్టి వివేకము కలుగుటకు హేతువగు స్ఫుటజ్ఞానమును చెప్పుచున్నాడు—

సమ్యగ్వివేకః స్ఫుటబోధజన్యో
విభజ్య దృగ్దృశ్యపదార్థతత్త్వమ్,
ఛినత్తి మాయాకృతమోహబన్ధం
యస్మాద్విముక్తస్య పునర్నసంసృతిః. 346

స్ఫుటబోధజన్యః=అసందిగ్ధమును అవిపర్యస్తమును అగు, శ్రుతులవలనను ఆచార్యప్రసాదమువలనను కలిగిన మహావాక్యార్థానుభవము వలన జనించిన అనగా అట్టి అనుభవము కలిగిన వెంటనే కలిగిన, సమ్యగ్వివేకః="బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" ఇత్యాదిరూపమగు వివేకము, దృగ్దృశ్యపదార్థతత్త్వం=ఆత్మానాత్మయథార్థ స్వరూపమును, విభజ్య= క్షీరనీరములనువలె వేరుచేసి, మాయాకృతమోహబన్ధం=మాయాజనితమగు స్వరూపతిరోధానముచే కల్గిన, అనాత్మయందు ఆత్మయనెడు బుద్ధిని, ఛినత్తి=సమూలముగ నశింపజేయును. ఇందులకు ప్రమాణమును చెప్పుచున్నాడు– యస్మాత్=ఏలయన, విముక్తస్య=మోక్షముపొందినవానికి పునః=మరల, సంసృతిః=సంసారము, న=లేదో, 'న స పునరావర్తతే' అని శ్రుతివాక్యము, పాలనుండి తీసిన నెయ్యి మరల పాలుగ మారదు. అట్లే స్వప్రకాశానందాకారమైన మనస్సు మరల అనాత్మలయందు లగ్నముకాదని భావము.

అవ. చతుర్థపాదముయొక్క అర్థమును ఉపపాదించుచున్నాడు–

పరావరైకత్వవివేకవహ్నిః
దహత్యవిద్యాగహనం హ్యశేషమ్,
కిం స్యాత్ పునః సంసరణస్య బీజ
మద్వైతభావం సముపేయుషోఽస్య. 347

హి=ఏలయన, పరావరైకత్వవివేకవహ్నిః=పరుడైన ఈశ్వరునియొక్కయు, అవరుడైన జీవునియొక్కయు ఏకత్వమునుగూర్చిన విచారమువలన కలిగిన జ్ఞాన మనెడు అగ్ని, అశేషం=సమస్తమైన, అనగా సకల కార్యసహితమైన, అవిద్యాగహనం=అవిద్యయనెడు అరణ్యమును, దహతి=భస్మముచేయును.

విభేదజనకేఽజ్ఞానే నాశమాత్యన్తికం గతే,
ఆత్మని బ్రహ్మణో భేద మసన్తం కః కరిష్యతి.

భేదబుద్ధినికలిగించు అజ్ఞానము పూర్తిగ నశించిన దగుచుండగా, జీవాత్మకును బ్రహ్మకును మధ్య ఏ మాత్రముకూడ లేని భేదమును ఏది కల్పింపగలదు? అను ప్రమాణము ననుసరించి, అద్వైతభావం = భేదరహితమగు బ్రహ్మభావమును, సముపేయుషః = పొందిన, అనగా నిరంతర బ్రహ్మసాక్షాత్కారవంతుడైన, అస్య = ఈ మహాత్మునకు, పునః = మరల, సంసరణస్య = దేహాదులయందు ఆత్మభ్రమ కలుగుటకు, బీజం కిం స్యాత్ = బీజము ఏది యుండును?

అవ. సమ్యగ్వస్తుజ్ఞానము సంసారము నే విధముగ నశింపజేయునో చెప్పుచున్నాడు—

ఆవరణస్య నివృత్తి ర్భవతి చ సమ్యక్పదార్థదర్శనతః,
మిథ్యాజ్ఞాన వినాశః తద్వద్విక్షేపజనితదుఃఖనివృత్తిః. 348

సమ్యక్పదార్థదర్శనతః = యథార్థవస్తుసాక్షాత్కారమువలన, ఆవరణస్య = ఆవరణముయొక్క, నివృత్తిః = నివృత్తియు, మిథ్యాజ్ఞాన వినాశః = మిథ్యాజ్ఞానముయొక్క నాశము, తద్వత్ = అటులనే, విక్షేప జనితదుఃఖనివృత్తిః = విక్షేపమువలనకలిగిన దుఃఖముయొక్క నివృత్తియు, భవతి = కలుగును.

"ఏతాభ్యామేవ శక్తిభ్యాం బన్ధః పుంసః సమాగతః" (146) అని వెనుకచెప్పినవిధమున, ఆవరణవిక్షేపములు నశించిన పిమ్మట సంసారబంధమెట్లు కలుగును అని అభిప్రాయము.

అవ. సమ్యక్పదార్థదర్శనమువలన ఆవరణ నివృత్తి కలుగును; మిథ్యాజ్ఞానము, అనగా అయథార్థజ్ఞానము నశించును, అయథార్థ జ్ఞానరూపమగు విక్షేపముచే జనించిన దుఃఖముకూడ నివర్తించును అను ఈ విషయమునే దృష్టాంతముద్వారా నిరూపించుచున్నాడు—

## అధిష్ఠాన నిరూపణము

ఏతత్త్రితయం దృష్టం సమ్యగ్రజ్జుస్వరూపవిజ్ఞానాత్,
తస్మాద్వస్తుసతత్త్వం జ్ఞాతవ్యం బన్ధముక్తయే విదుషా. 349

సమ్యగ్ = బాగుగా, రజ్జుస్వరూపవిజ్ఞానాత్ = రజ్జుస్వరూపమును తెలిసికొనుటవలన, ఏతత్ త్రితయం = రజ్జ్వావరణనివృత్తి, సర్పభ్రాంతి నాశము, రజ్జుసర్పవిక్షేపమువలనకలిగిన భయకంపాదులవలన జనించిన దుఃఖము నివర్తించుట అనెడు త్రయము, దృష్టం = చూడబడినది, తస్మాత్ = ఆ కారణమువలన, విదుషా = ఈ విషయమునెరిగిన పురుషునిచే, బన్ధముక్తయే = బంధహేతువులగు ఆవరణవిక్షేపముల నాశముకొరకు, వస్తుసతత్త్వం = వస్తువుయొక్క యథార్థస్వరూపము, జ్ఞాతవ్యం = తెలియదగినది.

అవ. ఆత్మభిన్నమైన సర్వము మిథ్య యని సోపపత్తికముగ చెప్పుచున్నాడు—

అయోఽగ్నియోగాదివ సత్యమన్వయా
న్మాత్రాదిరూపేణ విజృమ్భతే ధీః,
తత్కార్యమేతత్త్రితయం యతో మృషా
దృష్టం భ్రమస్వప్నమనోరథేషు. 350

అగ్నియోగాత్ = అగ్నిసంబంధమువలన, అయః ఇవ = ఇనుము కాల్చునదిగ కనబడునట్లు, సత్యమన్వయాత్ = సత్ ఐన ఆత్మయొక్క ప్రతిబింబించుట యనెడు సంబంధమువలన, ధీః = బుద్ధి, మాత్రాది రూపేణ = ప్రమాత (తెలిసికొనువాడు), ప్రమితి, ప్రమేయము అను త్రిపుటీరూపముతో, విజృమ్భతే = అనేకాకారము కలదగుచున్నది. ప్రమాతయైన జీవుడుకూడ ధీవిశిష్టవేషముచే కల్పితుడే.

"అన్వేష్టవ్యాత్మవిజ్ఞానాత్ ప్రాక్ ప్రమాతృత్వమాత్మనః,
అన్విష్టః స్యాత్ ప్రమాతైవ పాప్మదోషాదివర్జితః."

అన్వేషింపదగిన ఆత్మయొక్క విజ్ఞానము కలుగనంతవరకునే ఆత్మకు ప్రమాతృత్వమనునది ఉండును. ప్రమాతయే చివరకు పాపదోషాది శూన్యుడును అన్వేషింపదగినవాడును అగు ఆత్మగా అగును అని చెప్పిన విధమున ప్రమాతృత్వముకూడ కల్పితమే. యతః = ఏలయన, భ్రమ స్వప్నమనోరథేషు = భ్రమ, స్వప్నము, మనోరథము-వీటియందు, తత్కార్యం = సత్సంబంధముతోగూడిన బుద్ధియొక్క కార్యమైన, ఏత త్త్రితయం = మాతృ-మాన-మేయరూపమగు త్రయము, మృషా = అసత్యమైనదిగా, దృష్టం = చూడబడినది.

తతో వికారాః ప్రకృతే రహంముఖాః
దేహావసానా విషయాశ్చ సర్వే,
క్షణేఽన్యథాభావిన ఏష ఆత్మా
నోదేతి నాప్యేతి కదాపి నాన్యథా. 351

తతః = ధీకార్యములు మిథ్యాభూతములుగాన, అహంముఖాః = అహంకారము మొదలు, దేహావసానాః = దేహమువరకును ఉన్న, ప్రకృతేః = ప్రకృతియొక్క, వికారాః = వికారములు, సర్వే = సమస్తమైన, విషయాశ్చ = శబ్దాదివిషయములు, ఘటాదులును, క్షణే = క్షణకాలములో అనథ్యాభావినః = మరియొక విధముగ అగును. అవి సత్తులుగ భాసించుచున్నను విమర్శచేయగా అసత్తులై, దృష్టనష్టస్వరూపములగుటచే (కనబడి వెంటనే నశించిన స్వరూపము కలవగుటచే సత్యమైనవి కావు. ఏషః ఆత్మా = ఈ ఆత్మ యైతే, కదాపి = ఎన్నడును, నోదేతి = పుట్టదు, నాప్యేతి = నశించదు, అన్యథా న భవతి = మరియొకవిధముగ కూడ కాదు. బుద్ధికివలె ఆత్మకు పరిణామముకూడ లేదు, అది ఎల్లపుడును ఒకే విధమగు స్వరూపముతో ఎల్లప్పుడును ఉండును గాన అది సత్యము అని భావము.

నిత్యాద్వయాఖణ్డచిదేకరూపో
బుద్ధ్యాదిసాక్షీ సదసద్విలక్షణః,
అహంపదప్రత్యయలక్షితార్థః
ప్రత్యక్సదానన్దఘనః పరాత్మా. 352

(ఈ ఆత్మ) నిత్యాద్వయాఖణ్డచిదేకరూపః = నిత్యము, ద్వితీయ రహితము, అఖండము అగు చిత్తుమాత్రమే ఏకైకస్వరూపము గలదియు, బుద్ధ్యాదిసాక్షీ = బుద్ధ్యాదులకు సాక్షియైనదియు, సదసద్విలక్షణః = సత్తు కంటెను అసత్తుకంటెను విలక్షణమైనదియు, అహంపదప్రత్యయ లక్షితార్థః = 'అహం' అను పదముచే కలిగిన జ్ఞానమువలన లక్షణావృత్తి చేత బోధింపబడునదియు, ప్రత్యక్సదానన్దఘనః = ప్రత్యగ్రూపమైనదియు, ఎల్లప్పుడును ఆనందఘనమును అగు, పరాత్మా = పరమాత్మ.

నిత్యా....రూపః-నిత్యా=ఆద్యన్తశూన్యమైనదియు, అద్వయా= తనకంటె భిన్నమైన వస్తువుతో శూన్యమైనదియు కాన, అఖణ్డా= త్రివిధపరిచ్ఛేదరహితమును అగు ఏ చిత్తుగలదో అదియే ఒకరూపము గలది. అందు ప్రమాణము - బుద్ధ్యాదులకు సాక్షియైనది. "వికారిణాం సర్వవికారవేత్తా నిత్యోఽవికారో భవితుం సమర్హతి"(శ్లో. 293) అని వెనుక చెప్పబడియున్నది కావున సదసద్విలక్షణము, 'అనాదిమత్పరం బ్రహ్మ న సన్నాసదుచ్యతే' అను గీతావచనానుసారముగా అవిద్యకంటెను, అవిద్యాకార్యములకంటెను భిన్నమైనది అని యర్థము. అహంప్రత్యయలక్షితార్థః = లక్షణావృత్తిచే అహం' అను పదమువలన కలిగిన జ్ఞానమునకు విషయభూతుడు అని యర్థము. ప్రత్యక్సదానన్దఘనః = "ప్రాతిలోమ్యేన అఞ్చతీతి ప్రత్యఙ్" - అసత్తులు, జడములు, దుఃఖాత్మకము అగు-అహంకారాదులకంటె విలక్షణముగ సచ్చిదానందరూపముతో ప్రకాశించునది, సదానన్దఘనః = కాలత్రయాబాధ్యమైన ఆనన్దస్వరూపమైనది అగు, పరమాత్మ. ఈ విధముగ ఆత్మ యథార్థస్వరూపము చెప్పబడినది.

ఇత్థం విపశ్చిత్ సదసద్విభాజ్య
నిశ్చిత్య తత్త్వం నిజబోధదృష్ట్యా,
జ్ఞాత్వా స్వమాత్మాన మఖణ్డబోధం
తేభ్యో విముక్తః స్వయమేవ శామ్యతి. 353

ఇత్థం = ఈ విధముగా, విపశ్చిత్ = శ్రుతిని ప్రమాణముగ గ్రహించిన పరమార్థజ్ఞానవంతుడైన ముముక్షువు, సత్ = సత్తైన బ్రహ్మను, అసత్ = అసత్తైన అవిద్యాతత్కార్యమును, విభజ్య = సత్యమనియు, మిథ్యాభూతమనియు వేరువేరుగ విభజించి, నిజబోధదృష్ట్యా = విచారము వలన కలిగిన స్వానుభవమనెడి నేత్రముతో, తత్త్వం వినిశ్చిత్య = వస్తుయాథాత్మ్యమును నిశ్చయముగ తెలిసికొని, స్వం = తనను, అఖండబోధం = అఖండబోధస్వరూపమగు, ఆత్మానం = ఆత్మనుగా, జ్ఞాత్వా = తెలిసికొని, తేభ్యః = అవిద్య మొదలు దేహమువరకునుగల అనాత్మల నుండియు శబ్దాదివిషయములనుండియు పూర్తిగ ముక్తుడై, వాసనలుకూడ లేకుండుటయే పూర్తిగ ముక్తుడగుట అనుదానికి అర్థము, స్వయమేవ = స్వయముగనే శామ్యతి=శాంతించును, అనగా అనావృతము, స్వచ్ఛము నగు ప్రకాశరూపముతో ఉండును.

అవ. ఈ విధముగ ఎప్పు డగునో తెలిసికొనుటకై చెప్పుచున్నాడు—

## సమాధినిరూపణము

అజ్ఞానహృదయగ్రన్థే ర్నిశ్శేషవిలయస్తదా,
సమాధినావికల్పేన యదా ద్వైతాత్మదర్శనమ్. 354

అవికల్పేన సమాధినా = పూర్వోక్తలక్షణమగు నిర్వికల్పసమాధిచే, యదా = ఎప్పుడు, అద్వైతాత్మదర్శనం = భేదరహితాత్మసాక్షాత్కారము కలుగునో, తదా = అప్పుడు, అజ్ఞానహృదయగ్రన్థేః = అజ్ఞానకృతమగు హృదయగ్రంథియొక్క, అనగా చిజ్జడతాదాత్మ్యముయొక్క, విలయః = వాసనాసహితముగ పూర్తిగ నాశము.

త్వమహ మిదమితీయం కల్పనా బుద్ధిదోషాత్
ప్రభవతి పరమాత్మన్యద్వయే నిర్విశేషే,
ప్రవిలసతి సమాధావస్య సర్వో వికల్పః
విలయన ముపగచ్ఛేద్వస్తు తత్త్వావధృత్యా. 355

బుద్ధిదోషాత్ = రజస్తమోరూపమైన బుద్ధిదోషమువలన, త్వం = నీవు, అహం = నేను, ఇదం = ఇది, ఇతి = అని, ఇయం = ఈ, కల్పనా = కల్పన, అద్వయే = భేదరహితమును, కావుననే, నిర్విశేషే = విశేష శూన్యమైన, పరమాత్మని = పరమాత్మ యందు, ప్రభవతి = ఏర్పడు చున్నది, అస్య = ఈ విద్వాంసునకు, సమాధౌ = సమాధి, ప్రవిలసతి = ప్రకాశింపగా, అనగా సమాధిస్థితి ఏర్పడగా, వస్తుతత్త్వావధృత్యా = వస్తు యాథాత్మ్యముయొక్క నిర్ధారణముచే, సర్వః = సమస్తమైన, వికల్పః = వికల్పము, విలయనం = అత్యన్తనివృత్తిని, ఉపగచ్ఛేత్ = పొందును.

అవ. సామగ్రితో కూడిన సమాధిని, దాని ఫలమును, ఒక శ్లోకముచే విశదీకరించుచున్నాడు-

శాన్తోదాన్తః పరముపరతః క్షాన్తియుక్తస్సమాధిం
కుర్వన్నిత్యం కలయతి యతిః స్వస్య సర్వాత్మభావమ్,
తేనావిద్యాతిమిరజనితాన్ సాధు దగ్ధ్వా వికల్పాన్
బ్రహ్మాకృత్యా నివసతి సుఖం నిష్క్రియో నిర్వికల్పః. 356

శాన్తః = నిగ్రహింపబడిన మనస్సుకలవాడై, దాన్తః = నిరోధింప బడిన బాహ్యేంద్రియములుకలవాడై, పరం = అత్యంతము, ఉపరతః = బాహ్యవృత్తిని, అవలంబింపనివాడై, క్షాన్తియుక్తః = శీతాతపాదిద్వంద్వ ములను సహించువాడై, సమాధిం = నిర్విశేషమగు బ్రహ్మయందు చిత్తము యొక్క స్థాపనమును, నిత్యం = ఎల్లప్పుడును, కుర్వన్ = చేయుచున్న, యతిః = యతి, స్వస్య = తనయొక్క, సర్వాత్మభావం = కేవలస్వరూపత్వ మును, కలయతి = అనుభవించును. తేన = ఆ నిర్వికల్పసమాధిచే, అవిద్యా తిమిరజనితాన్ = అవిద్యాంధకారముచే పుట్టింపబడిన, వికల్పాన్ = వివిధము లైన కల్పనలను, సాధు = బాగుగా, దగ్ధ్వా = భస్మముచేసి, అనగా పూర్తిగ నశింపజేసి, నిష్క్రియః = క్రియాశూన్యుడై, నిర్వికల్పః = వికల్ప రహితుడై, బ్రహ్మకృత్యా = బ్రహ్మాకారముతో, సుఖం = సుఖముగా, నివసతి = నివసించును. దానిచే- "క్రియానాశే" ఇత్యాది శ్లోకమున (318) చెప్పినవిషయమును వివరించినట్లైనది. అందుకారణకే, (జీవన్ముక్తుని

స్వరూపమును విశదీకరించుటకే) 'నిష్క్రియః', 'నిర్వికల్పః' అను విశేషణద్వయము ప్రయోగింపబడినది.

అవ. ఈ విధముగా ముక్తి సిద్ధించుటకై సమాధి లభింపవలె నన్నచో అంతఃప్రపంచ బహిఃప్రపంచముల ప్రవిలాపనమే హేతువు; కేవల బాహ్యశబ్దములచే ముక్తి లభింపదని చెప్పుచున్నాడు -

సమాహితా యే ప్రవిలాప్య బాహ్యం
శ్రోత్రాదిచేతః స్వమహం చిదాత్మని,
త ఏవ ముక్తా భవపాశబన్ధై
ర్నాన్యే తు పారోక్ష్యకథాభిధాయినః. 357

యే = ఏ పురుషులు, బాహ్యం = బాహ్యమైన, శ్రోత్రాది = శ్రోత్రాదికమును, శ్రోత్రాదుల విషయము చెప్పుటచే చిదాత్మయందు వియదాదుల ప్రవిలాపనమును గూడ చెప్పినట్లే యైనది. "నేను వినుచున్నాను" ఇత్యాది విధమున శ్రోత్రాదులయందు ఆత్మత్వబుద్ధి (తాదాత్మ్యాధ్యాసము) చేయుచుందురుగాన 'శ్రోత్రాది' అని చెప్పబడినది. చేతః = ఆన్తరమైన చిత్తమును, స్వం=స్వకీయమైన, అహం=అహంకారమును, చిదాత్మని=చిదాత్మయందు, ప్రవిలాప్య=ప్రవిలాపనముచేసి; చిదాత్మకంటె, భిన్నముగ అంతరమైనదిగాని బాహ్యమైనదికాని ఏదియు లేదు అని దృఢముగ నిశ్చయించి, సమాహితాః = చిదాత్మయందు స్థాపితమైన మనస్సుకలవారో, తే ఏవ-వారే, భవపాశబన్ధైః-పాశములవలె బంధకములగు సాంసారికభ్రమలచే, ముక్తాః = విడువబడినవారు, పారోక్ష్యకథాభిధాయినః = విలాపనము చేయక పరోక్షములగు శబ్దములను మాత్రమే పలుకు, అన్యే తు=ఇతరులైతే, న తు = ముక్తులు కానే కారు.

అవ. ఈ విధముగ, సర్వోపాదానము, సర్వకల్పనలకు అధిష్ఠానము అగు బ్రహ్మకంటె భిన్నముగ ఏమియును లేదు అని ప్రపంచశూన్యత్వవాసన దృఢమైనచో మనస్సుకూడ నశించుటచే కైవల్యము నిర్విఘ్నముగ లభించును కావున నిరంతరము నిర్వికల్పసమాధి చేయవలెను అని చెప్పుచున్నాడు -

ఉపాధియోగాత్స్వయమేవ భిద్యతే
చోపాధ్యపోహే స్వయమేవ కేవలః,
తస్మాదుపాధేః విలయాయ విద్వాన్
వసేత్సదాకల్పసమాధినిష్ఠయా. 358

స్వయం='ఏకమేవాద్వితీయమ్', 'నేహ నానాస్తి కించన', 'నాత్ర కాచనభిదాస్తి' అను శ్రుతులచే వర్ణింపబడుచున్న స్వరూపముగల పరమాత్మ, ఉపాధియోగాదేవ=ఉపాధిసంబంధమువలననే, భిద్యతే=భేదమును పొందుచున్నాడు, ఉపాధ్యపోహే=ఉపాధులను నిరాకరింపగనే, స్వయం=తాను, (ఆత్మ) కేవల ఏవ=కేవలుడే, తస్మాత్=ఆ కారణమువలన, విద్వాన్=విద్వాంసుడు, ఉపాధేః=భేదహేతువగు అహంకారము యొక్క, విలయాయ=పూర్తిగ నాశముకొరకు, సదా=ఎల్లప్పుడును, అకల్పసమాధినిష్ఠయా=నిర్వికల్పకమగు సమాధియందు పూర్తిగ స్థితిచే, వసేత్=నివసింపవలెను.

అవ. ఈ విధముగ సమాధినిష్ఠుడగు జీవుడు బ్రహ్మాకారుడగుటకు దృష్టాంతము చెప్పుచున్నాడు—

సతి సక్తో నరో యాతి సద్భావం హ్యేకనిష్ఠయా,
కీటకో భ్రమరం ధ్యాయన్ భ్రమరత్వాయ కల్పతే. 359

ఏకనిష్ఠయా=తదేకదృష్టితో, సతి=బ్రహ్మయందు, సక్తః=సమాహితమైన బుద్ధిగల, నరః=మనుష్యుడు, సద్భావం=బ్రహ్మత్వమును, యాతి హి=తప్పక పొందును, అందుకుదృష్టాన్తము, కీటకః=చిన్నపురుగు, ఏకనిష్ఠయా=ఏకాగ్రదృష్టితో, భ్రమరం=తుమ్మెదను, ధ్యాయన్=ధ్యానముచేయుచు, భ్రమరత్వాయ=భ్రమరముగ అగుటకు, కల్పతే=సమర్థమగుచున్నది. భ్రమరభిన్నమైనను కీటకము భ్రమరమగుచుండగా, బ్రహ్మగనే ఉన్నను అజ్ఞానముచే అబ్రహ్మత్వమును ఆరోపించుకొనిన జీవుడు బ్రహ్మధ్యానమువలన బ్రహ్మయగునని వేరుగ చెప్పవలెనా ?

అవ. చెప్పబడిన విషయమును దృష్టాంతమునందు విశదీకరించుచు దార్ష్టాంతికమునందు సమన్వయించుచున్నాడు-

క్రియాన్తరాసక్తి మపాస్య కీటకో
ధ్యాయన్యథాలిం హ్యలిభావమృచ్ఛతి,
తథైవ యోగీ పరమాత్మతత్త్వం
ధ్యాత్వా సమాయాతి తదేకనిష్ఠయా. 360

కీటకః = పురుగు, క్రియాన్తరాసక్తిం = ఇతరక్రియలయందు ఆసక్తిని, అపాస్య = విడచి, యథా = ఏ విధముగా, అలిం = తుమ్మెదను, ధ్యాత్వా = ధ్యానముచేసి, అనగా తనను హింసించుననెడు భయముచే దానిని గూర్చి ఆలోచించి, తానుకూడ, అలిభావం = తుమ్మెదరూపమును, ఋచ్ఛతి = పొందునో, ఈ కీటకవిషయమున మొదటినుండియు భేదమే, తరువాతకూడ భేదమే యుండును. ఈ కీటకము మరియొక తుమ్మెదగా అవుచున్నది గాని దేనినైతే ధ్యానించుచున్నదో ఆ తుమ్మెదగా అగుటలేదు కదా? ఈ విధముగ తుమ్మెదయగుటకూడ తుమ్మెదను ధ్యానించుటచే ఏర్పడుచున్నది గాని, తానే తుమ్మెదనని అభేదమును ధ్యానించుటచే కాదు. కాని ఇచట (జీవవిషయమున) భేదము అజ్ఞానకల్పితముగాన, అభేదధ్యానముచే కలిగిన సాక్షాత్కారముచే అజ్ఞానము నశింపగా భేదప్రసక్తియే లేదు. తథైవ = ఆ కీటకమువలెనే, ఏకనిష్ఠయా = అనన్యాసక్తిచే, పరమాత్మతత్త్వం = పరమాత్మతత్త్వమును, ధ్యాత్వా = ధ్యానించి, యాథాత్మ్యమునే, సమాయాతి = పొందును, అజ్ఞానకృతమగు భేదము తొలగిపోయి, అభివ్యక్తమైన తనయథార్థస్వరూపము కలవాడగును అని భావము. ఈ యర్థమును సూచించుటకై 'సమాయాతి' అనునపుడు 'సమ్' అను ఉపసర్గ ప్రయోగింపబడినది. ధ్యానముచేయగా చేయగా, ఒకటి మరియొకటిగా అగుటకు అవకాశమున్నపుడు స్వధ్యానముచే స్వస్వరూపప్రాప్తి విషయమున ఇక అడ్డమేమి ఉండును అను నంశమును మాత్రము బోధించుటకే అక్కడక్కడ భ్రమరకీటోదాహరణము ఈయబడుచుండును అని గ్రహింపవలెను.

అతీవసూక్ష్మం పరమాత్మతత్త్వం
న స్థూలదృష్ట్యా ప్రతిపత్తు మర్హతి,
సమాధినాత్యన్త సుసూక్ష్మవృత్త్యా
జ్ఞాతవ్య మార్యైరతిశుద్ధబుద్ధిభిః. 361

అతీవసూక్ష్మం = నిర్గుణమగుటచే మిక్కిలి సూక్ష్మమైనదియు, పరం = పంచకోశవిలక్షణమైనదియునగు, ఆత్మతత్త్వం = త్రివిధములగు పరిచ్ఛేదము లేనిదియు, స్వప్రకాశమగు సదానందరూపమును అగు ఆత్మ యథార్థస్వరూపమును స్థూలదృష్ట్యా = శరీరాదులగు స్థూలవస్తువులకు సంబంధించిన అంతఃకరణవృత్తిచే, ప్రతిపత్తుం = పొందుటకు, నార్హతి = సమర్థుడుకాడు. అతిశుద్ధబుద్ధిభిః = "జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః"-పాపకర్మ క్షీణించుటవలన పురుషులకు జ్ఞానము కలుగును, "కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే"-కర్మలచే పాపము పక్వము కాగా అనగా క్షీణింపగా, అటుపిమ్మట జ్ఞానము కలుగును. 'దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః"-జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వః తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః" ఇత్యాది వచనానుసారముగ నిర్మలమైన అంతఃకరణము గల, ఆర్యైః = శ్రుతిస్మృత్యుక్తమార్గమును అనుసరించువారిచే, సమాధినా = మిక్కిలిసూక్ష్మమైనదియు, ప్రపంచవిషయకము కానిదియు, అఖండాకారమును అగు వృత్తిచే, జ్ఞాతవ్యం = తెలియదగినది.

అవ. మనస్సు నిర్మలమగుటకు ధ్యానమే కారణ మనెడు విషయమును దృష్టాన్తపూర్వకముగ చెప్పుచున్నాడు-

యథా సువర్ణం పుటపాకశోధితం
త్యక్త్వా మలం స్వాత్మగుణం సమృచ్ఛతి,
తథా మనః సత్త్వరజస్తమోమలం
ధ్యానేన సంత్యజ్య సమేతి తత్త్వమ్. 362

పుటపాకశోధితం = పుటపాకముచే శోధింపబడిన, సువర్ణం = బంగారము, యథా = ఏ విధముగా, మలం = మలమును, త్యక్త్వా = విడచి, స్వాత్మగుణం = తన సహజగుణమును పొందునో, తథా = అట్లే, మనః = మనస్సు, ధ్యానేన = ధ్యానముచేత, సత్త్వరజస్తమోమలం = సత్త్వము, రజస్సు, తమస్సు అనెడు మలమును, సంత్యజ్య = విడచి, తత్త్వం = తత్త్వమును, సమేతి = పొందును.

బంగారమును ఒక దొప్పలో ఉంచి, దానిపై ఎఱ్ఱమట్టి మొదలగు వాటిని పూసి, దానిని అగ్నిలో ఉంచి చేసిన పాకమునకు పుటపాక మనిపేరు. బంగారము యొక్క సహజగుణములను కప్పిపుచ్చెడు మలములను తొలగించుటకై ఈ పుటపాకము చేయబడును. దానిచే సువర్ణము, శోధితం=తొలగింపబడిన మలముకలదై ఏ విధముగా మలమును విడచి తన సహజగుణమైన భాస్వరత్వాదికమును, సమృచ్ఛతి = బాగుగా పొందును, అట్లే మనస్సు సత్త్వరజస్తమోగుణము లనెడు మలమును ధ్యానముచే విడచి, తత్త్వమును అనగా బ్రహ్మత్వమును పొందును.

(ఆశంక) "తస్మాత్సత్త్వమవష్టభ్య స్వాఽధ్యాసాపనయం కురు" అని వెనుక చెప్పిన విధమునను, "నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో భవ"-ద్వంద్వరహితుడవై, ఎల్లప్పుడును సత్యమునే అవలంబించినవాడవై ఉండుము అని గీతలో చెప్పిన విధమునను రజస్తమోగుణములతో మిశ్రితముకాని సత్త్వము మలమని చెప్పుటకు వీలుకాదు.

(సమాధానము) అయినను "సత్త్వం శుద్ధేన నశ్యతి"-శుద్ధాత్మస్వరూపముచే సత్త్వము నశించును అని చెప్పబడియుండుటచేతను "సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే"-అతడు మూడు గుణములను అతిక్రమించి అటుపిమ్మట బ్రహ్మత్వమును పొంద సమర్థు డగును, "నిస్త్రైగుణ్యో భవార్జున"-ఓ అర్జునా! గుణత్రయమును అతిక్రమించినవాడవు అగుము అను భగవద్గీతావచనాను

సారముగను నిర్గుణబ్రహ్మను పొందవలసియున్నపుడు మనస్సుకూడ రజస్తమస్సుల వినాశముకొరకై తాను ముందు గ్రహించిన సత్త్వ గుణాలంబనమును కూడ త్యజించును. "నాస్వాదయేద్రసం తత్ర నిస్సంగః ప్రజ్ఞయా భవేత్" అను గౌడపాదోక్తి ననుసరించి సత్త్వ గుణకార్యమగు ఆనందాస్వాదమును గూడ విడువవలెనని చెప్పుట చేతను, "యేన త్యజసి తత్ త్యజ" - ఏ సత్త్వగుణమును ఆలంబ నముగ జేసికొని ప్రపంచమును విడచితివో, దానిని కూడ విడువుము అను వాక్యముచేతను, "భూయశ్చాన్తే విశ్వమాయా నివృత్తిః" అను శ్రుతి, శుద్ధసత్త్వప్రధానమైన మాయ కూడ చివరకు నివర్తించును అని చెప్పుచు ఆ మాయకూడ మిథ్యయని నిరూపించుటచేతను, శుద్ధ సత్త్వము కూడ మలమే అని గ్రహింపవలెను. ఈ విధముగ మలము లైన మూడుగుణములను విడచి బ్రహ్మత్వమును పొందును. 'నేహ నానాస్తి కించన' అను శ్రుతి ననుసరించి బ్రహ్మయందు గుణగుణి భావమును అంగీకరింప నవకాశము లేదు. అందుచే సత్త్వగుణ మున్నంతవరకును, నిర్గుణప్రాప్తి అసంభవము గాన, మూలాజ్ఞాన మును తొలగించిన సాత్త్వికమగు అఖండాకారవృత్తి కూడ లీనమగు టతో అధిష్ఠానము మాత్రమే శేషించును అని భావము.

నిరన్తరాభ్యాసవశాత్తదిత్థం
పక్వంమనోబ్రహ్మణి లీయతే యదా,
తదా సమాధిః సవికల్పవర్జితః
స్వతోఽద్వయానన్దరసానుభావకః. 363

ఇత్థం = ఈ విధముగ, నిరన్తరాభ్యాసవశాత్ = నిరంతరము అభ్యాసముచేయుటవలన, పక్వం = పక్వమైన అనగా విపరీతభావనలు మొదలగు దోషములు లేని, మనః = మనస్సు, యదా = ఎప్పుడు, బ్రహ్మణి = బ్రహ్మయందు, లీయతే = లీన మగునో, అనగా వృత్తిర హితమై బ్రహ్మమాత్రావశేషమై అగునో, తదా = అప్పుడు, స్వతః =

ప్రయత్నమేమియు లేకుండగనే, అద్వయానన్దరసానుభావకః = అద్వితీయమగు బ్రహ్మస్వరూపమైన ఆనందమనెడు రసమును అనుభవింపజేయు 'రసో వై సః' అను శ్రుతి ననుసరించియు, పరమప్రేమాస్పద మగుట వలనను బ్రహ్మయే రసమని చెప్పబడుచున్నది, నవికల్పవర్జితః = 'అది', 'నేను' మొదలగు సకలవిశ్వవాసనల క్షయమునకు హేతువగు, సమాధిః = నిర్వికల్పసమాధి (కలుగును).

అవ. ఆ నిర్వికల్పసమాధియొక్క ఫలమును పూర్తిగ ఉపపాదించుచున్నాడు-

సమాధినానేన సమస్తవాసనా
గ్రన్థేర్వినాశోఽఖిలకర్మనాశః,
అన్తర్బహిః సర్వత ఏవ సర్వదా
స్వరూపవిస్ఫూర్తి రయత్నతః స్యాత్. 364

అనేన = ఈ, సమాధినా = నిర్వికల్పకమనెడు, యోగముచే, సమస్తవాసనాగ్రన్థేః = గ్రంథివలె విడదీయ శక్యముకాకుండ ఉన్నవియు, మిథ్యాజ్ఞానమువలన జనించినవియు అగు సమస్తవాసనలయొక్క, వినాశః = పూర్తిగ నాశము, అఖిలకర్మనాశః=సంచితములైన సమస్తకర్మలయొక్క నాశము (కలుగును). "భిద్యతే హృదయగ్రన్థిః క్షీయన్తే చాస్య కర్మాణి"-హృదయగ్రంథి తెగిపోవును, ఇతనికర్మ లన్నియు క్షీణించును అని శ్రుతులు చెప్పుచున్నవి. అన్తః = లోపలను, బహిః = వెలుపలను, సర్వతః = అంతటను, సర్వదా = ఎల్లప్పుడును, అయత్నతః = ప్రయత్నమేమియు లేకుండగనే, స్వరూపవిస్ఫూర్తిః = స్వరూపము యొక్క ప్రకాశము, స్యాత్ = కలుగును.

శ్రుతేః శతగుణం విద్యాన్మననం మననాదపి,
నిదిధ్యాసం లక్షగుణం అనన్తం నిర్వికల్పకమ్. 365

శ్రుతేః = శ్రవణముకంటె, మననం = మననమును, శతగుణం = నూరురెట్లైన దానినిగను, మననాదపి = మననముకంటె కూడ, నిదిధ్యాసం =

నిదిధ్యాసమును, లక్షగుణం = లక్షరెట్లైన దానినిగాను, (వాటికం తెగూడ) నిర్వికల్పకం = నిర్వికల్పకయోగమును, అనన్తం = అనన్తమైనదానినిగాను, విద్యాత్ = తెలియవలెను.

నిర్వికల్పక సమాధినా స్ఫుటం
బ్రహ్మతత్త్వ మవగమ్యతే ధ్రువమ్,
నాన్యథా చలతయా మనోగతేః
ప్రత్యయాన్తర విమిశ్రితం భవేత్. 366

నిర్వికల్పకసమాధినా = నిర్వికల్పకసమాధిచేత, బ్రహ్మతత్త్వం = బ్రహ్మతత్త్వము, స్ఫుటం = కరతలామలకమువలె స్పష్టముగా, అవగమ్యతే = తెలియబడును, ధ్రువం = నిశ్చయము. అన్యథా = మరియొక ప్రకారముచే, న = తెలియబడదు, మనోగతేః = మనస్సుయొక్క గతి, చలతయా = చంచలమైనదగుటచే, ప్రత్యయాన్తర విమిశ్రితః = ఇతర ప్రత్యయములతో మిశ్రితమైనదై, భవేత్ = అగును.

అతః సమాధత్స్వ యతేన్ద్రియః సన్
నిరన్తరం శాన్తమనాః ప్రతీచి,
విధ్వంసయ ధ్వాన్తమనాద్యవిద్యయా
కృతం సదేకత్వ విలోకనేన. 367

అతః = ఈ కారణమువలన, అనగా బ్రహ్మతత్త్వము స్ఫుటముగ తెలియుటకై, సదా = ఎల్లప్పుడును, యతేన్ద్రియః సన్ = నిగ్రహింపబడిన ఇంద్రియములు కలవాడవై, నిరన్తరం = ఎల్లప్పుడును, ప్రశాన్తమనాః = నిర్వికారమైన మనస్సు కలవాడవై, ప్రతీచి = ప్రత్యగాత్మయందు, సమాధత్స్వ = మనస్సును నిలుపుము, దానివలన కలిగిన, సదేకత్వవిలోకనేన = సకలభేదరహితమగు బ్రహ్మయొక్క సాక్షాత్కారముచేత, అనాద్యవిద్యయా = అనాదియైన సర్వసంసారమూలభూతమైన అవిద్యచే, కృతం = చేయబడిన, ధ్వాన్తం = అంధకారమును, అనగా స్వరూపాప్రకాశమును, విధ్వంసయ = నశింపజేయుము.

అవ. నిర్వికల్పసమాధి కలుగుటకు క్రమమున ఉపాయములను చెప్పుచున్నాడు -

యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధోఽపరిగ్రహః,
నిరాశా చ నిరీహా చ నిత్య మేకాన్తశీలతా. 368

యోగస్య = బాహ్యములైన సకలవృత్తుల నిరోధమునకు, వాఙ్నిరోధః = మౌనము, ప్రథమం = మొదటిదైన, ద్వారం = కారణము. మాటలాడుటచే మనోవృత్తులు పెరుగుచుండునుగదా! అపరిగ్రహః = శరీరస్థితికిమాత్రము ఉపయోగించు సాధనములకంటె భిన్నములైన భోగ సాధనములను స్వీకరింపకుండుటయు; వాటిని స్వీకరించినచో వాటిని రక్షించుట మొదలగు పనులలో లగ్నమైన చిత్తము కలవానికి వృత్తి నిరోధము అసంభావ్యము. అట్లే ఆశలు ఉన్నచో చిత్తమునకు ఆ యా పనులుచేయుటలో విక్షేపముండును. జనసంఘములో కూర్చున్నప్పుడు గూడ ఇట్టి విక్షేపమే యుండును. అందుచే, నిరాశా చ = వైరాగ్యము, నిరీహా చ = కర్మలనుండి విరతి, నిత్యం = ఎల్లప్పుడును, ఏకాన్తశీలతా = విజనప్రదేశమునందు నివసించు నలవాటు ఇవి యన్నియు యోగమునకు హేతువులు.

అవ. ఏకాన్తశీలత్వము యోగమునకు హేతువను విషయమును ఉపపాదించుచున్నాడు -

ఏకాన్తస్థితిరిన్ద్రియోపరమణే హేతుర్దమశ్చేతసః
సంరోధే కరణం శమేన విలయం యాయాదహంవాసనా,
తేనానన్దరసానుభూతిరచలా బ్రాహ్మీ సదా యోగినః
తస్మాచ్చిత్తనిరోధ ఏవ సతతం కార్యః ప్రయత్నాన్మునేః 369

ఏకాన్తస్థితిః = విజనప్రదేశ నివాసము, ఇన్ద్రియోపరమణే = బాహ్యేన్ద్రియములు వ్యాపారశూన్యములుగ ఉండుటయందు, హేతుః = హేతువు, దమః = బాహ్యేంద్రియనిగ్రహము, చేతసః = అన్తఃకరణము

యొక్క, సంరోధే=నిగ్రహమునందు, కరణం=సాధనము, కావుననే "ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః"-దుష్టములైన ఇంద్రియములు బలాత్కారముగ మనస్సును హరించును అని గీత చెప్పుచున్నది. విజనప్రదేశములో శబ్దాదివిషయము లేవియు ఉండవు గాన శ్రోత్రాదీంద్రియములు బహిర్ముఖములు కాకుండుటచే అంతఃకరణము ఆత్మాభిముఖమగునని భావము. ఈ విధముగ అంతఃకరణము బహిర్ముఖము కాక ఆత్మాభిముఖ మగుటకే శమమనిపేరు. శమేన=శమముచే, అహంవాసనా=అహంకారము, విలయం=లయమును, యాయాత్=పొందును. తేన=దానిచే, యోగినః=అనాత్మపదార్థములనుండి మనస్సును నిరోధించిన యోగికి, సదా=ఎల్లప్పుడును, బ్రాహ్మీ=బ్రహ్మసంబద్ధమైన, అనన్దరసానుభూతిః=ఆనందరసముయొక్క అనుభవము, అచలా=నిశ్చలమై, ఎన్నటికిని చ్యుతిలేనిదై అగును. తస్మాత్=ఆ కారణమువలన, అనగా-బాహ్యవృత్తుల నుండి చిత్తమును నిరోధింపగా అహంవాసనకూడ నశించి బ్రహ్మానందానుభవము నిర్విఘ్నముగ సమకూరును గాన, మునేః=మననశీలునకు (నిచే), ప్రయత్నాత్=ప్రయత్నపూర్వకముగ, సతతం=ఎల్లప్పుడును, చిత్తనిరోధ ఏవ=చిత్తముయొక్క నిరోధమే, కార్యః=చేయదగినది. ఎల్లప్పుడును ఆతడు నిర్వికల్పసమాధినే చేయవలెనని అర్థము.

అవ. వాఙ్నిరోధము యోగమునకు ప్రథమద్వారమని చెప్పబడినది (368). అందులకు-

"యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేద్ జ్ఞాన ఆత్మని,
జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని."

అను కఠశ్రుతి ప్రమాణము. ఈ శ్రుతిని అర్థతః అనువదించుచున్నాడు-

వాచం నియచ్ఛాత్మని తం నియచ్ఛ
బుద్ధౌ ధియం యచ్ఛ చ బుద్ధిసాక్షిణి,
తం చాపి పూర్ణాత్మని నిర్వికల్పే
విలాప్య శాన్తిం పరమాం భజస్వ. 370

వాచం=వాగింద్రియమును, ఆత్మని=మనస్సునందు, నియచ్ఛ=నిరోధింపుము, అనగా వాగ్వ్యాపారమును విడచి మనోమాత్రముతో ఉండుము అని యర్థము. పశ్వాదులకువలె మౌనము దృఢమైన పిమ్మట, తం=సంకల్పవికల్పాత్మకమగు ఆ మనోరూపమైన ఆత్మను, బుద్ధౌ=కేవలము అధ్యవసాయమే (నిర్ణయమే) లక్షణముగా గల బుద్ధియందు, నియచ్ఛ=నిలుపుము. అపుడు, బాడితమొదలైన సాధనములులేని వడ్రంగి వలె, కర్త్రియైన బుద్ధికూడ బాహ్యవ్యాపారముల నుండి విరమించి శాంతించును. ధియం=ఆ విధముగ శాంతమైన ఆ బుద్ధిని, బుద్ధిసాక్షిణి=బుద్ధిచే ఉపహితమగు చైతన్యమునందు, బుద్ధియొక్క ఉపాధిత్వము తొలగిపోగా కేవలముగనున్న చైతన్యమునందు, యచ్ఛ=నియమించుము అనగా శోధితమగు 'త్వం' పదార్థమును తెలిసికొనుము. తం చాపి=బుద్ధిసాక్షియైన చైతన్యమును, నిర్వికల్పే=నిర్గుణమైన, పూర్ణాత్మని=త్రివిధ పరిచ్ఛేదశూన్యమైన తత్పదలక్ష్యమగు బ్రహ్మయందు, విలాప్య=ఏకము చేసి, పరమాం=శాశ్వతమైన, శాన్తిం=మోక్షరూపమగు శాంతిని, భజస్వ=పొందుము.

అవ. మనోవృత్తులను నిరోధించినచో స్వరూపానందము అభివ్యక్తమగునను విషయమును సోపపత్తికముగ చెప్పుచున్నాడు -

దేహప్రాణేన్ద్రియ మనోబుద్ధ్యాదిభిరుపాధిభిః,
యైర్యైర్వృత్తేః సమాయోగః తత్తద్భావోఽస్యయోగినః 371

తన్నివృత్త్యా మునేః సమ్యక్సర్వోపరమణం సుఖమ్,
సన్దృశ్యతే సదానన్దరసానుభవ విప్లవః. 372

అస్య=ఈ ఆత్మకు, యైర్యైః=ఏయే, దేహప్రాణేన్ద్రియమనోబుద్ధ్యాదిభిః=దేహము, ప్రాణములు, ఇంద్రియములు, బుద్ధిమొదలగు, 'ఆది' అనుటచే ఆనందమయకోశమునుకూడ గ్రహింపవలెను. ఉపాధిభిః=ఉపాధులతో, వృత్తేః=మనోవృత్తియొక్క, సమాయోగః=తదాకారత్వరూపమగు సంబంధము ఏర్పడునో, తత్తద్భావః=స్ఫటికము తాను స్వచ్ఛమే యైనను నీలవస్త్రాది సంబంధ మేర్పడినపుడు ఏ విధముగ నీల

రూపాదులు కలదిగ కనబడునో అట్లే అన్తరములైన కోశములతో కాని బాహ్యములైన కోశములతో కాని తాదాత్మ్యము ఏర్పడును. అపుడు వాటి ధర్మములే ఈ ఆత్మకు సంక్రమించుటచే అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము అను పంచక్లేశములు కలుగును. మునేః = మునియైన, అనగా కోశపంచక ప్రకరణమునందు చెప్పిన యుక్తులచే ఆ కోశములు అనాత్మలని నిషేధించినవాడును, యోగినః=బాహ్యవృత్తులను నిరోధించిన యోగికి, తన్నివృత్త్యా = ఆ కోశముల విషయమున అతనికి అహంభావము తొలగిపోవుటతో అవికూడ, అనగా దేహద్యుపాధులుకూడ దూర మగుటచే, సర్వోపరమణం = దుఃఖాత్మకములైన అనాత్మ లేవియు భాసింపని, సుఖం = సుఖము, సమ్యగ్ = బాగుగా, (భవతి = కలుగును) అందులకు ప్రమాణము- సదానన్దరసానుభవ విప్లవః - ఆత్మానందరసానుభూతిలో తేలియాడుట, సందృశ్యతే = చూడబడుచున్నది. గ్రీష్మమున తాపముతో బాధపడువాడు జాహ్నవీప్రవాహమున మునిగినపుడు ఏ విధముగ లోనను బైటనుగూడ ఆనందానుభూతిని పొందునో అట్లే సర్వోపాధి విముక్తుడై కేవలరూపుడైనవానికి అఖండానందస్ఫూర్తి కలుగును అని భావము.

అవ. సూత్రస్థానీయమైన (సూత్రమువంటిదైన) "యోగస్య ప్రథమం ద్వారమ్" ఇత్యాది శ్లోకమున (368) 'నిరాశా' పదముచే ఈ నిర్వికల్పక యోగమునకు హేతువైన సర్వోపాధినివృత్తికి వైరాగ్యము కారణమని చెప్పబడినది. "వివేకవైరాగ్య గుణాతిరేకాత్" ఇత్యాది శ్లోకమున (177) "తాభ్యాం దృఢాభ్యాం భవితవ్యమగ్రే" అను వాక్యముచే మనశ్శుద్ధికి హేతువని చెప్పబడిన తీవ్రతమ వైరాగ్యము అంతరంగసాధనమని నిరూపించుచున్నాడు -

## వైరాగ్యనిరూపణము

అన్తస్త్యాగో బహిస్త్యాగో విరక్తస్యైవ యుజ్యతే,
త్యజత్యన్తర్బహిఃసఙ్గం విరక్తస్తు ముముక్షయా. 373

బహిస్తు విషయైః సఙ్గస్తథాన్తరహమాదిభిః,
విరక్త ఏవ శక్నోతి త్యక్తుం బ్రహ్మణి నిష్ఠితః. 374

అన్తస్త్యాగః = లోపలనున్న అనాత్మలయొక్క త్యాగము, బహిస్త్యాగః = బాహ్యములైన అనాత్మలయొక్క త్యాగము, విరక్తస్యైవ = వైరాగ్యవంతునకే, యుజ్యతే = యుక్త మగును అనగా శక్యమగును. అందులకు హేతువు- విరక్తస్తు = వైరాగ్యవంతుడే, ముముక్షయా = మోక్షేచ్ఛచేత, అన్తర్బహిః సఙ్గం = అంతరములు బాహ్యములు అగు అన్నాత్మల సంగమును, త్యజతి = విడచును; అనగా అహంకారమమ కారములను విడచును. సంగమును విభజించి చెప్పుచున్నాడు:- విషయైః = పుత్రాదులతోడను శబ్దాదులతోడను, సంగః = సంగము, బహిః తు = బాహ్య సంగము, తథా = అట్లే, అహమాదిభిః = అహమాదులతో; ఆదిశబ్దముచే దేహప్రాణమనో బుద్ధులు గ్రహింప వలెను, సఙ్గః = అవాస్తవమైన తాదాత్మ్యరూప సంబంధము, అన్తః = అంతఃసంబంధము, ఈ ఉభయవిధ సంబంధమును. బ్రహ్మణి నిష్ఠితః = ఎల్లప్పుడును మిక్కిలి బ్రహ్మయందే ఉన్న విరక్త ఏవ = వైరాగ్యవంతుడే, త్యక్తుం = విడచుటకు, శక్నోతి = సమర్థు డగును. బ్రహ్మనిష్ఠ త్యాగమునకు బీజము.

అవ. వైరాగ్యమువలె బోధము(జ్ఞానము) కూడ బ్రహ్మాత్మతో ఉండుటకు కారణమని చెప్పుచున్నాడు -

వైరాగ్యబోధౌ పురుషస్య పక్షివత్
పక్షౌ విజానీహి విచక్షణ త్వమ్,
విముక్తి సౌధాగ్రతలాధిరోహణం
తాభ్యాం వినా నాన్యతరేణ సిధ్యతి. 375

హే విచక్షణ = ఓ బుద్ధిమంతుడా, త్వం = నీవు. పురుషస్య = ముక్తిని పొంద నభిలషించు పురుషునకు, వైరాగ్యబోధౌ = పూర్వోక్తమైన వైరాగ్యమును, ఆత్మానాత్మవివేకమువలన కలిగిన ఆత్మయథార్థస్వరూపానుభవమును, పక్షివత్ = పక్షికివలె, పక్షౌ = రెండు రెక్కలనుగా, విజానీహి =

తెలిసికొనుము. అందులకు హేతువు:- విముక్తి సౌధాగ్రతలాధిరోహణం= మోక్షమనెడు సౌధముయొక్క అతిసుందరమైన ఉన్నతస్థానముయొక్క ప్రాప్తి, తాభ్యాం వినా = సముచ్చితములైన (కలిసియున్న) ఆ వైరాగ్య బోధములు లేకుండగ ఒక్క వైరాగ్యముచేతగాని ఒక్క బోధచేగాని, న సిధ్యతి = సిద్ధింపదు. పక్షి ఒక్కరెక్కతో ఎట్లు ఆకాశవీథిలోనికి ప్రవేశింపజాలదో, ప్రకృతమునగూడ అట్లే అని తాత్పర్యము.

అవ. ఈ విషయమునే ఉపపాదించుచున్నాడు -

అత్యన్త వైరాగ్యవతః సమాధిః
సమాహితస్యైవ దృఢప్రబోధః,
ప్రబుద్ధ తత్త్వస్య హి బన్ధముక్తి
ర్ముక్తాత్మనో నిత్యసుఖానుభూతిః. 376

అత్యన్తవైరాగ్యవతః = మనస్సునకు మరల సంగము కలుగని విధమున అనాత్మలవిషయమున తీవ్రవైరాగ్యము కలవానికి, సమాధిః = బ్రహ్మనిష్ఠ, కలుగును. సమాహితస్యైవ=బ్రహ్మపై స్థాపితమైన మనస్సు కలవానికే, దృఢప్రబోధః = ఇతరజ్ఞానములతో మిశ్రముకాని బ్రహ్మ జ్ఞానము, కలుగును. ప్రబుద్ధతత్త్వస్య = తత్త్వము తెలిసినవానికి, బన్ధ ముక్తిః = అనాత్మయందు ఆత్మబుద్ధిరూపమగు బంధమునుండి విముక్తి, (కలుగును). ముక్తాత్మనః=ముక్తిచెందిన ఆత్మకలవానికి, అనగా 'అది'కాని దానియందు అది యను బుద్ధిలేని అంతఃకరణము కలవానికి, నిత్యసుఖాను భూతిః=నిత్యమైన సుఖముయొక్క, అనగా ఆత్మస్వరూపమైన సుఖము యొక్క, అనుభవము కలుగును. ఆవరణవిక్షేపములు లేకపోవుటచే నిర్విఘ్నముగ ఆత్మానందానుభవము కలుగునని భావము.

"న సుఖం దేవరాజస్య న సుఖం చక్రవర్తినః,
యాదృశం వీతరాగస్య మునే రేకాన్తశీలినః."

వైరాగ్యవంతుడును, ఏకాన్తస్వభావము కలవాడును అగు మునికి ఉండెడు ఆనందము చక్రవర్తికైనను, దేవేంద్రునకైనను ఉండదు.

"యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్,
తృష్ణాక్షయసుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్."

లౌకికవిషయభోగములవలన కలుగు సుఖముగాని, దేవలోకములోని మహాసుఖముగాని వైరాగ్యమువలన కలుగు సుఖములో పదునారవ వంతునకు కూడ సాటిరావు.

"యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే,
తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః."

నాలుగువైపుల నీరు పూర్ణముగా వ్యాపించి యున్నపుడు ఏ రీతిగా వాపీకూపాదులను విచారింపరో అట్లే జ్ఞానము సిద్ధించినవారికి యజ్ఞ యాగాది వైదికకర్మలవలన ఉపయోగమేమియు ఉండదు.

"శ్రోత్రియస్య చాకామహతస్య" - చక్రవర్త్యాదుల కుండెడు సుఖము లన్నియు కామములచే పీడితుడుకాని శ్రోత్రియున కుండును. "సోఽశ్నుతే సర్వాన్కామాన్సహ" - ఆత్మజ్ఞాని అన్ని కామములను ఒక్కమారుగనే పొందును- అనగా విషయభోగాదులవలన ఎన్నెన్ని సుఖములు కలుగునో ఆ సుఖము లన్నియు ఆత్మజ్ఞానికి కలుగును. ఇత్యాది ప్రమాణములచే ప్రతిపాదింపబడినదియు, స్వానుభవసిద్ధమైనదియు అగు వైరాగ్యబోధముల ఫలమును స్తుతించుచున్నాడు లేదా ఫలమును గూర్చి ప్రస్తావించుచున్నాడు -

వైరాగ్యాన్న పరం సుఖస్య జనకం పశ్యామి వశ్యాత్మనః
తచ్చేచ్ఛుద్ధతరాత్మబోధసహితం స్వారాజ్యసామ్రాజ్యధుక్,
ఏతద్ద్వార మజస్రముక్తియువతేః యస్మాత్త్వమస్మాత్పరం
సర్వత్రాస్పృహయా సదాత్మని సదా ప్రజ్ఞాం కురు శ్రేయసే.
377

వశ్యాత్మనః=శరీరాదికమును వశములోనుంచుకొన్నవానికి కూడ, వైరాగ్యాత్పరం = వైరాగ్యమును మించిన, సుఖస్య జనకం = సుఖము కలిగించు దానిని, న పశ్యామి=చూడను. తత్=ఆ వైరాగ్యము, శుద్ధతరాత్మబోధసహితం చేత్=అతిశుద్ధమైన ఆత్మబోధముతో కూడినదైనచో, స్వారాజ్యసామ్రాజ్యధుక్=స్వారాజ్యసామ్రాజ్యములను ఇచ్చునది. ఏతత్= ఈ బోధసహితవైరాగ్యము, యస్మాత్=ఏ కారణమువలన, అజస్రముక్తియువతేః=శాశ్వతమైన ముక్తియనెడు యువతిని పొందుటకై, ద్వారం= ద్వారమో, అస్మాత్=ఈ కారణమువలన, సర్వత్ర=అంతటను, అస్పృహయా=అసక్తి లేకుండగ, శ్రేయసే=శ్రేయస్సుకొరకై, సదా=ఎల్లప్పుడును, పరం = అధికముగా, సదాత్మని=సద్రూపమైన ఆత్మయందు, ప్రజ్ఞాం = బుద్ధిని, నిర్వికల్పకసమాధిని, కురు = చేయుము.

వశ్యాత్మనః = ఆసనప్రాణాయామాదులచే దేహేంద్రియాదులను స్వాధీనము చేసికొనినవానికిగూడ, వైరాగ్యము లేనిచో సుఖము లేదు. అణిమాది విభూతులపై ఆసక్తి కలవారికి బంధము అనివార్యమే కదా? హిరణ్యకశిపుడు మొదలగువారు మహాతపస్సు చేసియు, వైరాగ్యము లెకపోవుటచే సంసారబంధమున చిక్కుకొనినట్లు పురాణాదులవలన తెలియుచునేయున్నది కదా? చీమలు ఎముకలోదూరి పాకుచున్నను తెలియనంతటి నిశ్చలమైన అట్టి తపస్సు కుదురవలెనన్నచో వశ్యాత్మత్వ ముండవలెను. ఆ విధముగ వశ్యాత్ముడైన వానికి కూడ వైరాగ్యము లేకున్నచో సుఖము లెదని దాని అభిప్రాయము. ముందుగ దేహాదికమును వశములో నుంచుకొనక పోయినచో వైరాగ్యము సంభవింపదు. కాన 'వశ్యాత్మనః' అని చెప్పబడినది. కావున హఠయోగాదులచే దేహాదులను వశములో నుంచుకొనినవానికి కూడ వైరాగ్యము తప్ప మరేదియు సుఖము కలిగింపజాలదని నేను చూచుచున్నాను (భావించుచున్నాను). తత్ = వైరాగ్యము, శుద్ధతరాత్మబోధసహితం చేత్ = పంచకోశవివేకము వలన కలిగిన ఆత్మస్వరూపజ్ఞానముతో సహితమైనచో, "స్వారాజ్యసామ్రాజ్యధుక్"–'స్వరాట్'

అనగా 'స్వయమేవ రాట్' అను విగ్రహముచే "తనకు తానే రాజు" గాగ మున్నంతవరకును మనస్సు విషయములవైపు పోవుచుండును. కాన అపుడు విషయాధీనుడై యుండును. వైరాగ్యవంతుడైనచో అన్యాధీనుడు కాడు. ఈ విధముగ అన్యాధీనుడు కాకుండుటయే స్వారాజ్యము. ఇతరులచే నియమింపబడకుండ ఉండుట. సామ్రాజ్యమనగా సర్వమును నియమించు సామర్థ్యము. బ్రహ్మవేత్త ఈశ్వరుని కంటె కూడ అధికుడు కదా? అట్టి స్వారాజ్యసామ్రాజ్యములను ఇచ్చునది ఈ వైరాగ్యము. 'అత్యన్త వైరాగ్యరతః సమాధిః' ఇత్యాది విధమున పూర్వశ్లోకమున చెప్పినట్లు, అజస్రముక్తియువతికి ద్వారము. కావున నీవు, సర్వవిషయములందును అత్యంతము అస్పృహతో, సద్రూపమైన బ్రహ్మయందు, నిరంతరము ముక్తికొరకై, ప్రజ్ఞాం= తత్త్వప్రబోధహేతువగు నిర్వికల్పకసమాధిని, చేయుము. జ్ఞానము వస్తుతంత్రము. అది చేయుటకు శక్యమైనది కాదు. అనగా ఏదైన ఒకవస్తువు ఇంద్రియముతో సంబంధించినపుడు దాని జ్ఞానము కలుగును. అంతియేకాని 'నేను ఘటజ్ఞానము చేసెదను' అని ప్రయత్నము చేసినచో కలుగదు. కావున జ్ఞానము వస్తుతంత్రము. కావున ఇచట ప్రజ్ఞను (జ్ఞానమును) చేయుము అనగా జ్ఞానమునకు హేతువగు సమాధిని చేయుము అని యర్థము.

ఆశాం ఛిన్ధి విషోపమేషు విషయేష్వేషైవ మృత్యోః సృతిః
త్యక్త్వా జాతికులాశ్రమేష్వభిమతిం ముఞ్చాతిదూరాత్క్రియాః,
దేహాదావసతి త్యజాత్మధిషణాం ప్రజ్ఞాం కురుష్వాత్మని
త్వం ద్రష్టాస్యమలోఽసి నిర్ద్వయ పరబ్రహ్మాసి యద్వస్తుతః.378

విషోపమేషు = విషముతో సమానమైన, విషయేషు = విషయముల యందు, ఆశాం = ఆశను, ఛిన్ధి = ఛేదించుము, ఏషైవ = ఈ ఆశయే, మృత్యోః = మృత్యువునకు, అనగా స్వరూపమునుండి చ్యుతుడగుట అనెడు రూపముగల ప్రమాదమునకు, సృతిః = మార్గము, జాతికులాశ్ర

వేషు = జాతి-కుల-ఆశ్రమముల విషయమున, అభిమతిః = అభిమానమును, త్యక్త్వా = విడచి, క్రియాః = జాత్యాదులనుబట్టి ఏర్పడిన క్రియలను, అతిదూరాత్ = చాలదూరముగ, ముఞ్చ = విడిచిపెట్టుము, అసతి = మిథ్యయైన, దేహాదౌ = దేహాదికమునందు, ఆత్మధిషణాం = అహంకారమును, త్యజ = విడువుము (చేయకుము), యత్ = ఏ కారణమువలన, త్వం = నీవు, ద్రష్టా = దేహాదిదృశ్యములకు ద్రష్టవుగా, అసి = అయి ఉన్నావో, అమలః అసి = దేహాదికము మలినమైనను నీవు నిర్మలుడవుగా ఉన్నావో, వస్తుతః = యథార్థమున, నిర్ద్వయపరబ్రహ్మ అసి = అద్వైతమగు పరబ్రహ్మగా ఉన్నావో, అందువలన, ఆత్మని = బ్రహ్మయందు, ప్రజ్ఞాం = "అహం బ్రహ్మాస్మి" అనెడు జ్ఞానమును, కురుష్వ = నిర్వికల్పకసమాధిచే సంపాదింపుము.

## ధ్యానవిధి

లక్ష్యే బ్రహ్మణి మానసం దృఢతరం సంస్థాప్య బాహ్యేన్ద్రియం
స్వస్థానే వినివేశ్య నిశ్చలతనుశ్చోపేక్ష్య దేహస్థితిమ్,
బ్రహ్మాత్మైక్యముపేత్య తన్మయతయా చాఖణ్డవృత్త్యానిశం
బ్రహ్మానన్దరసం పిబాత్మని ముదా శూన్యైః కిమన్యైర్భ్రమైః
379

దేహస్థితిం = దేహముయొక్క స్థితిని, ఉపేక్ష్య = విడచి, నిశ్చలతనుః = నిశ్చలమైన శరీరముకలవాడవై, బాహ్యేన్ద్రియం = బాహ్యేంద్రియములను, స్వస్థానే = వాటివాటిస్థానమున, వినివేశ్య = ఉంచి, లక్ష్యే = లక్ష్యమైన, బ్రహ్మణి = బ్రహ్మయందు, మానసం = మనస్సును, దృఢతరం = నిశ్చలమైనదానినిగా, సంస్థాప్య = నిలిపి, బ్రహ్మాత్మైక్యం = బ్రహ్మాత్మైకత్వమును, ఉపేత్య = పొంది, అనగా బ్రహ్మసాక్షాత్కారమును పొంది, అనిశం = ఎల్లపుడును, అఖణ్డవృత్త్యా = అఖండవృత్తితో, తన్మయతయా = బ్రహ్మరూపత్వముతో, ఆత్మని = ఆత్మయందు, బ్రహ్మానన్దరసం = బ్రహ్మానందరసమును, ముదా = సంతోషముతో, పిబ = త్రాగుము. శూన్యైః = శూన్యములైన, అన్యైః = ఇతరములైన, భ్రమైః = భ్రమలచేత, కిమ్ = ఏమి ప్రయోజనము?

'ప్రారబ్ధం పుష్యతి వపుః'-శరీరము ప్రారబ్ధకర్మను పెంచును అని నిశ్చయించి, దేహస్థితి దేహపోషణాదుల విషయమున అభిమానము విడచి, నిశ్చలతనుః="స్థిరసుఖమాసనమ్" - స్థిరము, సుఖము అయిన ఆసనమును స్వీకరింపవలెను అనెడు యోగసూత్రము ననుసరించి నిశ్చలమైన శరీరము కలవాడవై అనగా సుఖముగనుండు ఆసనమున కూర్చున్నవాడవై, బాహ్యేన్ద్రియం = జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల సముదాయమును, స్వస్థానే = దాని గోలములయందు, ఉంచి -

"వివిక్తదేశే చ సుఖాసనస్థః శుచిః సమగ్రీవశిరః శరీరః,
అత్యాశ్రమస్థః సకలేన్ద్రియాణి నిరుధ్య భక్త్యా స్వగురుం ప్రణమ్య."

ఏకాంతప్రదేశమున సుఖాసనమున కూర్చున్నవాడై, శుచియై, కంఠమును, శిరస్సును, శరీరమును సమముగ (నిడుపుగ) నిలిపి, ఆశ్రమాతీతుడై, సకలేంద్రియములను నిరోధించి, భక్తితో తన గురువునకు నమస్కరించి.

"హృత్పుణ్డరీకం విరజం విశుద్ధం విచిన్త్య మధ్యే విశదం విశోకమ్,
అచిన్త్య మవ్యక్త మనన్తరూపం శివం ప్రశాన్త మమృతం
బ్రహ్మయోనిమ్."

రజోరహితమును, విశుద్ధమును అగు హృదయపద్మమును చింతించి దాని మధ్యమందు నిర్మలుడును, శోకరహితుడును, అచింత్యుడును, అవ్యక్తరూపుడును, అనన్తుడును, మంగళకరుడును, శాంతుడును, అమృతస్వరూపుడును, బ్రహ్మకు కారణభూతుడును -

"తదాదిమధ్యాన్త విహీనమేకం
విభుం చిదానన్ద మరూపమద్భుతమ్,
ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం
త్రిలోచనం నీలకణ్ఠం ప్రశాన్తమ్."

ఆది మధ్యాన్త విహీనుడును, అద్వితీయుడును, సర్వవ్యాప్తుడును, చిదా

నందస్వరూపుడును, రూపరహితుడును, అద్భుతమైనవాడును, పార్వతీ సమేతుడును, ప్రభువును, త్రిలోచనుడును, నల్లనికంఠముకలవాడును ప్రశాంతుడును.

"ధ్యాత్వా ముని ర్గచ్ఛతి భూతయోనిం
సమస్తసాక్షిం తమసః పరస్తాత్"

సర్వభూతములకు కారణమైనవాడును, సమస్త సాక్షిభూతుడును అగు పరమేశ్వరుని ధ్యానించి ముని తమస్సునకు దూరమైన స్థానమును చేరును అను కైవల్యశ్రుతి చెప్పిన విధముగ లక్ష్యమైన బ్రహ్మయందు మనస్సును నిశ్చలముగ నిలిపి, బ్రహ్మ సాక్షాత్కారమును పొంది, ఎల్లప్పుడును అఖండాకారవృత్తితో, బ్రహ్మరూపముతో, ఆత్మయందు బ్రహ్మానందరసమును సంతోషముతో ఆస్వాదింపుము. ఫలశూన్యమైనవియు, అనర్థకరములును అగు అనాత్మ విషయకములైన అయథార్థ జ్ఞానములచే ఏమి ప్రయోజనము?

అవ. పూజ్యుడైన గురువు కరుణాతిరేకముచే, మరల మరల ఆత్మనిష్ఠను ఉపదేశించుచున్నాడు-

అనాత్మచిన్తనం త్యక్త్వా కశ్మలం దుఃఖకారణమ్,
చిన్తయాత్మాన మానన్దరూపం యన్ముక్తికారణమ్. 380

కశ్మలం=అపవిత్రములైన విషయములకు సంబంధించిన దగుటచే అపవిత్రమైనదియు, కావుననే, దుఃఖకారణం = దుఃఖమునకు కారణమైన, అనాత్మచిన్తనం = అనాత్మలనుగూర్చిన చింతనమును, త్యక్త్వా = విడచి, యత్ = ఏది, ముక్తికారణం = ముక్తికికారణమైనదో, అట్టి, ఆనన్దరూపం= ఆనందరూపమైన, ఆత్మానం=ఆత్మను, చిన్తయ = ధ్యానించుము.

అవ. చిన్తనప్రకారమును ఉపదేశించుచు "ధియం యచ్ఛ చ బుద్ధిసాక్షిణి" (శ్లో. 370) అను వాక్యముయొక్క అర్థమును చెప్పుచున్నాడు

ఏష స్వయంజ్యోతి రశేషసాక్షీ
విజ్ఞానకోశే విలసత్యజస్రమ్,
లక్ష్యం విధాయైన మసద్విలక్షణ
మఖణ్డ వృత్త్యాత్మతయానుభావయ. 381

ఏషః = ఈ ఆత్మ, స్వయంజ్యోతిః = స్వయంప్రకాశమైనది, ఇతరవస్తువులచే ప్రకాశింపబడునది కాదు. అశేషసాక్షీ = సర్వద్రష్ట, విజ్ఞానకోశే=బుద్ధియందు, విలసతి=పూర్తిగ భాసించును. అసద్విలక్షణం=సర్వావస్థలయందును అనువర్తించుటచేతను, స్వయంజ్యోతి యగుటచేతను, సర్వసాక్షియగుటచేతను, జడములును దృశ్యములును అగు బుద్ధ్యాదులకంటె విలక్షణమైన, ఏనం = ఈ ఆత్మను, అజస్రం = ఎల్లప్పుడును, లక్ష్యం విధాయ=లక్ష్యముగ చేసికొని, అనగా దానియందే మనస్సును నిలిపి, అఖణ్డవృత్త్యా = ఇతరజ్ఞానములతో మిశ్రముకాని ధారావాహికజ్ఞానముతో, ఆత్మతయా=స్వస్వరూపమునుగ, అనుభవ=సాక్షాత్కరింపజేసికొనుము.

అవ. వృత్తి అఖండ మనగా అర్థమును విశదీకరించుచున్నాడు-

ఏతమచ్ఛిన్నయా వృత్త్యా ప్రత్యయాన్తరశూన్యయా,
ఉల్లేఖయన్ విజానీయాత్ స్వస్వరూపతయా స్ఫుటమ్. 382

ప్రత్యయాన్తరశూన్యయా = విజాతీయమగు జ్ఞానముచే తిరస్కృతముకాని, అవిచ్ఛిన్నయా=నిర్మలమైన వత్తియు తైలమునుగల దీపజ్వాలవలెను, తైలధారవలెను ధారారూపమున అవిచ్ఛిన్నముగ ప్రవహించుచున్న, వృత్త్యా = వృత్తితో, ఏతం = ఈ ఆత్మను, ఉల్లేఖయన్ = విషయము చేయుచు, స్వస్వరూపతయా = స్వస్వరూపమునుగ, స్ఫుటం = స్పష్టముగ, విజానీయాత్ = తెలిసికొనవలెను.

అత్రాత్మత్వం దృఢీకుర్వన్నహమాదిషు సంత్యజన్,
ఉదాసీనతయా తేషు తిష్ఠేద్ ఘటపటాదివత్. 383

అత్ర = ఈ పరమాత్మవిషయమున, ఆత్మత్వం = స్వస్వరూపమనెడు బుద్ధిని, దృఢీకుర్వన్ = దృఢము చేసికొనుచు, అహమాదిషు = అహంకారాదులయందు, సంత్యజన్ = స్వస్వరూపత్వబుద్ధిని విడచుచు, తేషు = అప్పు డప్పుడు భాసించుచున్నను ఆ అహమాదుల విషయమున, ఘటపటాదివత్ = ఘటపటాదులయందువలె, ఉదాసీనతయా = ఔదాసీన్యముతో, అనగా అహంకారములేకుండగ, తిష్ఠేత్ = ఉండవలెను.

అవ. 'వాచం నియచ్ఛాత్మని' అను శ్లోకమున(370) చెప్పిన "తం చాపి పూర్ణాత్మని" అను వాక్యముయొక్క అర్థమును స్పష్టీకరించుచున్నాడు -

## ఆత్మదృష్టి

విశుద్ధమన్తఃకరణం స్వరూపే
నివేశ్య సాక్షిణ్యవబోధమాత్రే,
శనైః శనైర్నిశ్చలతా ముపానయన్
పూర్ణత్వ మేవానువిలోకయే త్తతః. 384

విశుద్ధం = రజస్తమోగుణములతో శూన్యమైన, అన్తఃకరణం = అంతఃకరణమును, అవబోధమాత్రే = జ్ఞానమాత్రస్వరూపమైన, అనగా ఉపాధిశూన్యమైన, సాక్షిణి = సాక్షిత్వముతో ఉపలక్షితమగు, స్వరూపే = స్వరూపమునందు, నివేశ్య = నిలిపి, శనైః శనైః = మెల్ల మెల్లగా, నిశ్చలతాం = నిశ్చలత్వమును, ఉపానయన్ = పొందించుచు, అనగా, అచటనే ఉండుటయందు ప్రయత్నము చేయుచు, తతః = అటుపిమ్మట, పూర్ణత్వమేవ = పూర్ణత్వమునే, అనువిలోకయేత్ = చూడవలెను, అద్దముతీసివేయగనే ప్రతిబింబము ముఖముగనే అయినట్లు, అన్నివృత్తులను నిరోధించిన పిమ్మట చిదాభాసముకూడ బింబమైన బ్రహ్మగనే అగును అని భావము.

అవ. ఈ విధముగ అఖండాకారవృత్తిచే అజ్ఞానావరణము భగ్నము కాగా, దానివలన కలిగిన విక్షేపములు కూడ దూరముగ తొలగిపోవును అను నభిప్రాయముతో చెప్పుచున్నాడు -

దేహేన్ద్రియప్రాణమనోఽహమాదిభిః
స్వాజ్ఞానక్లృప్తైరఖిలై రుపాధిభిః.
విముక్త మాత్మాన మఖణ్డరూపం
పూర్ణం మహాకాశమివావలోకయన్. 385

స్వాజ్ఞానక్లృప్తైః = తన అజ్ఞానముచే కల్పితములగు, దేహేన్ద్రియప్రాణమనోఽహమాదిభిః = దేహము, ఇంద్రియములు, మనస్సు, అహంకారము మొదలగు, అఖిలైః = సమస్తమైన, ఉపాధిభిః = ఉపాధులచే, విముక్తం = విడువబడిన, అఖణ్డరూపం=అఖండరూపమైనదియు, పూర్ణం= పూర్ణమైనదియు అగు, ఆత్మానం = ఆత్మను, మహాకాశమివ = మహాకాశమునువలె, అవలోకయేత్ = చూడవలెను. (దీనికి వ్యాఖ్యానములేదు.)

అవ. పై శ్లోకములోని నాల్గవపాదముయొక్క అర్థమును ఉపపాదించుచు, దార్ష్టాంతికమున సమన్వయించుచున్నాడు -

ఘటకలశకుసూల సూచిముఖ్యైః
గగనముపాధిశతై ర్విముక్త మేకమ్,
భవతి న వివిధం తథైవ శుద్ధం
పరమహమాది విముక్త మేకమేవ. 386

ఘట కలశ కుసూల సూచిముఖ్యైః = చిన్నవి, పెద్దవి అయిన ఘటము, కలశము, గౌణక, సూదిమొదలగు; ముఖ్యపదముచే పాళకూపాదులను గ్రహింపవలెను, ఉపాధిశతైః = సూచ్యాకాశము, పాశాకాశము మొదలగు వేరు వేరు వ్యవహారములకు కారణభూతములగు వేల కొలది ఉపాధులచే, విముక్తం = విడువబడిన, గగనం = ఆకాశము, ఏకం = ఒక్కటిగనే, భవతి = అగును; మహాకాశమని వ్యవహరింపబడును; వాస్తవమున, వివిధం = అనేకవిధములైనది, న = కాదు, తథైవ = అట్లే, అహమాది విముక్తం = అహంకారాదులచే విడువబడిన, శుద్ధం=శుద్ధమైన, పరం=బ్రహ్మ, అహమాదివిముక్తం=అహంకారాదులచే విముక్తమై, ఏకమేవ = ఒక్కటిగనే ఉండును.

అవ. ఉపాధులు అసత్యములు గాన, దార్ష్టాంతికమగు ఆత్మ విషయమున ఏకత్వజ్ఞానము సులభమని చెప్పుచున్నాడు -

బ్రహ్మాద్యాః స్తమ్బపర్యన్తా మృషామాత్రా ఉపాధయః,
తతఃపూర్ణం స్వమాత్మానం పశ్యేదేకాత్మనా స్థితమ్. 387

బ్రహ్మాద్యాః = సమష్టి లింగశరీరాభిమానియు చతుర్దశభువనాధిపతియు నగు బ్రహ్మ మొదలైనవియు, స్తంబపర్యన్తాః =అతిసూక్ష్మమైన స్తంబమనెడు జంతువువరకును గల ఉపాధయః = ఉపాధులు, అనగా భేదహేతువులగు దేహములు. మృషామాత్రాః=మిథ్యయైనవి, సర్వాధిష్ఠానమైన బ్రహ్మయందు కల్పితములు, వాస్తవమైనవి కాదు, బాధితయోగ్యమైనదని యర్థము. తతః = విమర్శింపగా వాటికి ప్రతీతి లేదుగాన, ఏకాత్మనా స్థితం = ప్రలయకాలసముద్రమువలె ఒకేస్వరూపముతో ఉన్నదియు, పూర్ణం = త్రివిధపరిచ్ఛేదములు లేని, స్వం ఆత్మానం=తనముఖ్యరూపమగు బ్రహ్మను, పశ్యేత్ = సాక్షత్కరింప జేసికొనవలెను.

యత్ర భ్రాన్త్యా కల్పితం యద్వివేకే
తత్తన్మాత్రం నైవ తస్మాద్విభిన్నమ్,
భ్రాన్తేర్నాశే భ్రాన్తిదృష్టాహితత్త్వం
రజ్జుస్తస్మాద్విశ్వ మాత్మస్వరూపమ్. 388

యత్ = ఏ వస్తువు, యత్ర = ఏ అధిష్ఠానమునందు, భ్రాన్త్యా = భ్రాంతిచేత, కల్పితం = ఆరోపింపబడినదో, తత్ = ఆ వస్తువు, వివేకే= వివేకము కలుగగనే, తన్మాత్రం =అధిష్ఠానమాత్రమై, అగును. తస్మాత్= దానికంటె, విభిన్నం = భిన్నమైనది, నైవ = కాదు. భ్రాన్తేః నాశే= బాగుగా పరిశీలించుటచే కలిగిన 'ఇది సర్పము కాదు' అను నిషేధముచే 'ఇది సర్పము' అనెడు భ్రాంతి నశింపగనే, భ్రాన్తిదృష్టాహితత్త్వం= భ్రాంతిచే చూడబడిన సర్పముయొక్క స్వరూపము, రజ్జుః=రజ్జువే. తస్మాత్= ఆ కారణమువలన అనగా "అథాత ఆదేశో నేతి నేతి' ఇత్యాది వాక్యము

లచే కలిగిన నిషేధజ్ఞానముచే, విశ్వం=సకలప్రపంచము, ఆత్మస్వరూపం= అధిష్ఠానాత్మస్వరూపమైనది. అందుచే రజ్జుసర్పమువలెనే ఇదికూడ మరల భాసింపదని భావము.

స్వయంబ్రహ్మా స్వయం విష్ణుః
స్వయమిన్ద్రః స్వయం శివః,
స్వయం విశ్వమిదం సర్వం
స్వస్మాదన్యన్న కించన. 389

స్వయం=తానే, అనగా ఆత్మయే, బ్రహ్మా=బ్రహ్మ, స్వయం= తానే, విష్ణుః=విష్ణువు, స్వయం=తానే, ఇన్ద్రః=ఇంద్రుడు, స్వయం= తానే, శివః=శివుడు, స్వయం=తానే, ఇదం=ఈ, సర్వం=సమస్తమైన, విశ్వం=ప్రపంచము. స్వస్మాత్=తనకంటె, అన్యత్=భిన్నమైనది, కించిత్=ఏదియు, న విద్యతే=లేదు.

"తద్ధైతత్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదే, అహం మనురభవం సూర్యశ్చ"- ఆత్మస్వరూప సాక్షాత్కారమును పొందిన వామదేవ ఋషి నేనే మనువునై యుంటిని; నేనే సూర్యుడను అని గ్రహించెను. "స యశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే స ఏకః"- పురుషుని యందు ఏ ఆత్మస్వరూప మున్నదో, ఈ ఆదిత్యునియందు ఏదియున్నదో అది ఒక్కటే ఇత్యాది శ్రుతుల ననుసరించి ఒకే చైతన్యము ఉపాధి భేదముచే బ్రహ్మయనియు, విష్ణువనియు, శివుడనియు, ఇంద్రుడనియు వ్యవహరింపబడుచున్నది. ఒకే రజ్జువును చూచి సర్ప మనియు, దండ మనియు, జలధార యనియు, నేలబీటయనియు కల్పించినట్లు ఈ విశ్వమంతయు స్వయమే, అనగా బ్రహ్మయే. బ్రహ్మకంటె భిన్న మైన దేదియును లేదు. విశేషము లన్నియు సామాన్యమునందు కల్పితమైనవే. నేను స్వయముగా చూచుచున్నాను, నీవు స్వయముగ చూడుము, అతడు స్వయముగ చూచెను ఇత్యాది వ్యవహారములలో

'నేను', 'నీవు', 'అతడు' అనునవి మారుచున్నను 'స్వయం' అనునది మాత్రము మార్పుచెందక అన్నింటియందును అనుస్యూతముగ వచ్చుచున్నది. ఈ విధముగ అనువర్తించుచున్న 'స్వయం' పదార్థమైన ఆత్మయందు విశేషము లన్నియు కల్పితములు. దానికంటె భిన్నముగ లేవని భావము.

అవ. "బ్రహ్మైవేద మమృతం పురస్తా ద్బ్రహ్మ పశ్చాత్ బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ", "అహమేవాధస్తాత్", "ఆత్మైవాధస్తాత్" "తూర్పు, పడమర, దక్షిణము, ఉత్తరము అంతటను బ్రహ్మయే యున్నది", "క్రిందకూడ నేనే ఉన్నాను", "క్రింద ఆత్మయే ఉన్నది" ఇత్యాది ముండకఛాందోగ్యాది శ్రుతుల అర్థమును, ధ్యానము దృఢమగుటకును, అఖండాకారవృత్తి ఏర్పడుటకును ఉపదేశించుచున్నాడు-

అన్తః స్వయం చాపి బహిః స్వయం చ
స్వయం పురస్తా త్స్వయమేవ పశ్చాత్,
స్వయం హ్యవాచ్యాం స్వయమప్యుదీచ్యాం
తథోపరిష్టా త్స్వయమప్యధస్తాత్. 390

అన్తః = లోపల, స్వయం = తానే, బహిః చ = బయటకూడ, స్వయం = తానే, పురస్తాత్ = ఎదుటను, పశ్చాత్ చ = వెనుకను కూడ, స్వయం = తానే, అవాచ్యాం = పశ్చిమమునందు, స్వయం = తానే, ఉదీచ్యామపి = ఉత్తరమునందును, స్వయం = తానే, తథా = మరియు, ఉపరిష్టాత్ = పైనను, అధస్తాదపి = క్రిందను గూడ, స్వయం = తానే.

తరఙ్గఫేనభ్రమ బుద్బుదాది
సర్వం స్వరూపేణ జలం యథా తథా,
చిదేవ దేహాద్యహమన్త మేతత్
సర్వం చిదేవైకరసం విశుద్ధమ్. 391

తరంగఫేన భ్రమబుద్బుదాది = తరంగములు, నురుగు, సుడులు, బుడగలు మొదలైన, స్వరూపేణ = స్వరూపముచేత, యథా = ఎట్లు, జలం = జలమో, జలభిన్నమైనదేదియును లేదో, తథా = అట్లే, దేహాది = దేహము మొదలు, అహమన్తం = అహంకారాంతమైన, ఏతత్ సర్వం = ఇది యంతయు, విశుద్ధం = శుద్ధమైనదియు, ఏకరసం = ఒకే స్వరూపముగల, చిదేవ = చిత్తుమాత్రమే.

దేని స్ఫురణములేనిచో ఏది స్ఫురింపదో అది దానికంటె భిన్నము కాదు. ఉదాహరణమునకు- రజ్జుస్ఫురణము లేనిదే భాసింపని సర్పము రజ్జువుకంటె భిన్నముకాదు. అట్లే- శ్రు. "తమేవ భాన్త మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి"- ఆత్మస్వరూపము భాసించుచుండగా మిగిలిన వన్నియు దానినే అనుసరించి భాసించుచున్నవి. ఇది యంతయు దాని భానముచేతనే భాసించుచున్నది అను శ్రుతి ననుసరించి ఆత్మభానము కంటె భిన్నమైన భానము లేకపోవుటచే అంతయు ఆత్మస్వరూపమే.

సదేవేదం సర్వం జగదవగతం వాఙ్మనసయోః
సతోఽన్యన్నాస్త్యేవ ప్రకృతిపరసీమ్ని స్థితవతః,
పృథ క్కిం మృత్స్నాయాః కలశఘట కుంభాద్యవగతం
వదత్యేష భ్రాన్తస్త్వమహమితి మాయామదిరయా. 392

ఇదం = ఈ, సర్వం = సమస్తమైన, జగత్ = జగత్తు, వాఙ్మనసయోః = వాక్కుచేతను మనస్సుచేతను, సదేవ = సద్రూపముగనే, అవగతం = తెలియుచున్నది. ప్రకృతిపరసీమ్ని = ప్రకృతికంటె పరమైన బ్రహ్మయందు, స్థితవతః = ఉన్నవానికి, సతః = సత్తుకంటె, అన్యత్ = భిన్నమైనది, నాస్త్యేవ = లేదు. అవగతం = భాసించుచున్న, కలశఘట కుంభాది = కలశఘటకుంభాదికము, మృత్స్నాయాః = మట్టికంటె, పృథక్ కిమ్ = భిన్నమైనదా? మాయామదిరయా = మాయయనెడు మద్యముచేత భ్రాన్తః = భ్రాంతిపొందినవాడై, (జనుడు) ఏషః = ఇతడు, త్వం = నీవు, అహం = నేను, ఇతి = అని, వదతి = పలుకుచున్నాడు.

'సన్‌ఘటః', 'సన్‌పటః', 'సత్‌కుడ్యం' అనగా 'ఘటము ఉన్నది', 'పటము ఉన్నది', 'గోడ ఉన్నది' అను సామానాధికరణ్యమును బోధించు వాక్యములలో వేరు వేరు అర్థములుగల శబ్దములు ఒకే అర్థమును అనగా వస్తువును బోధించుచున్నవి. ('సన్' అను శబ్దము ఏ వస్తువును బోధించుచున్నదో 'ఘటః' అను శబ్దము కూడ ఆ వస్తువునే బోధించుచున్నది). కావున దీనికి పదనిష్ఠమగు సామానాధికరణ్య మనిపేరు.

"ఏకత్రవృత్తిరర్థే శబ్దానాం భిన్నవృత్తి హేతూనామ్,
సామానాధికరణ్యం భవతీత్యేవం వదన్తి లాక్షణికాః."

వేరు వేరు ప్రవృత్తినిమిత్తములు గల అనగా అర్థములుగల శబ్దములు ఒకే అర్థమును బోధించుటకు సామానాధికరణ్యమని లాక్షణికులు చెప్పుదురు అని స్వాత్మనిరూపణమున చెప్పబడినది. మనస్సుచేతను, అట్టి శబ్దప్రయోగము వలన కలిగిన జ్ఞానముచేతను ఈ జగత్తు అంతయు సద్రూపమైనదే అని తెలియుచున్నది. 'వాఙ్మనసయోః' అనునది నిమిత్తార్థకసప్తమి 'వాఙ్మనస్సులచేత' అని యర్థము లేదా 'వాక్'- అనగా 'ఐతదాత్మ్యమిదం సర్వం వాచారమ్భణం వికారో నామధేయం' ఇత్యాది శ్రుతి. మనస్సు అనగా —

"జనివిపరీత క్రమతో బుధ్యా ప్రవిలాప్య పంచభూతాని,
పరిశిష్ట మాత్మతత్త్వం పశ్యన్నాస్తే మునిః శాన్తః."

పంచభూతములను వాటిపుట్టుక ఏ క్రమమున జరిగినదో దానికి విపరీతమైన క్రమముచే కార్యమును కారణమునందు విలీనముచేయగా మిగిలిన ఆత్మతత్త్వమును సాక్షాత్కరించుకొని ముని శాంతుడై ఉండును అని చెప్పిన విధమున అధిష్ఠానమునకు మాత్రము సంబంధించిన అఖండాకారవృత్తి. అట్టి వృత్తియందు బ్రహ్మకంటె భిన్నముగ జగత్తు కనబడదు. అందుచే "యః చోరః సః స్థాణుః"-ఎవడు దొంగయో అతడు మ్రాను అనగా ఇంతవరకును దొంగ అనుకొన్నవాడు మ్రానే అనునపుడు చోరత్వమును నిషేధించి స్థాణుత్వమును

బోధించు వాక్యమునందు 'చోర', 'స్థాణు' శబ్దములకు సామానాధి కరణ్యము ఉన్న విధముననే "బ్రహ్మైవేదం సర్వం" "ఐతదాత్మ్య మిదం సర్వం" ఇత్యాది శ్రుతివాక్యములందు ఏది జగత్తుగ భాసించి నదో, అది బ్రహ్మయే అని సామానాధికరణ్య ప్రయోగముచే జగత్తును బాధించి దానికి సద్రూపత్వము అనగా బ్రహ్మత్వము బోధింపబడు చున్నది. ఈ విషయము వెనుక విశదీకరింపబడినది.

'వాఙ్మనసయోః' అను వాక్యమున చెప్పిన విషయమును విశదీకరించుచున్నాడు — ప్రకృతిపరసీమ్ని = ఉపాదానముల యొక్క పరావధియందు అనగా సర్వోపాదానమైన బ్రహ్మయందు, స్థిత వతః = ఉన్నవాని లేదా ప్రకృతియనగా మూలప్రకృతియైన మాయ. దానికి పరసీమయైన, అనగా కల్పనాధిష్ఠానమైన నిర్గుణబ్రహ్మయందు ఉన్న వాని దృష్టిలో, 'సత్' కంటె భిన్నమైన దేదియు లేదు. "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్" అని శ్రుతి చెప్పుచున్నది. ఈ విధముగ ఉపాదానమైన అజ్ఞానముతోకూడ అన్నియు బాధింపబడునని చెప్పినట్లైనది. ఈ విషయమును దృష్టాం తముతో విశదీకరించుచున్నాడు- పూర్వము వేరైన వస్తువువలె భాసిం చిన ఘటకలశకుంభాదికము, బాగుగ పరిశీలించినచో మట్టికంటె భిన్నముగా నున్నదా? ఈ విషయమునే భగవత్పాదులే "మృత్కార్య భూఽతోపి" (230) ఇత్యాది శ్లోకములలో సవిస్తరముగ చెప్పి యున్నారు. మాయామదిరముచే భ్రాంతిచెందినవాడై అవివేకి, ఈతడు, నీవు, నేను అని ఒకే వస్తువును గూర్చి వేరు వేరు విధముల చెప్పుచు న్నాడు. విపరీతజ్ఞానమును కలిగించునది గాన మాయయే మదిర.

౭౨. కావున భ్రాంతిని తొలగించుకొనుటకై అద్వైతవస్తువును గూర్చి చింతింపవలెనని శ్రుతియొక్క సహాయముతో చెప్పుచున్నాడు-

క్రియాసమభిహారేణ యత్ర నాన్యదితి శ్రుతిః,
బ్రవీతి ద్వైతరాహిత్యం మిథ్యాధ్యాసనివృత్తయే. 393

యత్ర నాన్యదితి శ్రుతిః="యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా" అను శ్రుతి, క్రియాసమభిహారేణ = మాటి మాటికిని, మిథ్యాధ్యాసనివృత్తయే = అసత్యమైన భేదభ్రమ యొక్క నివృత్తి కొరకు, ద్వైతరాహిత్యం- "ద్వయోర్భావః=ద్వితా: ద్వితైవ-ద్వైతమ్, అనగా భేదము దానియొక్క అభావముకొరకు, బ్రవీతి=చెప్పు చున్నది, లేదా- మిథ్యాధ్యాసనివృత్తయే' అనునపుడు 'అధ్యాస' శబ్దము నకు ప్రపంచరూపమగు అర్థముయొక్క అధ్యాసము అని యర్థము. దాని యొక్క నివృత్తికొరకు అనగా అధిష్ఠానరూపముననే మిగులుట అనెడు నాశముకొరకు. "అధిష్ఠానావశేషో హి నాశః కల్పితవస్తునః"-కల్పితమగు వస్తువునకు నాశమనగా అధిష్ఠానము మాత్రమే శేషించుట అని అభి యుక్తుల వచనము. ఇది రజ్జుసర్పాదులందు కూడ కనబడుచున్నది. ప్రపం చము సత్యమైనచో దర్శన-శ్రవణ-విజ్ఞానాదులలో విషయము కాకుండ ఎట్లుండును? కావున బ్రహ్మనిష్ఠుడగు పురుషునకు ప్రపంచభానము లేదు గాన ప్రపంచము మిథ్యయని భావము.

అవ. ధ్యానము చేయుటకు వీలుగ నుండుటకై బ్రహ్మస్వరూపము బాగుగ చిత్తమునందు హత్తుకొనునట్లు వర్ణించుచున్నాడు-

ఆకాశవన్నిర్మల నిర్వికల్ప
నిస్సీమ నిష్పందన నిర్వికారమ్,
అన్తర్బహిఃశూన్య మనన్య మద్వయం
స్వయం పరంబ్రహ్మ కిమస్తి బోధ్యమ్. 394

పరంబ్రహ్మ = పరబ్రహ్మ, ఆకాశవత్ = ఆకాశమువలె, నిర్మల నిర్వికల్పనిస్సీమ నిష్పందన నిర్వికారం=నిర్మలమైనది, నిర్వికల్పమైనది, అనంతమైనది, నిశ్చలమైనది, వికారశూన్యమైనది, అన్తర్బహిఃశూన్యం= లోపలను బయటను శూన్యమైనది, అద్వయం = అద్వితీయమైనది. స్వయం = స్వతఃసిద్ధమైనది. దీనిని తెలిసికొనినపిమ్మట, బోధ్యం = తెలియదగినది, మరియొకటి, కిమస్తి = ఏమి ఉన్నది?

'అన్తర్బహిః శూన్యం' అనునంతవరకును ఉన్న విశేషణములు ఆకాశబ్రహ్మలకు గల సాధర్మ్యమును బోధించునవి. 'అద్వయం' అనునవి బ్రహ్మవిశేషణములు. ఆకాశమువలె నిర్మలమైనది. ఆకాశము ధూల్యాదులచే ఎట్లు ధూసరితము కాదో అట్లే బ్రహ్మ కూడ అజ్ఞానాదులచే స్పృశింపబడనిది. వాస్తవమున, నిర్వికల్పమైనది అనగా ఏకరూపమైనది. నిస్సీమం = అవధిలేనిది. నిఃస్పన్దనం = క్రియారహితమైనది. నిర్వికారం = ఉత్పత్తి-నాశ-వృద్ధి-హ్రాసాదులులేనిది. అన్తర్బహిః శూన్యమ్-పరిచ్ఛిన్నమైన దానికి లోపల అనియు, బయట అనియు విభాగ ముండును. బ్రహ్మ పూర్ణరూపము గాన దీనికి లోన, వెలుపల అనునవి లేవు. ఈ విధముగ దీనికి స్వగతమగు భేదములు - లోపలిభాగము బైటభాగము వంటి భేదములు లేవు. అనన్యాత్ = ప్రత్యగాత్మతో భేదములేనిది. అద్వయం = ద్వితీయరహితము, అనగా విజాతీయ ద్వితీయ వస్తువు లేమియు లేవని యర్థము. స్వయం = స్వతఃసిద్ధమైనది. ఇట్టి పరబ్రహ్మ ఒక్కటి తెలిసినచో అన్నియు తెలియును గాన ఇక తెలియవలసినది ఏదియు ఉండదని భావము, లేదా అనన్యాత్ = సర్వాత్మకమైనది. కావుననే అద్వయం = తనకంటె భిన్నమైన ద్వితీయవస్తువులు లేనిది. అట్టి పరబ్రహ్మయే, స్వయం = జీవాత్మ ఇంతకంటె తెలియవలసినది ఏమున్నది? "సూర్యుడు బాణమువలె వేగముగ పరుగెత్తుచున్నాడు" అని చెప్పినట్లు శ్రోతలబుద్ధికి బాగుగ అర్థమగుటకుమాత్రమే ఆకాశము బ్రహ్మకు దృష్టాన్తముగ చూపబడుచున్నది గాని వాస్తవమున "న తత్సమః" ఇత్యాది శ్రుతుల ననుసరించి బ్రహ్మతో పోల్చదగిన వస్తు వేదియును లేదు, "ప్రతిజ్ఞాహానిరవ్యతిరేకాచ్ఛబ్దేభ్యః" అను బ్రహ్మసూత్రముచే ఆకాశమునకు కూడ ఉత్పత్తి ఉన్నదని సిద్ధాంతీకరింపబడినది. ఐనను లోకమున దాని యుత్పత్తి చూచినవారు ఎవరును లేకపోవుటచే 'ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః' ఇత్యాది శ్రుతులలో ఆత్మ ఆకాశమువలె సర్వవ్యాప్తము, నిత్యము అని చెప్పినట్లుగనే, బ్రహ్మ ఆకాశమువలె నిర్వికారమని చెప్పుటలో దోష మేమియు లేదు,

వక్తవ్యం కిము విద్యతేఽత్ర బహుధా బ్రహ్మైవ జీవః స్వయం
బ్రహ్మైతజ్జగదాపరాణు సకలం బ్రహ్మాద్వితీయం శ్రుతేః,
బ్రహ్మైవాహమితి ప్రబుద్ధమతయః సన్త్యక్తబాహ్యాః స్ఫుటం
బ్రహ్మీభూయ వసన్తి సన్తతచిదానన్దాత్మనైవ ధ్రువమ్. 395

అత్ర = ఈ విషయమున, బహుధా = అనేకవిధములుగా (అధికముగా). వక్తవ్యం = చెప్పదగినది, కిము విద్యతే = ఏమి ఉన్నది? జీవః = జీవుడు, స్వయం = తాను, బ్రహ్మైవ = బ్రహ్మయే, అపరాణు = పరమాణువువరకును, సకలం = సమస్తమైన, ఏతత్ = ఈ, జగత్ = జగత్తు, బ్రహ్మ = బ్రహ్మయే, శ్రుతేః = శ్రుతివలన, బ్రహ్మ = బ్రహ్మ, అద్వితీయం = ద్వితీయరహితమైనది. "అహమేవ బ్రహ్మ" = నేనే బ్రహ్మను, ఇతి = అని, ప్రబుద్ధమతయః = తెలిసికొనిన బుద్ధికలవారు, స్ఫుటం = పూర్తిగా, సన్త్యక్తబాహ్యాః = విడువబడిన బాహ్యప్రపంచము కలవారై, బ్రహ్మీభూయ = బ్రహ్మగా అయి, సంతతచ్చిదానన్దాత్మనైవ = అవిచ్ఛిన్నమైన చిదానంద స్వరూపము తోడనే, వసన్తి = నివసింతురు, ధ్రువం = నిశ్చయము.

అత్ర = ఈ బ్రహ్మైకత్వవిషయమున, బహుధా = అనేకప్రకారములచే, చెప్పవలసినది ఏమున్నది. మనస్సునకు బాగుగ పట్టుటకై సర్వవేదాన్తముల తాత్పర్యగోచరమగు విషయము, అనేక దృష్టాంతములతో ప్రతిపాదింపబడినది. దానినే సంగ్రహముగ చెప్పుచున్నాడు-విస్తరముగను, సంగ్రహముగను చెప్పబడిన విషయమును బాగుగ తెలిసికొనుటకు అవకాశముండునని చెప్పుదురు.

"శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రన్థకోటిభిః,
బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః."

కోటిగ్రంథములలో చెప్పిన విషయమును శ్లోకార్ధములో చెప్పెదను. బ్రహ్మయే సత్యము; జగత్తు మిథ్య; జీవుడు బ్రహ్మయే; భిన్నుడు కాదు, జీవుడు తాను బ్రహ్మయే; జీవత్వము ఉపాధి కల్పితము. సర్పము యొక్క యథార్థస్వరూపము రజ్జువైనట్లు జీవుడని అను

కొనువాని యొక్క వాస్తవస్వరూపము బ్రహ్మయే. కావున జీవుడు తాను బ్రహ్మయే కాని తద్భిన్నుడు కాడు. పరమాణువువరకును, ఈ వియదాది ప్రపంచమంతయు బ్రహ్మయే. "సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలానితి శాన్త ఉపాసీత" అను శ్రుతి ననుసరించి, ఆ బ్రహ్మనుండి పుట్టి, దానియందు నిలిచి, దానియందే లీనమగుటచే ఈ సర్వప్రపంచమును బ్రహ్మయే. అనాదియగు అజ్ఞానాదికము గూడ అధిష్ఠానమగు బ్రహ్మపై కల్పితమేగాన దానికంటె అతిరిక్తము కాదు. కావున బ్రహ్మ, అద్వితీయం. తత్త్వమసి', 'అయమాత్మా 'బ్రహ్మ, ఇదం సర్వం యదయమాత్మా', 'ఆత్మైవేదం సర్వమ్', బ్రహ్మైవేదం సర్వమ్', 'ఏకమేవాద్వితీయమ్' ఇత్యాది శ్రుతుల ననుసరించి స్వవ్యతిరిక్తమగు వస్తువులు లేనిది 'నేనే బ్రహ్మను' అని, ప్రబుద్ధమతయః = శ్రుత్యాచార్యోపదేశములచే జ్ఞేయమును తెలిసికొనిన బుద్ధికలవారు, స్ఫుటం = వాసనాసహితముగ, సన్త్యక్త బాహ్యాః = విడువబడిన అహంకారాదులు కలవారై, బ్రహ్మీభూయ = పూర్వము అజ్ఞానముచే అబ్రహ్మత్వము కల్పితమైనది, ఆ అభిప్రాయముతో అభూతతద్భావార్థకమగు చ్విప్రత్యయము ప్రయుక్తమైనది, సాక్షాత్కరింపచేసికొనబడిన బ్రహ్మత్వము కలవారై, సన్తతచిదానన్దాత్మనైవ = అవిచ్ఛిన్నమగు చిదానందస్వరూపముతోడనే, నివసింతురు, అని విద్వదనుభవము చెప్పబడినది. ఇది, ధ్రువం = నిశ్చయము లేదా- ధ్రువం = నిశ్చలముగ, 'వసన్తి' అనుదానితో అన్వయము పూర్తిగ బాహ్యవస్తువులను పరిత్యజించుటచే బ్రహ్మరూపమున స్థిరముగ నుందురు అని యర్థము.

జహి మలమయకోశేఽహంధియోత్థాపితాశాం
ప్రసభ మనిలకల్పే లింగదేహేఽపి పశ్చాత్,
నిగమగదితకీర్తిం నిత్యమానన్దమూర్తిం
స్వయమితి పరిచీయ బ్రహ్మరూపేణ తిష్ఠ. 396

మలమయకోశే=మలభూయిష్ఠమైన స్థూలదేహమునందు, అహంధియా=అహంకారముచే, ఉత్థాపితాశాం=కలిగింపబడిన ఆశను, ప్రసభం=బలాత్కారముగ, జహి=నశింపజేయుము. పశ్చాత్=అటుపిమ్మట, అనిలకల్పే=వాయువుతో సమానమైన, లింగదేహేఽపి=లింగదేహమునందు కూడ, ఆశను విడువుము. నిగమగదితమూర్తిం=వేదములచే కొనియాడబడిన కీర్తిగల, నిత్యం ఆనన్దమూర్తిం=నిత్యమైన ఆనందస్వరూపమును: స్వయమితి=తానే అని, పరిచీయ=నిశ్చయించి, బ్రహ్మరూపేణ=బ్రహ్మరూపముతో; తిష్ఠ=ఉండుము.

మలప్రచారమగు స్థూలదేహమునందును, దాని పోషణాదుల విషయమునను, అహంకారముచే కలిగిన ఆశను, బలాత్కారముగ నశింపజేయుము. అహంకారమును తొలగించుటకై 'మలమయ' అను సాభిప్రాయమగు విశేషణము ప్రయోగింపబడినది. "పిణ్డాణ్డం త్యజ్యతాం మలభాణ్డవత్" అని వెనుక చెప్పబడినది కదా? పశ్చాత్=స్థూలదేహమునకు సంబంధించిన ఆశ నశించిన పిదప, అనిలకల్పే=వాయువువలె అదృశ్యమైన, లింగదేహేఽపి=పదునేడు అవయవములు గల సూక్ష్మశరీరమునందు గూడ, అహంకారాత్మకమగు ఆశను మనస్సునకు అనుకూలమగు విషయములపై ఆశను, నశింపజేయుము. మొదటనే సూక్ష్మమును విడచుట కష్టసాధ్యము. దూరదూరములగు స్థూలపదార్థములను మొదట విడచినచో, పిదప, సన్నిహితములగు సూక్ష్మవస్తువుల త్యాగము సుకరము గాన స్థూలపదార్థములకు సంబంధించిన ఆశలను విడువుమని మొదట చెప్పబడినది. ఈ ఆశకు అహంకారమే కారణమని చెప్పుటచే అసహ్యమును కలిగించు దేహాదికమునందు అహంకారము లేనిచో నిమిత్తము లేకపోవుటచే ఆశయే కలుగదని సూచింపబడినది. శ్రు. "అస్మాల్లోకాత్ప్రేత్య; ఏతమన్నమయ మాత్మాన ముపసంక్రామతి" ఇత్యాది శ్రుతి కూడ పుత్రమిత్రాది బాహ్యపదార్థములయందు అహంబుద్ధిని విడచి దేహమును మాత్రమే ఆత్మగ భావింపవలె ననియు, అటుపిమ్మట దేహముకంటె అంతరమగు

ప్రాణమును ఆత్మగ భావింపవలెననియు, సాధకుల సౌకర్యము కొరకై ఉపదేశించినది. అదే క్రమమున మొదట దేహముకొరకై ఉపయోగించు ధనము, పుత్రులు మొదలగు విషయములందు ఆశను త్యజింపవలెను. వాటియందు ఆశనే విడువ వలెనన్నచో వాటి విషయమున అహంకారమును విడువ వలెనని వేరే చెప్పవలెనా? అటుపైన స్థూలశరీరము విషయమున అహంకారమును, ఆశను విడువవలెను. అటుపిమ్మట ప్రాణమయ-మనోమయ-విజ్ఞానమయములతో కూడి యున్న సూక్ష్మశరీరవిషయమున, పంచకోశవివేకప్రకరణమునందు చెప్పిన యుక్తులచే, అహంకారమును, ఆశను నశింప జేసికొనవలెను. "నేను లేకుండపోకూడదు; నేను ఎల్లప్పుడును ఉండవలెను" అని ప్రతివానికిని ఆత్మయందు (తనయందు) అత్యధికమగు ప్రేమ ఉండును. స్థూలశరీరాదులందు అహంభావమున్నచో ఈ ప్రేమ వాటియందే ఉండునుగాన వాటి విషయమున ఆశను విడచుటకు శక్యము కాదు. అందుచే, క్రమముగ విచారణచేయగా దృఢమగు వివేకజ్ఞానము జనించి స్థూలసూక్ష్మశరీరములపై అహంకారము తొలగిపోవును. ప్రియము, మోదము మొదలగు అవయవములతో గూడిన ఆనందమయము గూడ సావయవము, ఔపాధికము గాన అదికూడ అనిత్యమే అను నిశ్చయము కలుగుటచే దానిపై కూడ అహంకారము కలుగదు. ఈ విధముగ పంచకోశములు ఆత్మభిన్నములే యని నిశ్చయించి, నిగమగదితకీర్తిం = వేదములచే చెప్పబడిన సర్వజ్ఞత్వము, సర్వశక్తత్వము, సర్వప్రాణి ప్రాణయితృత్వము, సర్వ ప్రశాస్తృత్వము, విశిష్టసగుణాధిష్ఠానత్వము, సచ్చిదానన్దఘనత్వము, వాఙ్మనసాగోచరత్వము, నిరాధారత్వము, నిర్గుణత్వము, నిష్కలత్వము, నిర్వికల్పత్వము, నిరంజనత్వము, సూక్ష్మతమత్వము, నిత్య-శుద్ధ-బుద్ధ - ముక్త - సత్యానన్దస్వభావత్వము మొదలగు రూపములుగల కీర్తి కలిగినట్టియు, నిత్యం ఆనన్దమూర్తిం = నిత్యమైనదియు ఆనందమూర్తియైనదియు నగు ఇట్లు చెప్పుటచే ఆనందమయకోశము

అనిత్యము కాన దానిని నిరాకరించినట్లైనది; పరమాత్మను, స్వయమితి = స్వస్వరూపమే అని, పరిచీయ = నిశ్చయించి, సాక్షాత్కరించుకొని, బ్రహ్మరూపమున ఉండుము. పంచకోశములు కూడ ఆత్మభిన్నములని నిషేధించిన పిదప బ్రహ్మయే ఆత్మయని కూడ అంగీకరింపనిచో నైరాత్మ్యవాదము (ఆత్మయే లేదను వాదము) ప్రసక్తమగును గాన బ్రహ్మరూపమున ఉండవలెను. కావుననే 'అసన్నేవ స భవతి' ఇత్యాది శ్రుతి బ్రహ్మ లేదనువాడు అసద్రూపుడగును అని చెప్పుచున్నది.

శవాకారం యావద్భజతి మనుజస్తావదశుచిః
పరేభ్యస్స్యాత్క్లేశో జననమరణ వ్యాధినిరయాః,
యదాత్మానం శుద్ధం కలయతి శివాకారమచలం
తదా తేభ్యో ముక్తో భవతి హి తదాహ శ్రుతిరపి. 397

మనుజః = మానవుడు, యావత్ = ఎంతకాలమువరకును, శవాకారం = శవాకారమును, అనగా స్థూలదేహ తాదాత్మ్యబుద్ధిని, భజతి = పొందునో, తావత్ = అంతవరకును, అశుచిః = అపవిత్రుడై యుండును. పరేభ్యః = ఇతరులవలన, క్లేశః = దుఃఖము, స్యాత్ = కలుగుచుండును. జననమరణవ్యాధినిరయాః = జననము, మరణము, వ్యాధులు, నరకము (కలుగుచుండును), యదా = ఎప్పుడు, ఆత్మానం = తనను, శుద్ధం = శుద్ధమైనవానినిగను, శివాకారం = శివస్వరూపునిగను, అచలం = చాంచల్యరహితునిగను, కలయతి = గ్రహించునో, తదా = అప్పుడు, తేభ్యః = ఆ అశుచిత్వాదులనుండి, ముక్తః = విముక్తుడై, భవతి = అగును. శ్రుతిరపి = శ్రుతి కూడ, తత్ = ఆ విషయమును, ఆహ హి = చెప్పుచున్నది కదా!

మానవుడు ఎంతవరకును చైతన్యహీనమగు స్థూలదేహ తాదాత్మ్యముతో శవత్వమును పొందునో, అనగా పాదాంగుష్ఠము మొదలు శిరస్సువరకును ఉన్న శరీరమే నేను అనెడు బుద్ధితో శవాకారమును పొందునో, అంతవరకును, మలమయమగు ఆ శరీరము

అశుచి యగుటచే, తాను వాస్తవమున శుచియైనను, శరీరతాదాత్మ్య బుద్ధిచే అశుచి యగును. మరియు, పరేభ్యః = శత్రువ్యాఘ్రాదుల వలన, క్లేశము కలుగును. జననమరణవ్యాధి నిరయాః - ఈ లోకమున జన్మమరణవ్యాధులు కలుగును. దేహమును ఆత్మగా భావించువాడు "యోఽన్యథా సన్తమాత్మానం" అను స్మృతి ననుసరించి పాపవంతుడు గాన, అతనికి దేహపాతానంతరము నరకము వచ్చును. ఈ విధముగ అతనికి ఎప్పటికిని దుఃఖమే. "న హ వై సశరీరస్య సతః ప్రియాప్రియయో రపహతి రస్తి" - శరీర మున్నంతవరకును, అనగా శరీరాభిమాన మున్నంతవరకును ప్రియాప్రియములు తొలగవు అని శ్రుతి చెప్పుచున్నది.

> "న సాంపరాయః ప్రతిభాతి బాలం
> ప్రమాద్యన్తం విత్తమోహేన మూఢమ్,
> అయం లోకో నాస్తి పర ఇతి మానీ
> పునః పున ర్వశమాపద్యతే మే."

ధనాశచే విమూఢుడై, ఏమరుపాటుతో ఉన్న తెలివితక్కువ వానికి పారలౌకికదృష్టియే ఉండదు. వాడు ఇదే లోకము, మరి యే లోకములును లేవు. అనుకొనుచుండును. అట్టివాడు మాటిమాటికిని నా వాతబడుచుండును అని యమవచనరూపమగు శ్రుతికూడ చెప్పుచున్నది. ఎప్పుడు సాధనచతుష్టయసంపన్నుడై యథాశాస్త్రముగ గురువును సమీపించి, ఆతని ముఖారవిందమునుండి వెలువడిన ఉపనిషద్వాక్యములచేతను, వాటిని అనుసరించిన యుక్తులచేతను, ఆత్మ దేహత్రయాతీతమగుటచే శుద్ధమైనదనియు, శివాకారం = ఆనందస్వరూపమైనదనియు, అచలం = ప్రమాదమేమియు లేని విధమున (అనగా నిశ్చితరూపమున) ఎపుడు తెలిసికొనునో, అపుడు, తేభ్యః = పరులవలన కలుగు క్లేశముల నుండియు, జన్మమరణవ్యాధి నరకముల నుండియు ముక్తుడగును. ఈ విషయమును, శ్రుతిరపి = శ్రుతి కూడ, చెప్పుచున్నది.

లేదా 'అపి' శబ్దమును 'తత్' అనుదానితో అన్వయించి, తదపి=దానిని కూడా, అను నర్థమును చెప్పినచో, "పూర్వార్థమునందు చెప్పిన విషయమునుకూడ శ్రుతి చెప్పుచున్నది" అని భావము. 'అపి' శబ్దమును ఉన్నట్లుగనే 'శ్రుతిః' అనుదానితో అన్వయించి 'శ్రుతిరపి'=శ్రుతి కూడ, చెప్పుచున్నది అను నర్థమును చెప్పినచో-"అనుభవము, గురువులు మాత్రమేకాక శ్రుతికూడ ఈ విషయమునే చెప్పుచున్నది" అని భావము. లేదా 'అపి' శబ్దమును 'ఆహ' అను క్రియాపదముతో అన్వయించి, ఆహాపి=చెప్పుచున్నది కూడ అని అర్థము చెప్పవలెను. "అశరీరం వా వ సన్తం న ప్రియాప్రియే స్పృశతః"-శరీరాభిమానము లేనివానిని ప్రియాప్రియములు ముట్టజాలవు, "ఆనన్దం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన" బ్రహ్మయొక్క ఆనందస్వరూపత్వమును తెలిసికొనినవాడు దేనినుండియు భయపడడు, "తరతి శోక మాత్మవిత్"-ఆత్మజ్ఞానము కలవాడు శోకమును తరించును. "జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాపైః"-ఆత్మను తెలిసికొనిన పిమ్మట సర్వపాపముల నుండియు విముక్తుడగును, "తమేవం విద్వానమృత ఇహ భవతి"-ఆత్మను సాక్షాత్కరించుకొనినవాడు ఇచటనే ముక్తిని పొందును, "క్షీణైః క్లేశైర్జన్మమృత్యుప్రహాణిః"-పాపములు క్షీణించుటతో జన్మమరణములు తొలగిపోవును, "జ్ఞాత్వా శివం శాన్తి మత్యన్తమేతి"-ఆనందస్వరూపమగు ఆత్మను తెలిసికొనిన పిమ్మట శాశ్వతమగు శాంతిని పొందును ఇత్యాది శ్రుతులును,

"సమానే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి ముహ్యమానః,
జుష్టం యదా పశ్యత్యన్యమీశ మస్య మహిమాన మితి వీతశోకః."

ఈశ్వరునితోకలిసి ఒకే వృక్షమున, అనగా శరీరమున, ఉన్న జీవుడు మాయచే మోహితుడై దుఃఖితు డగును. ఆ వృక్షమునందే ఉన్న ఈశ్వరుని ఎపుడు చూచునో, ఆతని మహిమను తెలిసికొనును; దుఃఖరహితు డగును అను శ్రుతియు చెప్పుచున్నవి. ఆత్మజ్ఞానము లేనిచో

దుష్ఫలమనియు, ఆత్మ యాథాత్మ్యజ్ఞానమున్న దుఃఖము పూర్తిగ తొలగిపోవు ననియు చెప్పుచు ఈ శ్లోకము పూర్వశ్లోకోక్తమగు విషయమును, ఫలప్రతిపాదనముద్వారా సమర్థించుచున్నది.

అవ. ఆత్మ శుద్ధ శివాకార మెట్లగును అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు

## ప్రపంచబాధ

స్వాత్మన్యారోపితాశేషాభాసవస్తునిరాసతః,
స్వయమేవ పరంబ్రహ్మ పూర్ణ మద్వయ మక్రియమ్. 398

స్వాత్మని=తన ఆత్మయందు, ఆరోపితా....నిరాసతః, ఆరోపిత= కేవలము అజ్ఞానముచే కల్పితములగు, అశేష = సమస్తమైన, ఆభాస వస్తు=ఆత్మభిన్నములైన పదార్థములయొక్కయు, ధర్మములయొక్కయు, నిరాసతః =శ్రుతియుక్తులచేతను నిదిధ్యాసనముచేతను నశింపజేయుటవలన, స్వయమేవ = తానే, పూర్ణం = పూర్ణమైనదియు, అద్వయం = ద్వితీయ రహితము, అక్రియం = క్రియాశూన్యమును అగు, పరంబ్రహ్మ = పరబ్రహ్మ యగును.

"అన్వేష్టవ్యాత్మవిజ్ఞానాత్ ప్రాక్ప్రమాతృత్వమాత్మనః,
అన్విష్టః స్యాత్ ప్రమాతైవ పాప్మదోషాదివర్జితః.
గౌణమిథ్యాత్మనోఽసత్త్వే పుత్రదేహాదిబాధనాత్,
సద్ బ్రహ్మాత్మాహమిత్యేవం బోధే కార్యం కథం భవేత్."

ఆత్మకు జ్ఞాతృత్వ మనునది అన్వేషింపదగిన ఆత్మయొక్క జ్ఞానము కలుగుటకు పూర్వము మాత్రమే ఉండును. పాపదోషాదిశూన్యుడగు ఆ అన్విష్టుడైన ఆత్మ, వాస్తవమున, (ఆ అన్వేషణముచేయు) ప్రమాతయే. గౌణాత్మ మిథ్యాత్మలు తొలగిపోయిన పిమ్మట పుత్రదేహాదులు బాధితములగును గాన, సద్బ్రహ్మరూపమగు ఆత్మయే నేను అను జ్ఞానము కలిగిన పిమ్మట ఇక కార్య మేమి ఉండును అని సాంప్రదాయికవచనము చెప్పు

చున్నది. "అథాయమశరీరోఽమృతః ప్రాణో బ్రహ్మైవ తేజ ఇవ"- శరీరరహితమగు ఈ ఆత్మయే అమృతస్వరూపుడు, ప్రాణము, బ్రహ్మ తేజస్సు వంటివాడు అని శ్రుతికూడ చెప్పుచున్నది.

అవ. ప్రారంభమున ప్రయత్నపూర్వకముగ దృశ్యప్రపంచమును నిరోధించి సమాధినిచేసి, దానియందే ఉన్నదానికి పూర్వము భాసించినను, దృశ్యము శశవిషాణము వంటిది అగును అని చెప్పుచున్నాడు..

సమాహితాయాం సతి చిత్తవృత్తౌ
పరాత్మని బ్రహ్మణి నిర్వికల్పే,
న దృశ్యతే కశ్చిదయం వికల్పః
ప్రజల్పమాత్రః పరిశిష్యతే తతః. 399

సతి = అబాధ్యము, పరాత్మని = నిర్వికల్పము అగు, బ్రహ్మణి = బ్రహ్మయందు, చిత్తవృత్తౌ = చిత్తవృత్తి, సమాహితాయాం=నిశ్చలముగ నిలుపబడినదగుచుండగా, అయం = ఈ, వికల్పః =వికల్పము, కశ్చిదపి= ఏదియు, న దృశ్యతే = కనబడదు, తతః = అటుపిమ్మట, ప్రజల్పమాత్రః = పేరుమాత్రమే, పరిశిష్యతే = శేషించును. సూ. "శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః"-వస్తువు లేకపోయినను శబ్దజ్ఞానము వలన మాత్రముకలుగు జ్ఞానము వికల్పము అని వికల్పమునకు లక్షణము. ఉదా. కుందేటి కొమ్ము అను పదార్థ మొకటి లేదు. అయినను 'శశవిషాణం' అను మాట వినగనే ఒకానొక జ్ఞానము కలుగుచున్నది- అదియే వికల్పము. అజ్ఞానము పూర్తిగ నశించిపోవుటచే కల్పితములగు దేహాదులతో తాదాత్మ్యబుద్ధి కూడ ఉండదుగాన అపుడు కేవలము అఖండమైన సచ్చిదానందము మాత్రమే ఉండునని యభిప్రాయము. అసత్తగు గగనకుసుమాదికము ఏ కార్యమును సాధింపజాలదు. అట్లే పూర్వ మొకానొకప్పుడు సుఖ-దుఃఖ-రాగ-భయ-క్రోధాదికమును కలిగించిన దృశ్యజాతముకూడ ఇపుడు బ్రహ్మనిష్ఠుడైనవాని విషయమున కోఱలుపీకిన పామువలె ఏమియు చేయజాలదని భావము.

అవ. అనాత్మవాసనలు క్షీణించిపోవుటచే, ఈ విధముగ ఉపదేశధారలచే అంతఃకరణమునందు అద్వైతవాసన నెలకొనిన శిష్యునకు సకలవేదాంతములును ఐకకంఠ్యముగ ప్రతిపాదించుచున్న 'ద్వైతమనునది ఏ మాత్రము లేదు", అను విషయమును అనుభవ-యుక్తి-దృష్టాన్త-శ్రుతులచే ఉపదేశించుచున్నాడు–

అసత్కల్పో వికల్పోఽయం విశ్వ మిత్యేకవస్తుని,
నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదా కుతః. 400

విశ్వం ఇతి = ప్రపంచమనునది ఏది కలదో, అయం = ఇది, ఇచట 'విశ్వం' అనునది నపుంసకలింగమైనను విధేయమగు 'వికల్పః' అనునది పుంలింగ మగుటచే దాని ప్రాధాన్యమును పురస్కరించుకొని 'అయం' అని పుంలింగ శబ్దము ప్రయోగింపబడినది. వికల్పః = 'వివిధం కల్ప్యతే ఇతి వికల్పః' అను విగ్రహముచే అజ్ఞానకల్పితమే కాని వాస్తవమైనది కాదు అని యర్థము. అసత్కల్పః=కొంచెము ఇంచుమించుగ లేనిదే. బ్రహ్మమునందు నిరంతర సమాహితమనస్కులై ఏడవభూమికను చేరిన వారికి ఈ ప్రపంచభాన మే మాత్రము ఉండదు. అందుచే వారికి సంబంధించినంత వరకు శశవిషాణము వంటిది. ఇతరులకు సంబంధించినంత వరకు ఈ ప్రపంచము శుక్తిపై ఆరోపితమగు రజతమువలె కనబడి వెంటనే నష్టమగు స్వరూపము కలదగుటచే ప్రాతిభాసికము. కావున 'అసన్నేవ' (లేనిది) అని చెప్పక "అసత్కల్పః"-ఇంచుమించు లేని దానివంటిదే అని చెప్పబడినది. కావున మిథ్యయగు ప్రపంచమును బట్టి బ్రహ్మకు సద్వితీయత్వము ఉండదు గాన-ఏకవస్తుని=ఒకే ఒక వస్తువును, నిర్వికారే = వికారరహితమును, నిరాకారే = ఆకారరహితమును, నిర్విశేషే=విశేషరహితమును అగు-అనగా గుణగుణిభావము, అవయవావయవిభావము, జాతివ్యక్తిభావము మొదలగునవి లేనిదగు- ఆత్మయందు జగత్తాదాత్మ్యము గూడ లేదు గాన, భిదా = భేదము, కుతః = ఎట్లు?

ద్రష్టృదర్శనదృశ్యాదిభావశూన్యైకవస్తుని,
నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదా కుతః. 401

"ద్రష్టృ.. వస్తుని"– 'ద్రష్ట' యనగా ప్రమాత. దర్శనము అనగా ప్రమితి అనగా జ్ఞానము. దృశ్యము అనగా ప్రమేయము– తెలియ దగినది. ఆదిపదముచే ప్రమాణములను గ్రహింపవలెను. లేదా కర్తృ-కరణ-కార్యములను గ్రహింపవలెను. ఇవి యన్నియు అవిద్యావస్థలో మాత్రమే ఉండును. వాస్తవమున "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్"– "ఈతని కంతయు ఆత్మస్వరూపముగనే గోచరించుచున్నపుడు, దీనిని దేనితో చూచును? అను శ్రుతి వాక్యము ననుసరించి నిర్వికల్పము, కేవలాఖండ చిన్మాత్రమును అగు ఆత్మయందు జ్ఞానావస్థలో అజ్ఞానము నశించుటచే, దానినిబట్టి ఏర్పడిన ద్రష్ట, దర్శనము, దృశ్యము మొదలగు భావములు ఉండవు. ఈ విధముగ ద్రష్టృ-దర్శన-దృశ్యాదిరూపములగు భావములతో శూన్యమగు ఏ ఏకవస్తువుకలదో అట్టి, నిర్వికారే=వికారశూన్యము, నిరాకారే=అవయవములకలయికచే నేర్పడు ఆకారము లేనిదియు, నిర్విశేషము అగు ఆత్మయందు భేద మెట్లుండును? ఉండుటకు అవకాశము లేదని యర్థము. ఆత్మ ప్రకృతి, జగత్తు వికృతి- అనెడు ప్రకృతి వికృతి భావాదులు లేకపోవుటచే భేదప్రసక్తి ఏమియు లేదని భావము.

కల్పార్ణవ ఇవాత్యన్తపరిపూర్ణైకవస్తుని,
నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదా కుతః. 402

నిర్వికారము, నిరాకారము, నిర్విశేషము అయినదియు, కల్పార్ణవే ఇవ=ప్రళయకాలసముద్రమువలె, పరిపూర్ణైకవస్తుని=అంతటను నిండియున్న ఏకైకవస్తువగు, ఆత్మయందు భేద మెట్లు?

ప్రళయకాలమున నాలుగు సముద్రములును కలిసిపోయి, నడుమ ద్వీపములేవియు లేకుండుటచే జగత్తునంతను జలమయము చేయును అని పురాణములవలన తెలియుచున్నది. అపుడు అంతటను జలమేగాని భూభాగమేమియు ఉండదు. భూమిభాగము కనబడు నపుడు వేరువేరుగనుండెడు సముద్రము లన్నియు ఇపుడు ఒక్కటిగ అయిపోవుటచే 'కల్పార్ణవః' అని ఏకవచనప్రయోగము చేయబడినది.

అపుడుకూడ ఆకాశాదికము ఉన్నను, సూర్యుడు బాణమువలె పరుగెత్తుచున్నాడు అని చెప్పినవిధమున, శ్రోతల బుద్ధికి బాగుగ పట్టుటకై అంతట జలమయముగ నుండును అని చెప్పబడినది. 'జ్యాయానాకాశాత్'—ఆకాశముకంటె పెద్దది, "పాదోఽస్య సర్వా భూతాని త్రిపాద స్యామృతం దివి" – ఈ సకల భువనములును ఈ పురుషుని నాల్గవ పాదము, ఈతని మూడువంతుల భాగము సకల భావనాతీతమై యున్నది ఇత్యాది శ్రుతులచే సాటిలేని బృహత్త్వము కలదియు, నిర్వికారము, నిరాకారము, నిర్విశేషము నగు ఏకవస్తువగు పరమాత్మ యందు భేద మెట్లుండును?

అవ. భేదము పూర్వముకూడ లేదు. కాని అపుడు భేద భ్రాంతికి కారణమగు అజ్ఞానము ఉండెను. ఇపుడు ఆ అజ్ఞానము సమూలముగ నశించిపోవుటచే భేదభ్రాంతికూడ లేదు అని చెప్పుచున్నాడు—

తేజసీవ తమో యత్ర విలీనం భ్రాన్తికారణమ్,
అద్వితీయే పరే తత్త్వే నిర్విశేషే భిదా కుతః. 403

'తమః' శబ్దమునకు అజ్ఞానము, అంధకారము అనికూడ అర్థము. యత్ర = ఏ పరమాత్మయందు, భ్రాంతికారణం = భ్రాంతికి కారణమైన, తమః = అజ్ఞానము, తేజసి = సూర్యాదిప్రకాశమునందు, తమః ఇవ = అంధకారమువలె, విలీనం = అణగిపోయినదో, అట్టి, నిర్విశేషే = విశేషరహితమగు, అద్వితీయే = ద్వితీయరహితమైన, పరే తత్త్వే = పరతత్త్వమునందు, భిదా = భేదము, కుతః = ఎట్లుండును?

"విభేదజనకేఽజ్ఞానే నాశ మాత్యన్తికం గతే,
ఆత్మనో బ్రహ్మణో భేదం అసన్తం కః కరిష్యతి."

భేదజనకమగు అజ్ఞానము పూర్తిగ నశించిపోయిన పిమ్మట జీవాత్మకును బ్రహ్మకును మధ్య ఏ మాత్రమును లేని భేదమును ఎవరు కల్పింపగలరు ఇత్యాది వాక్యములుగూడ ఇందులకు ప్రమాణము.

ఏకాత్మకే పరే తత్త్వే భేదవార్తా కథం భవేత్,
సుషుప్తౌ సుఖమాత్రాయాం భేదః కేనావలోకితః. 404

ఏకాత్మకే=ఏకైక స్వరూపమైన, పరే తత్త్వే=పరతత్త్వమునందు, భేదవార్తా=భేదమనెడు మాట కూడ, కథం భవేత్=ఎట్లుండును? సుఖమాత్రాయాం=కేవల సుఖరూపమైన, సుషుప్తౌ=సుషుప్తియందు, భేదః=భేదము, కేన=ఎవనిచే, అవలోకితః=చూడబడినది.

"యద్వై తన్న పశ్యతి పశ్యన్వై తన్న పశ్యతి,
న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం య త్పశ్యేత్."

దానిని చూచుట లేదనగా-చూచెడు శక్తియున్నను దానిని చూచుట లేదు. రెండవది ఏమైన యున్నకదా దేనినైన వేరుగ చూచుటకు? అని శ్రుతిలో చెప్పిన విధమున సుషుప్త్యవస్థలో ప్రపంచమునుచూచుట లేదనగా అందులకు కారణము ఆత్మ, తార్కికమతమునందువలె, జడమగుట కాదు. ఏలన సుషుప్తిలోకూడ నిత్యజ్ఞానస్వరూపము, స్వయం ప్రకాశము అగు ఆత్మ ఉండనే ఉన్నది. అందుచేత రెండవదేదైన ఉన్నచో ఆత్మ దానిని చూచియుండెడిది. కాని అట్టి ద్వితీయవస్తు వేదియును లేదు. అజ్ఞానమున్నను అది విభక్తముగ (వేరుగ) లేదు. శక్తికిని, శక్తిమత్తునకును భేదము లేదుకదా? ఈ విషయమున (పై శ్రుతి వాక్యమునందలి) "తతః అన్యత్ విభక్తమ్" అని 'భిన్నము', 'వేరుగ నున్నది' అను పదద్వయము ప్రయుక్తమైనది. సుషుప్త్యవస్థయందు అజ్ఞానోపహితమగు చైతన్యమే సాక్షి. ఆ అజ్ఞానము అధిష్ఠానమగు ఆయాత్మచైతన్యమునందు కల్పితమైనది గాన, కల్పితము అధిష్ఠానము కంటె భిన్నము కాదుకదా? ఆత్మ సర్వావస్థలయందును నిష్ప్రపంచమే (ప్రపంచరహితమే). ఐనను కార్యోపాధులన్నియు లీనమైపోయిన సుషుప్తియందు ఈ విషయమును (ఆత్మ నిష్ప్రపంచ మను విషయమును) గుర్తించుట సులభము గాన, శ్రోతల బుద్ధికి బాగుగ పట్టుటకై సుషుప్త్యవస్థ దృష్టాంతముగ చూపబడినది. జాగ్రదవస్థలో

మున్న పురుషు డెవ్వడైనను సుషుప్త్యవస్థను గూర్చి బాగుగ పరిశీలించి (ఆ అవస్థలో నున్న) అజ్ఞానమును మనస్సుచే వేరుచేసి భావించినచో అపుడు ఆ అజ్ఞానమును అంతఃకరణవృత్తి తొలగించినది గాన ఇక మిగిలినది నిష్ప్రపంచ బ్రహ్మయే కాన అపు డాతని మనస్సు నిష్ప్రపంచబ్రహ్మాకార మైనదని చెప్పవచ్చును. ఆ అవస్థయే జ్ఞానావస్థ. అపుడు కేవలమగు అఖండబ్రహ్మ మనస్సుచే పొందబడును. గాన మనకు కావలసిన అభీష్టము అనగా నిష్ప్రపంచ బ్రహ్మసాక్షాత్కారము, సిద్ధించినట్లే అని శ్రుతియొక్క అభిప్రాయము. విక్షేపము లేకపోవుట అనునది సుషుప్తియందును, సమాధియందును తుల్యమే. కాని సుషుప్త్యవస్థలో ఆవరణ ముండును; సమాధ్యవస్థలో ఉండదు; ఇదియే ఈ రెండింటికిని గల భేదము. కావుననే "నిద్రా సమాధిస్థితిః"_ నిద్రయే సమాధి అని చెప్పబడినది. జాగ్రదవస్థలోనున్న మనుష్యుడు సుఖమయమైన సుషుప్తిని గూర్చి చాలకాలము నిరంతరచింతనము చేసినచో ఆతనికి సమాధి కలుగును అను నభిప్రాయముతో చెప్పినది ఈ వాక్యము. కావున ఏకాత్మకమగు పరతత్త్వమునందు వికార_ ఆకార_విశేషము లేవియు లేవు గాన భేదమే ఉండుటకు అవకాశము లేనిచో, దాని వార్తమాత్ర మెట్లుండును?

"యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽ
నిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విన్దతే
అథ సోఽభయం గతో భవతి."

దృశ్యము కానిదియు, అనాత్మభిన్నమును నిర్వచింప శక్యము కానిదియు, ఆధారరహితమును అగు ఈ ఆత్మస్వరూపమునందు స్థితిని పొందినచో అపు డాతడు అభయస్థితిని పొందును. "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా" ఇత్యాది శ్రుతులు భేదాభావమును బోధించుచున్నవి. భేదము సత్యమేయైనచో అది సుషుప్త్యవస్థలో కూడ భాసింపవలెను. "న కించి దవేదిషమ్"_

నా కేమియు తెలియలేదు అనెడు భావము కలుగుటచే సుషుప్త్య వస్థలో అజ్ఞానము (వేరుగ) భాసించుచున్నది కదా అని ఆశంకింప రాదు. ఏలన కేవల జ్ఞానస్వరూపమైన సమాధ్యవస్థలో ఆ అజ్ఞానము కూడ దగ్ధమై పోయినదిగాన అదికూడ సత్యము కాదు. ఈ విధముగ అజ్ఞానము అజ్ఞానకార్యములును పూర్తిగ నశించిపోవుటచే-

"ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా"

మొదటను చివరను లేనిది ఇపుడు కూడ లేనిదే అని చెప్పిన విధమున ఇపుడు లేదు; పూర్వము కూడ ఉండలేదు; మున్ముందు ఉండబోదు. ఈ విధముగ 'మూడు కాలములందును లేకుండుట' అనెడు మిథ్యాత్వము సిద్ధించినదని యభిప్రాయము.

అవ. ఈ విషయమునే సమర్థించుచున్నాడు -

న హ్యస్తి విశ్వం పరతత్త్వబోధాత్
సదాత్మని బ్రహ్మణి నిర్వికల్పే,
కాలత్రయే నాప్యహి రీక్షితో గుణే
నహ్యమ్బుబిన్దు ర్మృగతృష్ణికాయామ్. 405

పరతత్త్వబోధాత్ = పరతత్త్వజ్ఞానము కలిగిన పిమ్మట, సదాత్మని = సత్స్వరూపమును, నిర్వికల్పే = వికల్పరహితమును అగు, బ్రహ్మణి = బ్రహ్మయందు, విశ్వం = ప్రపంచము, నాస్తి హి = లేదు కదా? గుణే = త్రాడు నందు, కాలత్రయేఽపి = మూడు లోకములలో ఏ కాలమునందైనను, అహిః = సర్పము, నేక్షితః = చూడబడలేదు కదా? మృగతృష్ణికాయాం = ఎండమావులయందు, అమ్బుబిన్దుః = నీటిబొట్టైనను, న హి = చూడబడ లేదు కదా?

వస్తుస్వరూపము తెలియవలెనన్నచో సమ్యగ్జ్ఞానము కావలెను. పూర్వము అజ్ఞానమువలన మనస్సునకు భ్రాంతి ఉండెను.

విచారణ చేయగా, దీపకలిక తీసికొని వచ్చిన పిమ్మట తమస్సువలె, అజ్ఞానము నష్టమై పోవును. కావున సద్రూపము, నిర్వికల్పము అగు బ్రహ్మయందు ప్రపంచము, న హ్యాస్తి=లేనే లేదు అని యర్థము. 'పరతత్త్వబోధాత్' అనునది అందులకు ప్రమాణము. పరస్య=బ్రహ్మ యొక్క, శ్రుతిబోధితమగు నిష్ప్రపంచత్వరూపమగు ఏ యథార్థ స్వరూపము కలదో, దానియొక్క, బోధాత్=అనుభవము వలన అని యర్థము. ప్రమాణానుసారముగా అనుభవము కలిగిన పిమ్మట సంశయవిపర్యయాదులు ఉండవు కదా? కావున ప్రపంచము లేనే లేదు. అందులకు దృష్టాంతము-హి=ఏలన, మూడుకాలముల యందును గూడ త్రాడునందు సర్పము కనబడలేదు. ఎండమావులలో ఉదకబిందువు కూడ కనబడుటలేదు. అదేవిధముగ మొదట అజ్ఞాన జనితమగు భ్రాంతిచే ఒక వస్తువు ఉన్నట్లు కనబడినను అది సత్తు కాదు అని భావము. "నాభావో విద్యతే సతః"-సత్తైనచో దానికి అభావ మనునది ఉండదు అను గీతావాక్యము, పండితానుభవము కూడ ఇందులకు ప్రమాణము. "శుక్తిక వెండివలె కనబడుచున్నది; చంద్ర బింబ మొక్కటే యైనను రెండు ఉన్నట్లు కనబడుచున్నది" అను అనుభవమునుబట్టి ఆరోపితమగు వస్తువు మిథ్య యనుటలో వివాదము లేదు. కావున శ్రుతి కూడ-

"యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి,
మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి."

"ఎచట భేదమువలె ఉండునో అచట ఒకడు మరియొక దానిని చూచుట ఉండును", "ఇచట ఎవడు భేదమున్నట్లు చూచునో వాడు మృత్యువునుండి మరల మృత్యువునే చేరుచుండును" అని 'ఇవ' (వలె) శబ్దమును ప్రయోగించుచు ద్వైతప్రపంచ మంతయు మిథ్య యని సూచించుచున్నది.

అవ. ఆ విషయమున స్పష్టమైన అర్థముగల శ్రుతిని ఉదాహరించుచున్నాడు -

మాయామాత్ర మిదం ద్వైత మద్వైతం పరమార్థతః,
ఇతి బ్రూతే శ్రుతిః సాక్షా త్సుషుప్తా వనుభూయతే. 406

ఇదం = ఈ దృశ్యమైన, ద్వైతం = భేదము, మాయామాత్రం = మాయయా మీయతే ఇతి మాయామాత్రం = మాయచే కనబడుచున్నది, పరమార్థతః = సత్యమైనది (వాస్తవమున ఉన్నది), అద్వైతం = భేద రహితమగు బ్రహ్మమే, ఇతి = అని, సాక్షాత్ = వాచ్యముగ, శ్రుతిః = శ్రుతి, బ్రూతే = చెప్పుచున్నది, సాక్షాత్ = ప్రత్యక్షముగ, సుషుప్తౌ = సుషుప్తియందు, అనుభూయతే = అందరిచేతను అనుభవింపబడుచున్నది. కావున ఈ విషయమున వివాదమునకు తావులేదు అని భావము. ఏలన అపౌరుషేయమగుటచే దోషలేశరహితమగు శ్రుతిని అనుసరించియే అనుభవము ఉన్నది.

అవ. "సుషుప్తికాలే సకలే విలీనే తమోఽభిభూతః సుఖరూప మేతి" సుషుప్తిసమయమున, అంతయు విలీనమైపోగా, తమస్సుచే ఆవరింపబడినదై (ఆత్మ) సుఖరూపమును పొందును అను కైవల్యోపనిషద్వాక్యము 'తమోఽభిభూతః' అను శబ్దముచే ఆ సమయమున తమస్సు (అజ్ఞానము) ఉండునని చెప్పుచున్నది కదా అని ఆశంకించుకొని, అచట ఆ తమస్సు కల్పితమే కాని వాస్తవము కాదు; అది సమాధ్యవస్థలో లేదు కదా అని సమాధానము చెప్పుచున్నాడు-

అనన్యత్వ మధిష్ఠానా దారోప్యస్య నిరీక్షితమ్,
పణ్డితై రజ్జుసర్పాదౌ వికల్పో భ్రాన్తిజీవనః. 407

ఆరోప్యస్య = ఆరోపింపబడునది, అధిష్ఠానాత్ = అధిష్ఠానముకంటె అనన్యత్వం = వేరుగ లేకుండుట, రజ్జుసర్పాదౌ = రజ్జుసర్పాదులందు, పండితైః = పండితులచే, నిరీక్షితం = చూడబడినది. వికల్పః = భేద

బుద్ధి, భ్రాన్తిజీవనః = భ్రాంతిమూలకమైనది, భేదజ్ఞానము, సమ్యగ్ జ్ఞానము కాదు గాన భ్రాంతి తొలగి పోయినతోడనే భేదము భాసింపదు.

అవ. భ్రాంతి తొలగుటకు ఉపాయమును చెప్పుచున్నాడు-

## ఆత్మచింతన విధానము

చిత్తమూలో వికల్పోఽయం చిత్తాభావే న కశ్చన,
అతశ్చిత్తం సమాధేహి ప్రత్యగ్రూపే పరాత్మని. 408

అయం = ఈ, వికల్పః = భేదబుద్ధి, చిత్తమూలః = బహిర్ముఖమైన మనస్సే మూలముగా కలది. చిత్తాభావే = చిత్తము లేని సుషుప్త్యవస్థలో, కశ్చన = భేదబుద్ధి ఏదియు, న = లేదు. కావున అవిద్య స్వరూపముచే ఉన్నను చిత్తము లేనపుడు తన కార్యమును చేయజాలదు. ఆ అవిద్య జాగ్రత్స్వప్నావస్థలలో చిత్తరూపమున పరిణమించుచు ప్రపంచమును జనింపజేయుచున్నది. అతః = ఆ కారణమువలన, చిత్తం = చిత్తమును, ప్రత్యగ్రూపే = నాయొక్క స్వరూపమగు, పరాత్మని = పరాత్మయందు, సమాధేహి = నిలుపుము, అపుడు అవిద్యతోపాటు వికల్పములన్నియును బాధితము లగును అని భావము.

అవ. పరమాత్మపై మనస్సును నిలుపుకొనునట్లు చేయుటకై మూడు శ్లోకములలో, మాటలతో పొడుచుచున్నాడు-

కిమపి సతతబోధం కేవలానన్దరూపం
నిరుపమ మతివేలం నిత్యముక్తం నిరీహమ్,
నిరవధి గగనాభం నిష్కలం నిర్వికల్పం
హృది కలయతి విద్వాన్ బ్రహ్మ పూర్ణం సమాధౌ. 409

కిమపి = వర్ణింపశక్యముకానిదియు, సతతబోధం = ఎల్లప్పుడును జ్ఞానస్వరూపమును, కేవలానన్దరూపం = కేవలము ఆనందస్వరూపమును, నిరుపమం = సాటిలేనిదియు, అతివేలం = సమస్తమును దాటియున్నదియు,

నిత్యముక్తం = నిత్యముక్తస్వరూపమును, నిరీహం = ఇచ్ఛాశూన్యమును, నిరవధి = అవధులులేనిదియు, గగనాభం = ఆకాశమువంటిదియు, నిష్కలం = అవయవ శూన్యమును, నిర్వికల్పం = వికల్పశూన్యమును, పూర్ణం = పూర్ణమైనదియు అగు, బ్రహ్మ = బ్రహ్మను, విద్వాన్ = విద్వాంసుడు, సమాధౌ = సమాధిలో, హృది = హృదయమునందు, కలయతి = చూచును.

ప్రకృతివికృతిశూన్యం భావనాతీతభావం
సమరస మసమానం మానసంబంధదూరమ్,
నిగమవచనసిద్ధం నిత్య మస్మత్ప్రసిద్ధం
హృది కలయతి విద్వాన్ బ్రహ్మ పూర్ణం సమాధౌ. 410

ప్రకృతివికృతిశూన్యం = ప్రకృతివికృతులు లేనిదియు, భావనాతీత భావం = ఊహకు అందని స్వభావము కలదియు, సమరసం = సమమైన రసముకలదియు, అసమానం = సాటిలేనిదియు, మానసంబన్ధదూరం = ప్రమాణములయొక్క సంబంధమునకు దూరమైనదియు, నిగమవచన సిద్ధం = శ్రుతివాక్యములచే తెలియునదియు, నిత్యం = నిత్యమైనదియు, అస్మత్ప్రసిద్ధం = నేను అనెడు ప్రత్యయమున గోచరించునదియు, పూర్ణం .... .... కలయతి.

అజరమమర మస్తాభాసవస్తు స్వరూపం
స్తిమిత సలిలరాశిప్రఖ్య మాఖ్యావిహీనమ్,
శమితగుణవికారం శాశ్వతం శాన్త మేకం
హృది కలయతి విద్వాన్ బ్రహ్మ పూర్ణం సమాధౌ. 411

అజరం = జరారహితమును, అమరం = మరణ రహితమును, అస్తాభాసవస్తుస్వరూపం = వికల్పశూన్యవస్తుస్వరూపమును, స్తిమితసలిల రాశిప్రఖ్యం = నిశ్చలమైన సముద్రముతో సమానమైనదియు, ఆఖ్యా విహీనం = నామశూన్యమును, శమితగుణవికారం = శమించిన గుణముల యొక్క వికారములు కలదియు, శాశ్వతం = నిత్యమైనదియు, శాన్తం = శాంతమైనదియు, ఏకం = ఒక్కటియు-పూర్ణం.... .... కలయతి.

(409, 410, 411)-కిమపి=వాక్కులకు గోచరము కానిదియు, సతతబోధం = నిత్యాఖండజ్ఞానస్వరూపమును, కేవలానన్దరూపం = దుఃఖమిశ్రముకాని నిరుపాధికమగు సుఖమనుస్వరూపముకలదియు, ఈ విధముగ స్వయంప్రకాశ నిత్యసుఖరూప మగుటచే ఇది పరమ పురుషార్థమని చెప్పినట్లైనది. నిరుపమం="న తస్య ప్రతిమాస్తి" -దీనికి పోలికలేదు అను శ్రుతివాక్యము ననుసరించి సాటిలేనిదియు, అతివేలం=ప్రపంచపు సరిహద్దులను దాటియున్నదియు, నిత్యముక్తం= ఎన్నడును బంధమనునది లేనిదియు, నిరీహం=కోరికలు లేనిదియు, లేదా క్రియారహితము అని యర్థము; నిరవధి=కాలమునుబట్టి కాని, దేశమునుబట్టి కాని, వస్తువునుబట్టి కాని అంతము లేనిదియు, గగనాభం = ఆకాశముతో సమానమైన దగుటచే సంగము కాని మాలిన్యము కాని లేనిదియు, నిష్కలం=అవయవశూన్యమును, నిర్వికల్పం= వివిధకల్పనాశూన్యమును, పూర్ణమును అగు బ్రహ్మను విద్వాంసుడు సమాధియందు, హృదయమున చూచును. అందుచే నీవు కూడ ఈ విధముగనే చూడుము అని భావము. ప్రకృతి వికృతి శూన్యం= నిత్యము, అవయవరహితము అగుటచే "తదేతద్బ్రహ్మాపూర్వ మన పరమ్"-ఈ బ్రహ్మకు పూర్వము (కారణము) కాని అపరము (కార్యము) కాని లేవు అని శ్రుతి చెప్పినవిధమున ప్రకృతివికృతులు లేనిదియు, భావనాతీతభావం=కల్పనలను దాటిన స్వభావము కలదియు, అనగా ఉపనిషత్సహాయము లేని కేవలతర్కముచే తెలిసికొనుటకు శక్యముకానిది అని యర్థము. సమరసం = ఒకే విధముగ ఉండునదియు, అసమానం=సాటిలేనిదియు, మానసంబంధదూరం= ప్రమాణముల సహాయముచే తెలిసికొన శక్యముకానిదియు; శ్రుతి కూడ ఈ బ్రహ్మను ప్రత్యక్షముగ కాక లక్షణాద్వారా మాత్రమే బోధించుచున్నది కదా?

"ప్రమాతా చ ప్రమాణం చ ప్రమేయం ప్రమితి స్తథా,
యస్య ప్రసాదాత్సిధ్యన్తి తత్సిద్ధౌ కిమపేక్ష్యతే."

ప్రమాత (తెలిసికొనువాడు), ప్రమాణము (తెలిసికొనుసాధనము), ప్రమేయము (తెలియదగినది), ప్రమితి (తెలిసికొనుట) అనునవి ఏ ఆత్మయొక్క అనుగ్రహముచే సిద్ధించుచున్నవో అట్టి ఆత్మయొక్క జ్ఞానము విషయమున వేరేమి అపేక్షింపబడును? అని సురేశ్వరాచార్యులు చెప్పినవిధమున స్వయంసిద్ధమగు ఆ ప్రత్యగాత్మవిషయమున తెలియదగినది, తెలిసికొనువాడు, తెలిసికొనుట మొదలగు భేదములను తొలగించు శ్రుతికూడ తాటస్థ్యమును వహించును గాని ప్రత్యక్షముగ దానిని బోధింపజాలదు. లేదా- 'మానసంబంధదూరం' అనునపుడు "మానం" అనగా ప్రత్యక్షాదిప్రమాణము. దానితో సంబంధ మనగా మేయత్వము; అనగా ప్రత్యక్షాదులవలన కలిగిన ప్రమలో విషయ మగుట. దానికి దూరమైనది; అనగా మేయము కానిది అని భావము. నిగమవచనసిద్ధం = వేదవచనములద్వారా ఎల్లప్పుడును విద్వాంసుల అనుభవమునందు గోచరమైనది, అజరం = అపక్షయము లేనిది, అమరం = నాశరహితమైనది, అస్తాభాసవస్తుస్వరూపమ్ = ఆభాసము లనగా వికల్పములు; అవి తొలగిపోయిన ఏ వస్తువుకలదో తత్స్వరూపమైనది; స్తిమితసలిలరాశిప్రఖ్యం = తరంగములులేని సముద్రమువలె నిశ్చలమైనది. ఆఖ్యావిహీనం = "తే యదన్తరా" అను శ్రుతివాక్యము ననుసరించి ఏదైన పేరు ఉంచుటకు నిమిత్తములగు జాతి-గుణ-క్రియాదులు లేకపోవుటచే నామశూన్యమైనది. శమితగుణవికారం = గుణములుగాని, వికారములుగాని, లేనిది; శాశ్వతం=అనాదిసిద్ధమైనది, శాన్తం=పరిణామశూన్యమైనది, ఏకం=అద్వితీయము; అట్టిబ్రహ్మను విద్వాంసుడు, సమాధియందు, హృదయమున వీక్షించును.

సమాహితాన్తఃకరణః స్వరూపే
విలోకయాత్మాన మఖణ్డవైభవమ్,
విచ్ఛిన్ధి బన్ధం భవగన్ధగన్ధిలం
యత్నేన పుంస్త్వం సఫలీకురుష్వ. 412

స్వరూపే = పరమాత్మయందు, సమాహితాన్తఃకరణః = స్థిరముగ నిలుపబడిన మనస్సు కలవాడవై, అఖణ్డవైభవం = అఖండమైన విభుత్వము (సర్వవ్యాప్తత్వము)గల, ఆత్మానం=ఆత్మను, విలోకయ= చూడుము, భవగన్ధగంధిలం = సంసారగంధముతో కంపుకొట్టుచున్న, బన్ధం=అజ్ఞానమును, విచ్ఛిన్ధి =తొలగించుకొనుము, యత్నేన=ప్రయత్న పూర్వకముగ, పుంస్త్వం = పురుషత్వమును, సఫలీకురుష్వ = సఫలము చేసికొనుము.

పరమాత్మయందు నిశ్చలముగ స్థాపితమగు మనస్సుకలవాడవై, అవ్యాకృతమగు ఆకాశముయొక్క కల్పనకు గూడ అధిష్ఠానమై అఖండమగు సర్వవ్యాప్తత్వరూప విభుత్వముగల ఆత్మను, విలోకయ=సాక్షాత్తరింపజేసికొనుము. భవగన్ధగన్ధిలం=సంసారవాసనావాసితమైన, బన్ధం=అజ్ఞానమును, విచ్ఛిన్ధి=నశింపజేసికొనుము. "అవిద్యాస్తమయో మోక్షః సా చ బన్ధ ఉదాహృతః" - అవిద్యానాశనమే మోక్షము. ఆ అవిద్యయే బంధమని చెప్పబడుచున్నది అని పెద్దల వాక్యము. యత్నేన=

యల్లాభాన్నాపరోలాభో యత్సుఖా న్నాపరం సుఖమ్,
యద్బోధాన్నాపరో బోధః తద్బ్రహ్మే త్యవధారయ.

దేని లాభముకంటె గొప్పదగు లాభ మేదియు లేదో, దేని సుఖముకంటె గొప్పసుఖము లేదో, దేని జ్ఞానముకంటె గొప్పజ్ఞాన మేదియు లేదో అదియే బ్రహ్మయని తెలిసికొనుము అనియు, "ఆత్మ లాభాన్న పరం కించిదస్తి" - ఆత్మలాభము కంటె గొప్ప దేదియును లేదు, "ఆత్మానమన్విచ్ఛ గుహాం ప్రవిష్టమ్" - గుహలో (హృదయమున) ప్రవేశించియున్న ఆత్మను అన్వేషింపుము ఇత్యాది వచనములచేతను, "ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత" - ఓ అర్జునా! ఈ ఆత్మను తెలిసికొనినచో బుద్ధిమంతుడును, కృతకృత్యుడును అగును అను గీతావాక్యము వలనను, "ఆత్మా అరే

ద్రష్టవ్యః ఏతావదరే ఖల్వమృతత్వమ్" - ఆత్మను సాక్షాత్కరింప జేసికొనవలెను; ఇదియే మోక్షము అను శ్రుతి వాక్యము వలనను, ఆత్మసాక్షాత్కారమే పరమఫలముగాన అందునిమిత్తమై, ప్రయత్నము చేత, పుంస్త్వం=ఎన్నో పుణ్యములు చేయగా లభించిన పురుషత్వమును సఫలీకురుష్వ=స్వరూపసాక్షాత్కారము పొంది సార్థకము చేసికొనుము. మరల సంసారములో ప్రవేశింపకుము అని భావము.

సర్వోపాధి వినిర్ముక్తం సచ్చిదానన్ద మద్వయమ్,
భావయాత్మానమాత్మస్థం న భూయః కల్పసేఽధ్వనే. 413

సర్వోపాధి వినిర్ముక్తం=సమస్తములగు ఉపాధులతో శూన్యమైన దానినిగను, సచ్చిదానన్దం =సచ్చిదానందస్వరూపమైన దానినిగను, అద్వయం=ద్వితీయరహితముగను, ఆత్మస్థం=ఆత్మలో (నీలో) నున్న దానినిగను, ఆత్మానం=పరమాత్మను గూర్చి, భావయ=భావింపుము, భూయః=మరల, అధ్వనే=సంసారమార్గమునకు, న కల్పసే=పాల్పడవు.

ఆత్మనుగూర్చి భావనచేయుము. ఏ విధమైనదానినిగా అనగా సర్వోపాధివినిర్ముక్తం=స్థూలము, సూక్ష్మము, కారణము అనెడు భేదములకు హేతువులగు సమస్తోపాధులతోడను, పూర్తిగ వాసన కూడ లేనివిధమున విడువబడినదానినిగను, సచ్చిదానంద స్వరూపమైనదానినిగను, ద్వితీయరహితమైనదానినిగను, తనలోనే ఉన్న దానినిగను, ఇట్లు చెప్పుటచే ఆత్మ ఎక్కడనో దూరమున ఉన్నది కాదని చెప్పినట్లైనది. "అత్ర వావ కిల సత్సోమ్య న నిభాలయసే" -ఓ సౌమ్యుడా! సత్స్వరూపమగు ఈ ఆత్మ ఇచటనే ఉన్నది; కాని నీవు గుర్తింపకున్నావు అని శ్రుతి వాక్యము. ఈ విధముగ 'ఆత్మ సంస్థం' అనగా సూక్ష్మమగు బుద్ధిలో భాసించుచున్నది అని యర్థము. (ఈ విధముగ భావనచేయుటచే) స్వమహిమయందే స్థితి లభించి స్వాత్మసాక్షాత్కారము సిద్ధించును గాన, మరల, అధ్వనే=సంసార

మునకు పాల్పడవు, 'న పునరావర్తతే' _అతడు మరల తిరిగిరాడు, "మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే"_ఓ అర్జునా! నన్ను పొందినచో మరల జన్మలేదు అని శ్రుతి స్మృతి వాక్యములు.

అవ. పునరావృత్తి లేకపోవుటనే ఉపపాదించుచున్నాడు-

## దృశ్యము నుపేక్షించుట

ఛాయేవ పుంసః పరిదృశ్యమాన
మాభాసరూపేణ ఫలానుభూత్యా,
శరీరమారాచ్ఛవవన్నిరస్తం
పునర్న సన్ధత్త ఇదం మహాత్మా. 414

మహాత్మా=బ్రహ్మభావమును పొందిన పురుషుడు. ఫలానుభూత్యా= 'ఫలం' అనగా అఖండాకారమగు వృత్తిచే ఆవరణము తొలగగా అభివ్యక్తమగు స్వరూపచైతన్యము, దానియొక్క అనుభవమనెడు హేతువుచే, ఆభాసరూపేణ = సర్పము విడచిన కుబుసము సర్పమువలె కనబడినట్లు, ఇతరుల దృష్టిలో ఆభాసరూపమున, పుంసః=పురుషునియొక్క, ఛాయేవ= నీడవలె, పరిదృశ్యమానం=దేహపాత మగునంతవరకును పూర్వము నందువలె కనబడుచున్నదియు, శవవత్=శవమువలె, ఆరాత్=దూరముగ నిరస్తం=విడువబడిన, ఇదం=ఈ, శరీరం=శరీరమును, పునః= మరల, న సన్ధత్తే=కూర్చుకొనడు, అనగా శరీరము భాసించుచున్నను, దానియందు, ఘటాదికమునందువలె అహంకారాదికము చేయక, దానివిషయమున ఉదాసీనుడుగ ఉండునని యర్థము.

సతతవిమల బోధానన్దరూపం స్వమేత్య
త్యజ జడమలరూపోపాధిమేతం సుదూరే,
అథ పునరపి నైవ స్మర్యతాం వాన్తవస్తు
స్మరణవిషయభూతం కల్పతే కుత్సనాయ. 415

సతతవిమలబోధానన్దరూపం = నిత్యనిర్మలప్రకాశానంద రూపమైన బ్రహ్మను, స్వం ఏత్య = స్వస్వరూపమునుగా పొంది, జడమలరూపోపాధిం = జడము, మలరూపము అయిన ఉపాధిగానున్న, ఏతం = ఈ స్థూల శరీరమును, సుదూరే = చాలదూరమున, త్యజ = విడువుము, అథ = అటు పిమ్మట, అనగా నేనే సచ్చిదానందరూపమగు బ్రహ్మను అను జ్ఞానము, కలిగిన పిమ్మట, పునరపి = మరల, నైవ స్మర్యతాం = స్మరింపబడకుండు గాక (ఆ శరీరమును స్మరింపవలదు), వాన్తవస్తు = వాంతిచేసికొనిన పదార్థము, స్మరణవిషయభూతం = స్మరణమునకు విషయమైనదై (దానిని స్మరించినచో), కుత్సనాయ కల్పతే = తనకే ఏహ్యభావమును లేదా పరుల ద్వారా నిందను కలిగించును. మలినమైనవస్తువును స్మరించినచో వికారము కలుగును గాన దానిని స్మరింపరాదు కదా. విడచిన చెడుపదార్థమును గూర్చి స్మరించు వానిని లోకమున ఇతరులు కూడ నిందింతురు.

సమూలమేతం పరిదహ్య వహ్నౌ
సదాత్మని బ్రహ్మణి నిర్వికల్పే,
తతః స్వయం నిత్యవిశుద్ధబోధా
నన్దాత్మనా తిష్ఠతి విద్వరిష్ఠః. 416

సదాత్మని = కాలత్రయాబాధ్యమైన స్వరూపముకలదియు, నిర్వికల్పే = భేదరహితమును అగు, బ్రహ్మణి = బ్రహ్మయందు, ఏతం = ఈ స్థూలదేహమును, సమూలం = అజ్ఞానసహితముగ, పరిదహ్య = నిశ్శేషముగ కాల్చివేసి, తతః = అటుపిమ్మట, విద్వరిష్ఠః = విద్వాంసులలో శ్రేష్ఠుడగువాడు, స్వయం = తాను, నిత్యవిశుద్ధబోధానన్దాత్మనా = నిత్యము శుద్ధము, జ్ఞానరూపము, ఆనందరూపము అగు ఆత్మతో, తిష్ఠతి = ఉండును. అతని కెప్పుడును అనాత్మవస్తువుల భావము ఉండదని భావము.

ప్రారబ్ధసూత్రగ్రథితం శరీరం
ప్రయాతు వా తిష్ఠతు గోరివ స్రక్,
న తత్పునః పశ్యతి తత్త్వవేత్తా
నన్దాత్మనా బ్రహ్మణి లీనవృత్తిః. 417

ప్రారబ్ధసూత్రగ్రథితం = ప్రారబ్ధమనెడు సూత్రముచే గ్రుచ్చ బడిన (ఏర్పడిన), శరీరం = శరీరము, గోః = గోవుయొక్క, స్రగివ = మాలవలె, ప్రయాతు వా = పోనిమ్ము, తిష్ఠతు వా = ఉండనిమ్ము, ఆనందాత్మనా = ఆనంద స్వరూపముతో, బ్రహ్మణి = బ్రహ్మయందు, లీనవృత్తిః = లీనమైన మనోవృత్తిగల, తత్త్వవేత్తా = తత్త్వవేత్త, తత్ = దానిని పునః = మరల, న పశ్యతి = చూడడు.

అలంకరణార్థమై సూత్రముచే గ్రుచ్చి, మెడలో వేసిన మాల లేదా త్రాడు, ఉన్నను పడిపోయినను గోవునకు ఏ విధముగ దానిపై దృష్టి ఉండదో అటులే, తత్త్వసాక్షాత్కారము కలుగుటకు పూర్వము ఆతనికి కలుగు సుఖదుఃఖాదుల అనుభవమునకు నిమిత్తముగ నుండి, ఇపుడు ఆతనికి అభిమానము లేకపోయినను, ఆయనకు సంబంధించి నట్లుగ భావింపబడుచున్నదియు, ప్రారబ్ధకర్మచే నిర్మిత మైనదియు నగు శరీరము, బ్రహ్మసాక్షాత్కారము కలిగిన పిమ్మట, ప్రయాతు = మరణించిన మరణించుగాక; లేదా తిష్ఠతు = ప్రాణముతో నుండుగాక, తత్త్వవేత్తా = ఆత్మయాథాత్మ్యమును తెలిసికొనిన జ్ఞాని, ఆ శరీరమును, పునః = తనకు బ్రహ్మతత్త్వజ్ఞానము కలిగిన పిమ్మట, చూడడు. 'ఆనన్దాత్మనా బ్రహ్మణి లీనవృత్తిః' అనునది అందులకు కారణము. వృత్తి బైటకు పోవుటకు కారణము 'ఆనన్దాత్మనా' అనునది. మనోవృత్తి అనావృతానంద స్వరూపమున లీనమైపోయిన పిదప మనస్సునకు బహిర్ముఖత్వ మెట్లుండును? "నా కెల్లప్పుడును అవిచ్ఛిన్నమగు సుఖము కలుగుగాక" అనెడు ఇచ్ఛ తీరిపోయినది. అందుచే నిత్యము, నిరతిశయము అగు సుఖమును పొంది తద్రూపమున లీనమైపోయిన మనస్సు మరల బహిర్ముఖము కాదు. ఈ విషయమునే "కసాం పరానన్ద రసానుభూతిం" ఇత్యాది శ్లోకమున(523) చెప్పనున్నారు.

అవ. ఉత్తరార్ధములో చెప్పిన "న తత్పునః పశ్యతి" అను దానికి ఉపపత్తి చూపుచున్నారు.-

అఖణ్డానన్దమాత్మానం విజ్ఞాయ స్వస్వరూపతః,
కిమిచ్ఛన్ కస్య వా హేతో ర్దేహం పుష్ణాతి తత్త్వవిత్. 418

తత్త్వవిత్ = తత్త్వవేత్త, అఖణ్డానన్దం = అఖండానందస్వరూపమైన, ఆత్మానం = ఆత్మను, స్వస్వరూపతః = తన స్వరూపముగా, విజ్ఞాయ = తెలిసికొని, కిమిచ్ఛన్ = ఏమి కోరుచు, కస్య వా హేతోః = ఏ హేతువు వలన అనగా ఏ ఫలము నుద్దేశించి, దేహం = దేహమును, పుష్ణాతి = పోషించును? ఏదైన కావలెనని కోరికయున్నచో, అప్రాప్తమగు దానిని సంపాదించుటకై ప్రయత్నము చేయవచ్చును. దేహము లేకుండ ప్రయత్నము చేయ శక్యము కాదు గాన, దేహమును కూడ పోషింపవచ్చును, కోరికయే లేనిచో ఏ ఫలము నుద్దేశించి దేహపోషణము చేయును? ఈ విషయమును "ఆత్మానం చేద్విజానీయా దయమస్మీతి పూరుషః కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్"-ఈ ఆత్మయే నేను అని గ్రహింపగల్గినచో పురుషుడు, ఏమి అభిలషించు, ఏ కామమును సంపాదించుకొనుటకై ఈ శరీరముతోపాటు బాధపడుచుండును? అని శ్రుతి కూడ బోధించుచున్నది.

## ఆత్మజ్ఞానఫలము

సంసిద్ధస్య ఫలం త్వేత జ్జీవన్ముక్తస్య యోగినః,
బహిరన్తః సదానన్దరసాస్వాదన మాత్మని. 419

సంసిద్ధస్య = సిద్ధి అనగా ఆత్మానుభవము కలవాడును, జీవన్ముక్తస్య = జీవన్ముక్తుడును అగు, యోగినః = యోగికి, ఆత్మని = అంతఃకరణమునందు, బహిః = వెలుపలను, అన్తః = లోపలను, సదా = ఎల్లప్పుడును, ఆనన్దరసాస్వాదనం = ఆనందరసమును ఆస్వాదించుటయే, ఏతత్ = ఇదియే, ఫలమ్ = ఫలము.

సంసిద్ధస్య = సాధనచతుష్టయమును సమకూర్చుకొని గురువును సమీపించి, అతని ముఖమునుండి వేదాన్తవాక్యార్థమును విని, మన

నము చేసి, నిదిధ్యాసనము చేసి, బాగుగ ఆత్మానుభవమును సంపా దించుకొనినవాడును, యోగినః = పరమాత్మయందే స్థాపింపబడిన చిత్తము కలవాడును అగు, జీవన్ముక్తస్య = జీవించియున్నను సర్వో పాధిసంబంధములు తొలగిపోయిన వానికి, ఏతత్ = ఇదియే, ఫలం = ఫలము. ఏది యనగా-అంతఃకరణమునందు బైటను వెలుపలను గూడ సర్వదా ఆనందరసమును అనుభవించుట. అఖండాకారవృత్తిచే ఆవ రణము పూర్తిగ తొలగిపోయినది గాన వ్యుత్థానమునందు గూడ (సమాధినుండి బైటకు వచ్చునపుడు గూడ) ఆనందము తిరోహితము కాదు. కావున 'బహిః' అని చెప్పబడినది. అట్టి వాని మూర్తి చూచి నపుడు, ఎల్లప్పుడు చిరునవ్వు, వికసించిన చూపులు మొదలగువాటిచే ఇతరులుకూడ ఇతడు పూర్ణానందముతో నున్నాడు అని తెలిసికొందురు. కావున ఆతనికి లభించిన పూర్ణానందరూపముతో స్థితి అవిచ్ఛిన్నమైనది గనే ఉండును. అవిద్యానివృత్తి రూపమగు మోక్షము దృష్టఫలమేకదా; అనగా ప్రత్యక్షముగ కనబడు ఫలమే కాని, ఎప్పుడో ఎక్కడో లభించు ఫలము కాదు కదా?

అవ. సాక్షాత్తుగ గాని, పరంపరయా గాని ఏ సాధనములు ఏ ఫలముల నిచ్చునో తెలిసినచో ముముక్షువు ప్రయత్నించి ఆ సాధ నములకు పూర్ణత్వమును సంపాదింప వీలుండును. కావున క్రమముగ వైరాగ్య-బోధ-ఉపరతుల ఫలములను చెప్పుచున్నాడు

వైరాగ్యస్య ఫలం బోధః బోధస్యోపరతిః ఫలమ్,
స్వానన్దానుభవాచ్ఛాన్తి రేషైవోపరతేః ఫలమ్. 420

వైరాగ్యస్య = వైరాగ్యమునకు, బోధః = జ్ఞానము, ఫలం = ఫలము, బోధస్య = జ్ఞానమునకు, ఉపరతిః = ఉపరతి, ఫలం = ఫలము, స్వానన్దాను భవాత్ = స్వానందమును అనుభవించుటవలన, శాన్తిః = శాంతి, భవేత్ = కలుగును, ఏషైవ = ఈ శాంతియే, ఉపరతేః = ఉపరతికి, ఫలం = ఫలము.

"విముక్తి సౌధాగ్రతలాధిరోహణం,
తాభ్యాం వినా నాన్యతరేణ సిద్ధ్యతి" (375) అనియు,

"వైరాగ్యాన్న పరం సుఖస్య జనకం పశ్యామి వశ్యాత్మనః,
తచ్చే చ్ఛుద్ధతరాత్మబోధసహితం స్వారాజ్యసామ్రాజ్య ధుక్."

(377) అనియు వెనుక చెప్పబడినది. కావున జ్ఞానవైరాగ్యములు రెండును మోక్షము విషయమున తుల్యముగ హేతువు లన్నట్లు కనబడుచున్నది. 'ఏతద్ద్వారమజస్ర ముక్తియువతేః' (377) అనువాక్యముచే వైరాగ్యము ముక్తికి ద్వారమని చెప్పబడినను, 'సర్వత్రాస్పృహయా సదాత్మని కురు ప్రజ్ఞాం నిజశ్రేయసే' (377) అను వాక్యము వలన గూడ వైరాగ్యజ్ఞానములకు గల హేతుహేతుమద్భావము (వైరాగ్యము వలన జ్ఞానము కలుగునను విషయము) స్పష్టముగ తెలియుట లేదు. కావున ఆ విషయమును ఇచట స్పష్టీకరించుచున్నాడు.

వివేకము, వైరాగ్యము, శమాదిషట్కము (అనగా శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము), ముముక్షుత్వము అనెడు బ్రహ్మవిచారసాధనములలో వైరాగ్యోపరతులు కూడ చేరి ఉన్నవి అను మాట సత్యమే. కాని, అంతరంగము లగుటచే అనగా బ్రహ్మవిచారమునకు అత్యావశ్యకము లగుటచే, ఆ సాధనములు విచారకాలమున సామాన్యరూపముగ ఉన్నను వాటికి ఉత్తమత్వము లభింపవలె నన్నచో శ్రవణ మనన రూపములగు జ్ఞానసాధనముల అనుష్ఠానము ఆవశ్యకము. కావుననే "బాహ్యానాలమ్బనం వృత్తే రేషోపరతి రుత్తమా" (24) అని వెనుక చెప్పబడినది. నిదిధ్యాసనము లేకుండ విపరీతభావన నివర్తించదు గాన, విచారదశయందు బాహ్యానాలంబనత్వము - అనగా మనోవృత్తి బాహ్యవిషయములను గూర్చి ప్రవర్తింపకుండుట అనునది, దుర్లభమే యైనను శబ్దాదివిషయములను ఆలంబనముగ స్వీకరింపక - అనగా శబ్దాదివిషయములను గూర్చి చింతింపక, వృత్తి (మనోవృత్తి) విచారమును సాధించునని చెప్ప

కొనవలెను. అనగా ఆ సమయమున శబ్దాది చింత లేకున్నను, విపరీత భావన ఉండవచ్చును గాన చిత్తవృత్తి పూర్తిగ బాహ్యవిషయానాలంబనము అని చెప్పుటకు వీలులేదు. కాని, పంచకోశ నిషేధపూర్వకముగా నిదిధ్యాసనముచే స్వానుభవమును సంపాదించిన పిమ్మట వృత్తి పూర్తిగ అనాత్మావిషయకముగా (అనగా అనాత్మవస్తువులకు సంబంధించనిదిగా) అగును అని చెప్పుటకు అవకాశముండును. అందుచే బోధకు ఉపరతి ఫలము అని చెప్పబడినది.

ఇచట శ్రీచరణులు ఒక సంభావ్యమగు ఆశంకకు సమాధానము చెప్పుచున్నారు. ౬75వ శ్లోకమున వైరాగ్యోపరతులు రెండును తుల్యముగ ముక్తికి హేతువులని చెప్పబడినది. వైరాగ్యమువలన ఉపరతి కలుగును అను సూచన ఈ శ్లోకములో కాని, 377వ శ్లోకములో కాని లేదు. మరియొక విషయ మేమనగా ఉపరతి కూడ బ్రహ్మవిచార సాధనములలో ఒకటి అని వెనుక 17వ శ్లోకములో చెప్పబడినది. అనగా ఉపరతివలన బ్రహ్మజ్ఞానము కలుగును అని చెప్పినట్లైనది కావున ఈ శ్లోకమున "బోధస్యోపరతిః ఫలమ్" అని ఆత్మజ్ఞానమునకు ఉపరతిని ఫలముగా చెప్పుట ఎట్లు పొసగును? అని ఆశంక. దీనికి సమాధాన మేమనగా - ఆత్మవిచార సమయమున బాహ్యానాలంబన వృత్తిరూపమగు ఉపరతి సాధనముగ ఉన్నను అది అంత పరినిష్ఠితముగ ఉండదు. ఉపరతియే కాదు, వైరాగ్యాది సాధనములు కూడ ఇట్లే సామాన్యరూపమున ఉండును గాని అంత దృఢముగ ఉండవు. కాని పంచకోశనిషేధపూర్వకముగ నిదిధ్యాసనము చేసినపిమ్మట ఆత్మానుభవము కలిగినతోడనే అంతవరకు సామాన్యముగ ఉన్న ఉపరతి దృఢతర మగును. ఈ అభిప్రాయముచే ఇచట "బోధస్యోపరతిః ఫలమ్" అని చెప్పబడినది.

ఇట్లే శమాదిషట్కము నడుమ నున్న ఉపరతి శమదమముల ఫలము అని (అనగా శమదమములవలన కలుగునని) చెప్పబడినది.

ఐనను ఆ ఉపరతియే ఉత్తమమైన పిమ్మట శాంతి దానికి ఫలమగును. అనగా అట్టి ఉపరతివలన శాంతి కలుగును అని "స్వానన్దానుభవా చ్ఛాన్తి రేషై వోపరతేః ఫలమ్" అను వాక్యముచే చెప్పబడుచున్నది. "స్వలక్ష్యే నియతావస్థా మనసః శమ ఉచ్యతే" (22) అని వెనుక చెప్పిన శమమే ఇపుడు ఇచట 'శాన్తి' పదముచే పేర్కొనబడినది. ప్రయత్నపూర్వకముగ, ఆప్తవాక్యాది సహాయముతో మొదట సంపాదించుకొనిన సాధనములే ఆత్మవిచారముచే ప్రకర్షను పొంది, అసంకుచిత లక్షణము లగును, అనగా వాటి స్వరూపము పరినిష్ఠితమగును అని భావము. కావున-

"బ్రహ్మ సత్యం జగన్మిథ్యే త్యేవంరూపో వినిశ్చయః,
సోఽయం నిత్యానిత్యవస్తువివేకః సముదాహృతః."

అను శ్లోకమున నిరూపితమగు లక్షణముగల వివేకము మొదట. కేవలము పరోక్షజ్ఞానరూపమున నుండి, ఆత్మవిచారానంతరము అపరోక్షరూపమగును. "రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే" - ఆత్మసాక్షాత్కారము కలిగిన తరువాత విషయములపై రాగము ఉండదు అని గీతలో చెప్పిన విధమున స్వరూపానంద సాక్షాత్కారము కలిగిన తోడనే విషయరాగము వాసనారూపమున గూడ ఉండదు గాన, అప్పుడు విషయేచ్ఛ పూర్తిగ తొలగిపోవుట అనెడు స్వరూపముగల వైరాగ్యము అసంకుచితము, అనగా పరిపూర్ణము అగును. కావున అభ్యాసవైరాగ్యములచే మనస్సును బాగుగా నిరోధించి విచారము చేసినచో బోధ (ఆత్మజ్ఞానము) తప్పక కలుగును. అట్లు కలుగకున్నచో వైరాగ్యరూపమగు సాధనము పూర్ణముగ లేదని యర్థము. అందుచే ఆ వైరాగ్యము దృఢమగునట్లు ప్రయత్నము చేయవలెను. ఇట్లు, బోధము అనగా ఉపనిషజ్జన్యమగు ఆత్మసాక్షాత్కారము, లేదా సందేహము గాని విపర్యాసజ్ఞానము కాని లేని ఆత్మవిషయక పరోక్షజ్ఞానము కలుగగా, ఆ బోధమునకు ఉపరతి ఫలము. ఆత్మజ్ఞానము కలిగిన పిమ్మటకూడ

మనస్సు బాహ్యావిషయములనుండి నివర్తింపకున్నచో, దృఢజ్ఞానము కలుగలేదని యర్థము. అట్లు దృఢజ్ఞానము కలుగకుండుటకు కారణము వైరాగ్యము అపరిపూర్ణముగ నుండుటయే పూర్ణమైన వైరాగ్యము, దృఢమైన ఆత్మనిశ్చయము లేకున్నచో విద్యావంతులకు తదితరులకు భేదమేమి? విద్యావంతులైన పిమ్మట గూడ ఉపరతిలేకుండ ఎట్లుండును? (అనగా వైరాగ్యము పూర్ణము కానంతవరకు ఆత్మజ్ఞానము దృఢము కాజాలదు. అది దృఢము కానంతవరకును ఆతడు విద్యావంతుడు కాజాలడు); అందుచేతనే ఆతనికి ఉపరతి కలుగదు అని యభిప్రాయము. మనస్సునకు ఉపరతి కలుగగనే, స్వానందానుభవముద్వారా శాంతి, క్రియాశూన్యస్థితి కలుగును. ఇదియే ఉపరతికి ఫలము. కావుననే_

"జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః,
నైవాస్తి కిఞ్చిత్కర్తవ్యమస్తి చేన్న స తత్త్వవిత్."

జ్ఞానామృతముచే తృప్తుడై, కృతకృత్యుడైన యోగి చేయదగినది ఏదియు ఉండదు. అట్లేదైన ఉన్నచో అతడు తత్త్వవేత్తయే కాడు అని చెప్పబడినది "యద్యుత్తరోత్తరాభావః పూర్వపూర్వం తు నిష్ఫలమ్"_తరువాత రావలసినవి రాకున్నచో వెనుకటివి వ్యర్థములు అను న్యాయము ననుసరించి ఆ యా ఫలములు లభించువరకును ఆ యా సాధనము పూర్ణము కాదనియే యర్థము. కావున సాధకుడు జ్ఞానమువిషయమున బాగుగ ప్రయత్నముచేసి సాధనములను పూర్ణములుగ నుండునట్లు చేసికొనవలెను అని బోధించుటకై ఈ విధముగ చెప్పబడినది.

అవ. బ్రహ్మవిద్యకు ఫలమును చెప్పుచున్నారు_

నివృత్తిః పరమా తృప్తిః ఆనన్దోఽనుపమః స్వతః,
దృష్టదుఃఖేష్వనుద్వేగః విద్యాయాః ప్రస్తుతం ఫలమ్. 421

**నివృత్తిః = సకలకార్యములనుండి మరలుటయు, పరమా = గొప్పదైన, తృప్తిః = తృప్తియు, స్వతః = స్వతస్సిద్ధమగు, అనుపమః = సాటిలేని, ఆనన్దః = ఆనందము, దృష్టదుఃఖేషు = కనబడుచున్న (ప్రాప్తించుచున్న) దుఃఖముల విషయమున, అనుద్వేగః = మనస్సులో బాధపడకుండుట, ఇవి, విద్యాయాః = విద్యయొక్క, ప్రస్తుతం = ప్రస్తుతమైన, అనగా ఇచటనే కనబడెడు, ఫలమ్ = ఫలము.**

నివృత్తిః = సర్వకార్యముల నుండియు నివర్తించుట, ఏ వ్యాపారమును చేయకుండుట. అనగా కర్తవ్యమేమియు మిగులకుండుట, పరమా తృప్తిః = నిరంకుశమైన, ఎట్టి విఘాతమును లేని, తృప్తియు, అనగా - చేయవలసిన దంతయు చేసినాను, పొందదగిన దానిని పొందినాను, ఇటుపైన చేయదగినదిగాని, పొందదగినదీ కాని ఏదియు లేదు; ఈ విధముగ నేను ధన్యులలో ధన్యుడను అను చింతచే కలుగు సుఖవిశేషము. స్వతః = స్వతస్సిద్ధమైనదియు, అనుపమః = సాటిలెనిదియు అగు, ఆనన్దః = విషయముల అపేక్షలెని నిత్యము, నిరతిశయము (దేనిని మించిన మరియొక సుఖము లేదో అట్టి) సుఖము, దృష్టదుఃఖేషు అనుద్వేగః = ప్రారబ్ధకర్మను అనుసరించి వచ్చిపడెడు దుఃఖముల విషయమున మానసిక క్లేశము చెందకుండుట. ఇట్టి దుఃఖములు ప్రాప్తించినపుడు, 'ఛీ' నే నెంత పాపాత్ముడను!" అని అజ్ఞాని పశ్చాత్తాపము చెందుచుండును. ఇదియే ఉద్వేగము. ఇట్టి పశ్చాత్తాపము కలుగుట వివేకమువలె కనబడవచ్చును. కాని ఇట్టి జ్ఞానము, పూర్వజన్మమున పాపాచరణముచేయు సమయమున కలిగియున్నచో, ఆ పాపము చేయకుండ మరల్చును గాన కొంత ప్రయోజన ముండెడిది. కాని ఈ పశ్చాత్తాపము (ఉద్వేగము) ఇపుడు నిష్ప్రయోజనము గాన ఇదియొక తమోవికారమైన భ్రాంతిమాత్రమే. రాగాది నిమిత్తముల వలన కలుగు సంతాపరూపమగు చిత్తవృత్తికి దుఃఖ మని పేరు. ఇది రజోగుణవికార రూపమైనది. దుఃఖోద్వేగములకు ఇదియే భేదము. అజ్ఞానికి ఇట్టి ఉద్వేగము కలుగును గాని జ్ఞానికి

కలుగదు. ఈ విధముగ నివృత్తియు, నిరంకుశమగు తృప్తియు, విషయశూన్యమైనదియు, సాటిలేనిదియు అగు ఆనందము, దుఃఖము కలిగినపుడు ఉద్వేగము చెందకుండుట అను నవి నాలుగు ఫలములు. ఇది యంతయు, విద్యాయాః=ఆత్మతత్త్వజ్ఞానముయొక్క, ప్రస్తుతం= ముఖ్యమైనదియు, ఇచటనే కనబడునదియు అగు ఫలము.

అవ. వాటిలో నివృత్తి ఏల కలుగునో చెప్పుచున్నాడు—

యత్కృతం భ్రాన్తివేళాయాం నానాకర్మ జుగుప్సితమ్,
పశ్చాన్నరో వివేకేన తత్కథం కర్తు మర్హతి. 422

భ్రాన్తివేళాయాం=భ్రాంతి ఉన్న సమయమునందు, జుగుప్సితం= నింద్యమైన, యత్=ఏ, నానాకర్మ=అనేకవిధములగు కర్మ, కృతం= చేయబడినదో, తత్=దానిని, నరః=మానవుడు, వివేకేన=వివేక ముతో, పశ్చాత్=తరువాత, (వివేకజ్ఞానము కలిగిన పిమ్మట) కర్తుం= చేయుటకు, కథం=ఎట్లు, అర్హతి=తగియుంటాడు?

అవివేక వివేకములకే ఇంతభేద మున్నపుడు, వివేకమునకు ఫలమైనదియు, పరమాత్మ విషయకమును అగు జ్ఞానము కలిగిన పిమ్మట వేరుగ చెప్పవలెనా అను నభిప్రాయముతో చెప్పుచున్నాడు- ఏదైన భ్రాంతి కలిగినపుడు మానవుడు నింద్యములగు ఏవేవియో కర్మలు చేయవచ్చు. ఆ భ్రాంతి తొలగి వివేకము కలిగినపుడు ఆతడే ఆ పనులు చేయజాలడు. ఈ విధముగ వివేకవంతుడు జుగుప్సిత ములగు కర్మలనుండి ఎట్లు నివర్తించునో అట్లే విద్యావంతుడు బ్రహ్మ నిష్ఠు డగుటచే సర్వకర్మలనుండియు నివర్తించును అని భావము.

అవ. ఈ ఫలము లోకమునందు కూడ కానవచ్చు చున్నదని చెప్పుచున్నాడు—

విద్యాఫలం స్యాదసతో నివృత్తిః
ప్రవృత్తిరజ్ఞానఫలం యదీక్షితమ్,
తద్జ్ఞాజ్ఞయోర్యన్మృగతృష్ణికాదౌ
నోచే ద్విదో దృష్టఫలం కి మస్మాత్. 423

అసతః = అసత్తునుండి (లేనిదానినుండి) నివృత్తిః = మరలుట, విద్యాఫలం = విద్యయొక్క ఫలముగా, స్యాత్ = అగును, ప్రవృత్తిః = ప్రవర్తించుట, అజ్ఞానఫలం = అజ్ఞానముయొక్క ఫలమగును అనునది, యత్ = ఏది కలదో, తత్ = అది, యత్ = ఏ కారణమువలన, జ్ఞాజ్ఞయోః = జ్ఞానవంతునకు, అజ్ఞానవంతునకును, మృగతృష్ణికాదౌ = మృగతృష్ణ (ఎండ మావులు) మొదలగువాటి విషయమున, ఈక్షితమ్ = చూడబడినదో (అందు వలన భ్రాంతికాలమున చేయు వివిధ కర్మలకు వివేకము కలిగిన పిమ్మట అవకాశములేదు అను పూర్వశ్లోకార్థముతో అన్వయము) నో చేత్ = అట్లు కానిచో, విదః = జ్ఞానికి, అస్మాత్ = దీనికంటె భిన్నమైన, దృష్టఫలం = దృష్టమైన ఫలము, కిమ్ = ఏ మున్నది?

అసత్తునుండి నివృత్తి విద్యాఫలము, అసత్తు విషయమున ప్రవృత్తి అజ్ఞానఫలము అను విషయము జ్ఞాని అజ్ఞానులలో తెలియు చున్నది. యత్ = ఏ కారణమువలన, మృగతృష్ణికాదౌ = మృగ తృష్ణ మొదలగు వాటి విషయమున, 'అది' పదముచే శుక్తిరజతాది కమును గ్రహింపవలెను. అది మృగతృష్ణికయే అను జ్ఞానముకలవాడు జలగ్రహణము కొరకై మరుభూమిలో ప్రవర్తించడు. మరుభూమిపై సూర్యకిరణాలు ప్రసరించినపుడు అది నీటివలె కనబడును అను జ్ఞానము లేనివాడు మాత్రము, అది మరుభూమి యని తెలియక, అచట జల మున్నదను భ్రాంతిచే ప్రవర్తించి, ఇష్టమును పొందజాలడు. అతని ప్రవృత్తి విఫలమగును. ఆ కారణమువలన, అసత్తునుండి నివర్తించుట జ్ఞానఫల మనియు, ప్రవర్తించుట అజ్ఞానఫల మనియు చూడబడినది. అట్లు కానిచో జ్ఞానవంతునకు, ఈ అసన్నివృత్తిరూపమగు ఫలము

కంటె వేరుగ దృష్టఫల మేమియున్నది? ప్రకృతమగు బ్రహ్మవిద్యా విషయమున అసత్' అనగా బ్రహ్మాభిన్నములైన పదార్థము లన్నియు అని యర్థము. పూర్వము అజ్ఞానావస్థలో, స్వరూపానందము లభింప కుండుటచే, అనాత్మవస్తువులవిషయమున ప్రవృత్తి ఉండెడిది. ఇపుడు స్వాత్మను తెలిసికొనిన వానికి అనాత్మవస్తువు లన్నియు మిథ్యయే యను జ్ఞానము కలుగుటచే వాటి విషయమున ప్రవృత్తి యుండదు. ఈ విధముగ అసన్నివృత్తియే విద్యాఫలము.

అవ. ప్రవర్తించుటకు కారణము లేకపోవుటవలనగూడ నివృత్తి కలుగును అని చెప్పుచున్నాడు—

అజ్ఞానహృదయగ్రన్థే ర్వినాశో యద్యశేషతః,
అనిచ్ఛోర్విదుషః కిం ను ప్రవృత్తేః కారణం స్వతః. 424

అజ్ఞానహృదయగ్రన్థేః=అజ్ఞానకృతమగు హృదయగ్రంథికి, అశేషతః=పూర్తిగా, వినాశః యది=నాశనము కలిగినచో, అనిచ్ఛోః=ఇచ్ఛాశూన్యుడగు, విదుషః=విద్వాంసునకు, స్వతః ప్రవృత్తేః=స్వయముగ ప్రవర్తించుటకు, కారణం=కారణము, కిం ను=ఏది?

'అనిచ్ఛోః' అనుటచే జ్ఞానికి పరమతృప్తి యున్నట్లు కూడ చెప్పబడుచున్నది. అజ్ఞానహృదయగ్రన్థేః = అజ్ఞానముచే ఏర్పడు ఏ హృదయగ్రంథి, అనగా సాక్షిభూతుడగు ఆత్మకును బుద్ధికిని తాదాత్మ్యాధ్యాసము - బుద్ధియందు ఆత్మత్వారోపము కలదో దానియొక్క అఖండాకారవృత్తిచేత మూలభూతమగు అజ్ఞానము నశించుటచే, అశేషతః=వాసన కూడ లేనివిధమున, వినాశః యది=కారణసహితముగ నాశము కలిగినచో; 'యది' అను పదముండుటచే 'తదా' అను పదమును అధ్యాహారము చేసికొనవలెను. స్వతః=తనంత తానుగ, అనిచ్ఛోః = ఇచ్ఛారహితుడగు, విదుషః = విద్వాంసుని, ప్రవృత్తికి కారణమేమియుండును? మానవు డేదైన కార్యమున ప్రవర్తించుచున్నా

డన్నచో అందులకు ఇచ్ఛయే (కోరికయే) కారణము. ఇచ్ఛ లేనిచో ప్రవృత్తియే యుండదు. అందుచేతనే "ప్రయోజన మనుద్దిశ్య న మన్దోఽపి ప్రవర్తతే"-ప్రయోజనాపేక్ష లేకుండ మూర్ఖుడు కూడ ప్రవర్తించడు అని చెప్పుదురు. కావుననే, సాధనచతుష్టయములో ముముక్షుత్వము- మోక్షేచ్ఛ-గూడ చేర్చబడినది. "కామః సఙ్కల్పః .... .... ఇత్యేత త్సర్వం మన ఏవ" అను శ్రుతి వాక్యమున చెప్పిన విధముగ ఇచ్ఛకూడ అంతఃకరణధర్మమే. ఆనందరూపమగు ఆత్మను సాక్షాత్కరింప జేసికొననంతవరకును మనస్సునకు బాహ్యవిషయాభిలాషయుండును. బాహ్యవిషయములు దోషభూయిష్ఠములని తెలిసికొని, మోక్షేచ్ఛచే, శాస్త్రవిహితములగు నిత్యనిరతిశయానంద రూపాత్మయొక్క శ్రవణమనననిదిధ్యాసనములయందు ప్రవర్తించిన సాధకునకు, ఆత్మసాక్షాత్కారరూపమగు ఫలము లభింపగనే ఆ మోక్షేచ్ఛకూడ తొలగిపోవును. ఆత్మవిచారము చేయుసమయమందు కూడ ఏమాత్రము బాహ్యేచ్ఛ ఉండదు. (బాహ్యేచ్ఛాభావరూపమగు) వైరాగ్యమే ఆత్మవిచారమునకు ఉత్తమసాధనము కదా! అపుడు కూడ సాధకునకు ఇచ్ఛయుండును అన్నచో తాదాత్మ్యాధ్యాసముచే సాక్షికికూడ ఇచ్ఛఉండును అని చెప్పవలసియుండును. ఆత్మవిషయకమగు ఇచ్ఛకూడ ఆత్మాజ్ఞానసమయముననే (ఆత్మజ్ఞానము జనించుటకు పూర్వము మాత్రమే) ఉండును. అజ్ఞానము తొలగిపోవుటతో, దానిచే ఏర్పడిన చిజ్జడతాదాత్మ్యాధ్యాసము (చిత్పదార్థమగు ఆత్మకు జడములగు అంతఃకరణాదుల తోడను, అంతఃకరణాదులకు ఆత్మతోడను ఏకత్వమును ఆరోపించుట) తొలగిపోవును. అపుడు ఇచ్ఛ పూర్తిగ తొలగిపోవును. ఈ విధముగ ఇచ్ఛాప్రవృత్తికి కారణభూతమగు బాహ్యవిషయము కాని, ఆంతర విషయముకాని ఏదియు ఉండదు. కావున 'నివృత్తి' శబ్దార్థమగు సర్వక్రియాశూన్యస్థితియే బ్రహ్మవిద్యవలన కలుగు దృష్టఫలమని భావము.

అవ. వైరాగ్య - బోధ - ఉపరతులు పూర్ణముగ నున్నట్లు ఎట్లు తెలియును అని ఆశంకించుకొని, వాటి పరిపూర్ణత్వావధిని శిష్యాను గ్రహామునకై, ఉపదేశించుచున్నాడు-

వాసనానుదయో భోగ్యే వైరాగ్యస్య తదావధిః,
అహంభావోదయాభావో బోధస్య పరమావధిః,
లీనవృత్తే రనుత్పత్తిర్మర్యాదోపరతేస్తు సా. 425

(యదా=ఎప్పుడు), భోగ్యే=భోగ్యవస్తువునందు, వాసనానుదయః= వాసనయొక్క ఉదయము ఉండదో, తదా=అప్పుడు, వైరాగ్యస్య= వైరాగ్యముయొక్క, అవధిః=పరాకాష్ఠ, అహంభావోదయాభావః= అహంకారము కలుగకుండుట, బోధస్య=ఆత్మజ్ఞానముయొక్క, పరమా వధిః=ఉత్తమమైన అవధి. లీనవృత్తేః=లీనమైన మనోవృత్తి (యొక్క) అనుత్పత్తిః=మరల ఉత్పన్నము కాకుండుట (ఏది కలదో) సా=అది, ఉపరతేః=ఉపరతియొక్క, మర్యాదా=చివరి అవధి.

భోగ్యవస్తువిషయమున వాసన ఉద్బుద్ధము కాకుండుట, అనగా మరల కలుగకుండుట; పూర్వము అనుభవింపబడిన విషయము ఎదుటునే ఉన్నను దాని అనుభవమునకు సంబంధించిన సంస్కారము కలుగకుండుట, ఎప్పుడు ఏర్పడునో, అప్పుడు, అది వైరాగ్యము యొక్క చివరి అవధి. భోగ్యవస్తువుల విషయమున ఆతని మనస్సు పూర్తిగ నశించినది. అట్టివానికి రాగముకలుగుటకు అవకాశ మెచట నున్నది. ఇది వైరాగ్యముయొక్క పరాకాష్ఠగా చూపబడినది. అహం కారము ఉదయించకుండుట జ్ఞానముయొక్క పరమావధి. 'అహం బ్రహ్మ' అను భావనలోకూడ బాధలో సామానాధికరణ్యము. (వి. చెట్టు మొరడునుచూచి పురుషుడని భ్రాంతిపొందినవాడు, ఆ భ్రాంతి పోయినపుడు "యః స్థాణుః సః పురుషః"- ఏ స్థాణువున్నదో అది పురుషుడు అని చెప్పును. ఇచట 'స్థాణువు, పురుషుడు' అని రెండు శబ్దములను సమాన విభక్తివచనములందు ప్రయోగింపబడుచున్నవి.

ఇట్లు ప్రయోగించుటకు సామానాధికరణ్యనిర్దేశ మని పేరు. కాని ఈ ప్రయోగము 'ఈ వృక్షమే చూతవృక్షము' ఇత్యాది సామానాధికరణ్యనిర్దేశములలో వృక్ష-చూతములకు అభేదమును చెప్పినట్లు స్థాణు-పురుషులకు అభేదమును బోధించుటకై ఉద్దిష్టము కాదు. "ఏది చూచి స్థాణు వనుకొంటినో అది స్థాణువుకాదు; పురుషుడు" అను విధమును స్థాణుత్వనిషేధమునకై ఉద్దిష్టమైనది. దీనికి 'బాధాయాం సామానాధికరణ్యమ్' అని పేరు. అట్లే "అహం బ్రహ్మ" అనునపుడు కూడ "బాధాయాం సామానాధికరణ్యం". ఇంతవరకును 'నేను', 'నేను' అనుకొనునది "బ్రహ్మయే" యని దీని యర్థము. కావున సర్వాత్మకమగు బ్రహ్మయందు అహంత్వము కూడ కల్పితమే. కావుననే "వదత్యేష భ్రాన్తస్త్వమహమితి మాయామదిరయా" (శ్లో. 392) అని చెప్పియున్నాడు. కావున "అహం బ్రహ్మ" అను దానికి, "యః చోరః సః స్థాణుః"-దేనినిచూచి చోరుడనుకొన్నానో అది స్థాణువు ఇత్యాదిస్థలములందువలె, "దేనిని 'అహం' బుద్ధితో గ్రహించుచుంటినో అది బ్రహ్మయే" అని యరము. లేదా "అహం భావోదయాభావః" అను పదమునకు 'కోశములందు అహంబుద్ధి కలుగకుండుట' అని యర్థము. "లీనవృత్తే రనుత్పత్తిః మర్యాదోపరతేస్తు సా"- ఆనందాత్మయందు లీనమైపోయిన మనోవృత్తి, నెయ్యి మరల, ఏ విధముగ, క్షీరముగ మార్పుచెందదో, ఆ విధముగ, మరల ఉదయింపకుండుట ఉపరతియొక్క పరమావధి. అట్టి ఉపరతి వలన స్వతః అనుపమమగు ఆనందము, దానివలన పరమతృప్తియు, దాని వలన అన్నికార్యములనుండి నివృత్తియు కలుగును. ఈ విధముగ (వైరాగ్య-బోధ-ఉపరతి-ఆనంద-తృప్తి-నివృత్తులకు) పరస్పరము కార్యకారణభావమును గ్రహింపవలెను.

అవ. ఇపుడు, జ్ఞానియొక్క ఆనందము సాటిలేనిదని చెప్పచున్నాడు

# జీవన్ముక్తుని లక్షణము

బ్రహ్మాకారతయా సదా స్థితతయా నిర్ముక్త బాహ్యార్థధీః
అన్యావేదితభోగ్య భోగకలనో నిద్రాళువత్ బాలవత్,
స్వప్నాలోకితలోకవ జ్జగదిదం పశ్యన్ క్వచిల్లబ్ధధీః
ఆస్తే కశ్చి దనన్తపుణ్యఫలభు గ్ధన్యః స మాన్యో భువి-426

సదా=ఎల్లప్పుడును, బ్రహ్మాకారతయా=బ్రహ్మాకారమై, స్థిత తయా=ఉండుటచేత, నిర్ముక్తబాహ్యార్థధీః=తొలగిపోయిన బాహ్యవిషయ ములుగల బుద్ధికలవాడై, నిద్రాలువత్=నిద్రపోవుచున్నవానివలెను, బాలవత్=బాలుడు వలెను, అన్యావేదిత భోగ్యభోగకలనః=ఇతరులచే సమర్పింపబడిన భోగ్యవస్తువుల భోగముకలవాడై, ఇదం=ఈ, జగత్= జగత్తును, స్వప్నాలోకితలోకవత్=స్వప్నమునందుచూడబడిన లోకమును వలె, పశ్యన్=చూచుచు, క్వచిత్=ఒకానొక అనిర్వాచ్యమగు వస్తువు నందు, అనగా బ్రహ్మయందు, లబ్ధధీః=స్థిరమైన బుద్ధికలవాడై, కశ్చిత్= ఒకానొక పురుషుడు, (జ్ఞాని), ఆస్తే=ఉండును. అనంతపుణ్యఫలభుక్= అనంతములైన పుణ్యముల ఫలమైన మోక్షమును అనుభవించుచున్న, ధన్యః=ధన్యుడైన, సః=అతడే, భువి=ఈ భూమియందు, మాన్యః= పూజనీయుడు.

"బ్రహ్మాకారతయా సదా స్థితతయా" అనునది బుద్ధినిర్ముక్త బాహ్యార్థమనుటలో హేతువు. సదా=ఇతరప్రత్యయములు (జ్ఞాన ములు) ఏవియులేక అవిచ్ఛిన్నముగ బ్రహ్మాకారతయా=పరమపురు షార్థమైన అఖండసచ్చిదానంద పరమాత్మరూపమున ఉండుటచే నిర్ముక్త బాహ్యార్థధీః=వాసనాసహితముగ పూర్తిగ నశించిన బాహ్యార్థములు కల బుద్ధికలవాడై. ఇచట 'నిర్ముక్త' అను పదమునకు విడువ బడిన అని యర్థము కాక 'తమంతట తాముగనే నశించిన' అను నర్థము చెప్పబడినది. అందులకు కారణ మేమనగా "రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే"-ఆ పరమాత్మ సాక్షాత్కారము లభించిన

పిమ్మట విషయవాసన కూడ తనంతట తానే తొలగిపోవును అను భగవద్గీతా వాక్యానుసారముగ బ్రహ్మదర్శనము కలిగిన పిమ్మట విషయములను తొలగించుటకు ప్రయత్నము ఏమియు ఆవశ్యకముకాదు. అవి తమంతట తామే నశించును. ఈ 'నిర్ముక్తబాహ్యార్థధీః' అను పదము 'కశ్చిత్' అను దానికి విశేషణము "అన్యావేదిత భోగ్యభోగ కలనః", అన్యైః = ఇతరులచే, ఆవేదితం = సమకూర్చబడిన, యత్ భోగ్యం = శరీరస్థితికి నిమిత్తమైన ఏ అన్నపానాదికము కలదో, దానిచే, భోగస్య = భోగముయొక్క, కలనః = ఏర్పాటుకలవాడై, నోటిదగ్గరకు వచ్చిన ఆహారమును భుజించువాడై అని యర్థము. నిద్రపోవుచున్న వాడు ఇతరులు తినిపించిన ఆహారమును భుజించునో, బాలుడు తల్లి తినిపించిన ఆహారమును భుజించునో, ఆ విధముగనే బహిర్ముఖుడు కాకుండుటచేతను, దేహాద్యభిమానరహితు డగుటచేతను నిద్రపోవు చున్నవాడువలెను, బాలుడువలెను, ఇతర జనసంపాదిత భోగములను మాత్రమే అనుభవించువాడై, అట్టి జ్ఞాని ప్రారబ్ధకర్మ ననుసరించి ప్రాప్తించు భోగములనుమాత్రమే అనుభవించుచుండును; కాని అట్టి భోగముకూడ పరుల ద్వారా మాత్రమే లభించి ఈతని శరీరస్థితికి హేతు వగునని భావము. క్వచిత్ = పరమాత్మయందు, లబ్ధధీః = ప్రతిష్ఠితమగు బుద్ధి కలవాడై లేదా, క్వచిత్ = ఎప్పుడో ఒకప్పుడు (అప్పుడప్పుడు), లబ్ధధీః = బహిర్ముఖమైన (సమాధినుండి బయటకు వచ్చిన) బుద్ధి కలవాడై, ఈ జగత్తును, స్వప్నమునందు చూడబడిన లోకమునువలె మిథ్యగా చూచుచు, కశ్చిత్ = బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడగు ఒకానొకడు, అనన్తపుణ్యఫలభుక్ = శతకోటి జన్మలలో చేసిన సుకృతమునకు ఫలముగా లభించిన మోక్షానందమును అనుభవించుచు, ఆస్తే = ఉండును. సః = ఆ, ధన్యః = ధన్యుడు, భువి = భూమియందు, మాన్యః = సకలపూజ్యుడు. దీనిచే, విషయ స్పర్శలేనిదియు, స్వతఃసిద్ధము, నిరుపమము అగు ఆనందమే ఆత్మ జ్ఞానమునకు ఫలమని చెప్పినట్లైనది. ఈ విషయమునే - "సోఽశ్నుతే

సర్వాన్ కామాన్ సహ "_ఆతడు, జ్ఞాని, కామముల నన్నింటిని ఒక్కు మ్మడిగ పొందును.

"యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే,
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః."

వాపీకూపాదులగు ఉదకస్థానములవలన కలుగుప్రయోజనమంతయు పొంగిపొరలుచున్న జలముతో నిండిన అతివిశాలమగు ఉదకస్థానము వలన కలుగు ప్రయోజనములో అంతర్గత మగును. అట్లే సకల వేదోక్త కర్మాచరణజన్య ఫలము జ్ఞానికి కలుగు ఫలములో అంతర్గత మగును, "ఏతస్యై వానన్దస్య అన్యాని భూతాని మాత్రాముపజీవన్తి" భూతము లన్నియు ఈ బ్రహ్మానందముయొక్క అంశను మాత్రమే ఆలంబనముగ జేసికొని జీవించుచున్నవి, మొదలగు శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. అనగా ఇతరానందములన్నియు ఈ బ్రహ్మానందములో అంతర్గతము లే యగును అని భావము. లేదా 'అనన్తపుణ్యఫలభుక్' అను పదమునకు మరియొక అర్థము చెప్పవచ్చును_ లోకములో ఎందరెందరు పురుషులు, ఎన్నెన్ని పుణ్యములుచేసి, ఏ యే సుఖములను అనుభవింతురో ఆ సుఖముల నన్నింటిని, జీవబ్రహ్మైక్య సాక్షాత్కారవంతుడగు జ్ఞాని ఒక్కుమ్మడిగనే అనుభవించును. ఏలన ఆతడు అనుభవించు బ్రహ్మానందము సముద్రమువంటిది. తైత్తిరీయోపనిషదర్థమును వివరించుచు, బ్రహ్మగీతలో, విషయభోగముల వలన కలుగు సుఖము లన్నియు బ్రహ్మానందామృతమహాసముద్రములోని బిందువులవంటి వని చెప్పబడినది.

సోఽశ్నుతే సకలాన్ కామానక్రమేణ సురర్షభాః,
విదితబ్రహ్మరూపేణ జీవన్ముక్తో న సంశయః.

ఓ! దేవశ్రేష్ఠులారా! బ్రహ్మతత్త్వసాక్షాత్కారముపొందిన జీవన్ముక్తుడు అన్నికామములను క్రమరహితముగ (ప్రథమ పుణ్యఫలసుఖము మొదట, ద్వితీయ పుణ్యఫలసుఖము తరువాత అను క్రమము లేకుండ ఒక్కుమ్మడిగ పొందును. సంశయము లేదు.

స్నాతం తేన సమస్తతీర్థసలిలే సర్వాపి దత్తావనిః
యజ్ఞానాం చ సహస్రమిష్ట మఖిలా దేవాశ్చ సంతర్పితాః,
సంసారాచ్చ సముద్ధృతాః స్వపితర స్త్రైలోక్యపూజ్యోఽప్యసౌ
యస్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్.

ఎవని మనస్సు బ్రహ్మవిచారణమునందు క్షణముపాటైనను స్థిరముగ నుండునో ఆతడు సమస్త తీర్థోదకములయందు స్నానము చేసినట్లే; భూమినంతను దానము చేసినట్లే, వేయి యజ్ఞములు చేసినట్లే; దేవతలనందరిని తృప్తిపరచినట్లే; పితృదేవతలనందరినీ సంసారమునుండి ఉద్ధరించినట్లే. అతడు మూడు లోకములందును పూజ్యుడు అని చెప్పబడినది. అట్టి సమయమున ఎల్లప్పుడును బ్రహ్మనిష్ఠుడై యున్నవాడు పూజ్యుడను విషయమును వేరుగ చెప్పవలెనా?

కులం పవిత్రం జననీ కృతార్థా
విశ్వంభరా పుణ్యవతీ చ తేన,
అపారసంవిత్సుఖసాగరేఽస్మిన్
లీనం పరే బ్రహ్మణి యస్య చేతః.

ఎవని చిత్తము అపారజ్ఞానానంద సాగరమగు పరబ్రహ్మయందు లీనమైనదో ఆతని కులము పవిత్రము. తల్లి కృతార్థురాలు. ఆతనినిబట్టి భూమికూడ పవిత్ర మగును అనికూడ చెప్పబడినది. "తస్మాదాత్మజ్ఞం హ్యర్చయే ద్భూతికామః"-అందువలన ఐశ్వర్యాభిలాషకలవాడు ఆత్మజ్ఞానవంతుని పూజింపవలెను అని శ్రుతి వాక్యము కూడ చెప్పుచున్నది.

అవ. జీవన్ముక్తలక్షణము తెలిసినచో, సాధకులగు ముముక్షువులు కూడ ఆ విధముగ నుండుటకై ప్రయత్నించుటకు వీలగును గాన, ముముక్షు జనానుగ్రహముకొఱకు జీవన్ముక్తలక్షణములను చెప్పుటకు ఉపక్రమించుచున్నాడు-

స్థితప్రజ్ఞో యతి రయం యః సదానన్ద మశ్నుతే,
బ్రహ్మణ్యేవ విలీనాత్మా నిర్వికారో వినిష్క్రియః. 427

బ్రహ్మణ్యేవ = బ్రహ్మయందే, విలీనాత్మా = విలీనమైన అంతఃకరణము కలవాడై, నిర్వికారః = వికారములు లేనివాడై, వినిష్క్రియః = క్రియాశూన్యుడై, యః = ఎవడు, సదా = ఎల్లప్పుడును, ఆనన్దం = ఆనందమును, అశ్నుతే = పొందునో, అయం = ఈ, యతిః = యతి, స్థితప్రజ్ఞః = స్థితప్రజ్ఞుడు.

బ్రహ్మయందే విలీనమైన అంతఃకరణము కలవాడై, కావుననే హర్షము, విషాదము మొదలగు మానసిక వికారములు లేనివాడై, వినిష్క్రియః = బాహ్యములగు దేహాదులచేష్టలు లేనివాడై, లేదా, 'వినిష్క్రియః' అనునది 'నిర్వికారః' అని చెప్పుటలో హేతువు. అందువలననే, సమన్వయసూత్రభాష్యమున – "క్రియా హి స్వాశ్రయ మవికుర్వతీ నైవాత్మానం లభతే" – ఏదైన ఒక క్రియ జరిగిన దన్నచో దానిచే, దాని ఆశ్రయమునందు ఏదియో వికారము (మార్పు) కలిగి తీరును అని చెప్పబడినది. (ఈ విధముగ) ఎవడు ఎల్లప్పుడును ఆనందమును అనుభవించునో అట్టి యతి స్థితప్రజ్ఞుడు. ఈ శ్లోకము సూత్రస్థానీయము. (సూత్రమువంటిది. అనగా ఈ శ్లోకములో సంక్షిప్తముగ చెప్పిన అర్థమే రాబోవు శ్లోకములలో విశదీకరింపబడును.)

అవ. అందు 'స్థితప్రజ్ఞః' అను దాని అర్థమును విశదీకరించుచున్నాడు_

బ్రహ్మాత్మనోః శోధితయో రేక భావావగాహినీ,
నిర్వికల్పా చ చిన్మాత్రవృత్తిః ప్రజ్ఞేతి కథ్యతే,
సా సర్వదా భవేద్యస్య స జీవన్ముక్త ఉచ్యతే. 428

శోధితయోః = శోధింపబడిన, బ్రహ్మాత్మనోః = బ్రహ్మజీవాత్మల యొక్క, ఏకభావావగాహినీ = ఐక్యముతో సంబంధించినదియు, నిర్వికల్పా = నిర్వికల్పమైనదియు, చిన్మాత్రా = శుద్ధజ్ఞానస్వరూపమైన, వృత్తిః = మనోవృత్తి, ప్రజ్ఞేతి = ప్రజ్ఞ అని, కథ్యతే = చెప్పబడుచున్నది, సా = అట్టిచిత్తవృత్తి, యస్య = ఎవనికి, సర్వదా = ఎల్లప్పుడును, భవేత్ = ఉండునో, సః = అతడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడుగా, ఇష్యతే = అంగీకరింపబడును (చెప్పబడును).

స్థితా = ఎల్లప్పుడును ఉన్న, ప్రజ్ఞా = ప్రజ్ఞ, యస్య = ఎవనికో, సః = అతడు - స్థితప్రజ్ఞుడు అని విగ్రహము. అందు 'ప్రజ్ఞా' శబ్దార్థమును చెప్పుచున్నాడు — శోధితయోః = మహావాక్యార్థమును విశదీకరించు సమయమున చూపిన విధముగ తత్', 'త్వమ్' పదములచే, లక్షణావృత్తిచే బోధింపబడినవియు, ఉపాధిరహితములును అగు, బ్రహ్మాత్మనోః = పరమాత్మప్రత్యగాత్మలయొక్క, ఏకభావావగాహినీ = ఐక్యమును పరామర్శించునదియు, నిర్వికల్పా = అసత్యభూతములగు సంసర్గము మొదలైన పదార్థములకు సంబంధించనిదియు, వి-'రామః ఫలం భక్షయతి' అను దానికి రాముడు కర్తగా కలదియు, ఫలము కలదియు వర్తమానకాలికమును అగు భక్షణక్రియ అని యర్థము. ఇచట 'రామపదార్థము కర్తగాను- 'ఫల' పదార్థము కర్మగాను, 'భక్షయతి' పదార్థమగు భక్షణక్రియలో అన్వయించినవి. ఇట్లు పదార్థములు ఒకదానితో నొకటి అన్వయించుటకు సంసర్గమని పేరు. 'తత్త్వమసి' ఇత్యాది వాక్యార్థములలో ఇట్టి పదార్థసంసర్గ మేమియు భాసింపక అఖండవాక్యార్థమే భాసించును. చిదాకారా = అఖండచిదాకారమును అగు, వృత్తిః = శ్రవణ-మనన-నిదిధ్యాసనములచే సంస్కృతమగు మనస్సుయొక్క పరిణామము 'ప్రజ్ఞ' యని చెప్పబడును ఇపుడు 'స్థితప్రజ్ఞ' లోని 'స్థిత' పదార్థమును చెప్పుచున్నారు - "సా సర్వదా భవేద్యస్య" అట్టివృత్తి ఎల్లపుడును ఎవనికి ఉండునో అతడు జీవన్ముక్తుడు అని చెప్పబడును. 'అది' కాని దానిని 'అది' అని

అనుకొనుటయే బంధము. అఖండ బ్రహ్మాకారవృత్తి కలిగిన పిమ్మట బంధమునకు ప్రసక్తియే యుండదు గాన, అట్టివాడు జీవన్ముక్తుడు. ("నేను బ్రహ్మను ధ్యానించుచున్నాను" ఇత్యాది భేదబుద్ధికి లేశమాత్ర మైనను అవకాశము లేక మనస్సు పూర్తిగ బ్రహ్మాకారమైపోయిన స్థితికి అఖండచిదాకారస్థితి యని పేరు. ఇట్టి స్థితిని, కొంతవరకు సుషుప్త్య వస్థలో చవిచూడవచ్చును.)

యస్య స్థితా భవేత్ ప్రజ్ఞా యస్యానన్దో నిరన్తరః,
ప్రపఞ్చో విస్మృతప్రాయః స జీవన్ముక్త ఇష్యతే. 429

యస్య = ఎవనియొక్క, ప్రజ్ఞా = ప్రజ్ఞ, స్థితా = స్థిరమైనదై, భవేత్ = ఉండునో, యస్య = ఎవనియొక్క, ఆనన్దః = ఆనందము నిరన్తరః = అంతరాయము లేనిదో (ఎవనిచే), ప్రపఞ్చః = ప్రపంచము, విస్మృతప్రాయః = మరవబడినదా అన్నట్లుండునో, సః = అతడు జీవన్ముక్తః = జీవన్ముక్తుడుగా, ఇష్యతే = అంగీకరింపబడును.

ఈ శ్లోకము, సూత్రశ్లోకములో (427) ఉన్న "యః సదానన్ద మశ్నుతే", "బ్రహ్మణ్యేవ విలీనాత్మా" అనుదానికి వివరణరూపము. ఇచట చెప్పబడిన దంతయు జీవన్ముక్తుని స్వరూపమే. అందుచే ఇందలి విశేషణములు ఇతరవ్యావర్తకములు అను శంక చేయరాదు. -అనగా 'నీలమ్ ఉత్పలమ్' ఇత్యాది వాక్యములందు 'నీలమ్' అను విశేషణము, ఈ ఉత్పలమును నీలభిన్నమైన శుక్లవర్ణోత్పలాదులనుండి వేరుగ చూపుటకై ప్రయోగింపబడినది. ఇచట జీవన్ముక్తునివిషయమున ప్రయోగించిన విశేషణములు, ఆ విధముగ, ఇతరవ్యావృత్తికై, ప్రయోగించినవి కావు. 'ప్రకృష్టప్రకాశః చన్ద్రః' అనునపుడు 'ప్రకృష్టః ప్రకాశః' అనునది ఏవిధముగ చంద్రునిస్వరూపమును బోధించుటకై ప్రయోగింపబడినదో, ఈ విశేషణములు కూడ జీవన్ముక్తుని స్వరూపమును బోధించుటకు ఉద్దేశింపబడినవి. అనగా, నల్లనివి కాని

తెల్లకలువ మొదలైనవి కూడ ఉన్నట్లు జీవన్ముక్తులలో ఈ లక్షణము లున్నవారు, లేనివారు కొందరు ఉందు రనుటకు అవకాశము లేదు. చంద్రు డెప్పుడును ప్రకృష్టప్రకాశస్వరూపుడే కాని మరియొక రీతిగ ఉండడు కదా?; లేదా- ఎవని ప్రజ్ఞ స్థిరముగ నుండునో అతడు జీవన్ముక్తుడు; ఎవని ఆనందము నిరంతరముగా నుండునో అతడు జీవన్ముక్తుడు; ఎవనికి ప్రపంచ మంతయు విస్మృతప్రాయమో అతడు జీవన్ముక్తుడు అని సమన్వయము. ఇచట ప్రపంచము విస్మృత ప్రాయము (విస్మృతమైనట్లుండును) అని చెప్పుటలో అభిప్రాయ మేమనగా- జీవన్ముక్తుడు ప్రపంచమును మరచియే యుండును. కాని "ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః" - తత్త్వవేత్తలగు జ్ఞానులు నీకు జ్ఞానమును ఉపదేశింతురు అని గీతలో చెప్పిన విధమున శిష్యులకు ఉపదేశించుటకై, జీవన్ముక్తునకుకూడ శిష్యాదృష్టము ననుసరించి సమాధిస్థితి నుండి వ్యుత్థానము (బాహ్యస్మృతి) కలుగు చుండును. అపుడు ఆతనికి, శిష్యోపదేశమునకు ఆవశ్యకములగు ప్రమాణవాక్యాదుల స్మృతి కలుగును. ఇతరప్రపంచ మేదియు స్మృతి పథమునకు రాదు. కావున ప్రపంచ మంతయు ఈతనికి విస్మృత ప్రాయమే.

అవ సుషుప్తికిని జీవన్ముక్తావస్థకును భేదమును చెప్పు చున్నాడు-

**లీనధీరపి జాగర్తి యో జాగ్రద్ధర్మవర్జితః,**
**బోధో నిర్వాసనో యస్య స జీవన్ముక్త ఇష్యతే. 430**

యః=ఎవడు, లీనధీరపి=లీనమైన బుద్ధికలవాడైనను, జాగ్రద్ధర్మ వర్జితః=జాగ్రదవస్థకు సంబంధించిన ధర్మములులేనివాడై, జాగర్తి= మేల్కొని యుండునో, యస్య=ఎవనియొక్క, బోధః=పదార్థజ్ఞానము, నిర్వాసనః=వాసనారహితమో, సః=అతడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడుగా, ఇష్యతే=అంగీకరింపబడును.

సుషుప్త్యవస్థలో మనస్సు అజ్ఞానములో లీన మగును. కాని ఇపుడు (జీవన్ముక్తావస్థయందు) చిన్మాత్రమగు బ్రహ్మయందు లీన మగును. అందుచే తమఃసంబంధ మేమాత్రము లేకపోవుటచే లీన మనస్కుడైనను, మెలకువగ ఉండును. అనగా ఈతని అవిద్యానిద్ర తొలగి పోయినది అని యర్థము. లేదా సకలపదార్థములును అనావృతమగు ఆత్మతో సంబంధించిన వగుటచే, సర్వమును స్వాభిన్నముగ చూచును అని అర్థము. (ఈ సమయమున జీవన్ముక్తుడు ఇంద్రియములచేతనే పదార్థములను చూచుచుండునుగాన) "ఇన్ద్రియైరర్థోపలబ్ధిర్జాగరితమ్" - ఇంద్రియములచే విషయములను గ్రహించుట జాగరము అను లక్షణము ఇచటకూడ ప్రవర్తించును. "యో జాగ్రద్ధర్మవర్జితః" అను వాక్యముచే ఈతడు జాగ్రదవస్థలో నున్నను, పూర్వమునందువలె, స్థూలదేహాద్యభిమానము ఉండదు అని చెప్పుచున్నారు.

రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్,
ఆత్మవశ్యై ర్విధేయాత్మా స శాన్తి మధిగచ్ఛతి.

రాగద్వేషరహితములును, తన వశములోనున్నవియు అగు ఇంద్రియములచే విషయములను గ్రహించుచు, ఎవడు నిగ్రహింపబడిన మనస్సుకలవాడో, అతడు శాంతిని పొందును అని భగవద్గీతలో చెప్పిన విధమున ఇతడు (జీవన్ముక్తుడు) అభ్యాసకాలమునందే శాంతి సంపాదనకై ప్రయత్నము చేసియున్నాడు. కావున ఇపు డాతనికి దేహాద్యభిమానము కలుగుటకు అవకాశము లేదు. ఎవనియొక్క, బోధః = పదార్థముల జ్ఞానము కూడ, నిర్వాసనః = ఆసక్తి రహితమో;

యదృచ్ఛోపనతే ష్వపి దిగ్ద్రవ్యేషు యథా పునః,
నీరాగమేవ పతతి తద్వద్ భోగ్యేషు ధీరధీః.

- దైవవశముచే ప్రాప్తించిన దిక్కులవైపునను, పదార్థములవైపునను దృష్టి ఏ విధముగ రాగశూన్యముగనే ప్రసరించునో స్థిరబుద్ధి గల

జ్ఞాని కూడ భోగ్యవస్తువుల విషయమున ఆ విధముగనే ప్రవర్తించును అను వాసిష్ఠోక్తి ననుసరించి జీవన్ముక్తుడు ఆ యా పదార్థములను చూచుచున్నను, ఇది హేయము, ఇది గ్రాహ్యము అను బుద్ధి, ఆతనికి కలుగదని యభిప్రాయము. లేదా- "లీనధీరపి జాగర్తి"-చక్షురాదింద్రియములు వాటి వాటి స్థానములలో నుండుటచే, ఇంకను ఉపరతి (ఇంద్రియనాశము) కలుగకపోవుటచే, మెలకువగ నున్నాడు ఇంద్రియము లున్నను, మనస్సు బ్రహ్మయందు లీనమై యుండుటచే, ఇంద్రియముల ద్వారా పదార్థములను గ్రహింపడు గాన అతడు జాగ్రద్ధర్మవర్జితుడు. 'బోధో నిర్వాసనో యస్య' అను దానికి అర్థమేమనగా ఒకప్పుడు పదార్థజ్ఞానము కలిగినను, దృఢతరమగు వివేకముండుటచే అతని మనస్సునందు రాగద్వేషాదులు ఉదయించవు. ఈ విధముగ సూత్రశ్లోకములో (427) నున్న 'నిర్వికారః' అను పదముయొక్క భావము వివరింపబడినది.

అవ. ఈ నిర్వికారత్వమునే, పండ్రెండు శ్లోకములలో ప్రధానముగ వివరించుచున్నాడు. ఆ నిర్వికారత్వ మున్నపుడే ప్రజ్ఞాస్థైర్యము సిద్ధించును. ఆ ప్రజ్ఞాస్థైర్యముచే సదానందము అప్రయత్నసిద్ధముగ లభించును- -

శాన్తసంసారకలనః కలావానపి నిష్కలః,
యః సచిత్తోఽపి నిశ్చిత్తః స జీవన్ముక్త ఉచ్యతే. 431

యః = ఎవడు, శాన్తసంసారకలనః = శాంతించిన సంసారబంధము కలవాడో, కలావానపి = విద్యావంతుడైనను, నిష్కలః = నిష్కలుడో, సచిత్తోఽపి = చిత్తముతో కూడినవాడైనను, నిశ్చిత్తః = చిత్తరహితుడో, సః = అతడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడుగా, ఇష్యతే = అంగీకరింపబడును.

శాన్తసంసారకలనః = శాంతించిన సంసారబంధము కలవాడు. ఈ విశేషణము, ఇతడు నిశ్చిత్తుడని చెప్పుటకు హేతువు. కలావానపి =

సకలవిద్యావేత్తయైనను, నిష్కలః=బ్రహ్మాకారవృత్తికంటె భిన్నము లైన వృత్తులు లేనివా డగుటచే కలారహితుడు లేదా మోక్షము కలుగు వరకును ప్రాణ-శ్రద్ధాది షోడశకలలతో కూడియున్నను, ఆతనికి వాటి విషయమున అభిమానరూపమగు సంబంధ ముండదు. అందుచే ఇతరుల ప్రాణశ్రద్ధాదులతో ఏ విధముగ ఈతనికి సంబంధము లేదో అట్లే తన ప్రాణశ్రద్ధాదులతో కూడ సంబంధ ముండదు. కావున ఇతడు నిష్కళుడు అని యర్థము. ప్రాణశ్రద్ధాది షోడశకళలు_

"స ప్రాణ మసృజత; ప్రాణాత్ శ్రద్ధాం, ఖం, వాయుః, జ్యోతిః, ఆపః, పృథివీ, ఇన్ద్రియం, మనః, అన్నం, అన్నాద్ వీర్యం, తపః, మన్త్రాః కర్మ, లోకాః, లోకేషు చ నామ చ." అని ప్రశ్నోపనిషత్తులో చెప్పబడినవి. ఎవడు సచిత్తోఽపి=స్వాత్మ రూపమున పరిణతమగు చిత్తము కలవాడైనను, నిశ్చిత్తః=బాహ్య వృత్తులు లేకపోవుట వలన లేదా అమాయకునివలె రాగాదులు లేని వాడగుటవలన, చిత్తములేనివాడో ఆతడు జీవన్ముక్తుడుగా అంగీక రింపబడును.

వర్తమానేఽపి దేహేఽస్మిం శ్ఛాయావదనువర్తిని,
అహంతా మమతాభావో జీవన్ముక్తస్య లక్షణమ్. 432

ఛాయావత్=నీడవలె, అనువర్తిని=అనుసరించుచు, అస్మిన్= ఈ, దేహే=దేహము, వర్తమానేఽపి=ఉంటూన్నను, అహంతా మమతా భావః=అహంకార మమకారములు లేకుండుట, జీవన్ముక్తస్య=జీవన్ము క్తునియొక్క, లక్షణమ్=లక్షణము.

నీడవలె వెన్నంటుచు ఈ దేహము ఉంటూన్నను, పరుల దేహమువిషయమున ఏ విధముగ ఉండవో, అదే విధముగ తన దేహమువిషయమున గూడ అహంకార మమకారములు లేకుండుట జీవన్ముక్తుని లక్షణము. ఇట్లు చెప్పుటచే - రాగద్వేషాది వికారములు,

జరామరణాది వికారములు ఇవన్నియు స్థూలదేహాభిమానమును బట్టి వచ్చినవి గాన, ఆ స్థూలదేహాభిమానము అనెడు మూలకారణము పోయినతోడనే, నిర్వికారత్వము సిద్ధించును అను విషయము స్పష్టీకరింపబడినది.

అతీతాననుసన్ధానం భవిష్య దవిచారణమ్,
ఔదాసీన్యమపి ప్రాప్తే జీవన్ముక్తస్య లక్షణమ్. 433

అతీతాననుసన్ధానం = జరిగిపోయిన దానినిగూర్చి స్మరింపకుండుట, భవిష్యదవిచారణం = రానున్న దానినిగూర్చి ఆలోచింపకుండుట, ప్రాప్తే = లభించిన దాని విషయమున, వర్తమానము విషయమున, ఔదాసీన్యం = ఉదాసీనత్వము అనగా సంగరాహిత్యము, జీవన్ముక్తస్య = జీవన్ముక్తుని యొక్క, లక్షణం = లక్షణము.

గుణదోషవిశిష్టేఽస్మిన్ స్వభావేన విలక్షణే,
సర్వత్ర సమదర్శిత్వం జీవన్ముక్తస్య లక్షణమ్. 434

స్వభావేన = స్వభావముచేత, విలక్షణే = విలక్షణమైనదియు, గుణదోషవిశిష్టే = గుణదోషములతో కూడిన, అస్మిన్ = ఈ ప్రపంచమునందు, సర్వత్ర = అంతటను, సమదర్శిత్వం = సమదర్శనము కలిగియుండుట, జీవన్ముక్తస్య = జీవన్ముక్తునియొక్క, లక్షణం = లక్షణము.

గుణదోషములతో కూడినదియు. కావుననే స్వభావముచేత విలక్షణమైనదియు ఈ జగత్తునందు, అంతటను, సమదర్శిత్వం = సమముగా చూచుట—

"న నిషేధతి దోషధియా గుణబుద్ధ్యా వా న కించిదాదత్తే,
అవిద్యైక మఖిలమితి జ్ఞాత్వోదాస్తే యతిః కోఽపి."

దోషదృష్టితో దేనిని కూడ నిషేధించడు; గుణదృష్టితో దేనిని కూడ స్వీకరించడు. సమస్తము కూడ అవిద్యాకల్పితమే యని తెలిసికొని,

ఒకానొక యోగి - (అట్టి యోగి ఎక్కడనో కాని లభింపడు అని భావము) ఉదాసీనుడుగ నుండును అని ఆత్మవిలాసమునందు చెప్పిన విధమున, పరిహరించుట, స్వీకరించుట అనునది లేకుండుటయే సమదర్శిత్వము లేదా 'సమం' అనగా బ్రహ్మ. 'నిర్దోషం హి సమం బ్రహ్మ'-బ్రహ్మ నిర్దోషము, సమము అని స్మృతి (గీతా) వాక్యము. కావున 'సర్వత్ర సమదర్శిత్వం' అనగా అంతటను బ్రహ్మను చూచుట. ఇది జీవన్ముక్తుని లక్షణము.

ఇష్టానిష్టార్థసంప్రాప్తౌ సమదర్శితయాత్మని,
ఉభయత్రావికారిత్వం జీవన్ముక్తస్యలక్షణమ్. 435

ఇష్టానిష్టార్థసంప్రాప్తౌ=ఇష్టమైన విషయము కాని, అనిష్టమైన విషయముకాని ప్రాప్తించినప్పుడు, సమదర్శితయా=సమముగా చూచుటచే ఇది ఇష్టము, ఇది అనిష్టము అనెడు బుద్ధి లేకపోవుటచే, ఆత్మని=తనలో, ఉభయత్ర = ఇష్టానిష్టములు రెండింటియందును, అవికారిత్వం = హర్ష విషాదములు లేకుండుట, జీవన్ముక్తస్య=జీవన్ముక్తునియొక్క, లక్షణమ్= లక్షణము. జీవన్ముక్తునకు ఇష్టానిష్టములు అను మాట లేకున్నను, లోక దృష్ట్యా ఇచట ఇష్టము, అనిష్టము అని చెప్పబడినది.

బ్రహ్మానన్దరసాస్వాదాసక్తచిత్తతయా యతేః,
అన్తర్బహిరవిజ్ఞానం జీవన్ముక్తస్య లక్షణమ్. 436

బ్రహ్మానన్దరసాస్వాదాసక్తచిత్తతయా=బ్రహ్మానందరసాస్వాదము నందు లగ్నమైన చిత్తము కలిగియుండుటచే (చిత్తము బ్రహ్మానంద రసాస్వాదలగ్న మగుటచే), అన్తఃబహిః అవిజ్ఞానం = అంతరజ్ఞానము గాని, బాహ్యజ్ఞానముగాని లేకుండుట, జీవన్ముక్తస్య = జీవన్ముక్తుడైన, యతేః = యతియొక్క, లక్షణమ్ = లక్షణము, (స్పష్టార్థ మగుటచే శ్రీచరణులు 'స్పష్టమ్' అని మాత్రమే వ్రాసినారు.

దేహేన్ద్రియాదౌ కర్తవ్యే మమాహంభావవర్జితః,
ఔదాసీన్యేన యస్తిష్ఠేత్ స జీవన్ముక్త ఇష్యతే. 437

దేహేన్ద్రియాదౌ = దేహేంద్రియాదికమునందును, 'ఆది' పదముచే మనో-బుద్ధ్యహంకారములను కూడ గ్రహింపవలెను, కర్తవ్యే = చేయతగిన కర్మయందును, మమాహం భావవర్జితః=మమకార అహంకారములు లేనివాడై, అనగా కర్మవిషయమున "ఇది నేను చేయవలసియున్నది. ఇది నేను చేసినాను" అనెడు మమకారము లేనివాడై, దేహేంద్రియాదులవిషయమున "నేను మనుష్యుడను, నేను చూచుచున్నాను, ఇది నా దేహము, నా నేత్రము" అనెడు అధ్యాసలేనివాడై, యః=ఎవడు, ఔదాసీన్యేన = ఔదాసీన్యముతో, అనగా అధ్యాసకల్పితమగు తాదాత్మ్యబుద్ధిలేకపోవుటచే సంగరహితుడై, తిష్ఠేత్ = ఉండునో, సః = అతడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడుగా, ఇష్యతే =అంగీకరింపబడును.

విజ్ఞాత ఆత్మనో యస్య బ్రహ్మభావః శ్రుతేర్బలాత్,
భవబన్ధ వినిర్ముక్తః స జీవన్ముక్త ఇష్యతే. 438

శ్రుతేః బలాత్ = 'తత్త్వమసి' మొదలగు వేదవాక్యముల యొక్క మహిమచే, ఆత్మనః = తనయొక్క, బ్రహ్మభావః = బ్రహ్మత్వము, (తానే బ్రహ్మయను విషయము), యస్య = ఎవనికి (ఎవనిచే) విజ్ఞాతః = సాక్షాత్కరింప బడినదో, భవ బన్ధ వినిర్ముక్తః=సంసారబంధముల నుండి ముక్తుడైన, అనగా మూలాజ్ఞానము కూడ నశించుటచే సకల విధములగు భ్రాంతులును తొలగిన, సః = అతడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడుగా, ఇష్యతే = అంగీకరింపబడును.

అవ. భవబంధవినిర్ముక్తత్వమునే స్పష్టముగ చెప్పుచున్నాడు

దేహేన్ద్రియేష్వహంభావః ఇదంభావస్తదన్యకే,
యస్య నో భవతః క్వాపి స జీవన్ముక్త ఇష్యతే. 439

యస్య = ఎవనికి, దేహేన్ద్రియేషు = దేహమునందును ఇంద్రియ ములయందును, అహంభావః = 'నేను' అనెడు బుద్ధియు, తదన్యకే = దేహేంద్రియాదులకంటె భిన్నమైన ఘటాదికమునందు, ఇదంభావః = 'ఇది' అనెడు బుద్ధియు- క్వాపి = ఏ సమయమునందును, న భవతః = కలుగవో, సః = అతడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడుగా, ఇష్యతే = అంగీక రింపబడును. ఆత్మభిన్నత్వ మనునది. దేహేంద్రియాదులకును, ఘటాదుల కును సమానమే. తనయందు కల్పితము లగుట యనునదికూడ రెండిం టికిని సమానమే కావున, వాసనాశూన్యమగు బోధగల జీవన్ముక్తునకు, పూర్వవాసనను మాత్రము నిమిత్తముగ జేసికొని బయల్వెడలు అహం భావ ఇదంభావములు కలుగవు అని భావము.

జీవేశోభయ సంసారరూప దుర్వాసనోజ్ఝితా,
సా సర్వదా భవేద్యస్య స జీవన్ముక్త ఉచ్యతే. 440

యస్య = ఎవనికి, సా = ఆ, జీవేశోభయ సంసారరూపదుర్వా సనా = జీవుడు, ఈశ్వరుడు అను ద్వయము, సంసారము అనెడు దుష్టమగు వాసన (జీవేశ్వరుల భేదదృష్టిచే ఏర్పడిన సంసారవాసన), సర్వదా = ఎల్లప్పుడును, ఉజ్ఝితా = విడువబడినదై, భవేత్ = అగునో, సః = అతడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడుగా, ఉచ్యతే = చెప్పబడును (శ్రీచరణులు దీనికి వ్యాఖ్య వ్రాయలేదు).

న ప్రత్యగ్బ్రహ్మణోర్భేదం కదాపి బ్రహ్మసర్గయోః,
ప్రజ్ఞయా యో విజానాతి స జీవన్ముక్త ఇష్యతే. 441

యః = ఎవడు, కదాపి = ఎన్నడును, ప్రత్యగ్బ్రహ్మణోః = జీవాత్మ పరమాత్మలయొక్కయు, బ్రహ్మసర్గయోః = బ్రహ్మజగత్తులయొక్కయు, భేదం = భేదమును, న విజానాతి = తెలిసికొనడో, సః = అతడు, జీవ న్ముక్తః = జీవన్ముక్తుడుగా, ఇష్యతే = అంగీకరింపబడును.

"విభేదజనకేఽజ్ఞానే నాశమాత్యన్తికం గతే,
ఆత్మని బ్రహ్మణో భేద మసన్తం కః కరిష్యతి."

భేదజ్ఞానమునకు హేతువగు అజ్ఞానము పూర్తిగ తొలగిపోయిన పిమ్మట జీవాత్మ బ్రహ్మలకు లేని భేదమును ఎవరు కల్పింపగలరు అను ప్రమాణముచే, ప్రత్యగ్బ్రహ్మణోః=జీవబ్రహ్మలకును, 'సృజ్యతే ఇతి సర్గః' అను విగ్రహముచే సర్గశబ్దమునకు సృష్టింపబడు జగత్తు అని యర్థము. 'బ్రహ్మైవేదం విశ్వమ్'-ఈ ప్రపంచ మంతయు బ్రహ్మ రూపమే అను శ్రుతి ననుసరించి, రజ్జువుపై సర్పము కల్పితమైనట్లు, ఈ ప్రపంచము బ్రహ్మయందు కల్పితము. అందుచే ఇది స్వకల్పనా ధిష్ఠానమగు బ్రహ్మకంటె భిన్నము కాదు (వేరుగ లేదు). "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్"- అంతయు ఆత్మ స్వరూపమే అయినపుడు ఎవడు, దేనిని, దేనితో చూచును, "యత్ర నాన్యత్పశ్యతి"-ఎచట తనకంటె భిన్నమైన దానిని దేనిని కూడ చూడడో, "యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమన్తరం కురుతే, అథ తస్య భయం భవతి"-ఇతడు ఈ ఆత్మస్వరూపమునందు ఏ కొంచెమై నను భేదబుద్ధిని చేయునో, అపుడు ఆతనికి భయము కలుగును ఇత్యాది శ్రుతుల ననుసరించి భయరూపమగు బ్రహ్మయందు స్థిరమైన స్థితిని పొందిన ఆ జీవన్ముక్తునకు కొంచెమైనను భేదజ్ఞానము ఉండదని భావము, కావున, ఆతనికి భేదజ్ఞానము కలుగుట లేదనగా అందులకు కారణము భేదమనునది లేకపోవుటయే. భేదము శశవిషాణమువలె త్రైకాలిక నిషేధప్రతియోగి కదా? అనగా భేద మనునది పూర్వ మెన్నడును లేదు. ఇపుడు లేదు. భవిష్యత్తునందు కూడ ఉండబోదు. వాస్తవముగనున్న వస్తువును గూర్చి తెలియకున్నచో అట్టివాడు కించిద్జ్ఞుడు కావచ్చును; కాని లేనిదానిని గూర్చి తెలియకున్నచో కించిద్జ్ఞత్వదోషము లేదు. సర్వజ్ఞులైన యోగీశ్వరులకు శశవిషాణాదుల జ్ఞానము లేకపోవుటచే, వారు అసర్వజ్ఞులని ఎవ్వరును అనరు కదా? కావున జీవన్ముక్తుడు, నిర్వికల్పము, సకలశాస్త్రముల సంస్కార ముచే సంస్కృతమగు మనస్సుయొక్క పరిణామరూపమైనదియు, చిన్మాత్రమును అగు ప్రజ్ఞతో కూడినవాడై భేదమును తెలిసికొనడు.

ప్రమాణాంతరములచే తెలియనిదియు, ప్రమాణాంతరములకు విరుద్ధము కానిదియు, సప్రయోజనమును అగు విషయమును బోధించి నపుడే శాస్త్రము ప్రమాణమగును.(భేదము అట్టి విషయము కాదు గాన శాస్త్రము భేదమును బోధించుటకై ప్రవర్తింపదు అని భావము). లోకముయొక్క అజ్ఞానముచే భేదము ఉన్నట్లు కనబడుచున్నది. అది నిష్ప్రయోజనము. అట్టి భేదము, తన ఉపాదానకారణమగు అజ్ఞానముతో కూడ నివృత్తమైపోయిన పిమ్మట మరల అది అఖండాకారవృత్తిలో ఎట్లు భాసించును?

ప్రతీతిర్జీవజగతోః స్వప్నవద్భాతి యావతా,
తావన్నిరన్తరం విద్వన్ స్వాధ్యాసాపనయం కురు. (286)

అని వెనుక ఉపదేశించిన విధమున, భ్రమలన్నియు తొలగిపోయిన వానికి భేదజ్ఞాన మెన్నటికిని కలుగదు గాన, ఏతాదృశ లక్షణ సంపన్నుడు, జీవన్ముక్తుడని అంగీకరింపబడును.

**సాధుభిః పూజ్యమానేఽస్మిన్ పీడ్యమానేఽపి దుర్జనైః,**
**సమభావో భవేద్యస్య స జీవన్ముక్త ఇష్యతే. 442**

**అస్మిన్ = ఈ శరీరము, సాధుభిః=సత్పురుషులచేత, పూజ్యమానేఽపి=పూజింపబడుచున్నను, దుర్జనైః=దుర్జనులచేత, పీడ్యమానేఽపి=పీడింపబడుచున్నను, యస్య=ఎవనికి, సమభావః=సమత్వము, హర్షామర్షాది శూన్యత్వము, భవేత్=కలుగునో, సః=అతడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడుగా, ఇష్యతే=అంగీకరింపబడును.**

అవ. వేయేల?

**యత్ర ప్రవిష్టా విషయాః పరేరితాః**
**నదీప్రవాహా ఇవ వారిరాశౌ,**
**లినన్తి సన్మాత్రతయా న విక్రియామ్**
**ఉత్పాదయన్త్యేష యతి ర్విముక్తః. 443**

పరేరితాః=పరులచే ప్రేరితములైన, విషయాః=విషయములు, నదీప్రవాహాః=నదీప్రవాహములు, వారిరాశావివ=సముద్రము నందువలె, యత్ర=ఏ జీవన్ముక్తునిలో, ప్రవిష్టాః=ప్రవేశించినవై, లినవ్తి=లీనమై పోవునో, సన్మాత్రతయా=ఈతడు అఖండబ్రహ్మ స్వరూపుడగుటచే, విక్రియాం=వికారమును, న ఉత్పాదయన్తి=పుట్టింపవో, ఏషః=అట్టి, యతిః=యతి, విముక్తః=ముక్తుడు.

పరేరితాః=అన్యప్రేరితములగు; ఇట్లు చెప్పుటచే, బ్రహ్మసాక్షాత్కారము పొందిన పురుషునకు తానుగా విషయోన్ముఖుడగుట ఉండదు అని సూచింపబడినది. పరులుచేయు స్తుతినిందాదులు కూడ, పరుల దృష్టినిబట్టి మాత్రమే సాధువు లనియు, అసాధువు లనియు చెప్పబడుచున్నవి. అట్టి శబ్దాదివిషయములు, యత్ర ప్రవిష్టాః=ఎవనిని ఉద్దేశించి చేయబడినవై, సముద్రములో ప్రవేశించిన నదీప్రవాహమువలె లీనమైపోవునో, వికారమును పుట్టింపవో, అనగా హర్షమును గాని, అమర్షమును గాని, దైన్యమును గాని కలిగింపవో, 'సన్మాత్రతయా' అనునది వికారానుత్పాదనమునకు హేతువు. నేను అఖండ బ్రహ్మస్వరూపుడను అను దృఢనిశ్చయముతో నున్నవానికి, శరీరమునకు సంబంధించిన స్తుతినిందాదులచే ఏమగును? నిర్గుణమును, నిర్దోషమును అగు బ్రహ్మయందు ఉన్నవారికి ఎట్టి వికారములును ఉండవు. అట్టివారి విషయమున పరులేమి చేసినను, ఆకాశమును కొట్టుటకై ఖడ్గాద్యాయుధములను ప్రయోగించినట్లు వ్యర్థమే యగును. ఏష యతిః=ఎవనియందు ప్రవేశించిన విషయములు వికారమును పుట్టింపజాలవో అట్టి యతి, విముక్తః=వాసనలన్నియు క్షీణించుట చేతను, మనస్సు కూడ నష్టమగుటచేతను మోక్షము పొందినవాడు

అవ. "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సమ్పత్స్యే" - ఈ శరీరము రాలిపోవుటయే తడవుగ బ్రహ్మైకత్వము

పొందును అను శ్రుతిని, "భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే"- ఫలము నిచ్చుటకు ప్రారంభించిన పుణ్యాపాపములను భోగముచేతనే క్షీణింపజేసికొని, పిదప బ్రహ్మసంపత్తి పొందును అను బ్రహ్మసూత్రమును అనుసరించి, జ్ఞానులకు కూడ ప్రారబ్ధకర్మానుసారముగ భోగము ఉండునని అంగీకరింపవలెను కదా? భోగ మనగా సుఖదుఃఖానుభవము. ఇట్లు సుఖదుఃఖములను అనుభవింపవలసిన వానికి నిర్వికారత్వ మెట్లుండును అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు -

విజ్ఞాతబ్రహ్మతత్త్వస్య యథాపూర్వం న సంసృతిః,
అస్తి చే న్న స విజ్ఞాతబ్రహ్మభావో బహిర్ముఖః. 444

విజ్ఞాతబ్రహ్మతత్త్వస్య=బ్రహ్మతత్త్వము తెలిసినవానికి, యథాపూర్వం=పూర్వమునందువలె, సంసృతిః=సంసారము, న=ఉండదు, అస్తి చేత్=ఉన్నట్లైతే, బహిర్ముఖః=బహిర్ముఖుడైన, సః=అతడు, విజ్ఞాతబ్రహ్మభావః=బ్రహ్మతత్త్వమును తెలిసినవాడు, న=కాదు.

విజ్ఞాతబ్రహ్మతత్త్వః=అనుభవింపబడిన బ్రహ్మతత్త్వము కలవాడు; అట్టివాని మిథ్యాజ్ఞానము (అజ్ఞానము) నశించిపోవుటచే, ఆ మిథ్యాజ్ఞానము వలన ఏర్పడిన అభిమానముండదు గాన; యథాపూర్వం=అనుభవము కలుగుటకు పూర్వమువలె, సంసృతిః న=సుఖదుఃఖానుభవరూపమగు సంసారము ఉండదు. అతనికి స్పృహ(ఆసక్తి) గాని, ఉద్వేగము గాని ఉండవు గాన సుఖదుఃఖానుభవ ముండదు. కావుననే, భగవద్గీతలో-

"దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః,
వీతరాగభయక్రోధః స్థితధీ ర్మునిరుచ్యతే."

కష్టములు వచ్చినపుడు మనస్సులో ఆవేశము చెందనివాడు, సుఖముల యందు ఆసక్తి లేనివాడు, రాగము, భయము, క్రోధము లేనివాడు అగు ముని స్థితప్రజ్ఞుడని చెప్పబడును అని చెప్పబడినది. ఇతరులు

ఈ విధముగ ఉండజాలరు. వారు రాగ-భయ-కోపాద్యావిష్టులై దుఃఖ ములకు భయపడుచు, సుఖముకొరకై ఆశించుచుందురు. ఆ విష యమునే చెప్పుచున్నాడు-అస్తి చేత్=ఉద్వేగస్పృహాదిక మున్నట్లైతే, బహిర్ముఖః=కోశములయందు ఆత్మాభిమానముగల ఆతడు, తెలియ బడిన బ్రహ్మస్వభావము కలవాడు కాడు.

ప్రాచీనవాసనావేగా దసౌ సంసరతీతి చేత్,
న సదేకత్వ విజ్ఞానా న్మన్దీభవతి వాసనా. 445

ప్రాచీనవాసనావేగాత్=బ్రహ్మానుభవముకంటె పూర్వమునందున్న అనాది జన్మలలో సంచితమగు వాసనయొక్క వేగమువలన, అసౌ=ఈ బ్రహ్మవేత్త, సంసరతి=బంధమును పొందును, ఇతి చేత్=అని అన్న ట్లైతే, న=కాదు, సదేకత్వవిజ్ఞానాత్=అద్వితీయము, అఖండము, స్వ ప్రకాశానందరూపము అగు బ్రహ్మతో అభేదమును సాక్షాత్కరించుకొనుట వలన, వాసనా=అల్పములు, జడములు, దుఃఖాత్మకములు అని నిశ్చితము లగు అనాత్మపదార్థములయందు ఆత్మత్వభ్రమచే కలిగిన వాసన, మన్దీ భవతి=తగ్గిపోవును; అరుణోదయకాలమున చీకటివలె శిథిలమైపోవును అని అర్థము.

అవ. అందులకు దృష్టాంతమును చెప్పుచున్నాడు-

అత్యన్తకాముకస్యాపి వృత్తిః కుణ్ఠతి మాతరి,
తథైవ బ్రహ్మణి జ్ఞాతే పూర్ణానన్దే మనీషిణః. 446

అత్యన్తకాముకస్య=మిక్కిలి కాముకుడైన వానియొక్క, వృత్తిః అపి=ప్రవృత్తి కూడా, మాతరి=తల్లి విషయమున, కుణ్ఠతి=ప్రతిహత మగును. పూర్ణానన్దే=పూర్ణానందస్వరూపమైన, బ్రహ్మణి=బ్రహ్మ, జ్ఞాతే=తెలియబడినదగుచుండగా, మనీషిణః=జ్ఞానియొక్క, (ప్రవృత్తి కూడ జగత్తు విషయమున), తథైవ=అట్లే.

పూర్ణానన్దే=అఖండానందరూపమగు, బ్రహ్మ సాక్షాత్కరింపబడినదగుచుండగా, మనీషిణః=వివేకవంతునియొక్క, వృత్తి, జగత్తు విషయమున ప్రతిహత మగును. (ఈ విషయమునే సమర్థించుచు) "చన్ద్రే మహోల్లాదిని దీప్యమానే చిత్రేన్దు మాలోకయితుం క ఇచ్ఛేత్" (524) అని చెప్పనున్నాడు.

## ప్రారబ్ధ విచారము

నిదిధ్యాసనశీలస్య బాహ్యప్రత్యయ ఈక్ష్యతే,
బ్రవీతి శ్రుతిరేతస్య ప్రారబ్ధం ఫలదర్శనాత్. 447

నిదిధ్యాసనశీలస్య = నిదిధ్యాసనముచేయు స్వభావము కలవానికి, బాహ్యప్రత్యయః = బాహ్యవిషయజ్ఞానము, ఈక్ష్యతే = కనబడుచున్నది. ఏతస్య = ఇతనికి, ఫలదర్శనాత్ = సుఖదుఃఖానుభవరూపమగు ఫలము కనబడుటవలన, ప్రారబ్ధం = ప్రారబ్ధమును, శ్రుతిః = శ్రుతి, బ్రవీతి = చెప్పుచున్నది.

విపరీతభావనతొలగుటకై నిదిధ్యాసనశీలస్య=నిదిధ్యాసనము చేయుటయందు స్వభావముగలవానికి లేదా నిదిధ్యాసనమే స్వభావముగా గలవానికి, బాహ్యజ్ఞానము కనబడుచున్నది. అతడు కూడ బుద్ధిని ఆత్మపై స్థిరముగ నిలుపుటకై ఎల్లప్పుడును ప్రయత్నము చేయుచుండుట కానవచ్చుచున్నది కదా? ఏతస్య=ఈ ధ్యాతకు, ఫలదర్శనాత్=సుఖదుఃఖానుభవము కనబడుటవలన, శ్రుతి ప్రారబ్ధమును చెప్పుచున్నది. (అనగా అట్టి ధ్యాత కూడ ప్రారబ్ధమును అనుభవింపవలసియుండునని చెప్పుచున్నది.) కర్తృత్వము దుఃఖరూపమగుటవలనను, ధ్యానము పూర్తియైనపిమ్మట దేహాదిభావము కలుగుటకు కూడ అవకాశముండుటవలనను, నిదిధ్యాసన మనునది సవికల్పకసమాధిరూప మగుటవలనను, పూర్వకర్మానుసారముగ

సుఖముకాని, దుఃఖముకాని భాసింపవచ్చును. అది (నిదిధ్యాసనము సవికల్పకసమాధి యను విషయము)–

"శ్రుతేః శతగుణం విద్యాత్ మననం మననాదపి,
నిదిధ్యాసం లక్షగుణ మనన్తం నిర్వికల్పకమ్. (365)
"నిర్వికల్పక సమాధినా స్ఫుటం
బ్రహ్మతత్త్వ మవగమ్యతే ధ్రువమ్,
నాన్యథా చలతయా మనోగతేః
ప్రత్యయాన్తరవిమిశ్రితం భవేత్." (366)

అను శ్లోకములలో చెప్పబడినది. అటులే ఇచట కూడ, బాహ్య ప్రత్యయము ఉండుననియు, బాహ్యప్రత్యయ ముండునపుడు ప్రారబ్ధానుసారముగ సుఖముకాని, దుఃఖముకాని కలుగుననియు చెప్పబడినది. కావుననే "న హ వై సశరీరస్య ప్రియాప్రియయో రపహతిరస్తి"– శరీరమున్నంతవరకును ప్రియాప్రియములు పూర్తిగ తొలగవు అను శ్రుతివాక్యము ఉపపన్న మగును. అపుడు (నిదిధ్యాసన సమయమున) ఇంకను బ్రహ్మసాక్షాత్కారము కలుగకుండుటచే అధ్యాస తొలగదు. అప్పుడు శరీరాత్మలకు, అధ్యాసచే ఏర్పడిన సంబంధము ఉండుటచే సశరీరత్వముండును. కావున 'తస్య తావదేవ చిరమ్' ఇత్యాది శ్రుతియు, "భోగేన త్వితరే"ఇత్యాది సూత్రమును, అట్టి నిదిధ్యాసనశీలుని గూర్చి చెప్పినవి; ఏలన, ప్రారబ్ధాదికము అనాత్మధర్మము గాన, నిర్గుణబ్రహ్మవేత్తకు అది (ప్రారబ్ధాదికము) అసంభావ్యము.

అవ. పై శ్లోకములో చెప్పిన విషయమునకు ఉపపత్తి చూపుచున్నాడు–

సుఖాద్యనుభవో యావ త్తావత్ప్రారబ్ధ మిష్యతే,
ఫలోదయః క్రియాపూర్వో నిష్క్రియో న హి కుత్రచిత్. 448

**సుఖాద్యనుభవః = సుఖాదులయొక్క అనుభవము, యావత్ = ఎంత వరకు ఉండునో, తావత్ = అంతవరకును, ప్రారబ్ధం = ప్రారబ్ధము, ఇష్యతే = అంగీకరింపబడును. ఫలోదయః = ఫలముయొక్క పుట్టుక, క్రియాపూర్వః = క్రియపూర్వమునందు కలది, అనగా ఫలము క్రియవలన జనించును. కుత్రచిత్ = ఎక్కడను, నిష్క్రియః = క్రియలేనిది, నహి = ఉండదుకదా?**

ఎంతకాలము సుఖాద్యనుభవముండునో అంతవరకును ప్రారబ్ధ మున్నట్లు అంగీకరింపబడును. అందులకు కారణము చెప్పుచున్నాడు- హి=ఎందువలన అనగా, ఫలోదయః=సుఖముయొక్క ఉదయము గాని, దుఃఖముయొక్క ఉదయము గాని, క్రియాపూర్వః=క్రియ పూర్వమునందు కలది కర్మజన్యము: అని అర్థము. ఎచటను కూడ, న నిష్క్రియః=కర్మ లేకుండ కలుగదు. నిమిత్తము లేని కార్యముండదు కదా? సుఖదుఃఖములు సదసత్కర్మలవలన మాత్రమే కలుగుచుండును. కర్మఫలము అనాత్మకు సంబంధించినది. కావున ఆత్మకు, అనాత్మలగు దేహాదులవిషయమున తాదాత్మ్యాధ్యాసము లేనిచో కర్మఫల సంబంధమే ఉండదు. కావున బాహ్యప్రయత్నము చేసెడు ధ్యానశీలునకు కర్మల ననుసరించి భోగము కలుగుచుండును అని ఉపపాదింపబడినది.

అవ. పూర్వోక్తములగు శ్రుతి సూత్రములు మందశంకకు సమాధానముచెప్పుటకు ఉద్దిష్టమైనవి అని చెప్పనున్నవారై, ముందుగ "తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ"-బ్రహ్మసాక్షాత్కారము లభించినపిమ్మట, రాబోవు (పాపముతో) కర్మతో సంబంధముండదు; వెనుకటిది నశించును) అను బ్రహ్మసూత్రము ననుసరించియు, "క్షీయన్తే చాస్య కర్మాణి"-ఈ జ్ఞానియొక్క కర్మలన్నియు క్షీణించును అను శ్రుతి ననుసరించియు, (ఇచట నశించునవి) ప్రారబ్ధకర్మ వ్యతిరిక్తములగు కర్మలని గ్రహింపవలెనను భిప్రాయముతో, బ్రహ్మ సాక్షాత్కారము సంచితకర్మలను (వెనుక ప్రోగుపడియున్న కర్మలను) నశింపజేయును అని చెప్పుచున్నాడు-

అహం బ్రహ్మేతి విజ్ఞానా త్కల్పకోటిశతార్జితమ్,
సంచితం విలయం యాతి ప్రబోధాత్ స్వప్నకర్మవత్. 449

అహం = నేనే, బ్రహ్మ=కర్తృత్వరహితమగు బ్రహ్మను, ఇతి= =అని, విజ్ఞానాత్ = సాక్షాత్కారమువలన, కల్పకోటిశతార్జితమ్ = శతకోటి కల్పములలో సంపాదింపబడిన, సంచితం = సంచితకర్మ, ప్రబోధాత్ = మేల్కొనుటవలన, స్వప్నకర్మవత్ = స్వప్నములో చేసిన కర్మవలె, విలయం = వినాశమును, యాతి = పొందును.

అవ. దృష్టాంతమును ఉపపాదించుచున్నాడు -

యత్ కృతం స్వప్నవేళాయాం
పుణ్యం వా పాపముల్బణమ్,
సుప్తోత్థితస్య కిం తత్ స్యాత్
స్వర్గాయ నరకాయ వా. 450

స్వప్నవేళాయాం=స్వప్నసమయమునందు, యత్=ఏ, ఉల్బణం= తీవ్రమైన, పుణ్యం వా=పుణ్యము కాని, పాపం=పాపము కాని, కృతం= చేయబడినదో, తత్ = అది, సుప్తోత్థితస్య=నిద్రించి మేల్కొన్న వానికి, స్వర్గాయ=స్వర్గహేతువు గాని, నరకాయ వా=నరకహేతువు గాని, స్యాత్ కిమ్ = అగునా?

ఆత్మైకత్వసాక్షాత్కార మనెడు ప్రబోధమును (మెలకువను) పొందినవాడును, అవిద్య నశించుటచే ఉపాధికృత కర్తృత్వము కూడ లేనివాడును అగు జ్ఞానికి, అవిద్య అనెడు నిద్రాసమయమునందు ఆచరించిన కర్మలేవియును ఫలము నీయజాలవు అని భావము.

అవ. అనాత్మాధ్యాసము నశించుటచే సంచితకర్మలు నశించును అని చెప్పి, ఇపుడు, ఆగామికర్మలు కూడ సంబంధించవు అని చెప్పుచున్నాడు. కర్మకు ఆశ్రయభూతములగు దేహాద్యనాత్మ పదార్థములతో తాదాత్మ్యాధ్యాసముండుటచే, పూర్వము, నేనే కర్తనను

జ్ఞానముండెడిది. అట్టి కర్తృత్వజ్ఞాన మున్న కాలమున చేయబడిన కర్మలుకూడ ఆ కర్తృత్వజ్ఞానము నశింపగనే నశించినవి. కర్తృత్వ రహిత బ్రహ్మాత్మత్వ సాక్షాత్కారము కలిగినచో, ఆతనికి రాబోవు కర్మలతో సంబంధమే ఉండదని ఇపుడు చెప్పబడుచున్నది-

స్వ మసఙ్గ ముదాసీనం పరిజ్ఞాయ నభో యథా,
న శ్లిష్యతే యతిః కిఞ్చిత్ కదాచిద్ భావికర్మభిః. 451

స్వం = తనను, అసఙ్గం = సంగరహితునిగాను, అనగా ఒక్కనిగాను, ఉదాసీనం = కర్తృత్వము లేని వానినిగను, పరిజ్ఞాయ = బాగుగ తెలిసికొని, యతిః = ఆత్మవేత్త, నభః యథా - ఆకాశమువలె, అనగా, ఆకాశము ఏ విధముగ జలము, వాయువు, అగ్ని మొదలగు వాటితో సంబంధింపదో ఆ విధముగ, కదాచిత్ = ఎన్నడును, కించిత్ = కొంచెమైనను, భావికర్మభిః = ఆత్మసాక్షాత్కారము కలిగిన పిమ్మట చేసిన కర్మలచే, ఆ కర్మలు శరీరాదులయందున్నను వాటిచే, న శ్లిష్యతే = సంబంధింపదు, నేను చేయుచున్నాను అను అభిమాన మనెడు సంగము లేకపోవుటచే సంబంధింపదు. కర్మతో సంబంధము గల దేహేంద్రియాదులతో తాదాత్మ్యాధ్యాస మున్నచో, ఆ దేహేంద్రియాదులను బట్టి (ఇవి నా కర్మలు అని) కర్మాధ్యాసము కూడ కలుగును. మూలాజ్ఞానము నశింపగనే అనాత్మలగు దేహేంద్రియాదుల తాదాత్మ్యాధ్యాసము నశింపగా, వాటి ధర్మములతో (కర్మలతో) సంబంధముండదు.

అవ. ఈ చెప్పిన విషయమును దృష్టాన్తమగు ఆకాశమునందు ఉపపాదించుచు, దార్ష్టాన్తికమునందు కూడ సమన్వయించుచున్నాడు-

న నభో ఘటయోగేన సురాగన్ధేన లిప్యతే,
తథాత్మోపాధియోగేన తద్ధర్మై ర్నైవ లిప్యతే. 452

నభః = ఆకాశము, ఘటయోగేన = ఘటముతో సంబంధించి ఉండుటచేత, సురాగన్ధేన = కల్లుయొక్క వాసనచేత, న లిప్యతే = లిప్తముకాదు. తథా = అట్లే, ఆత్మా = ఆత్మ, ఉపాధియోగేన = ఉపాధులతో సంబంధముండుటచే, తద్ధర్మైః = ఆ ఉపాధుల ధర్మములచేత, నైవలిప్యతే = లిప్తము కాదు.

జగత్తును వ్యాపించియున్న ఆకాశము, ఘటావచ్ఛిన్న మగుటచే పరిచ్ఛిన్నమువలె కనబడుచున్నను నిర్మలము, మూర్తి రహితము అగుటచే, అవచ్ఛేదకమగు ఘటములోనున్న సురయొక్క గంధముచేత లిప్తము కాదు. ఈ విధముగనే, ఆత్మకూడ, ఉపాధి యోగేన=విదేహకైవల్యము కలుగువరకును అనువర్తించు స్థూల సూక్ష్మశరీర రూపములగు ఉపాధులతో మిథ్యాసంబంధ మున్నను, తద్ధర్మైః=స్థూలసూక్ష్మశరీర ధర్మములగు దేవతావందనము, తార జపము మొదలగు ధర్మములచే లిప్తము కాదు.

అవ. ఇపుడు "భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే" అను సూత్రముయొక్క అర్థమును చెప్పుచున్నాడు-

జ్ఞానోదయాత్పురారబ్ధం కర్మజ్ఞానాన్న నశ్యతి,
అదత్వా స్వఫలం లక్ష్య ముద్దిశ్యోత్సృష్టబాణవత్. 453

జ్ఞానోదయాత్='అహం బ్రహ్మాస్మి' అను సాక్షాత్కారము కలుగుటకు పూర్వము, ఆరబ్ధం=ఫలము నిచ్చుటకు ప్రారంభించిన, కర్మ=కర్మ, స్వఫలం=తన ఫలమైన సుఖమును గాని దుఃఖమును గాని, అదత్వా= ఇవ్వకుండగా, లక్ష్యం ఉద్దిశ్య=లక్ష్యమును ఉద్దేశించి, ఉత్సృష్టబాణవత్= విడువబడిన బాణము వలె; ఇది ఉత్తరశ్లోకమునందు స్పష్టీకరింపబడును. జ్ఞానాత్=కర్తృత్వరహితాత్మ సాక్షాత్కారమువలన, న నశ్యతి=నశింపదు. సంచితము నశించును కాని ఇది నశింపదు.

అవ. 'లక్ష్యముద్దిశ్య' ఇత్యాది దృష్టాంతమును స్పష్టీకరించు చున్నాడు-

వ్యాఘ్రబుద్ధ్యా వినిర్ముక్తో బాణః పశ్చాత్తు గోమతౌ,
న తిష్ఠతి ఛినత్త్యేవ లక్ష్యం వేగేన నిర్భరమ్. 454

వ్యాఘ్రబుద్ధ్యా=వ్యాఘ్రమనెడు బుద్ధితో, వినిర్ముక్తః=విడువబడిన, బాణః=బాణము, పశ్చాత్=తరువాత, గోమతౌ=గోవు అను బుద్ధికలుగగా, న తిష్ఠతి=ఆగదు; వేగేన=వేగముచే, లక్ష్యం=లక్ష్యమును, నిర్భరం=తప్పక, ఛినత్త్యేవ=చంపియే తీరును.

'ఈ దుష్టవ్యాఘ్రమును చంపవలెను' అను నభిప్రాయముతో ఆకర్ణాంతము లాగి విడువబడిన బాణము, పశ్చాత్=బాణము విడచిన పిమ్మట, గోమతౌ=ఎదుటనున్న వ్యక్తి గోవు అను బుద్ధి కలిగినను, న తిష్ఠతి=వెనుకకు తిరిగి రాదు; వేగముచేత, నిర్భరం=తప్పక, బాగుగా, లక్ష్యం=ఎదుటనున్న వస్తువును, ఛినత్త్యేవ=చంపియే తీరును. ఈ విధముగనే, కర్మ తన ఫలమును ఇచ్చుటకు ఉపక్రమించుటచే ఈ నడుమ బ్రహ్మసాక్షాత్కారము కలిగినను, తా నీయవలసిన ఫలమును ఇచ్చియే క్షీణించును. "ఇతరే=ఫలము నిచ్చుటకు ప్రారంభించిన పుణ్యపాపములను, భోగేన=ఆ పుణ్యపాప ఫలముల అనుభవము చేత, క్షపయిత్వా=క్షీణింప జేసికొని, సమ్పద్యతే=విదేహ ముక్తుడగును" అని పై బ్రహ్మసూత్రమున కర్థము. "తస్య=ఆ జ్ఞానికి, తావదేవ చిరమ్=అంత ఆలస్యము మాత్రమే ఉండును; యావత్=ఎంతవరకు, న విమోక్ష్యే=ప్రారబ్ధకర్మాధీనత్వముచే శరీరమును విడువడో; అథ=శరీరపాతానంతరము, సంపత్స్యే=సంపన్నుడగును, అనగా విదేహముక్తి పొందును" అని పూర్వోదాహృతశ్రుతికి అర్థము.

అవ. ఈ శ్రుతి సూత్రముల అర్థమును పూర్వార్ధమున సంగ్రహించి, ఉత్తరార్ధమున పరమార్థమును చెప్పుచున్నాడు -

ప్రారబ్ధం బలవత్తరం ఖలు
విదాం భోగేన తస్య క్షయః,
సమ్యగ్జ్ఞానహుతాశనేన విలయః
ప్రాక్సఞ్చితాగామినామ్.

బ్రహ్మాత్మైక్య మవేక్ష్య తన్మయ
తయా యే సర్వదా సంస్థితాః,
తేషాం తత్త్రితయం న హి
క్వచిదపి బ్రహ్మైవ తే నిర్గుణమ్. 455

విదాం=జ్ఞానులకు, ప్రారబ్ధమ్=ప్రారబ్ధము, బలవత్తరం ఖలు=బలవత్తరమైనది కదా? భోగేన=భోగముచేత, తస్య=ఆ ప్రారబ్ధము యొక్క, క్షయః=క్షయము కలుగును. ప్రాక్సంచితాగామినాం=సంచిత కర్మలకును, ఆగామి కర్మలకును, సమ్యగ్జ్ఞాన హుతాశనేన=ఆత్మజ్ఞాన మనెడు అగ్నిచేత, విలయః=నాశము కలుగును. బ్రహ్మాత్మైక్యం=బ్రహ్మాత్మలయొక్క ఐక్యమును, అవేక్ష్య=సాక్షాత్కరింపజేసికొని, యే=ఎవరు, సర్వదా=ఎల్లప్పుడును, తన్మయతయా=ఆ బ్రహ్మస్వరూపముననే, సంస్థితాః=ఉన్నారో, తేషాం=వారికి, తత్=ఆ, త్రితయం=సంచితాగామి ప్రారబ్ధకర్మలత్రయము, క్వచిదపి=ఎన్నడును, న హి=ఉండదు కదా? తే=వారు, నిర్గుణం=నిర్గుణమైన, బ్రహ్మైవ=బ్రహ్మమే.

జ్ఞానము ఏకరూపమేయైనను, సమాధిప్రకర్షనుబట్టి ఏర్పడిన, సత్త్వాపత్తి, అసంసక్తి, పదార్థభావన, తుర్యగ అనెడు భూమికలను అనుసరించి, బ్రహ్మసాక్షాత్కారము పొందినవారిని, బ్రహ్మవిత్తు, బ్రహ్మవిద్వరుడు, బ్రహ్మవిద్వరీయుడు, బ్రహ్మవిద్వరిష్ఠుడు అని నాల్గుతరగతులుగ విభజించి వ్యవహరించుట కలదు. వారిలో తుర్యగాభూమికలో నున్న బ్రహ్మవిద్వరిష్ఠుడు కేవల నిర్గుణబ్రహ్మ రూపు డగుటచే ఆతనికి పరులుచేయు ప్రబోధముకూడ ఉండదు గాన (ఇతరులద్వారా ప్రాప్తించినవిషయముల జ్ఞానము కూడ ఉండదు గాన) ఆతనికి త్రివిధకర్మలును ఉండవు (మూడవభూమికలో ఉన్న) బ్రహ్మవిద్వరీయునకు పరకృతమగు ప్రబోధము కలిగినపుడు, ప్రపంచ భానము కలుగును. అపుడు ప్రారబ్ధకర్మ తన వ్యాపారమును చేయుటచే, మహావిష్ణువు చేసిన పాంచజన్య ధ్వనిని వినుటచే ప్రహ్లాదునకు కలిగినట్లు, ఆతనికి సమాధినుండి వ్యుత్థానము కలుగును. (రెండవ భూమికలో నున్న) బ్రహ్మవిద్వరుడు, స్థితప్రజ్ఞుడే యైనను కర్మవశ

ముచే స్వయముగనే సమాధినుండి వ్యుత్థితు డగుచు సుఖదుఃఖాదుల భానమును పొందుచుండును అను విషయము, అర్జునుడు వేసిన, 'స్థిత ప్రజ్ఞస్య కా భాషా' ఇత్యాది ప్రశ్నలకు సమాధానముగ భగవద్గీతలో చెప్పిన స్థితప్రజ్ఞలక్షణములవలన స్పష్టముగ తెలియుచున్నది. జ్ఞాన పరిపాకము కొరకై సంన్యాసమును స్వీకరించి తమ ఉపదేశముచే జన కాదులకు బ్రహ్మసాక్షాత్కారము కలిగించిన యాజ్ఞవల్క్యాదులు (మొదటిభూమికలో ఉన్న) బ్రహ్మవిదులు. అట్టి, విదాం=జ్ఞానులకు, జ్ఞానప్రారబ్ధములలో ప్రారబ్ధము బలవత్తరమైనది అను విషయము ప్రసిద్ధము. ఆ ప్రారబ్ధకర్మ, భోగముచేతనే నశించును. సమ్యగ్ జ్ఞానహుతాశనేన=సమ్యగ్జ్ఞానమే అగ్ని; దానిచే ప్రాక్సంచితాగా మినాం=జ్ఞానోదయమునకు పూర్వము చేసిన సంచితకర్మలకును, జ్ఞానానంతరము చేయనున్న ఆగామికర్మలకును, విలయః=నాశము; అనగా సంచితకర్మల వినాశము, ఆగామికర్మల అశ్లేషము కలుగును. బ్రహ్మాత్మైక్యమును, అవేక్ష్య=సాక్షాత్కరించు కొని, తన్మయ తయా=బ్రహ్మరూపమున, ఇచటి 'మయట్' ప్రత్యయము స్వార్థము నందే వచ్చినది (దీనికి వికారాద్యర్థము లేవియు లేవు). ఎవరు ఎల్లప్పుడును ఉన్నారో, అనగా తుర్యగాభూమికను అధిష్ఠించి యున్నారో, వారికి, తత్ త్రితయం=ఆ త్రివిధకర్మయు, క్వచిదపి= ఎన్నడును, న హి=ఉండదుకదా. అట్టివారు నిర్గుణబ్రహ్మస్వరూపులే. అందుచే వారివిషయమున సత్త్వాదిగుణములవలన కలుగు కార్యముల ప్రసక్తి లేదని భావము.

అవ. ఆ విషయమును స్పష్టీకరించుచున్నాడు-

ఉపాధితాదాత్మ్య విహీన కేవల
బ్రహ్మాత్మనైవాత్మని తిష్ఠతో మునేః,
ప్రారబ్ధసద్భావకథా న యుక్తా
స్వప్నార్థ సమ్బన్ధకథేవ జాగ్రతః. 456

**ఉపాధితాదాత్మ్యవిహీన కేవలబ్రహ్మాత్మనైవ** =దేహేంద్రియాద్యుపాధుల తాదాత్మ్యముతో శూన్యమై, కేవలబ్రహ్మరూపముతోడనే, **ఆత్మని**= ఆత్మయందు, **తిష్ఠతః** = ఉంటూన్న, **మునేః** = జ్ఞానికి, **జాగ్రతః** = మేల్కొన్న వానికి, **స్వప్నార్థసమ్బన్ధకథేవ** =స్వప్న విషయములలో సంబంధ మున్నదన్న కథవలె, **ప్రారబ్ధసద్భావకథా**=మాటపరుసకైనను ప్రారబ్ధమున్నదని చెప్పుట, **న యుక్తా**=యుక్తము కాదు.

జీవునకు, అజ్ఞానదశలో, అజ్ఞానకృతమగు, దేహేంద్రియాద్యుపాధితాదాత్మ్యము ఉండెడిది. ఇపుడు, శ్రుతిప్రసాదముచేతను, ఆచార్యానుగ్రహముచేతను పరమాత్మప్రత్యగాత్మల ఏకత్వజ్ఞానాతిశయము కలుగగనే, ఉపాధులైన అహంకారాదులతో తాదాత్మ్యము లేనిదియు, కేవలము అనగా దేశ-కాల-వస్తుపరిచ్ఛేదము లేనిదియు నిర్వికల్పము, నిష్ప్రపంచముఅగు బ్రహ్మతో తాదాత్మ్యమును పొంది, "స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి; స్వే మహిమ్ని"—ఓ పూజ్యుడా! ఆ ఆత్మ ఎచట ప్రతిష్ఠితమైనది? తన మహిమయందే ప్రతిష్ఠితమైనది. అని శ్రుతి చెప్పిన విధమున, ఆత్మని తిష్ఠతః=ఆత్మయందే ఉన్న పూర్వము, ఇతడు ఉపాధులలో ఉండెడివాడు, ఇపుడది లేదు, అని చెప్పుటకై 'ఆత్మని తిష్ఠతః' అని చెప్పబడినది. ఈ విధముగ స్వస్థుడైన (తనయందే ఉన్న) మునికి ప్రారబ్ధమున్నదని చెప్పుట యుక్తము కాదు. ఇందులకు ఉదాహరణముగ "జాగ్రతః స్వప్నార్థసమ్బన్ధకథేవ" అని చెప్పబడినది.

అవ. ఆ విషయమునే స్పష్టీకరించుచున్నాడు-

న హి ప్రబుద్ధః ప్రతిభాసదేహే
దేహోపయోగిన్యపి చ ప్రపఞ్చే,
కరో త్యహన్తాం మమతా మిదన్తాం
కిన్తు స్వయం తిష్ఠతి జాగరేణ. 457

న తస్య మిథ్యార్థసమర్థనేచ్ఛా
న సఙ్గ్రహస్తజ్జగతోఽపిదృష్టః,
తత్రానువృత్తిర్యదిచే న్మృషార్థే
న నిద్రయా ముక్త ఇతీష్యతే ధ్రువమ్. 458

ప్రబుద్ధః=స్వప్నమునుండి మేల్కొన్నపురుషుడు, ప్రతిభాసదేహే=స్వప్నకాలమునందు భాసించిన దేహమునందు గాని, దేహోపయోగిని=ఆ స్వాప్నదేహమున కుపయుక్తమైన, ప్రపఞ్చేఽపి=ప్రపంచమునందు గాని, క్రమముగ, అహన్తాం=అహంకారమును, మమతాం=మమకారమును, ఇదన్తాం చ=ఇది అను బుద్ధిని, న కరోతి=చేయడు. హి=నిశ్చయము. కిన్తు=కాని, స్వయం=తాను, జాగరేణ=మెలకువతో, తిష్ఠతి=ఉండును. స్వప్నమున తనకు పిశాచాదిరూపము వచ్చినట్లు కనబడినది కదా యని, మెలకువ వచ్చిన పిమ్మట, తృణాదిభక్షణమును గాని స్వకీయ నియమత్యాగమును గాని చేయడు కదా? తస్య=వానికి మిథ్యార్థసమర్థనేచ్ఛా=స్వప్నమునందు కనబడిన దేహాదులగు అసత్యవిషయములను సమర్థింపవలెననెడు ఇచ్ఛ, నాస్తి=లేదు, తజ్జగతః=స్వప్నకాలమునందు భాసించిన ఆ జగత్తుయొక్క, సంగ్రహోఽపి=స్వీకారముకూడ, న దృష్టః=చూడబడలేదు. తత్ర=దేహజగదాదిరూపమగు ఆ స్వాప్నికమిథ్యాపదార్థమునందు, అనువృత్తిః యది చేత్=జాగ్రత్కాలిక వస్తువు విషయమునందువలె మనస్సునకు అనువృత్తి ఉన్నదైతే, నిద్రయా=నిద్రచేత, న ముక్తః ఇతి=విడువబడలేదు అని, ధ్రువం=నిశ్చయముగా, ఇష్యతే=అంగీకరింపబడును.

తద్వత్పరే బ్రహ్మణి వర్తమానః
సదాత్మనా తిష్ఠతి నాన్యదీక్షతే,
స్మృతిర్యథా స్వప్నవిలోకితార్థే
తథావిదః ప్రాశనమోచనాదౌ. 459

తద్వత్=స్వప్నమునుండి లేచినవానివలె, పరే బ్రహ్మణి=పరబ్రహ్మయందు, వర్తమానః=ఉండెడివాడు, సదాత్మనా=ఆ సద్రూపముతోడనే, తిష్ఠతి=ఉండును. అన్యత్=మరియొక దానిని దేనిని కూడ,

నేక్షతే = చూడడు; స్వప్నవిలోకితార్థే = స్వప్నమునందు చూడబడిన పదార్థములవిషయమున, స్మృతిః=స్మృతి, యథా=ఎట్లు కలుగుచుండునో, విదః =జ్ఞానికి, ప్రాశనమోచనాదౌ = ఆహారగ్రహణ విసర్గాదులందు, (ప్రవృత్తి), తథా = అట్టిదే.

నిద్రించి మేల్కొనినవానివలె, పరబ్రహ్మయందు, వర్తమానః = స్థిరముగ నెలకొల్పబడిన మనస్సు కలవాడు, సదాత్మనా = అబాధ్యము అసంగము. అగు చిత్తుయొక్క రూపమున, ఉండును. మరియొక దానిని దేనినికూడ చూడడు. 'యత్ర నాన్యత్పశ్యతి'- ఎచట అన్యమును దేనినిచూడడో, "యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్ కేన కం పశ్యేత్"- అంతయు ఆత్మమయమే అయినస్థితిలో దేనితో, దేనిని చూచును ఇత్యాది శ్రుతుల ననుసరించి అన్యమనునది ఏదియు లేదు కదా? బ్రహ్మవేత్తకు కూడ అన్నభోజన విసర్గాదులున్నవి కదా అను మందబుద్ధి యొక్క శంకకు సమాధానము చెప్పుచున్నాడు. మేల్కొన్నవానికి స్వప్నదృష్టవిషయములస్మృతి కలిగినను అవి సత్యములు అనెడు అభిప్రాయము ఏ విధముగ కలుగదో, జ్ఞానికి కూడ భోజన విసర్గాదులందు అట్లే. "నాప్రతీతిస్తయోర్బాధః కిన్తు మిథ్యాత్వ నిశ్చయః" జ్ఞానిదృష్టిలో జీవజగత్తులు బాధితము లనగా ఆతనికి వాటి జ్ఞానమే ఉండదని యర్థము కాదు; ఆతనికి ఆ రెండును మిథ్యాభూతములను నిశ్చయ ముండు నని యర్థము అని పంచదశిలో చెప్పబడినది. స్వప్నములో తనను వ్యాఘ్రముగా భావించినవాడు కూడ మేల్కొనిన పిమ్మట ఆ వ్యాఘ్రత్వము సత్యమేయని తలపడు. నాకిట్టి స్వప్నము వచ్చినది కదా యని దానిని స్మరించును. అట్లే జ్ఞానము కలుగుటకు పూర్వము పురుషుడు భోజనవిసర్గాదులను చేయు దేహమును 'నేను' అని భావించెను. ఇపుడు తన వాస్తవస్వరూపమును గ్రహించిన వానికి, అహంకారముపోయి, భోజనాదులను చేయు శరీరము, ఆతడు సమాధినుండి బహిర్ముఖుడైనపుడు గూడ, వేరుగనే కనబడును అని భావము.

అవ. ఆత్మకు ప్రారబ్ధకర్మ లేదు అను నంశమును యుక్తితో సమర్థించుచున్నాడు -

కర్మణా నిర్మితో దేహః ప్రారబ్ధం తస్య కల్ప్యతామ్,
నానాదేరాత్మనో యుక్తం నైవాత్మా కర్మనిర్మితః. 460

దేహః= దేహము, కర్మణా =కర్మచే, నిర్మితః = నిర్మింపబడినది. ప్రారబ్ధం =ప్రారబ్ధము, తస్య = దానికి, కల్ప్యతామ్= కల్పింపబడుగాక, అనాదేః = ఆదిరహితమగు, ఆత్మనః = ఆత్మకు, న యుక్తం = యుక్తము కాదు. ఆత్మా = ఆత్మ, కర్మనిర్మితః = కర్మలచే నిర్మింపబడినది, న = కాదు.

అవ. ఆత్మ అనాది యనుటకు ప్రమాణము చెప్పుచున్నాడు -

అజో నిత్య ఇతి బ్రూతే శ్రుతిరేషా త్వమోఘవాక్,
తదాత్మనా తిష్ఠతోఽస్య కుతః ప్రారబ్ధకల్పనా. 461

అమోఘవాక్ = అబాధితార్థమును బోధించు వాక్కు గల, అనగా అట్టి వాక్కుతో కూడిన, ఏషా = ఈ, శ్రుతిః =అజో " నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే "- ఈ ఆత్మ జన్మరహితము; నిత్యము; శాశ్వతము; ప్రాచీనము. శరీరము చంపబడుచున్నను ఆత్మ చంపబడదు ఇత్యాది కఠోపనిషద్రూపమగు శ్రుతి, అజః =(ఆత్మ) జన్మ రహితమనియు, నిత్యః = నిత్యమనియు, బ్రూతే = చెప్పుచున్నది. తదాత్మనా = తనయొక్క ఆ వాస్తవస్వరూపముతో, తిష్ఠతః = ఉంటూన్న, అస్య =ఈ జ్ఞానికి; ప్రారబ్ధకల్పనా =ప్రారబ్ధముయొక్క కల్పన, కుతః= ఎట్లు? దేహాత్మతో (దేహమే ఆత్మయను భావముతో) నున్నప్పుడు, ప్రారబ్ధము ఆశ్రయభూతమగు దేహముతో తాదాత్మ్యమును అధ్యసించుటచేత, దాని ధర్మమైన ప్రారబ్ధము యొక్క అధ్యాసము కూడ ఉండును. జ్ఞాని విషయమునను ఆ కథ కూడ ఉండదు.

అవ. ఈ విషయమును స్పష్టీకరించుచున్నాడు -

ప్రారబ్ధం సిధ్యతి తదా యదా దేహాత్మనా స్థితిః,
దేహాత్మభావో నైవేష్టః ప్రారబ్ధం త్యజ్యతామతః,
శరీరస్యాపి ప్రారబ్ధకల్పనా భ్రాన్తిరేవ హి. 462

యదా = ఎప్పుడు, దేహాత్మనా = దేహాత్మబుద్ధితో, స్థితిః = స్థితి యుండునో, తదా = అప్పుడు, ప్రారబ్ధం = ప్రారబ్ధము, సిధ్యతి = సిద్ధించును. అధ్యాసకు మూలభూతమగు అజ్ఞానము నశించినది గాన, దేహాత్మభావః = దేహాత్మతాదాత్మ్యాధ్యాసము, నైవ ఇష్టః = ఇష్టము (అంగీకార్యము) కాదు. అతః = ఆ కారణమువలన, ప్రారబ్ధం = ప్రారబ్ధము, త్యజ్యతామ్ = విడువబడుగాక ః ఆత్మకు ప్రారబ్ధముండునను వాదమును చేయరాదు అని తాత్పర్యము, బాగుగ ఆలోచింపగా, శరీరస్యాపి = శరీరమునకుకూడ, ప్రారబ్ధకల్పనా = ప్రారబ్ధముయొక్క కల్పన, భ్రాన్తిః = ఏవ = భ్రాంతి మాత్రమే, హి = నిశ్చయము.

అవ. ఈ విషయమును ఉపపాదించుచున్నాడు —

అధ్యస్తస్య కుతః సత్త్వం అసత్త్వస్య కుతో జనిః,
అజాతస్య కుతో నాశః ప్రారబ్ధ మసతః కుతః. 463

అధ్యస్తస్య = అధ్యసింపబడిన దానికి, సత్త్వం = ఉనికి, కుతః = ఎట్లు ? అసత్త్వస్య = సత్త్వము (ఉనికి) లేనిదానికి, జనిః = పుట్టుక, కుతః = ఎట్లు ? అజాతస్య = పుట్టని దానికి, నాశః = నాశము, కుతః = ఎట్లు? అసతః = లేని దానికి, ప్రారబ్ధం = ప్రారబ్ధము, కుతః = ఎట్లు ?

"న విద్యతే సత్త్వం యస్య తత్ = అసత్త్వమ్" - సత్త్వము లేనిది. దానికి ఉత్పత్తి ఎట్లు? ఉత్పత్తి అనునది లేదని అర్థము. పుట్టని దానికి నాశము ఎట్లు? నాశముకూడ లేదు. ఉత్పత్తికొరకై ప్రారబ్ధమును అంగీకరింపవలెను. ప్రారబ్ధమును అంగీకరింపకున్నచో, లోకప్రసిద్ధమగు, దేవతలు, తిర్యగ్జన్తువులు, మనుష్యులు ఈ విధమైన వైషమ్యమును ఉపపాదించుటకు శక్యము కాదు. (కొందరు

దేవతలుగను, కొందరు తిర్యగ్జంతువులుగను, కొందరు మనుష్యులుగను జన్మించుచున్నారు. ఇట్లు వేరు వేరు జన్మలకు ప్రారబ్ధమే కారణమని అంగీకరింపకున్నచో మరియొక కారణమును దేనినికూడ చూపుటకు శక్యముకాదు అని అర్థము). కాని బ్రహ్మవ్యతిరిక్తమగు సర్వమును మిథ్యయని నిర్ణయించిన పిమ్మట, శుక్తిరజతమువలె, కేవలము అజ్ఞానమువలన మాత్రమే భాసించుచున్న జగత్తు యొక్క పుట్టుకకు కర్మ నిమిత్తమని చెప్పపనిలేదు. వారి వారి కర్మల ననుసరించియు, వారి వారి విద్యాదుల ననుసరించియు జీవులు స్థాణ్వాది జన్మలను పొందుచుందురు అని చెప్పు "స్థాణుమన్యేఽనుసంయన్తి యథాకర్మ యథాశ్రుతమ్" ఇత్యాది శ్రుతులు వ్యవహార దృష్ట్యా అట్లు చెప్పుచున్నవని భావము. (అనగా పరమార్థదృష్టిలో, జగత్సృష్టియు లేదు. దానికి నిమిత్తమగు ప్రారబ్ధకర్మయు లేదు అని యర్థము.)

అవ. ఇపుడు- "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే" అను శ్రుతియొక్క తాత్పర్యమును చెప్పుచున్నాడు-

> జ్ఞానేనాజ్ఞానకార్యస్య సమూలస్య లయో యది,
> తిష్ఠత్యయం కథం దేహ ఇతి శంకావతో జడాన్,
> సమాధాతుం బాహ్యదృష్ట్యా ప్రారబ్ధం వదతి శ్రుతిః. 464

సమూలస్య = మూలభూతమగు అజ్ఞానముతోకూడిన, అజ్ఞానకార్యస్య = అజ్ఞానముయొక్క-కార్యమైన బాహ్యమగు వియదాదిప్రపంచమునకును, ఆధ్యాత్మికమగు అహంకారాది దేహాంత ప్రపంచమునకును, జ్ఞానేన = బ్రహ్మసాక్షాత్కారముచే, లయః యది = బాధ (విలయము) కలిగినచో, అయం దేహః = ఈ పాంచభౌతికదేహము, కథం = ఎట్లు, తిష్ఠతి = నిలుచును? ఇతి = అని, శంకావతః = శంకగల, జడాన్ = ప్రాకృత జనులను, తెలివితక్కువవారిని గూర్చి, సమాధాతుం = సమాధానము చెప్పు

టకు, బాహ్యదృష్ట్యా = వ్యవహారదృష్టితో, శ్రుతిః = శ్రుతి, ప్రారబ్ధం= ప్రారబ్ధమును (ప్రారబ్ధ మనునది ఉన్నదని), వదతి = 'యావన్నవిమోక్ష్యే ఇత్యాది వాక్యములలో చెప్పుచున్నది.

అవ. శ్రుతి, పైనచూపిన విధమున, వ్యవహారము ననుసరించి ప్రారబ్ధ మనునది ఉన్నదని చెప్పుచున్నది. అంతేయే కాని కర్మజన్యమగు శరీరాదికము శుక్తిరజతాదికమువలె ప్రాతీతికము (పైకి కనబడునది) మాత్రము కాదు; సత్యమే అని చెప్పుటయందు ఈ శ్రుతివాక్యముల తాత్పర్యము అని ఎన్నడును భ్రాంతి చెందరాదు అని చెప్పుచున్నాడు -

న తు దేహాదిసత్యత్వబోధనాయ విపశ్చితామ్,
యతః శ్రుతేరభిప్రాయః పరమార్థైకగోచరః. 465

తు = కాని, విపశ్చితామ్ = జ్ఞానులయొక్క, దేహాదిసత్యత్వబోధనాయ = దేహాదుల సత్యత్వమును బోధించుటకు, న=కాదు, యతః=ఎందువలన అనగా, శ్రుతేః = శ్రుతియొక్క, అభిప్రాయః = అభిప్రాయము, పరమార్థైకగోచరః = పరమార్థ విషయమునకు మాత్రమే సంబంధించినది.

జ్ఞానులయొక్క ఏ దేహాదిక మున్నదో దానియొక్క సత్యత్వమును బోధించుటకై శ్రుతి ప్రారబ్ధమునుగూర్చి చెప్పుటలేదు. లేదా 'విపశ్చితాం' అనుదానికి 'బోధనాయ' అను దానితో అన్వయము చెప్పి 'పండితులకు బోధించుటకై' అని అర్థము చెప్పవచ్చును. తేజస్సుచే తిమిరము నశించినట్లు, జ్ఞానముచే జగదుపాదానభూతమగు అజ్ఞానము నశించినను, దేహము మాత్రము ప్రారబ్ధము నశించిన పిమ్మటనే నశించును. దేహము నశించుటకు అంతమాత్రము ఆలస్యముండును అని చెప్పుటచే, ఆ దేహము అజ్ఞానజన్యము కాదనియు, కర్మజన్యమనియు, అందుచే అది సత్యమనియు భావించుటకు అవకాశమున్నది. కాని అది యుక్తము కాదు. తార్కికుల సిద్ధాంతము

ప్రకారము, పటమునకు ఉపాదానకారణమగు తంతువులు నశించిన వెంటనే ఆ పటము నశించదు. తంతువులు నశించిన మరుసటి క్షణము వరకును పటము ఉండి, మరుసటి క్షణముననే నశించును. అనగా ఉపాదానకారణము నశించిన పిమ్మట గూడ ఒక క్షణము పాటు కార్యముండునని తార్కికుల సిద్ధాంతము. ఈ సిద్ధాంతమును పురస్కరించుకొని పంచదశిలో, చిత్రదీపప్రకరణమున ఇట్లు చెప్పబడినది.

> ఉపాదానే వినష్టేఽపి క్షణం కార్యం ప్రతీక్షతే,
> ఇత్యాహుస్తార్కికా స్తద్వదస్మాకం కిం న సమ్భవేత్.
> తన్తూనాం దినసంఖ్యానాం తైస్తాదృక్ క్షణ ఈరితః,
> భ్రమస్యాసంఖ్యకల్పస్య యోగ్యః క్షణ ఇహేష్యతామ్.

ఉపాదానకారణము నశించినను కార్యము క్షణకాలముండునని తార్కికులు చెప్పుచున్నారు. అది మాకు మాత్రము ఎందుకు కుదరదు? తంతువులు కొన్నిరోజులపాటు మాత్రమే ఉండును. కావున ఆ దివసముల ప్రమాణమునకు అనుగుణమైన క్షణమును వా రంగీకరించినారు. ఎన్నియో కల్పముల అనంతకాలమునుండి వచ్చుచున్న భ్రమకు అనుగుణముగ క్షణమును మా మతమున అంగీకరింపవచ్చును గదా? ఈ విధముగ అనాదికాలమునుండి వచ్చుచున్న అజ్ఞానము ఉపాదానముగా గల దేహాదికము కూడ, అజ్ఞానము నశించిన పిమ్మట కొంతకాలము ఉండునని చెప్పుటకు శక్యమే కదా? కాని ఇది యంతయు విజిగీషుకథలో(ఏదో విధముగ ప్రతివాదిని ఓడించు నుద్దేశముతో చేసెడి వాగ్వాదమునకు విజిగీషుకథ యని పేరు) చెప్పెడి సమాధానము. వాస్తవమున -

> "న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః,
> న ముముక్షు ర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా."

సృష్టినిరోధము గాని, సృష్టి గాని, బద్ధుడు గాని, సాధకుడు గాని, ముముక్షువు గాని, ముక్తుడు గాని లేదు; ఇది పరమార్థము అను శ్రుతి

ననుసరించి బ్రహ్మమాత్రమే పరమార్థము. "జ్ఞానముచే సమూలముగ అజ్ఞానకార్యము నశించినచో ఈ దేహమెట్లుండును?" అనెడు, మందబుద్ధులు చేయు శంకకు ఏదియో యొక సమాధానము చెప్పవలెను గదా యని మాత్రమే శ్రుతి ప్రారబ్ధమనునది ఒకటున్నది అని చెప్పుచున్నది. ఈ సమాధానము చెప్పుట శ్రుతికి ప్రధాన తాత్పర్యవిషయము కాదు. ఏలన, శ్రుతియొక్క అభిప్రాయము, పరమార్థైకగోచరః= ప్రమాణాంతరములచే తెలియరానిదియు, సప్రయోజనమును, అబాధితమును అగు విషయమునకు సంబంధించి యుండును. ఈ విధముగ, అజ్ఞాననాశానంతరము కూడ, జ్ఞానుల శరీరము, కర్మసమాప్తియగువరకును ఉండును అని చెప్పుటలో ప్రయోజన మేమియు లేదు గాన 'తస్య తావదేవ చిరం' ఇత్యాది శ్రుతి మందుల శంకకు సమాధానము చెప్పుటకు మాత్రమే ఉద్దిష్టమైనదని భావము.

అవ. ఇపుడు శ్రుతితాత్పర్య విషయమగు పరమార్థమును ఏడు శ్లోకములలో సంగ్రహించుచున్నాడు-

## నానాత్వ నిషేధము

పరిపూర్ణ మనాద్యన్త మప్రమేయ మవిక్రియమ్,
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన. 466

బ్రహ్మ=బ్రహ్మ, పరిపూర్ణః=అంతటను నిండినది; అనగా దేశపరిచ్ఛేదము లేనిది. అనాద్యన్తం=ఉత్పత్తివినాశములు లేనిది. అప్రమేయం=మనస్సుచే గ్రహింపశక్యము కానిది. అవిక్రియం=పరిణామము లేనిది. ఏకం=స్వగతభేదములు లేనిది. ఏవ=సజాతీయభేదములు లేనిది. అద్వయం=విజాతీయ భేదములు లేనిది. ఇహ=ఈ బ్రహ్మమందు, కించన=కొంచెమైనను, నానా=నానాత్వము, అనగా భేదము, నాస్తి=లేదు. ఈ విధముగ శ్రుతి, బ్రహ్మ సకలవిధభేదరహిత మని చెప్పుచున్నది.

"మనసైవానుద్రష్టవ్యం నేహ నానాస్తి కించన,
మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి."

బ్రహ్మను గూర్చి తెలిసికొనుటకు మనస్సు ఒక్కటియే సాధనము. ఈ బ్రహ్మయందు ఎట్టి భేదమును లేదు. ఈ బ్రహ్మయందు భేదమును చూచెడి వాడు మృత్యువునుండి మరియొక మృత్యువును పొందుచుండును. సంసార నిమగ్నుడగును అని బృహదారణ్యకశ్రుతి చెప్పుచున్నది. 'ఏకమేవాద్వయం' అను పదములచే 'ఏకమేవాద్వితీయమ్' అను ఛాందోగ్య శ్రుతి యొక్క అర్థతోఽనువాదము చేయబడినది.

అవ. శ్రుతివాక్యములలోనున్న శబ్దములను, శ్రుత్యర్థమును అనుసరించు స్వీయశబ్దములను ప్రయోగించి పరమార్థతత్త్వమును చెప్పుచున్నారు-

సద్ఘనం చిద్ఘనం నిత్య మానన్దఘన మక్రియమ్,
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన. 467

'ఘనః' అనగా మూర్తి; బ్రహ్మ, సద్ఘనం=సత్తుశరీరముగా కలది. చిద్ఘనం=చిత్తు శరీరముగాకలది. నిత్యం=నిత్యమైనది. ఆనన్దఘనం= ఆనందమే శరీరముగా కలది. అనగా సచ్చిదానందస్వరూపమని యర్థము. 465 నుండి 471 వరకు ఏడు శ్లోకములలో ఉత్తరార్ధములు సమానములు.

ప్రత్యగేకరసం పూర్ణ మనన్తం సర్వతోముఖమ్,
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన. 468

బ్రహ్మ, ప్రత్యగేకరసం=సర్వాత్మభూతమైనది, పూర్ణం=సర్వ వ్యాప్తమైనది, అనన్తం=నాశరహితమైనది, సర్వతోముఖం=సర్వాత్మ భూతమగుటచే అంతటను ముఖము కలది, "త్వం జాతో భవసి విశ్వతో ముఖః"-నీవు జన్మించినవాడవై అనగా సకలభూతరూపమున ఆవిర్భ వించినవాడవై అన్నివైపుల ముఖము కలవాడ వగుచున్నావు అని శ్రుతి వాక్యము కూడ చెప్పుచున్నది.

అహేయ మనుపాదేయ మనాధేయ మనాశ్రయమ్,
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన. 469

ఇది ప్రతియొక్కరికిని ఆత్మస్వరూపమే గాన, అహేయం=విడువ దగనిది, అనుపాదేయం=గ్రహింప శక్యము కానిది, అనాధేయం=ప్రపంచ రహితమగుటచే అధేయము (తనపై ఉండు మరియొక వస్తువేదియు)లేనిది, అనాశ్రయం=ఆశ్రయరహితమైనది అనగా అధారశూన్యము, 'అహేతుం' 'అనుపాదేయం' అను పదములకు 'దోషరహితము', 'నిర్గుణము' అని కూడ అర్థము చెప్పవచ్చును.

నిర్గుణం నిష్కలం సూక్ష్మం నిర్వికల్పం నిరంజనమ్,
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన. 470

నిర్గుణం=గుణరహితమైనది, నిష్కలం=భేదశూన్యము, సూక్ష్మం=సూక్ష్మమైనది, నిర్వికల్పం=వికల్పశూన్యము. నిరంజనం=ఇతర సంబంధము లేనిది (వ్యాఖ్య లేదు).

అనిరూప్య స్వరూపం యన్మనోవాచామగోచరమ్,
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన. 471

యత్=ఏ కారణము వలన, మనోవాచాం=మనస్సునకును, వాక్కులకును, అగోచరం=గోచరము కానిదో, తత్=ఆ కారణమువలన, అనిరూప్య స్వరూపం=ఇది ఇట్లు అని నిరూపింప శక్యము కాని స్వరూపము కలది. ఈ విషయమునే శిష్యుని వాక్యముగా-"వాచా వక్తు మశక్యమేవ మనసా మన్తుమ్".(శ్లో. 484) అని చెప్పనున్నాడు.

సత్సమృద్ధం స్వతఃసిద్ధం శుద్ధం బుద్ధ మనీదృశమ్,
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన. 472

సత్=ఎల్లప్పుడును ఉండునది; అందుచే అబాధ్యమైనది, సమృద్ధం=అఖండానందరూప మైనది, స్వతఃసిద్ధం=ప్రత్యక్షాది ప్రమాణము

లన్నియు దీని మూలముననే ప్రవర్తించును గాన దీని విషయమున ఏ ప్రమాణములును ప్రవర్తించవు. అందుచే స్వసంవేద్యము. శుద్ధం=దోష ములచే స్పృశింపబడనిది. బుద్ధం = జ్ఞానస్వరూప మైనది. అసీదృశం= సాటిలేనిది. అతిసూక్ష్మమైన విషయమును అవిచ్ఛిన్నముగ బుద్ధియందు ప్రవేశపెట్టుటకై శ్రుత్యుక్తమగు బ్రహ్మపదార్థమును గూర్చి ఈ విధము గనే చెప్పవలసి యుండును. అందుచే ఇట్టి ప్రదేశములందు పౌనరుక్త్య దోష మున్నదను శంక చేయరాదు.

## ఆత్మానుభవోపదేశము

నిరస్తరాగా నిరపాస్తభోగాః
శాన్తాః సుదాన్తా యతయో మహాన్తః,
విజ్ఞాయ తత్త్వం పరమేతదన్తే
ప్రాప్తాః పరాం నిర్వృతి మాత్మయోగాత్. 473

నిరస్తరాగాః = విడువబడిన విషయాభిలాష కలవారును, నిరపాస్త భోగాః = విడువబడిన భోగములు కలవారును, శాన్తాః = శాంతులును, సుదాన్తాః=ఇంద్రియములను బాగుగా నిగ్రహించుకొన్నవారును, మహాన్తః= గొప్పవారైన, యతయః=యతులు, ఏతత్=ఈ, పరంతత్త్వం=పరతత్త్వ మును, విజ్ఞాయ=తెలిసికొని, అన్తే=అంతమునందు, ఆత్మయోగాత్= ఆత్మయోగమువలన, పరాం = గొప్పదైన, నిర్వృతిం = ఆనందమును, ప్రాప్తాః=పొందినారు.

నిరస్తరాగాః = విషయేచ్ఛను తొలగించుకొన్నవారును, కావు ననే, నిరపాస్తభోగాః = విడువబడిన భోగము కలవారు, యాదృచ్ఛి కముగా లభించిన దానితో సంతుష్టులు. రాగ మున్ననే కదా భోగ మనునది. కావుననే "అన్యావేదిత భోగ్యభోగకలనో నిద్రాలువద్ బాలవత్" (శ్లో. 428) అని వెనుక చెప్పబడినది. లేదా 'నిరపాస్త భోగాః' అను పదమునకు శీతోష్ణాది ద్వంద్వములను సహింపగల్గిన వారు అని యర్థము. శాన్తాః=బ్రహ్మయందు స్థాపితమగు మనస్సు

కలవారు. సుదాన్తాః=బాగుగా నిగ్రహింపబడిన బాహ్యేంద్రియములు కలవారు. యతయః=ప్రయత్నశీలురు, మహాన్తః=బాహ్యేంద్రియములద్వారా బైటకు వెడలిన మనస్సు పరిచ్ఛిన్నములగు విషయముల ఆకారమున పరిణమింపగా, అట్టి పరిచ్ఛిన్నమనోవృత్తిచే ఉపహితుడగు జీవుడు కూడా అల్పుడగును. శాంతులును, దాంతులును అగు యతులకు అట్టి యల్పత్వము లేదు గాన వారు మహాపురుషులని యర్థము. అవిచ్ఛిన్నముగ అన్తర్ముఖముగనే ఉండు మనస్సు కలవారికి మహత్త్వము కూడ సహజమే. అట్టి పురుషశ్రేష్ఠులు, ఏతత్= 'పరిపూర్ణ మనాద్యన్తమ్' ఇత్యాది శ్లోకములలో చెప్పబడిన, పరం తత్త్వం=సర్వోత్కృష్టమగు బ్రహ్మను, విజ్ఞాయ=తెలిసికొని, ఆత్మయోగాత్=నిర్వికల్పసమాధివలన, పరాం నిర్వృతిం=నిత్యనిరతిశయానన్దరూపమైన ముక్తిని, అన్తే=జ్ఞానప్రాప్త్యనంతరము, ప్రాప్తాః=పొందినారు. 'అన్తే'-ప్రారబ్ధకర్మ యొక్క అంతమందు, అనగా దేహపాతానంతరము అని కూడ అర్థము చెప్పవచ్చును. ఆత్మయోగము వలన తెలిసికొని, దేహపాతానంతరము విదేహముక్తిని పొందినారు అని యర్థము.

అవ. "మా భైష్ట విద్వంస్తవ నాస్త్యపాయః
సంసారసిన్ధోస్తరణేఽస్త్యుపాయః,
యేనైవ యాతా యతయోఽస్య పారం
తమేవ మార్గం తవ నిర్దిశామి." (శ్లో. 45)

అని వెనుక చెప్పిన విషయమును ముగించుచున్నాడు-

భావనపీదం పరతత్త్వ మాత్మనః
స్వరూప మానన్దఘనం నిచాయ్య,
విధూయ మోహం స్వమనఃప్రకల్పితం
ముక్తః కృతార్థో భవతు ప్రబుద్ధః. 474

భవానపి=నీవు కూడ, ఆత్మనః=నీయొక్క, స్వరూపం=స్వరూపము, ఆనన్దఘనం=ఆనందరూపమును అయిన, ఇదం=ఈ, పరతత్త్వం=బ్రహ్మను, విచాయ్య=సాక్షాత్కరింప జేసికొని, స్వమనః ప్రకల్పితం=నీయొక్క మనస్సుచేతనే కల్పితమైన, మోహం=అనాత్మయందు ఆత్మభ్రమను, విధూయ=సమూలముగా నశింపజేసికొని, ప్రబుద్ధః=అవిద్యానిద్ర లేనివాడవుగ అయి, ముక్తః=అధ్యాసరూపమగు బంధమునుండి విముక్తుడవై, కృతార్థః భవతు=కృతార్థుడ వగుదువు గాక అని ఆశీర్వాదరూపములో నున్న ఉపదేశము.

సమాధినా సాధు సునిశ్చలాత్మనా
పశ్యాత్మతత్త్వం స్ఫుటబోధ చక్షుషా,
నిస్సంశయం సమ్యగవేక్షితశ్చేత్
శ్రుతః పదార్థో న పునర్వికల్ప్యతే. 475

సునిశ్చలాత్మనా=దేనియందు అంతఃకరణము పూర్తిగ నిశ్చలముగా నుండునో అట్టి, సమాధినా=నిర్వికల్పక సమాధిచేత, స్ఫుటబోధ చక్షుషా=స్ఫుటమగు జ్ఞానమనెడు నేత్రముచేత, బాహ్యమగు నేత్రముతో రూపమును ఎట్లు చూతురో ఆ విధముగ, సాధు=బాగుగా, అనగా సందేహ విపర్యాసములు లేకుండగా, ఆత్మతత్త్వం=ఆత్మతత్త్వమును, పశ్య=సాక్షాత్కరింప జేసికొనుము.

"నిర్వికల్పక సమాధినా స్ఫుటం బ్రహ్మతత్త్వ మపగమ్యతే ధ్రువమ్,
నాన్యథా చలతయా మనోగతేః ప్రత్యయాన్తర విమిశ్రితం భవేత్."

(శ్లో. 366) అని వెనుక గూడ చెప్పబడినది. శ్రుతః=ఆప్తులద్వారా వినబడిన, పదార్థః=పదార్థము, నిస్సంశయం=నిస్సంశయముగా, సమ్యక్=బాగుగా, అవేక్షితశ్చేత్=అనుభవగోచరముగ చేసికొనబడినచో, పునః=మరల, న వికల్ప్యతే=మరియొక విధముగ భాసింపదు.

స్వస్యా విద్యాబన్ధ సమ్బన్ధమోక్షాత్
సత్యజ్ఞానానన్దరూపాత్మలబ్ధౌ,
శాస్త్రం యుక్తిర్దేశికోక్తిః ప్రమాణం
చాన్తఃసిద్ధా స్వానుభూతిః ప్రమాణమ్. 476

స్వస్య=తనకు, అవిద్యాబన్ధసమ్బన్ధమోక్షాత్=అవిద్యచే గలిగిన, అహంకారాది దేహాన్త బంధములతో అధ్యాసకల్పితమగు తాదాత్మ్య సంబంధమునుండి మోక్షమువలన, అనగా స్వస్వరూపజ్ఞానము కలిగిన పిమ్మట లభించిన దేహాదిబంధవియోగమువలన, సత్యజ్ఞానానన్దరూపాత్మలబ్ధౌ= సత్యజ్ఞానానందరూపమగు ఆత్మయొక్క ప్రాప్తి కలుగువిషయమున, శాస్త్రం= "అస్య మహిమానమితి వీతశోకః", "బ్రహ్మవిదాప్నోతి పరమ్" -బ్రహ్మవేత్త ఆ పరమాత్మను పొందును ఇత్యాది శాస్త్రము, దేశికోక్తిః=

తత్త్వమస్యాది వాక్యోత్థ బ్రహ్మాత్మైకత్వ బోధతః,
బ్రహ్మణ్యాత్మత్వదార్ఢ్యాయ స్వాధ్యాసాపనయం కురు. (శ్లో.284)

ఇత్యాది గురూపదేశము, ప్రమాణం=ప్రమాణము. అన్తః సిద్ధా=తనలోనున్న, శాస్త్ర-యుక్తి-గురూపదేశానురూపమైన, స్వానుభూతిశ్చ=స్వానుభవము కూడ, ప్రమాణమ్=ప్రమాణము.

అవ. పైనచెప్పిన విషయమున దృష్టాంతముగ చూపుటకై అనుభవసిద్ధములగు మరికొన్ని విషయములను గూడ చెప్పుచున్నాడు-

బన్ధో మోక్షశ్చ తృప్తిశ్చ చిన్తారోగ్యక్షుధాదయః,
స్వేనైవ వేద్యా యద్ జ్ఞానం పరేషా మానుమానికమ్. 477

బన్ధః=అవిద్యయు, మోక్షః చ=అవిద్యానాశము, తృప్తిశ్చ= తృప్తియు, చిన్తారోగ్యక్షుధాదయః=చింత, ఆరోగ్యము, ఆకలి మొదలగునవి; 'ఆది' పదముచే దప్పిక, రోగము, కుక్షిశూల మొదలగునవి గ్రహింపబడును. స్వేనైవ=తనచేతనే, వేద్యాః=తెలియదగినవి; స్వానుభవమాత్రగమ్యములు. యత్=ఏలన, పరేషాం=పరులయొక్క, జ్ఞానం= జ్ఞానము, ఆనుమానికం=అనుమానప్రమాణముచేతనే తెలియదగినదగుటచే పరోక్షమైనది. ఒక్కొకప్పుడు హేతువు (అనుమితి హేతువు) దుష్టమైనచో ఆ జ్ఞానము భ్రమకూడ కావచ్చును అని అభిప్రాయము.

తటస్థితా బోధయన్తి గురవః శ్రుతయో యథా,
ప్రజ్ఞయైవ తరేద్విద్వా నీశ్వరానుగృహీతయా. 478

నావనెక్కి నదిలో ప్రయాణము చేయుచున్న, తెడ్డు ఎట్లువేయవలెనో తెలియని వానికి ఒడ్డుమీదనున్న వాడు, 'తెడ్డును ఈ విధముగ వేయవలెను' అని దూరమునుండియే బోధించును. అట్లే-గురవః=గురువులు, శ్రుతయో యథా = శ్రుతుల వలెనే, తటస్థితాః = తటస్థులై అనగా పరోక్షజ్ఞానము మాత్రమే కలుగువిధమున, బోధయన్తి=బోధింతురు. విద్వాన్ = విద్వాంసుడు, ఈశ్వరానుగృహీతయా=ఈశ్వరునిచే అనుగ్రహింపబడిన, ప్రజ్ఞయైవ = 'బ్రహ్మాత్మనోః శోధితయోః' (శ్లో. 428) ఇత్యాది శ్లోకమున చెప్పిన లక్షణముగల చిన్మాత్రవృత్తిచేతనే, తరేత్ = సంసారసముద్రమును దాటవలెను.

స్వానుభూత్యా స్వయం జ్ఞాత్వా స్వమాత్మాన మఖణ్డితమ్,
సంసిద్ధః సుసుఖం తిష్ఠేన్నిర్వికల్పాత్మనాత్మని. 479

స్వం ఆత్మానం = తన ఆత్మను (తనను), అఖణ్డితం = అద్వితీయ స్వరూపమైన దానినిగా, స్వయం = స్వయముగనే, స్వానుభూత్యా = స్వానుభవముచేత, జాత్వా = తెలిసికొని, సంసిద్ధః = సిద్ధిని పొందినవాడై, ఆత్మని = ఆత్మ యందే, నిర్వికల్పాత్మనా = వికల్పరహితమైన స్థితిలో, సుసుఖమ్ = మిక్కిలి సుఖముగా, తిష్ఠేత్=ఉండవలెను.

వేదాన్తసిద్ధాన్తనిరుక్తి రేషా
బ్రహ్మైవ జీవః సకలం జగచ్చ,
అఖణ్డరూపస్థితిరేవ మోక్షః
బ్రహ్మాద్వితీయంశ్రుతయః ప్రమాణమ్. 480

ఏషా=ఇది, వేదాన్తసిద్ధాన్తనిరుక్తిః=వేదాన్తసిద్ధాంతముయొక్క, నిర్వచనము, జీవః=జీవుడు, బ్రహ్మైవ=బ్రహ్మయే, సకలం=సమస్తమైన, జగచ్చ=జగత్తు కూడా (బ్రహ్మయే), అఖణ్డరూపస్థితిరేవ = అద్వితీయ రూపమున ఉండుటయే, మోక్షః=మోక్షము, బ్రహ్మ=బ్రహ్మ, అద్వితీయం=ద్వితీయరహితము, శ్రుతయః=శ్రుతులు, ప్రమాణమ్=ప్రమాణము.

వేదాన్తసిద్ధాన్తనిరుక్తిః-వేదాన్తైః = వేదాన్తములచే, సిద్ధః = సిద్ధించిన, యః అన్తః=ఏ నిర్ణయము కలదో, దానియొక్క, నిరుక్తిః= ఆ నిర్ణయమును కలిగించు సంకుచిత శబ్దము, ఏషా=ఇది (వేదాన్త సిద్ధాంతము నంతయు కొలదిమాటలలో చెప్పవలెనన్నచో ఇట్లు చెప్పవలెను అని యర్థము). జీవుడు బ్రహ్మయే. సకల జగత్తును బ్రహ్మయే. అఖండరూపమున ఉండుటయే, అనగా బ్రహ్మస్వరూపమున ఉండుటయే మోక్షము. బ్రహ్మ అద్వితీయము. ఈ విషయమున శ్రుతులే ప్రమాణము. శ్రుతులు బహుసంఖ్యాకము లైనను, వాటి అన్నింటివలనను కలుగు ప్రమ (జ్ఞానము) ఒక్కటియేగాన ('శ్రుతయః' బహువచనమునను) 'ప్రమాణమ్' అను పదము ఏకపదమున ప్రయోగింపబడినది. ఆ యా శాస్త్రములలో సిద్ధమగు అర్థము ఆ శాస్త్రముల సిద్ధాంతమని ఇతరులు చెప్పుదురు. ఆ విధముగ 'వేదాన్త సిద్ధాన్త' పదమునకు 'వేదాంతముల యొక్క సిద్ధాంతము' అని అర్థము చెప్పవచ్చును. దానియొక్క నిరుక్తి, అనగా నిర్ణయమును కలిగించు సంకుచితశబ్దము, అనగా నిర్వచనము అని అర్థము. "తత్త్వమసి", "సర్వం ఖల్విదం బ్రహ్మ", "బ్రహ్మైవేదమ్ విశ్వమ్", "ఏకమేవాద్వితీయమ్" ఇత్యాదిశ్రుతులు (ఈ విషయమున ప్రమాణము).

## బోధోపలబ్ధి

ఇతి గురువచనాచ్ఛ్రుతిప్రమాణాత్
పర మవగమ్య సతత్త్వమాత్మయుక్త్యా,
ప్రశమితకరణః సమాహితాత్మా
క్వచిదచలాకృతి రాత్మనిష్ఠితోఽభూత్. 481

ఇతి = ఈ విధముగా, గురువచనాత్ = గురువుయొక్క వచనము వలనను, శ్రుతిప్రమాణాత్=శ్రుతిరూప ప్రమాణమువలనను, ఆత్మయుక్త్యా=

తనయొక్క యుక్తిచేతను, పరం సతత్త్వం=పరబ్రహ్మను, లేదా 'సః' అను దానిని వేరుగ గ్రహించి అతడు అను నర్థము చెప్పవచ్చును. అవ గమ్య=తెలిసికొని, ప్రశమితకరణః=బాగుగా శాంతింపజేయబడిన చక్షు రాదీంద్రియములు కలవాడై, సమాహితాత్మా=బ్రహ్మయందు నిలుపబడిన అంతఃకరణము కలవాడై, క్వచిత్=ఒకానొక స్థానమున, అచలాకృతిః= నిశ్చలమైన శరీరము కలవాడై, ఆత్మనిష్ఠితః=బ్రహ్మనిష్ఠుడై, స్థితః= ఉండెను.

ఇతి=ఈ విధముగ పూర్వము విస్తరరూపమునను సంగ్రహ రూపమునను చెప్పబడిన, గురువచనాత్ = గురువచనమువలన, శ్రుతిప్రమాణాత్ =శ్రుతులే ప్రమాణములుగాగల గురువచనమువలన, (ఈ పదమును 'గురువచనాత్' అనుదానికి విశేషణముగచేసి పై యర్థము చెప్పబడినది) లేదా-

శాస్త్రం యుక్తిః దేశికోక్తిః ప్రమాణం
చాన్తస్సిద్ధా స్వానుభూతిః ప్రమాణమ్. (శ్లో 476)

అను శ్లోకమున శాస్త్రము కూడ వేరుగ చెప్పబడినది గాన "శ్రుతి రూపమగు ప్రమాణమువలన" అని అర్థము. ఆత్మయుక్త్యా=శ్రుతు లును, ఆచార్యులును ఉపదేశించిన విషయమును మననము చేయుట చేత అని యర్థము. పరం సతత్త్వం=పరబ్రహ్మను, పరమార్థ తత్త్వ మును, తెలిసికొని, ప్రశమితకరణః=ఎక్కువగా శాంతింపజేయ బడిన చక్షురాది బాహ్యేంద్రియములు కలవాడై, లేదా, ఆత్మ యుక్త్యా='యుక్తిః' అనగా యోగము; వృత్తినిరోధము. ఆత్మ యొక్క, అనగా, మనస్సుయొక్క వృత్తులను నిరోధించుటచే బాహ్యేంద్రియములు పూర్తిగ శాంతింపజేయబడినవి అని చెప్ప వచ్చును. సమాహితాత్మా=బాగుగా బ్రహ్మయందు స్థాపింపబడిన అన్తఃకరణము కలవాడై, మనోవృత్తిని నిరోధించి చక్షురాదులను శమింపజేసినను ఆత్మనిష్ఠ లేకపోవచ్చును. అందుచే 'సమాహితాత్మా'

యని చెప్పబడినది. క్వచిత్ = ఏకాంతప్రదేశమున, అచలాకృతిః= పర్వతమువలె కదల్ప శక్యము కానివాడై, ఆత్మనిష్ఠితః=బ్రహ్మనిష్ఠుడై, అభూత్ =ఆయెను. ఆత్మ నిష్ఠితః_ఆత్మనిష్ఠితః= ఆత్మయందు ఉన్న వాడు లేదా కలిగిన ఆత్మనిష్ఠ కలవాడు అని యర్థము.

కంచిత్కాలం సమాధాయ పరే బ్రహ్మణి మానసమ్,
వ్యుత్థాయ పరమానన్దా దిదం వచన మబ్రవీత్. 482

మానసం = మనస్సును, కంచిత్ కాలం = కొంతకాలము, పరే బ్రహ్మణి = పరబ్రహ్మపై, సమాధాయ = నిలిపి, వ్యుత్థాయ=సమాధి నుండి బహిర్ముఖుడై లేచి, పరమానన్దాత్ = పరమానందమువలన (తో) ఇదం వచనం = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

బుద్ధిర్వినష్టా గలితా ప్రవృత్తిః
బ్రహ్మాత్మనో రేకతయాధిగత్యా,
ఇదం న జానేఽప్యనిదం న జానే
కిం వా కియద్వా సుఖమస్య పారమ్. 483

బ్రహ్మాత్మనోః = బ్రహ్మజీవాత్మల యొక్క (ను), ఏకతయా= ఏకరూపముగా, అధిగత్యా=గ్రహించుటచే, బుద్ధిః=బుద్ధి, వినష్టా=నశించినది, ప్రవృత్తిః=ప్రవృత్తి, గలితా=తొలగిపోయినది, ఇదం=ఎదుట నున్నదానిని, న జానే=ఎరుగను, అనిదం=ఎదుటలేని దానిని, న జానే= ఎరుగను, సుఖం=సుఖము, కిం వా=ఎట్టిదని కాని, కియద్వా=ఎంత ఉన్నదాని కాని, అస్య=ఈ సుఖముయొక్క, పారం=పారమును గాని, (న జానే=ఎరుగను).

బ్రహాత్మనోః ఏకతయా అధిగత్యా=బ్రహ్మ జీవాత్మలు ఏక రూపులే అని గ్రహించుటచేత, బుద్ధి నశించినది; ప్రవృత్తికూడ తొలగి పోయినది. ఇదం=ప్రత్యక్షముగ నున్న దానిని, ఎరుగను, అనిదం= పరోక్షమైన దానినికూడ, ఎరుగను. ఎదుటనున్నది ప్రత్యక్షమనియు,

ఎదుటలేనిది పరోక్ష మనియు, పూర్వము విభాగ ముండెడిది. ఇపుడు అట్లు లేదని యర్థము. ఏ సుఖము? ఎంత సుఖము? దీని పారమేది? అనునది కూడ ఎరుగను. ఇంతవరకును అనుభవించిన సుఖము అఖండరూప మగుటచే ఆ సుఖమునకు కాల-దేశ-వస్తుకృతమగు పరిచ్ఛేదము లేదని 'కియద్వా సుఖమ్', 'కిం వా సుఖమ్' అను వాక్యములు సూచించుచున్నవి. 'ఇదం న జానేఽప్యనిదం న జానే' అను వాక్యముచే వస్తుతః పరిచ్ఛేదము లేదనియు, 'కిం వా కియద్వా సుఖమస్య పారమ్'-అను వాక్యముచే కాలతః పరిచ్ఛేద దేశతః పరిచ్ఛేదములు లేవనియు చెప్పబడినది.

వాచావక్తు మశక్యమేవ మనసా మన్తుం న వా శక్యతే
స్వానన్దామృతపూరపూరిత పరబ్రహ్మామ్బుధేర్వైభవమ్,
అమ్భోరాశివిశీర్ణవార్షికశిలాభావం భజన్మే మనః
యస్యాంశాంశలవే విలీనమధునాఽఽనన్దాత్మనా నిర్వృతమ్.484

స్వానన్దామృతపూరపూరిత పరబ్రహ్మామ్బుధేః=స్వానందామృతము యొక్క ప్రవాహముచే నింపబడిన పరబ్రహ్మ సముద్రము యొక్క, వైభవమ్=వైభవము, వాచా=వాక్కుచే, వక్తుం=చెప్పుటకు, అశక్యమేవ=ఎటులును శక్యము కాదు. మనసా=మనస్సుచే, మన్తుం వా=మననము చేయుటకైనను, న శక్యతే=శక్యము కాదు, మే=నా యొక్క, మనః=మనస్సు, అమ్భోరాశివిశీర్ణ వార్షికశిలాభావం భజత్=సముద్రములో కరిగిపోయిన వడగలిగా (వార్షికశిల) అయినదై, యస్య=ఏ పరబ్రహ్మ సముద్రము యొక్క, అంశాంశలవే=సూక్ష్మభాగములోని సూక్ష్మభాగములోని, సూక్ష్మభాగమునందు, విలీనం=విలీనమైనదై, అధునా=ఇప్పుడు, ఆనన్దాత్మనా=ఆనందస్వరూపమున, నిర్వృతం=సుఖమును పొందినదో.

క్వ గతం కేన వానీతం కుత్ర లీన మిదం జగత్,
అధునైవ మయా దృష్టం నాస్తి కిం మహదద్భుతమ్.485

ఇదం=ఈ, జగత్=జగత్తు, క్వ=ఎచటికి, గతం=పోయినది? కేన వా=ఎవనిచేత, నీతం=తీసికొని పోబడినది? కుత్ర=ఎచట, లీనం= అణగి పోయినది? అధునైవ=ఇప్పుడే (కొలది కాలము క్రితమే), మయా= నాచేత, దృష్టం=చూడబడిన ఈ జగత్తు, నాస్తి=లేదు (కనబడుట లేదు), మహత్=గొప్పదైన, అద్భుతం=ఈ ఆశ్చర్యము, కిమ్=ఏమి ?

కిం హేయం కిముపాదేయం కిమన్యత్ కిం విలక్షణమ్,
అఖణ్డానన్దపీయూషపూర్ణే బ్రహ్మమహార్ణవే. 486

అఖణ్డానన్దపీయూషపూర్ణే=అఖండమగు ఆనందామృతముతోనిండిన ఈ బ్రహ్మసముద్రమునందు, హేయం = విడువదగినది, కిమ్ = ఏది? ఉపాదేయం = గ్రహింపదగినది, కిమ్ = ఏది? అన్యత్ = భిన్నమైనది, కిమ్=ఏది, విలక్షణం=భిన్నస్వభావము కలది, కిమ్=ఏది?

న కించిదత్ర పశ్యామి న శృణోమి న వేద్మ్యహమ్,
స్వాత్మనైవ సదానన్దరూపేణాఽస్మి విలక్షణః. 487

విలక్షణః=పంచకోశవిలక్షణుడనైన, అహం=నేను, అత్ర=ఇచట, కించిత్=ఏమియు, న పశ్యామి=చూచుటలేదు, న శృణోమి=వినుట లేదు, న వేద్మి=తెలిసికొనుట లేదు, ఆనందరూపేణ=ఆనందరూపమగు, స్వాత్మనైవ=స్వస్వరూపము తోడనే, సదా అస్మి=ఎల్లప్పుడును సంబంధించి ఉన్నాను.

అవ. శిష్యు డీ విధముగ నశించిన అజ్ఞానము కలవాడై, కృత కృత్యుడై, గురువునకు నమస్కరించుచున్నాడు –

"భావాద్వైతం సదా కార్యం క్రియాద్వైతం న కుత్రచిత్,
అద్వైతం త్రిషు లోకేషు నాద్వైతం గురుణా సహ."

భావాద్వైతమును ఎల్లప్పుడును చేయవచ్చును. క్రియాద్వైతమును మాత్రము చేయరాదు. మూడు లోకములందును అద్వైతమును చేయ వచ్చును గాని గురువు విషయమున అద్వైతము లేదు – అనగా మన

స్సులో మాత్రము పూర్తిగ అద్వైతదృష్టి ఉండవచ్చును గాని వ్యవహారములో మాత్రము అద్వైతదృష్టితో కార్యములు చేయరాదు. ఇతర సకల ప్రపంచవిషయమునను అద్వైతదృష్టిని ప్రదర్శింపవచ్చును గాని గురువు విషయమున ప్రదర్శింపరాదు. (గురువును చూచి నీవును నేను ఒకటే అనరాదు అని శాస్త్రము చెప్పుచున్నది.)

నమో నమస్తే గురవే మహాత్మనే
విముక్తసంగాయ సదుత్తమాయ,
నిత్యాద్వయానన్దరసస్వరూపిణే
భూమ్నే సదాపారదయామ్బుధామ్నే. 488

మహాత్మనే=మహాత్ముడవును, విముక్తసంగాయ=త్యక్తసంగుడవును, సదుత్తమాయ=బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడవును, నిత్యాద్వయానన్దరసస్వరూపిణే=నిత్యము, అద్వితీయము అగు ఆనందరసమే స్వరూపముగా కలవాడవును, భూమ్నే=విస్తృతస్వరూపుడవును, అనగా బ్రహ్మభిన్నమైన విషయము దర్శనము, శ్రవణము, విజ్ఞానము లేనివాడవును, సదా=ఎల్లప్పుడును, అపారదయామ్బుధామ్నే=అపారమైన దయయే ఉదకము; దానిని దాచిఉంచిన స్థానమైనవాడవు అనగా కరుణాసముద్రుడవును గురవే=గురువైన, తే=నీకు, నమో నమః=మాటి మాటికిని నమస్కారము.

యత్కటాక్షశశిసాన్ద్రచన్ద్రికాపాతధూతభవతాపజశ్రమః,
ప్రాప్తవానహమఖణ్డవైభవానన్దమాత్మపదమక్షయంక్షణాత్. 489

యత్కటాక్షశశిసాన్ద్రచన్ద్రికా పాతధూతభవతాపజశ్రమః = ఏ నీ యొక్క కటాక్షమనెడు చంద్రునియొక్క దట్టమైన చల్లనివెన్నెలయొక్క ప్రసారముచే తొలగింపబడిన, సంసారతాపము వలన కలిగిన శ్రమ కలవాడనై, అహం = నేను, అఖణ్డవైభవానన్దం = అఖండవైభవానందరూపమును, అక్షయం=అక్షయమును అగు, ఆత్మపదం = మోక్షమును, క్షణాత్= క్షణకాలములో, ప్రాప్తవాన్ = పొందినానో, అట్టి గురువైన నీకు నమస్కారము.

నిష్కలము, నిష్క్రియము, శాన్తము, నిరవద్యము, నిరంజనము అగు పరబ్రహ్మమునందు మగ్నమైన మనస్సుతో సంబంధించిన వగుటచే మిక్కిలి చల్లనైనవియు జగదాహ్లాదకములును అగు, ఏ, కటాక్షాః = అమృతప్రవాహ తరంగములైన కటాక్షములు కలవో, ఆ కటాక్షములే చంద్రుడు, ఆ చంద్రునియొక్క దట్టమైన చంద్రిక లేదా ఆ కటాక్షములే శశిసాన్ద్రచంద్రిక, దానియొక్క పాతముచేత అనగా నిరర్గలప్రసారముచేత తొలగింపబడిన, సంసారతాపజన్యశ్రమ కలవాడనై నేను, అఖణ్డవైభవానన్దం = నిరతిశయమగు స్వప్రకాశసుఖమైన, అక్షయం = శాశ్వతమైన, ఆత్మపదం = విష్ణువుయొక్క పరమపదమును, క్షణాత్ = క్షణకాలములో పొందినానో అట్టి మహాత్ముడగు గురువునకు నమస్కారము అని పూర్వశ్లోకముతో అన్వయము.

అవ. గురుప్రసాదముచే లభించిన స్వానుభవమును ఆవిష్కరించుచున్నాడు -

ధన్యోఽహం కృతకృత్యోఽహం
విముక్తోఽహం భవగ్రహాత్,
నిత్యానంద స్వరూపోఽహం
పూర్ణోఽహం త్వదనుగ్రహాత్. 490

త్వదనుగ్రహాత్ = నీయొక్క అనుగ్రహమువలన, అహం = నేను ధన్యః = ధన్యుడను, అహం = నేను, కృతకృత్యః = కృతకృత్యుడను, అహం = నేను, భవగ్రహాత్ = సంసారబంధమునుండి, విముక్తః = విడువబడితిని, అహం = నేను, నిత్యానందస్వరూపః = నిత్యానంద స్వరూపుడను. అహం = నేను, పూర్ణః = పూర్ణుడను.

అసఙ్గోఽహ మనఙ్గోఽహ మలిఙ్గోఽహ మభఙ్గురః,
ప్రశాన్తోఽహ మనన్తోఽహ మతాన్తోఽహం చిరన్తనః. 491

అహం = నేను, అసంగః = సంగరహితుడను, అహం = నేను, అనఙ్గః = దేహరహితుడను, అహం = నేను, అలిఙ్గః = జాత్యాశ్రమాది లింగములు లేనివాడను, అభఙ్గురః = నాశములేనివాడను, అహం = నేను, ప్రశాన్తః = శాన్తుడను, అహం = నేను, అనన్తః = అంతము లేని వాడను, అహం = నేను, అతాన్తః = అలసటలేనివాడను, చిరన్తనః = అతి ప్రాచీనుడను.

అకర్తాహ మభోక్తాహ మవికారోఽహ మక్రియః,
శుద్ధబుద్ధస్వరూపోఽహం కేవలోఽహం సదాశివః. 492

అహం=నేను, అకర్తా=కర్తను కాను, అహం=నేను, అభోక్తా= భోక్తను కాను, అహం = నేను, అవికారః = వికారము లేనివాడను, అక్రియః = క్రియలు లేనివాడను, అహం = నేను, శుద్ధబుద్ధస్వరూపః = నిర్మలము, జ్ఞానాత్మకము అగు స్వరూపము కలవాడను. అహం = నేను, కేవలః = అద్వితీయుడను. సదాశివః = సర్వదా మంగళస్వరూపుడను.

ద్రష్టుః శ్రోతుర్వక్తుః కర్తుర్భోక్తుర్విభిన్న ఏవాహమ్,
నిత్యనిరన్తరనిష్క్రియ నిస్సీమాసఙ్గ పూర్ణబోధాత్మా. 493

అహం = నేను, ద్రష్టుః = ద్రష్టకంటెను, శ్రోతుః = శ్రోతకంటెను, వక్తుః = మాటలాడు వానికంటెను, కర్తుః = కర్తకంటెను, భోక్తుః = భోగములను అనుభవించు వానికంటెను, భిన్నః ఏవ = భిన్నుడనే, నిత్య....బోధాత్మా = నిత్యము, భేదశూన్యము, క్రియారహితము, విభాగశూన్యము, అసంగము, పూర్ణము అగు జ్ఞానస్వరూపుడను.

నాహమిదం నాహమదోఽ
ప్యుభయోరవభాసకం పరం శుద్ధమ్,
బాహ్యాభ్యన్తర శూన్యం
పూర్ణం బ్రహ్మాద్వితీయ మేవాహమ్. 494

అహం = నేను, ఇదం = ఈ వస్తువు, న = కాను, అహం = నేను, అదః = ఆ వస్తువు, న = కాను, అహం = నేను, ఉభయోః అవభాసకం = ఈ వస్తువును ఆ వస్తువును, అనగా సకలమును ప్రకాశింప జేయునదియు, పరం = అత్యుత్తమమైనదియు, శుద్ధం = నిర్మలమైనదియు, బాహ్యాభ్యన్తర శూన్యం = వెలుపల, లోపల అనెడు విభాగములు లేనిదియు, పూర్ణం = సర్వవ్యాప్తమును, అద్వితీయం = ద్వితీయరహితమును అగు, బ్రహ్మ ఏవ = బ్రహ్మమునే.

నేను సర్వోపాధులతోడను రహితుడను అని యర్థము. త్రివిధములగు పరిచ్ఛేదములు (దేశతః, కాలతః, వస్తుతః పరిచ్ఛేదములు) లేనిదాని విషయమున బాహ్యము, ఆంతరము అనుదాని కల్పన ఎట్లుండును? ఈ భాహ్యాభ్యన్తరకల్పన శరీరదృష్టిచేతనే కాని ఆత్మ దృష్టిచే కాదు

నిరుపమమనాదితత్త్వం
త్వమహమిదమద ఇతి కల్పనాదూరమ్,
నిత్యానన్దైకరసం
సత్యం బ్రహ్మాద్వితీయమేవాహమ్. 495

నిరుపమం = సాటిలేనిదియు, అనాదితత్త్వం = అనాదితత్త్వమును, త్వం = నీవు, అహం = నేను, ఇదం = ఇది, అదః = అది, ఇతి = అను, కల్పనాదూరం = కల్పనలకు దూరమైనదియు, నిత్యానన్దైకరసం = కేవల నిత్యానందస్వరూపమును, సత్యం = సత్యమును, అద్వితీయం = ద్వితీయ రహితమును, అగు, బ్రహ్మైవ = బ్రహ్మమే, అహం = నేను.

నారాయణోఽహం నరకాన్తకోఽహం
పురాన్తకోఽహం పురుషోఽహ మీశః,
అఖణ్డబోధోఽహ మశేషసాక్షీ
నిరీశ్వరోఽహం నిరహం చ నిర్మమః. 496

అహం = నేను, నారాయణః = నారాయణుడను, అహం = నేను, నరకాన్తకః = నరకాసురసంహారిని, అహం=నేను, పురాన్తకః = త్రిపుర సంహారియైన శివుడను, అహం = నేనే, పురుషః = పురుషుడను, ఈశః = ఈశ్వరుడను, అహం = నేను, అఖణ్డబోధః = అఖండజ్ఞానస్వరూపుడను, అశేషసాక్షీ = సర్వసాక్షిభూతుడను, అహం = నేను, నిరీశ్వరః = ఈశ్వరుడు లేనివాడను, నిరహం = అహంకారము లేనివాడను, నిర్మమః చ = మమకారము లేనివాడను

నేను అహంకార మమకార శూన్యుడను అని అర్థము. "అత ఏవ చానన్యాధిపతిః" అని బ్రహ్మసూత్రము కూడ చెప్పుచున్నది. జ్ఞాని సిద్ధసంకల్పుడగుటచే ఆతనికి అధిపతి యగువాడు మరొక డెవడును ఉండడు అని దీని అర్థము.

సర్వేషు భూతేష్వహమేవ సంస్థితః
జ్ఞానా (త్రా) త్మనాన్తర్బహిరాశ్రయః సన్,
భోక్తా చ భోగ్యం స్వయమేవ సర్వం
(య) తద్యత్ పృథగ్ దృష్టమిదం తయా పురా 497

అహమేవ=నేనే, జ్ఞాత్రాత్మనా=జ్ఞాతృస్వరూపముతో, 'జ్ఞానాత్మనా' అను పాఠమున జ్ఞాన స్వరూపముతో అని యర్థము, సర్వేషు = సమస్తమైన, భూతేషు = భూతములయందు, అన్తర్బహిరాశ్రయః సన్ = లోపలను బైటను ఆశ్రయము కలవాడనై, సంస్థితః = ఉన్నాను, పురా = పూర్వము యద్యత్ = ఏది యేది, ఇదంతయా = 'ఇది' అను రీతిగా, పృథక్ = వేరుగా, దృష్టం = చూడబడినదో, (తత్తత్ = అ యా), భోక్తా చ = భోక్తయు, భోగ్యం చ = భోగ్యము, సర్వం = అంతయు, స్వయమేవ = నేనే.

సమస్తమైన, భూతేషు = ఆకాశాదిభూతములయందు, లోపలను వెలుపలను ఆశ్రయించినవాడనై, జ్ఞాతృరూపమున, లేదా జ్ఞానరూపమున నేనే ఉన్నాను, సర్వమును తెలిసికొనుచున్నాననగా

అపుడు తనకు ఉపాధియగు అంతఃకరణముచే సర్వమును వ్యాపించి యున్నానని యర్థము. ఈ విధముగ జ్ఞానము కలుగు సమయమున తెలియబడు ప్రతివస్తువును అంతఃకరణము ఆవరించుచున్నది. అంతఃకరణద్వారా అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము కూడ (ఈ చైతన్యమే జ్ఞాత) ఆ వస్తువులను ఆవరించుచున్నది. ఈ అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము, ఆ జ్ఞేయవస్తువులచే అవచ్ఛిన్నమగు చైతన్యమును ఒక్కటే. ఈ విధముగ జ్ఞేయము లన్నియు జ్ఞాతృచైతన్యాభిన్నమగు చైతన్యముపై అధ్యస్తములు గాన జ్ఞేయజగత్తునకంతకును నేనే, అనగా జ్ఞాతయే, అనగా అంతఃకరణావచ్ఛిన్న చైతన్యమే అధిష్ఠాన మని యభిప్రాయము. ఆరోపితము అధిష్ఠానముకంటె భిన్నము కాదు. శుక్తి రజతమువలెను, రజ్జుసర్పాదికమువలెను, పూర్వము ఏది వేరు వేరుగ చూడబడినదో అట్టి భోగ్యమగు శబ్దాదికము, భోక్తయు కూడ నేనే.

మయ్యఖణ్డసుఖామ్భోధౌ బహుధా విశ్వవీచయః,
ఉత్పద్యన్తే విలీయన్తే మాయామారుత విభ్రమాత్. 498

మాయామారుతవిభ్రమాత్ = మాయ యనెడు మారుతముయొక్క ఆఘాతమువలన, అఖణ్డసుఖామ్భోధౌ = అఖండసుఖసముద్రుడనైన, మయి = నాయందు, బహుధా = అనేకవిధములుగ, విశ్వవీచయః = ప్రపంచములనెడు తరంగములు, ఉత్పద్యన్తే = పుట్టుచుండును, విలీయన్తే = అణగిపోవుచున్నవి.

భగవత్పాద రచితమగు స్వాత్మనిరూపణము, అను గ్రంథమున ఇట్లు చెప్పబడినది.

మయి సుఖబోధపయోధౌ మహతి బ్రహ్మాణ్డబుద్బుదసహస్రమ్.
మాయామయేన మరుతా భూత్వా భూత్వా ముహు స్తిరోధత్తే.

సుఖజ్ఞానమహాసముద్రమగు నా యందు వేలకొలది బ్రహ్మాండము

లనెడు బుడగలు, మాయ యనెడు గాలిచే, మాటిమాటికి పుట్టు చుండును, మాటిమాటికి విలీన మగుచుండును అని చెప్పబడినది.

స్థూలాదిభావా మయి కల్పితా భ్రమా
దారోపితా ను స్ఫురణేన లోకైః,
కాలే యథా కల్పకవత్సరాయ-
నర్త్వాదయో నిష్కల నిర్వికల్పే. 499

నిష్కల నిర్వికల్పే = భేదరహితము, వికల్పశూన్యము అగు, కాలే = కాలమునందు, కల్పకవత్సరాయనర్త్వాదయః=కల్పకము, సంవత్సరము, అయనము, ఋతువు మొదలగునవి, యథా = ఏ విధముగా (కల్పింపబడినవో, అట్లే) నిష్కల నిర్వికల్పే=నిష్కలుడను నిర్వికల్పుడను అగు, మయి = నా యందు, ఆరోపితా ను స్ఫురణేన = కల్పితమగు స్ఫురణమాత్రము చేత, భ్రమాత్ = భ్రమ వలన, లోకైః=లోకులచే, స్థూలాదిభావాః = స్థూలదేహాదులు, కల్పితాః = కల్పింప బడినవి.

"అష్టాదశ నిమేషాస్తు కాష్ఠా త్రింశత్తు తాః కలా"-పదునెనిమిది కనురెప్పపాట్లకు సరియగు కాలము ఒక కాష్ఠ. ముప్పదికాష్ఠలు ఒక కల ఇత్యాది విధమున, నిష్కలే=అవయవములు లేనిదియు, నిర్వికల్పే= కలాకాష్ఠాదిపరిణామములు లేనిదియు అగు అఖండకాలమునందు, మానవులచే, ఏ విధముగ క్షణము, దినము, మాసము, ఋతువు, అయనము, సంవత్సరము, కల్పము, మొదలగు భేదములు కల్పింపబడినవో, అట్లే, ఆరోపితా ను స్ఫురణేన=కల్పితమగు స్ఫురణమాత్రముచే స్థూలాదిభావాః=స్థూలశరీరము, సూక్ష్మశరీరము, కారణశరీరము మొదలగు పదార్థములు, భ్రమవలన నాపై కల్పింపబడినవి. నాద బిందుకళలను దాటినవాడు కాలమును గాని, దాని భేదములను గాని చూడడు. అట్లే దేశ-కాల-వస్తుపరిచ్ఛేద శూన్యమగు సర్వవ్యాప్తమగు ఆత్మ స్వరూపసాక్షాత్కారము పొందిన, పూర్తిగా నశించిన అజ్ఞానము

గల, నాకు ఆరోపితవస్తుభావము లేదు. భ్రాంతియున్నకదా ఆ వస్తువులు భాసించుటు?

ఆరోపితం నాశ్రయదూషకం భవేత్
కదాపి మూఢై ర్మతిదోషదూషితైః,
నార్ద్రీకరో త్యూషరభూమిభాగం
మరీచికావారిమహాప్రవాహః. 500

మతిదోషదూషితైః = బుద్ధిదోషముచే దూషితులగు, మూఢైః = మూఢులచేత, ఆరోపితం = ఆరోపింపబడినవస్తువు, కదాపి = ఎన్నడును, ఆశ్రయదూషకం = ఆశ్రయమును దూషించునది, న భవతి = కాజాలదు. మరీచికావారిమహాప్రవాహః = మరుమరీచికయందు (ఎండమావులయందు) కల్పితమగు జలముయొక్క మహాప్రవాహము, ఊషరభూమిభాగం = ఎడారిభూమిని, నార్ద్రీకరోతి = తడిగ చేయజాలదు.

బుద్ధదోషముచే దూషితులగువారిచె ఆరోపితమగు వస్తువు ఆశ్రయదూషకం = భ్రమచే ఒక వస్తువును ఆరోపించుచున్నా రనగా అట్టి ఆరోపణకు ఏదైన ఒక ఆధారముండవలెను. అట్టి ఆధారమునకు దోషమును కలిగించునదిగ ఎన్నటికిని కాజాలదు.

"తత్రైవం సతి యత్ర యదధ్యాసః తత్కృతేన
గుణేన దోషేణ వా అణుమాత్రేణాపి స న సంబధ్యతే"

ఇట్టి పరిస్థితిలో, దేనియందు మరియొకదానిని అధ్యసింతుమో ఆ అధ్యసింపబడినదాని దోషము కాని గుణము కాని దానికి (అధ్యాసాధిష్ఠానమునకు) అంటుదు అని అధ్యాసభాష్యమున చెప్పబడినది. ఈ విషయమునే దృష్టాంతముచేత స్పష్టికరించుచున్నాడు — ఎండమావులలోని జలప్రవాహము ఊషరభూమిని తడిచేయదు కదా? మరీచికావారిమహాప్రవాహమును కల్పించుటకు ఊషరభూమిభాగము ఆశ్రయము.

ఆకాశవత్ కల్పవిదూరగోఽహ
మాదిత్యవద్భాస్యవిలక్షణోఽహమ్,
అహార్యవన్నిత్యవినిశ్చలోఽహ
మమ్భోధివత్పారవివర్జితోఽహమ్. 501

"ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః" = ఆకాశమువలె ఆత్మ సర్వగతము, నిత్యము అను శ్రుతియొక్క అర్థము అనుభవములో తెలిసినదని చెప్పుచున్నాడు. అహం = నేను, ఆకాశవత్ = ఆకాశమువలె, కల్పవిదూరగః = కల్పమునకు దూరమైనవాడను, అనగా కాలముచే పరిచ్ఛేద్యుడను కాను. "స్వయం జ్యోతిః" ఇత్యాది శ్రుత్యర్థమును చెప్పుచున్నాడు. అహం = నేను, ఆదిత్యవత్ = సూర్యునివలె, భాస్యవిలక్షణః = ప్రకాశింపజేయదగిన (తెలియదగిన) వస్తువులకంటె భిన్నమైనవాడను, అహార్యవత్ = పర్వతమువలె, అహం = నేను, నిత్యవినిశ్చలః = నిత్యుడను, స్థిరమైనవాడను లేదా ఎల్లప్పుడును స్థిరమైనవాడను, అహం = నేను, అమ్భోధివత్ = సముద్రమువలె, పారవివర్జితః = పారము (అవలిఒడ్డు) లేనివాడను అనగా అంతములేనివాడను.

న మే దేహేన సమ్బన్ధః మేఘేనేవ విహాయసః,
అతః కుతో మే తద్ధర్మాః జాగ్రత్స్వప్నసుషుప్తయః. 502

విహాయసః = ఆకాశమునకు: మేఘేనేవ = మేఘముతోవలెనే, మే = నాకు, దేహేన = దేహముతో, సమ్బన్ధః = సంబంధము, న = లేదు, అతః = అందువలన, తద్ధర్మాః = ఆ దేహముయొక్క ధర్మములగు, జాగ్రత్స్వప్న సుషుప్తయః = జాగ్రత్స్వప్న సుషుప్తులు, మే = నాకు, కుతః = ఎట్లు సంబంధించును ?

ఆకాశమునకు మేఘముతో ఏ విధముగ సంబంధము లేదో, "ధూమ జ్యోతిః సలిల మరుతాం సన్నిపాతః క్వ మేఘః"-ధూమము తేజస్సు, ఉదకము, వాయువు - వీటియొక్క కలయికయైన మేఘమెక్కడ.... అని కాళిదాసు చెప్పిన విధమున పృథ్వీ - జల - తేజో

వాయు సంఘాతరూపమగు మేఘముచే ఆకాశము ఎట్లు సంబంధించదో నిర్లిప్తస్వభావము కలదగుటవలనను, అమూర్తమగుటవలనను ఆకాశము ఏ విధముగ జలవర్షణముచే తడి అంటకుండ ఉండునో అట్లే ఆత్మనగు నాకు పాంచభౌతికమగు దేహముతో ఎట్టి సంబంధమును ఉండదు. అందుకుకూడ కారణము ఆత్మ నిర్లిప్తస్వభావము, అమూర్తము అగుటయే. అతః = ధర్మియగు దేహముతోడనే సంబంధము లేకపోవుటవలన, దాని ధర్మములైన జాగ్రత్స్వప్నసుషుప్తులు నా కెట్లుండును అని అన్వయము.

ఉపాధిరాయాతి స ఏవ గచ్ఛతి
స ఏవ కర్మాణి కరోతి భుఙ్క్తే,
స ఏవ జీవన్ మ్రియతే సదాహం
కులాద్రివన్నిశ్చల ఏవ సంస్థితః. 503

న మే ప్రవృత్తిర్న చ మే నివృత్తిః
సదైకరూపస్య నిరంశకస్య,
ఏకాత్మకో యో నిబిడో నిరన్తరో
వ్యోమేవ పూర్ణః స కథం ను చేష్టతే. 504

ఉపాధిః = దేహాద్యుపాధి, ఆయాతి = వచ్చుచుండును, సః ఏవ = అదియే, గచ్ఛతి = పోవుచుండును, సః ఏవ = అదియే, కర్మాణి = కర్మలను కరోతి = చేయుచుండును, భుఙ్క్తే = కర్మఫలమును అనుభవించుచుండును. సః ఏవ = ఆ ఉపాధియే, జీవన్ = జీవించుచు, (కొంతకాలముండి), మ్రియతే = మరణించుచున్నది. అహం = నేను, సదా = ఎల్లప్పుడును, కులాద్రివత్ = కులపర్వతమువలె, నిశ్చలః ఏవ = నిశ్చలముగనే, సంస్థితః = ఉన్నాను.

సదా = ఎల్లప్పుడును, ఏకరూపస్య = ఒకే రూపముననున్న, నిరంశకస్య = అవయవములు లేని, మే = నాకు, ప్రవృత్తిః = ప్రవృత్తి, న = లేదు, మే = నాకు, నివృత్తిః చ = నివృత్తి కూడ, న = లేదు (కర్మ

వాయు సంఘాతరూపమగు మేఘముచే ఆకాశము ఎట్లు సంబంధించదో నిర్లిప్తస్వభావము కలదగుటవలనను, అమూర్తమగుటవలనను ఆకాశము ఏ విధముగ జలవర్షణముచే తడి అంటకుండ ఉండునో అట్లే ఆత్మనగు నాకు పాంచభౌతికమగు దేహముతో ఎట్టి సంబంధమును ఉండదు. అందుకుకూడ కారణము ఆత్మ నిర్లిప్తస్వభావము, అమూర్తము అగుటయే. అతః = ధర్మియగు దేహముతోడనే సంబంధము లేకపోవుటవలన, దాని ధర్మములైన జాగ్రత్స్వప్నసుషుప్తులు నాకెట్లుండును అని అన్వయము.

ఉపాధిరాయాతి స ఏవ గచ్ఛతి
స ఏవ కర్మాణి కరోతి భుఙ్క్తే,
స ఏవ జీవన్ మ్రియతే సదాహం
కులాద్రివన్నిశ్చల ఏవ సంస్థితః. 503

న మే ప్రవృత్తిర్న చ మే నివృత్తిః
సదైకరూపస్య నిరంశకస్య,
ఏకాత్మకో యో నిబిడో నిరన్తరో
వ్యోమేవ పూర్ణః స కథం ను చేష్టతే. 504

ఉపాధిః = దేహాద్యుపాధి, ఆయాతి = వచ్చుచుండును, సః ఏవ = అదియే, గచ్ఛతి = పోవుచుండును, సః ఏవ = అదియే, కర్మాణి = కర్మలను కరోతి = చేయుచుండును, భుఙ్క్తే = కర్మఫలమును అనుభవించుచుండును. సః ఏవ = ఆ ఉపాధియే, జీవన్ = జీవించుచు, (కొంతకాలముండి), మ్రియతే = మరణించుచున్నది. అహం = నేను, సదా = ఎల్లప్పుడును, కులాద్రివత్ = కులపర్వతమువలె, నిశ్చలః ఏవ = నిశ్చలముగనే, సంస్థితః = ఉన్నాను.

సదా = ఎల్లప్పుడును, ఏకరూపస్య = ఒకే రూపముననున్న, నిరంశకస్య = అవయవములు లేని, మే = నాకు, ప్రవృత్తిః = ప్రవృత్తి, న = లేదు, మే = నాకు, నివృత్తిః చ = నివృత్తికూడ, న = లేదు (కర్మ

స్యాత్తద్వ్యపదేశో భాక్త స్తద్భావభావిత్వాత్" - దేవదత్తుడు పుట్టి నాడు ఇత్యాది ఏకవ్యవహారమును బట్టి జీవునకు జననమరణము లున్నవని ఆశంకించి ఈ సూత్రమున సమాధానము చెప్పబడినది. జంగమములు, స్థావరములును అగు శరీరముల జన్మమరణములను జీవునకు ఆరోపించి జీవునకు జననమరణవ్యవహారము జరుగుచున్నది. కావున ఈ వ్యవహారము భాక్తము అనగా ఔపచారికము. కావుననే ఆ శరీరసంబంధ మున్నప్పుడు ఈ వ్యవహారమున్నది. అది లేనపుడు ఈ వ్యవహారము కూడ లేదు (బ్ర. సూ. 2.3.16). నేనెల్లప్పుడును కులపర్వతమువలె నిశ్చలముగనే ఉన్నాను. ప్రవృత్తి నివృత్తులు రెండును ఒకేమారు జరిగినను, క్రమముగ జరిగినను ఏకరూపత్వ మనునది ఉండదు. నిరంశునకు అనగా అవయవరహితునకు వికా రము కూడ అసంభావ్యము. ఆ విషయమునే ఉపపాదించుచున్నాడు. ఏకాత్మకమును, దట్టమైనదియు, నిరన్తరః=అవకాశరహితము, ఆకా శమువలె పూర్ణమైనదియు అగునది ఎట్లు, చేష్టతే=కదలును; కార్య ములు చేయును?

పుణ్యాని పాపాని నిరిన్ద్రియస్య
నిశ్చేతసో నిర్వికృతే ర్నిరాకృతేః,
కుతో మమాఖణ్డ సుఖానుభూతే
ర్బ్రూతే హ్యనన్వాగత మిత్యపి శ్రుతిః. 505

నిరిన్ద్రియస్య=ఇంద్రియ రహితుడను, నిశ్చేతసః=మనస్సులేని వాడను, నిర్వికృతేః=వికారములు లేనివాడను, నిరాకృతేః=ఆకార శూన్యుడను, అఖణ్డసుఖానుభూతేః=అఖండసుఖానుభవ స్వరూపుడను అగు, మమ=నాకు, పుణ్యాని=పుణ్యములుకాని, పాపాని=పాపములుకాని, కుతః=ఎట్లు? శ్రుతిః అపి=శ్రుతికూడ, అనన్వాగతం ఇతి=సుషుప్తిలోగూడ సుఖదుఃఖాదు లుండవని, బ్రూతే హి=చెప్పుచున్నది కదా!

శాస్త్రవిహితములగు కర్మలు చేయుటవలన కలుగునది పుణ్యము. శాస్త్రనిషిద్ధములగు కర్మలను చేయుటవలన కలుగునది పాపము. శారీరము, మానసము, వాచికము అని కర్మ మూడు విధములు. భగవద్గీతలో "శరీరవాఙ్మనోభి ర్యత్ కర్మ ప్రారభతే నరః, న్యాయ్యం వా విపరీతం వా"-మానవుడు న్యాయ్యమైనది కాని, అన్యాయ్యమైనది కాని, ఏ కర్మను శరీరముచేతను, వాక్కుచేతను, మనస్సుచేతను చేయునో-అని చెప్పబడినది. మహానదులలో స్నానము, దేవతలు, బ్రాహ్మణులు మొదలగువారికి ప్రదక్షిణాదికము చేయుట మొదలగునవి శరీరముతో చేయు పుణ్యములు. మహామంత్రములను జపించుట, భగవన్నామ సంకీర్తనము చేయుట, భగవద్గుణములను కీర్తించుట మొదలగునవి వాక్కుతో చేయు పుణ్యములు. ఈశ్వరుని ధ్యానించుట, తనకును పరులకును హితమగు విషయములను గూర్చి ఆలోచించుట మొదలగునవి మనస్సుచేత చేయు పుణ్యములు. అగమ్యాస్త్రీ సంగమాదికము శరీరముచేత చేయు పాపము. పరనింద-అసత్యభాషణాదికము, వాక్కుతో చేయు పాపము. శాస్త్రనిషిద్ధములగు విషయములను గూర్చి ఆలోచించుట మనస్సుతో చేయు పాపము.

శరీరజైః కర్మదోషై ర్యాతి స్థావరతాం నరః,
వాచికైః పక్షిమృగతాం మానసైరన్త్యజాతితామ్.

శారీరపాపములచే మానవుడు వృక్షాదిస్థావరజన్మ మెత్తును. వాచికపాపములచే పక్షిమృగాదిజన్మ మెత్తును. మానసపాపములచే అంత్యజాతిలో పుట్టును అని చెప్పబడినది. ఇచ్చట వాక్కు అనునది చక్షుః శ్రోత్రాదులకు ఉపలక్షణము. (అనగా పరనిందాదికము ఏ విధముగ వాక్కుచే చేయుపాపమో అట్లే చూడకూడని వాటిని చూచుట, వినుట మొదలగునవి చక్షుః శ్రోత్రాదీంద్రియములచే చేసిన పాపము అని అర్థము ఇట్లే పుణ్యము విషయమున గూడ), లేదా వాక్పదముచేత కర్మసాధనములగు కర్మేంద్రియము లన్నింటిని, మనః పదముచే

జ్ఞానసాధనములగు చక్షురాది జ్ఞానేంద్రియము లన్నింటిని గ్రహింప వలెను. మంచిపని చేయుట, చూచుట, వినుట మొదలగునవి ఆ యా యింద్రియములకు సంబంధించిన పుణ్యములు. అసత్కార్య మును చేయుట, వినుట, చూచుట మొదలగునవి ఆ యా యింద్రియ ములు చేయుపాపములు, ఇదంతయు ఇంద్రియములకు గాని చిత్త మునకు గాని, సాకారమగు స్థూలశరీరమునకు గాని సంబంధించినది. నిరింద్రియునకు దీనితో సంబంధములేదు. "న తస్య కార్యం కరణం చ విద్యతే" పరమాత్మకు కార్యము గాని, శరీరాదిసాధనము గాని లేదు అని శ్రుతివాక్యము "సచక్షురచక్షురివ సకర్ణోఽకర్ణ ఇవ సమనా అమనా ఇవ సప్రాణోఽప్రాణ ఇవ" అని మరియొక శ్రుతి అధ్యాసిక సంబంధములేని జీవన్ముక్తుడు వాస్తవమున నేత్రేంద్రియములేనివాడై నను నేత్రేంద్రియమున్నవాడువలె, కర్ణములు లేనివాడైనను కర్ణము లున్న వాడువలె, మనస్సు లేనివాడైనను మనస్సు ఉన్న వాడువలె, ప్రాణములేని వాడైనను ప్రాణమున్న వాడువలె పరులకు కనబడు చుండును అని ఈ శ్రుతి వాక్యమున కర్థము. శరీరేంద్రియాదు లతని మిథ్యాజ్ఞాన కల్పితమగు అభిమానకృతమైన, తాదాత్మ్య సంబంధ మున్నపుడే అట్టివాడు సశరీరుడనియు, సేంద్రియుడనియు, సమన స్కుడనియు చెప్పవచ్చును గాని బ్రహ్మసాక్షాత్కారముచే దగ్ధమైన అజ్ఞానము కలవానికి అభిమాన మెక్కడిది? తాదాత్మ్య మెక్కడిది? ఈ విధముగ 'నిరిన్ద్రియస్య', 'నిశ్చేతసః', 'నిరాకృతేః' అను పద త్రయముచే పుణ్యపాప సాధనములగు వాఙ్మనఃశరీరములు లేవని చెప్పబడినది. పుణ్యపాపములు ఆత్మకే సంబంధించి యుండునని తార్కికులు చెప్పుదురు. విహిత-నిషిద్ధకర్మల నాచరించుటవలన కలి గిన పుణ్యపాపములు అనునవి ఒకవిధమగు వికారమే. నిత్యమగు ఆత్మకు వికారరూపములగు ఈ అనిత్యపుణ్యపాపములతో సంబంధ మున్నదని చెప్పినచో ఆత్మకూడ అనిత్యమని చెప్పవలసియుండును. అందుచే "నిర్వికృతేః" అనుపదముచే ఆత్మ వికార శూన్యమని

చెప్పబడినది. తోటకాచార్యులు గూడ శ్రుతిసారసముద్ధరణమున—
'న హి నిత్య మనిత్యగుణేన గుణీ' నిత్యమైన దానికి అనిత్యమైన గుణములు ఉండవుకదా? అని చెప్పినాడు. 'అనిత్యమగు శబ్దమునకు ఆశ్రయమగుటచే ఆకాశము అనిత్యమే' యని వియదధికరణభాష్యమునగూడ చెప్పబడినది. కావున, స్వభావతః నిర్వికారుడనగుటచేతను నందు మూలాజ్ఞాననాశముచే శరీరేంద్రియ మనోరూపోపాధులతో సంబంధము లేకపోవుటవలనను, అఖణ్డసుఖానుభూతేః—అనావృతము, అపరిచ్ఛిన్నము, స్వయంప్రకాశము అగు ఆనందమే స్వరూపముగా గల, నాకు పుణ్యము లెట్లుండును? పాపము లెట్లుండును? ఈ విషయమున శ్రుతిని ప్రమాణముగ చూపుచున్నాడు.

అనన్వాగతం పుణ్యేన, అనన్వాగతం పాపేన,
తీర్ణో హి తదా సర్వాన్ శోకాన్ హృదయస్య భవతి.

ఈ సుషుప్తియందు ఆత్మ పుణ్యముచేతగాని పాపముచేతగాని సంబంధింపదు. ఆ సమయమున హృదయముయొక్క శోకముల నన్నింటిని దాటును అను శ్రుతి ఇంకను మూలాజ్ఞానమున్న సుషుప్త్యవస్థలోకూడ, ఆ అజ్ఞానకార్యముల అధ్యాసము లేకపోవుటచే, ఆత్మకు పుణ్యపాపముల స్పర్శ లేదనియు, హృదయగతములగు శోకముల స్పర్శ లేదనియు బోధించుచున్నది ఆ విధముగ అందరి అనుభవములోకూడ నున్నది. ఇపుడు కారణాజ్ఞానము కూడ నశించుటచే పుణ్య-పాప-దుఃఖముల సంబంధము ఏ మాత్రమును ఉండదు. కావున 'కో మోహః కః శోకః' అను శ్రుతివాక్యమునందలి కిం శబ్దమువలె, ఈ శ్లోకమునందలి 'కుతః' శబ్దము, ఆక్షేపముచే, పాపాదుల అభావమును బోధించుచున్నది. పుణ్యపాపదుఃఖములు ఆత్మధర్మములైనచో సుషుప్త్యవస్థలో కూడ అవి అనువర్తించవలెను. అట్లు అనువర్తించుట లేదు కదా? ఆ సమయమున స్వరూపసుఖమే అనుభవింపబడుచున్నది. అప్పుడు అనుభవింపబడునది, పుణ్యఫలమైన పరిచ్ఛిన్నసుఖము కాదు.

ఆ సుఖము విషయసంబంధమువలన కలిగినది కాదుకదా? ఆ సమయ మున దుఃఖము లేనే లేదు. 'ఏషోఽస్య పరమ ఆనన్దః' ఇది సుషు ప్త్యవస్థలోనున్న జీవుని పరమానందము అను శ్రుతియు, సర్వజనాను భవమును అందులకు ప్రమాణము, అందుచే అపుడు పాపసంబంధము లేదు. (పూర్వోదాహృత శ్రుతిలో) 'హృదయస్య శోకాన్' అని చెప్పుటచే శోకపదపర్యాయమగు దుఃఖము ఆత్మధర్మము కాదని చెప్పి నట్లైనది. జాగ్రత్స్వప్నావస్థలలో శరీరాద్యధ్యాసముండుటచే పుణ్య పాపహృదయశోకాదులు కల్పితములైనవి. కాని ఇపుడు అధ్యాసము లేకపోవుటచే పుణ్యాదికల్పన లేదు అని శ్రుత్యర్థము.

అవ. చెప్పినవిషయమునే దృష్టాంతపూర్వకముగ రెండు శ్లోకములలో విశదీకరించుచున్నాడు —

**ఛాయయా స్పృష్ట ముష్ణం వా శీతం వా సుష్ఠు దుష్ఠు వా,**
**న స్పృశత్యేవ యత్కిఞ్చిత్ పురుషం తద్విలక్షణమ్. 506**

**ఛాయయా= నీడచేత, సంస్పృష్టం = స్పృశింపబడిన, ఉష్ణం వా= ఉష్ణపదార్థముగాని, శీతం వా = చల్లని పదార్థముగాని, సుష్ఠు వా= మంచిది. గాని, దుష్ఠు వా = చెడ్డదిగాని, యత్కించిత్ = ఏదియు, తద్విలక్షణం = ఆ ఛాయకంటె భిన్నమైన, పురుషం=పురుషదేహమును, న స్పృశత్యేవ= స్పృశిందనే స్పృశింపదు.**

తన శరీరముయొక్క నీడకు జలాగ్న్యాదులతోగాని, సదసద్వ స్తువులతోగాని సంబంధము కలిగినను శరీరమునకు ఏ విధముగ శీతో ష్ణాదిసంబంధము ఉండదో అట్లే, ఉపాధి ప్రతిబింబపక్షపాతి గాన— అనగా ఉపాధిధర్మములు ప్రతిబింబమునందు కానవచ్చుచుండును గాన, బుద్ధియందు ప్రతిబింబించిన జీవునకు ఆ బుద్ధిధర్మములైన పుణ్యసుఖాదులతో సంబంధ మున్నను, అజ్ఞానము నశించి, జీవత్వము తొలగిన పిమ్మట తద్విలక్షణమైన, బింబమగు పురుషుని అనగా పూర్ణము గాన పురుషుడు; ఆత్మ; దానిని ఏదియు స్పృశింపదు ఛాయకు

సంబంధించిన అర్థమున పురుషశబ్దమునకు శరీరమని అర్థము. తద్వి లక్షణం=ఛాయకంటె భిన్నమైన-

న సాక్షిణం సాక్ష్యధర్మాః సంస్పృశన్తి (కదాచన) విలక్షణమ్,
అవికార ముదాసీనం గృహధర్మాః ప్రదీపవత్,
దేహేన్ద్రియమనోధర్మా నైవాత్మానం స్పృశన్త్యహో. 507

గృహధర్మాః=గృహముయొక్క ధర్మములు, ప్రదీపవత్=దీపమునువలె, సాక్ష్యధర్మాః=సాక్షిధర్మములుకానివి, (కదాచన=ఎన్నడును), విలక్షణం=దృశ్యములకంటెభిన్నమైన స్వభావముగల, సాక్షిణం=సాక్షియైన ఆత్మను, న సంస్పృశన్తి=స్పృశింపవు. దేహేన్ద్రియమనోధర్మాః=దేహేంద్రియమనస్సుల ధర్మములు, అవికారం=వికారరహితమును, ఉదాసీనం=ఉదాసీనమును అగు, ఆత్మానం=ఆత్మను, నైవ స్పృశన్తి=స్పృశింపవు, అహో=ఆశ్చర్యము.

గృహముయొక్క ధర్మములు, గృహమును ప్రకాశింపజేయు దీపమును ఏ విధముగ స్పృశింపవో, అట్లే సాక్షిధర్మములుకాని, దృశ్యములైన బుద్ధీన్ద్రియశరీరధర్మములు, విలక్షణం=దృగ్రూపుడును, స్వయంప్రకాశుడును, అవికారియు, ఉదాసీనుడును అగు సాక్షిని ఎన్నడును స్పృశింపవు. దేహేంద్రియమనోధర్మములు అవికారియు, ఉదాసీనమును అగు ఆత్మను ఏ మాత్రమును స్పృశింపవు అని దీప దృష్టాన్తముతో చెప్పుటచే 'పుణ్యాని పాపాని'(505)ఇత్యాది శ్లోకార్థము వివరింపబడినది.

అవ. మూడు దృష్టాంతములతో ఆత్మ అసంగ మను విషయమును ప్రతిపాదించుచున్నాడు—

రవే ర్యథా కర్మణి సాక్షిభావో
వహ్నే ర్యథా వాయసి దాహకత్వమ్,
రజ్జో ర్యథాఽఽరోపితవస్తుసంగః
తథైవ కూటస్థచిదాత్మనో మే 508

కర్మణి = కర్మయందు, రవేః = సూర్యునకు, సాక్షిభావః = సాక్షిత్వము, యథా = ఎట్లో, అయసి = ఇనుము పైనున్న, వహ్నేః = అగ్నికి, దాహకత్వం = దాహకత్వము, యథా = ఎట్లో, రజ్జోః = రజ్జువుకు, ఆరోపిత వస్తుసంగః = ఆరోపితమగు వస్తువుతో సంగము, యథా = ఎట్లో, కూటస్థ చిదాత్మనః = కూటస్థమగు చిదాత్మనైన, మే = నాకును, తథైవ = అట్లే.

ఏ కర్మలతోడను సంగములేని సూర్యుడు, "కర్మసాక్షి", "జగచ్చక్షువు" (జగత్తునకు నేత్రము) అను లోకప్రసిద్ధి ననుసరించి, ఏ విధముగ సకలప్రాణుల కర్మలకు, సాక్షిగ నుండునో, కూటస్థ చిదాత్మనః = వికారశూన్యచిద్రూపుడనై సకలకర్మసంగ విహీనుడనైన నాకు గూడ సాక్షిత్వము. (నేను గూడ సాక్షిగా ఉన్నాను). 'ఇనుము కాల్చుచున్నది' ఇత్యాదివిధమున అగ్నికిగల దాహకత్వము ఇనుమునకు ఆరోపింపబడుచున్నది. అట్లే బుద్ధ్యాదులకు గల కర్తృత్వము నాపై ఆరోపింపబడుచున్నది. కల్పితములగు సర్పము, దండము, జలధార మొదలగువాటితో తాదాత్మ్య సంబంధము రజ్జువునకు కల్పింపబడుచున్నది. అట్లే నిర్వికారచిద్రూపుడనగు నాకు దేహాది సంబంధము కల్పింపబడుచున్నది. మూడు దృష్టాన్తములును (రవి, ఇనుము, రజ్జువు) వాస్తవమున అసంగములే.

కర్తాపి వా కారయితాపి నాహం
భోక్తాపి వా భోజయితాపి నాహమ్,
ద్రష్టాపి వా దర్శయితాపి నాహం
సోఽహం స్వయంజ్యోతి రనీదృగాత్మా. 509

అహం = నేను, కర్తాపి = చేయువాడను, కారయితాపి = చేయించువాడను కూడ, న = కాను, అహం = నేను, భోక్తాపి = అనుభవించువాడను, భోజయితాపి వా = అనుభవింప జేయువాడను కూడ, న = కాను, అహం = నేను, ద్రష్టాపి = చూచెడువాడను, దర్శయితాపి వా = చూపించువాడనుకూడ, న =

కాను, సః అహం = అట్టి నేను, అసీదృగాత్మా = ఇట్టి స్వరూపము కల వాడను కాని, స్వయంజ్యోతిః = స్వయంప్రకాశ స్వరూపుడను.

"విజ్ఞానం యజ్ఞం తనుతే" - జీవుడు యజ్ఞమును అనగా సంకల్పమును చేయుచున్నాడు. "ఏషహ్యేవ సాధు కర్మ కారయతి" - ఈశ్వరుడే సత్కర్మ చేయించును అను శ్రుతులచే బుద్ధ్యుపహితమగు ఆత్మకు (జీవునకు) కర్తృత్వము, మాయోపహితమగు ఆత్మకు (ఈశ్వరునకు) కారయితృత్వము తెలియుచున్నది. భోక్తృత్వ భోజయితృత్వములు కూడ ఈ జీవేశ్వరులకే సంబంధించినవి. ద్రష్టృత్వమనునది కూడ దృశ్యసాపేక్షము గాన, అనగా దృశ్యము లేనిదే ద్రష్ట అనువాడు ఉండడు గాన, అద్వితీయాత్మయందు ద్రష్టృత్వము కూడ కల్పితమే; వాస్తవమున ద్రష్టృత్వము లేదు. చక్షురాదులను ప్రేరేపించుట అనునది కూడ, అనగా దర్శయితృత్వము కూడ, వ్యవహారావస్థలోనే ఉన్నది. కాని వాస్తవమున లేదు. అందుచే నేను దర్శయితనుగూడ కాను. సోఽహం = అట్టి ఈ నేను, అసీదృక్ = ఇట్టి వాడు కాని (అనగా కర్తృత్వాది సకల ధర్మరహితుడైన); "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" - ఈ ఆత్మ సాక్షిరూపమైనది; చైతన్యస్వరూపము; అద్వితీయము, గుణరహితము అని శ్రుతి చెప్పుచున్నది. స్వయంజ్యోతిః = ఇతర వస్తువులపై ఆధారపడని స్ఫురణము కల, ఆత్మా = ఆత్మను.

చలత్యుపాధౌ ప్రతిబిమ్బలౌల్య
మౌపాధికం మూఢధియో నయన్తి,
స్వబిమ్బభూతం రవివద్వినిష్క్రియం
కర్తాస్మి భోక్తాస్మి హతోఽస్మి హేతి. 510

ఉపాధౌ = ఉపాధిభూతమగు బుద్ధ్యాదికము (రవిపక్షమున జలాదికము) చలతి సతి = చలించుచుండగా, మూఢధియః = మూఢబుద్ధులు, ఔపాధికం = ఉపాధి కల్పితమైన, ప్రతిబిమ్బలౌల్యం = ప్రతిబింబము యొక్క చంచల

త్వమును (సూర్యప్రతిబింబము, ఆత్మప్రతిబింబము కూడ గ్రహింప వలెను), రవివత్=బింబసూర్యుడువలె, వినిష్క్రియం=క్రియాశూన్యమైన బిమ్బభూతం=బింబమైన ఆత్మను, కర్తా అస్మి=నేను కర్తగా ఉన్నాను, భోక్తా అస్మి=నేను భోక్తగా ఉన్నాను, హతః అస్మి=నేను చంపబడినాను, హా=అయ్యో, ఇతి=ఈ విధముగ తలంచుచు, నయన్తి=పొందించు చున్నారు. ('ప్రతిబింబలౌల్యమును ఆత్మను పొందించున్నారు' అనగా ప్రతిబింబలౌల్యమును ఆత్మపై ఆరోపించుచున్నారు అని యర్థము).

భ్రాంతిచే మూఢమైన బుద్ధిగలవారు ఉపాధియైన జలము కదలినపుడు దానియందలి సూర్యబింబము కూడ కదలుట చూచి ఆ కదలికను, వాస్తవమున ఎట్టి క్రియయు లేని బింబభూతమగు రవి యందు ఆరోపించుచుందురు. అట్లే బుద్ధ్యాద్యుపాధుల చలనముచే తత్ప్రతిబింబిత జీవాత్మకూడ చలింపగా, ఆ చలనమును నిష్క్రియము, బింబభూతము అగు ఆత్మయందు ఆరోపించి, బుద్ధితాదాత్మ్యాధ్యాస ముచే నేనే కర్తను, నేనే భోక్తను అని యు, స్థూలదేహతాదాత్మ్యాధ్యాస ముచే అయ్యో నేను చంపబడితి ననియు అనుకొనుచుందురు. కావుననే "ధ్యాయతీవ లెలాయతీవ"-ఆత్మ ధ్యానము చేయుచున్నదా అన్న ట్లున్నది, కదలుచున్నదా అన్నట్లున్నది అని చెప్పుచున్నది. వాస్త వమున ప్రతిబింబము నందు కూడ ఉపాధిధర్మములు భ్రాంతి సిద్ధము లే.అందుచే బింబమునందు సుతరాం ఉండజాలవు. అయినను మూఢా త్ములు ఆరోపించుచున్నారు. కావున శ్రుతి, యుక్త్యనుభవములచే సిద్ధ మగు నిర్గుణత్వమునకు విరోధ మేమియును లేదు.

అవ. స్థూలదేహ ధర్మములు ఆత్మకు సంబంధింపవు అను విషయమును ఘటాకాశదృష్టాంతముతో చెప్పుచున్నాడు-

జలే వాపి స్థలే వాపి లుఠత్వేష జడాత్మకః,
నాహం విలిప్యే తద్ధర్మై ర్ఘటధర్మై ర్నభో యథా. 511

జడాత్మకః=జడమైన, ఏషః=ఈ శరీరము, జలే వాపి=జలమునందైనను, స్థలే వాపి=స్థలమునందైనను, లుఠతు=దొరలునుగాక, నభః=ఆకాశము, యథా=ఏ విధముగా, ఘటధర్మైః=ఘటముయొక్క ధర్మముల చేత, అనగా అనిత్యత్వము మొదలగు ధర్మములచేతను, పెద్దపొట్ట మొదలైన ఆకారములచేతను, నీలాది రూపములచేతను, లిప్తము కాదో, ఆ విధముగనే, తద్ధర్మైః=దానియొక్క (స్థూలదేహముయొక్క ధర్మముల చేతను, జలస్థూలాదులతో సంబంధము వలన ఏర్పడిన శైత్యాభిఘాతాదుల చేతను, జరామరణాదులచేతను గూడ, అహం న విలిప్యే=నేను లిప్తుడను కాను.

కర్తృత్వ భోక్తృత్వ ఖలత్వమత్తతా
జడత్వ బద్ధత్వ విముక్తతాదయః,
బుద్ధే ర్వికల్పా న తు సన్తి వస్తుతః
స్వస్మిన్ పరే బ్రహ్మణి కేవలేఽద్వయే. 512

కేవలే=ఏకైకము, అద్వయే=ద్వితీయరహితము, పరే బ్రహ్మణి=పరబ్రహ్మమైన, స్వస్మిన్=తనయందు, కర్తృత్వ .... .... ఆదయః=కర్తృత్వము, భోక్తృత్వము, దుష్టత్వము, మత్తత్వము, జడత్వము, బద్ధత్వము, ముక్తత్వము మొదలైన, బుద్ధేః వికల్పాః=బుద్ధియొక్క అధ్యాసము వలన ఏర్పడిన వివిధ కల్పనలు, వస్తుతః=వాస్తవమున, న సన్తి=లేవు.

సన్తు వికారాః ప్రకృతేర్దశధా
శతధా సహస్రధా వాపి,
తైః కిం మేఽసఙ్గచితేః
న హ్యమ్బుదడమ్బరోఽమ్బరం స్పృశతి. 513

సకల ప్రపంచము కూడ సాక్షాత్తుగనో, పరంపరగనో మూల ప్రకృతి నుండి పుట్టిన దగుటచే, ప్రకృతేః = మూలప్రకృతి యొక్క, వికారాః=వికారములు, దశధా = పదిరీతులుగా గాని, శతధా = నూరు విధ

ములుగా గాని, సహస్రధా వాపి=వేయివిధములుగా గాని, సన్తు=అగు గాక, అసంగచితేః=అసంగచిద్రూపమైన, మే=నాకు, తైః=ఆ వికారములచే, కిమ్=ఏ మగును? అందు దృష్టాన్తము - అమ్బుదడమ్బరః=మేఘగర్జనాదికము, అమ్బరం=ఆకాశమును, న స్పృశతి హి=స్పృశింపదు కదా, ఎల్లప్పుడును నిర్వికారమైన ఆకాశమునందు మేఘోదయము, గర్జనము, మేఘ వినాశము మొదలగు వాటిచే విశేష మేదియును ఉండదు.

అవ. శ్రీ గురూపదేశానుసారముగ కలిగిన అద్వైతానుభవమును విశదీకరించుచున్నాడు-

అవ్యక్తాది స్థూలపర్యన్త మేత
ద్విశ్వం యత్రా భాసమాత్రం ప్రతీతమ్,
వ్యోమప్రఖ్యం సూక్ష్మమాద్యన్త హీనం
బ్రహ్మాద్వైతం యత్తదేవాహ మస్మి. 514

యత్ర=దేనియందు, అవ్యక్తాది=అవ్యక్తము మొదలు, స్థూలపర్యన్తం=స్థూలమువరకును గల, ఏతత్=ఈ, విశ్వం=ప్రపంచము, ఆభాసమాత్రం=కేవలాభాసరూపమున, ప్రతీతం=కనబడుచున్నదో, యత్=ఏది, వ్యోమప్రఖ్యం=ఆకాశముతో సమానమైనదో, సూక్ష్మం=సూక్ష్మమైనదో, ఆద్యన్తహీనం=ఆద్యంతములు లేనిదో, తత్=అట్టి, అద్వైతం=అద్వైతరూపమగు, బ్రహ్మ=బ్రహ్మగా, అహం=నేను, అస్మి=అయి ఉన్నాను.

సర్వాధారం సర్వవస్తుప్రకాశం
సర్వాకారం సర్వగం సర్వశూన్యమ్,
నిత్యం శుద్ధం నిష్కలం నిర్వికల్పం
బ్రహ్మాద్వైతం యత్తదేవాహ మస్మి. 515

యత్=ఏ బ్రహ్మ, సర్వాధారం=అంతకును ఆధారమో, సర్వవస్తుప్రకాశం=సమస్త వస్తువులను ప్రకాశింప జేయునదో, సర్వాకారం=

సర్వాకారమైనదో, సర్వగం=అంతటను వ్యాపించినదో, సర్వశూన్యమ్=సర్వముతోడను శూన్యమైనదో, నిత్యం=నిత్యమో, శుద్ధం=పరిశుద్ధమో, నిష్కలం=నిరవయవమో, నిర్వికల్పం= వికల్పరహితమో, తత్=అ, అద్వైతం బ్రహ్మ=అద్వైతమైన బ్రహ్మగా, అహం=నేను, అస్మి=ఉన్నాను.

సర్వవస్తుప్రకాశం="తస్య భాసా సర్వ మిదం విభాతి" ఆ ఆత్మయొక్క కాంతిచేతనే ఇదంతయు భాసించుచున్నది అని శ్రుతి చెప్పిన విధమున సకలపదార్థములకు ప్రకాశము దేనివలన లభించుచున్నదో అట్టిది. సర్వాకారం="ఇదం సర్వం యదయమాత్మా" ఇదియంతయు ఆత్మయే అను శ్రుతి ననుసరించి, సర్వవస్తుస్వరూపమైనది. సర్వగం=అంతటను వ్యాపించియుండుటచే అపరిచ్ఛిన్నమైనది. సర్వశూన్యం=తనకంటె భిన్నమైనది ఏదియు లేకపోవుటచే సర్వశూన్యము.

యత్ప్రత్యస్తా (యస్మిన్నస్తా) శేషమాయా విశేషం
ప్రత్యగ్రూపం ప్రత్యయాగమ్యమానమ్,
సత్యజ్ఞానానన్త మానన్దరూపం
బ్రహ్మాద్వైతం యత్తదేవాహ మస్మి. 516

యత్=ఏది, ప్రత్యస్తాశేషమాయావిశేషం=తొలగింపబడిన సమస్తమాయావిశేషములు కలదో (రెండవ పాఠమునకు అర్థము-ప్రత్యగ్రూపం=ప్రత్యగాత్మ, యస్మిన్=దేనితో అభిన్నమగుటచే, అస్తాశేషమాయావిశేషం=తొలగిన సమస్త మాయావిశేషములు కలదో), ప్రత్యగ్రూపం=ప్రత్యగ్రూపమైనదో, ప్రత్యయాగమ్యమానం=అఖండాకారవృత్తికంటె భిన్నమగు వృత్తిచే గమ్యము కాదో, యత్=ఏది, సత్యజ్ఞానానన్తం=సత్యరూపము, జ్ఞానరూపము, అనంతము అయినదో, ఆనన్దరూపం=ఆనందరూపమో, అహం=నేను, తత్=అ, అద్వైతం బ్రహ్మైవ=అద్వైతమగు బ్రహ్మగానే, అస్మి=అయి ఉన్నాను.

శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర భారతీ శ్రీచరణులు ఇంతవరకు మాత్రమే వ్యాఖ్యను అనుగ్రహించినారు.

నిష్క్రియోఽస్మ్యవికారోఽస్మి
నిష్కలోఽస్మి నిరాకృతిః,
నిర్వికల్పోఽస్మి నిత్యోఽస్మి
నిరాలమ్బోఽస్మి నిర్ద్వయః. 517

నిష్క్రియః=క్రియలు లేనివాడనై, అస్మి=ఉన్నాను, అవికారః=వికారములు లేనివాడనై, అస్మి=ఉన్నాను, నిష్కలః=అవయవ రహితుడనై, అస్మి=ఉన్నాను, నిరాకృతిః=అకారము లేనివాడనై, అస్మి=ఉన్నాను, నిర్వికల్పః=వికల్పములు లేనివాడనై, అస్మి=ఉన్నాను, నిత్యం=నిత్యుడనుగా, అస్మి=ఉన్నాను, నిరాలమ్బః=ఆశ్రయరహితుడనుగ, అస్మి=ఉన్నాను, నిర్ద్వయః=ద్వితీయరహితుడుగ నున్నాను.

సర్వాత్మకోఽహం సర్వోఽహం సర్వాతీతోఽహ మద్వయః,
కేవలాఖణ్డబోధోఽహ మానన్దోఽహం నిరన్తరః. 518

అహం=నేను, సర్వాత్మకః=సర్వస్వరూపుడును, అహం=నేను, సర్వః=సర్వము, అహం=నేను, సర్వాతీతః=సర్వమును అతిక్రమించినవాడను, అద్వయః=ద్వితీయవస్తువు లేనివాడను, అహం=నేను, కేవలాఖణ్డబోధః=కేవలము అఖండమును అయిన జ్ఞానము, అహం=నేను, నిరన్తరః=అవిచ్ఛిన్నమైన, ఆనన్దః=ఆనందమును.

స్వారాజ్య సామ్రాజ్య విభూతిరేషా
భవత్కృపాశ్రీమహితప్రసాదాత్,
ప్రాప్తా మయా శ్రీగురవే మహాత్మనే
నమో నమస్తేఽస్తు పునర్నమోఽస్తు. 519

భవత్కృపాశ్రీ మహితప్రసాదాత్=నీ యొక్క దయాలక్ష్మితో ఒప్పుచున్న అనుగ్రహమువలన, మయా=నా చేత, ఏషా=ఈ, స్వారాజ్య

సామ్రాజ్యవిభూతిః=స్వర్గలోకరాజ్య సామ్రాజ్యముల వైభవము (బ్రహ్మ సాక్షాత్కారానందములో భూలోకసామ్రాజ్య-స్వర్గలోకాధిపత్యాదుల వలన కలుగు ఆనందము అంతర్గతము గాన ఇట్లు చెప్పబడినది)! ప్రాప్తా= పొందబడినది, మహాత్మనే=మహాత్ముడవైన, శ్రీ గురవే=శ్రీయుతుడవైన గురుడవైన, తే=నీకు, నమో నమః=నమస్కారము, నమస్కారము. పునః=మరల, నమః అస్తు=నమస్కార మగు గాక.

మహాస్వప్నే మాయాకృత జనిజరామృత్యుగహనే
భ్రమన్తం క్లిశ్యన్తం బహులతర తాపై రనుకలమ్,
అహంకారవ్యాఘ్ర వ్యథితమిమ మత్యన్తకృపయా
ప్రబోధ్య ప్రస్వాపాత్పర మవితవాన్ మామసి గురో. 520

హే గురో = ఓ గురూ, మాయాకృతజనిజరామృత్యుగహనే = మాయచే నేర్పడు జన్మజరామృత్యువులచేత భయంకరమైన (ప్రవేశించుటకు శక్యము కాని విధమున భయంకరమైన), మహాస్వప్నే=మహాస్వప్నము నందు, భ్రమన్తం=తిరుగాడుచున్నట్టియు, అనుకలం=ప్రతిక్షణమునందును బహులతర తాపైః=అత్యధికమగు తాపములచే, క్లిశ్యన్తం=బాధపడుచున్నట్టియు, అహంకారవ్యాఘ్రవ్యథితం = అహంకార మనెడు వ్యాఘ్రముచే బాధింపబడుచున్న, ఇమం మాం=ఈ నన్ను, అత్యన్తకృపయా=మిక్కిలి దయతో, ప్రస్వాపాత్=నిద్రనుండి, ప్రబోధ్య=లేపి, అవితవాన్ అసి= రక్షించినావు.

నమస్తస్మై సదేకస్మై నమశ్చిన్మహసే ముహుః,
యదేత ద్విశ్వరూపేణ రాజతే గురురాజ తే. 521

హే గురురాజ=ఓ గురుశ్రేష్ఠుడా! యత్=ఏ, ఏతత్=ఈ తేజస్సు విశ్వరూపేణ=ప్రపంచరూపమున, రాజతే=భాసించుచున్నదో, తస్మై=అట్టి, సదేకస్మై=ఏకసద్రూపమైన, తే=నీకు, నమః=నమస్కారము, చిన్మహసే = చిద్రూపతేజోమూర్తియైన, నీకు, ముహుః = మాటిమాటికిని, నమః=నమస్కారము.

## ఉపదేశముయొక్క ఉపసంహారము

ఇతి నత మవలోక్య శిష్యవర్యం
సమధిగతాత్మసుఖం ప్రబుద్ధతత్త్వమ్,
ప్రముదితహృదయః స దేశికేన్ద్రః
పున రిద మాహ వచః పరం మహాత్మా. 522

ఇతి=ఈ విధముగా, నతం=నమస్కరించుచున్నట్టియు, సమధిగతాత్మసుఖం=పొందబడిన ఆత్మానందముకలిగినట్టియు, ప్రబుద్ధతత్త్వం=తెలియబడిన తత్త్వముగల, శిష్యవర్యం=శిష్యశ్రేష్ఠుని, అవలోక్య=చూచి, సః=ఆ, మహాత్మా=మహాత్ముడైన, దేశికేన్ద్రః=గురూత్తముడు, ప్రముదితహృదయః=సంతసించిన హృదయముకలవాడై, పునః=తిరిగి, ఇదం=ఈ, పరం=గొప్పదైన, వచః=వాక్యమును, ఆహ=పలికెను.

బ్రహ్మప్రత్యయసన్తతి ర్జగదతో బ్రహ్మైవ సత్సర్వతః
పశ్యాధ్యాత్మదృశా ప్రశాన్తమనసా సర్వాస్వవస్థాస్వపి,
రూపాదన్యదవేక్షితుం కిమభితశ్చక్షుష్మతాం విద్యతే
తద్వద్బ్రహ్మవిదః సతః కిమపరం బుద్ధే ర్విహారాస్పదమ్. 523

జగత్ = జగత్తు, బ్రహ్మప్రత్యయసన్తతిః=బ్రహ్మరూపమైన జ్ఞానప్రవాహమే. అతః=ఆ కారణమువలన సర్వతః=నలువైపులను, సత్=సద్రూపమగు, బ్రహ్మైవ=బ్రహ్మనే, సర్వాసు అపి=సమస్తమైన, అవస్థాసు=అవస్థలయందు, అధ్యాత్మదృశా=అధ్యాత్మదృష్టితో, ప్రశాన్తమనసా=ప్రశాంతమైనమనస్సుతో, పశ్య=చూడుము. చక్షుష్మతాం=నేత్రములు కలవారికి, అభితః=చుట్టుప్రక్కల, అవేక్షితుం=చూచుటకు, రూపాత్=రూపముకంటె, అన్యత్=భిన్నమైనది, విద్యతే హి=ఉన్నదా? తద్వత్=అటులనే, బ్రహ్మవిదః=బ్రహ్మవేత్తయొక్క, బుద్ధేః=బుద్ధియొక్క, విహారాస్పదమ్=విహారమునకు స్థానము, సతః=సత్తైన బ్రహ్మకంటె, అపరం=భిన్నమైనది, కిమ్=ఏమి ఉన్నది?

కస్తాం పరానన్ద రసానుభూతి
ముత్సృజ్య శూన్యేషు రమేత విద్వాన్,
చన్ద్రే మహాహ్లాదిని దీప్యమానే
చిత్రేన్దుమాలోకయితుం క ఇచ్ఛేత్. 524

తాం = ఆ, పరానన్దరసానుభూతిం = సర్వోత్కృష్టమైన ఆనంద రసానుభూతిని, ఉత్సృజ్య = విడచి, కః = ఏ, విద్వాన్ = విద్వాంసుడు, శూన్యేషు = శూన్యవస్తువులయందు, రమేత = క్రీడించును? మహాహ్లాదిని = ఎక్కువగ అహ్లాదకరుడైన, చన్ద్రే = చంద్రుడు, దీప్యమానే = ప్రకాశించుచుండగా, చిత్రేన్దుం = చిత్తరువులోనున్నచంద్రుని, ఆలోకయితుం = చూచుటకు; కః = ఎవడు, ఇచ్ఛేత్ = ఇచ్ఛించును?

అసత్పదార్థానుభవే న కించి
న్నహ్యస్తి తృప్తి ర్న చ దుఃఖహానిః,
తదద్వయానన్ద రసానుభూత్యా
తృప్తః సుఖం తిష్ఠ సదాత్మనిష్ఠయా. 525

అసత్పదార్థానుభవే = అసత్తులగు పదార్థములను అనుభవించుటలో, కించిత్ = ప్రయోజనమేమియు, న = లేదు. తృప్తిః = తృప్తి, నాస్తి హి = లేదు కదా; దుఃఖహానిః చ = దుఃఖనాశముకూడ, న = లేదు. తత్ = ఆ కారణమువలన, అద్వయానన్దరసానుభూత్యా = అద్వితీయానందరసముయొక్క అనుభవముచే, తృప్తః = తృప్తిచెందినవాడవై, సదా = ఎల్లప్పుడును, ఆత్మనిష్ఠయా = ఆత్మనిష్ఠతో, సుఖం = సుఖముగా, తిష్ఠ = ఉండుము.

స్వమేవ సర్వతః పశ్యన్ మన్యమానః స్వమద్వయమ్,
స్వానన్దమనుభుఞ్జానః కాలం నయ మహామతే. 526

హే మహామతే = ఓ గొప్పబుద్ధిగలవాడా? సర్వతః = అంతటను, స్వమేవ = తననే (ఆత్మనే), పశ్యన్ = చూచుచు, స్వం = తనను, అద్వయం = ద్వితీయరహితునిగా, మన్యమానః = తలచుచు, స్వానన్దం = ఆత్మానందమును. అనుభుఞ్జానః = అనుభవించుచు, కాలం = కాలమును, నయ = గడపుము.

అఖణ్డబోధాత్మని నిర్వికల్పే
వికల్పనం వ్యోమ్ని పురః ప్రకల్పనమ్,
తదద్వయానన్దమయాత్మనా సదా
శాన్తిం పరామేత్య భజస్వ మౌనమ్. 527

అఖణ్డబోధాత్మని = అఖండజ్ఞానస్వరూపమును, నిర్వికల్పే = నిర్వికల్పమును అగు ఆత్మయందు, వికల్పనం=వివిధవస్తుకల్పనము, వ్యోమ్ని= ఆకాశమునందు, పురః = పట్టణము యొక్క, ప్రకల్పనం=కల్పనమే, తత్ = ఆ కారణమువలన, అద్వయానన్దమయాత్మనా = అద్వయానంద స్వరూపముతో, పరాం = గొప్పదైన, శాన్తిం = శాంతిని, ఏత్య=పొంది, సదా = ఎల్లప్పుడును, మౌనం = మౌనమును, భజస్వ=పొందుము.

తూష్ణీమవస్థా పరమోపశాన్తి
ర్బుద్ధే రసత్కల్ప వికల్పహేతోః,
బ్రహ్మాత్మనా బ్రహ్మవిదో మహాత్మనో
యత్రాద్వయానన్దసుఖం నిరన్తరమ్. 528

అసత్కల్పవికల్పహేతోః = అసత్తులైన వికల్పములకు కారణభూతమైన, బుద్ధేః =బుద్ధియొక్క, తూష్ణీం అవస్థా = నిష్క్రియముగ ఉండుటయే, పరమా = గొప్పదైన, ఉపశాన్తిః = శాంతి; యత్ర = ఏ తూష్ణీమవస్థయందు, బ్రహ్మవిదః = బ్రహ్మవేత్తయైన, మహాత్మనః = మహాత్మునకు, బ్రహ్మాత్మనా = బ్రహ్మరూపమున, నిరన్తరం = నిర్విఘ్నమైన, అద్వయానన్దసుఖం = అద్వయానందరూపమగు సుఖముఉండునో,

నాస్తి నిర్వాసనాన్మౌనాత్పరం సుఖకృదుత్తమమ్,
విజ్ఞాతాత్మస్వరూపస్య స్వానన్దరసపాయినః. 529

విజ్ఞాతాత్మస్వరూపస్య = తెలియబడిన ఆత్మస్వరూపముగల, స్వానన్దరసపాయినః = ఆత్మానందరసమును ఆస్వాదించుజ్ఞానికి, నిర్వాసనాత్ = వాసనాశూన్యమైన, మౌనాత్ = మౌనముకంటె, పరం = భిన్నమైన, సుఖకృత్ = సుఖమును కలిగించు, ఉత్తమం = ఉత్తమమైనది, నాస్తి = లేదు.

గచ్ఛంస్తిష్ఠన్నుపవిశన్ శయానో వాన్యథాపి వా,
యథేచ్ఛయా వసేద్విద్వానాత్మారామః సదా మునిః. 530

విద్వాన్ = ఆత్మవేత్తయు, సదా = ఎల్లప్పుడును, ఆత్మారామః = ఆత్మయందే క్రీడించు, మునిః = జ్ఞాని, గచ్ఛన్ = నడచుచునైనను, ఉపవిశన్ = కూర్చుండియైనను, శయానః వా = శయనించియైనను, అన్యథాపి వా = మరియొక విధముగానైనను, యథేచ్ఛయా = ఇచ్ఛానుసారముగా, వసేత్ = నివసించవచ్చును.

న దేశకాలాసన దిగ్యమాది
లక్ష్యాద్యపేక్షా ప్రతిబద్ధవృత్తేః,
సంసిద్ధ తత్త్వస్య మహాత్మనోఽస్తి
స్వవేదనే కా నియమాద్యవస్థా. 531

ప్రతిబద్ధవృత్తేః = నిగ్రహింపబడిన మనోవృత్తికలవాడును, సంసిద్ధతత్త్వస్య = సిద్ధమైన (అనగా తెలియబడిన) తత్త్వముగల, మహాత్మనః = మహాత్మునకు, దేశకాలాసనదిగ్యమాది లక్ష్యాద్యపేక్షా = దేశ-కాల-ఆసన-దిశల నియమము మొదలగువానియొక్కయు, లక్ష్యాదులయొక్కయు అపేక్ష. (అనగా ఈ దేశమున, ఈ కాలమున, ఈ ఆసనమున, ఈ దిక్కునందు, ఈ లక్ష్యమును గూర్చి ధ్యానింపవలెను ఇత్యాది నియమముల అపేక్ష), నాస్తి = లేదు, స్వవేదనే = తన్నుగూర్చి తాను తెలిసికొనునపుడు, నియమాద్యవస్థా = నియమాదుల అవస్థ, కా = ఏమి?

ఘటోఽయమితి విజ్ఞాతుం నియమః కో న్వపేక్షతే,
వినా ప్రమాణసుష్ఠుత్వం యస్మిన్సతి పదార్థధీః. 532

యస్మిన్ సతి = ఏది ఉన్నప్పుడు, పదార్థధీః = పదార్థముల జ్ఞానము కలుగునో, (అట్టి), ప్రమాణసుష్ఠుత్వం వినా = చక్షురాది ప్రమాణముల సౌష్ఠవము తప్ప, అయం ఘటః ఇతి విజ్ఞాతుం = ఇది ఘటము అని తెలిసికొనుటకు, కః ను = ఏ, నియమః = నియమము, అపేక్ష్యతే = అపేక్షింపబడును?

అయమాత్మా నిత్యసిద్ధః ప్రమాణే సతి భాసతే,
న దేశం నాపి వా కాలం న శుద్ధిం వా ప్యపేక్షతే. 533

నిత్యసిద్ధః = నిత్యసిద్ధమైన, అయం = ఈ, ఆత్మా = ఆత్మ, ప్రమాణే సతి=ప్రమాణము ఉన్నప్పుడు, (అనగా ఆత్మను తెలిసికొనుటకు తగిన శాస్త్రగురూపదేశాది ప్రమాణము లభింపగనే) భాసతే = భాసించును, సాక్షాత్కరింపబడును, దేశం = దేశమును, న అపేక్షతే = అపేక్షింపదు. కాలం అపి వా= కాలమునుగూడ, న = అపేక్షింపదు. శుద్ధిం వాపి = బాహ్య శౌచాదికమునైనను, లేదా దేశాది శుద్ధినైనను, న = అపేక్షింపదు.

దేవదత్తోఽహ మిత్యేతద్విజ్ఞానం నిరపేక్షకమ్,
తద్వద్బ్రహ్మవిదోఽప్యస్య బ్రహ్మాహమితి వేదనమ్. 534

అహం = నేను, దేవదత్తః = దేవదత్తుడను, ఇతి = అని, ఏతత్ = ఈ, విజ్ఞానం = జ్ఞానము, నిరపేక్షకం = బాహ్యదేశకాలాద్యపేక్ష లేనిది, అస్య = ఈ, బ్రహ్మవిదః = బ్రహ్మవేత్తయొక్క, బ్రహ్మాహం ఇతి = నేనే బ్రహ్మను అనెడు, వేదన మపి = జ్ఞానముకూడ, తద్వత్ = అటులనే బాహ్యదేశకాలాద్యపేక్ష లేనిది.

భానునేవ జగత్సర్వం భాసతే యస్య తేజసా,
అనాత్మక మసత్తుచ్ఛం కిం ను తస్యావభాసకమ్. 535

భానునేవ = సూర్యునిచేతవలె, యస్య = ఏ బ్రహ్మయొక్క, తేజసా = తేజస్సుచేత, అనాత్మకం = వాస్తవస్వరూప మేదియు లేనిదియు, అసత్ = అసత్తును, తుచ్ఛం =(కావుననే) తుచ్ఛమును అయిన, సర్వం= సమస్తమైన, జగత్ = జగత్తు, భాసతే = ప్రకాశించుచున్నదో, తస్య = అట్టి బ్రహ్మకు (ను), అవభాసకం = ప్రకాశింపజేయునది, కిం ను = ఏది?

వేదశాస్త్రపురాణాని భూతాని సకలాన్యపి,
యేనార్థవన్తి తం కిం ను విజ్ఞాతారం ప్రకాశయేత్. 536

వేదశాస్త్రపురాణాని = వేదశాస్త్రపురాణములును, సకలాని = సమస్తమైన, భూతాని చ = భూతములును, యేన = ఏ ఆత్మచే, అర్థవన్తి = ప్రయోజనము కలవో, (అనగా వేదశాస్త్రాదులకు ఏ ఆత్మ పరమ ప్రయోజనమో), తం = అట్టి, విజ్ఞాతారం = విజ్ఞాతను, కిం ను = ఏది, ప్రకాశయేత్ = ప్రకాశింపజేయును ?

ఏష స్వయంజ్యోతి రనన్తశక్తి
రాత్మాఽప్రమేయః సకలానుభూతిః,
యమేవ విజ్ఞాయ విముక్తబన్ధః
జయత్యయం బ్రహ్మవిదుత్తమోత్తమః. 537

యమ్ ఏవ = ఏ ఆత్మనే, విజ్ఞాయ = సాక్షాత్కరించుకొని, అయం = ఈ, బ్రహ్మవిదుత్తమోత్తమః = బ్రహ్మవేత్తలలో ఉత్తములలో నుత్తముడు, విముక్తబన్ధః = విడువబడిన బంధములుకలవాడై, జయతి = సర్వోత్కర్షగా ఉంటున్నాడో, ఏషః = అట్టి ఈ, ఆత్మా = ఆత్మ, స్వయంజ్యోతిః = స్వప్రకాశస్వరూపము, అనంతశక్తిః = అనంతశక్తులు కలది; అప్రమేయః = బుద్ధికి గోచరించినది, సకలానుభూతిః = అందరి యొక్క అనుభవ స్వరూపమైనది.

న ఖిద్యతే నో విషయైః ప్రమోదతే
న సజ్జతే నాపి విరజ్యతే చ,
స్వస్మిన్ సదా క్రీడతి నన్దతి స్వయం
నిరన్తరానన్దరసేన తృప్తః. 538

నిరన్తరానన్దరసేన = నిరంతరమైన ఆనందరసముచే, తృప్తః = తృప్తుడైన జ్ఞాని, న ఖిద్యతే = ఖేదము చెందడు. విషయైః = విషయములచే, నో ప్రమోదతే = ఆనందించడు. న సజ్జతే = విషయములయందు ఆసక్తుడు కాడు. న విరజ్యతేఽపి చ = వైరాగ్యమును కూడ పొందడు, అనగా విషయములను ద్వేషించడు. సదా = ఎల్లప్పుడును, స్వస్మిన్ = తనయందే, క్రీడతి = క్రీడించును. స్వయం = తానే, నన్దతి = ఆనందించును.

క్షుధాం దేహవ్యథాం త్యక్త్వా బాలః క్రీడతి వస్తుని,
తథైవ విద్వాన్ రమతే నిర్మమో నిరహం సుఖీ. 539

బాలః = బాలుడు, క్షుధాం = ఆకలిని, దేహవ్యథామ్ = దేహము యొక్క వ్యథను, త్యక్త్వా = విడచి, వస్తుని=ఆటవస్తువునందు (తో) క్రీడతి = క్రీడించును. విద్వాన్ = జ్ఞాని, తథైవ = అట్లే, నిర్మమః = మమకారము లేనివాడై, నిరహం=అహంకారము లేనివాడై, సుఖీ=సుఖ వంతుడై, రమతే=ఆనందించుచుండును.

చిన్తాశూన్య మదైన్యభైక్ష మశనం పానం సరిద్వారిషు
స్వాతన్త్ర్యేణ నిరఙ్కుశా స్థితి రభీర్నిద్రా శ్మశానే వనే,
వస్త్రం క్షాళన శోషణాదిరహితం దిగ్వాస్తు శయ్యా మహీ
సఞ్చారో నిగమాన్తవీథిషు విదాం క్రీడా పరే బ్రహ్మణి. 540

విదాం = జ్ఞానులకు, చిన్తాశూన్యం = చింతలేని, అదైన్యభైక్షం= దైన్యము లేని భిక్షన్నము, అశనం = భోజనము. సరిద్వారిషు = నదీ జలములందు, పానం = పానము; స్వాతంత్ర్యేణ = స్వాతంత్ర్యముతో, నిరఙ్కుశా=ఎట్టి నిర్బంధములును లేని, అభీః = భయము లేని, స్థితిః = స్థితి, శ్మశానే=శ్మశానమునందుగాని, వనే = వనమునందుగాని, నిద్రా = నిద్ర, దిక్ =దిక్కు, క్షాలనశోషణాదిరహితం = ఉతుకుట, ఆరవేసి కొనుట మొదలగునవి లేని, వస్త్రం = వస్త్రము. మహీ=భూమి, వాస్తు= నివాసస్థానము, శయ్యా=శయ్య; నిగమాన్తవీథిషు=ఉపనిషద్వీథులయందు, సంచారః = సంచారము, పరే బ్రహ్మణి=పరబ్రహ్మయందు, క్రీడా=క్రీడ.

విమానమాలమ్బ్య శరీరమేతత్
భునక్త్యశేషాన్ విషయానుపస్థితాన్,
పరేచ్ఛయా బాలవదాత్మవేత్తా
యోఽవ్యక్తలిఙ్గోఽననుషక్తబాహ్యః. 541

యః=ఎవడు, అవ్యక్తలిఙ్గః=అస్పష్టమైన (కనబడని) వర్ణాశ్రమాది లింగములు కలవాడో, అననుషక్తబాహ్యః=సంగములేని బాహ్యవస్తువుల

కలవాడో (అనగా బాహ్యవస్తువులతో సంబంధము లేనివాడో) (సః=అట్టి), ఆత్మవేత్తా=ఆత్మజ్ఞాని, ఏతత్ = ఈ, శరీరం = శరీరమనెడు, విమానం = విమానమును, ఆలమ్బ్య=ఆశ్రయించి, బాలవత్ = బాలుడువలె, పరేచ్ఛయా=పరులయొక్క ఇచ్ఛచేత, ఉపస్థితాన్=తమంతగా వచ్చిన, అశేషాన్= సమస్తమైన, విషయాన్=విషయములను, భునక్తి=అనుభవించుచున్నాడు.

దిగమ్బరో వాపి చ సామ్బరో వా
త్వగమ్బరో వాపి చిదమ్బరస్థః,
ఉన్మత్తవద్వాపి చ బాలవద్వా
పిశాచవద్వాపి చరత్యవన్యామ్. 542

చిదమ్బరస్థః=చిద్రూపాత్మయనెడు అంబరములోనున్న (అంబరమును ధరించిన) జ్ఞాని, దిగంబరో వాపి=దిగంబరుడైనను సామ్బరశ్చ వా= వస్త్రధారియైనను, త్వగమ్బరో వాపి= నారచీరలను ధరించినవాడైనను, (అయి), ఉన్మత్తవద్వాపి = ఉన్మత్తుడువలెను, బాలవద్వా = బాలుడువలెను, పిశాచవద్వాపి=లేదా పిశాచమువలెను, అవన్యాం=భూమియందు, చరతి= సంచరించును.

కామాన్నీ కామరూపీ సంశ్చర త్యేకచరో మునిః,
స్వాత్మనైవ సదా తుష్టః స్వయం సర్వాత్మనా స్థితః. 543

మునిః=జ్ఞాని, కామాన్నీ=ఇష్టమువచ్చిన ఆహారమును భుజించుచు, కామరూపీ సన్ = ఇష్టమువచ్చినరూపము (వేషాదికము) కలవాడై, సదా= ఎల్లప్పుడును, స్వాత్మనైవ = స్వాత్మచేతనే, తుష్టః = సంతసించినవాడై, స్వయం=తాను, సర్వాత్మనా = సర్వభూతస్వరూపముతో, స్థితః = ఉన్నవాడై, ఏకచరః చరతి = ఒంటరిగా తిరుగుచుండును.

క్వచిన్మూఢో విద్వాన్ క్వచిదపి మహారాజవిభవః
క్వచిద్భ్రాన్తః సౌమ్యః క్వచిదజగరాచారకలితః,
క్వచిత్పాత్రీభూతః క్వచిదవమతః క్వాప్యవిదిత
శ్చరత్యేవం ప్రాజ్ఞః సతత పరమానన్దసుఖితః. 544

సతతపరమానన్దసుఖితః = అవిచ్ఛిన్నమైన పరమానందముచే సుఖము ననుభవించుచున్న, ప్రాజ్ఞః = ఆత్మసాక్షాత్కారమును పొందిన జ్ఞాని, క్వచిత్ = కొన్నిచోట్ల, మూఢః = మూఢు డగుచు, క్వచిదపి = మరి కొన్నిచోట్ల, విద్వాన్ = పండితు డగుచు, క్వచిత్ = కొన్నిచోట్ల, మహారాజ విభవః = మహారాజవైభవము కలవాడై, భ్రాన్తః = సంచారముచేయుచు, క్వచిత్ = కొన్నిచోట్ల, సౌమ్యః = సౌమ్యుడై, అజగరాచారకలితః = కొండచిలువయొక్క ప్రవృత్తిని అవలంబించిన వాడగుచు (ఒకచోటనుండి కదలకుండ నోటికి అందిన ఆహారమును తినుచు), క్వచిత్ = కొన్ని చోట్ల, పాత్రీభూతః = సత్పాత్రయై గౌరవింపబడుచు, క్వచిత్ = కొన్ని చోట్ల, అవమతః = అవమానింపబడుచు, క్వాపి = ఎచ్చటనుకూడ, అవి దితః = ఎవరిచేత జ్ఞానిగ గుర్తింపబడనివా డగుచు, ఏవం = ఈ విధముగ, చరతి = సంచరించుచుండును.

నిర్ధనోఽపి సదా తుష్టోఽప్యసహాయో మహాబలః,
నిత్యతృప్తోఽప్యభుఞ్జానోఽప్యసమః సమదర్శనః. 545

(జ్ఞాని) నిర్ధనోఽపి = ధనములేని వాడైనను, సదా = ఎల్లప్పుడును, తుష్టః = సంతోషించుచున్నవాడు, అసహాయోఽపి = సహాయములేనివాడైనను, మహాబలః = మహాబలవంతుడు, అభుఞ్జానః అపి = భుజించనివాడైనను, నిత్యతృప్తః = ఎల్లప్పుడును తృప్తుడు, అసమః అపి = అసముడైనను (సాటిలేనివాడైనను), సమదర్శనః = సమదృష్టి కలవాడు.

అపి కుర్వన్నకుర్వాణశ్చాభోక్తా ఫలభోగ్యపి,
శరీర్య ప్యశరీర్యేష పరిచ్ఛిన్నోఽపి సర్వగః. 546

కుర్వన్నపి ఏషః = ఈ జ్ఞాని, (ఇతరుల దృష్టిలో) వివిధకర్మలను చేయుచున్నను, అకుర్వాణః = చేయనివాడు (వాస్తవమున కర్తృత్వము లేనివాడు), ఫలభోగ్యపి = కర్మఫలమును అనుభవించుచున్నను, అభోక్తా = భోక్త కానివాడు, శరీర్యపి = శరీరముకలవాడైనను, అశరీరీ = శరీరము లేని వాడు. పరిచ్ఛిన్నః అపి = దేశకాలాదులచే పరిచ్ఛిన్నుడైనను, సర్వగః = అంతటను వ్యాపించి ఉన్నవాడు.

అశరీరం సదా సన్తమిమం బ్రహ్మవిదం క్వచిత్,
ప్రియాప్రియే న స్పృశత స్తథైవ చ శుభాశుభే. 547

అశరీరం=శరీరరహితుడును, సదా=ఎల్లప్పుడును, సన్తం=సద్రూపుడును అగు, ఇమం=ఈ, బ్రహ్మవిదం=బ్రహ్మవేత్తను, క్వచిత్=ఎచ్చటను, ప్రియాప్రియే=ప్రియము, అప్రియము, తథైవ=మరియు, శుభాశుభే=శుభము, అశుభమును, న స్పృశతః=స్పృశింపవు.

స్థూలాది సమ్బన్ధవతోఽభిమానినః
సుఖం చ దుఃఖం చ శుభాశుభే చ,
విధ్వస్తబన్ధస్య సదాత్మనో మునేః
కుతః శుభం వా ప్యశుభం ఫలం వా. 548

సుఖం చ=సుఖము, దుఃఖం చ=దుఃఖము, శుభాశుభే చ=శుభాశుభములును, స్థూలాది సంబన్ధవతః=స్థూలదేహాదులతో సంబంధముగల, అభిమానినః=అభిమానవంతుడైన అజ్ఞానికి ఉండును, విధ్వస్తబన్ధస్య=తొలగినబంధములుకలవాడును. సదాత్మనః=సద్రూపుడును అగు, మునేః=జ్ఞానికి, శుభం వాపి=శుభము గాని, ఫలం వా=ఫలముగాని, అశుభం వాపి=అశుభఫలము గాని, కుతః=ఎట్లు? (ఉండును)

తమసా గ్రస్తవద్భానా దగ్రస్తోఽపి రవి ర్జనైః,
గ్రస్త ఇత్యుచ్యతే భ్రాన్త్యా హ్యజ్ఞాత్వా వస్తులక్షణమ్. 549

రవిః=సూర్యుడు, తమసా=రాహువుచేత, అగ్రస్తోఽపి=మ్రింగబడకపోయినను, గ్రస్తవత్=మ్రింగబడినవానివలె, భానాత్=కనబడుటవలన, భ్రాన్త్యా=భ్రాంతిచేత, వస్తులక్షణం=వస్తుస్వరూపమును. అజ్ఞాత్వా=తెలియక, జనైః=జనులచే, గ్రస్తః ఇతి=మ్రింగబడినాడు అని, ఉచ్యతే హి=చెప్పబడుచున్నాడు కదా!

తద్వద్దేహాదిబన్ధేభ్యో విముక్తం బ్రహ్మవిత్తమమ్,
పశ్యన్తి దేహివన్మూఢాః శరీరాభాసదర్శనాత్. 550

తద్వత్ = అటులనే, దేహాదిబన్ధేభ్యః = దేహాదిబంధములనుండి, విముక్తం = ముక్తుడైన, బ్రహ్మవిత్తమం = బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుని, మూఢాః = మూఢులు, శరీరాభాసదర్శనాత్ = శరీరాభాసము కనబడుటవలన, దేహివత్ = దేహము కలవానివలె, పశ్యన్తి = చూచుచున్నారు.

అహిర్నిర్ల్వయినీవాయం ముక్తదేహస్తు తిష్ఠతి,
ఇతస్తతశ్చాల్యమానో యత్కించిత్ ప్రాణవాయునా. 551

అయం = ఈ జ్ఞాని, నిర్ల్వయనీ = కూసము విడిచిన, అహిరివ = సర్పమువలె, ముక్తదేహః = విడువబడిన దేహము కలవాడై, ప్రాణవాయునా = ప్రాణవాయువుచే, యత్కించిత్ = ఏ కొంచెమో, ఇతస్తతః = ఇటునటు చాల్యమానః = చలింపజేయబడుచు, తిష్ఠతి = ఉండును.

స్రోతసా నీయతే దారు యథా నిమ్నోన్నతస్థలమ్,
దైవేన నీయతే దేహో యథాకాలోపభుక్తిషు. 552

దారు = కట్ట, యథా = ఏ విధముగ, స్రోతసా = జలప్రవాహముచేత, నిమ్నోన్నతస్థలమ్ = పల్లపు ప్రదేశములకును, ఎత్తు ప్రదేశములకును, నీయతే = తీసికొని వెళ్లబడునో, (ఆ విధముగనే), దేహః = (జ్ఞానియొక్క) దేహము, యథాకాలోపభుక్తిషు = ఆ యా కాలములకు సంబంధించిన భోగములయందు (భోగములనుగూర్చి) దైవేన = దైవముచే, నీయతే = తీసికొని వెళ్లబడును.

ప్రారబ్ధకర్మ పరికల్పితవాసనాభిః
సంసారివ చ్చరతి భుక్తిషు ముక్తదేహః,
సిద్ధః స్వయం వసతి సాక్షివదత్ర తూష్ణీం
చక్రస్య మూలమివ కల్పవికల్పశూన్యః. 553

ముక్తదేహః = ముక్తునియొక్క దేహము, ప్రారబ్ధకర్మపరికల్పితవాసనాభిః = ప్రారబ్ధకర్మలచే కల్పితములైన (ఏర్పడిన) వాసనలచే, భుక్తిషు = భోగముల విషయమున, సంసారివత్ = సంసారియొక్క దేహము

వలె, చరతి=సంచరించుచున్నది. సిద్ధః=ముక్తినిపొందినవాడు, చక్రస్య=(తిరుగుచున్న) చక్రముయొక్క మూలమివ=(తాను మాత్రము తిరుగకుండగ స్థిరముగనున్న) ఇరుసువలె, స్వయం=తాను, కల్పవికల్పశూన్యః=కల్పనలు వికల్పములు లేనివాడై, అత్ర=ఈ శరీరమున, తూష్ణీం=మౌనముగ (క్రియాశూన్యుడై), వసతి=నివసించును.

నైవేన్ద్రియాణి విషయేషు నియుఙ్క్త ఏషః
నైవాపయుఙ్క్త ఉపదర్శన లక్షణస్థః,
నైవక్రియా ఫలమపీష దపేక్షతే సః
స్వానన్దపాన రసపాన సుమత్త చిత్తః. 554

ఉపదర్శనలక్షణస్థః=దర్శనోపకారియగు దీపాదులవంటి లక్షణము గల (శంకరభగవత్పాదుల కాలమున ఉన్నదో లేదో తెలియదు కాని 'ఉపదర్శన' అనుదానికి ఆధునికదృష్టితో 'కండ్లజోడు' అని అర్థము కూడ చెప్పవచ్చును), ఏషః=ఈ ఆత్మ, ఇన్ద్రియాణి=ఇంద్రియములను, విషయేషు=భోగ్యవిషయములయందు, నైవనియుఙ్క్తే=నియమించడు (ప్రవర్తింపజేయడు), నైవ అపయుఙ్క్తే=(వాటినుండి) మరలించడు. స్వానన్దసాన్ద్రరసపానసుమత్త చిత్తః=స్వానందమనెడు చిక్కనిరసము యొక్క పానముచేత మదించిన చిత్తముకలవాడై, ఈషత్=కొంచెమైనను, క్రియాఫలం=కర్మఫలమును, నైవాపేక్షతే=అపేక్షింపడు.

లక్ష్యాలక్ష్యగతిం త్యక్త్వా యస్తిష్ఠేత్కేవలాత్మనా,
శివ ఏవ స్వయం సాక్షా దయం బ్రహ్మవిదుత్తమః. 555

యః=ఎవడు, లక్ష్యాలక్ష్యగతిం=కంటికి కనబడు ఇహలోకమునకును, కనబడని పరలోకమునకును సంబంధించిన గమనమును, త్యక్త్వా=విడచి, కేవలాత్మనా=అద్వితీయాత్మ స్వరూపముతో, తిష్ఠేత్=ఉండునో, అయం=ఈ, బ్రహ్మవిదుత్తమః=బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడు, స్వయం=తాను, సాక్షాత్=సాక్షాత్తు, శివః ఏవ=శివుడే.

జీవన్నేవ సదా ముక్తః కృతార్థో బ్రహ్మవిత్తమః,
ఉపాధినాశాద్ బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి నిర్ద్వయమ్. 556

జీవన్నేవ=జీవించియుండగనే, సదా=ఎల్లప్పుడును, ముక్తః= ముక్తుడైన, కృతార్థః=కృతార్థుడైన, బ్రహ్మవిత్తమః=బ్రహ్మవేత్త, బ్రహ్మైవ సన్=బ్రహ్మగానే ఉన్నవాడై, ఉపాధినాశాత్=ఉపాధియొక్క నాశమువలన, నిర్ద్వయం=ద్వితీయరహితమైన, బ్రహ్మ=బ్రహ్మను, అప్యేతి=చేరును.

శైలూషో వేష సద్భావాభావయోశ్చ యథా పుమాన్,
తథైవ బ్రహ్మవిచ్ఛ్రేష్ఠః సదా బ్రహ్మైవ నాపరః. 557

శైలూషః=నటుడు, వేషసద్భావాభావయోః చ = స్త్రీవేషమున్నను కాకున్నను, యథా=ఏ విధముగ, పుమాన్=పురుషుడో, తథైవ=అట్లే బ్రహ్మవిచ్ఛ్రేష్ఠః=బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడైనజ్ఞాని, సదా=ఎల్లప్పుడును, బ్రహ్మైవ=బ్రహ్మయే. అపరః=బ్రహ్మభిన్నుడు, న=కాదు.

యత్ర క్వాపి విశీర్ణం పర్ణమివ తరోర్వపుః పతనాత్,
బ్రహ్మీభూతస్య యతేః ప్రాగేవ హి తచ్చిదగ్నినా దగ్ధమ్. 558

యత్ర క్వాపి=ఎచటనో ఒకచోట, విశీర్ణం=రాలిపోయిన, తరోః= వృక్షముయొక్క, పర్ణమివ=ఆకువలె, బ్రహ్మీభూతస్య=బ్రహ్మీభావమును పొందిన, యతేః=జ్ఞానియొక్క, తత్=ఆ, వపుః=శరీరము, పతనాత్=పడిపోవుటకంటె, (మరణించుటకంటె), ప్రాగేవ=ముందుగనే, చిదగ్నినా=జ్ఞానాగ్నిచే, దగ్ధం హి=కాల్చబడినది కదా!

సదాత్మని బ్రహ్మణి తిష్ఠతో మునేః
పూర్ణాద్వయానన్దమయాత్మనా సదా,
న దేశకాలాద్యుచిత ప్రతీక్షా
త్వఙ్మాంస విట్పిణ్డ విసర్జనాయ. 559

సదా=ఎల్లప్పుడును, పూర్ణాద్వయానన్దమయాత్మనా=పూర్ణము, అద్వితీయమునగు ఆనందస్వరూపముతో, సదాత్మని=సద్రూపమగు, బ్రహ్మణి=బ్రహ్మయందు, తిష్ఠతః=ఉంటూన్న, మునేః=మునికి,

త్వఙ్మాంసవిట్పిండ విసర్జనాయ = త్వఙ్మాంసమయమైన శరీరమును విడచుటకు, దేశకాలాద్యుచితప్రతీక్షా = దేశకాలాదులగు ఉచితవిషయముల నిరీక్షణము, న = ఉండదు.

దేహస్య మోక్షో నో మోక్షో న దణ్డస్య కమణ్డలోః,
అవిద్యాహృదయగ్రన్థిమోక్షో మోక్షో యత స్తతః. 560

యతః = ఏ కారణమువలన, అవిద్యాహృదయగ్రంథిమోక్షః = అవిద్యారూపమైన హృదయగ్రంథియొక్క మోక్షమే, మోక్షః = మోక్షమో, తతః = ఆ కారణమువలన, దేహస్య = దేహముయొక్క, మోక్షః = మోక్షము మోక్షః నో = మోక్షము కాదు, దండస్య = దండముయొక్కయు, కమణ్డలోః = కమండలముయొక్కయు మోక్షముకూడ, న = మోక్షము కాదు.

కుల్యాయా మథ నద్యాం వా శివక్షేత్రేఽపి చత్వరే,
పర్ణం పతతి చేత్తేన తరోః కింను శుభాశుభమ్. 561

కుల్యాయాం = కాలవలో కాని, అథ = లేక, నద్యాం వా = నదిలో కాని, శివక్షేత్రేఽపి = శివక్షేత్రమునందు గాని, చత్వరే = చతుష్పథమునందు గాని, పర్ణం = ఆకు, పతతి చేత్ = రాలినచో, తేన = దానిచేత, తరోః = వృక్షమునకు, శుభాశుభమ్ = శుభముకాని అశుభముకాని, కింను = ఏమి యుండును?

పత్రస్య పుష్పస్య ఫలస్య నాశవ
ద్దేహేన్ద్రియ ప్రాణధియాం వినాశః,
నైవాత్మనః స్వస్య సదాత్మకస్యా
నన్దాకృతే ర్వృక్షవదాస్త ఏషః. 562

వినాశః = నాశనము, పత్రస్య = ఆకుయొక్కయు, పుష్పస్య = పుష్పముయొక్కయు, ఫలస్య = ఫలముయొక్కయు, నాశవత్ = నాశము వలె, దేహేంద్రియప్రాణధియాం = దేహమునకు, ఇంద్రియములకు,

ప్రాణములకు, బుద్ధికి మాత్రమే కలుగునది, సదాత్మకస్య=సద్రూపమును, ఆనన్దాకృతేః=ఆనందస్వరూపమును అగు, స్వస్య=తనయొక్క, ఆత్మనః=ఆత్మకు, ఏషః=ఈ వినాశము, వృక్షవత్=వృక్షమునకువలె, న ఆస్తే=లేదు.

ప్రజ్ఞానఘన ఇత్యాత్మలక్షణం సత్యసూచకమ్,
అనూద్యౌపాధికస్యైవ కథయన్తి వినాశనమ్. 563

ప్రజ్ఞానఘనః ఇతి=ఆత్మపూర్తిగ జ్ఞానస్వరూపమైనది అని, సత్యసూచకమ్=సత్యత్వమును సూచించు, ఆత్మలక్షణం=ఆత్మయొక్క లక్షణమును, అనూద్య=అనువదించి, ఔపాధికస్య ఏవ=ఉపాధితో సంబంధించినదానికే, వినాశనం=నాశమును, కథయన్తి=చెప్పుచున్నారు.

అవినాశీ వా అరేఽయమాత్మేతి శ్రుతిరాత్మనః,
ప్రబ్రవీత్యవినాశిత్వం వినశ్యత్సు వికారిషు. 564

'అవినాశీ వా అరే అయమాత్మా'=ఈ ఆత్మ వినాశరహితమైనది, ఇతి శ్రుతిః=అను శ్రుతి, వికారిషు=వికారులగు దేహేంద్రియాదులు, వినశ్యత్సు=నశించుచుండగా (నశించుచున్నను), ఆత్మనః=ఆత్మయొక్క, అవినాశిత్వం=వినాశరాహిత్యమును, ప్రబ్రవీతి=చెప్పుచున్నది.

పాషాణవృక్ష తృణధాన్యకటామ్బరాద్యా
దగ్ధా భవన్తి హి మృదేవ యథా తథైవ,
దేహేన్ద్రియాసుమన ఆది సమస్తదృశ్యం
జ్ఞానాగ్నిదగ్ధ ముపయాతి పరాత్మభావమ్. 565

పాషాణవృక్షతృణధాన్య కటామ్బరాద్యాః=రాళ్లు, వృక్షములు, గడ్డి, ధాన్యము, చాప, వస్త్రము మొదలగునవి, దగ్ధాః=కాల్చబడినవై, యథా=ఏ విధముగా, మృదేవ=మట్టిగానే, భవన్తి=అగునో, తథైవ=అట్లే, దేహేన్ద్రియాసుమనఆది=దేహములు, ఇంద్రియములు, ప్రాణ

ములు, మనస్సు మొదలైన, సమస్తదృశ్యం=సమస్తమైనదృశ్యపదార్థము, జ్ఞానాగ్నిదగ్ధం = జ్ఞానాగ్నిచే దగ్ధమైనదై, పరాత్మభావం = పరమాత్మ స్వరూపత్వమును, ఉపయాతి = పొందును.

విలక్షణం యథా ధ్వాన్తం లీయతే భానుతేజసి,
తథైవ సకలం దృశ్యం బ్రహ్మణి ప్రవిలీయతే. 566

విలక్షణం=(తేజస్సుకంటె) భిన్నమైనస్వభావముగల, ధ్వాన్తం= అన్ధకారము, యథా = ఏ విధముగా, భానుతేజసి = సూర్యునియొక్క తేజస్సునందు, లీయతే = లీనమగునో, తథైవ = అటులనే, సకలం = సమస్తమైన, దృశ్యం = దృశ్యము, బ్రహ్మణి = బ్రహ్మయందు, ప్రవిలీయతే = లీనమగును.

ఘటే నష్టే యథా వ్యోమ వ్యోమైవ భవతి స్ఫుటమ్,
తథైవోపాధివిలయే బ్రహ్మైవ బ్రహ్మవిత్స్వయమ్. 567

ఘటే = ఘటము, నష్టే = నశించినదగుచుండగా, వ్యోమ = ఘటాకాశము, స్ఫుటమ్ = స్ఫుటముగా, వ్యోమైవ = ఆకాశముగానే, భవతి = అగునో, తథైవ = అటులనే, ఉపాధివిలయే = ఉపాధి లీనమైన దగుచుండగా, బ్రహ్మవిత్ = బ్రహ్మవేత్త, స్వయం = తాను, బ్రహ్మైవ= బ్రహ్మగానే, భవతి = అగును.

క్షీరం క్షీరే యథా క్షిప్తం తైలం తైలే జలం జలే,
సంయుక్తమేకతాం యాతి తథాత్మన్యాత్మవిన్మునిః. 568

క్షీరే = క్షీరమునందు, క్షిప్తం = ఉంచబడిన, క్షీరం = క్షీరము, తైలే = తైలమునందు ఉంచబడిన, తైలం = తైలము, జలే = జలమునందు ఉంచబడిన, జలం = జలము, యథా = ఏ విధముగా, సంయుక్తం= కలసిపోయినదై, ఏకతాం = ఏకత్వమును, యాతి = పొందునో, ఆత్మవిత్ = ఆత్మవేత్తయైన, మునిః = జ్ఞాని, తథా = ఆ విధముగా, ఆత్మని = ఆత్మయందు, (ఏకత్వమును పొందును).

ఏవం విదేహకైవల్యం సన్మాత్రత్వ మఖణ్డితమ్,
బ్రహ్మభావం ప్రపద్యైష యతిర్నావర్తతే పునః. 569

ఏవం=ఈ విధముగ, ఏషః = ఈ, యతిః = జ్ఞాని, అఖణ్డితం = అఖండితమైన, సన్మాత్రత్వం = కేవలసద్రూపముననుండుట అనెడు స్వరూపము గల, విదేహకైవల్యం = విదేహముక్తి యనెడు పేరు గల, బ్రహ్మభావం = బ్రహ్మత్వమును, ప్రపద్య = పొంది, పునః = మరల, నావర్తతే = జన్మమరణాదులను పొందడు.

సదాత్మైకత్వ విజ్ఞానదగ్ధావిద్యాదివర్ష్మణః,
అముష్య బ్రహ్మభూతత్వాద్ బ్రహ్మణః కుత ఉద్భవః. 570

సదాత్మైకత్వవిజ్ఞానదగ్ధావిద్యాదివర్ష్మణః = సద్రూపమగు ఆత్మతో (ఆత్మయొక్క) ఏకత్వముయొక్క విజ్ఞానముచే దగ్ధమైన అవిద్యాది శరీరముగల, అముష్య = ఈ జ్ఞాని, బ్రహ్మభూతత్వాత్ = బ్రహ్మభావమును పొందియుండుటచే (అతనికి పునరావృత్తి లేదు), బ్రహ్మణః = బ్రహ్మకు, ఉద్భవః = పుట్టుక, కుతః = ఎట్లు కలుగును?

మాయాక్లృప్తౌ బన్ధమోక్షౌ న స్తః స్వాత్మని వస్తుతః,
యథా రజ్జౌ నిష్క్రియాయాం సర్పాభాసవినిర్గమౌ. 571

నిష్క్రియాయాం = క్రియాశూన్యమైన, రజ్జౌ = రజ్జువునందు, సర్పాభాసవినిర్గమౌ = సర్పాభాసము కాని అది తొలగిపోవుట గాని, యథా = ఏ విధముగ లేవో, మాయాక్లృప్తౌ = మాయాకల్పితములగు, బన్ధమోక్షౌ = బంధమోక్షములు, స్వాత్మని = స్వాత్మయందు, వస్తుతః = వాస్తవమున, న స్తః = లేవు.

ఆవృతేః సదసత్త్వాభ్యాం వక్తవ్యే బన్ధమోక్షణే,
నావృతిర్బ్రహ్మణః కాచి దన్యాభావా దనావృతమ్,
యద్యస్త్యద్వైతహానిః స్యాద్ద్వైతం నో సహతే శ్రుతిః. 572

ఆవృతేః = ఆవరణము యొక్క, సదసత్త్వాభ్యాం = సదసత్త్వ ములచే (ఆవరణము ఉండుట లేకపోవుట అనుదానినిబట్టి), బన్ధమోక్షణే = బంధము, మోక్షము (వరుసగ), వక్తవ్యే = చెప్పదగినవి, (వాస్తవమున) బ్రహ్మణః = బ్రహ్మకు, ఆవృతిః = ఆవరణము, కాచిత్ = ఏదియు, న = లేదు. అన్యాభావాత్ = బ్రహ్మభిన్నమగునది ఏదియు లేకపోవుటచే, అనావృతం = బ్రహ్మ అనావృతము, అస్తి యది = (బ్రహ్మభిన్నమగు ఆవారకము) ఉన్నచో, అద్వైతహానిః = అద్వైతముయొక్క హాని, స్యాత్ = అగును. శ్రుతిః = శ్రుతి, ద్వైతం = ద్వైతమును, నో సహతే = సహించదు (అంగీకరింపదు).

బన్ధశ్చ మోక్షశ్చ మృషైవ మూఢా
బుద్ధేర్గుణం వస్తుని కల్పయన్తి,
దృగావృతిం మేఘకృతాం యథా రవౌ
యతో౽ద్వయాసఙ్గచి దేకమక్షరమ్. 573

బన్ధః చ = బంధము, మోక్షః చ = మోక్షము, మృషైవ = అసత్యముగనే, మూఢాః = మూఢులు, బుద్ధేః = బుద్ధియొక్క, గుణం = గుణమును, వస్తుని = వస్తుభూతమగు ఆత్మయందు, మేఘకృతాః = మేఘముచే చేయబడిన, దృగావృతిం = దృష్టియొక్క ఆవరణను, రవౌ = సూర్యునియందు, యథా = ఎటులనో, (ఆ విధముగనే) కల్పయన్తి = కల్పించుచున్నారు, యతః = ఏ కారణమువలన, అక్షరం = నాశరహితమగు బ్రహ్మ, అద్వయాసఙ్గచిత్ = అద్వితీయము, సంగరహితము, కేవల చిద్రూపము.

అస్తీతి ప్రత్యయో యశ్చ యశ్చ నాస్తీతి వస్తుని,
బుద్ధేరేవ గుణావేతౌ న తు నిత్యస్య వస్తునః. 574

వస్తుని = యథార్థమగు బ్రహ్మరూపవస్తువునందు, అస్తి ఇతి = ఉన్నది అని, యః = ఏ, ప్రత్యయః = జ్ఞానముకలదో. నాస్తీతి = లేదు అని, యః చ = ఏ జ్ఞానముకలదో. ఏతౌ = ఈ జ్ఞానములు, బుద్ధేః ఏవ = బుద్ధియొక్క మాత్రమే, గుణౌ = గుణములు, తు = కాని, నిత్యస్య = నిత్యమైన, వస్తువుయొక్క గుణములు, న = కావు.

అతస్తౌ మాయయా క్లృప్తౌ బన్ధమోక్షౌ న చాత్మని,
నిష్కలే నిష్క్రియే శాన్తే నిరవద్యే నిరఞ్జనే,
అద్వితీయే పరే తత్త్వే వ్యోమవత్కల్పనా కుతః. 575

అతః = ఆ కారణమువలన, మాయయా = మాయచేత, క్లృప్తౌ = కల్పితములగు, తౌ = ఉన్నది, లేదు అనెడు ఆ జ్ఞానములును, బన్ధమోక్షౌ = బంధమోక్షములును, ఆత్మని = ఆత్మయందు, న = లేవు, నిష్కలే = అవయవశూన్యమును, నిష్క్రియే = క్రియాశూన్యమును, శాన్తే = శాంతమును, నిరవద్యే = దోషరహితమును, నిరఞ్జనే = నిర్లేపమును, అద్వితీయే = ద్వితీయరహితమును అగు, పరే తత్త్వే = పరతత్త్వమునందు వ్యోమవత్ = ఆకాశమునందువలె, ('నిష్కలే' ఇత్యాది విశేషణములు ఆకాశమునకు కూడ సరిపడును) కల్పనా = కల్పన (భేదాదికల్పన), కుతః = ఎట్లు ఉండును?

న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః,
న ముముక్షు ర్న వై ముక్తః ఇత్యేషా పరమార్థతా. 576

నిరోధః = ప్రలయము, న = లేదు. ఉత్పత్తిః చ = సృష్టికూడ, న = లేదు, బద్ధః = బద్ధుడు, న = లేడు, సాధకః = సాధకుడు, న = లేడు, ముముక్షుః = మోక్షేచ్ఛ కలవాడు, న = లేడు, ముక్తః = ముక్తుడు కూడ, న వై = లేడు, ఇతి = ఇట్లు, ఏషా = ఇది, పరమార్థతా = పరమార్థము.

సకలనిగమ చూడా స్వాన్త సిద్ధాన్త గుహ్యం
పర మిద మతిగుహ్యం దర్శితం తే మయాద్య,
అపగతకలిదోషః కామనిర్ముక్తబుద్ధి
స్తదతుల మసకృత్త్వం భావయేదం ముముక్షుః. 577

అద్య = ఇపుడు, మయా = నాచేత, తే = నీకు, సకలనిగమచూడా స్వాన్తసిద్ధాన్త గుహ్యం = సమస్తమైన ఉపనిషత్తులయొక్క సారభూతమగు సిద్ధాంతరూపము రక్షణీయము అయిన, ఇదం = ఈ, అతిగుహ్యం = అతిరహస్యమైన, పరం = పరతత్త్వము, దర్శితం = చూపబడినది,

తత్ = ఆ కారణమువలన, ముముక్షుః = మోక్షేచ్ఛగల, త్వం=నీవు, అపగత కలిదోషః = తొలగిన కలిదోషములు గలవాడవై, కామనిర్ముక్త బుద్ధిః = కామముచే విడువబడిన బుద్ధిగలవాడవై (కామశూన్యమైన బుద్ధి గలవాడవై), అసకృత్ = మాటిమాటికిని, అతులం = సాటిలేని, ఇదం = ఈ తత్త్వమును, భావయ = భావనచేయుము.

## శిష్యుడు సెలవు గైకొనుట

ఇతి శ్రుత్వా గురోర్వాక్యం ప్రశ్రయేణ కృతానతిః,
సతేన సమనుజ్ఞాతో యయౌ నిర్ముక్తబన్ధనః. 578

ఇతి = ఈ విధముగా, గురోః = గురువుయొక్క, వాక్యం = వాక్యమును, శ్రుత్వా = విని, ప్రశ్రయేణ = వినయముచే, కృతానతిః = చేయబడిన నమస్కారము కలవాడై, సః = ఆ శిష్యుడు, తేన = గురువుచే, సమనుజ్ఞాతః = అనుజ్ఞ ఈయబడినవాడై, నిర్ముక్తబన్ధనః = తొలగినబంధము కలవాడై, యయౌ = వెళ్లెను.

గురురేష సదానన్దసిన్ధౌ నిర్మగ్నమానసః,
పావయన్ వసుధాం సర్వాం విచచార నిరన్తరః. 579

ఏషః = ఈ, గురుః = గురువు, సదా = ఎల్లప్పుడును, ఆనన్దసిన్ధౌ = ఆనందసముద్రమునందు, నిర్మగ్నమానసః = మగ్నమైన మనస్సు కలవాడై, నిరన్తరః = భేదబుద్ధిలేనివాడై, సర్వాం = సమస్తమైన, వసుధాం = భూమిని, పావయన్ = పవిత్రముజేయుచు, సర్వాం = సమస్తమైన, వసుధాం = భూమిని, విచచార = సంచరించెను

## అనుబంధ చతుష్టయము

ఇత్యాచార్యస్య శిష్యస్య సంవాదేనాత్మలక్షణమ్,
నిరూపితం ముముక్షూణాం సుఖబోధోపపత్తయే. 580

ఇతి=ఈ విధముగా, ముముక్షూణాం=మోక్షేచ్ఛకలవారికి, సుఖబోధోపపత్త్యే=సుఖముగ జ్ఞానము లభించుటకై, ఆచార్యస్య=ఆచార్యుని యొక్కయు, శిష్యస్య=శిష్యునియొక్కయు సంవాదేన=సంవాదముచే (సంవాదరూపమున), ఆత్మలక్షణం=ఆత్మయొక్క లక్షణము, నిరూపితం=నిరూపింపబడినది.

హితమిద ముపదేశ మాద్రియన్తాం
విహిత నిరస్త సమస్త చిత్తదోషాః,
భవసుఖ విముఖాః ప్రశాన్తచిత్తాః
శ్రుతిరసికా యతయో ముముక్షవో యే. 581

విహిత నిరస్తసమస్త చిత్తదోషాః = విహితకర్మాచరణముచే తొలగింపబడిన సమస్తమైన చిత్తదోషము కలవారును, భవసుఖవిముఖాః= సంసారసుఖమువిషయమున విముఖులును, ప్రశాన్తచిత్తాః=శాంతమైన చిత్తము కలవారును, శ్రుతిరసికాః=వేదోపదేశమునందు ఆసక్తికలవారును, ముముక్షవః=మోక్షేచ్ఛకలవారును, అగు, యే=ఏ, యతయః=జ్ఞానులు కలరో, (తే=వారు), హితం=హితమైన, ఇదం=ఈ, ఉపదేశం= ఉపదేశమును, ఆద్రియన్తాం=ఆదరింతురు గాక.

## గ్రంథ ప్రశంస

సంసారాధ్వని తాపభానుకిరణ ప్రోద్భూతదాహవ్యథా
ఖిన్నానాం జలకాఙ్క్షయా మరుభువి భ్రాన్త్యా పరిభ్రామ్యతామ్,
అత్యాసన్నసుధామ్బుధిం సుఖకరం బ్రహ్మాద్వయం దర్శయ
న్త్యేషా శంకరభారతీ విజయతే నిర్వాణసన్దాయినీ. 582

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యస్య
శ్రీ గోవిన్దభగవత్పూజ్యపాదశిష్యస్య
శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ వివేకచూడామణిః
శృఙ్గగిరి జగద్గురు శ్రీ చన్ద్రశేఖర భారతీస్వామ్యనుగృహీత
వ్యాఖ్యాసనాథః సమాప్తః

సంసారాధ్వని=సంసారమార్గమునందు, తాపభానుకిరణ ప్రోద్భూత దాహవ్యథాఖిన్నానాం = త్రివిధతాపము లనెడు సూర్యకిరణములవలన కలిగిన దాహబాధచే (దప్పికచే లేదా తాపముచే) దుఃఖితులును, జలకాఙ్క్షయా= జలమునందు కోరికచే, భ్రాంత్యా=భ్రాంతిచేత, మరుభువి=ఎడారిలో, పరి భ్రామ్యతాం=తిరుగాడుచున్నవారికి, సుఖకరం=సుఖకరమైన, అద్వయం బ్రహ్మ=అద్వితీయమగు బ్రహ్మ యనెడు, అత్యాసన్నసుధామ్బుధిమ్= అతిసమీపముననున్న సుధాసముద్రమును, దర్శయన్తీ = చూపు చున్నట్టిదియు, నిర్వాణసన్దాయినీ=మోక్షమును కలిగించునదియు అగు, ఏషా=ఈ, శంకరభారతీ=శంకరవాక్కు, విజయతే=సర్వోత్కర్షగా నున్నది.

శ్రీమచ్ఛంకరభగవత్పాదప్రణీతమును, శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరభారతీ
విరచితవ్యాఖ్యాసముల్లసితమును అగు వివేకచూడామణికి
పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన ఆంధ్ర
భాషానువాదము సమాప్తము
శ్రీః శ్రీః శ్రీః.

*

యత్కృపాలేశసంసర్గా దనువాదః కృతో మయా,
తస్యైవ జానకీజానేః పదయో రయ మర్ప్యతే.
క్వాహం మన్దమతిః క్వేయ మద్వైతప్రక్రియోద్భృతా,
క్షామ్యన్తు విబుధాః సర్వే జిజ్ఞాసోశ్చాపలం మమ.

— పుల్లెల శ్రీరామచంద్రుడు

జగద్గురు శ్రీశంకరాచార్య విరచిత

# శ్రీ వివేకచూడామణి

ఆంధ్రవ్యాఖ్యాసమేతము

వ్యాఖ్యాత

డా. పుల్లెల శ్రీరామచంద్రుడు
ఎమ్. ఏ. పిహెచ్. డి.



ప్రచురణ :

సంస్కృతభాషా ప్రచారసమితి,

(జి. పుల్లారెడ్డి చారిటీస్ ట్రస్ట్ అనుబంధ సంస్థ)

హైదరాబాదు